# సుందరకాండము

## (పారాయణ గ్రంథం)

శ్రీ మాన్ ఎస్.టి.పి.వి. కోనప్పాచార్యులు (విద్యాప్రవీణ)



రోహిణి పబ్లికేషన్స్
మెయిన్ రోడ్, రాజమండ్రి-1. Ph: 73444

## సకలాభీష్టప్రదాయి

# సుందరకాండము

## (సర్వజన నిత్యపారాయణ గ్రంథము)

-: సరళ సుందర అనువాదము :-


భాషాప్రవీణ, విద్యాప్రవీణ, ఉభయవేదాంత ప్రవక్తకులు

**శ్రీమాన్ శ్రీమత్తిరుమల పురిహెళ్ళ**
**వేంకట కోనప్పాచార్యులు**

విశ్రాంత ప్రధానోపాధ్యాయులు

ఆంధ్రాయువతీ సంస్కృత కళాశాల రాజమండ్రి





© 473444

**రోహిణి పబ్లికేషన్స్**

పాతకూరగాయల మార్కెట్, మెయిన్‌రోడ్

రాజమండ్రి-1

సకలాభీష్టప్రదాయి
**సుందరకాండము**
(సర్వజన నిత్యపారాయణ గ్రంథము)
- శ్రీ ఎస్.టి.పి.వి.కోనప్పాచార్యులు



ప్రథమ ముద్రణ : ఫిబ్రవరి. 1998
ద్వితీయ ముద్రణ : నవంబరు.1999
తృతీయ ముద్రణ : జనవరి. 2002

మూల్యం: రు.125/-

ముద్రణ :
స్వామి ఆఫ్‌సెట్ ప్రింటర్స్
స్వామి వీధి, గాంధీనగర్, విజయవాడ- 2.
ఫోన్ : 578211.

ప్రకాశకులు:
రోహిణి పబ్లికేషన్స్
మెయిన్‌రోడ్, రాజమండ్రి-1
✆ 473444

## దేవతా ప్రార్థనా

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్,
ప్రసన్నవదనం ధ్యాయే త్సర్వవిఘ్నోపశాన్తయే.
రామాయ రామభద్రాయ రామచన్ద్రాయ వేధసే,
రఘునాథాయ నాథాయ సీతాయాః పతయే నమః.

## వాల్మీకి ప్రార్థనా

కూజన్తం రామరామేతి మధురం మధురాక్షరమ్,
ఆరుహ్య కవితాశాఖాం వన్దే వాల్మీకి కోకిలమ్.
వాల్మీకే ర్మునిసింహస్య కవితావనచారిణః,
శృణ్వ న్రామకథానాదం కో నయాతి పరాం గతిమ్.

## శ్రీ ఆంజనేయ ప్రార్థనా

అఞ్జనానన్దనం వీరం జానకీశోకనాశనమ్,
కపీశ మక్షహన్తారం వన్దే లఙ్కాభయఙ్కరమ్.
గోష్పదీకృత వారాశిం మశకీకృత రాక్షసమ్,
రామాయణమహామాలారత్నం వన్దేఽనిలాత్మజమ్.

మనోజవం మారుతతుల్యవేగం
జితేన్ద్రియం బుద్ధిమతాం వరిష్ఠమ్,
వాతాత్మజం వానరయూథముఖ్యం
శ్రీరామదూతం శిరసా నమామి.

## శ్రీరామాయణ ప్రశంసా

వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే,
వేదః ప్రాచేతసా దాసీ త్సాక్షా ద్రామాయణాత్మనా.
శ్రీమద్బ్రహ్మతదేవబీజ మమలం యస్యాఙ్కుర శ్చిన్మయః
కాణ్డై స్సప్తభి రన్వితోఽతివితతో బుష్యాలవాలోదితః,
పత్రై స్తత్త్వసహస్రకై స్సువిలసచ్ఛాఖాశతైః పఞ్చభిః
స్వాత్మప్రాప్తిఫలప్రదో విజయతే రామాయణస్వస్తరుః.
యః కర్ణాఞ్జలిసంపుటై రహరహ స్సమ్య క్పిబ త్యాదరా
ద్వాల్మీకే ర్వదనారవిన్దగళితం రామాయణాఖ్యం మధు,
జన్మవ్యాధిజరావిపత్తిమరణై రత్యన్తసోపద్రవం
సంసారం స విహాయ గచ్ఛతి పుమా న్విష్ణోః పదం శాశ్వతమ్.
వాల్మీకిగిరిసంభూతా రామాంభోనిధిసంగతా,
శ్రీమద్రామాయణీ గంగా పునాతు భువనత్రయమ్.

# ప్రకాశకుల విజ్ఞప్తి

## 'ఎందరో మహానుభావులు అందరికీ వందనములు'

భరతవర్షంలో ఆస్తిక మహాజనుల ఆరాధ్యగ్రంథాలు భారత రామాయణాలు. తత్త్వ వివేచకులు శ్రీమన్మహాభారత సారమే భగవద్గీతఅనీ, శ్రీమద్రామాయణ సారమే సుందరకాండమనీ సూక్ష్మీకరించారు. ఈ వివేచనని బట్టే ఈ రెండు ఆస్తిక గ్రంథాలు నిత్య పారాయణ గ్రంథాలుగా విరాజిల్లుతూనే ఉన్నాయి. నిత్యపారాయణ కర్మిష్ఠుల అభిప్రాయానుసారం భారతాంతర్గమైన భగవద్గీత మోక్ష సాధనంగాను, రామాయణాంతర్గతమైన సుందరకాండము ఐహికాముష్మిక సాధనంగాను తేటతెల్లం చేసారు.

శ్రీమద్భగవద్గీత శ్రీకైవల్యపదం చేరే మార్గాన్ని నిర్దేశిస్తే, శ్రీమత్సుందరకాండము ఇహపరాల రెంటికీ లౌకిక జగత్తులోనే మార్గనిర్దేశం చేయగల మహత్తర పారాయణ గ్రంథంగా మనకు సాక్షాత్కరిస్తుంది. పైగా ఎందరో మహాత్ములు తమ అనుభవంలో సుందరకాండము పారాయణము చేస్తే వైయక్తికమైన కార్యసిద్ధి, కామ్యసిద్ధి, సుఖశాంతులు అవశ్యం సిద్ధించగలవని నొక్కిచెబుతూ వచ్చారు. ఇది మూఢ విశ్వాసం కాదు. సిద్ధాంతికమే!

ఇటువంటి మహామంత్రయుక్త నిత్యపారాయణ గ్రంథాన్ని భక్త పాఠకులకు అందివ్వాలనే ధ్యేయంతో మా ప్రచురణసంస్థ శ్రేయోభిలాషులైన శ్రీమాన్ ఎం.వి.నారాయణా చార్యులవారిని సంప్రదించగా వారు ఎంతో ఉత్సాహంతో మమ్మల్ని అభినందించి వారి వేదాంత గురువులైన శ్రీమాన్ శ్రీమత్తిరుమల పురిహెళ్ళ కోనప్పాచార్యులవారి వద్దకు తోడ్కొనిపోయి, మా ఆలోచనలను శ్రీవారి ముందుంచారు. అంతే. వా రేమాత్రం తాత్సారం చేయకుండా

68 సర్గలకు సరళమైన భాషలో వ్యాఖ్యానాన్ని వ్రాసి (వారి మనుమరాలిచే వ్రాయించి) మాకు ప్రసాదించారు. పైగా సర్వజన పారాయణ గ్రంథంగా రూపుదాల్చడానికి ఎన్నో అమూల్య సలహాల నందించిన మహనీయులు. వారు మా ప్రచురణ సంస్థకు ఇటువంటి ప్రతిష్ఠాత్మకమైన గ్రంథాన్ని ప్రచురించే అవకాశం కల్పించినందుకు మేము వారికి సర్వదా కృతజ్ఞులం.

సరే, ఇంతటి మహామంత్ర గ్రంథాన్ని నిర్దోషంగా ముద్రించాలంటే సమర్థులైన పండితులు 'ప్రూఫ్'లు చూస్తే మా ప్రచురణ భక్తకోటి అభిమానాన్ని అనాయాసంగా పొందగలదని ఎంచి డాక్టర్ శ్రీ జొన్నలగడ్డ మృత్యుంజయ రావుగారి వద్ద యథాలాపంగా ప్రస్తావిస్తే వారు ఎంతో ప్రోత్సాహపూర్వకంగా మొత్తం గ్రంథమంతా ప్రూఫ్‌లు చూసి సరిచేసి ఇవ్వగలనని వాగ్దానం చేసారు. అంతే! అన్నమాటప్రకారం, విశ్వామిత్రుని యజ్ఞ సంరక్షణార్థం తోడు వెళ్ళిన శ్రీరామచంద్రుడు ఏ విధంగా రాక్షసులను సంహరిస్తూ కౌశికుని క్రతువును నిర్విఘ్నంగా పరిసమాప్తి చేయించ గలిగాడో, అచ్చం అదేమాదిరి ఈ మహామంత్రగ్రంథం ప్రచురణ యజ్ఞానికి తోడునీడగా వుంటూ అక్షరాలలో రహస్యంగా దాగి వుండే ముద్రారాక్షసుల్ని అవిశ్రాంతంగా తన కృతప్రజ్ఞ అనే కార్ముకంతో పచ్చని సిరాక్షరాలనే బాణాలచేత పరిహరిస్తూ, నిత్యం పారాయణ చెయ్యాలనుకునే వారికి మంత్రసిద్ధిని, సాఫల్యాన్నీ సంతరించిపెట్టిన ఘనులు. వారి ఋణం ఎన్నటికీ తీర్చుకోలేనిదే!

ఇకపోతే ఈ గ్రంథానికి మకుటాయమానమైన అంశం పారాయణ విధివిధానాలు. అన్యులతో పారాయణ చేయించుకొనే అగత్యం లేకుండ ఎవరికి వారే స్వయంగా ఫలించగల అవకాశం సర్వులకు అందివ్వాలనే సంకల్పంతో ఎన్నో గ్రంథాలను పరిశీలించి, పారాయణ పరాయణులను సంప్రదించి స్వల్పసమయంలోనే

పారాయణచేసుకొని అనేకానేక అభీష్టాలను, దోషాలను, పీడలను సంపుటీకరణ పద్ధతిలో శ్లోకాలను జపంచేసుకుని కార్యసిద్ధి, దోషశాంతి, పీడానివారణలు పొందగలిగే వినూత్నమైన పారాయణ విధానానికి రూపం కల్పించినవారు ప్రముఖ జ్యోతిషగ్రంథ రచయిత బ్రహ్మశ్రీ పుచ్చా శ్రీనివాసరావుగారు. వారికి మా కృతజ్ఞతలు.

ఈ గ్రంథాన్ని కార్యోత్సాహంతో డి.టి.పి చేసిన సన్మిత్రులు సహనానికీ, సహకారానికీ మరోపేరైన బ్రహ్మశ్రీ చల్లా చంద్రశేఖర శర్మ (శ్రీ లక్ష్మీగణపతి డి.టి.పి. సిస్టమ్స్) గారు. సహజంగా పండితకుటుంబంలో జన్మించినవారు కాబట్టే పారాయణ గ్రంథానికి అవసరమైన పవిత్రతను సమకూర్చిపెట్టిన సజ్జనులు. ఈ గ్రంథప్రచురణ యజ్ఞానికి వారే ప్రధాన ఋత్విక్కు. వారికి మా కృతజ్ఞతాంజలులు.

అవశ్యంగానో, ఆవశ్యకంగానో అక్షరదానంకోసం ఆశ్రయించినవారి ఆలోచనలకు అలసత్వం లేకుండా అక్షరరూపం కల్పించి అందించే అస్మదీయులు శ్రీమాన్ సముద్రాల వేంకటరంగరామానుజాచార్యుల వారు. వీరే ఈ మహామంత్రయుక్త పారాయణ గ్రంథానికి తిరుమణివంటి తత్త్వసారాన్ని '**సుందరే కిం న సుందరమ్?**' అందించి మమ్మల్ని ధన్యులుగా దీవించారు. వారికి మా కృతజ్ఞతలు.

ఇలా ఎన్నో రంగాల్లో ఎందరోమహానుభావులు వారివారి స్నేహ సహకారాలను అందించి తీర్చిదిద్దిన ఈ '**సకలాభీష్టప్రదాయి సుందరకాండము**' మీకు అందిస్తున్నాం. అందుకోండి! నిత్యం పారాయణ చేసుకోండి! మీ ప్రయత్నాలతోపాటు శ్రీ ఆంజనేయుని అండను పొంది అఖండవిజయాలను అలవోకగా అందిపుచ్చుకోండి!

సన్మంగలాని భవన్తు.

రోహిణి పబ్లికేషన్స్.

సకలాభీష్టప్రదాయి

# సుందరకాండ

## విషయానుక్రమణిక


| | | పేజీ నెం. |
|---|---|---|
| 1. | ప్రస్తావన | 20 |
| 2. | సున్దరే కిం న సుందరమ్? | 25 |
| 3. | శ్రీ ఆఞ్జనేయ యంత్రము | |
| 4. | శ్రీ ఆఞ్జనేయ స్తోత్రము | 35 |
| 5. | శ్రీమద్రామాయణ పారాయణక్రమః | 38 |
| 6. | తత్త్వసంగ్రహరామాయణమున చెప్పబడిన శ్రీమత్సుందరకాండ శ్రవణఫలము | 40 |
| 7. | శ్రీమత్సుందరకాండ పారాయణ విధులు, ఫలనిరూపణలు | 41 |
| 8. | పారాయణమునకు మాస తిథి వార నక్షత్ర దేశ నిర్ణయము | 50 |
| 9. | పారాశర్యోప పురాణమున శ్రీమత్సుందరకాండ సప్తసర్గి పారాయణ విధానము | 52 |
| 10. | సప్తసర్గ పారాయణ క్రమము | 54 |
| 11. | సంగ్రహ పారాయణ క్రమము | 56 |

**12. సుందరకాండ పారాయణము - లౌకిక ఫలితములు 57**

1. కార్యసిద్ధికి 61
2. సహాయసహకారములు వాంఛించుటకు 61
3. భూతప్రేత బాధలనుండి నివారణకు 62
4. అభయదానం 62
5. అజ్ఞానం తొలగుటకు 62
6. శారీరక దౌర్బల్యం తొలగుటకు 63
7. బుద్ధిమాంద్యము తొలగుటకు 63
8. శత్రునిర్మూలన కోసం 63
9. కార్యసాధన కోరేవారు 64
10. మానసిక శాంతికి 64
11. మనసులోని కోరికలు సాధించుటకు 65
12. ప్రత్యర్థులపై జయం కోరువారు 65
13. స్వగృహం కోరువారు 65
14. వాహనప్రాప్తి కోరువారు 67
15. అధికారులప్రాపు కోరేవారు 67
16. మనోనిగ్రహం కోరువారు 68
17. కార్యోన్ముఖుని కావించుటకు 68
18. ఋణవిముక్తికై 68
19. స్వప్నదోషాలుతొలగుటకు 69
20. యోగక్షేమాలు కోరువారు 69
21. దుఃఖము తొలగుటకు 69
22. స్థానాంతరములో ఉన్నవారి క్షేమం కోరుటకు 70
23. సుఖసౌఖ్యములు కోరేవారు 71
24. ఉద్యోగప్రాప్తి కోరువారు 71

25. శుభవార్తలు కోరువారు 71
26. ఏలినాటి శని దోషము తొలగుటకు 72
27. దైవనింద చేసినందువల్ల ఏర్పడే దోషం తొలగడానికి 73
28. అనారోగ్యం నివారణకు 73
29. ధైర్యముకోసం 73
30. ఎడబాటు తొలగుటకు 74
31. ప్రియాసమాగమం కోసము 74
32. కార్యాచరణ కోసం 74
33. సమస్త దోషములు తొలగుటకు 75
34. అపహరణ దోషము తొలగుటకు 75
35. అగ్నిభయం లేకుండుటకు 75
36. శ్రమసాఫల్యం పొందుటకు 76
37. సుఖప్రయాణంకోసం 76
38. ఉదర రోగములు తొలగుటకు 77

13. గ్రహదోషాల నివారణము - పారాయణ పద్ధతులు 78
1. రవి మహాదశ 79
2. చంద్ర మహాదశ 79
3. కుజ మహాదశ 79
4. బుధ మహాదశ 79
5. గురు మహాదశ 80
6. శుక్ర మహాదశ 80
7. శని మహాదశ 80
8. రాహు మహాదశ 81
9. కేతు మహాదశ 81

14. శ్రీమత్సుందరకాండ పారాయణ ప్రారంభంలో
శ్రీవైష్ణవులు చదువవలసిన శ్లోకములు 82

15. శ్రీమత్సుందరకాండ పారాయణ ప్రారంభంలో
చదువవలసిన శ్లోకములు 86

16. శ్రీమత్సుందరకాండ పారాయణ ప్రారంభములో
పఠించవలసిన సర్గములు 90

*1.* గాయత్రీ రామాయణము 90

*2.* సంక్షేప రామాయణము 97

*3.* శ్రీరామావతార సర్గము *121*

*4.* శ్రీసీతారామకళ్యాణ సర్గము *135*

*5.* శ్రీసీతారామ సుఖజీవన సర్గము *145*

17. శ్రీమత్సుందరకాండము మూలము - 153-746

18. సర్గాంతమున చేరియున్న సుందర వచనానువాద
కథాక్రమణిక

సర్గము సంఖ్య

*1* హనుమంతుడు మహేంద్ర పర్వతమున విహరించుట; హనుమంత విక్రమమునకు మహేంద్రాద్రి చీకాకు పడుట; హనుమంతుడు ఆకాశమున కెగిరి వానరుల వద్ద సెలవు పుచ్చుకొనుట; హనుమద్గమన వేగ వర్ణనము; సముద్రుడు హనుమంతునకు తోడ్పడ యోజించుట; సముద్రుడు మైనాకునితో సంభాషించుట; మైనాకుడు ఆంజనేయున కెదురుగ వచ్చుట; మైనాకుడు తన పూర్వ వృత్తాంతము హనుమకు తెల్పుట; హనుమంతుడునకు సురస అడ్డుపడుట; హనుమంతుడు సురసనోట ప్రవేశించి బయల్వెడలుట;

ఆంజనేయుడు సింహికను వధించుట; హనుమంతుడు లంకాతీరంబును దర్శించుట.. (175)
2 హనుమంతుడు లంకాపురి వెలుపలి ఉద్యానంబుల విహరించుట; హనుమంతుడు లంకను చూచుట; హనుమంతుడు లంకను చూచి నివ్వెరగొనుట; హనుమంతుడు లంకలో ప్రవేశింప ఉపాయమును యోచించుట; హనుమంతుడు లంకలో ప్రవేశించుట (197)
3 హనుమంతుడు ప్రాకారమున జేరి ఆలోచించుట; హనుమంతుడు లంకాధిదేవతను జయించుట; లంక తనను రక్షింపమని హనుమంతుని వేడుట; (207)
4 హనుమంతుడు లంకలో సంచరించుట (215)
5 చంద్రోదయము; చంద్ర వర్ణనము; హనుమంతుడు లంకలో రాక్షస స్త్రీ పురుషులను చూచుట (223)
6 హనుమంతుడు రావణాలయమును చూచుట; హనుమ రాక్షస ముఖ్యుల ఇండ్లయందు సీతాదేవిని వెదకుట; హనుమంతుడు రావణ గృహములో ప్రవేశించుట; (231)
7 హనుమంతుడు అంతఃపురములో సంచరించుట; హనుమంతుడు పుష్పకవిమానమును వీక్షించుట; (237)
8 పుష్పకవిమాన వర్ణనము; (242)
9 హనుమంతుడు రావణుని అంతఃపురమును చూచుట; నిద్రించుచున్న రావణుని అంతఃపుర స్త్రీలను హనుమ తిలకించుట; (251)
10 హనుమంతుడు నిద్రించు రావణుని కనుగొనుట; హనుమంతుడు నిద్రించుచున్న రావణుని భార్యలను చూచుట; హనుమంతుడు మండోదరిని చూచుట; (260)

11 హనుమ సీతాదేవిని పానశాలయందు మరల వెదకుట; పరస్త్రీ దర్శనమునకు హనుమంతుడు విచారించుట; (267)

12 హనుమంతుడు సీతాదేవిని గానక దిగులుపడుట; హనుమ ఉత్సాహము వహించి మరల సీతాదేవిని వెదకుట; (273)

13 హనుమ ప్రాకారము చేరి సీతాదేవి కానరామికి దుఃఖించుట; సీతాదేవి లేదని శ్రీరామునితో చెప్పిన కలుగు అనర్థకమును హనుమంతుడు యోచించుట; హనుమంతుడు ప్రాణత్యాగము చేయ తలపోయుట; హనుమంతుడు అశోకవనమును చూచుట; (283)

14 హనుమంతుడు అశోకవనమున ప్రవేశించుట; హనుమంతుడు అశోకవనమున సంచరించుట; (294)

15 హనుమంతుడు అశోకవనమున సీతాదేవిని వెదకుట; హనుమంతుడు సీతాదేవిని దర్శించుట; హనుమంతుడు సీతాదేవిని చూచి తనలోతను వితర్కించుకొనుట; హనుమ తాను చూచిన స్త్రీ సీతాదేవి అని నిశ్చయించుకొనుట; (303)

16 హనుమంతుడు సీతాదేవి స్థితికి దుఃఖించుట; (311)

17 హనుమంతుడు సీతాదేవికి కావున్న రాక్షస స్త్రీలను చూచుట; హనుమంతుడు సీతాదేవిని చూచి సంతోషించుట; (318)

18 రావణుడు అశోకవనమునకు వచ్చుట; (324)

19 రావణుడు సీతాదేవిని చేరవచ్చుట; (329)

20 రావణుడు తన కోరికను సీతాదేవికి ఎరిగించుట; (335)

21 సీతాదేవి రావణునకు బుద్ధి చెప్పుట; (343)

22 రావణుడు సీతాదేవిని బెదరించుట; సీతాదేవి రావణునితో పరుషములు పలుకుట; రావణుడు సీతాదేవిపై ఆగ్రహపడుట; ధాన్యమాలిని రావణునకు అడ్డము వచ్చుట; (352)

23 రాక్షస స్త్రీలు సీతాదేవికి బోధ చేయుట; (359)

24 రాక్షస స్త్రీలు సీతాదేవిని బెదరించుట; సీతాదేవి రాక్షస స్త్రీలకు తన మనోనిశ్చయము తెలుపుట; రాక్షస స్త్రీలు సీతాదేవిని కఠినోక్తులాడుట; (366)

25 రాక్షస స్త్రీల పలుకులకు భయపడి సీతాదేవి ఏడ్చుట; (373)

26 సీతాదేవి శ్రీరాముని తలచుకొని దుఃఖించుట; సీతాదేవి రాక్షస స్త్రీలకు కఠినముగ ప్రత్యుత్తరము ఇచ్చుట; (381)

27 త్రిజట తన స్వప్న వృత్తాంతమును రాక్షస స్త్రీలకు చెప్పుట; (392)

28 సీతాదేవి శ్రీరాముడు రామికి అనేకవిధముల పరితపించుట; (401)

29 మరణోద్యుక్తయగు సీతాదేవికి శుభశకునములు గోచరమగుట; (406)

30 సీతాదేవితో ఎట్లు భాషింప తగునని హనుమ యోచించుట; (412)

31 హనుమ సీతాదేవి వినునట్లు శ్రీరాముని ప్రశంసించుట; (419)

32 సీతాదేవి హనుమంతుని చూచి భయపడుట; (424)

33 హనుమంతుడు సీతాదేవితో సంభాషించుట; సీతాదేవి హనుమంతునితో తన వృత్తాంతము సొంతము చెప్పుట; (430)

34 హనుమంతుడు సీతాదేవికి శ్రీరామలక్ష్మణుల కుశలవార్తను తెలుపుట; సీతాదేవి హనుమంతుని రావణుడనియే శంకించుట; హనుమంతుడు సీతాదేవికి సందేహము తీరునట్లు భాషించుట; (438)

35 సీతాదేవి హనుమంతుని శ్రీరామలక్ష్మణుల చిహ్నంబులు అడుగుట; సీతాదేవికి హనుమంతుడు శ్రీరామసుగ్రీవుల సమాగమ విధంబు చెప్పుట; శ్రీరాముని విరహతాపము హనుమంతుడు సీతాదేవికి చెప్పుట; హనుమంతుడు సీతాదేవితో తమ కామె ఉనికి తెలిసిన విధమును చెప్పుట; హనుమంతుడు సీతాదేవికి తన జన్మవృత్తాంతము చెప్పుట; (452)

36 హనుమంతుడు సీతాదేవికి శ్రీరామముద్రికను ఇచ్చుట; సీతాదేవి హనుమంతుని ప్రశంసించి శ్రీరామాదుల కుశలము అడుగుట; హనుమంతుడు సీతాదేవికి ధైర్యోక్తులు చెప్పుట; (467)

37 సీతాదేవి హనుమంతునకు రావణుడు విధించిన గడువును తెలియపరచుట; హనుమంతుడు సీతాదేవిని తన వీపున కూర్చుండ బెట్టుకొని తీసుకుపోయెదనని చెప్పుట; హనుమంతుడు సీతాదేవికి తన దేహము పెంచి చూపుట; హనుమంతునితోడ సీతాదేవి తన రామికి కారణము చెప్పుట; (480)

38 సీతాదేవి చెప్పిన కారణములను విని హనుమంతుడు ఆమెను ప్రశంసించుట; సీతాదేవి హనుమంతునకు కాకాసుర వృత్తాంతము చెప్పుట; సీతాదేవి హనుమంతునితో శ్రీరామలక్ష్మణులకు సందేశవార్తలు చెప్పి పంపుట; సీతాదేవి హనుమంతుని చేతికి తన చూడామణిని ఇచ్చుట; (495)

39 సీతాదేవి తన్ను గురించి శ్రీరామునికి తెలుపమని హనుమంతుని కోరుట; సీతాదేవి తన సందేహమును హనుమంతునితో చెప్పుట; హనుమంతుడు సీతాదేవి సందేహమును తీర్చుట; (508)

40 సీతాదేవి శ్రీరాముని ఉద్దేశించి హనుమంతునితో పలుకుట; హనుమంతుడు మరలిపోవుటకు సీతాదేవిని సెలవిమ్మని అడుగుట; సీతాదేవి హనుమంతుడు తిరిగి పోవుటకు అనుమతించుట; (516)

41 హనుమంతుడు కార్యశేషమును ఆలోచించుట; హనుమంతుడు అశోకవనమును ధ్వంసము చేయుట; (523)

42 రాక్షస స్త్రీలు హనుమంతుని వృత్తాంతము సీతాదేవిని

అడుగుట; రాక్షస స్త్రీలు అశోకవనము పాడగుట రావణునకు తెలుపుట; రావణుడు హనుమంతుని మీదికి కింకరులను పంపుట; హనుమంతుని జయఘోషము; (531)
43 హనుమంతుడు ప్రాసాదమును విరుగ తన్నుట; హనుమంతుడు చైత్యపాలకులను చంపుట; (538)
44 హనుమంతుడు జంబుమాలిని వధించుట; (543)
45 హనుమంతుడు ఏడుగురు మంత్రి పుత్రులను చంపుట; (547)
46 హనుమంతుని మీదికి రావణుడు ఐదుగురు సేనానాయకులను పంపుట; హనుమంతుడు సేనానాయకులందరినీ సంహరించుట; (554)
47 హనుమంతుని మీదికి రావణుడు అక్షకుమారుని పంపుట; హనుమంతుడు అక్షకుమారుని చంపుట; (566)
48 రావణుడు ఇంద్రజిత్తును హనుమంతుని మీదికి పంపుట; ఇంద్రజిత్తు హనుమంతునితో యుద్ధము చేయుట; ఇంద్రజిత్తు హనుమంతుని బ్రహ్మాస్త్రముతో బంధించుట; రాక్షసులు హనుమంతుని బంధించి రావణుని వద్దకు తీసికొని పోవుట; (579)
49 హనుమంతుడు రావణుని సభలో చూచుట; (587)
50 రావణుడు హనుమంతుని చూచి ఆలోచించుట; ప్రహస్తుడు హనుమంతుని ప్రశ్నించుట; హనుమంతుడు రావణునకు తన వృత్తాంతము చెప్పుట; (592)
51 హనుమంతుడు రావణునకు తాను లంకకు వచ్చిన కారణము తెల్పుట; హనుమంతుడు రావణునకు హితము చెప్పుట; (599)
52 విభీషణుడు రావణునితో దూతను చంపరాదని చెప్పుట; (608)
53 రావణుడు హనుమంతుని తోక కాల్చ ఆజ్ఞచేయుట; రాక్షసులు

తోక కాల్చుచుండ హనుమ ఆలోచించుట; సీతాదేవి అగ్నిహోత్రుని ప్రార్థించుట; అగ్ని చల్లనై నందునకు హనుమంతుడు ఆశ్చర్యపడుట; (616)

54 హనుమంతుడు లంకను దహింపచేయుట; రాక్షస విలాపము; (628)

55 హనుమంతుడు సీతాదేవి దగ్ధ మయ్యెనని పరితాపపడుట; హనుమంతుడు సీతాదేవిని అగ్ని దహింపడని నిశ్చయించుట; (635)

56 హనుమంతుడు మరల సీతాదేవిని సందర్శించుట; సీతాదేవి వద్ద సెలవుతీసికొని మరల హనుమంతుడు అరిష్టాద్రిని ఎక్కుట; (643)

57 హనుమంతుడు మరల సముద్రమును లంఘించుట; హనుమంతుని సింహనాదము విని వానరులు హర్షించుట; హనుమంతుడు మందరాద్రిపై దిగుట; హనుమ కపులతో తాను సీతాదేవిని చూచితినని చెప్పుట; (652)

58 హనుమంతుడు తాను లంకకు పోయి వచ్చిన విధమునంతయు వానరులకు చెప్పుట; (673)

59 హనుమంతుడు సీతాదేవిని తోడ్కొని వచ్చి శ్రీరాముని దర్శించుట యుక్తమని చెప్పుట; హనుమంతుడు వానరులకు సీతాదేవి స్థితిని తెలుపుట; (690)

60 అంగదుడు సీతాదేవిని తీసికొని వచ్చుటకు సమ్మతించుట; (694)

61 వానరులు కిష్కింధకు పోవు మార్గములో మధవనమును చూచుట; వానరులు మధవనమున ప్రవేశించుట; దధిముఖుడు వానరులను వారించుట; (699)

62 అంగదహనుమంతుల దన్నుతో వానరులు మధువనములో నిచ్చకొలది సంచరించుట; అంగదుడు దధిముఖుని తన్నుట; (707)

63 దధిముఖుడు సుగ్రీవునితో వానరుల దుశ్చేష్టలు తెల్పుట; సుగ్రీవుడు లక్ష్మణునితో హనుమదాదులు మధువనమును

విహరించు విషయమును తెల్పుట; సుగ్రీవుడు వానరులకు త్వరగ రమ్మని దధిముఖునిచే వార్త పంపుట; (714)

64 అంగదాదులు సుగ్రీవుని కడకు పోవుట; సుగ్రీవుడు రామునకు ధైర్యోక్తులు చెప్పుట; హనుమంతుడు శ్రీరామునకు సీతాదేవి స్థితి తెలుపుట; (722)

65 హనుమంతుడు శ్రీరామునకు సీతాదేవి లంకయందున్నదని తెలుపుట; హనుమంతుడు శ్రీరామునికి సీతదేవి సందేశమును వినిపించుట; (729)

66 శ్రీరాముడు సీతాదేవి గుర్తుగా పంపిన చూడామణిని చూచి దుఃఖించుట; (734)

67 హనుమంతుడు శ్రీరామునకు కాకాసుర వృత్తాంతము అభిజ్ఞానముగ తెలుపుట; సీతాదేవిని తాను ఓదార్చిన విధమును హనుమంతుడు శ్రీరామునకు తెలుపుట; సీతాదేవి సందేశ వాక్యములు హనుమంతుడు శ్రీరామునకు తెలుపుట; (740)

68 హనుమంతుడు సీతాదేవికి తనకు జరిగిన సంభాషణము ఎరిగించుట; (747)

## 19. శ్రీమత్సుందరకాండము పారాయణాంతములో పఠించవలసిన సర్గములు

1. నాగపాశవిమోచన సర్గము 750

2. ఆదిత్య హృదయము 764

3. రావణ వధ సర్గము 773

4. శ్రీరామస్తుతి సర్గము 781

5. శ్రీరామపట్టాభిషేక సర్గము 789

6. గాయత్రీ రామాయణము 817

20. శ్రీమత్సుందరకాండము పారాయణ సమాపనములో శ్రీవైష్ణవులు చదువవలసిన శ్లోకములు 827
21. శ్రీమత్సుందరకాండ పారాయణ సమాపనములో చదువవలసిన శ్లోకములు 829
22. శ్రీ ఆపదుద్ధారక హనుమత్ స్తవరాజము 831
23. శ్రీ ఆంజనేయ అష్టోత్తర శతనామస్తోత్రము 838
24. శ్రీ ఆఞ్జనేయ సహస్రనామ స్తోత్రము 841
25. శ్రీ రామాష్టకము 854





శ్రీమతే రామానుజాయ నమః

# ప్రస్తావన

వేదవేద్యే పరేపుంసి జాతే దశరథాత్మజే
వేదః ప్రాచేతసా దాసీత్సాక్షాద్రామాయణాత్మనా.

వేద ప్రతిపాద్యుడైన పరమపురుషుడు దశరథాత్మజుడై అవతరింపగా ఆ పరమపురుషుని స్వరూప రూప గుణ విభూతులను ప్రతిపాదించు వేదము కూడా వాల్మీకిని తండ్రిగా చేసుకుని భూలోకమున అవతరించెనట. పుట్టుకలేని పరమపురుషుడు అవతరించినట్లే అపౌరుషేయమైన వేదమును పౌరుషేయ మైనది. మహాతపమును ఆచరించిన దశరథుడు శ్రీరామ జనకుడు అయినాడు. చరితవ్రతుడు అయిన వాల్మీకి మహర్షి శ్రీరామాయణ జనకుడు అయినాడు. దశరథ ప్రాచేతసుల తపోవ్రతములు లోకశ్రేయమునకే వినియోగ పడినవి.

శ్రీరామాయణము ఆదికావ్యము. వాల్మీకి మహర్షి ఆదికవి. బ్రహ్మలోకము నుండి భూలోకమున అవతరించుచున్న సంస్కృత కవితా సరస్వతి ప్రథమ పాదన్యాసము వాల్మీకి యందు చేసినది. బ్రహ్మవంటి మహనీయుడు తన ఆశ్రమమునకు వచ్చి ఆదరించి

నతేవా గనృతే కావ్యే కాచిదత్ర భవిష్యతి
కురురామకథాం పుణ్యాం శ్లోకబద్ధాం మనోరమామ్.
యావత్ స్థాస్యంతి గిరయఃసరితశ్చ మహీతలే,
తావద్రామాయణ కథాత్వత్కృతా ప్రచరిష్యతి. తావదూర్ధ్వ మధశ్చత్వం మల్లోకేషు నివత్స్యసి, ఇత్యుక్త్వా భగవాన్బ్రహ్మా తత్రైవాన్తరధీయత.

అని ఆజ్ఞాపించితే లేదా కోరితే శ్రీవాల్మీకి మహర్షి శ్రీరామాయణమును రచించినాడు. కావున అది మహనీయమైన గ్రంథము. వేదములోని ఉత్తరభాగ ప్రతిపాద్యుడగు సర్వేశ్వరుని స్వరూప, రూప, గుణ విభూతులను ప్రతిపాదించుచున్నది కావున ఇతిహాస శ్రేష్ఠము అయినది. కావ్యలక్షణోపేతమై వాచ్యార్థమయిన సీతారాముల చరిత్రను ప్రతిపాదించుచు అతి రమణీయముగ వేదాంతార్థమును గూడ ధ్వనింప చేయుచున్నది. కావున ఉత్తమ కావ్యమును అయినది. ఆస్తిక భారతీయుల కెల్ల మాననీయమైనది. వేదమువలె ప్రమాణ గ్రంథము అయినది.

మజ్జనకులవలన నాకు బాల్యముననే పరిచితము అయిన శ్రీరామాయణము తరువాతి కాలమున నిత్యాను సంధేయము అయినది. సంస్కృత భాషా వ్యుత్పత్తి పెరిగినకొలది శ్రద్ధయు పెరిగెను. శ్రీరామాయణము నిత్యకాలక్షేపముగా దీర్ఘకాలము ప్రవచించితిని. శ్రీ నిర్వికల్పానందస్వామి వారి ఆజ్ఞను శిరసావహించి శ్రీరామకృష్ణ సేవాసమితి (Town Centre)లో రెండు సంవత్సరముల కాలము రామాయణ ప్రవచనము చేసితిని. ఆ ప్రవచనము పూర్తి అయిన తరువాత శ్రోతలు పెద్ద ఎత్తున హార్దికమయిన సన్మానము చేసిరి. ఈ సన్మానసభకు మా ఆచార్యులు ఉ॥వే॥ప్ర॥ శ్రీమాన్ గోపాలాచార్యస్వామివారు, ఉ॥వే॥ప్ర॥ శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యులుగారు వేంచేసి మంగళాశాసనములు కృపజేసిరి. ఇది నేను జీవితములో మరచిపోలేని మధుర ఘట్టము.

శ్రీరామాయణము అనేక పర్యాయములు పారాయణము చేయుట చేతను, ప్రవచించుటచేతను, సంస్కృత భాషతో గాఢమయిన పరిచయము, వ్యుత్పత్తి కూడా కలిగినది. శ్రీరామాయణ పారాయణ ప్రవచనములే నాకు జీవితములో విలక్షణమయిన సంతృప్తిని, పేరుప్రతిష్ఠలను శ్రేయః ప్రేయములను మనఃశాంతిని గూడ చేకూర్చినవి.

ఇటీవల నా శ్రవణ శక్తి సన్నగిల్లుటచే విశ్రాంతి నిమిత్తము రాజమండ్రిలో ఉండుట జరిగినది. అప్పుడు శ్రీమాన్ మరంగంటి

నారాయణాచార్యులుగారి ద్వారా పరియచమైన రోహిణి పబ్లికేషన్స్ వారు శ్రీవాల్మీకి రామాయణములోని సుందరకాండను పారాయణ గ్రంథముగా అనువాదము చేసిపెట్టవలసినదిగా కోరిరి. ఆరోగ్యము సరిగా లేకపోయిననూ నాకు వాల్మీకి రామాయణములోని ఆదరాభిమానములు, భక్తిశ్రద్ధలు కారణముగా వారి అభ్యర్థనను కాదనలేక పోయినాను.

శ్రీమద్వాల్మీకి రామాయణాంతర్గత సుందరకాండ పారాయణము మహాఫలప్రదము అని పెద్దలు వచించుచుందురు. జీవితములో ఏవేని క్లేశములు కలిగినపుడు స్వయముగ సుందరకాండను పారాయణ చేసికొనిగాని, మరియొకరిచే చేయించుకొనిగాని కష్టముల నధిగమించి సుఖములను పొందిన వారిని మనము ఎరుగుదుము. ఎందరికో శ్రవణ పారాయణములచే దుఃఖాపహాము, సుఖావహాము అయినది ఈ సుందరకాండ.

## సుందరకాండ

శ్రీరామచంద్రుని పట్టాభిషేకాంతము అయిన శ్రీరామాయణ కథాభాగము ఆరుకాండములుగా విభజింపబడినది.

కథాభాగములను బట్టి అన్ని కాండలకు ఆయా పేర్లు సమంజసముగా తోచుచున్నవి. కాని 5వ కాండ సుందరకాండ అని ప్రసిద్ధి గాంచినది. సుందరకాండ అనగా అందమయిన కాండ అని అర్థము. ఈ కాండయొక్క సౌందర్యము ఏమయి ఉండును.

''సుందరే సుందరో రామః
సుందరే సుందరం వనం,
సుందరే సుందరీ సీతా,
సుందరే సుందర కపిః
సుందరే సుందరం కావ్యం'' – ఇత్యాది రీతిగ పెద్దల నిర్వాహములు కలవు. రామచంద్రుని సౌందర్యము, సీతా సౌందర్యము, అశోకవన

సౌందర్యము, కావ్యరచనా సౌందర్యము మించి ఉండుటచేతను, ఆంజనేయుని బుద్ధి, శౌర్య, సాహస, పరాక్రమములు చక్కగ వర్ణింపబడుటచే ఆ పేరు ఆ కాండకు తగి ఉన్నది అని పెద్దలు చెప్పుచుందురు.

శ్రీమాన్ వేదాంత దేశికుల వారు సుందరకాండచే బోధితమగు ఆధ్యాత్మిక రహస్యార్థము ఈ క్రింది శ్లోకములచే చక్కగ నిరూపించి యున్నారు.

దర్పోదగ్ర దశేంద్రియానన మనోనక్తంచ రాధిష్ఠితే,
దేహేస్మిన్ భవసింధునా పరివృతేదీనాం దశా మాస్థితః.
అత్రత్రే హనుమత్సమేతే గురుణా సందర్శితార్థః పుమాన్
లంకారుద్ధ విదేహ రాజ తనయా న్యాయేన లాలప్యతే.

మనస్సే రావణుడు; పది ఇంద్రియములే పది తలలు; దేహమే లంక; హనుమంతుడే ఆచార్యుడు; హనుమద్వచనములే తత్త్వజ్ఞానోపదేశములు.

ఎందరో కృతార్థులయిన గాథలు ఈ సుందరకాండలో వివరింపబడెను.

శ్రీరామునకు సీతాదేవి జాడ, క్షేమము తెలిసినవి. సీతాదేవికి శ్రీరాముని క్షేమము, ప్రయత్నము తెలిసినది. హనుమానునకు సీతాదర్శనము కల్గినది. వానరులకు సీతాన్వేషణయత్నము సఫలమై సుగ్రీవ దండనము తప్పినది. సుగ్రీవునకు ప్రతిజ్ఞాపూర్తి లభించినది.

ఇంతమందికి అనిష్టనివృత్తి కలిగి ఇష్టప్రాప్తి కలిగిన అంశము ఇందు ఉండుటచే ప్రవచనము చేయువారు, శ్రవణము చేయువారు కూడ తమ అరిష్టముల తొలగి, ఇష్టసిద్ధి లభించునను విశ్వాసముతో ఈ సుందరకాండ శ్రవణ, పారాయణలకు ఇష్టపడుదురు.

రోహిణి పబ్లికేషన్స్ వారి కోరికమేర సుందరకాండానువాదమునకు ఉద్యుక్తుడనైతిని. కాని లేఖనము ఒక సమస్య అయినది. నాలిపి నాకే

చదువుటకు అశక్యము. ఆ సమయమున మా పౌత్రి చి॥సౌ॥ సుధారాణి, B.A., మా దౌహిత్రుడు చి॥ శ్రీనివాసాచార్యులు వ్రాయుటకు కుతూహలము చూపిరి. స్వల్పకాలములో సుందరకాండానువాదము పూర్తి అయినది.

అనువాదము చేయునపుడు గంభీరమయిన సంప్రదాయ విషయముల జోలికి పోలేదు. సామాన్య జనులను దృష్టిలో పెట్టుకొని వారి భాషలో సరళమయిన శైలిలో వారి హృదయములకు హత్తుకొనునట్లుగా సామాన్య శైలిలో విశదముగ ఉండునట్లు వ్రాసితిని.

సుందరకాండానువాదము ఏ శ్లోకమునూ పరిత్యజించకుండ చేసిన మాట నిజమేగాని, సీతాదేవి శ్రీరామచంద్రుని స్వరూపమును వర్ణింపుమని కోరగా ఆంజనేయుడు కొన్ని లక్షణములను అతి గంభీరముగా నిగూఢముగా శ్రీరామచంద్రుని శరీర లక్షణములను వర్ణించును. ఆ సాముద్రిక లక్షణములను గోవిందరాజాచార్యులవారు సప్రమాణముగ నిరూపించిరి. తదనుసారముగ అనువదించుటకు అవకాశము ఉన్ననూ సామాన్య జనులకు సరసముగ తోచవేమో అను అభిప్రాయముతో రెండు, మూడు శ్లోకములు విడిచితిని. ఇది బుద్ధిపూర్వకముగ చేసిన పరిత్యాగము. విజ్ఞులు అన్యథా భావించరని తలంచితిని. వయోభారము చేత అనవధానము చేత అనిష్టములు ఏమయిన దొర్లిననూ అవి అభిజ్ఞులకు క్షమార్హములు.

అనువాదకర్త

శ్రీమత్తిరుమల పురిహెళ్ళ వేంకట కోనప్పాచార్యులు

# సుందరే కిం న సుందరమ్?

శ్రీమాన్ డాక్టర్ సముద్రాల వేంకట రంగ రామానుజాచార్యులుగారు
సంస్కృతోపన్యాసకులు, ఆంధ్రగీర్వాణ పీఠము,
కొవ్వూరు, పశ్చిమ గోదావరి జిల్లా,
ఆంధ్రప్రదేశ్

శ్రీమద్రామాయణ సమగ్ర సౌందర్యం సుందరకాండలో ప్రోదిచేసికొని ఉన్నదని విజ్ఞుల అనుభవం.

సుందరే సుందరో రామః, సుందరే సుందరః కపిః,
సుందరే సుందరీ సీతా, సుందరే కిం న సుందరమ్ - అని సూక్తి.

సుందరకాండంలో శ్రీరామసౌందర్యం ఉపక్షిప్తమై ఉంది హనూమద్వచనాలలో సుందరకాండంలో కపి అయిన 'హనుమ' సుందరుడుగా సాక్షాత్కరిస్తాడు. ఈ హనూమత్సౌందర్యం సమగ్రంగా విజ్ఞులచే దర్శింపబడుతున్నది. కార్యనిర్వహణదక్షుడైన దూతగా, జీవుని పరమాత్మలో అనుసంధానం చేసే ఆచార్య పురుషుడుగా రెండురకాల, హనుమ మనకు సుందరుడుగా సాక్షాత్కరిస్తాడు. సీతాసౌందర్యం ఇక్కడ విరాడ్రూపాన్ని ధరించి గోచరిస్తుంది. ఈ విధమైన సౌందర్యవైవిధ్యాన్ని దర్శింపజేయడానికి మహర్షి వాల్మీకి ఆశ్రయించిన శబ్దగ్రథనశైలి, అర్థోపవర్ణన విధానం, ఆ అర్థాన్ని సాలంకారంగా, సరసంగా ఉపనిబంధనం చేసినతీరు సుందరతమమై గోచరిస్తుంది. ఇన్ని అందాలు ప్రోదిచేసికొన్న దవడంచేత సుందరకాండం సర్వతోముఖసుందరం అని భావిస్తారు పెద్దలు.

ఒక అలంకారాన్ని వేసినా, ఒక వర్ణన చేసినా కవితాసౌందర్యం పురివిప్పి నాట్యం చేసే మయూరంగా గోచరిస్తుంది. పఠితలకు, కవిత్వానికి, చూచిన వెంటనే రమణీయతను కలిగించేది శబ్దం. అర్థంలో అందం వెంటనే బుద్ధి గోచరంకాదు. దానికి కొంత సమయం పడుతుంది. కేవలం శబ్ద సౌందర్యమాత్రప్రధానాలైన కావ్యాలను అధమకావ్యాలుగా ఆలంకారికులు పరిగణించినా, శబ్దసౌందర్యం ఉపాదేయంకాదని అనే సాహసం ఎవ్వరూ చేయలేదు.

'త దేత దాహుః సౌశబ్ద్యం నార్థవ్యుత్పత్తి రీదృశీ' ఇత్యాదిగా సుశబ్దత అనేది కవిత్వోపాదేయతా లక్షణంగా పేర్కొన్నారు. ఈ సుశబ్దతారూపమైన స్వభావాన్ని కూడా వాల్మీకి సుందరకాండంలో బాగా ఆదరించాడు.

పంచమసర్గంలో చంద్రవర్ణన సందర్భంలోని 'తత స్స మధ్యంగత మంశుమన్తం జ్యోత్స్నా వితానం మహ దుద్వమన్తమ్' ఇత్యాది శ్లోకాల్లో ఈ సౌశబ్ద్యం బాగా స్వీకరింపబడింది. ఈ విధమైన శబ్దవిన్యాసాలనే శబ్దాలంకారాలుగా అలంకారికులు పేర్కొన్నారు. ఇలాగే, అర్థాలంకారాలకు సుందరకాండంలో కొదువలేదు. ఉపమలు, ఉత్ప్రేక్షలు, అతిశయోక్తులు పుంఖానుపుంఖాలుగా ఖలేకపోతన్యాయంగా ఆవిర్భవిస్తూ ఉంటాయి. కాళిదాసాదులకు స్ఫూర్తిని కలుగజేయగల ఉపమాసౌందర్యాన్ని మనం సుందర కాండంలో దర్శింపవచ్చు. లంకను వర్ణిస్తూ 'మనసేవ కృతాంలంకామ్' మనస్సుచేత నిర్మింపబడినదా అన్నట్లున్నదని ఉత్ప్రేక్షిస్తాడు.

లంకను వర్ణించిన తీరు రెండు రకాలుగా భావింపవలసి ఉంది. ఒకటి సాక్షాత్తు విశ్వకర్మ తన నిర్మాణ కౌశలాన్ని అంతటినీ చూపి, ఇతరేతర వస్తునిర్మాణ సమర్థాలైన సామాన్య పరికరాలతో ఉపాదాన సామగ్రితో కాక మనస్సుతోనే సంకల్పమాత్రంచేత నిర్మించాడా అన్నట్లున్నది లంక అని అత్యాశ్చర్యకరమైన లంకానిర్మాణాన్ని ప్రశంసిస్తాడు వాల్మీకి. దీని విశిష్టతను సూచించడానికి 'అచింత్యామ్, అద్భుతాకారామ్' అని అంటాడు. లంకను దర్శించినపుడు దాని సౌందర్యాన్ని చూచి హర్షించినా, దానిలో ఎలా ప్రవేశించాలి? అనే విచికిత్సతో విషణ్ణుడు కూడా అయినాడు హనుమ. 'ఆసీ ద్విషణ్ణో హృష్టశ్చ'. అయితే లంకలో ప్రవేశించి తాను దర్శింపవలసిన సీతమ్మను దర్శించడంలో ఔత్సుక్యాన్ని ఎంతమాత్రం వీడలేదు. 'వైదేహ్యా దర్శనోత్సుకః' అన్నాడు వాల్మీకి. హనుమ యొక్క ఈ లంకాదర్శనోద్యమం, శతయోజనవిస్తీర్ణ సాగరలంఘన ప్రయత్నం - లంకా ప్రవేశం, సీతా దర్శనం, రాక్షస సేనా హననం - రామదౌత్య నిర్వహణం ఇవన్నీ పారమార్థికదృష్టితో సమన్వయించినప్పుడు పైన పేర్కొన్న లంకావిశేషణలన్నీ విలక్షణాలైన అభిప్రాయాలను వ్యక్తపరుస్తాయి.

లంకను విశ్వకర్మ మనస్సుతో నిర్మించినాడట! వివిధ స్వభావవిచిత్రమైన ఈ సృష్టిని లంకగా పేర్కొనవచ్చు. దీనిని విశ్వకర్మ అంటే పరమాత్మ, మనస్సుతో అంటే స్వసంకల్పంచేత నిర్మించాడు. ఈ ప్రాకృతిక సృష్టి చేసి జీవునిలోపల ప్రవేశపెట్టి పరమాత్మ తానుకూడా ప్రవేశించి తదాధారమై ఉన్నాడని ఉపనిషత్తులు

ఉద్ఘోషిస్తున్నాయి. 'హ న్తాహ మిమాః తిస్రోదేవతా అనేన జీవేన ఆత్మనా అనుప్రవిశ్య నామరూపేత్యా కరవాణి' ఇత్యాదిగా ఈ లంకలో ప్రవేశించడం చాలా కష్టం. దీనిలో ప్రవేశించి సీతాన్వేషణం చేయాలనే పూనికయే 'దుష్కరం'. అందుకనే - 'దుష్కరం నిష్ప్రతిద్వంద్వం చికీర్షన్ కర్మ వానరః' అని హనుమ చేసే ఆ ప్రయత్నాన్ని 'దుష్కరం' అన్నాడు వాల్మీకి. అంతేకాదు అది 'నిష్ప్రతిద్వంద్వం' దీనితో సాటియైన ప్రయత్నం మరొకటి లేదన్నాడు.

లంకలో ప్రవేశించడానికి ముందు శతయోజనవిస్తీర్ణమైన సాగరాన్ని దాటాలి. అలా దాటేటప్పుడు కూడా ఎన్నో అడ్డంకులు. వాటిని గడచి, లక్ష్యాన్ని చేరుకోవాలి. లక్ష్యాన్ని చేరుకోవడానికి నాల్గు లక్షణాలు కావాలన్నాడు మహర్షి. 'యస్య త్వేతాని చత్వారి వానరేంద్ర! ధాతేవ! ధృతి ర్దృష్టి ర్మతి ర్దాక్ష్యం స్వకర్మసు న సీదతి' ధృతి, దృష్టి, మతి, దాక్ష్యం ఈ నాలుగూ ఉన్నవాడే శతయోజన విస్తీర్ణ సాగరాన్ని అవలీలగా దాటి, లంకలో ప్రవేశించి, సీతాన్వేషణం చేసి కృతకృత్యుడు కాగలుగుతాడు. ఏదైనా ఒక లోకకల్యాణకరమైన కృత్యాన్ని సాధించదలచిన ఏమానవునికైనా ఈ నాలుగూ అత్యవసరం అని, హనుమత్ ప్రయత్నం మనకు విశదపరుస్తుంది.

ఏ పనిచేయాలన్నా ముందు సాధించాలనే దృఢమైన అధ్యవసాయం కావాలి. 'అనారంభో మనుష్యాణాం ప్రథమం బుద్ధి లక్షణం' అన్నట్లు మనకెందుకులే, ఈ పని మనం చేయకపోతే ఏమి? అని స్తబ్ధంగా ఉండడమే మానవనైజం. అలాకాక లోకకల్యాణకరమైన కార్యాన్ని దేన్ని సాధించాలన్నా ముందు దృఢాధ్యవసాయం

(దృఢనిశ్చయం) అత్యవసరం. అదే ప్రథమశ్లోకంలో 'ఇయేష పద మన్వేష్టుమ్' సీతమ్మ జాడను తెలిసికోవడానికి అభిలషించాడని చెప్పడం ద్వారా సూచించాడు మహర్షి.

ఈ ప్రయత్నం లక్ష్యంనుండి తొలగక ఏకాగ్రంగా ఉండాలంటే, ఆ సాధింపదగిన కృత్యమందే దృష్టి కావాలి. సాధింప సంకల్పించి కదలడం ప్రారంభించగానే సాధకుడైన యోగికి, ఈ ప్రాకృతికప్రపంచంలో ఆత్మను దర్శించి పరమాత్మతో యోజన చేయాలని ప్రయత్నించే మహానుభావునికి, యోగదశలో వివిధ సిద్ధులు లేదా, ఇతరేతరప్రయోజనాలు లభిస్తే వాటిపట్ల వైముఖ్యం, లక్ష్యదృష్టి కావాలి. కార్యసాధకునికికూడా కార్యసాధనారంభ దశలో కలిగే ప్రశంసలు, సమ్మానాలు ఇవన్నీ అనుకూల ప్రతిబంధకాలు. వీటిని 'దృష్టి'తో గడవాలి. అదే మైనాక సమ్మాన తిరస్కారంగా వర్ణింపబడింది. ఇది గడచినా, కార్యసాధనకు గల పూనికను, సామర్థ్యాన్ని పరీక్షించడానికి పెద్దలు పెట్టే పరీక్షలు గడవడం, అలాగే సిద్ధికైయత్నించే యోగికి ఆతని మానసికస్థైర్యాన్ని పరీక్షించేందుకు కలిగే ప్రతిబంధాలే సురసాగమనాదులు. వీటిని యుక్తితో దాటాలి.

ఇక చివరికి సింహికానిగ్రహణం – అంటే సాధకుడు తనకు అత్యంత ప్రతిబంధకాలైన దోషాలను పూర్తిగా నిగ్రహింపగల్గటం, అంటే దక్షత కలిగి ఉండటం. ఇలా నాల్గు లక్షణాలున్న సాధకుడే 'ఆచార్య పద' సమ్మాననీయుడు, ఇలా నాల్గు లక్షణాలుగల కార్యసాధకుడే కార్యసాధనసమర్థుడు. హనుమ ఈ నాల్గు లక్షణాలు కలిగి ఉండటం చేతనే సాగరతరణం చేసి లంకాప్రవేశ సామర్థ్యాన్ని

నిరూపించుకున్నాడు. ఇక లంకలో ప్రవేశించడం కూడా చాలా కష్టమే. దానికి ముందు 'లంకిణి'ని నిర్జించాలి. అంటే ఈ ప్రాకృతికాలైన దేహప్రవృత్తులను ఇంద్రియ జయాదుల ద్వారా నిగ్రహించి - అంతర్ముఖుడు కాగలగడమే. అలా అంతర్ముఖుడైన సాధకునికి తత్త్వదర్శనం చేయడానికి ఉపకరించేది ప్రణవం. ఇదే 'అద్వారం' 'అ' అనే వర్ణం ద్వారంగా కలది.

అ ఉ మ్ అనే మూడువర్ణాల సంపుటి అయిన ప్రణవంలో మూలాక్షరం అకారమే. 'యో వే దాదౌ స్వరః ప్రోక్తః వేదాన్తేషు ప్రతిష్ఠితః తస్యప్రకృతిలీనస్య యః పరః స మహేశ్వరః' అనే మంత్రం ఈ అభిప్రాయాన్నే చెబుతుంది. లంకిణిని నిర్జించిన హనుమ 'అద్వారేణ మహాబాహుః ప్రాకార మభిపుప్లువే' అంటాడు మహర్షి. ఇలా లంకలో ప్రవేశించడానికి సత్త్వస్థైర్యం కావాలంటాడు -

'సత్త్వ మాస్థాయ మేధావీ, హనుమాన్ మారుతాత్మజః,
నిశి లఙ్కాం మహాసత్త్వో వివేశ కపికుఞ్జరః.'

అన్న శ్లోకంలో హనుమకు వేసిన విశేషణాలు మనం చాలా జాగరూకతతో పరిశీలించాలి. మేధావీ మహాసత్త్వః, సత్త్వ మాస్థాయ - మారుతాత్మజః - కపికుఞ్జరః ఇవన్నీ తరచిన కొద్దీ అగాధాలైన తాత్త్విక భావాలను, సాధకుని చిత్త స్థైర్యాది గుణసంపత్తిని విస్పష్ట పరుస్తాయి. హనుమ లంకలో రాత్రి సమయంలో ప్రవేశించాడు. ఇదే తగిన సమయం అంటాడు కవి. తాను ధరించవలసిన రూపం 'లక్ష్యాలక్ష్యం' అంటాడు.

లక్ష్యా లక్ష్యేణ రూపేణ రాత్రౌ లఙ్కాపురీ మయా,
ప్రవేష్టుం ప్రాప్తకాలం మే కృత్యం సాధయితుం మహత్.

తాను సాధింపవలసిన కృత్యం ఎంతో గొప్పది. దానిని సాధించాలంటే - 'యా నిశా సర్వభూతానాం' అని శ్రీగీతలో చెప్పినట్లు ఇంద్రియప్రవృత్తులతోపాటు సర్వవిధ మనఃప్రవృత్తులు బహిఃప్రవృతాలు కాకుండా అంతస్స్రోతములై ఉండే దశయే నిశ. ఆ దశలో రావణుడు నిదురించి ఉన్నదశలో రాక్షసులు గాఢనిద్రలో ఉన్న దశలో హనుమ లంకలో చేరాడు. ఆత్మదర్శనోన్ముఖుడై యోగీయ భూములను క్రమంగా దాటి ఆత్మదర్శనదశకు చేరే సాధకునికి, ముందు దశల్లో కొన్ని సిద్ధులు భోగభూముల అనుభవాలు సన్నిహితాలైనా వాటిపట్ల భోగ్యతాబుద్ధి లేకయే నిర్వికారచిత్తుడై యోగభూములను క్రమంగా దాటటం యోగికి ముఖ్య లక్షణం. ఆచార్యపురుషుల స్థితి ఇదే. లంకను వెదకుతున్నప్పుడు రావణాంతఃపురం - అక్కడ ఉండే భోగాలు, పానభూములు ఇవన్నీ ఆహ్వానిస్తున్నట్లుగా ఉన్నాయట. అసలు రావణ నివాసమైన అంతఃపురమే - భూమిపై పరచిన స్వర్గంలా ఉందట. 'మహీతలే స్వర్గమివ ప్రకీర్ణం'. ఇక్కడ రావణ నివాసశాలను దర్శించిన హనుమకు ఆశాల, మాతలా గోచరించిందట. రావణునికి మాత్రం మనఃకాంత అయిన కాంతలా భోగ్యమై ఉన్నదట.

తత స్తాం ప్రస్థిత శ్శాలాం దదర్శ మహతీం శుభాం,
రావణస్య మనఃకాన్తాం కాన్తామివ వరస్త్రియమ్.

అని ప్రారంభించి రావణుని భోగ్యకాంతలా ఉన్న ఆ దేశాలు హనుమకు -

ఇన్ద్రియాణీ న్ద్రియార్థైస్తు పఞ్చ పఞ్చభి రుత్తమైః,
తర్పయామాస మాతేవ తదా రావణ పాలితా'

తల్లిలా తృప్తిని కలిగించిందంటాడు. ఈ శ్లోకాలు చాలా గంభీరార్థం కలిగి ఉన్నాయి. వీటిని వ్యాఖ్యాతలు వ్యాఖ్యానింపకయే పాఠకుల భావనకు విడిచిపెట్టారు.

ఈ ప్రాకృతికప్రపంచానికి ప్రతీకం లంక. లంకలోని రావణ భోగ్యమైన సంపద అంతా అలాంటిదే. అనియంత్రితమైన మనస్సుకు తద్వశాలైన ఇంద్రియాలకు ఈ ప్రకృతి అంతా ఒక భోగ్యవస్తువుగానే గోచరిస్తుంది. భోగానుభవాన్నే కలుగజేస్తుంది. ఐదు ఇంద్రియములకు కలిగే శబ్దస్పర్శరూపరసగంధాలనే ఐదు విషయాల అనుభవం అనియంత్రిత మనస్సుకు భోగతృప్తిజనకం. అయితే యోగులు – ఆచార్య పురుషులు ఇదే ప్రకృతితో తామున్నా ఈ ప్రకృతి వారికి భోగ్యతాబుద్ధిజనకం కాదు. చిన్నపిల్లవానిని తల్లి అక్కున జేర్చి, వానికి తియ్యని చనుబాలనిచ్చి, తన ఎదపై మెత్తని స్పర్శ కలుగజేస్తూ, తాను ధరించిన పూవుల పరిమళంచేత, తాను పాడే లాలిపాటచేత ఐదు ఇంద్రియాలకు తృప్తి కలిగించినా ఈ తృప్తి భోగ్యతాబుద్ధికి దూరమైన అలౌకిక పరితృప్తియేతప్ప వేరుకాదు. ఈ ప్రకృతిమండలాన్ని లీలావిభూతిగా భగవచ్ఛరీరంగా భావించి దర్శింపగల ఉత్తమసిద్ధిపురుషునకు శబ్దస్పర్శరూపరసగంధాలు ఏవీ భోగ్యతా బుద్ధికృతమైన తృప్తిని కాక ఒక అలౌకిక పరమపవిత్రభావనామేదురమైన తృప్తిని కలిగించేవే తప్ప వేరుకాదు. ఇటువంటి అలౌకికతృప్తిని పొందగలగడం ఉత్తమోత్తమాధికారులకు మాత్రమే సాధ్యం. కనుకనే హనుమకు రావణశాలాదర్శనం వల్ల కాని, రావణాంతఃపుర స్త్రీల దర్శనం వల్లకాని, మానసవికారం ఎంతమాత్రం కలుగలేదంటాడు మహర్షి.

న హి మే మనసః కించిత్ వైకృత్య ముపపద్యతే,
మనో హి హేతుః సర్వేషా మిన్ద్రియాణాం ప్రవర్తనే.
శుభాశుభాస్వవస్థాసు తచ్చ మే సువ్యవస్థితమ్,
సర్వవికారాలకు మూలం మనస్సే.

శుభాశుభావస్థల్లో మనస్సు పొంగక, క్రుంగక ఉండేవాడే స్థితప్రజ్ఞుడు. అలా ఉండగలగడమే సమదర్శనం అంటుంది శ్రీగీత. స్థితప్రజ్ఞతయే జీవునికి గల స్వరూప సౌందర్యం.

ఇటువంటి స్థితప్రజ్ఞగల పరమాచార్యపురుషుడుగా సుందర కాండంలో అడుగడుగునా హనుమ మనకు గోచరిస్తాడు. సీతాన్వేషణంలో విరోధులైన రాక్షసుల నిరసనంలో సీతమ్మకు రామ సందేశాన్ని అంగుళీయకాన్ని అందించి, రావణుని ప్రతిబోధించి తిరిగి శ్రీరామ సన్నిధి చేరేవరకు మహర్షి సుందరకాండంలో హనుమ యొక్క విరాడ్రూపాన్ని దర్శింపజేశాడు. హనుమత్సౌందర్యం అనుభవైకవేద్యం.

'ఇషుక్షయా న్నివర్తన్తే నాంతరిక్ష క్షితి క్షయాత్' అన్నట్లుగా బుద్ధి ప్రసరించక పాఠకులు ఒక దశలో ఆగిపోవలసినదే తప్ప విషయానికి కొదువ ఎంతమాత్రం లేదు సుందరకాండంలో. పలువురు మహానుభావులు, పలు దృక్కోణాలతో దీన్ని వివరించ యత్నించారు. వారివారి అధికారాన్ని బట్టి వారువారు ఆయా విశేషాలను గ్రహించగలుగుతారు.

శ్రీమద్రామాయణాన్ని ఒక మహాకావ్యంగానే సాహిత్యదృష్టితోనే పరిశీలించాలని కొందరి వాదం. కాదు అందులో

పరమార్థ తత్త్వాన్ని సాంప్రదాయిక మార్గాన దర్శించాలని పెద్దలైన ఆచార్యుల అనుభవం.

ఈ రెండు దృష్టులకు పారస్పరికవైరుధ్యం ఏమీ లేదు. ఒకటి మొదటి మెట్టు అయితే రెండవది పై మెట్టు. మొదటి మెట్టు ఎక్కిన తరువాతనే రెండవ మెట్టు ఎక్కినట్లుగా సాహిత్య దృష్టితో రామాయణాన్నీ సుందరకాండాన్నీ దర్శించి అంతటితో తృప్తిచెంది ఉండిపోక తాత్త్విక దృష్టితో మరింత లోతుగా దర్శిస్తే అప్పుడే ఆ దృష్టి అవగాహనం సమగ్రం, ప్రయోజనకారి అవుతుంది.

దీనికి చక్కని తెలుగు వివరణాన్ని అందించిన ఉభయ వేదాంత ప్రవర్తకులు, సంస్కృతాంధ్ర సారస్వత పారదృశ్వులు, సంప్రదాయ నిష్ఠాపరినిష్ఠితులు అయిన శ్రీమాన్ కోనప్పాచార్య స్వామివారు సర్వథా అభినందనీయులు. ఇలాగే మరికొన్ని అనర్ఘమణులను వెలికిదీసి సానపట్టి మెరుగులు దిద్ది, పాఠకలోక హృదయసీమల నలంకరించేటట్లు చేస్తారని, చేయాలని ఆశిస్తూ, ఈ మాటలు రాసే అవకాశం ఇచ్చిన రోహిణి పబ్లికేషన్స్ వారికి నిజంగా ఇదియే శుభారంభం అని మనవి చేస్తూ విరమిస్తున్నాను.

భవదీయుడు

డాక్టర్ సముద్రాల వేంకట రంగరామానుజాచార్యులు.

సకలాభీష్టప్రదాయి సుందరకాండము

# శ్రీ ఆఞ్జనేయ యంత్రము




ఈ యంత్రమును 5" X 5" పరిమితిగల బంగారము లేక ఛాదీవెండి రేకుపై తయారుచేయించి, శుభ నక్షత్రము, తిథులతో కూడిన మంగళవారమునాడు ఆవుపాలతో శుద్ధి చేసి అష్టోత్తర శతనామములతో శాస్త్రోక్తంగా పూజించి, పూజామందిరంలో ఉంచినచో సర్వశుభములు చేకూరును.



# ఆంజనేయ స్తోత్రమ్

శృణు దేవి ప్రవక్ష్యామి స్తోత్రం సర్వభయాపహమ్,
సర్వకామప్రదం నృణాం హనూమత్ స్తోత్ర ముత్తమమ్. 1

తప్తకాంచనసఙ్కాశం నానారత్నవిభూషితమ్,
ఉద్యద్బాలార్కవదనం త్రినేత్రం కుణ్డలోజ్జ్వలమ్. 2

మౌఞ్జీ కౌపీనసంయుక్తం హేమయజ్ఞోపవీతినమ్,
పిఙ్గళాక్షం మహాకాయం టఙ్కశైలేన్ద్రధారిణమ్. 3

శిఖానిక్షిప్త వాలాగ్రం మేరుశైలాగ్ర సంస్థితమ్,
మూర్తిత్రయాత్మకం పీనం మహావీరం మహాహనుమ్. 4

హనూమన్తం వాయుపుత్రం నమామి బ్రహ్మచారిణమ్,
త్రిమూర్త్యాత్మక మాత్మస్థం జపాకుసుమసన్నిభమ్. 5

నానాభూషణసంయుక్త మాఞ్జనేయం నమా మ్యహమ్,
పఞ్చాక్షరస్థితం దేవం నీలనీరదసన్నిభమ్. 6

పూజితం సర్వదేవై శ్చ రాక్షసాన్తం నమా మ్యహమ్,
అచలద్యుతిసఙ్కాశం సర్వాలఙ్కారభూషితమ్. 7

షడక్షరస్థితం దేవం నమామి కపినాయకమ్,
తప్తస్వర్ణమయం దేవం హరిద్రాభం సురార్చితమ్. 8

సుస్వరం సాబ్జనయనం త్రినేత్రం తం నమా మ్యహమ్,
అష్టాక్షరాధిపం దేవం హీరవర్ణసముజ్జ్వలమ్. 9

నమామి జనతావన్ద్యం లఙ్కాప్రాసాదభఞ్జనం,
అతసీపుష్పసఙ్కాశం దశవర్ణాత్మకం విభుమ్. 10

జటాధరం చతుర్బాహుం నమామి కపినాయకం,
ద్వాదశాక్షరమన్త్రస్య నాయకం కున్తధారిణమ్. 11

అఙ్కుశఞ్చ దధానఞ్చ కపివీరం నమా మ్యహం,
త్రయోదశాక్షరయుతం సీతాదుఃఖనివారణమ్. 12

పీతవర్ణం లసత్కాయం భజే సుగ్రీవమన్త్రిణమ్,
మాలామన్త్రాత్మకం దేవం చిత్రవర్ణం చతుర్భుజమ్. 13

పాశాఙ్కుశాభయకరం ధృతటఙ్కం నమా మ్యహం,
సురాసురగణై స్సర్వై స్సంస్తుతం ప్రణమా మ్యహమ్. 14

ఏవం ధ్యాయే న్నరో నిత్యం సర్వపాపైః ప్రముచ్యతే,
ప్రయాతి చిన్తితం కార్యం శీఘ్రమేవ న సంశయః. 15

అష్టమ్యాం వా చతుర్దశ్యా మర్కవారే విశేషతః,
సన్ధ్యాపూజాం ప్రకుర్వీత ద్వాదశ్యాఞ్చ విశేషతః. 16

అర్కమూలేన కుర్వీత హనుమత్ప్రతిమాం సుధీః,
పూజయే త్తత్ర విద్వాన్ యో రక్తవస్త్రేణ వేష్టయేత్. 17

బ్రాహ్మణా న్భోజయే త్పశ్చా త్తత్ప్రీత్యై సర్వకామదామ్,
యః కరోతి నరో భక్త్యా పూజాం హనుమత స్సుధీః. 18

న శస్త్రభయ మాప్నోతి భయం వా ప్యస్త్రరిక్షజమ్,
అక్షాదిరాక్షస హరం దశకణ్ఠదర్ప
నిర్మూలనం రఘువరాఙ్ఘ్రిసరోజభక్తమ్,
సీతాఽవిషహ్యఘనదుఃఖనివారకం తం,
వాయోస్సుతం గిలితభాను మహం నమామి. 19

మాం పశ్య పశ్య హనుమన్ నిజదృష్టిపాతైః
మాం రక్ష రక్ష పరితో రిపుదుఃఖపుఞ్జాత్,
వశ్యాం కురు త్రిజగతీం వసుధాధిపానాం,
మే దేహి దేహి మహతీం వసుధాం శ్రియం చ. 20

ఆపద్భ్యో రక్ష సర్వత్ర ఆంజనేయ నమోఽస్తు తే,
బన్ధనం ఛేదయాజస్రం కపివీర నమోఽస్తు తే. 21

దుష్టరోగాన్ హన హన రామదూత నమోఽస్తుతే,
ఉచ్చాటయ రిపూ న్సర్వా న్మోహనం కురు భూభుజామ్. 22

విద్వేషిణో మారయ త్వం త్రిమూర్త్యాత్మక సర్వదా,
సఞ్జీవపర్వతోద్ధార మనోదుఃఖం నివారయ. 23

ఘోరా నుపద్రవాన్ సర్వాన్ నాశ యాక్షాసురాన్తక,
ఏవం స్తుత్వా హనూమన్తం నర శ్శ్రద్ధాసమన్వితః, 24
పుత్రపౌత్రాదిసహితః సర్వసౌఖ్య మవాప్నుయాత్.

ఇ త్యుమాసంహితాయాం ఆంజనేయస్తోత్రమ్
సంపూర్ణమ్.

# శ్రీమద్రామాయణపారాయణక్రమః

సద్గురుసకాశా ల్లబ్ధోపదేశో వక్ష్యమాణరీత్యా శ్రీరామాయణ పారాయణం కుర్యాత్ - దేశకాలౌ సంకీర్త్య:-

అస్య శ్రీ రామాయణమహామన్త్రస్య; వాల్మీకి ర్భగవాన్ ఋషిః, అనుష్టుప్ఛందః, శ్రీ సీతాలక్ష్మణభరతశత్రుఘ్న హనుమత్సమేత శ్రీరామచన్ద్రో దేవతా; రాం బీజం; శ్రీం శక్తిః; మం కీలకం! మమ శ్రీ సీతాలక్ష్మణభరతశత్రుఘ్న హనుమత్సమేత శ్రీరామచన్ద్ర ప్రసాదసిద్ధ్యర్థే పారాయణజపే వినియోగః; రాం అంగుష్ఠాభ్యాన్నమః; రీం తర్జనీభ్యాం స్వాహా; రూం మధ్యమాభ్యాం వషట్! రైం అనామికాభ్యాం హుం; రౌం కనిష్ఠికాభ్యాం వౌషట్; రః కరతలకరపృష్ఠాభ్యాం ఫట్; రాం హృదయాయ నమః! రీం శిరసే స్వాహా! రూం శిఖాయై వషట్; రైం కవచాయ హుం! రౌం నేత్రత్రయాయ వౌషట్; రః అస్త్రాయ ఫట్! లోకత్రయేణ దిగ్బన్ధః.

### ధ్యానమ్

కాలామ్భోధరకాన్తికాన్త మనిశం వీరాసనాధ్యాసినం
ముద్రాం జ్ఞానమయీం దధాన మపరం హస్తామ్బుజం జానుని,
సీతాం పార్శ్వగతాం సరోరుహకరాం విద్యున్నిభాం రాఘవం
పశ్యన్తం మకుటాఙ్గదాదివివిధాకల్పోజ్జ్వలాఙ్గం భజే.

## అథ మానసికపూజా

లం పృథివ్యాత్మనే శ్రీరామచన్ద్ర పరబ్రహ్మణే గన్ధం సమర్పయామి - హం ఆకాశాత్మనే శ్రీరామచన్ద్ర పరబ్రహ్మణే పుష్పం సమర్పయామి - యం వాయ్వాత్మనే శ్రీరామచన్ద్ర పరబ్రహ్మణే ధూపమాఘ్రాపయామి - రం అగ్న్యాత్మనే శ్రీరామచన్ద్ర పరబ్రహ్మణే దీపం దర్శయామి - వం అమృతాత్మనే శ్రీరామచన్ద్ర పరబ్రహ్మణే అమృతోపహారం సమర్పయామి - సం సర్వాత్మనే శ్రీరామచన్ద్ర పరబ్రహ్మణే సర్వోపచారపూజా స్సమర్పయామి - ఇతి మానసిక పూజా.

## మూలమన్త్రః

ధర్మాత్మా సత్యసన్ధశ్చ రామో దాశరథి ర్యది,
పౌరుషే చాప్రతిద్వంద్వ శ్శ రైనం జహి రావణిమ్.

ఇతి, యథాశక్తి జపిత్వా, శ్రీ రామాయణపారాయణం కుర్యాత్. అనన్తరం, పునః, ధ్యానం, మానసికపూజాం, హృదయాదిన్యాసం చ కుర్యాత్ - లోకత్రయేణ దిగ్విమోకః.

గుహ్యాతిగుహ్యగోప్తా త్వం గృహాణాస్మత్కృతం జపమ్,
సిద్ధి ర్భవతు మే దేవ త్వత్ప్రసాదా ద్రఘూద్వహ.
ఇతి పారాయణం శ్రీరామచన్ద్రాయ సమర్పయేత్

శ్రీరామచన్ద్రార్పణమస్తు.

# తత్త్వ సంగ్రహ రామాయణమున చెప్పబడిన శ్రీమత్సున్దరకాండ శ్రవణ ఫలము

సున్దరాదిమసర్గస్థహనూమద్విక్రమాదికమ్,
శ్రుత్వాఽపస్మారకుష్ఠాదిభూత బేతాళనాశనమ్. 1

స నిర్జితపురీం శేషా మితి శ్లోకాదిమాక్షరమ్,
శ్రుత్వా బన్ధా ద్విముక్తస్సన్ బ్రహ్మభూయాయ కల్పతే. 2

సీతాసందర్శనంశ్రుత్వా వీతశోకో భవిష్యతి,
శ్రుత్వా తు త్రిజటాస్వప్నం దుస్స్వప్నం నశ్యతి ధ్రువమ్. 3

శ్రీరామముద్రికాదానం యే శృణ్వ న్త్యాదరేణ తు,
నిర్జిత్య శత్రూన్ సంగ్రామే స్థిరం రాజ్యం వ్రజన్తి తే. 4

ధన్యా దేవా స్సగన్ధర్వా స్సిద్ధా ఇత్యత్ర చాదిమమ్,
శ్రుత్వా చతుర్దశం వర్ణ మనఙ్గో వాయువచ్చ రేత్. 5

హనూమద్గ్రహణం శ్రుత్వా బన్ధా న్ముచ్యేత మానవః,
లఙ్కా దాహా ద్యనుశ్రుత్వా తాపత్రయహతి ర్భవేత్. 6

మఙ్గలాభిముఖీ త్యస్మిన్ శ్లోకే యత్ప్రథమాక్షరమ్,
త ద్గాత్ర్యాః పఞ్చదశం శ్రుత్వా మద్రూపభాగ్భవేత్. 7

శ్రుత్వా తు పఞ్చమం కాణ్డం హనూమద్విజయాఙ్కితమ్,
ఆఞ్జనేయ ప్రసాదేన బ్రహ్మలోకం స గచ్ఛతి. 8

# ఉమాసంహిత యందలి శ్రీమత్సుందరకాండ పారాయణ విధులు, ఫలనిరూపణలు.

శ్లో. పఞ్చవింశతి సర్గాంశ్చ ప్రత్యహం పఠతే తు యః,
మహద్ధన మవాప్నోతి గృహ ధాన్యాదికం చ సః.

ఎవ్వరైతే ఇరువది యైదు సర్గములుగా నిత్యము అనుష్ఠించునో వారు భోగభాగ్యములు, గృహాది సంపదలు పొందుదురు.

శ్లో. ప్రత్యహం సప్త సర్గాంశ్చ పఠిత్వా వత్సరం నరః,
మహత్సామ్రాజ్య మాప్నోతి పృథీన్ద్రైశ్చ ప్రపూజ్యతే.

ప్రతిదినము ఏడు సర్గముల వంతున సంవత్సరము వరకు ఈ సుందరకాండము అనుష్ఠించు భక్తులు మహాసామ్రాజ్య గౌరవము పొంది అన్యభూపతులచే మిక్కిలిగా పూజింపబడుదురు.

శ్లో. చతుర్వింశతి సర్గాంశ్చ పఠిత్వా యుగ్మకే దినే,
తావత్యా చైవ చావృత్యా రాజబన్ధా ద్విముచ్యతే.

ఇరువది నాలుగు సర్గములు కేవలం ద్విదినములలో పారాయణమును సల్పిన రాజబంధమునుండి విముక్తులు కాగలరు.

శ్లో. యథాశక్తి పఠిత్వా తు యావజ్జీవం నరోత్తమః,
ఐహికం తు సుఖం ప్రాప్య మోక్ష మాయాత్పరత్ర చ.

ఎవరేని యావజ్జీవితము సుందరకాండమును నియమముతో, నిష్ఠతో, యథాశక్తిగ అనుష్ఠింతురో వారు లౌకిక జీవితములో సౌఖ్యానందములను అనుభవించి, అనంతరము ఊర్ధ్వలోకమును పొందగలరు.

శ్లో. అనావృష్ట్యాం ప్రవృత్తాయా మవగ్రహ నివృత్తయే,
పఠే చ్చ సున్దరం కాణ్డం సువృష్టిశ్చ తతో భవేత్.

అనావృష్టిచే ప్రజలు బాధపడునప్పుడు శ్రీమత్సుందరకాండమును పారాయణము చేసిన యెడల ఉపయుక్తమగు వర్షములు కురిసి ప్రజలు సుఖింపగలరు.

శ్లో. కిం బహూక్తేన విధినా సర్వాభీష్ట ప్రదాయకం,
నా తోన్య ద్విద్యతే లోకే ఇహాముత్ర ఫలప్రదమ్.

వేయివిధముల చెప్పవలసిన అగత్యం లేదు. ఏలయనగ సకల వాంఛితములు ఈడేరుటకు శ్రీమత్సుందరకాండ అనుష్ఠానమునకు మించిన పారాయణము ఇలలోనే లేదు.

శ్లో. ఏవంకర్తు మశక్తానాం విధానాని బహూని చ,
సన్తి తా న్యద్య వక్ష్యామి లోకానాం హితకామ్య యా.

ఉమాదేవీ! నిత్యము కాండమునంతను పారాయణము చేయలేని అశక్తులకు వివిధ విధానములున్నవి. లోకోపకారమునకై వాటినన్నిటినీ వివరించెదను. వినుము.

శ్లో. పఠే ద్ద్వాత్రింశ దావృత్తీః కాణ్డం శ్రీసున్దరాభిధమ్,
చూడామణి ప్రదానాన్తం ప్రథమే దివసే పఠేత్.

శ్లో. కాండ సంపూర్తి పర్యన్తం ద్వితీయే దివసే పఠేత్,
ఏవం ద్వాత్రింశ దావృత్తి శ్చతుష్షష్ట్యా దినైః పఠేత్.

కాత్యాయనీ! శ్రీమత్సుందరకాండమును ముప్పదిరెండు పర్యాయములు పారాయణము చేయు క్రమమును ఆలకింపుము. ప్రథమ దివసమున జగజ్జననియగు సీతాదేవి ఆంజనేయునకు తన చూడామణిని

అందించు ( అనగా సుందరకాండము ముప్పది యెనిమిదవసర్గము శ్లోక సంఖ్య అఱువది తొమ్మిది) వరకు చదువవలెను. ద్వితీయ దివసమున శేషించిన కాండమంతయు పారాయణము చేయవలెను. ఈ విధముగ అఱువది నాలుగు దినములలో ముప్పది రెండు మారులు పారాయణము పూర్తియగును.

శ్లో. చతుర్వింశతి కృత్వోవా ద్విసప్తతి దినైః పఠేత్,
సీతా దర్శన పర్యన్తం ప్రథమే దివసే పఠేత్.

శ్లో. ద్వితీయేఽశోకవనికా భఙ్గాన్తం ప్రయతః పఠేత్,
తృతీయే దివసే కాణ్డం పఠిత్వా పూరయే త్సుధీః.

డెబ్బదిరెండు దినములలో ఇరువదినాలుగు పర్యాయములు పారాయణమును చేయు విధమును వినుము. ఆంజనేయుడు జానకీమాతను దర్శించు ( సుందరకాండము పదునేడవ సర్గము శ్లోక సంఖ్య మూడు) వరకు ప్రథమ దివసమున పఠింపవలయును. ద్వితీయ దివసమున హనుమంతుడు అశోకవనమును ధ్వంసము ( సుందరకాండము నలుబదియొకటవ సర్గము, శ్లోక సంఖ్య పదునైదు) చేయు వరకు చదువవలెను. తృతీయ దివసమున శేషించిన కాండమునంతను యథావిధిగా పూర్తి చేయవలయును.

శ్లో. అష్టచత్వారింశ దహ్నో ద్వాదశాఽవృత్తివా పఠేత్,
సీతా దర్శన పర్యన్తం ప్రథమే దివసే పఠేత్.

శ్లో. హనూమ ద్విశ్వరూపాన్తం ద్వితీయే విరమే ద్దినే,
హనూమ దుపదేశాన్తం రావణస్య తృతీయకే,
శేషం చతుర్థే కాణ్డస్య దివసే సంపఠే త్సుధీః.

నలుబదియెనిమిది దినములలో పన్రెండావృత్తులు పఠించు విధానమును ఆలకింపుము. ప్రథమ దివసమున ఆంజనేయుడు సీతాదేవిని దర్శించు ( శ్రీమత్సుందరకాండము సర్గము పదునేడు, శ్లోక సంఖ్య మూడు)

వరకును, ద్వితీయ దివసమునాడు విశ్వరూపసందర్శనము (శ్రీమత్సుందర కాండము సర్గము ముప్పదియేడవది, శ్లోకసంఖ్య ముప్పది యైదవది) వరకును, తృతీయ దివసమునాడు వాయునందనుడు రావణునకు హితోపదేశము సల్పు (శ్రీమత్సుందరకాండము ఏబది యొకటవ సర్గము శ్లోకసంఖ్య నలుబది యైదు) వరకును, చతుర్థ దివసమునాడు కాండాంతము వరకును పఠింపవలయును.

శ్లో. షడావృత్తి పఠే న్మాస మాత్రం ప్రయత మానసః,
సీతాదర్శన పర్యన్తం ప్రథమే దివసే పఠేత్.

శ్లో. ద్వితీయే త్రిజటా స్వప్న కథనాన్తం పఠే ద్దినే,
చూడామణి ప్రదానాన్తం తృతీయే దివసే పఠేత్.

శ్లో. లఙ్కాదాహాన్త మేవ స్యా చ్చతుర్థే సంపఠే ద్దినే,
పఞ్చమే పూరయే త్కాణ్డ మితి పఞ్చదినై ర్విధిః.

ముప్పది దినములలో శ్రద్ధాయుక్తుడై ఆ ఆవృత్తులుగా పారాయణ విధమును వినుము. ప్రథమ దివసమున హనుమంతుడు వైదేహీ దర్శనము (శ్రీమత్సుందరకాండము, పదునేడవ సర్గము శ్లోక సంఖ్య మూడు) వరకు చదువవలెను. ద్వితీయ దివసమున శ్రీమత్సుందరకాండము ఇరువది యేడవ సర్గము, శ్లోక సంఖ్య ఏబది ఒకటి నుండి త్రిజటా స్వప్నము వరకు చదువవలెను. తృతీయ దివసమున శ్రీమత్సుందర కాండము, ముప్పది యెనిమిదవ సర్గము, శ్లోకసంఖ్య అఱువది తొమ్మిది చూడామణిని ఆంజనేయుడు ఇచ్చువరకు పఠింపవలెను. చతుర్థ దివసమున శ్రీమత్సుందరకాండమున, ఏబదియైదవ సర్గము, ప్రారంభ శ్లోకమునుండి లంకాదాహాంతము వరకు అనుష్ఠింపవలెను. పంచమ దివసమున శేషించినదంతయు శ్రద్ధాభక్తులతో పారాయణము చేయవలెను. ఈ విధానము ప్రకారము ఒక మాసములో ఆఱు పర్యాయములు పారాయణలు జరుగును.

శ్లో. పఞ్చావృత్తిః త్వఞ్చవింశతి ర్దివసైః క్రమాత్,
పూర్వోక్త విధినా కాణ్డం పఞ్చభి ర్దివసైః పఠేత్.

ఇరువదియైదు దినములలో ఐదావృత్తులు అగునట్లు పారాయణము చేసిన యెడల పైన పేర్కొనిన విధముగనే కాండము అయిదు దినములకు తూగునట్లు పఠింపదగును.

శ్లో. త్రిరావృత్తిః పఠే త్కాణ్డం చైక వింశతిభి ర్దినైః,
ప్రథమే రాక్షసేన్ద్రస్య దారాణాం దర్శనం పఠేత్.

శ్లో. ద్వితీయేఽశోకవనికాం రావణాగమనం పఠేత్,
త్రిజటాస్వప్న వృత్తాన్తం తృతీయే దివసే పఠేత్.

శ్లో. హనూమ ద్విశ్వరూపాన్తం చతుర్థే దివసే పఠేత్,
పఞ్చసేనాపతీనాం చ నాశం పఞ్చమకే పఠేత్.

శ్లో. పున స్సీతాదర్శనాన్తం షష్ఠే తు దివసే పఠేత్,
సప్తమే పూరయే త్కాణ్డ మితి సప్తదినై ర్విధిః.

మూడు వారములలో మూడావృత్తులు పారాయణము సలుపు విధానము. మొదటి దినమున వాయునందనుడు రావణాసురుని భార్యయగు మండోదరిని దర్శించుట (శ్రీమత్సుందరకాండము, పదవ సర్గము, శ్లోకసంఖ్య ముప్పదియైదు) వరకు చదువవలెను. రెండవ దినమున రావణుడు అశోకవనమునకు వచ్చు (శ్రీమత్సుందరకాండము, పదునెనిమిదవ సర్గము, శ్లోకసంఖ్య ఇరువది యేడు) వరకు పఠింపవలెను. మూడవ దినమున శ్రీమత్సుందరకాండము, ఇరువది యేడవ సర్గము, శ్లోకసంఖ్య ఏబది యొకటి త్రిజటా స్వప్నవృత్తాంతము వరకు చదువవలెను. నాలుగవ దినమున శ్రీమత్సుందరకాండమునందలి ముప్పది యేడవ సర్గము, శ్లోకసంఖ్య ముప్పదియైదు ఆంజనేయుని విశ్వరూప సందర్శన ఘట్టము వరకు

పఠింపవలెను. ఐదవదినమున శ్రీమత్సుందరకాండము నందలి నలుబది యాఱవ సర్గము, శ్లోకసంఖ్య ముప్పది మూడు హనుమంతుని మీదకు రావణుడు అయిదుగురు సేనానాయకులను పంపు ఘట్టము వరకు చదువవలెను. ఆరవదినమున తిరిగి జానకిని చూచు ఘట్టము శ్రీమత్సుందరకాండము, ఏబదియాఱవ సర్గము, శ్లోకసంఖ్య ముప్పదియైదు వరకు పఠింపవలెను. అంతట ఏడవ దినమున మిగిలిన కాండము పూర్తిగా పఠింపవలెను. ఇది ఏడు దినములకు పూర్తి పారాయణ విధానము.

శ్లో. ద్విరాత్రం పఠే త్కాణ్డం ద్వాదశై ర్దివసై ర్ద్విజః,
సర్వదా య స్త్వశక్త స్స్వ్య దేషు కల్పేషు భూసురః.

శ్లో. సకృ త్సున్దరకాణ్డం తు పఠే త్ప్రయతమానసః,
ఏకాహ్నే యః పఠే త్ప్రాత స్సమారభ్యా పరాహ్ణతః.

శ్లో. ప్రాగేవ పూరయే త్కాణ్డ మవ్యగ్ర పద ముచ్చరైః,
తస్య పుణ్యఫలం వక్తుం నైవ శేషోపి శక్నుయాత్.

శ్లో. తత్రాప్యశక్తో ద్విదినం పఠే త్కాఙ్క్షిత సిద్ధయే,
తృతీయే పూరయే త్కాణ్డం దినత్రయ విధానతః.
చతుర్థే పూరయే త్కాణ్డం చతుర్దిన విధానతః,
పఞ్చమే పూరయే త్కాణ్డం పంచాహ్నిక విధానతః.
సప్తమే పూరయే త్కాణ్డం సప్తాహవిధి పూర్వకమ్.

శ్లో. ఏవ మష్ట దినై రేష విధి శ్శ్రీకామినాం వరః,
విధి రేష మహాన్ ప్రోక్తో నవభి ర్దివసైః కృతః.

ద్వాదశ దినములలో రెండు పర్యాయములుగ కాండము పారాయణము చేయవలెను. ఈ విధి విధానములో ఎందునను సామర్థ్యము లేనివారు శ్రద్ధాభక్తులతో కేవలము ఒక్క పర్యాయమైనను అనుష్ఠింపవలెను.

ఒక్క దినముననే కాండమంతయు పారాయణ చేయ నిశ్చయించిన యెడల బ్రాహ్మీ ముహూర్తకాలమున స్నాన మాచరించి, పారాయణము ప్రారంభించి అపరాహ్ణాత్పూర్వమే కాండమును పరిసమాప్తి చేయవలెను. అనుష్ఠాన సమయమున తొందరపాటు పడకుండగ పఠించవలెను. ఈ విధానమునకు అశక్తులయిన యెడల రెండుదినములలోనైన పఠించదగును. అప్పటికి శక్తి చాలకున్న మూడు దినములలోను, నాలుగు దినముల విధానములోనైనను పఠించవచ్చును. లక్ష్మీకటాక్షం కోరువారు ఎనిమిది దినములకు పారాయణ పూర్తి చేయవచ్చును. చివరగా తొమ్మిదిదినములలోను పారాయణము పూర్తి చేయవచ్చును.

శ్లో. ప్రత్యహం సర్గ మేకం వా పఠే త్కాణ్డం సమాహితః,
నిత్యం పారాయణం కుర్యా చ్ఛ్లోకం శ్లోకార్ధ మేవ వా.
పాదం వా వాక్యమాత్రం వా పదం వా ప్యక్షరం ద్విజః,
యద్య త్సంకల్పితం చిత్తే సుకరం దుష్కరం చ వా,
లభతే సున్దరాఖ్యస్య కాణ్డస్య పఠనా న్నరః.

ప్రతిదినము నియమనిష్ఠలతో ఒక సర్గము వంతునను పారాయణము చేయవలెను. లేదా శ్లోకముగాని దానిలో అర్ధభాగముగాని, పావు భాగముగాని నియమముతోను, భక్తితోను ఒక అక్షరముగాని చదువనగును. భక్తిశ్రద్ధలతో ఆంజనేయుని పూజించి, సుందరకాండము పారాయణము చేసినచో సంకల్పించిన కార్యములు ఎంత దుష్కరమైనవియు కూడ సుకరముగా నెరవేరును.

శ్లో. ఏతేషు సర్వకల్పేషు సమాప్తి దివసే ప్రభోః,
రాజ్య పట్టాభిషేకాఖ్యాం పఠేత్సర్గం ప్రయత్నతః.
యథావిభవమర్యాదం కారయే దుత్సవం సదా,
భోజ్యా విప్రా యథాశక్తి సమాప్తౌ ద్విజసత్తమః.

ఈ విధమైన పారాయణ సమాప్తి దినమున శ్రీసీతారామచంద్రుల రాజ్య పట్టాభిషేక సర్గము తప్పక పఠింపవలెను. ఉత్సవము చేసి సమారాధన చేయవలెను.

శ్లో. ప్రత్యహం పఠనాత్పూర్వం పరం చ వినివేదయేత్,
పయ స్సశర్కరం తప్తం తామ్బూలంచ ఫలాని చ.
కిం బహూక్తేన గిరిజే యాం సిద్ధిం కామయే న్నరః,
శ్రీమత్సున్దర కాణ్డస్య స లభే త్పఠనా త్త్విహ,
సర్వే రోగాః ప్రశామ్యన్తి నశ్యే త్సకల దుష్కృతమ్.
సన్తానార్థీ ధనార్థీ వా సామ్రాజ్యార్థీ చ మానవః,
రాజబన్ధ విమోక్షార్థీ మోక్షార్థీ వా పి యో భవేత్.
తత్తత్ఫల మవాప్నోతి గృహధాన్యాదికం చ సః.
యథాశక్తి పఠిత్వా తు యావజ్జీవం నరోత్తమః,
ఐహికం తు సుఖం ప్రాప్య మోక్ష మీయా త్పరత్ర చ,
అనావృష్ట్యాం ప్రవృత్త్యా మవగ్రహ నివృత్తయే,
పఠేచ్చ సున్దరకాణ్డ సువృష్టిశ్చ తతో భవేత్.
కిం బహూక్తేన విధినా సర్వాభీష్టప్రదాయికమ్,
నా తో న్యో విద్యతే లోకే ఇహాముత్రఫలప్రదం.

ఇతి శ్రీ శివరామాయణే ఉమాసంహితాయాం పార్వతీం ప్రతి పరమేశ్వరోక్త శ్రీసుందరకాణ్డ పారాయణ విధి ఫల నిరూపణే చ సమాప్తః.

ప్రతిదినము అనుష్ఠానమునకు పూర్వమందును, పరమందును చక్కరతో మిశ్రితమైన పాలను, పండ్లను తాంబూలమును నివేధన చేయవలెను. పెక్కుమాటలేల! శర్వాణీ! ఎటువంటి కోర్కెలను మానవుడు కోరునో ఆ

కోరికలన్నీ శ్రీమత్సుందరకాండము పారాయణ చేయుటచే సిద్ధించును. రోగములు శాంతించి స్వస్థత చేకూరును. సకల సంకటములు నశించును. సంతానము పొందగోరువాడుగాని, అర్థమును గోరువాడుగాని, రాజ్యాధికారము కోరువాడుగాని, బంధ విముక్తిని కోరువాడుగాని, మోక్షార్థికాని ఈ శ్రీమత్సుందరకాండమును ప్రత్యహము పారాయణ చేయునో ఆ మానవుడు ఏతత్ఫలము పొందగలడు.

గృహధాన్యాది ఐశ్వర్యమును పొందును. యథాశక్తి ప్రతిదినము అనుష్ఠించినను, జీవితకాలమంతయు భక్తిశ్రద్ధలతో పఠించినను ఇహలోక సౌఖ్యములు అన్నింటిని అనుభవించి, పరమునందు మోక్షమును కూడ పొందగలడు. దేశమందు అనావృష్టి దోషము ఏర్పడినప్పుడు సుందరకాండమును పారాయణము చేసిన మంచి వర్షములు కురిసి దేశము సుభిక్షమగును. మిక్కిలిగ శ్రీమత్సుందరకాండమును పారాయణము చేసిన యెడల సర్వాభీష్ట ఫలములు కలుగును.

ఇది శివరామాయణములోని ఉమాసంహితలో పార్వతీ దేవికి పరమేశ్వరుడు ఉపదేశించిన శ్రీమత్సుందరకాండము విధివిధాన క్రమము సర్వము సంపూర్ణము.

4

# పారాయణమునకు మాసతిథివారనక్షత్రదేశ నిర్ణయము

## మాసములు

శ్లో. చైత్రమాసే ధర్మవృద్ధి స్సమృద్ధ్వృద్ధిస్తు మాధవే,
జ్యేష్ఠే సర్వార్థసంసిద్ధి రాషాఢే ధర్మనాశనమ్.

శ్లో. శ్రావణే కర్మవృద్ధిశ్చ ధనవృద్ధి స్తథాऽశ్వినే,
సామాన్యం స్యా ద్భాద్రపదే ఫలం మునిభి రీరితమ్.

శ్లో. కార్తికే తు యశోవృద్ధి ర్మార్గశీర్షే ఫలాదికమ్,
పుష్యే సర్వార్థనాశశ్చ మాఘే ధర్మాది సంపదః.

శ్లో. ఫాల్గునే కార్యసంసిద్ధి రిత్యేత న్మాసలక్షణమ్,
శుక్ర స్యాస్తమయే చాపి గురోరస్తమయే తథా.

## తిథులు

శ్లో. ద్వితీయా ప్రథమా చాపి తృతీయా పఞ్చమీ తథా,
త్రయోదశీ సప్తమీచ దశమ్యేకాదశీ తిథిః.

## వారములు

శ్లో. భానువారే కర్మవృద్ధి స్సోమే సర్వాఘనాశనమ్,
భౌమే దేహవినాశ స్స్యా త్సౌమ్యే కీర్తిస్తు శాశ్వతీ.

శ్లో. గురౌ తు శుభవృద్ధి స్స్యా దర్థవృద్ధి ర్భృగౌ భవేత్,
శనౌతు కార్యహాని స్స్యా దిత్యేత ద్వారలక్షణమ్.

## నక్షత్రములు

శ్లో. అశ్విన్యాం చైవ రేవత్యాం త్రిపూర్వాయాం ప్రజాపతౌ,
పునర్వసౌ తథా పుష్యేఽప్యుత్తరే హస్తచిత్తయోః.
శ్లో. ఏతేషు ఋక్షముఖ్యేషు పఠనారమ్భ మాచరేత్,
తేష్వేవ శ్రవణ స్యాపి ప్రారమ్భస్తు శుభావహః.

## దేశములు

శ్లో. ఏవం విమృశ్య విప్రర్షే శుచి స్సంశుద్ధమానసః,
గోదావర్యా స్తథాతీరే గఙ్గాయాశ్చ మునీశ్వర.
శ్లో. ధర్మక్షేత్రేషు సర్వేషు అయోధ్యాయాం విశేషతః,
కాశ్యాం సముద్రతీరే వా తథా దేవాలయేఽపి వా.
శ్లో. గోష్ఠే బృన్దావనే వాపి అగ్నిహోత్రగృహేఽపి వా,
బ్రాహ్మణానాం సమూహే వా తథా వైష్ణవ సన్నిధౌ.
శ్లో. మద్భక్త సన్నిధానే వా తథా వేదాన్త వేదినామ్,
క్షేత్రే ష్వేత ప్రభృతిషు పరిశుద్ధేషు సర్వదా,
ఆరమ్భం తు నరః కుర్యా దస్య పారాయణస్య హి.



 

# పారాశర్యోప పురాణమున శ్రీమత్సుందరకాండ సప్తసర్గి పారాయణ విధానము

పార్వతీ –

కథం సున్దరకాణ్డస్య సప్తసర్గీం పఠేన్నరః,
విధానం తస్య మే బ్రూహి కృతార్థా స్యా మహం ప్రభో.

మహేశ్వర ఉవాచ –

త్రివర్గఫలకామేన విపదుత్తరణేచ్ఛునా,
శ్రీమత్సున్దరకాణ్డస్య పాఠః కార్యో విజానతా.

శాన్తికర్మణి సర్వత్ర తథా దుస్స్వప్ననాశనే,
గ్రహపీడాసు చోగ్రాసు రోగేషు విషమేషు చ.

అరణ్యే ప్రాన్తరే వాపి శస్త్రచోరాగ్నిపీడనే,
సర్వా స్వాప త్సు ఘోరాసు నైతస్మా త్తారకం పరమ్.

శ్రీమత్సున్దరకాణ్డస్య సప్తసర్గ్యభిపాఠతః,
మహారాజ్యాదిసంపత్తి ర్లభ్యతే దుర్లభాఽపి వా.

ఆయుష్కా మోలభేతాయు ర్ధనకామో ధనాన్యపి,
శ్రీకామః శ్రియ మాప్నోతి క్షితికామ స్తథా క్షితిమ్.

విద్యాకామ స్తథా విద్యాం స్త్రీకామశ్చ తథా స్త్రియమ్,
ఆరోగ్యకామ స్త్వారోగ్యం సప్తసర్గ్యభిపాఠనాత్.

యదా యదా హి రామస్య వృత్తం పిపఠిషే ద్బుధః,
తదా తదా తు ధర్మా త్మే త్యేత న్మూలమనుం జపేత్.

శ్రీరామచరణామ్భోజద్వన్ద్వం ధ్యాయ న్ప్రసన్నధీః,
సకృదే వేతి చరమశ్లోకం చ శుభదం జపేత్.

అనయో ర్మన్త్రయోః కో ను మాహాత్మ్యం వేత్తి వల్లభే,
అన్యత్ర జానకీనాథా దన్యత్ర చ హనూమతః.

శుభేఽహ్ని శుభనక్షత్రే సంకల్ప్యోపక్రమే ద్బుధః,
పాఠం సున్దరకాణ్డస్య సప్తసర్గ్యా యథావిధి.

సప్తసర్గీ మనుదినం పఠే న్నియమపూర్వకమ్,
పౌనఃపున్యేన తం కాణ్డం యావత్కాణ్డ స్సమాప్యతే.

అన్యూనానతిరిక్తం తు కాణ్డాన్తే సప్తసర్గకాః,
సమాప్య న్తే యదా దేవి తదా విప్రాంశ్చ భోజయేత్.

సర్గసంఖ్యై ర్దినై స్తత్తు పూర్యతే నాన్యథా ప్రియే,
ఏకం పారాయణం హ్యేత త్సప్తసర్గ్యా శ్శుచివ్రతే.

సప్తకృతః పఠే దేవం తన్మహాసప్తసర్గకమ్,
భోజయే ద్బ్రాహ్మణా నన్తే నియమా త్సర్గసంఖ్యయా.

ఏవం పఠ న్నారయ న్వా దుర్గా ణ్యతితరే దసౌ,
లభతేఽభీప్సితా న్కామాన్ సర్వానేవ న సంశయః.

పాఠనే ప్రతిపాఠం తు సప్తనిష్కాతు దక్షిణా,
వాచకాయ ప్రదేయా స్యా ద్వస్త్రమాల్యానులేపనైః.

మహత్యాం సప్తవర్గ్యాం తు సమాప్తాయా మనుక్రమాత్,
సువర్ణాన్ సర్గసంఖ్యాకా న్దద్యా దాదృత్య దక్షిణామ్.

ఇత్యే త త్కథితం దేవి యత్పృష్టోఽహ మిహ త్వయా,
ధ్రియతాం హృదయే సాధు కిమన్య చ్ఛ్రోతు మిచ్ఛసి.

ఇతి శ్రీమత్పారాశర్యే ఉపపురాణే
శ్రీరామాయణమాహాత్మ్యే అష్టమోఽధ్యాయః.

# సప్త సర్గ పారాయణ క్రమము

శ్లో. దినే దినే సప్త సర్గాం తస్య కాణ్డస్య యో నరః,
పఠే ద్భక్త్యా తు కాకుత్స్థం హృది ధ్యాత్వా నమస్య చ.

శ్లో. తస్య జన్మాన్తర శతైః సఞ్చితస్యాపి పాప్మనః,
నాశం కుర్యా త్సుప్రసన్నో రామో విష్ణు స్సనాతనః.

శ్లో. కిం పున శ్చిన్తితార్థాప్తిం చిన్తయామః పునఃపునః,
సహస్రనామభి ర్విష్ణో రభ్యర్చ్య చ దినే దినే,
పఠే త్సున్దరకాణ్డస్య సప్తసర్గీం విధానతః.

శ్లో. యదా తు సప్తమ స్సర్గః కాణ్డ స్యాన్తిమ సర్గకః,
భవిష్యతి తదన్తం తు సప్తసర్గాన్ పఠే ద్వ్రతీ.

శ్లో. సప్తసర్గ క్రమేణైవ నిత్యం యః పఠతే ముదా,
షట్సప్తవేద సఙ్ఖ్యేషు దినేషు ఫల మశ్నుతే.

శ్లో. అష్ట షష్టి దినై ర్వాపి ఏకం పారాయణం భవేత్,
ఋషిభి ర్వా గ్రహైర్వాపి రుద్రై ర్వా కాణ్డ ఏవ వా,
పారాయణం యః కరోతి తత్రమాణ ఫలం భవేత్.

ప్రతిదినము సుందరకాండము సప్తసర్గక్రమముగ పారాయణము చేయువారు శ్రీరామచంద్రునికి నమస్కరించి, మనసారా ధ్యానించి అనుష్ఠింప నారంభింపవలెను. ఈ విధముగ పారాయణము చేయువారికి జన్మాంతర అభీష్టములు సిద్ధింపగలవు. సహస్రనామములచే శ్రీమహావిష్ణువును పూజించి శ్రీమత్సుందర కాండమును సప్తసర్గక్రమమున అనుష్ఠింప వలయును. ఎంతవరకు సప్తమసర్గము కాండము యొక్క అంతిమ సర్గమగునో అంతవరకు నియమ నిష్ఠలు గలవాడై అనుష్ఠింప వలయును.

సప్తసర్గ క్రమముగ నిత్యము ఎవరు ఏడుపర్యాయములు నాలుగువందల డెబ్బదియాఱు దినములలో అనుష్ఠించునో వారు ఇష్టకామ్యములను పొందగలరు. అఱువది ఎనిమిది దినములకు ఒక సప్తసర్గ పారాయణము పూర్తి అగును. ఇటులే ఏడుగాని, తొమ్మిదిగాని, పదునొకండు గాని శ్రీమత్సుందరకాండము పారాయణములు అనుష్ఠించినవారు తదనురూపమైన ఫలితములు పొందగలరు.



# సంగ్రహ పారాయణ క్రమము

(ఉమా సంహిత)

శ్లో. దేవదేవ నమ స్తే స్తు కలౌ సామాన్యమానవాః
చత్వారింశత్సహస్రాణాం శ్లోకానాం పఠనేఽఖిలాః
అసమర్థా స్తత స్త్వం హి సంగ్రహం తస్య వక్ష్యతాం
ఇత్యుక్తః ప్రాహ గౌరీశః శృణు వక్ష్యే నగాత్మజే
వాల్మీకి ప్రోక్త శ్రీరామ చరితస్య హి సంగ్రహం
వాల్మీకినా చ యత్ప్రోక్తం రామాయణ మనుత్తమం
తస్యైవ సౌన్దరేకాణ్డే హ్యష్ట పంచాశ దాత్మకం
సర్గ మారభ్య కాణ్డాన్తం గ్రన్థం చైకాదశాత్మకం
సర్గమాత్ర గ్రన్థ మష్ట చత్వారింశోత్తరం తథా
చతుశ్శత శ్లోకరూపం పురుషార్థ స్వరూపకం
ఆదౌ పారాయణం కుర్యా దేవ త్రింశాఖ్యసర్గకే
షోడశశ్లోక పర్యన్త ముపోద్ఘాతాత్మికం శుభమ్.

శ్రీమత్సుందరకాండము నందలి ఏబది ఎనిమిదవ సర్గము మొదలిడి అఱువది యొకటవ సర్గము వరకు అనగా కాండాంతము వరకు పారాయణమును అనుష్ఠించినచో యావద్రామాయణమును పారాయణము చేయుటవలన కలుగు ఫలము ఈ స్వల్ప పారాయణమువలన కలుగును. ఈ సంగ్రహ పారాయణమునకు ఉపోద్ఘాతముగ ముప్పది యొకటవ సర్గము నందలి ప్రారంభమునుండి పదునాఱు శ్లోకములను పారాయణము ఆచరించిన తదుపరి మరల ఏబది యెనిమిదవ సర్గమును అవశ్యము పారాయణము చేయవలెను. ఈ సంగ్రహ పారాయణమున మొత్తము నాలుగువందల అఱువదినాలుగు శ్లోకములు గలవు. ఈ సంగ్రహ పారాయణ క్రమమున పారాయణమును అనుష్ఠించువారికి శ్రీమద్రామాయణ పారాయణ ఫలితములు నిస్సందేహముగ లభించునని మహాశివుడు సెలవిచ్చెను.

# సుందరకాండ పారాయణము లౌకిక ఫలితములు

సుందరకాండము పారాయణ చేయుటయే కాకుండా అందలి కొన్ని సర్గలను, లేదా కొన్ని శ్లోకములను వివిధ పద్ధతులలో జపించడం వల్ల లౌకిక పరమార్థిక ఫలితములు చేకూరుతాయని వివిధ గ్రంథములలో వివరంగా తెలియజేయబడింది.

ఈ గ్రంథమందలి ముందు అధ్యాయములలో 1. పారాశర్య ఉపపురాణం అనుసరించి పారాయణ పద్ధతి 2. తత్త్వ సంగ్రహ రామాయణము నందలి సుందరకాండ శ్రవణ ఫలితములలో వివరంగా తెలియజేయబడింది.

అదే విధంగా ఉమాసంహితయందు ఈ విధంగా చెప్పబడింది.

శ్లో. పఠనాత్ శ్రవణా దస్య భక్త్యా ప్రవచనా దపి
సిధ్యన్తి సిద్ధయః సర్వా అనర్థశ్చ వినశ్యతి,
పూర్యన్తే సంపదః సర్వా నశ్యన్తి సకాలాగదాః
విశేషతో మహారోగభీతానాం పరమౌషధమ్.

సుందరకాండము భక్తితో చదివినను, వినినను, పురాణ ప్రవచనము చేసినను కష్టములు తొలగి సంపదలు సమృద్ధిగా లభిస్తాయని, సర్వరోగములు నశిస్తాయని వివరించబడింది. విశేషించి మహా రోగముల బారిన పడిన వారికి పరమ ఔషధం అని చెప్పబడింది.

లౌకిక ఫలితములు కోరువారు వారి వారి కోరికలను అనుసరించి ఈ క్రింద తెలియజేసిన శ్లోకములను శ్రద్ధతో జపించినచో ఫలితములు తప్పక ఏర్పడతాయి. ఇచట ఒకొక్క ఫలితం క్రింద అనేక శ్లోకములు తెలియజేసినప్పటికి, వాటిలో ఏ శ్లోకమయినను జపించవచ్చు. ఇచట శ్రద్ధ ప్రధానమయినది.

శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పరః సంయతేన్ద్రియః,
జ్ఞానం లబ్ధ్వా పరాం శాన్తి మచిరే ణాధిగచ్ఛతి.

శ్రద్ధగలవాడును, తదేకనిష్ఠతో గూడినవాడును, ఇంద్రియములను లెస్సగా జయించినవాడునగు మనుజుడు జ్ఞానమును పొందుచున్నాడు. అట్లు జ్ఞానమును పొందినవాడై యతడు గొప్ప శాంతిని శీఘ్రముగా పొందుచున్నాడు అని భగవద్గీతలో తెలియ జేయబడింది.

పారిశ్రామిక నాగరికతకు పూర్వం ప్రశాంతంగా జీవించే రోజులలో తమ అభీష్టములకు అనుగుణంగా వివిధపద్ధతులలో పారాయణము చేసుకొనేవారు. తరువాతి కాలంలో వేగం పెరిగింది. సదా ఒత్తిడులు.. అనేక సమస్యలు.. సమయాభావం పెరిగింది. ఇటువంటి రోజులలో ఈ పారాయణము చేసుకోవడానికి అవసరమైన సమయం తగ్గిపోయింది. ఇతరులచే పారాయణము చేయించుకోవడం ప్రారంభం అయింది.

ఎవరి (మన) అభీష్టం సిద్ధించడానికి వారే (మనమే) పారాయణ చేసికొనుట ఉత్తమమైన పద్ధతి. అందువలన అవకాశం ఉన్నవారు ఈ క్రింద తెలియజేయబడిన పద్ధతులలో పారాయణం

చేసికొని, తద్వారా తామే పారాయణ చేసుకొన్నామనే తృప్తితో సత్వరమే లబ్ధి పొందగలరని ఆశిస్తున్నాం. దీనిని దృష్టిలో ఉంచుకొని కొద్ది సమయం అంటే సుమారు **30** నుండి **45** నిమిషములు కేటాయించగలిగే వారిని ఉద్దేశించి సులభ పద్ధతిలో పారాయణము, శ్లోక పఠనాలు ( అనుభవంలో చూసినవి) తెలియజేయడం జరిగింది.

వీటిని రెండు రకముల పద్ధతులలో జపించవచ్చును. అవి :

**1. సామాన్య పద్ధతి :** కోరికలకు చెప్పబడిన శ్లోకములను చెప్పబడిన జపసంఖ్య, జపకాలములలో పఠించుట.

**2. సంపుటీకరణ పద్ధతి :** ఇది మరల రెండు రకములు : అ) సుందర కాండము లోని ప్రతిశ్లోకము పిదప తాను ఎన్నుకొనిన శ్లోకము పఠించి తరువాత శ్లోకము పఠించడము. ఆ) ప్రతిశ్లోకమునకు ముందు తర్వాతలలో అనగా ఒక శ్లోకము పఠించి, రెండవ శ్లోకము పఠించుటకు ముందుగా ఎన్నుకొనిన సంపుటీకరణ శ్లోకము రెండుసార్లు పఠించుట. దీనినే సంపుటవల్లి అందురు.

సుందర కాండములోని ప్రతి శ్లోకము మంత్రమే. అవన్నియు మనోరథములను తీర్చగలిగినవే. ప్రతి శ్లోకమును సంపుటీకరణంగా వాడుకొనవచ్చును. జాతి, కుల, మత బేధములు లేకుండా వారి శక్తిని అనుసరించి ఎవరికి వారే పారాయణ చేసుకొనవచ్చును. కేవలం శ్రద్ధ మాత్రమే అవసరము. తమ శక్తిని అనుసరించి ఏ ప్రదేశమునందయినను, ప్రయాణంలోనైనను పఠించవచ్చును.

## నివేదన

ప్రతిదినము పారాయణము పూర్తియైన తరువాత, మంగళ శ్లోకములను పఠించి మనకు లభించిన ఏ స్వల్ప వస్తువు నయినను నివేదన చేయవచ్చును. దీనిగురించి భగవద్గీత యందు ఈ విధంగా తెలియ జేయబడింది.

పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి
త దహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః. (9-26)

ఎవడు నాకు భక్తితో ఆకునుగాని, పువ్వునుగాని, పండును గాని, జలము గాని సమర్పించుచున్నాడో అట్టి పరమార్థశీలుని యొక్క భక్తి పూర్వకముగా నొసంగబడిన ఆ పత్రపుష్పాదులను నేను ప్రీతితో ఆరగించు చున్నాను. (అనుభవించుచున్నాను).

అందువలన తమతమ శక్త్యనుసారము భగవంతునకు తోచినది నివేదన చేయవచ్చును. కోరికలు సిద్ధించిన తరువాత శక్త్యనుసారము అన్నశాంతి చేయుట ఉత్తమమైనదిగా చెప్పబడినది.

## పారాయణ కాలం

సూర్యోదయకాలమందు, శౌచస్నానాదులు ముగించుకొని, శుభ్రమయిన వస్త్రం ధరించి తగిన ఆసనం మీద కూర్చొని, ఇష్టదైవ ప్రార్థన చేసికొని, ఈ కార్యసిద్ధికై ఈ మంత్రమును జపించుచున్నా నని సంకల్పం చేసి ఈ శ్లోకములను పఠించవలెను. ఒకసారి ఆచరించినను కార్యసిద్ధికి కాలవిలంబము అయినచో శ్రద్ధాపూర్వకంగా తిరిగి అనుష్ఠించవలెను. ఇందువలన మంత్రము యొక్క బలం పెరిగి శీఘ్రమే కార్యసిద్ధి పొందగలరు.

## 1. కార్యసిద్ధికి

మంత్రము :

1. సర్వథా కృతకార్యోఽహ మేష్యామి సహ సీతయా,
   ఆనయిష్యామి వా లఙ్కాం సముత్పాట్య సరావణామ్.
2. యది వా త్రిదివే సీతాం న ద్రక్ష్యా మ్యకృతశ్రమః,
   బద్ధ్వా రాక్షసరాజాన మానయిష్యామి రావణమ్.
3. భీమ మద్య కృతం కర్మ మహ త్సత్త్వం త్వయా హతమ్
   సాధ యార్థ మభిప్రేత మరిష్టం ప్లవతాంవర.
   యస్య త్వేతాని చత్వారి వానరేన్ద్ర యథా తవ,
   ధృతి ర్దృష్టి ర్మతి ర్దాక్ష్యం స్వకర్మసు న సీదతి.
4. స ఏష కపిశార్దూల స్త్వా ముపర్యేతి వీర్యవా౯,
   హనుమా న్రామకార్యార్థం భీమకర్మా ఖ మాప్లుతః.

జపసంఖ్య : 108 జపకాలం : 40 రోజులు

## 2. సహాయ సహకారములు వాంఛించుటకు

మంత్రము :

1. సాహాయ్యం వానరేన్ద్రస్య యది నాహం హనూమతః,
   కరిష్యామి భవిష్యామి సర్వవాచ్యో విపక్షతామ్.

జపసంఖ్య : 216 జపకాలం : 40 రోజులు

## 3. భూతప్రేత బాధలనుండి నివారణకు

**(గాలి, ధూళి నివృత్తికి)**

1. స తముచ్ఛ్రిత మత్యర్థం మహావేగో మహాకపిః,
ఉరసా పాతయామాస జీమూత ఇవ మారుతః.

2. న రావణసహస్రం మే యుద్ధే ప్రతిబలం భవేత్,
శిలాభిస్తు ప్రహరతః పాదపైశ్చ సహస్రశః.
అర్దయిత్వా పురీం లఙ్కా మభివాద్య చ మైథిలీమ్,
సమృద్ధార్థో గమిష్యామి మిషతాం సర్వరక్షసామ్.
తస్య సన్నాదశబ్దేన తేఽభవ న్భయశఙ్కితాః,
దదృశు శ్చ హనూమన్తం సన్ధ్యామేఘ మివోన్నతమ్.

జపసంఖ్య : 54 జపకాలం : 20 రోజులు

## 4. అభయదానం

1. హిరణ్యనాభశైలేన్ద్ర పరితుష్టోఽస్మి తే భృశమ్,
అభయం తే ప్రయచ్ఛామి తిష్ఠ సౌమ్య! యథాసుఖమ్.

జపసంఖ్య : 54 జపకాలం : 21 రోజులు

## 5. అజ్ఞానం తొలగుటకు

1. తత శ్శరీరం సంక్షిప్య త న్మహీధరసన్నిభమ్
పునః ప్రకృతి మాపేదే వీతమోహ ఇ వాత్మవాన్.

జపసంఖ్య : 108 జపకాలం : 40 రోజులు

## 6. శారీరక దౌర్బల్యం తొలగుటకు

1. యోజనానాం శతం శ్రీమాం స్తీర్త్వా ఉ ప్యుత్తమవిక్రమః,
అనిశ్శ్వస న్నపి స్తత్ర న గ్లాని మధిగచ్ఛతి.

2. శతా న్యహం యోజనానాం క్రమేయం సుబహూ న్యపి,
కిం పున స్సాగర స్యాన్తం సఙ్ఖ్యాతం శతయోజనమ్.

జపసంఖ్య : **108** జపకాలం : **40**రోజులు

## 7. బుద్ధిమాంద్యము తొలగుటకు

1. ఇతి సఞ్చిన్త్య హనుమాన్ సూర్య స్యాస్తమయం కపిః,
ఆచకాంక్షే తదా వీరో వైదేహ్యా దర్శనోత్సుకః.

జపసంఖ్య : **108** జపకాలం : **40**రోజులు

## 8. శత్రునిర్మూలనం కోరేవారు

1. తాం తు దృష్ట్వా మహాబాహో దారితాం చ స్తనాన్తరే,
అశీవిష ఇవ క్రుద్ధో నిశ్శ్వస న్నభ్యభాషథాః.
నఖాగ్రైః కేన తే భీరు దారితం తు స్తనాన్తరమ్,
కః క్రీడతి సరోషేణ పఞ్చవక్త్రేణ భోగినా.

జపసంఖ్య : **216** జపకాలం : **40**రోజులు

## 9. కార్యసాధన కోరేవారు

1. స లమ్బశిఖరే లమ్బే లమ్బతోయదసన్నిభే,
సత్త్వ మాస్థాయ మేధావీ హనుమా న్మారుతాత్మజః.
నిశి లఙ్కాం మహాసత్త్వో వివేశ కపికుఞ్జరః,
రమ్య కానన తోయాఢ్యాం పురీం రావణపాలితామ్.

2. మణివర ముపగృహ్య తం మహార్హం
జనకనృపాత్మజయా ధృతం ప్రభావాత్,
గిరి రివ పవనావధూతముక్త
స్సుఖితమనాః ప్రతిసంక్రమం ప్రపేదే.

జపసంఖ్య : 216 జపకాలం : 21రోజులు

## 10. మానసిక శాంతికి

1. లోకస్య పాపాని వినాశయన్తం
మహోదధిం చాపి సమేధయన్తమ్
భూతాని సర్వాణి విరాజయన్తం
దదర్శ శీతాంశు మథాభియాన్తమ్.

2. అథవా నైత దేవం హి యన్మయా పరిశఙ్కితమ్,
మనసో హి మమ ప్రీతి రుత్పన్నా తవ దర్శనాత్.

జపసంఖ్య : 108 జపకాలం : 40రోజులు

## 11. మనసులోని కోరికలు సాధించుటకు

1. తాం చిత్రమాల్యాభరణాం కపిరాజహితంకరః,
రాఘవార్థం చరన్ శ్రీమాన్ దదర్శ చ ననన్ద చ.

జపసంఖ్య : 21 జపకాలం : 40రోజులు

## 12. ప్రత్యర్థులపై జయము కోరువారు

1. ররాస సహ తై ర్భూతైః ప్రవిశ న్వసుధాతలమ్,
కమ్పమానైశ్చ శిఖరైః పతద్భి రపి చ ద్రుమైః.
త స్యోరువేగోన్మథితాః పాదపాః పుష్పశాలినః,
నిపేతు ర్భూతలే రుగ్ణా శ్శక్రాయుధహతా ఇవ.

జపసంఖ్య : 216 జపకాలం : 21రోజులు

## 13. స్వగృహము కోరువారు

1. గృహాణి నానావసురాజితాని
దేవాసురై శ్చాపి సుపూజితాని,
సర్వైశ్చ దోషైః పరివర్జితాని
కపి ర్దదర్శ స్వబలార్జితాని.
తాని ప్రయత్నాభిసమాహితాని
మయేన సాక్షా దివ నిర్మితాని,
మహీతలే సర్వగుణోత్తరాణి
దదర్శ లఙ్కాధిపతే ర్గృహాణి.

5

2\. హేమసోపానసంయుక్తం చారుప్రవరవేదికమ్,
జాలవాతాయనై ర్యుక్తం కాఞ్చనైః స్ఫాటికై రపి,
ఇన్ద్రనీల మహానీల మణిప్రవర వేదికమ్.
విద్రుమేణ విచిత్రేణ మణిభి శ్చ మహాధనైః,
నిస్తులాభి శ్చ ముక్తాభి స్తలే నాభివిరాజితమ్.
చన్దనేన చ రక్తేన తపనీయనిభేన చ,
సుపుణ్యగన్ధినా యుక్త మాదిత్య తరుణోపమమ్.

3\. ధూమ్రా మగరుధూపేన విమలాం హంసపాణ్డురామ్,
చిత్రాం పుష్పోపహారేణ కల్మాషీ మివ సుప్రభామ్.
మనస్సంహ్లాదజననీం వర్ణ స్యాపి ప్రసాదినీమ్,
తాం శోకనాశినీం దివ్యాం శ్రియ స్సంజననీ మివ.
ఇన్ద్రియా ణీంద్రియార్థైస్తు పఞ్చపఞ్చభి రుత్తమైః,
తర్పయామాస మాతేవ తదా రావణపాలితా.
స్వర్గోఽయం దేవలోకోఽయ మిన్ద్రస్యేయం పురీ భవేత్,
సిద్ధి ర్వేయం పరా హి స్యా ది త్యమన్యత మారుతిః.

4\. ధూమ్రా మగరుధూపేన విమలాం హంసపాణ్డురామ్,
చిత్రాం పుష్పోపహారేణ కల్మాషీ మివ సుప్రభామ్.
మనస్సంహ్లాదజననీం వర్ణ స్యాపి ప్రసాదినీమ్,
తాం శోకనాశినీం దివ్యాం శ్రియ స్సంజననీ మివ.
ఇన్ద్రియా ణీంద్రియార్థైస్తు పఞ్చపఞ్చభి రుత్తమైః,
తర్పయామాస మాతేవ తదా రావణపాలితా.

స్వర్గోఽయం దేవలోకోఽయ మిన్ద్రస్యేయం పురీ భవేత్,
సిద్ధి ర్వేయం పరా హి స్యా ది త్యమన్యత మారుతిః. 31

జపసంఖ్య : 216 జపకాలం : 40రోజులు

## 14. వాహనప్రాప్తి కోరేవారు

1. వసన్తపుష్పోత్కరచారుదర్శనం
వసన్తమాసా దపి కాన్తదర్శనమ్,
స పుష్పకం తత్ర విమాన ముత్తమం
దదర్శ త ద్వానరవీరసత్తమః.

2. మన స్సమాధాయ తు శీఘ్రగామినం
దురావరం మారుతతుల్యగామినమ్,
మహాత్మనాం పుణ్యకృతాం మహర్ది నాం
యశస్స్వినా మగ్ర్యముదా మి వాలయమ్.

జపసంఖ్య : 108 జపకాలం : 40రోజులు

## 15. అధికారుల ప్రాపుకోరేవారు (పైరవీ)

1. రామ మక్లిష్టకర్మాణం స్వబన్ధు మనుకీర్తయన్.
నైనా ముద్వేజయిష్యామి తద్బన్ధుగతమానసామ్,
ఇక్ష్వాకూణాం వరిష్ఠస్య రామస్య విదితాత్మనః.
శుభాని ధర్మయుక్తాని వచనాని సమర్పయన్,
శ్రావయిష్యామి సర్వాణి మధురాం ప్రబ్రువన్ గిరమ్.

జపసంఖ్య : 216 జపకాలం : 21రోజులు

## 16. మనోనిగ్రహం కోరేవారు (విల్‌పవర్)

1. మనో హి హేతు స్సర్వేషా మిన్ద్రియాణాం ప్రవర్తనే,
శుభాశుభా స్వవస్థాసు తచ్చ మే సువ్యవస్థితమ్.

జపసంఖ్య : 216 జపకాలం : 40రోజులు

## 17. కార్యోన్ముఖుని కావించుటకు

1. అనిర్వేదశ్శ్రియో మూల మనిర్వేదః పరం సుఖమ్,
అనిర్వేదో హి సతతం సర్వార్థేషు ప్రవర్తకః.
కరోతి సఫలం జన్తోః కర్మ యత్తత్కరోతి సః,
తస్మా దనిర్వేదకృతం యత్నం చేష్టే హ ముత్తమమ్.

జపసంఖ్య : 108 జపకాలం : 21రోజులు

## 18. ఋణవిముక్తికై

1. నమోఽస్తు రామాయ స లక్ష్మణాయ
దేవ్యై చ తస్యై జనకాత్మజాయై,
నమోస్తు రుద్రేన్ద్రయమానిలేభ్యో
నమోస్తు చన్ద్రార్కమరుద్గణేభ్యః.

2. సంక్షిప్తోఽయం మయాఽఽత్మా చ రామార్థే రావణస్య హి,
సిద్ధిం మే సంవిధాస్యన్తి దేవా స్సర్షిగణా స్త్విహ.
బ్రహ్మా స్వయంభూ ర్భగవా న్దేవాశ్చైవ దిశన్తు మే,
సిద్ధి మగ్ని శ్చ వాయుశ్చ పురుహూతశ్చ వజ్రభృత్.

వరుణః పాశహస్త శ్చ సోమాదిత్యా తథైవ చ,
అశ్వినౌ చ మహాత్మానౌ మరుత శ్శర్వ ఏవ చ.

సిద్ధిం సర్వాణి భూతాని భూతానాం చైవ యః ప్రభుః,
దాస్యన్తి మమ యే చాన్యే హ్యదృష్టాః పథి గోచరాః.

జపసంఖ్య : 54 జపకాలం : 80రోజులు

## 19. స్వప్నదోషాలు తొలగుటకు

1. స్వప్నో హ్యద్య మయా దృష్టో దారుణో రోమహర్షణః,
రాక్షసానా మభావాయ భర్తు రస్యా జయాయ చ.

ఏవం స్వప్నే మయా దృష్టో రామో విష్ణుపరాక్రమః,
లక్ష్మణేనసహ భ్రాత్రా సీతయాసహ రాఘవః.

జపసంఖ్య : 108 జపకాలం : 27రోజులు

## 20. యోగక్షేమాలు కోరువారు

1. మయా చ స మహాబాహుః పూర్ణచన్ద్రనిభాననః,
సమాశ్వాసయితుం న్యాయ్య స్సీతాదర్శనలాలసః.

జపసంఖ్య : 108 జపకాలం : 21రోజులు

## 21. దుఃఖము తొలగుటకు

1. ఏతై ర్నిమిత్తై రపరైశ్చ సుభ్రూ
స్సంబోధితా ప్రాగపి సాధుసిద్ధైః,

వాతాతపక్లాన్త మివ ప్రణష్టం
వర్షేణ బీజం ప్రతిసంజహర్ష.

2. మత్సందేశయుతా వాచ స్త్వత్త శ్రుత్వా చ రాఘవః,
పరాక్రమవిధిం వీరో విధివ త్సంవిధాస్యతి.

3. క్షిప్ర మేష్యతి కాకుత్స్థో హర్యక్షప్రవరై ర్వృతః,
యస్తే యుధి విజిత్యారీ ఞ్ఛోకం వ్యపనయిష్యతి. 14

జపసంఖ్య : 108 జపకాలం : 40రోజులు

## ౨౨. స్థానాంతరములో ఉన్నవారి క్షేమము కోరుటకు

1. కల్యాణీ బత గాథేయం లౌకికీ ప్రతిభాతి మే,
ఏతి జీవన్త మానన్దో నరం వర్షశతా దపి.
తయో సమాగతే తస్మిన్ ప్రీతి రుత్పాదితాఽద్భుతా,
పరస్పరేణ చాలాపం విశ్వస్తౌ తౌ ప్రచక్రతుః.

2. హనుమాంస్తు గురూ న్వృద్ధా న్జామ్బవత్ప్రముఖాం స్తదా,
కుమార మఙ్గదం చైవ సోఽవన్దత మహాకపిః.
స తాభ్యాం పూజితః పూజ్యః కపిభిశ్చ ప్రసాదితః.
దృష్టా సీ తేతి విక్రాన్త స్సంక్షేపేణ న్యవేదయత్,
నిషసాద చ హస్తేన గృహీత్వా వాలిన స్సుతమ్,
రమణీయే వనోద్దేశే మహేన్ద్రస్య గిరే స్తదా.

జపసంఖ్య : 1000 జపకాలం : 7రోజులు

## 23. సుఖసౌఖ్యములు కోరేవారు

1. రక్షితా జీవలోకస్య స్వజన స్యాభిరక్షితా,
   రక్షితా స్వస్య వృత్తస్య ధర్మస్య చ పరంతపః.

జపసంఖ్య : **108** జపకాలం : **40**రోజులు

## 24. ఉద్యోగప్రాప్తి కోరువారు

1. వానరోఽహం మహాభాగే దూతో రామస్య ధీమతః,
   రామనామాఙ్కితం చేదం పశ్య దే వ్యఙ్గుళీయకమ్.
   ప్రత్యయార్థం తవాఽఽనీతం తేన దత్తం మహాత్మనా,
   సమాశ్వసిహి భద్రం తే క్షీణదుఃఖఫలా హ్యసి.

జపసంఖ్య : **216** జపకాలం : **21**రోజులు

## 25. శుభవార్తలు కోరువారు

1. గృహీత్వా ప్రేక్షమాణా సా భర్తుః కరవిభూషణమ్,
   భర్తార మివ సంప్రాప్తా జానకీ ముదితాఽభవత్.
   చారు త ద్వదనం తస్యా స్తామ్రశుక్లాయతేక్షణమ్,
   అశోభత విశాలాక్ష్యా రాహుముక్త ఇ వోడురాట్.
   తత స్సా హ్రీమతీ బాలా భర్తృసన్దేశహర్షితా,
   పరితుష్టా ప్రియం కృత్వా ప్రశశంస మహాకపిమ్.

విక్రాన్త స్త్వం సమర్థ స్త్వం ప్రాజ్ఞ స్త్వం వానరోత్తమ,
యే నేదం రాక్షసపదం త్వయైకేన ప్రధర్షితమ్.

శతయోజనవిస్తీర్ణ స్సాగరో మకరాలయః,
విక్రమశ్లాఘనీయేన క్రమతా గోష్పదీకృతః.

జపసంఖ్య : 1000 జపకాలం : 7రోజులు

## 26. ఏలినాటి శని దోషము తొలగుటకు

1. హరిః పర్వతసఙ్కాశ స్తామ్రవక్త్రో మహాబలః,
వజ్రదంష్ట్రనఖో భీమో వైదేహీ మిద మబ్రవీత్.
స పర్వతవనోద్దేశాం సాట్టప్రాకారతోరణామ్,
లఙ్కా మిమాం సనాథాం వా నయితుం శక్తి రస్తి మే.
త దవస్థాప్యతాం బుద్ధి రలం దేవి వికాఙ్క్షయా,
విశోకం కురు వైదేహి రాఘవం సహలక్ష్మణమ్.

2. తం దృష్ట్వా భీమసఙ్కాశ మువాచ జనకాత్మజా,
పద్మపత్రవిశాలాక్షీ మారుత స్యౌరసం సుతమ్.

3. అహో స్వామిని తే భక్తి రహో వీర్య మహో ధృతిః,
దిష్ట్యా దృష్టా త్వయా దేవీ రామపత్నీ యశస్వినీ,
దిష్ట్యా త్యక్ష్యతి కాకుత్స్థ శ్శోకం సీతావియోగజమ్.

జపసంఖ్య : 27 జపకాలం : 120రోజులు

## 27. దైవనిందచేసినందువల్ల ఏర్పడే దోషం తొలగడానికి

1. స తం నిపతితం భూమౌ శరణ్య శ్శరణాగతమ్.
వధార్హ మపి కాకుత్స్థః కృపయా పర్యపాలయత్,
న శర్మ లబ్ధ్వా లోకేషు త మేవ శరణం గతః.

జపసంఖ్య : 216 జపకాలం : 21రోజులు

## 28. అనారోగ్య నివారణకు

1. కి మాహ సీతా హనుమం స్తత్త్వతః కథయాద్య మే,
ఏతేన ఖలు జీవిష్యే భేషజే నాతురో యథా.

జపసంఖ్య : 108 జపకాలం : 40రోజులు

## 29. ధైర్యము కోసము

1. నిత్య ముత్సాహయుక్తాశ్చ వాచ శ్శ్రుత్వా త్వ యేరితాః,
వర్ధిష్యతే దాశరథేః పౌరుషం మ దవాప్తయే.

2. సగణం రావణం హత్వా రాఘవో రఘునన్దనః,
త్వా మాదాయ వరారోహే స్వపురం ప్రతియాస్యతి.
త దాశ్వసిహి భద్రం తే భవ త్వం కాలకాఙ్క్షిణీ,
న చిరా ద్ద్రక్ష్యసే రామం ప్రజ్వలన్త మి వానలమ్.

3. మత్సందేశయుతా వాచ స్తత్ర శ్శ్రుత్వా చ రాఘవః,
పరాక్రమవిధిం వీరో విధివ త్సంవిధాస్యతి.

జపసంఖ్య : 11 జపకాలం : 40రోజులు

## 30. ఎడబాటు తొలగుటకు

1. సగణం రావణం హత్వా రాఘవో రఘునన్దనః,
త్వా మాదాయ వరారోహే స్వపురం ప్రతియాస్యతి.
త దాశ్వసిహి భద్రం తే భవ త్వం కాలకాఙ్క్షిణీ,
న చిరా ద్ద్రక్ష్యసే రామం ప్రజ్వలన్త మి వానలమ్.
నిహతే రాక్షసేన్ద్రేఽస్మి న్ సపుత్రామాత్యబాన్ధవే,
త్వం సమేష్యసి రామేణ శశాఙ్కే నేవ రోహిణీ.

జపసంఖ్య : 216 జపకాలం : 40రోజులు

## 31. ప్రియాసమాగమం కోసము

1. నాస్మిం శ్చిరం వత్స్యసి దేవి దేశే,
రక్షోగణై రధ్యుషితేఽతిరౌద్రే,
న తే చిరా దాగమనం ప్రియస్య
క్షమస్వ మత్సఙ్గమకాలమాత్రమ్.

జపసంఖ్య : 108 జపకాలం : 40రోజులు

## 32. కార్యాచరణకోసం

1. కార్యే కర్మణి నిర్దిష్టే యో బహూ న్యపి సాధయేత్,
పూర్వకార్యావిరోధేన స కార్యం కర్తు మర్హతి.

జపసంఖ్య : 216 జపకాలం : 21రోజులు

## 33. సమస్త దోషములు తొలగుటకు

1. దాసోఽహం కోసలేన్ద్రస్య రామ స్యాక్లిష్టకర్మణః,
హనుమా ఞ్చత్రుసైన్యానాం నిహన్తా మారుతాత్మజః.
స రావణసహస్రం మే యుద్ధే ప్రతిబలం భవేత్,
శిలాభిస్తు ప్రహరతః పాదపైశ్చ సహస్రశః.
అర్దయిత్వా పురీం లఙ్కా మభివాద్య చ మైథిలీమ్,
సమృద్ధార్థో గమిష్యామి మిషతాం సర్వరక్షసామ్.
ఏవ ముక్త్వా విమానస్థ శ్చైత్యస్థో హరియూథపః,
ననాద భీమనిర్హ్రాదో రక్షసాం జనయ న్భయమ్.

జపసంఖ్య : 108 జపకాలం : 40రోజులు

## 34. అపహరణ దోషము తొలగుటకు

1. లక్షి తేయం మయా సీతా తథా శోకపరాయణా,
గృహ్య యాం నాభిజానాసి పఞ్చాస్యా మివ పన్నగీమ్.

జపసంఖ్య : 108 జపకాలం : 40రోజులు

## 35. అగ్నిభయం లేకుండుటకు

1. యది చా స్త్యేకపత్నీత్వం శీతో భవ హనూమతః,
యది కిఞ్చి దనుక్రోశ స్తస్య మయ్యస్తి ధీమతః.
యది వా భాగ్యశేషో మే శీతో భవ హనూమతః,
యది మాం వృత్తసంపన్నాం తత్సమాగమలాలసామ్.

స విజానాతి ధర్మాత్మా శీతో భవ హనూమతః,
యది మాం తారయే దార్య సుగ్రీవ స్సత్యసఙ్గరః.

2. అస్మా ద్దుఃఖామ్బుసంరోధా చ్ఛీతో భవ హనూమతః,
తత స్తీక్ష్ణార్చి రవ్యగ్రః ప్రదక్షిణశిఖోఽనలః.
జజ్వాల మృగశాబాక్ష్యా శ్శంసన్నివ శివం కపేః,
హనుమజ్జనక శ్చాపి పుచ్ఛానలయుతోఽనిలః.

జపసంఖ్య : 216 జపకాలం : 11 రోజులు

## 36. శ్రమసాఫల్యం పొందుటకు

1. దుర్గే వినాశితే కర్మ భవే త్సుఖపరిశ్రమమ్,
అల్పయత్నేన కార్యేఽస్మి న్మమ స్యా త్సఫల శ్శ్రమః.

జపసంఖ్య : 108 జపకాలం : 40 రోజులు

## 37. సుఖ ప్రయాణం కోసం

1. ప్రీతిమన్త స్తత స్సర్వే వాయుపుత్రపురస్సరాః,
మహేన్ద్రాద్రిం పరిత్యజ్య పుప్లువుః ప్లవగర్షభాః.
మేరుమన్దరసఙ్కాశా మత్తా ఇవ మహాగజాః,
ఛాదయన్త ఇ వాకాశం మహాకాయా మహాబలాః.
సభాజ్యమానం భూతై స్త మాత్మవన్తం మహాబలమ్,
హనుమన్తం మహావేగం వహన్త ఇవ దృష్టిభిః.
రాఘవే చార్థనిర్వృత్తిం కర్తుం చ పరమం యశః,
సమాధాయ సమృద్ధార్థాః కర్మసిద్ధిభి రున్నతాః.

ప్రియాఖ్యానోన్ముఖా స్సర్వే సర్వే యుద్ధాభినన్దినః,
సర్వే రామప్రతీకారే నిశ్చితార్థా మనస్వినః.
ప్లవమానాః ఖ మాప్లుత్య తత స్తే కాననౌకసః,
నన్దనోపమ మాసేదు ర్వనం ద్రుమలతాయుతమ్.

2. ఇమం చ తీవ్రం మమ శోకవేగం
రక్షోభి రేభిః పరిభర్త్సనం చ,
బ్రూయాస్తు రామస్య గత స్సమీపం
శివశ్చ తేఽధ్వాస్తు హరిప్రవీర.

జపసంఖ్య : 58 జపకాలం : 11 రోజులు

## 38. ఉదర రోగములు తొలగుటకు

1. తా నువాచ హరిశ్రేష్ఠో హనుమా న్వానరర్షభః,
అవ్యగ్రమనసో యూయం మధు సేవత వానరాః.
సాధుసాధ్వితి సంహృష్టా వానరాః ప్రత్యపూజయన్,
పూజయి త్వాఙ్గదం సర్వే వానరా వానరర్షభమ్.

2. తా నువాచ హరిశ్రేష్ఠో హనుమా న్వానరర్షభః,
అవ్యగ్రమనసో యూయం మధు సేవత వానరాః.
అహ మావారయిష్యామి యుష్మాకం పరిపన్థినః,
శ్రుత్వా హనుమతో వాక్యం హరీణాం ప్రవరోఽఙ్గదః.
ప్రత్యువాచ ప్రసన్నాత్మా పిబన్తు హరయో మధు,
అవశ్యం కృతకార్యస్య వాక్యం హనుమతో మయా.

జపసంఖ్య : 54 జపకాలం : 21రోజులు

# గ్రహదోషాల నివారణము పారాయణ పద్ధతులు

జ్యోతిష ఫలశాస్త్రం అనుసరించి ప్రతి జాతకునకు కొన్ని గ్రహదశలు లేదా గ్రహదశలలోని అంతర్దశలు క్లేశములు కలుగజేస్తుంటాయి. ఈ క్లేశములనుండి నివారణకై ఆయా గ్రహములకు ప్రార్థనలు, జపములు, ఇతర పారాయణలు వంటి అనేక ప్రక్రియలు చెప్పబడ్డాయి. ఈ కోవలోకి చెందినది, మహత్తరమైనది... విశేష ఫలితములు చేకూర్చేది 'శ్రీమద్రామాయణము' నందలి కొన్ని సర్గలు పారాయణ చేయుట. పూర్వకాలంనుండి ఈనాటి వరకు ఈ రామాయణ పారాయణ, సుందరకాండ పారాయణ చేసి (గ్రహశాంతులు చేసిన ఫలితములు పొందుటచే) విశేష శుభఫలితములను పొందినట్లు తెలుస్తోంది. అందువలన గ్రహదోషములు ఏర్పడే కాలములో ఈ దిగువ చెప్పబడిన సర్గలను పఠించుట వల్ల ఆ గ్రహదోషములనుండి నివారణ కలుగుతుంది.

## పారాయణ కాలం

సూర్యోదయ కాలమందు, శౌచస్నానాదులు ముగించుకొని, శుభ్రమయిన వస్త్రాలు ధరించి తగిన ఆసనంమీద కూర్చొని, ఇష్టదైవ ప్రార్థన చేసికొని, పారాయణ ప్రారంభించవలెను.

## రవి మహాదశ

రవి మహాదశ యోగించనపుడు లేదా రవిగ్రహం వల్ల ఏర్పడే యితర దోషాలు అనారోగ్యములు ఏర్పడినప్పుడు ఈ గ్రంథమునందే చెప్పబడిన **'గాయత్రీ బీజ సంయుత గాయత్రీ రామాయణము'** లేదా **'ఆదిత్య హృదయ సర్గము'**ను ఆదివారం నాడు పారాయణ చేయవలెను.

## చంద్రమహాదశ

చంద్రమహాదశ యోగించనపుడు లేదా చంద్రగ్రహం వల్ల ఏర్పడే యితర దోషాలు, అనారోగ్యములు ఏర్పడినపుడు, ఈగ్రంథమునందే చెప్పబడిన **'సంక్షేప రామాయణము'** లేదా **'సుందరకాండమునందలి 5వ సర్గము'**ను సోమవారంనాడు పారాయణ చేయవలెను.

## కుజమహాదశ

కుజమహాదశ యోగించనపుడు లేదా కుజగ్రహంవల్ల ఏర్పడే ఇతర దోషములు, అనారోగ్యములు ఏర్పడినపుడు ఈ గ్రంథమునందే చెప్పబడిన **'రావణవధ సర్గ'** పారాయణము లేదా **'సుందరకాండము నందలి 47వ సర్గము'**ను మంగళవారము నాడు పారాయణ చేయవలెను.

## బుధమహాదశ

బుధమహాదశ యోగించనపుడు లేదా బుధగ్రహంవల్ల ఏర్పడే ఇతర దోషములు, అనారోగ్యములు ఏర్పడినపుడు ఈ

గ్రంథమునందే చెప్పబడిన **'శ్రీరామావతారసర్గము'** పారాయణము లేదా **'సుందరకాండము నందలి 35వ సర్గము'**ను బుధవారము నాడు పారాయణ చేయవలెను.

## గురుమహాదశ

గురుమహాదశ యోగించనపుడు లేదా గురుగ్రహంవల్ల ఏర్పడే ఇతర దోషములు, అనారోగ్యములు ఏర్పడినపుడు ఈ గ్రంథమునందే చెప్పబడిన **'శ్రీరామపట్టాభిషేకసర్గము'** పారాయణము లేదా **'సుందరకాండము నందలి 1వ సర్గము'**ను గురువారము నాడు పారాయణ చేయవలెను.

## శుక్రమహాదశ

శుక్రమహాదశ యోగించనపుడు లేదా శుక్రగ్రహంవల్ల ఏర్పడే ఇతర దోషములు, అనారోగ్యములు ఏర్పడినపుడు ఈ గ్రంథమునందే చెప్పబడిన **'శ్రీసీతారామకల్యాణసర్గము'** పారాయణము లేదా **'సుందరకాండము నందలి 68వ సర్గము'**ను శుక్రవారము నాడు పారాయణ చేయవలెను. (వివాహము కావలసినవారు **'శ్రీసీతారామ కల్యాణసర్గము'**ను **40**రోజులు పారాయణ చేసినచో శీఘ్రమే వివాహము జరుగును)

## శనిమహాదశ

శనిమహాదశ యోగించనపుడు లేదా శనిగ్రహంవల్ల ఏర్పడే ఇతర దోషములు, అనారోగ్యములు ఏర్పడినపుడు ఈ గ్రంథమునందే చెప్పబడిన **'శ్రీరామస్తుతిసర్గము'** పారాయణము లేదా

**'సుందరకాండము నందలి 46వ సర్గము'**ను శనివారము నాడు పారాయణ చేయవలెను.

## రాహుమహాదశ

రాహుమహాదశ యోగించనపుడు లేదా రాహుగ్రహంవల్ల ఏర్పడే ఇతర దోషములు, అనారోగ్యములు ఏర్పడినపుడు ఈ గ్రంథమునందే చెప్పబడిన **'నాగపాశవిమోచనసర్గము'** పారాయణము లేదా **'సుందరకాండము నందలి 48వ సర్గము'**ను ఆదివారము నాడు పారాయణ చేయవలెను.

## కేతుమహాదశ

కేతుమహాదశ యోగించనపుడు లేదా కేతుగ్రహంవల్ల ఏర్పడే ఇతర దోషములు, అనారోగ్యములు ఏర్పడినపుడు ఈ గ్రంథమునందే చెప్పబడిన **'శ్రీసీతారామసుఖజీవనసర్గము'** పారాయణము లేదా **'సుందరకాండము నందలి 32వ సర్గము'**ను సోమవారము నాడు పారాయణ చేయవలెను.

## నివేదన

ప్రతిదినము పారాయణ పూర్తి అయిన పిదప మంగళశ్లోకములను పఠించి, లభించిన ఏ పదార్థమునైనను నివేదన చేయవలెను. పారాయణానంతరము ఆయా గ్రహములకు చెప్పబడిన ధాన్యములను లేదా శాస్త్రప్రకారము చెప్పబడిన ఇతర ద్రవ్యములను దానముచేసి అన్నశాంతి చేయుటద్వారా శుభఫలితములను సత్వరము పొందగలరు.

# శ్రీమత్సుందరకాండ పారాయణ ప్రారంభంలో శ్రీవైష్ణవులు చదువవలసిన శ్లోకములు

లక్ష్మీనాథసమారమ్భాం నాథయామునమధ్యమామ్,
అస్మదాచార్య పర్యన్తాం వన్దే గురుపరంపరామ్.
యో నిత్య మచ్యుతపదామ్బుజయుగ్మరుక్మ వ్యామోహత
స్తదితరాణి తృణాయ మేనే, అస్మద్గురో ర్భగవతో౽స్య
దయైక సిన్ధో రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే.
మాతా పితా యువతయ స్తనయా విభూతి స్సర్వం
యదేవ నియమేన మదన్వయానామ్,
ఆద్యస్య నః కులపతే ర్వకుళాభిరామం
శ్రీమత్త దఙ్ఘ్రియుగళం ప్రణమామి మూర్ధ్నా.
భూతం సరశ్చ మహదాహ్వయ భట్టనాథ
శ్రీభక్తిసారకుల శేఖరయోగివాహాన్,
భక్తాఙ్ఘ్రి రేణు పరకాల యతీన్ద్రమిశ్రాన్
శ్రీమత్పరాఙ్కుశమునిం ప్రణతో౽స్మి నిత్యమ్.

అథ శ్రీశైలపూర్ణవిషయమ్

పితామహస్యాపి పితామహాయ ప్రాచేత సాదేశఫలప్రదాయ, శ్రీభాష్యకారోత్తమదేశికాయ శ్రీశైలపూర్ణాయ నమో నమస్తాత్. ఇతి శ్లోక మారభ్య శ్రీభాష్యకార ప్రభృతి స్వాచార్యప్రభృతి శ్రీధరపర్యన్త ప్రతివ్యక్తివిషయాః శ్లోకా అనుసన్ధేయాః.

## విష్వక్సేనధ్యానమ్

శుక్లామ్బరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్,
ప్రసన్నవదనం ధ్యాయే త్సర్వవిఘ్నోపశాన్తయే.
యస్య ద్విరదవక్త్రాద్యాః పారిషద్యాః పరశ్శతమ్,
విఘ్నం నిఘ్నన్తి సతతం విష్వక్సేనం త మాశ్రయే.

## శ్రీహయగ్రీవధ్యానమ్

జ్ఞానానన్దమయం దేవం నిర్మలస్ఫటికాకృతిమ్,
ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవ ముపాస్మహే.
అభఙ్గురకలాదానస్థూల లక్షత్వ మీయుషే,
తుఙ్గాయ మహసే తస్మై తురఙ్గాయ ముఖే నమః

## వాల్మీకిధ్యానమ్

కూజన్తం రామరామేతి మధురం మధురాక్షరమ్,
ఆరుహ్య కవితాశాఖాం వన్దే వాల్మీకికోకిలమ్.
వాల్మీకే ర్మునిసింహస్య కవితా వనచారిణః,
శృణ్వన్ రామకథానాదం కో నయాతి పరాంగతిమ్.
యః పిబన్ రామచరితామృతసాగరమ్,
అతృప్త స్తం మునిం వన్దే ప్రాచేతస మకల్మషమ్.

## ఆఞ్జనేయప్రార్థనా

గోష్పదీకృతవారాశిం మశకీకృతరాక్షసమ్,
రామాయణమహామాలారత్నం వన్దేఽనిలాత్మజమ్. 1

అఞ్జనానన్దనం వీరం జానకీశోకనాశనమ్,
కపీశ మక్షహన్తారం వన్దే లఙ్కాభయఙ్కరమ్. 2

ఆమిషీకృతమార్తాణ్డం గోష్పదీకృతసాగరమ్,
తృణీకృతదశగ్రీవ మాఞ్జనేయం నమా మ్యహమ్. 3

మనోజవం మారుతతుల్యవేగం జితేన్ద్రియం బుద్ధిమతాం వరిష్ఠమ్,
వాతాత్మజం వానరయూథముఖ్యం శ్రీరామదూతం శిరసా నమామి.

ఉల్లఙ్ఘ్య సిన్ధో స్సలిలం సలీలం యశ్శోకవహ్నిం జనకాత్మజాయాః,
ఆదాయ తేనైవ దదాహ లఙ్కాం నమామి తం ప్రాఞ్జలి రాఞ్జనేయమ్.

ఆఞ్జనేయ మతిపాటలాననం కాఞ్చనాద్రికమనీయవిగ్రహమ్,
పారిజాతతరుమూలవాసినం భావయామి పవమాననన్దనమ్. 6

యత్రయత్ర రఘునాథకీర్తనం తత్రతత్ర కృతమస్తకాఞ్జలిమ్,
బాష్పవారిపరిపూర్ణలోచనం మారుతిం నమత రాక్షసాన్తకమ్.

## శ్రీరామాయణప్రార్థనా

వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే,
వేదః ప్రాచేతసా దాసీ త్సాక్షా ద్రామాయణాత్మనా. 1

చరితం రఘునాథస్య శతకోటి ప్రవిస్తరమ్,
ఏకైక మక్షరం ప్రోక్తం మహాపాతకనాశనమ్. 2

శృణ్వన్ రామాయణం భక్త్యా యః పాదం పదమేవ వా,
స యాతి బ్రహ్మణఃస్థానం బ్రహ్మణా పూజ్య తే సదా. 3

వాల్మీకిగిరిసంభూతా రామసాగరగామినీ,
పునాతి భువనం పుణ్యా రామాయణమహానదీ. 4

శ్లోకసారసమాకీర్ణం సర్గకల్లోలసంకులమ్,
కాణ్డగ్రాహ మహామీనం వన్దే రామాయణార్ణవమ్. 5

యః కర్ణాఞ్జలిసంపుటైరహరహ స్సమ్యక్పిబత్యాదరా
ద్వాల్మీకే ర్వదనారవిన్దగలితం రామాయణాఖ్యం మధు,
జన్మవ్యాధిజరావిపత్తిమరణై రత్యన్తసోపద్రవం
సంసారం స విహాయ గచ్ఛతి పుమాన్విష్ణోః పదం శాశ్వతమ్. 6

తదుపగతసమాససన్ధియోగం సమమధురోపనతార్థ వాక్యబద్ధమ్,
రఘువరచరితం మునిప్రణీతం దశశిరస శ్చ వధం నిశామయధ్వమ్.

## శ్రీరామప్రార్థనా

శ్రీరాఘవం దశరథాత్మజ మప్రమేయం
సీతాపతిం రఘుకులాన్వయరత్న దీపమ్,
ఆజానుబాహు మరవిన్దదళాయతాక్షం
రామం నిశాచరవినాశకరం నమామి.

వైదేహీసహితం సురద్రుమతలే హైమే మహామణ్డపే
మధ్యే పుష్పకమాసనే మణిమయే వీరాసనే సుస్థితమ్,
అగ్రే వాచయతి ప్రభఞ్జనసుతే తత్త్వం మునిభ్యః పరం
వ్యాఖ్యాన్తం భరతాదాభిః పరివృతం రామం భజే శ్యామలమ్.

తతో యథాశక్తి శ్రీకోశోపరి భగవదారాధనం కార్యమ్. అథ

''ధర్మాత్మా సత్యసన్ధ శ్చ రామో దాశరథి ర్యది,
పౌరుషే చాప్రతిద్వన్ద్వ శ్శరైనం జహి రావణిమ్.
తవ స్స్వాధ్యాయనిరతం తపస్వీ వాగ్విదాం వరమ్,
నారదం పరిపప్రచ్ఛ వాల్మీకి ర్మునిపుఙ్గవమ్''.

ఇతి శ్లోకద్వయం పఠిత్వా 'శ్రీరఘునన్దనపరబ్రహ్మణే నమః' ఇత్యుక్త్వా పారాయణ మారభేత.

# శ్రీ మత్సుందరకాండ పారాయణ ప్రారంభంలో చదువవలసిన శ్లోకములు

## ఆదౌ శ్రీమహాగణపతి ధ్యానమ్

శుక్లామ్బరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్,
ప్రసన్నవదనం ధ్యాయే త్సర్వవిఘ్నోపశాన్తయే. 1
అగజాననపద్మార్కం గజానన మహర్నిశమ్,
అనేకదంతం భక్తానా మేకదన్త ముపాస్మహే. 2
వాగీశాద్యా స్సుమనస స్సర్వార్థానా ముపక్రమే,
యం నత్వా కృతకృత్యా స్స్యు స్తం నమామి గజాననమ్. 3

## సరస్వతీప్రార్థనా

శారదా శారదామ్భోజవదనా వదనామ్బుజే,
సర్వదా సర్వదాఽస్మాకం సన్నిధి స్సన్నిధిం క్రియాత్. 1
యా కున్దేన్దుతుషారహారధవళా యా శుభ్రవస్త్రావృతా,
యా వీణావరదణ్డమణ్డితకరా యా శ్వేతపద్మాసనా,
యా బ్రహ్మాచ్యుతశఙ్కరప్రభృతిభి ర్దేవై స్సదా పూజితా
సా మాం పాతు సరస్వతీ భగవతీ నిశ్శేషజాడ్యాపహా. 2

దోర్భి ర్యుక్తా చతుర్భి స్స్ఫటికమణిమయీ మక్షమాలాం
దధానా హస్తే నైకేన పద్మం సిత మపి చ శుకం పుస్తకం చాపరేణ,
భాసా కున్దేన్దుశఙ్ఖస్ఫటికమణినిభా భాసమానాఽసమానా
సామే వాగ్దేవ తేయం నివసతు వదనే సర్వదా సుప్రసన్నా.

## వాల్మీకినమస్క్రియా

కూజన్తం రామరామేతి మధురం మధురాక్షరమ్,
ఆరుహ్య కవితాశాఖాం వన్దే వాల్మీకికోకిలమ్. 1

వాల్మీకే ర్మునిసింహస్య కవితా వనచారిణః,
శృణ్వన్ రామకథానాదం కో న యాతి పరాం గతిమ్. 2

యః పిబన్ సతతం రామచరితామృతసాగరమ్,
అతృప్త స్తం మునిం వన్దే ప్రాచేతస మకల్మషమ్.

## ఆఞ్జనేయనమస్క్రియా

గోష్పదీకృతవారాశిం మశకీకృత రాక్షసమ్,
రామాయణ మహామాలారత్నం వన్దేఽనిలాత్మజమ్. 1

అఞ్జనానన్దనం వీరం జానకీశోకనాశనమ్,
కపీశ మక్షహన్తారం వన్దే లఙ్కాభయఙ్కరమ్. 2

ఆమిషీకృతమార్తాణ్డం గోష్పదీకృతసాగరమ్,
తృణీకృతదశగ్రీవ మాఞ్జనేయం నమా మ్యహమ్.

ఉల్లఙ్ఘ్య సిన్ధో స్సలిలం సలీలం
య శ్శోకవహ్నిం జనకాత్మజాయాః,
ఆదాయ తేనైవ దదాహ లఙ్కాం నమామి తం ప్రాఞ్జలి రాఞ్జనేయమ్.

ఆఞ్జనేయ మతిపాటలాననం కాఞ్చనాద్రికమనీయవిగ్రహమ్,
పారిజాతతరుమూలవాసినం భావయామి పవమాననన్దనమ్. 4

యత్ర యత్ర రఘునాథకీర్తనం తత్ర తత్ర కృతమస్తకాఞ్జలిమ్,
బాష్పవారిపరిపూర్ణలోచనం మారుతిం నమత రాక్షసాన్తకమ్. 5

మనోజవం మారుతతుల్యవేగం
జితేన్ద్రియం బుద్ధిమతాం వరిష్ఠమ్,
వాతాత్మజం వానరయూథ ముఖ్యం
శ్రీరామదూతం శిరసా నమామి.

# శ్రీమద్రామాయణప్రార్థనా

వాల్మీకిస్మృతిమన్దరేణ మథిత స్సీతారమాసంభవ
స్సుగ్రీవామరభూరుహో ఽఙ్గదగజ స్సౌమిత్రిచన్ద్రోదయః,
వాతోత్పన్న మణిర్విభీషణసుధః పౌలస్త్యహాలాహల
శ్శ్రీరామాయణదుగ్ధసిన్ధు రమలో భూయా త్స న శ్శ్రేయసే. 1

యః కర్ణాఞ్జలిసంపుటై రహరహ స్సమ్యక్పిబ త్యాదరా
ద్వాల్మీకేర్వదనారవిన్దగళితం రామాయణాఖ్యం మధు,
జన్మ వ్యాధిజరావిపత్తిమరణై రత్యన్తసోపద్రవం
సంసారం స విహాయ గచ్ఛతి పుమా న్విష్ణోః పదం శాశ్వతమ్. 2

త దు పగతసమాససన్ధియోగం సమమధురోపనతార్థవాక్యబద్ధమ్,
రఘువరచరితం మునిప్రణీతం దశశిరసశ్చ వధం నిశామయధ్వమ్. 3

వాల్మీకిగిరిసంభూతా రామసాగర గామినీ,
పునాతి భువనం పుణ్యా రామాయణమహానదీ. 4

శ్లోకసారసమాకీర్ణం సర్గకల్లోలసఙ్కులమ్,
కాణ్డగ్రాహమహామీనం వన్దే రామాయణార్ణవమ్. 5

వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే,
వేదః ప్రాచేతసా దాసీ త్సాక్షా ద్రామాయణాత్మనా.

## శ్రీరామధ్యానక్రమః

వైదేహీసహితం సురద్రుమతలే హైమే మహామణ్డపే
మధ్యేపుష్పక మాసనే మణిమయే వీరాసనే సుస్థితమ్,
అగ్రే వాచయతి ప్రభఞ్జనసుతే తత్త్వం మునిభ్యః పరం
వ్యాఖ్యాన్తం భరతాదిభిః పరివృతం రామంభజే శ్యామలమ్. 1

వామే భూమిసుతా పురశ్చ హనుమాన్ పశ్చా త్సుమిత్రాసుత
శ్శత్రుఘ్నో భరతశ్చ పార్శ్వదళయో ర్వాయ్వాదికోణేషు చ,
సుగ్రీవశ్చ విభీషణశ్చ యువరా ట్తారాసుతో జామ్బవా
న్మధ్యే నీలసరోజకోమలరుచిం రామం భజే శ్యామలమ్. 2

మాతా రామో మత్పితా రామభద్రో భ్రాతా రామో మత్సఖా రాఘవేశః,
సర్వస్వం మే రామచన్ద్రో దయాళు ర్నాన్యం దేవం నైవ జానే న జానే.

సాకేతే శరదిన్దుకున్దధవళే సౌధే మహామణ్డపే
పర్యాసాగురుధూపదీపలలితే కర్పూరదీపోజ్జ్వలే,
సుగ్రీవాఙ్గదజామ్బవత్పరివృతం సౌమిత్రిణా సేవితం
లీలామానుషవిగ్రహం రఘువరం రామం భజే శ్యామలమ్. 4

నమోఽస్తు రామాయ సలక్ష్మణాయ దేవ్యైచ తస్యై జనకాత్మజాయై,
నమోఽస్తు రుద్రేన్ద్రయమానిలేభ్యో నమోఽస్తు చన్ద్రార్కమరుద్గణేభ్యః.

తత శ్శ్రీకోశోపరి శ్రీరామావాహనాది నైవేద్యాన్తపూజా విధేయా.

పారాయణావసానే చ పునఃపూజా కర్తవ్యా.

# శ్రీమత్సుందరకాండ పారాయణ ప్రారంభములో పఠించవలసిన సర్గములు

## గాయత్రీ రామాయణము

శ్లో. తపస్స్వాధ్యాయనిరతం తపస్వీ వాగ్విదాం వరం,
నారదం పరిపప్రచ్ఛ వాల్మీకి ర్మునిపుఙ్గవమ్. 1

తా. తపస్సంపన్నుడగు వాల్మీకి మహర్షి తపస్సునందును, వేదమునందును, ఆసక్తుడును, బ్రహ్మవేత్తలలో ఉత్తముడును, మునిశ్రేష్ఠుడు నగు నారదమహామునిని ఇట్లని యడిగెను.

శ్లో. స హత్వా రాక్షసా న్సర్వా న్యజ్ఞఘ్నా న్రఘునన్దనః,
ఋషిభిః పూజిత స్సమ్య గ్యథేన్ద్రో విజయీ పురా. 2

తా. ఆ రాముడు యజ్ఞములను చెరచునట్టి రాక్షసులనందరను వధించి మున్ను జయమునొందిన దేవేంద్రుడు వలె మహర్షులచే చక్కగా పూజింపబడెను.

శ్లో. విశ్వామిత్ర స్స ధర్మాత్మా శ్రుత్వా జనకభాషితమ్
వత్స రామ ధనుః పశ్య ఇతి రాఘవ మబ్రవీత్. 3

తా. ధర్మస్వభావుడగు విశ్వామిత్రుడు జనకమహారాజు మాటను విని నాయనా రామా! శివధనుస్సును చూడుమని రామునితో చెప్పెను.

శ్లో. తుష్టావాస్య తథా వంశం ప్రవిశ్య స విశాంపతేః
శయనీయం నరేన్ద్రస్య త దాసాద్య వ్యతిష్ఠత. 4

తా. ఆ సుమంత్రుడు లోపల ప్రవేశించి యీ దశరథ మహారాజుయొక్క వంశమును పొగడెను. అంత రాజుపానుపునొద్ద జేరి నిలబడెను.

శ్లో. వనవాసం హి సఙ్ఖ్యాయ వాసాం స్యాభరణాని చ
భర్తార మనుగచ్ఛన్త్యై సీతాయై శ్వశురో దదౌ. 5

తా. పెనిమిటి వెంబడి పోవుచున్న సీతకు మామయగు దశరథుడు వనవాసకాలము లెక్కపెట్టి యందుకు కావలసిన వస్త్రములను ఆభరణములను ఇచ్చెను.

శ్లో. రాజా సత్యంచ ధర్మశ్చ రాజా కులవతాం కులమ్
రాజా మాతా పితాచైవ రాజా హితకరో నృణామ్. 6

తా. రాజే సత్యమును ధర్మమును రక్షించువాడు. సత్కులముగలవారికి రాజే ఆ సత్కులము కాపాడువాడు. రాజే తల్లియు దండ్రియు, రాజే ప్రజలకు మేలుచేయువాడు - ఇది దశరథ మరణానంతరము మార్కండేయాదుల వాక్యము.

శ్లో. నిరీక్ష్య స ముహూర్తంతు దదర్శ భరతో గురుమ్
ఉటజే రామ మాసీనం జటావల్కల ధారిణమ్. 7

తా. ఆ భరతుడు కొంచెముసేపు పర్ణశాల నాలుగుప్రక్కలను చూచి యచ్చట కూర్చుండినవాడును జటామండలము ధరించినవాడునగు రామునిగాంచెను.

శ్లో. యదిబుద్ధిః కృతా ద్రష్టు మగస్త్యం తం మహామునిమ్
అద్యైవ గమనే బుద్ధిం రోచయస్వ మహాయశాః. 8

తా. గొప్ప కీర్తిగలరాముడా! మహామునియగు నా యగస్త్యుని చూచుటకు తలంపుకలిగినయెడల ఇప్పుడే యచటికి పోవుటయందు మనస్సు పెట్టుము. ఇది సుతీక్ష్ణమహర్షి వాక్యము.

శ్లో. భరత స్యార్యపుత్త్రస్య శ్వశ్రూణాం మమ చ ప్రభో
మృగరూప మిదం వ్యక్తం విస్మయం జనయిష్యతి. 9

తా. ప్రభువగు రాముడా! భరతునకు నీకును అత్తలకును నాకును ఈ మృగముయొక్క సౌందర్యము ఆశ్చర్యము కలిగించుననుట స్పష్టము. ఇది సీతావాక్యము.

శ్లో. గచ్ఛ శీఘ్ర మితో రామ సుగ్రీవం తం మహాబలమ్
వయస్యం తం కురు క్షిప్ర మితో గత్వాద్య రాఘవ.

తా. రాముడా! ఇచటినుండి శీఘ్రముగా మహాబలుడగు ఆ సుగ్రీవుని యొద్దకు పొమ్ము. నీ విప్పుడు పోయి యతనిని శీఘ్రముగా నీకు మిత్రునిగా చేసికొనుము. ఇది కబంధవాక్యము.

శ్లో. దేశకాలౌ భజ స్వాద్య క్షమమాణః ప్రియాప్రియే
సుఖదుఃఖసహః కాలే సుగ్రీవవశగో భవ. 11

తా. దేశకాలముల నాలోచింపుము. ప్రియమును అప్రియమును ఓర్చి సుఖమును దుఃఖమును సహించి సుగ్రీవునకు లోబడియుండుము. ఇది అంగదునితో వాలి వాక్యము.

శ్లో. వన్ద్యా స్తే తు తపస్సిద్ధా స్తపసా వీతకల్మషాః
ప్రష్టవ్యాచాపి సీతాయాః ప్రవృత్తి ర్వినయాన్వితైః. 12

తా. ఆ తపస్సిద్ధులును తపస్సుచేత పోగొట్టబడిన పాపముగలవారలు నగు వారలను నమస్కరించి మీరలు వినయముతో కూడినవారలై వారలను సీతావృత్తాంతము నడుగవలెను. ఇది శతవలితో సుగ్రీవ వచనము.

శ్లో. స నిర్జిత్య పురీం శ్రేష్ఠాం లఙ్కాం తాం కామరూపిణీం,
విక్రమేణ మహాతేజా హనూమా న్మారుతాత్మజః. 13

తా. వాయువు యొక్క కుమారుడును మహాపరాక్రమశాలియు నగు ఆ

హనుమంతుడు కామరూపిణియు ఉత్తమయునగు ఆ లంకాపురీ దేవతను పరాక్రమముచే జయించెను.

శ్లో. ధన్యా దేవా స్సగన్ధర్వా స్సిద్ధాశ్చ పరమర్షయః
మమ పశ్యన్తి యే నాథం రామం రాజీవలోచనమ్. 14

తా. నాభర్తను కమలములవంటి కన్నులుగల రాముని ఎవరు చూచుచున్నారో అట్టి దేవతలును, గంధర్వులును, సిద్ధులును, మహర్షులును ధన్యులు. ఇది సీతావాక్యము.

శ్లో. మఙ్గళాభిముఖీ తస్య సా తదాసీ న్మహాకపేః
ఉపతస్థే విశాలాక్షీ ప్రయతా హవ్యవాహనమ్. 15

తా. ఆ సీతాదేవి అప్పుడు హనుమంతునకు మంగళము కోరినదై పరిశుద్ధయై అగ్నిహోత్రుని ప్రార్థించెను.

శ్లో. హితం మహార్థం మృదు హేతుసంహితం
వ్యతీత కాలాయతి సమ్ప్రతిక్షమమ్,
నిశమ్య త ద్వాక్య ముపస్థితజ్వరః
ప్రసజ్గవా నుత్తర మేత దబ్రవీత్. 16

తా. ఆ రావణుడు హితకరంబును గొప్ప అర్థముగలదియు మృదులమును, యుక్తియుక్తమును, భూతకాలమునందును, భవిష్యత్కాలము నందును, వర్తమాన కాలమునందును మేలుగలించునదియు నగు నా విభీషణుని వాక్యమును విని కోపము పొంది మిక్కిలి పట్టుదల గలవాడై యిట్లని బదులు చెప్పెను.

శ్లో. ధర్మాత్మా రక్షసాం శ్రేష్ఠ స్సమ్ప్రాప్తోఽయం విభీషణః
లఙ్కైశ్వర్యం ధ్రువం శ్రీమా నయం ప్రాప్నో త్యకణ్టకమ్.

తా. ధర్మబుద్ధియు రాక్షసులలో నుత్తముడునగు విభీషణుడు నన్ను శరణుజొచ్చినాడు. శ్రీమంతుడగు నితడు నిష్కంటకమగు లంకా రాజ్యము పొందగలడు. నిశ్చయము. ఇది రాముడు అంగదునిచే రావణునకు చెప్పి పంపు వాక్యము.

శ్లో. యో వజ్రపాతాశని సన్నిపాతా
న్న చుక్షుభే నాపి చచాల రాజా,
స రామబాణాభిహతో భృశార్త
శ్చచాల చాపంచ ముమోచ వీరః. 18

తా. ఎవ్వడు వజ్రాయుధము దెబ్బకును పిడుగు పడుటకును క్షోభపడలేదో, చలింపలేదో అట్టి వీరుడగు రావణుడు రాముని బాణములచే కొట్టబడినవాడై మిక్కిలి బాధనొంది చలించెను. చేతి ధనుస్సును జారవిడిచెను.

శ్లో. యస్య విక్రమ మాసాద్య రాక్షసా నిధనం గతాః,
తం మన్యే రాఘవం వీరం నారాయణ మనామయమ్.

తా. ఎవ్వని పరాక్రమముమీదికి పోయి రాక్షసులు మరణము పొందిరో అట్టి వీరుడగు రాముని నాశములేని నారాయణుడని తలచుచున్నాను. ఇది రావణవాక్యము.

శ్లో. న తే దదృశిరే రామం దహన్త మరివాహినీమ్
మోహితాః పరమాస్త్రేణ గాన్ధర్వేణ మహాత్మనా. 20

తా. ఆ మూలబలమునందలి రాక్షసులు మహాప్రభావమగు గాంధర్వాస్త్రములచే మోహితులగుటవలన శత్రుసైన్యమును దహించుచున్న రాముని చూడ్డారెరి.

శ్లో. ప్రణమ్య దేవతాభ్యశ్చ బ్రాహ్మణేభ్యశ్చ మైథిలీ
బద్ధాఞ్జలిపుటా చేద మువా చాగ్నిసమీపతః. 21

తా. సీతాదేవి దేవతలకును బ్రాహ్మణులకును నమస్కరించి చేతులు మోడ్చి అగ్నిహోత్రము సమీపమున నీ వాక్యము పలికెను.

శ్లో. చలనా త్పర్వతేన్ద్రస్య గణా దేవాశ్చ కమ్పితాః
చచాల పార్వతీచాపి తదాశ్లిష్టా మహేశ్వరమ్. 22

తా. కైలాసపర్వతము కదలుట వలన ఆ పర్వతము మీదనుండు ప్రమథగణములును దేవతలును చలనము పొందిరి. అప్పుడు పార్వతీదేవియు చలనము నొంది శివుని కౌగిలించుకొనెను.

శ్లో. దారాః పుత్రాః పురం రాష్ట్రం భోగాచ్ఛాదనభోజనం,
సర్వ మే వావిభక్తం నౌ భవిష్యతి హరీశ్వర. 23

తా. వానరనాథుడవగు వాలీ! భార్యలును, కొడుకులును, పట్టణమును, రాజ్యమును, భోగములును, వస్త్రములును, భోజనమును, సమస్తమును మన యిరువురకు భేదములేక యుండగలదు. ఇది రావణవాక్యము.

శ్లో. యా మేవ రాత్రిం శత్రుఘ్నః పర్ణశాలాం సమావిశత్,
తామేవ రాత్రిం సీతాపి ప్రసూతా దారకద్వయమ్. 24

తా. ఏ రాత్రి శత్రుఘ్నుడు వాల్మీకి యాశ్రమమున పర్ణశాలయందు వసుండెనో ఆ రాత్రియే సీత ఇద్దరు పుత్రులను కనెను.

శ్లో. ఇదం రామాయణం కృత్స్నం గాయత్రీ బీజసంయుతమ్
త్రిసన్ధ్యం యః పఠే న్నిత్యం సర్వపాపైః ప్రముచ్యతే. 25

తా. గాయత్రీబీజాక్షరములతో కూడిన యీ రామాయణము

నంతయు ఎవ్వడు ప్రతిదినము మూడు సంధ్యలయందును జదువునో అతడు సమస్త పాపముల చేతను విడువబడును.

ఈ శ్లోకములయందలి మొదటి యక్షరములచే క్రమముగా గాయత్రి మంత్రమునందలి యక్షరములు సంగ్రహింపబడినవి.

గాయత్రీ రామాయణము సంపూర్ణము.



# సంక్షేపరామాయణము

శ్లో. తపస్స్వాధ్యాయనిరతం తపస్వీ వాగ్విదాం వరమ్,
నారదం పరిపప్రచ్ఛ వాల్మీకి ర్మునిపుఙ్గవమ్. 1

తా. తపస్సంపన్నుడగు వాల్మీకిమహాముని తపస్సునందును వేదమునందును ఆసక్తుడును బ్రహ్మవేత్తలలో ఉత్తముడును ముని శ్రేష్ఠుడును అగు నారదమహర్షిని యిట్లని యడిగెను.

శ్లో. కో న్వస్మిన్ సాంప్రతం లోకే గుణవా న్కశ్చ వీర్యవాన్,
ధర్మజ్ఞశ్చ కృతజ్ఞశ్చ సత్యవాక్యో దృఢవ్రతః. 2

తా. అయ్యా! ఇప్పుడు ఈ లోకమున ఉత్తమగుణములు గల వాడెవ్వడు? వీర్యవంతుడును ధర్మము తెలిసినవాడును ఉపకారము మరవనివాడును సత్యము పలుకువాడును వ్రతము తప్పనివాడును ఎవ్వడు?

శ్లో. చారిత్రేణ చ కో యుక్త స్సర్వభూతేషు కో హితః,
విద్వా న్కః క స్సమర్థశ్చ కశ్చైకప్రియదర్శనః. 3

తా. మంచి సదాచారముగలవాడెవ్వడు? సమస్తప్రాణుల విషయ మందును మేలుచేయువాడు ఎవ్వడు? పండితుడు ఎవ్వడు? ఎంతటి కార్యమునైనను నిర్వహింపజాలినవాడు ఎవ్వడు? ఎవ్వని చూచిన మాత్రాన చూపరులకు ఆనందము గలుగును?

శ్లో. ఆత్మవా న్కో జితక్రోధో ద్యుతిమా న్కో ఽనసూయకః,
కస్య బిభ్యతి దేవాశ్చ జాతరోషస్య సంయుగే. 4

తా. ధైర్యముగలవాడు ఎవ్వడు? కోపమును జయించిన వాడెవ్వడు? అసూయ లేనివాడెవ్వడు? యుద్ధమునందు ఎవ్వనికి కోపము వచ్చినయెడల దేవతలు కూడ భయపడుదురు?

శ్లో. ఏత దిచ్ఛా మ్యహం శ్రోతుం పరం కౌతూహలం హి మే,
మహర్షే త్వం సమర్థోఽసి జ్ఞాతు మేవవిధం నరమ్. 5

తా. ఈ రహస్యము వినగోరుచున్నాను. నాకు మిక్కిలి కుతూహలముగా నున్నది. మహర్షీ! నీవు అట్టి లక్షణములు గల పురుషోత్తముడగు మనుష్యుని ఎరుంగుటకు సమర్థుడవు.

శ్లో. శ్రుత్వా చైత త్త్రిలోకజ్ఞో వాల్మీకే ర్నారదో వచః,
శ్రూయతా మితి చామన్త్ర్య ప్రహృష్టో వాక్య మబ్రవీత్.

తా. అని ఈవాల్మీకిమాటవిని ముల్లోకములను ఎరింగినట్టి నారదుడు సంతోషించినవాడై వినుమనియెచ్చరించి ఈ వాక్యము చెప్పెను.

శ్లో. బహవో దుర్లభాశ్చైవ యే త్వయా కీర్తితా గుణాః,
మునే వక్ష్యా మ్యహం బుద్ధ్వా తై ర్యుక్త శ్శ్రూయతాం నరః.

తా. వాల్మీకీ! నీవు చెప్పిన గుణములు అనేకములు గాను దుర్లభములుగాను ఉన్నవి. అట్టి గుణములతో కూడిన పురుషుని నేను తెలియ చెప్పెదను. వినుము.

శ్లో. ఇక్ష్వాకువంశప్రభవో రామోనామ జనై శ్శ్రుతః,
నియతాత్మా మహావీర్యో ద్యుతిమా న్ధృతిమా న్వశీ. 8

తా. ఇక్ష్వాకువంశమున పుట్టిన రాముడుఅనువాడు నీవు చెప్పిన లక్షణములు గలవాడు. అతని జనులందరు వినియున్నారు. అతడు నిశ్చితమైన స్వభావముగలవాడు. గొప్పశక్తిగలవాడు. ప్రకాశము గలవాడు. గొప్ప ధైర్యము గలవాడు. సమస్తమును తనవశము చేసికొనువాడు.

శ్లో. బుద్ధిమా న్నీతిమా న్వాగ్మీ శ్రీమా౯ శత్రునిబర్హణః,
విపులాంసో మహాబాహుః కమ్బుగ్రీవో మహాహనుః. 9

తా. అతడు ప్రశస్తమయిన బుద్ధిగలవాడు. నీతిగలవాడు. ఉత్తమమయిన మాటలు గలవాడు. అఖండమైన ఐశ్వర్యముగలవాడు. శత్రువుల వధించువాడు. ఉన్నతములగు మూపులుగలవాడు. గొప్ప చేతులు గలవాడు. శంఖమువంటి కంఠముగలవాడు. ఉన్నతమయిన చెక్కిళ్ళు కలవాడు.

శ్లో. మహోరస్కో మహేష్వాసో గూఢజత్రు రరిన్దమః
ఆజానుబాహు స్సుశిరా స్సులలాట స్సువిక్రమః. 10

తా. అతడు విశాలమగు రొమ్ము గలవాడు. గొప్ప ధనుస్సు గలవాడు. కండచే బలిసి కనబడనట్టి మూపులసంధిఎముకలుగలవాడు. శత్రువుల నణగ ద్రొక్కువాడు. మోకాలివరకు పొడవులయిన చేతులు గలవాడు. మంచి లక్షణములతో కూడిన శిరస్సు గలవాడు. శుభలక్షణము గల నుదురుగలవాడు. శోభనమగు నడకగలవాడు.

శ్లో. సమ స్సమవిభక్తాఙ్గః స్నిగ్ధవర్ణః ప్రతాపవా౯,
పీనవక్షా విశాలాక్షో లక్ష్మీవా౯ శుభలక్షణః. 11

తా. అతడు మిక్కిలి పొడుగుగాని పొట్టిగాని కాక సమమయిన శరీరము గలవాడు. హెచ్చుతగ్గులు లేక సమముగా విభజింపబడిన అవయవములు గలవాడు. మెరుగుతో కూడిన వన్నెగలవాడు. గొప్ప పరాక్రమము గలవాడు.

బలిసిన రొమ్ము గలవాడు. విశాలములగు నేత్రములు గలవాడు. ప్రశస్తమయిన కాంతి గలవాడు. మంగళకరములగు లక్షణములు గలవాడు.

శ్లో. ధర్మజ్ఞ స్సత్యసన్ధశ్చ ప్రజానాం చ హితే రతః,
యశస్వీ జ్ఞానసంపన్న శ్శుచి ర్వశ్య స్సమాధిమాన్. 12

తా. ఆ రాముడు ధర్మము తెలిసినవాడు. మాట తప్పనివాడు. ప్రజలకు మేలు చేయుటయందు ఆసక్తుడు. ఉత్తమమయిన కీర్తి గలవాడు. జ్ఞానముతోగూడినవాడు. ఆశ్రితులకు లోబడువాడు. ఆశ్రితులను రక్షింపవలెనను చింతగలవాడు.

శ్లో. ప్రజాపతిసమ శ్శ్రీమాన్ ధాతా రిపునిషూదనః,
రక్షితా జీవలోకస్య ధర్మస్య పరిరక్షితా. 13

తా. ఆ రాముడు బ్రహ్మదేవునితో సమానుడు. సర్వము అతిశయించినవాడు. సమస్తప్రపంచమును పోషించువాడు. శత్రువులను సంహరించువాడు. సకలప్రాణులను రక్షించువాడు. విశేషించి ధర్మమును రక్షించువాడు.

శ్లో. రక్షితా స్వస్య ధర్మస్య స్వజనస్య చ రక్షితా,
వేదవేదాఙ్గతత్త్వజ్ఞో ధనుర్వేదే చ నిష్ఠితః. 14

తా. మరియు ఆ రాముడు స్వధర్మమును కాపాడువాడు. స్వజనమును కాపాడువాడు. వేదములయొక్కయు వేదాంగములయొక్కయు సిద్ధాంతములను తెలిసినవాడు. ధనుర్వేదమునందు పండితుడు.

శ్లో. సర్వశాస్త్రార్థతత్త్వజ్ఞః స్మృతిమాన్ ప్రతిభానవాన్,
సర్వలోకప్రియ స్సాధు రదీనాత్మా విచక్షణః. 15

తా. ఆ రాముడు ఎల్లశాస్త్రముల అర్థములను సిద్ధాంతములను

తెలిసినవాడు, మరపులేనివాడు. మిక్కిలి ప్రతిభ కలవాడు. సర్వజనులకును సంతోషము చేయువాడు. అపకారము చేసిన వారికి ఉపకారము చేయువాడు. ఎంతటి దుఃఖకాలమునందును కలతపడని మనస్సు కలవాడు. వినువారికి హృదయానందముగా పలుకువాడును.

శ్లో. సర్వదా ఽభిగత స్సద్భి స్సముద్ర ఇవ సిన్ధుభిః,
ఆర్య స్సర్వసమశ్చైవ సదైవ ప్రియదర్శనః. **16**

తా. నదులు సముద్రుని చేరునట్లు సత్పురుషులు ఎల్లప్పుడును ఆ రాముని చేరుదురు. ఆ రాముడు పూజ్యుడు. సమస్త భూతములయందును సమముగా వర్తించువాడు. సర్వకాలముల యందును తన్ను చూచిన మాత్రాన సంతోషము కలిగించువాడు.

శ్లో. స చ సర్వగుణోపేతః కౌసల్యానన్దవర్ధనః,
సముద్ర ఇవ గామ్భీర్యే ధైర్యేణ హిమవా నివ. **17**

తా. ఆ రాముడే యిట్లు సమస్తసద్గుణములతోను కూడినవాడు. కౌసల్యకు కొడుకగుటచే ఆనందము వృద్ధి పొందించువాడు. ఆరాముడు గాంభీర్యమునందు సముద్రమువంటివాడు, ధైర్యమున హిమవత్పర్వతము వంటివాడు.

శ్లో. విష్ణునా సదృశో వీర్యే సోమవ త్ప్రియదర్శనః,
కాలాగ్నిసదృశః క్రోధే క్షమయా పృథివీసమః. **18**

తా. ఆ రాముడు పరాక్రమమునందు విష్ణువునకు సరిపోలును. చంద్రునివలె ఆనందకరమగు దర్శనము గలవాడు కోపమున ప్రళయకాలము నందలి యగ్నికి సమానుడు, ఓర్పునందు భూమివంటివాడు.

శ్లో. ధనదేన సమ స్త్యాగే సత్యే ధర్మ ఇవాఽపరః,

తా. అతడు దానమందు కుబేరునితో తుల్యుడు. సత్యమునందు రెండవ ధర్మదేవతయని పిలువదగినవాడు.

ఇంతవరకు 'ఇక్ష్వాకువంశ ప్రభవః' అనుటచే శ్రీరామావతారమును, 'మహావీర్యః శత్రునిబర్హణః' అను శబ్దములచేత తాటక మారీచవధ, పరశురామ పరాజయములను, 'లక్ష్మీవాన్ శ్రీమాన్' అను మాటలచే సీతావివాహమును, 'ధనుర్వేదే చ నిష్ఠితః' అను వాక్యముచే విశ్వామిత్రుని వలన రామునకు సమస్తాస్త్రప్రాప్తియు ఇట్లు బాలకాండకథ చెప్పబడినది. ఇక అయోధ్యాకాండ కథ :

త మేవంగుణసంపన్నం రామం సత్యపరాక్రమమ్. 19

శ్లో. జ్యేష్ఠం శ్రేష్ఠగుణై ర్యుక్తం ప్రియం దశరథస్సుతమ్,
ప్రకృతీనాం హితై ర్యుక్తం ప్రకృతిప్రియకామ్యయా. 20

శ్లో. యౌవరాజ్యేన సంయోక్తు మైచ్ఛ త్ప్రీత్యా మహీపతిః.

తా. ఇట్టి గుణములతో కూడినవాడును ఎప్పుడును వ్యర్థముకాని పరాక్రమముగలవాడును జ్యేష్ఠపుత్రుడును ఉత్తమగుణములచే ఒప్పుచున్న వాడును ప్రియకుమారుడును ప్రజలకు మేలుకలిగించు కార్యములందు శ్రద్ధ కలవాడును అగు ఆ రాముని దశరథమహారాజు ప్రజలకు ప్రియము చేయ దలచి సంతోషముతో యువరాజుగా జేయగోరెను.

త స్యాభిషేకసమ్భారాన్ దృష్ట్వా భార్యాఽథ కైకయీ.

శ్లో. పూర్వం దత్తవరా దేవీ వర మేవ మయాచత,
వివాసనంచ రామస్య భరత స్యాభిషేచనమ్. 22

తా. అంత రాముని పట్టాభిషేకమునకై తెచ్చిన సంభారములను చూచి మునుపు దశరథునిచే ఈయబడిన వరము గలదియు దశరథుని భార్యయు అగు కైకేయి రాముని అడవికి పంపుట, భరతుని అభిషేకించుట అను వరములను దశరథుని అడిగెను.

శ్లో. స సత్యవచనా ద్రాజా ధర్మపాశేన సంయతః,
వివాసయామాస సుతం రామం దశరథః ప్రియమ్. **23**

తా. ఆ దశరథమహారాజు సత్యవాక్యము వలన ధర్మమను త్రాటిచేత బద్ధుడై, తన ప్రియకుమారుడగు రాముని అడవికి పంపెను.

శ్లో. స జగామ వనం వీరః ప్రతిజ్ఞా మనుపాలయన్,
పితు ర్వచననిర్దేశాత్ కైకేయ్యాః ప్రియకారణాత్. **24**

తా. వీరుడగు ఆరాముడు కైకేయి సంతోషముకొరకు తండ్రియాజ్ఞపై తాను కావించిన ప్రతినను పాలించుటకై వనమునకు పోయెను.

శ్లో. తం వ్రజన్తం ప్రియో భ్రాతా లక్ష్మణోఽనుజగామ హ,
స్నేహా ద్వినయసమ్పన్న స్సుమిత్రానన్దవర్ధనః. **25**
భ్రాతరం దయితో భ్రాతుః సౌభ్రాత్ర మనుదర్శయన్.

తా. ఆ రాముడు అరణ్యమునకు పోవుచుండగా అతనికి ప్రియుడగు తమ్ముడును సుమిత్ర పుత్త్రుడు అగు లక్ష్మణుడు రాముని యందు సహజ ప్రీతిగలవాడు కాబట్టి అతనికి సేవ చేయగోరి ఉత్తమమగు తోడబుట్టుతనము ఇదియని ప్రజలకు స్పష్టముగా తెలియునట్లు భక్తితో వెంట బోయెను.

రామస్య దయితా భార్యా నిత్యంప్రాణసమా హితా. **26**
శ్లో. జనకస్య కులే జాతా దేవమా యేవ నిర్మితా,
సర్వలక్షణసంపన్నా నారీణా ముత్తమా వధూః. **27**
శ్లో. సీతా ప్యనుగతా రామం శశినం రోహిణీ యథా,

తా. రామునకు ప్రియభార్యయు ప్రాణసమానురాలును, హితము కోరునదియు, జనకకులమందు పుట్టి తిలోత్తమవలెనో లేక రాక్షసుల మోహపరచుటకై అవతరించిన మోహినీదేవివలెనో సర్వోత్తర సౌందర్యవతియై సర్వలక్షణములుకల ఉత్తమవనితగా వెలుగుచున్నదై ఆ సీతాదేవియును చంద్రుని రోహిణి వెంబడించినట్లుగా రాముని వెంట అడవికి పోయెను.

పౌరై రనుగతో దూరం పిత్రా దశరథేన చ. 28

తా. పట్టణములోని ప్రజలును తండ్రియగు దశరథుడును చాలదూరము వరకు రాముని వెంటపోయిరి.

శ్లో. శృఙ్గిబేరపురే సూతం గఙ్గాకూలే వ్యసర్జయత్,

గుహ మాసాద్య ధర్మాత్మా నిషాదాధిపతిం ప్రియమ్. 29

శ్లో. గుహేన సహితో రామో లక్ష్మణేన చ సీతయా,

తా. అంత ధర్మాత్ముడగు రాముడు గంగాతీరమందున్న శృంగిబేర మనెడిపట్టణములో బోయలకు ప్రభువయిన ప్రియుడగు గుహుని చేరి అచ్చట సీతాలక్ష్మణగుహులతో కూడినవాడై తన సారథియగు సుమంత్రుని తిరిగి అయోధ్యకు పంపెను.

తే వనేన వనం గత్వా నదీ స్తీర్త్వా బహూదకాః. 30

శ్లో. చిత్రకూట మనుప్రాప్య భరద్వాజస్య శాసనాత్,

తా. ఆ సీతారామలక్ష్మణులు ఒక అడవినుండి మరియొక అడవి చేరుచు, నీళ్లునిండిన నదులను దాటుచు భరద్వాజమహర్షి ఆజ్ఞచే చిత్రకూట పర్వతమువైపునకు వెళ్ళిరి.

రమ్య మావసథం కృత్వా రమమాణా వనే త్రయః. 31

శ్లో. దేవగన్ధర్వసఙ్కాశా స్తత్ర తే న్యవసన్ సుఖమ్,

తా. అచట రమణీయమగు పర్ణశాలను నిర్మించుకొని అయోధ్యలో సమస్తసుఖములు అనుభవించుచుండిన వారైనను వారు ముగ్గురు ఆ చిత్రకూట మందు ఎంతమాత్రము దుఃఖము లేక దేవగంధర్వులవలె సుఖముగా విహరించుచుండిరి.

చిత్రకూటం గతే రామే పుత్రశోకాతుర స్తదా. 32

శ్లో. రాజా దశరథ స్స్వర్గం జగామ విలప౯ సుతమ్,

తా. రాముడు చిత్రకూటము చేరినపిమ్మట దశరథుడు పుత్ర శోకముచే పీడింపబడినవాడై కొడుకునే తలచుకొని విలపించుచు మృతిపొందెను.

మృతే తు తస్మి౯ భరతో వసిష్ఠప్రముఖై ర్ద్విజైః. 33

శ్లో. నియుజ్యమానో రాజ్యాయ నైచ్ఛ ద్రాజ్యం మహాబలః,

తా. దశరథుడు మృతిపొందినపిమ్మట వసిష్ఠుడు మొదలగు బ్రాహ్మణులు రాజ్యభారము వహింపుమని నియోగించినను మహాబలశాలి యైన భరతుడు రాజ్యము స్వీకరింపలేదు.

స జగామ వనం వీరో రామపాదప్రసాదకః. 34

తా. వీరుడగు ఆ భరతుడు రాముని ప్రసన్నునిగ చేయుటకై అడవికి పోయెను.

శ్లో. గత్వా తు సుమహాత్మానం రామం సత్యపరాక్రమమ్,
అయాచ ద్భ్రాతరం రామ మార్యభావపురస్కృతః. 35

తా. ఆ భరతుడు మహానుభావుడును సత్యమైన పరాక్రమము కలవాడును అన్నయు అగు రామునివద్దకు పోయి వినయముతో కూడిన వాడై ప్రార్థించెను.

శ్లో. త్వ మేవ రాజా ధర్మజ్ఞ ఇతి రామం వచోఽబ్రవీత్,
రామోఽపి పరమోదార స్సుముఖ స్సుమహాయశాః. 36

శ్లో. న చైచ్ఛ త్పితు రాదేశా ద్రాజ్యం రామో మహాబలః,

తా. ధర్మము తెలిసినట్టినీవే రాజవు అని భరతుడు రామునితో చెప్పెను. రాముడు అందరిని సంతోషింప జేయువాడైనను, యాచకులు కోరినదంతయు ఇచ్చువాడైనను, యాచకులు దొరకినయెడల ప్రసన్నమగు ముఖము కలవాడైనను, దానముచే మిక్కిలి గొప్ప కీర్తికలవాడైనను, ఎంత

పనినైనను సాధింపగల గొప్ప బలముకలవాడైనను, పదునాలుగు సంవత్సరములు వనవాసము చేయవలెనని తండ్రి యాజ్ఞఅగుట వలన భరతుడు యాచించిన చొప్పున రాజ్యము సమ్మతింపలేదు.

పాదుకే చాస్య రాజ్యాయ న్యాసం దత్వా పునఃపునః. 37
శ్లో. నివర్తయామాస తతో భరతం భరతాగ్రజః.

తా. భరతునిఅన్న అగు రాముడు రాజ్యము చేయుటకు భరతుడు తన పాదుకలను ఇమ్మనగా ఇచ్చి భరతుని అచటినుండి త్రిప్పిపంపెను.

స కామ మనవాప్యైవ రామపాదా వుపస్పృశన్. 38
శ్లో. నన్దిగ్రామేஉకరో ద్రాజ్యం రామాగమనకాఙ్క్షయా.

తా. ఆ భరతుడు తన మనోరథము నెరవేరకయే నంది గ్రామమునందు రాముని పాదుకలను సేవించుచు పదునాలుగు సంవత్సరములు గడచినంతనే రాముడు వచ్చునను ఆశతో రాజ్యమును పాలించెను.

గతే తు భరతే శ్రీమాన్ సత్యసన్ధో జితేన్ద్రియః. 39
శ్లో. రామస్తు పున రాలక్ష్య నాగరస్య జనస్య చ,
తత్రాగమన మేకాగ్రో దణ్డకాన్ ప్రవివేశ హ. 40

తా. భరతుడు మరలిపోగానే ప్రశస్తమగు కాంతికలవాడును, సత్యమైన ప్రతిజ్ఞకలవాడును, ఇంద్రియములను జయించినవాడు అగు రాముడు చిత్రకూటమున తానుండుట తెలిసినది కావున అయోధ్యాజనులును భరతుడును మరల అచటికి వత్తురని సందేహించి ప్రతిజ్ఞను నెరవేర్చుటయందు చలనములేనివాడై దండకారణ్యము ప్రవేశించెను.

ఇంక అరణ్యకాండకథ :

శ్లో. ప్రవిశ్యతు మహారణ్యం రామో రాజీవలోచనః,
విరాధం రాక్షసం హత్వా శరభఙ్గం దదర్శ హ. 41

శ్లో. సుతీక్ష్ణం చా ప్యగస్త్యం చ అగస్త్యభ్రాతరం తథా,

తా. కమలములవంటి కన్నులుకల రాముడు దండకారణ్యమును ప్రవేశించినంతనే విరాధుడను రాక్షసుని చంపి శరభంగమహామునిని చూచెను. అంత సుతీక్ష్ణుని అగస్త్యుని అగస్త్యుని తమ్ముని చూచెను.

అగస్త్య వచనాచ్చైవ జగ్రాహైన్ద్రం శరాసనమ్. 42

శ్లో. ఖడ్గం చ పరమప్రీత స్తూణీ చాక్షయసాయకౌ.

తా. అగస్త్యుని మాటవలన ఇంద్రుని ధనస్సును ఖడ్గమును బాణములు తరుగని అమ్ముల పొదులను రాముడు మిక్కిలి సంతోషించినవాడై స్వీకరించెను.

వసత స్తస్య రామస్య వనే వనచరై స్సహ. 43

శ్లో. ఋషయోఽభ్యాగమ న్సర్వే వధాయాఽసుర రక్షసామ్.

తా. రాముడు వనవాసులతో కూడ ఆ వనమున ఉన్నప్పుడు అచ్చటి ఋషులందరు అసురులయొక్కయు రాక్షసులయొక్కయు సంహారముకొరకు రాముని వద్దకు వచ్చిరి.

స తేషాం ప్రతిశుశ్రావ రాక్షసానాం తథా వనే. 44

తా. రాముడు రాక్షసుల ఉనికిపట్టయిన ఆ దండకారణ్యమునందు ఆ ఋషులు ప్రార్థించినట్లు అంగీకరించెను.

శ్లో. ప్రతిజ్ఞాతశ్చ రామేణ వధ స్సంయతి రక్షసామ్,
ఋషీణా మగ్నికల్పానాం దణ్డకారణ్యవాసినామ్. 45

తా. అగ్నిహోత్రముతో సమానులు అగు దండకారణ్యవాసులయిన ఋషులకొరకు రాముడు యుద్ధమున రాక్షసుల వధించెదనని ప్రతిజ్ఞ కావించెను.

శ్లో. తేన తత్రైవ వసతా జనస్థాన నివాసినీ,
విరూపితా శూర్పణఖా రాక్షసీ కామరూపిణీ. 46

తా. ఆ అడవిలోనే నివాసముచేయుచు రాముడు జనస్థానమున ఉండునట్టి కామరూపిణిఅగు శూర్పణఖ అను రాక్షసస్త్రీని ముక్కుచెవులు కోయించి వికృతరూపముకలదానినిగా కావించెను.

శ్లో. తత శ్శూర్పణఖావాక్యా దుద్యుక్తాన్ సర్వరాక్షసాన్,
ఖరం త్రిశిరసం చైవ దూషణం చైవ రాక్షసమ్. 47

శ్లో. నిజఘాన రణే రామ స్తేషాం చైవ పదానుగాన్.

తా. అంత శూర్పణఖ ప్రేరణమున యుద్ధమునకు వచ్చిన రాక్షసులు అందరును ఖరుని త్రిశరుని దూషణుడను రాక్షసుని అనుచరులను రాముడు యుద్ధమున వధించెను.

వనే తస్మి న్నివసతా జనస్థాన నివాసినామ్. 48

శ్లో. రక్షసాం నిహతా న్యాసన్ సహస్రాణి చతుర్దశ,

తా. అట్లు రాముడు ఆ అడవిలో ఉండునప్పుడు జనస్థానమున ఉండు రాక్షసులను పదునాలుగు వేలమందిని వధించెను.

తతో జ్ఞాతివధం శ్రుత్వా రావణః క్రోధమూర్ఛితః. 49

శ్లో. సహాయం వరయామాస మారీచంనామ రాక్షసమ్

తా. అంత బంధువుల వధమును విని రావణుడు కోపమును పొందినవాడై మారీచుడను రాక్షసుని తనకు సహాయునిగా కోరెను.

వార్యమాణ స్సుబహుశో మారీచేన స రావణః. 50

శ్లో. న విరోధో బలవతా క్షమో రావణ తేన తే.

తా. మారీచుడు బలవంతుడగు రామునితో విరోధము నీకు తగదని రావణుని పలుమార్లు వారించెను.

అనాదృత్య తు తద్వాక్యం రావణః కాలచోదితః. 51
శ్లో. జగామ సహమారీచ స్తస్యాశ్రమపదం తదా.

తా. రావణుడు మృత్యువుచే ప్రేరితుడై మారీచునిమాటలు లక్ష్యపెట్టక మారీచునితోకూడ అప్పుడు రాముని ఆశ్రమమునకు పోయెను.

తేన మాయావినా దూర మపవాహ్య నృపాత్మజౌ. 52
శ్లో. జహార భార్యాం రామస్య గృధ్రం హత్వా జటాయుషమ్,

తా. రావణుడు మాయావి అగు మారీచునిచే రామలక్ష్మణులను దూరముగా పోవునట్లు చేయించి జటాయువును కొట్టి రామునిభార్యను అపహరించెను.

గృధ్రం చ నిహతం దృష్ట్వా హృతాం శ్రుత్వా చ మైథిలీమ్.
శ్లో. రాఘవ శ్శోకసన్తప్తో విలలా పాకులేన్ద్రియః

తా. అంత రాముడు జటాయువు హతుడై ఉండుటను చూచి సీతను రావణుడు అపహరించెనని విని మిక్కిలి దుఃఖితుడై పరవశములైన యింద్రియములతో విలపించెను.

తత స్తేనైవ శోకేన గృధ్రం దగ్ధ్వా జటాయుషమ్. 54
శ్లో. మార్గమాణో వనే సీతాం రాక్షసం సందదర్శ హ
కబన్ధం నామ రూపేణ వికృతం ఘోరదర్శనమ్. 55

తా. అంత రాముడు ఆ దుఃఖముతోనే గ్రద్దయిన జటాయువునకు దహనసంస్కారములు చేసి అడవిలో సీతను వెదకుచు రూపమున వికృతుడును చూపరులకు భయమును కలిగించువాడునుఅగు కబంధుడను రాక్షసుని చూచెను.

శ్లో. తం నిహత్య మహాబాహు ర్దదాహ స్వర్గతశ్చ సః,

తా. గొప్పచేతులుగల రాముడు ఆ కబంధుని చంపి దహనము కావించెను. కబంధుడును స్వర్గమును పొందెను.

స చాస్య కథయామాస శబరీం ధర్మచారిణీమ్. 56

శ్లో. శ్రమణీం ధర్మనిపుణా మభిగచ్ఛేతి రాఘవ,

తా. ఆ కబంధుడు రామా! నీవు ధర్మము ఆచరించునదియు సన్న్యాసాశ్రమము పొందియున్నదియు ధర్మమునందు పండితురాలును అగు శబరియొద్దకు పొమ్ము అని రామునితో చెప్పెను.

సోఽభ్యగచ్ఛ న్మహాతేజా శ్శబరీం శత్రుసూదనః. 57

శ్లో. శబర్యా పూజిత స్సమ్య గ్రామో దశరథాత్మజః.

తా. గొప్ప పరాక్రముగలవాడును శత్రువులను చంపువాడును అగు రాముడు శబరియొద్దకు పోయెను. దశరథుని పుత్త్రుడగు రాముడు ఆ శబరిచే చక్కగా పూజింపబడెను.

ఇంక కిష్కింధాకాండకథ :

పమ్పాతీరే హనుమతా సఙ్గతో వానరేణ హ. 58

శ్లో. హనుమద్వచనాచ్చైవ సుగ్రీవేణ సమాగతః.

తా. పంపాతీరమునందు, రాముడు హనుమంతుడు అను వానరునితో సమాగమము పొందెను. హనుమంతుని వాక్యములవలన సుగ్రీవునితో కలిసెను.

సుగ్రీవాయ చ త త్సర్వం శంస ద్రామో మహాబలః.59

శ్లో. ఆదిత స్త ద్యథావృత్తం సీతాయాశ్చ విశేషతః.

 

తా. మహాబలుడగు రాముడు మొదటినుండి తన వృత్తాంతమంతయు సుగ్రీవునకు హనుమంతునకు చెప్పి మరి విశేషముగా సీతావృత్తాంతమును జరిగినది జరిగినట్లు వారికి తెలియజేసెను.

సుగ్రీవశ్చాపి త త్సర్వం శ్రుత్వా రామస్య వానరః. 60
శ్లో. చకార సఖ్యం రామేణ ప్రీతశ్చై వాగ్నిసాక్షికమ్.

తా. సుగ్రీవుడు రాముని వృత్తాంతమంతయు విని అగ్నిని సాక్షిగా చేసుకొని రామునితో సంతోషముగా సఖ్యము చేసెను.

తతో వానరరాజేన వైరానుకథనం ప్రతి. 61
శ్లో. రామా యావేదితం సర్వం ప్రణయా ద్దుఃఖితేన చ.

తా. అంత మిత్రుడు రాముడు దగ్గరనుండుటచే సుగ్రీవునకు దుఃఖము పైకుబ్బి దుఃఖింపగా రాముడు ఏల దుఃఖపడెదవని అడుగగా సుగ్రీవుడు తనకును వాలికిని కలిగిన విరోధము మొదలగు తన వృత్తాంతమును రామునితో చెప్పికొనెను.

ప్రతిజ్ఞాతం చ రామేణ తదా వాలివధం ప్రతి. 62
శ్లో. వాలినశ్చ బలం తత్ర కథయామాస వానరః.

తా. అప్పుడు రాముడు వాలినివధించెదని ప్రతిజ్ఞచేసెను. అంత సుగ్రీవుడు రామునకు వాలి పరాక్రమమును గూర్చి చెప్పెను.

సుగ్రీవ శ్శఙ్కిత శ్చాసీ న్నిత్యం వీర్యేణ రాఘవే. 63
శ్లో. రాఘవప్రత్యయార్థం తు దున్దుభేః కాయ ముత్తమమ్,
దర్శయామాస సుగ్రీవో మహాపర్వతసన్నిభమ్. 64

తా. సుగ్రీవుడు రాముని చూచినది మొదలుకొని అతని పరాక్రమము విని ఇతడు వాలినిచంప సమర్థుడో కాడో అని సందేహము పొందెను. రాముని

పరాక్రమమునందు నమ్మకము కలుగుటకై పూర్వము వాలిచే దూరముగా విసరివేయబడ్డ గొప్ప కొండవంటి ఎత్తయిన దుందుభి కళేబరమును రామునకు చూపెను.

శ్లో. ఉత్స్మయిత్వా మహాబాహుః ప్రేక్ష్య చాస్థి మహాబలః,
పాదాఙ్గుష్ఠేన చిక్షేప సంపూర్ణం దశయోజనమ్. 65

తా. గొప్పవయిన చేతులుగలవాడు అగు రాముడు చిరునవ్వునవ్వి అస్థిమయమయిన దుందుభి కళేబరమును చూచి కాలి బొటనవ్రేలిచే పూర్తిగా పదియోజనముల దూరములో పడునట్లు ఎగురవేసెను.

శ్లో. బిభేద చ పునస్సాలాన్ స ప్తైకేన మహేషుణా,
గిరిం రసాతలం చైవ జనయన్ ప్రత్యయం తదా. 66

తా. ఇంక సుగ్రీవునకు నమ్మకము కలిగించుటకై ఒక ఉత్తమ బాణముచే ఏడు మద్దిచెట్లను అచ్చటి కొండను భూగర్భమును భేదించెను.

శ్లో. తతః ప్రీతమనా స్తేన విశ్వస్త స్స మహాకపిః,
కిష్కిన్ధాం రామసహితో జగామ చ గుహాం తదా. 67

తా. అంత అప్పుడు ఆ సుగ్రీవుడు నమ్మకము కలిగినవాడై మనస్సున సంతోషించి రామునితోగూడ బిలమువంటి కిష్కింధకు పోయెను.

శ్లో. తతోఽగర్జ ద్ధరివర స్సుగ్రీవో హేమపిఙ్గళః,
తేన నాదేన మహతా నిర్జగామ హరీశ్వరః. 68

తా. కిష్కింధలో ప్రవేశించిన వానరోత్తముడును బంగారువంటి పింగళవర్ణుడును అగు సుగ్రీవుడు సింహనాదము చేసెను. ఆ గొప్ప ధ్వని విని వానరేశ్వరుడగు వాలి వెడలివచ్చెను.

శ్లో. అనుమాన్య తదా తారాం సుగ్రీవేణ సమాగతః
నిజఘాన చ త త్రైనం శరే ణైకేన రాఘవః. 69

తా. అప్పుడు వాలి, ఇప్పుడు సుగ్రీవునితో యుద్ధము చేయవలదని అడ్డగించిన తారను ఒప్పించి సుగ్రీవునితో యుద్ధము చేయసాగెను. అంత రాముడు ఒక బాణముతో వాలిని వధించెను.

శ్లో. తత స్సుగ్రీవ వచనా ద్ధత్వా వాలిన మాహవే,
సుగ్రీవ మేవ తద్రాజ్యే రాఘవః ప్రత్యపాదయత్. 70

తా. అట్లు సుగ్రీవునకిచ్చిన మాట ప్రకారము రాముడు యుద్ధమున వాలిని వధించి ఆ వాలి రాజ్యమునందు సుగ్రీవుని ఉంచెను.

శ్లో. స చ సర్వా న్సమానీయ వానరా న్వానరర్షభః,
దిశః ప్రస్థాపయామాస దిదృక్షు ర్జనకాత్మజామ్. 71

తా. వానరోత్తముడగు ఆ సుగ్రీవుడు సీతను వెదకుటకై వానరుల నందరను రప్పించి అన్ని దిక్కులకు పంపెను.

ఇంక సుందరకాండకథ :

శ్లో. తతో గృధ్రస్య వచనా త్సమ్పాతే ర్హనుమా న్బలీ,
శతయోజన విస్తీర్ణం పుప్లువే లవణార్ణవమ్. 72

తా. అంత సంపాతియనుగ్రద్ద చెప్పిన చొప్పున బలవంతుడగు హనుమంతుడు నూఱుయోజనముల వైశాల్యముగల సముద్రమును దాటెను.

శ్లో. తత్ర లఙ్కాం సమాసాద్య పురీం రావణపాలితామ్,
దదర్శ సీతాం ధ్యాయన్తీ మశోకవనికాం గతామ్. 73

తా. రావణునిచే పాలింపబడు ల లంకానగరము చేరి అచ్చట అశోకవనమను అంతఃపురోద్యానవనమునందు రాముని ధ్యానించుచున్న సీతను చూచెను.

శ్లో. నివేదయిత్వాఽభిజ్ఞానం ప్రవృత్తిం చ నివేద్య చ
సమాశ్వాస్య చ వైదేహీం మర్దయామాస తోరణమ్. 74

తా. అంత సీతాదేవికి రాముని ఉంగరమును గుర్తుగ సమర్పించి రాముని వృత్తాంతమును చెప్పి ఊరడించి వెలుపలిద్వారమును విరుగగొట్టెను.

శ్లో. పఞ్చసేనాగ్రగాన్ హత్వా, సప్త మన్త్రిసుతా నపి,
శూర మక్షం చ నిష్పిష్య గ్రహణం సముపాగమత్. 75

తా. అంత హనుమంతుడు సేనాధిపతులను ఐదుగురిని మంత్రి కుమారులను ఏడుగురిని చంపి శూరుడగు అక్షుని వధించి పిసికి ముద్ద కావించి ఇంద్రజిత్తునకు చిక్కెను.

శ్లో. అస్త్రేణోన్ముక్త మాత్మానం జ్ఞాత్వా పైతామహా ద్వరాత్,
మర్షయన్ రాక్షసాన్ వీరో యన్త్రిణ స్తాన్ యదృచ్ఛయా.

తా. వీరుడగు హనుమంతుడు బ్రహ్మదేవునివరమువలన తన్ను బ్రహ్మాస్త్రముకట్టు వదిలినదని ఎరిగియు స్వేచ్ఛగా తన్ను పగ్గములచే బంధించి లాగుచున్న రాక్షసులను క్షమించుచు.

శ్లో. తతో దగ్ధ్వా పురీం లఙ్కా మృతే సీతాం చ మైథిలీమ్,
రామాయ ప్రియ మాఖ్యాతుం పున రాయా న్మహాకపిః.

తా. అటుపిమ్మట మిథిలారాజపుత్రి అగుసీతను, విభీషణు గృహమును తప్ప తక్కిన లంకాపట్టణమంతయు దహించి రామునికి సంతోషవార్తను చెప్పుటకై మరల వచ్చెను.

శ్లో. సోఽభిగమ్య మహాత్మానం కృత్వా రామం ప్రదక్షిణమ్,
న్యవేదయ దమేయాత్మా దృష్టా సీతేతి తత్త్వతః. 78

తా. తక్కువకాని పరాక్రమముగల ఆ హనుమంతుడు మహానుభావుడగు రాముని చేరి ప్రదక్షిణము కావించి 'చూచితిని సీతను' అని నిశ్చయముగా చెప్పెను.

ఇంక యుద్ధకాండకథ :

శ్లో. తత స్సుగ్రీవసహితో గత్వా తీరం మహోదధేః,
సముద్రం క్షోభయామాస శరై రాదిత్యసన్నిభైః. 79

తా. అంత రాముడు సుగ్రీవునితో కూడ సముద్రతీరమును చేరి సూర్యుని వంటి బాణములచే సముద్రుని నొప్పించెను.

శ్లో. దర్శయామాస చాత్మానం సముద్ర స్సరితాం పతిః,
సముద్ర వచనాచ్చైవ నళం సేతు మకారయత్. 80

తా. అంత నదీనాథుడగు సముద్రుడు నిజరూపమున రామునకు సాక్షాత్కరించెను. సముద్రుడు చెప్పిన ప్రకారము రాముడు నళునిచే వారధి కట్టించెను.

శ్లో. తేన గత్వా పురీం లఙ్కాం హత్వా రావణ మాహవే,
రామ స్సీతా మనుప్రాప్య పరాం వ్రీడా ముపాగమత్. 81

తా. రాముడు ఆ వారధిమీదుగా లంకాపురము చేరి యుద్ధమున రావణుని వధించి సీతాదేవినిపొంది అటుపిమ్మట రావణునింట ఇంత కాలమున్న దాని నెట్లు పరిగ్రహింపవచ్చునని మిక్కిలిగా సంకోచము పొందెను.

శ్లో. తా మువాచ తతో రామః పరుషం జనసంసది,
అమృష్యమాణా సా సీతా వివేశ జ్వలనం సతీ. 82

తా. అంత రాముడు ఆసీతను చూచి వానరులు రాక్షసులు వినుచుండ పరుషవాక్యములు పలికెను. పతివ్రతయగు సీతాదేవి తనయందు రాముడు దోషము తలచుటకు సహింపక అగ్నిహోత్రమునందు ప్రవేశించెను.

శ్లో. తతోఽగ్ని వచనా త్సీతాం జ్ఞాత్వా విగతకల్మషామ్,
బభౌ రామ స్సంప్రహృష్టః పూజిత స్సర్వదైవతైః. 83

తా. ఆపైన అగ్నిదేవుని వాక్యమువలన సీతాదేవి పవిత్రత తెలిసికొని రాముడు మిక్కిలి సంతోషించి సమస్తదేవతలచేతను పూజింపబడినవాడై ప్రకాశించెను.

శ్లో. కర్మణా తేన మహతా త్రైలోక్యం స చరాచరమ్,
సదేవర్షిగణం తుష్టం రాఘవస్య మహాత్మనః. 84

తా. మహానుభావుడు రాముడు చేసిన ఆ కార్యముచే జంగమ స్థావరములతోను దేవతలతోను ఋషులతోను కూడ మూడులోకములును సంతోషించెను.

శ్లో. అభిషిచ్య చ లఙ్కాయాం రాక్షసేన్ద్రం విభీషణమ్,
కృతకృత్య స్తదా రామో విజ్వరః ప్రముమోద హ. 85

తా. అప్పుడు రాముడు లంకాపురమునకు విభీషణుని రాక్షస రాజుగా అభిషిక్తునిచేసి కృతకృత్యుడై కొంచెమయినను సంతాపములేక మిక్కిలి సంతోషించెను.

శ్లో. దేవతాభ్యో వరం ప్రాప్య సముత్థాప్య చ వానరాన్,
అయోధ్యాం ప్రస్థితో రామః పుష్పకేణ సుహృద్వృతః.

తా. రాముడు దేవతలవలన వరము పొంది యుద్ధమున చచ్చిన వానరులను బ్రతికించుకొని సుగ్రీవుడు విభీషణుడు మొదలగు మిత్రులతో కూడ పుష్పకవిమానము ఎక్కి అయోధ్యకు పోయెను.

శ్లో. భరద్వాజాశ్రమం గత్వా రామ స్సత్యపరాక్రమః,
భరత స్యాన్తికం రామో హనూమన్తం వ్యసర్జయత్. 87

తా. సత్య పరాక్రమముగల రాముడు భరద్వాజాశ్రమము చేరి భరతుని వద్దకు తనరాక తెలుపుటకై హనుమంతుని పంపెను.

శ్లో. పున రాఖ్యాయికాం జల్పన్ సుగ్రీవసహితశ్చ సః,
పుష్పకం తత్సమారుహ్య నన్దిగ్రామం యయౌ తదా.

తా. అంతట రాముడు సుగ్రీవునితో చేరి ఆ పుష్పక విమానమును ఎక్కి వెనుకటి వృత్తాంతములు చెప్పుకొనుచు నందిగ్రామమునకు పోయెను.

శ్లో. నన్దిగ్రామే జటాం హిత్వా భ్రాతృభి స్సహితోఽనఘః,
రామ స్సీతా మనుప్రాప్య రాజ్యం పున రవాప్తవాన్. 89

తా. పాపరహితుడగు రాముడు తమ్ములతో కూడినవాడై నందిగ్రామము నందు జడలను విడిచి మునివేషమును విడుచుటచే సీతాదేవి కనురూపముగా రూపలక్షణసంపన్నుడై మరల రాజ్యము పొందెను.

శ్లో. ప్రహృష్టో ముదితో లోక స్తుష్టః పుష్ట స్సుధార్మికః,
నిరామయో హ్యరోగశ్చ దుర్భిక్షభయవర్జితః. 90

తా. రాముడు పట్టాభిషిక్తుడు అగుచుండగా లోకమంతయు ఆనందముచే పులకితమై మిక్కిలి సంతోషించినదై పుష్టిపొందెను. పీడలును వ్యాధులును కరువును లేక ఉండెను.

ఇంక ఉత్తరకాండకథ :

శ్లో. న పుత్త్రమరణం కించి ద్ద్రక్ష్యన్తి పురుషాః క్వచిత్,
నార్య శ్చావిధవా నిత్యం భవిష్యన్తి పతివ్రతాః. 91

తా. రాముడు రాజ్యముచేయునపుడు ఎవ్వరును ఎచ్చటను కొంచెమయినను పుత్రదుఃఖము పొందరు. స్త్రీలు పతివ్రతలు ఎల్లప్పుడు అయిదువతనము కలిగియుందురు.

శ్లో. న చాగ్నిజం భయం కించి న్నాప్సు మజ్జన్తి జన్తవః,
న వాతజం భయం కించి న్నాపి జ్వరకృతం తథా. 92

శ్లో. న చాపి క్షుద్భయం తత్ర న తస్కరభయం తథా.

తా. కొంచెమయినను అగ్నిభయము కలుగదు. ఎవ్వరును నీళ్ళలోబడి మునుగరు. వాయువువలనను జ్వరమువలనను భయము కలుగదు. అట్లే ఆకలిబాధయు దొంగలభయమును ఉండవు.

నగరాణి చ రాష్ట్రాణి ధనధాన్యయుతాని చ. 93

శ్లో. నిత్యం ప్రముదితా స్సర్వే యథా కృతయుగే తథా.

తా. పట్టణములును దేశములును ధనధాన్యములతో సమృద్ధములై ఉండును. జనులందరు కృతయుగము నందెట్లో అట్లు ఎల్లప్పుడును సంతోషము కలవారగుదురు.

అశ్వమేధశతై రిష్ట్వా తథా బహుసువర్ణకైః. 94

శ్లో. గవాం కోట్యయుతం దత్వా బ్రహ్మలోకం ప్రయాస్యతి,
అసఙ్ఖ్యేయం ధనం దత్వా బ్రాహ్మణేభ్యో మహాయశాః.

తా. రాముడు ఎన్నో అశ్వమేధయాగములు చేసి బహుసువర్ణములతో దేవతలను తృప్తిపొందించి పదివేలకోట్ల గోవులను, లెక్కలేని ధనమును బ్రాహ్మణులకొసగి గొప్పకీర్తి వహించి బ్రహ్మలోకమును చేరగలడు.

శ్లో. రాజవంశా౯ శతగుణా౯ స్థాపయిష్యతి రాఘవః,
చాతుర్వర్ణ్యం చ లోకేஉ స్మి౯ స్వేస్వే ధర్మే నియోక్ష్యతి.

తా. మరియు రాముడు నూఱంతలుగా రాజవంశములను భూమిపై స్థాపింపగలడు. బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులను నాలుగు వర్ణములను తమతమధర్మములు తప్పకుండ నియమింపగలడు.

శ్లో. దశ వర్ష సహస్రాణి దశవర్ష శతాని చ,
రామో రాజ్య ముపాసిత్వా బ్రహ్మలోకం గమిష్యతి. 97

తా. ఇట్లు రాముడు పదునొకొండు వేలయేండ్లు రాజ్యము చేసి వైకుంఠము చేరును.

శ్లో. ఇదం పవిత్రం పాపఘ్నం పుణ్యం వేదైశ్చ సమ్మితమ్,
యః పఠే ద్రామచరితం సర్వపాపైః ప్రముచ్యతే. 98

తా. పవిత్రము చేయునదియు పాపములను పోగొట్టునదియు పుణ్యము నిచ్చునదియులగు రామకథను ఎవడు చదువునో అతడు సమస్త పాపముల చేతను విముక్తుడగును.

శ్లో. ఏత దాఖ్యాన మాయుష్యం పఠన్ రామాయణం నరః,
సపుత్త్రపౌత్త్ర స్సగణః ప్రేత్య స్వర్గే మహీయతే. 99

తా. ఆయుర్వృద్ధి కలిగించునది వాస్తవకథను చెప్పునది అగు ఈ రామాయణమును చదువు మనుష్యుడు లోకములో కొడుకులతోను మనుమలతోను సపరివారముతోను కూడినవాడై సమస్తభోగములను అనుభవించి చివర స్వర్గమునందు దేవతలచే పూజింపబడును.

శ్లో. పఠన్ ద్విజో వాగృషభత్వ మీయాత్
స్యాత్ క్షత్త్రియో భూమిపతిత్వ మీయాత్,
వణిగ్జనః పణ్యఫలత్వ మీయా
జ్జనశ్చ శూద్రోపి మహత్త్వ మీయాత్. 100

తా. ఈ రామాయణమును బ్రాహ్మణుడు పఠించిన సమస్త విద్యాపారంగతుడగును. క్షత్రియుడు పఠించిన యెడల భూమండలమునకు

రాజగును. వైశ్యుడు చదివినచో వాణిజ్యమునందు లాభము పొందును. శూద్రుడును చదివుచో ~ మవులేని తన కులమునందు పూజ్యుండగును.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే
బాలకాణ్డే సంక్షేపోనామ ప్రథమ స్సర్గః.

తా. ఇట్లు ఋషిప్రోక్తమైన, రామాయణమను ఆదికావ్యమందలి బాలకాండమునందు రామాయణకథాసంక్షేపమని ప్రసిద్ధమైన మొదటి సర్గము ముగిసినది.



# శ్రీ రామావతారసర్గము

శ్లో. నివృత్తే తు క్రతౌ తస్మిన్ హయమేధే మహాత్మనః,
ప్రతిగృహ్యా సురా భాగాన్ ప్రతిజగ్ము ర్యథాగతమ్. 1

తా. అట్లు మహాత్ముడగు దశరథుని యశ్వమేధము పూర్తికాగానే దేవతలు తమ హవిర్భాగములను స్వీకరించి తమతమస్థానములకు పోయిరి.

శ్లో. సమాప్తదీక్షానియమః పత్నీగణసమన్వితః,
ప్రవివేశ పురీం రాజా సభృత్యబలవాహనః. 2

తా. దశరథ మహారాజు యాగము కొరకై దీక్షానియమము ముగించి భార్యలతో కూడినవాడై సేవకులతోను సైన్యముతోను వాహనములతోను పట్టణమందు ప్రవేశించెను.

శ్లో. యథార్హం పూజితా స్తేన రాజ్ఞా వై పృథివీశ్వరాః,
ముదితాః ప్రయయు ర్దేశాన్ ప్రణమ్య మునిపుఙ్గవమ్. 3

తా. యాగమునకు వచ్చిన రాజులందరు దశరథునిచే తమ గౌరవమునకు తగునట్లుగా పూజింపబడినవారలై మునిశ్రేష్ఠుడగు వసిష్ఠునికి నమస్కరించి సంతోషమున తిరిగి పోయిరి.

శ్లో. శ్రీమతాం గచ్ఛతాం తేషాం స్వపురాణి పురా త్తతః,
బలాని రాజ్ఞాం శుభ్రాణి ప్రహృష్టాని చకాశిరే. 4

తా. శ్రీమంతులగు రాజులు అయోధ్యనుండి తమ తమ

రాజధానులకు పోవునపుడు వారి సైనికులు దశరథునిచే ఈయబడిన వస్త్రాదులచే మిక్కిలి సంతోషించినవారై తెల్లనికాంతికలవారలయి ప్రకాశించిరి.

శ్లో. గతేషు పృథివీశేషు రాజా దశరథ స్తదా,
ప్రవివేశ పురీం శ్రీమా౯ పురస్కృత్య ద్విజోత్తమా౯. 5

తా. ఆ రాజులు వెళ్లిపోయిన తర్వాత శ్రీమంతుడగు దశరథ మహారాజు బ్రాహ్మణోత్తముల ముందుంచుకొని అయోధ్యానగరమును ప్రవేశించెను.

శ్లో. శాన్తయా ప్రయయౌ సార్థం ఋశ్యశృఙ్గ స్సుపూజితః,
అన్వీయమానో రాజ్ఞాథ సానుయాత్రేణ ధీమతా. 6

తా. అంత ఋశ్యశృంగమహాముని చక్కగా పూజింపబడినవాడై భార్యయగు శాంతతోను పరివారసహితుడగు రోమపాదమహారాజుతోను కలిసి వెడలిపోయెను.

శ్లో. ఏవం విసృజ్య తా౯ సర్వా౯ రాజా సంపూర్ణ మానసః,
ఉవాస సుఖిత స్తత్ర పుత్రోత్పత్తిం విచిన్తయ౯. 7

తా. యజ్ఞమునకు వచ్చిన వారినందరిని సాగనంపి దశరథ మహారాజు తనకోరిక పూర్ణఫలమగుటవలన మిక్కిలి సంతోషము పొందినవాడై పుత్రులు ఎప్పుడు పుట్టుదురో అని నిరీక్షించుచుండెను.

శ్లో. తతో యజ్ఞే సమాప్తే తు ఋతూనాం ష ట్సమత్యయుః,

తా. అట్లు యాగము ముగిసినపిమ్మట ఒక వత్సరము గడచెను.

తతశ్చ ద్వాదశే మాసే చైత్రే నావమికే తిథౌ. 8

శ్లో. నక్షత్రేఽదితి దైవత్యే స్వోచ్చసంస్థేషు పఞ్చసు,
గ్రహేషు కర్కటే లగ్నే వాక్పతా విన్దునా సహ. 9

శ్లో. ప్రోద్యమానే జగన్నాథం సర్వలోకనమస్కృతమ్,
కౌసల్యాఽజనయ ద్రామం సర్వలక్షణసంయుతమ్. 10

శ్లో. విష్ణో రర్ధం మహాభాగం పుత్ర మైక్ష్వాకవర్ధనమ్.

తా. అంత పండ్రెండవదియగు చైత్ర మాసమునందు కౌసల్యాదేవి శుద్ధ నవమీ తిథియందు అదితి దేవతగా గల పునర్వసు నక్షత్రమున సూర్యుడును అంగారకుడును బృహస్పతియును శుక్రుడును శనియును ఈ ఐదు గ్రహములు తమ ఉచ్చస్థానములయిన మేష మకర కర్కాటక మీన తులా రాసులందుండగా బృహస్పతి చంద్రునితో చేరియుండగా కర్కాటక లగ్నమందు సమస్తలోకములచే నమస్కరింపబడువాడును, సమస్త శుభలక్షణములతో కూడినవాడును, ఇక్ష్వాకువంశమునందు పుట్టినవారిని అభివృద్ధి పొందించువాడును, మహాభాగ్యశాలియును, విష్ణుదేవునిలో సగమైనవాడు అగు రాముడనెడి పుత్రుని కనెను.

కౌసల్యా శుశుభే తేన పుత్రేణాఽమితతేజసా. 11

శ్లో. యథా వరేణ దేవానా మదితి ర్వజ్రపాణినా,

తా. కౌసల్యాదేవి మిక్కిలి అధికమయిన తేజస్సుగల ఆ కొడుకును కని దేవశ్రేష్ఠుడగు ఇంద్రుని కన్న అదితివలె ప్రకాశించెను.

భరతో నామ కైకేయ్యాం జజ్ఞే సత్యపరాక్రమః. 12

శ్లో. సాక్షాద్విష్ణో శ్చతుర్భాగ స్సర్వై స్సముదితో గుణైః

తా. కైకేయికి సాక్షాత్తు విష్ణువు నందు నాలుగవ అంశయైనవాడును, సమస్తగుణములతో కూడినవాడును సత్యమయిన పరాక్రమము కలవాడును అగు భరతుడు జన్మించెను.

అథ లక్ష్మణశత్రుఘ్నౌ సుమిత్రాఽజనయ త్సుతౌ. 13
శ్లో. వీరౌ సర్వాస్త్రకుశలౌ విష్ణో రర్ధసమన్వితౌ,

తా. అంత సుమిత్ర శూరులును, అన్ని అస్త్రములందును సమర్థులును, విష్ణువు నర్ధాంశల పుట్టినవారును అగు లక్ష్మణశత్రుఘ్నులను కనెను.

పుష్యే జాతస్తు భరతో మీనలగ్నే ప్రసన్నధీః. 14
శ్లో. సార్పే జాతౌ తు సౌమిత్రీ కుళీరేఽభ్యుదితే రవౌ,

తా. నిర్మలమగు బుద్ధిగల భరతుడు పుష్యమీనక్షత్రమందు మీనలగ్నమున జన్మించెను. లక్ష్మణశత్రుఘ్నులు ఆశ్లేషానక్షత్రమున కర్కాటక లగ్నమందు మధ్యాహ్నమున పుట్టిరి.

రాజ్ఞః పుత్త్రా మహాత్మాన శ్చత్వారో జజ్ఞిరే పృథక్. 15
శ్లో. గుణవన్తోఽనురూపాశ్చ రుచ్యా ప్రోష్ఠపదోపమాః

తా. అట్లు దశరథమహారాజునకు గొప్ప ప్రభావముకలవారును గుణవంతులును తనకుతగినవారును కాంతిచే పూర్వాభాద్ర ఉత్తరాభాద్ర రూపములయిన నాలుగు నక్షత్రములతో సమానులు అగు నలుగురు కొడుకులు పుట్టిరి.

జగుః కలం చ గన్ధర్వా ననృతు శ్చాప్సరోగణాః. 16
శ్లో. దేవదున్దుభయో నేదుః పుష్పవృష్టిశ్చ ఖా చ్చ్యుతా,
ఉత్సవశ్చ మహా నాసీ దయోధ్యాయాం జనాకులః. 17

తా. అప్పుడు గంధర్వులు మధురముగా పాడిరి. అప్సరసలు ఆడిరి. దేవతల భేరీలు మ్రోగినవి. ఆకాశమునుండి పుష్పవర్షము కురిసినది. అయోధ్యయందు జనసమూహముచేరి గొప్ప ఉత్సవము చేసెను.

శ్లో. రథ్యాశ్చ జనసమ్బాధా నట నర్తక సఙ్కులాః,
గాయనైశ్చ విరావిణ్యో వాదనైశ్చ తథాపరైః. 18

తా. రాజమార్గములన్నియు ప్రజలచే ఇరుకులై రసభావముల అభినయించు నటనర్తకులతో నిండి, పాటలతోను వాద్యముతోను వందిమాగధుల స్తుతివాక్యములతోను మిక్కిలి రొదగలవి అయ్యెను.

శ్లో. ప్రదేయాంశ్చ దదౌ రాజా సూతమాగధవన్దినామ్,
బ్రాహ్మణేభ్యో దదౌ విత్తం గోధనాని సహస్రశః. 19

తా. దశరథమహారాజు పౌరాణికులకును వంశావళి కీర్తించు వారలకును స్తుతిపాఠకులకును పారితోషకములు ఇచ్చెను. బ్రాహ్మణులకు ధనమును గోవులను వేలవేలుగా దానము చేసెను.

శ్లో. అతీ త్యైకాదశాహం తు నామకర్మ తథాఽకరోత్.

తా. పదునొకొండవ దినము గడచిన పిమ్మట దశరథుడు కొడుకులకు నామకరణము చేసెను.

జ్యేష్ఠం రామం మహాత్మానం భరతం కైకయీ సుతమ్.
శ్లో. సౌమిత్రిం లక్ష్మణ మితి శత్రుఘ్న మపరం తథా,
వసిష్ఠః పరమప్రీతో నామాని కురుతే తథా. 21

తా. అప్పుడు వసిష్ఠుడు మిక్కిలి సంతోషముతో మహానుభావుడగు జ్యేష్ఠపుత్రునకు రాముడని, కైకేయికొడుకునకు భరతుడని, సుమిత్ర కొడుకులకు పెద్దవానికి లక్ష్మణుడని, చిన్నవానికి శత్రుఘ్నుడని పేర్లు పెట్టెను.

శ్లో. బ్రాహ్మణాన్ భోజయామాస పౌరాన్ జానపదా నపి
అదదా ద్బ్రాహ్మణానాం చ రత్నౌఘ మమితం బహు.

తా. దశరథుడు అప్పుడు పట్టణములందును గ్రామములందును

ఉన్నట్టి బ్రాహ్మణులకు భోజనము పెట్టెను. మరియు ఆబ్రాహ్మణులకు మితిలేని రత్నసమూహములు ఎక్కువగా ఇచ్చెను.

శ్లో. తేషాం జన్మక్రియాదీని సర్వకర్మా ణ్యకారయత్,

తా. అంత ఆ కుమారులకు దశరథుడు జాతకర్మ అన్నప్రాశనము చౌలము ఉపనయనము కావించెను.

తేషాం కేతురివ జ్యేష్ఠో రామో రతికరః పితుః. 23

శ్లో. బభూవ భూయో భూతానాం స్వయంభూ రివ సమ్మతః

తా. ఆ కుమారులలో వయస్సు చేతను గుణములచేతను జ్యేష్ఠుడగుట వలన ధ్వజమువలె ప్రకాశించుచున్న రాముడు ఇతరులకన్న అధికముగా తండ్రికి సంతోషము కలిగించుచు సమస్త ప్రాణులకును బ్రహ్మదేవుడు వలె ఇష్టుడై ఉండెను.

సర్వే వేదవిద శ్శూరా స్సర్వే లోకహితే రతాః. 24

శ్లో. సర్వే జ్ఞానోపసంపన్నా స్సర్వే సముదితా గుణైః

తా. ఆ కుమారులందరును వేదములు తెలిసినవారు శూరులు. అందరును లోకమునకు మేలుచేయుటయందు ఆసక్తికలవారు. అందరును ఉత్తమమగు తెలివితో కూడినవారు అందరును సద్గుణములతో కూడిన వారైరి.

తేషా మపి మహాతేజా రామ స్సత్యపరాక్రమః. 25

శ్లో. ఇష్ట స్సర్వస్య లోకస్య శశాఙ్క ఇవ నిర్మలః

తా. వారందరిలోను రాముడు అధికమయిన ప్రతాపమును సత్యమయిన పరాక్రమమును కలవాడై కళంకములేని చంద్రునివలె సమస్తలోకములకు ప్రియుడై ఉండెను.

శ్లో. గజస్కన్ధేఽశ్వపృష్ఠేచ రథచర్యాసు సమ్మతః. 26
ధనుర్వేదే చ నిరతః పితృ శుశ్రూషణే రతః

తా. రాముడు ఏనుగు మూపునందును గుఱ్ఱముమీదను రథముమీద ఎక్కి యుద్ధము చేయుటలో మిక్కిలి సమర్థుడు. ధనుర్విద్య మొదలగు విద్యలయందు పండితుడు. తండ్రి సేవచేయుటయందు ఆసక్తుడు.

బాల్యాత్ప్రభృతి సుస్నిగ్ధో లక్ష్మణో లక్ష్మివర్ధనః. 27
శ్లో. రామస్య లోకరామస్య భ్రాతు ర్జ్యేష్ఠస్య నిత్యశః

తా. సంపదను వృద్ధి పొందించునట్టి లక్ష్మణుడు తనకు అన్నయు లోకమునంతయు రమింపచేయువాడు అగు రామునియందు బాల్యము నుండి మిక్కిలి స్నేహము కలవాడు అయ్యెను.

సర్వప్రియకర స్తస్య రామస్యాపి శరీరతః. 28
శ్లో. లక్ష్మణో లక్ష్మిసంపన్నో బహిఃప్రాణ ఇవాపరః.

తా. రామునకును తన శరీరముకన్నను లక్ష్మీసంపన్నుడగు లక్ష్మణుడు సర్వకాలములయందు ప్రియుడై దేహమునకు వెలుపలనుండు రెండవ ప్రాణమోయన్నట్లు ఉండెను.

న చ తేన వినా నిద్రాం లభతే పురుషోత్తమః. 29
శ్లో. మృష్ట మన్న ముపానీత మశ్నాతి న చ తం వినా.

తా. పురుషోత్తముడగు రాముడు లక్ష్మణుడు లేనిచో నిద్రపోడు. ఉత్తమమయిన ఆహారము తెచ్చినపుడు లక్ష్మణుని విడిచి భుజింపడు.

యదా హి హయమారూఢో మృగయాం యాతి రాఘవః.
శ్లో. తదైనం పృష్ఠతోఽ న్వేతి సధనుః పరిపాలయన్

తా. రాముడు ఎప్పుడు గుఱ్ఱము ఎక్కి వేటకుపోవునో అప్పుడు లక్ష్మణుడు ధనుర్ధరుడై అతని రక్షించుచు వెంబడించి నడచును.

భరతస్యాపి శత్రుఘ్నో లక్ష్మణావరజో హి సః. 31
శ్లో. ప్రాణైః ప్రియతరో నిత్యం తస్య చాసీ త్తథాప్రియః

తా. శత్రుఘ్నుడును లక్ష్మణుని తమ్ముడగుటవలన భరతునికి ఎల్లప్పుడును ప్రాణములకన్నను అధికప్రియుడయ్యెను. ఆ ప్రకారముగనే భరతుడు శత్రుఘ్నునకు మిక్కిలి ప్రియుడుగా ఉండెను.

స చతుర్భి ర్మహాభాగై పుత్రై ర్దశరథః ప్రియైః. 32
శ్లో. బభూవ పరమప్రీతో దేవై రివ పితామహః

తా. ఉత్తమమయిన భాగ్యముగలవారలును ప్రియులునగు ఆ నలుగురి కొడుకులచే దశరథుడు దేవతలచే బ్రహ్మదేవుడువలె పరమ సంతోషము కలవాడయ్యెను.

తే యదా జ్ఞానసంపన్నా స్సర్వే స్సముదితా గుణైః. 33
శ్లో. హ్రీమన్తః కీర్తిమన్తశ్చ సర్వజ్ఞా దీర్ఘదర్శినః

తా. ఆ రామలక్ష్మణభరతశత్రుఘ్నులు ఎప్పుడు శాస్త్రజ్ఞానముతో కూడినవారై సమస్త సద్గుణములచేతను ఒప్పినవారై చెడుపనులు చేయుటకు సిగ్గుకలవారై అధికమయిన కీర్తికలవారై దీర్ఘమయిన ఆలోచనకలవారై ఉండిరి.

తేషా మేవం ప్రభావానాం సర్వేషాం దీప్త తేజసామ్. 34
శ్లో. పితా దశరథో హృష్టో బ్రహ్మాలోకాధిపో యథా

తా. వారందరు ఇట్టి ప్రభావము కలిగి తేజస్సుచే ప్రకాశించు చుండుటచేత వారి తండ్రి దశరథుడు తాను బ్రహ్మలోకమునకు ప్రభువయినంత సంతోషము పొందెను.

తే చాపి మనుజవ్యాఘ్రా వైదికాధ్యయనే రతాః. 35
శ్లో. పితృ శుశ్రూషణరతా ధనుర్వేదే చ నిష్ఠితాః.

తా. పురుషశ్రేష్ఠులగు ఆ రామభరతలక్ష్మణశత్రుఘ్నులును తండ్రి మెచ్చుటచే విఙ్టవీగి సోమరులు కాక రెట్టింపుగా స్మృతులు మొదలగు వానిని చదువుటయందును తండ్రికి సేవచేయుట యందును అస్త్రవిద్యలయందును ఆసక్తులయి ఉండిరి.

అథ రాజా దశరథ స్తేషాం దారక్రియాం ప్రతి. 36
శ్లో. చిన్తయామాస ధర్మాత్మా సోపాధ్యాయ స్సబాన్ధవః.

తా. అంతట, ధర్మాత్ముడగు దశరథమహారాజు కొడుకుల వివాహముల గురించి, పురోహితునితోను బంధువులతోను కూడి ఆలోచించెను.

తస్య చిన్తయమానస్య మన్త్రిమధ్యే మహాత్మనః. 37
శ్లో. అభ్యగచ్ఛ న్మహాతేజా విశ్వామిత్రో మహామునిః.

తా. మహాత్ముడగు దశరథుడు అట్లు మంత్రులమధ్య కొడుకుల వివాహములను గురించి ఆలోచించుచుండగా, అచ్చటికి మహానుభావుడగు విశ్వామిత్ర మహాముని వచ్చెను.

స రాజ్ఞో దర్శనాకాంక్షీ ద్వారాధ్యక్షా నువాచ హ. 38
శ్లో. శీఘ్ర మాఖ్యాత మాం ప్రాప్తం కౌశికం గాధిన స్సుతమ్.

తా. ఆ విశ్వామిత్రుడు రాజును చూడగోరి ద్వారపాలకులను చూచి మీరు గాధికొడుకు కౌశికుడను పేరుగల నేను వచ్చియున్నానని శీఘ్రముగా పోయి రాజుతో చెప్పుడని పలికెను.

తచ్ఛ్రుత్వా వచనం త్రాసా ద్రాజ్ఞో వేశ్మ ప్రదుద్రువుః. 39

శ్లో. సంభ్రాన్తమనస స్సర్వే తేన వాక్యేన చోదితాః

తా. ఆ విశ్వామిత్రుని వచనము విని, ద్వారపాలకులు భయముతో తొట్రుపడిన మనస్సు కలవారై రాజున్న గృహమునకు పరుగెత్తిరి.

తే గత్వా రాజభవనం విశ్వామిత్ర మృషిం తదా. **40**
శ్లో. ప్రాప్త మావేదయామాసు ర్నృపా యైక్ష్వాకవే తదా.

తా. ఆ ద్వారపాలకులు అప్పుడు రాజగృహమునకు పోయి విశ్వామిత్ర మహర్షి వచ్చియున్నాడని ఇక్ష్వాకువంశమున పుట్టిన దశరథునకు చెప్పిరి.

తేషాం తద్వచనం శ్రుత్వా సపురోధా స్సమాహితః. **41**
శ్లో. ప్రత్యుజ్జగామ తం హృష్టో బ్రహ్మాణమివ వాసవః

తా. వారి మాటను వినినంతనే దశరథుడు ఎచ్చరికపడి పురోహితునితో కూడి బ్రహ్మదేవుని దేవేంద్రుడు ఎదుర్కొనునట్లు సంతోషమున ఆ మహాముని కి ఎదురేగెను.

తం దృష్ట్వా జ్వలితం దీప్త్యా తాపసం సంశితవ్రతమ్.
శ్లో. ప్రహృష్టవదనో రాజా తతో ఽర్ఘ్య ముపహారయత్.

తా. శరీరకాంతిచే ప్రజ్వలించుచు మహాతపస్సును తీక్ష్ణవ్రతమును కలిగిన ఆ విశ్వామిత్రుని చూచి సంతోషించినవాడై దశరథమహారాజు ఆయనకు తన పురోహితునిచే అర్ఘ్యము ఇప్పించెను.

స రాజ్ఞః పతిగృహ్యార్ఘ్యం శాస్త్రదృష్టేన కర్మణా . **43**
శ్లో. కుశలం చావ్యయం చైవ పర్యపృచ్ఛ న్నరాధిపమ్.

తా. ఆ మహాముని యథాశాస్త్రముగ దశరథుడు ఇచ్చిన అర్ఘ్యమును స్వీకరించి అతని క్షేమసమాచారములు, కుశలప్రశ్నములు అడిగెను.

పురే కోశే జనపదే బాన్ధవేషు సుహృత్సు చ. 44
శ్లో. కుశలం కౌశికో రాజ్ఞః పర్యపృచ్ఛ త్సుధార్మికః

తా. మిక్కిలి ధార్మికుడగు కౌశికుడు పట్టణమునకును బొక్కసమునకును దేశమునకును బంధువులకును మిత్రులకును క్షేమమాయని దశరథమహారాజును చక్కగా అడిగెను.

అపి తే సన్నతా స్సర్వే సామన్తా రిపవో జితాః. 45
శ్లో. దైవం చ మానుషం చాపి కర్మ తే సా ధ్వనుష్ఠితమ్.

తా. నీకు ఇరుగు పొరుగు రాజులందరు లొంగియున్నారా? శత్రువులు జయింపబడిరా? దేవతా సంబంధమయిన యజ్ఞయాగాది కర్మములును మనుష్యసంబంధమగు సామదానబేధదండాత్మకములయిన కర్మములను నీవు చక్కగా చేయుచున్నావా? అని కౌశికుడు దశరథుని అడిగెను.

వసిష్ఠం చ సమాగమ్య కుశలం మునిపుఙ్గవః. 46
శ్లో. ఋషీం శ్చాన్యాంశ్చ యథా న్యాయం మహాభాగా నువాచ హ.

తా. ఆ మునిశ్రేష్ఠుడు, వసిష్ఠుని, మహాత్ములగు ఇతరులను చేరి, వారిని యథాన్యాయముగ క్షేమములు అడిగెను.

తే సర్వే హృష్టమనస స్తస్య రాజ్ఞో నివేశనమ్. 47
శ్లో. వివిశుః పూజితా స్తత్ర నిషేదుశ్చ యథార్హతః

తా. ఆ ఋషులందరు సంతోషించిన మనసు కలవారై దశరథుని సభను ప్రవేశించి, అచ్చట రాజుచే యథాయోగ్యముగ పూజింపబడినవారలై కూర్చుండిరి.

అథ హృష్టమనా రాజా విశ్వామిత్రం మహామునిమ్. 48

శ్లో. ఉవాచ పరమోదారో హృష్ట స్త మభిపూజయన్.

తా. అంత పరమదాతయగు దశరథమహారాజు సంతోషించిన మనస్సుగలవాడై పులకాంకితుడై విశ్వామిత్రమహామునిని పొగడుచు ఇట్లు పలికెను.

యథాఽమృతస్య సంప్రాప్తి ర్యథా వర్ష మనూదకే. 49
శ్లో. యథా సదృశదారేషు పుత్ర జన్మాఽప్రజస్య చ.

తా. అమృతము లభించుట ఎట్టిదో, నిర్జలప్రదేశమునందు వర్షము కురియుట ఎట్టిదో, సంతానము లేనివానికి సజాతీయమైన భార్యయందు కొడుకు పుట్టుట ఎటువంటిదో,

ప్రణష్టస్య యథాలాభో యథా హర్షో మహోదయే. 50
శ్లో. తథై వాగమనం మన్యే స్వాగతం తే మహామునే,

తా. కనబడకపోయినది తిరిగి దొరకుట యెట్టిదో, ఉత్సవారంభమందు సంతోషము కలుగుట ఏవిధమో, నేను కొడుకుల వివాహము గురించి యాలోచించుచుండగా తమరు వచ్చుట అట్టిదే యని తలచెదను. మీకు స్వాగతము.

కం చ తే పరమం కామం కరోమి కిము హర్షితః. 51
శ్లో. పాత్రభూతోఽసి మే బ్రహ్మన్ దిష్ట్యా ప్రాప్తోఽసి ధార్మిక

తా. బ్రాహ్మణుడా! నేను సంతోషమున ఈ ముఖ్యమయిన కోరికను దేనిని ఏ ప్రకారముగా చేయవలెను? కౌశికుడా! నీవు ఉచితమయిన వాడవు. నా భాగ్యముచే వచ్చితివి.

అద్య మే సఫలం జన్మ జీవితం చ సుజీవితమ్. 52

తా. ఇప్పుడు నా జన్మము సఫలమయినది. నా బ్రతుకు మంచి బ్రతుకైనది.

శ్లో. పూర్వం రాజర్షిశబ్దేన తపసా ద్యోతితప్రభః
బ్రహ్మర్షిత్వ మనుప్రాప్తః పూజ్యోఽసి బహుధా మయా.

తా. నీవు మొదట రాజర్షి పదమునొంది పిమ్మట తపస్సుచే మహా ప్రకాశము పొందుటవలన బ్రహ్మర్షిత్వము పొందితివి కావున నీవు నాకు బహువిధముల పూజింపదగినవాడవు.

శ్లో. త దద్భుత మిదం బ్రహ్మన్ పవిత్రం పరమం మమ
శుభక్షేత్రగత శ్చాహం తవ సన్దర్శనా త్ప్రభో. 54

తా. బ్రాహ్మణుడా! అట్టి నీరాక మిక్కిలి యాశ్చర్యము, నాకు పరమ పవిత్రమైనది. స్వామీ! ఇచ్చట నిన్ను చూచుటవలన నేను పుణ్యక్షేత్రమున నుండినవాడనైతిని.

శ్లో. బ్రూహి య త్ప్రార్థితం తుభ్యం కార్య మాగమనంప్రతి
ఇచ్ఛా ఉమ్యనుగృహీతో హం త్వదర్థపరివృద్ధయే. 55

తా. నీవు ఇచ్చటికి ఏమి ప్రయోజనము కోరి వచ్చితివో చెప్పుము. నీ యనుగ్రహము పొందినవాడను కావున, ఈ కార్యము అభివృద్ధి పొందునట్లు చేయగోరుచున్నాను.

శ్లో. కార్యస్య న విమర్శం చ గన్తు మర్హసి కౌశిక,
కర్తా చాహ మశేషేణ దైవతం హి భవా న్మమ. 56

తా. కౌశికుడా! కార్యమును గురించి, గొప్పదే ఇతడు చేయునో చేయడో అను విచారము చేయవలదు. కార్యము కొరతపడకుండ చేయువాడను నేను. నీవు నాకు దేవతవుగదా.

శ్లో. మమ చాయ మనుప్రాప్తో మహా సభ్యుదయో ద్విజ,
తవాగమనజః కృత్స్నో ధర్మ శ్చానుత్తమో మమ. 57

తా. బ్రాహ్మణుడా! నీ రాక నాకు గొప్ప అభ్యుదయమును చేకూర్చునది. నీ రాకవలన నాకు ఉత్తమమయిన ధర్మమంతయు ఉపలబ్ధ మయినది.

శ్లో. ఇతి హృదయసుఖం నిశమ్య వాక్యం
శ్రుతిసుఖ మాత్మవతా వినీత ముక్తమ్,
ప్రథితగుణయశా గుణై ర్విశిష్టః
పరమఋషిః పరమం జగామ హర్షమ్. 58

తా. ఈ విధముగా మనస్సునకు చెవులకు సుఖమగునట్లు బుద్ధిమంతుడగు దశరథునిచే సవినయముగ చెప్పబడిన మాటను విని గుణములచే కలుగు ప్రసిద్ధమయిన కీర్తిగలవాడును, గుణవంతుడును అగు విశ్వామిత్ర మహాముని పరమసంతోషము పొందెను.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే
బాలకాణ్డే శ్రీ రామావతారో నామ
అష్టాదశస్సర్గః.

ఇట్లు ఋషిప్రోక్తమయిన శ్రీమద్రామాయణ మను ఆదికావ్య మందలి బాలకాండమునందు శ్రీరామావతారమనబడు అష్టాదశసర్గము ముగిసినది.

శ్లో. తచ్ఛ్రుత్వా రాజసింహస్య వాక్య మద్భుతవిస్తరమ్,
హృష్టరోమా మహాతేజా విశ్వామిత్రోఽభ్యభాషత.

తా. రాజసత్తముడగు దశరథుని ఆశ్చర్యకరమైన మాటలను విని మహాప్రభావుడగు విశ్వామిత్రుడు సంతోషమున గగుర్పాటు నొందినవాడై ఇట్లని బదులు చెప్పెను.



# శ్రీ సీతారామకళ్యాణసర్గము.

శ్లో. యస్మింస్తు దివసే రాజా చక్రే గోదాన ముత్తమమ్,
తస్మింస్తు దివసే శూరో యుధాజి త్సముపేయివా౯. 1

తా. ఏ దినమునందు దశరథమహారాజు ఉత్తమమగు గోదానమును చేసెనో ఆ దినమునందే శూరుడగు యుధాజిత్తు దశరథుని యొద్దకు వచ్చెను.

శ్లో. పుత్త్రః కేకయరాజస్య సాక్షా ద్భరతమాతులః
దృష్ట్వా పృష్ట్వా చ కుశలం రాజాన మిద మబ్రవీత్. 2

తా. భరతుని మేనమామయగు కేకయరాజకుమారుడు యుధాజిత్తు దశరథ మహారాజును చూచి, కుశలమడిగి, ఇట్లని చెప్పెను.

శ్లో. కేకయాధిపతీ రాజా స్నేహా త్కుశల మబ్రవీత్,
యేషాం కుశలకామోఽసి తేషాం సంప్ర త్యనామయమ్.

తా. కేకయరాజు, స్నేహముతో నీ క్షేమము అడుగుమనెను. నీ వెవ్వరి క్షేమము కోరుదువో అట్టి మేమందరము కుశలముగ నున్నాము.

శ్లో. స్వస్రీయం మమ రాజేన్ద్ర ద్రష్టుకామో మహీపతిః,
తదర్థ ముపయాతోఽహ మయోధ్యాం రఘునన్దన. 4

తా. రాజశ్రేష్ఠుడగు దశరథుడా! కేకయరాజు నా మేనల్లుడగు భరతుని చూడగోరుచున్నాడు. అందు కొరకు నేను అయోధ్యకు పోయితిని.

శ్లో. శ్రుత్వా త్వహ మయోధ్యాయాం వివాహార్థం తవాత్మజాన్
మిథిలా ముపయాతాం స్తు త్వయాసహ మహీపతే. 5
త్వరయాభ్యుపయాతో ఽహం ద్రష్టుకామ స్స్వసుస్సుతమ్

తా. రాజా! నేను అయోధ్యయందు నీవును నీ కొడుకులును వివాహము కొరకు మిథిలకు వచ్చినారని విని, నా మేనల్లుని చూచుటకై యిచ్చటికి శీఘ్రముగా వచ్చినాడను.

శ్లో. అథ రాజా దశరథః ప్రియాతిథి ముపస్థితమ్. 6
దృష్ట్వా పరమసత్కారైః పూజార్హం సమపూజయత్.

తా. ఇట్లు యుధాజిత్తు చెప్పిన పిమ్మట, దశరథ మహారాజు ప్రియాతిథి యయిన యుధాజిత్తు వచ్చుటను జూచి పూజార్హుడగు నతని ఉత్తమములగు పూజలచే చక్కగా పూజించెను.

శ్లో. తత స్తా ముషితో రాత్రిం సహపుత్రై ర్మహాత్మభిః. 7

తా. అంత దశరథుడు మహానుభావులగు కొడుకులతో కూడ, నా రాత్రియంతయు గడపెను.

శ్లో. ప్రభాతే పున రుత్థాయ కృత్వా కర్మాణి కర్మవిత్,
ఋషీం స్తదా పురస్కృత్య యజ్ఞవాట ముపాగమత్. 8

తా. ఏకాలమునందు ఏకర్మము చేయవలెనో దానినంతయు తెలిసిన దశరథమహారాజు, ప్రాతఃకాలమునందే లేచి అప్పటి కర్మములను తీర్చి అంత ఋషులను పురస్కరించుకొని జనకుని యాగశాలకు పోయెను.

శ్లో. యుక్తే ముహూర్తే విజయే సర్వాభరణభూషితైః,

భ్రాతృభి స్సహితో రామః కృతకౌతుకమఙ్గళః. 9

శ్లో. వసిష్ఠం పురతః కృత్వా మహర్షీ నపరా నపి

తా. రాముడు సమస్త భూషణములచేతను అలంకరింపబడియున్న తమ్ములతో కూడ, తోరముకట్టుకొని, వివాహమునకు తగిన విజయమను ముహూర్తమునందు, వసిష్ఠుని ఇతర మహర్షులను ముందిడుకొని వెడలెను.

(పితు స్సమీప మాశ్రిత్య తస్థౌ భ్రాతృభి రావృతః)
వసిష్ఠో భగవా నేత్య వైదేహ మిద మబ్రవీత్. 10

తా. తండ్రి సమీపమున చేరి యచ్చట తమ్ములతో కూడ నిలిచి యుండెను. అంత భగవంతుడగు వసిష్ఠుడు జనకమహారాజు నొద్దకు పోయి ఈ వాక్యమును చెప్పెను.

శ్లో. రాజా దశరథో రాజ౯ కృతకౌతుకమఙ్గళైః
పుత్రై ర్నరవరశ్రేష్ఠ దాతార మభికాంక్షతే. 11

తా. రాజశ్రేష్ఠుడవగు జనకమహారాజా! దశరథమహారాజు తోరము గట్టుకొని సిద్ధముగానున్న కొడుకులతో కూడినవాడై, కన్యాదాతవగు ని న్నెదురుచూచుచున్నాడు.

శ్లో. దాతృప్రతిగృహీతృభ్యాం సర్వార్థాః ప్రభవన్తి హి,
స్వధర్మం ప్రతిపద్యస్వ కృత్వా వైవాహ్య ముత్తమమ్. 12

తా. ఇందు ఇచ్చువానికిని పుచ్చుకొనువానికిని కూడ సమస్త పురుషార్థములును సిద్ధించును. కావున నీవు ఉత్తమమగు కన్యాదానము చేసి నీధర్మమయిన ప్రతిజ్ఞాపాలనము పొందుము.

శ్లో. ఇత్యుక్తః పరమోదారో వసిష్ఠేన మహాత్మనా,
ప్రత్యువాచ మహాతేజా వాక్యం పరమధర్మవిత్. 13

తా. ఇట్లు మహాత్ముండగు వసిష్ఠునిచే చెప్పబడినవాడై, మిక్కిలి ఉదారుడును గొప్ప తేజస్సు గలవాడును సమస్త ధర్మములను చక్కగా తెలిసినవాడునగు జనకుడు ఇట్లు బదులు చెప్పెను.

శ్లో. కః స్థితః ప్రతిహారో మే కస్యాజ్ఞా సంప్రతీక్ష్యతే
స్వగృహే కో విచారోఽస్తి యథారాజ్య మిదం తవ.

తా. దశరథమహారాజా! నా ద్వారపాలకు డెవ్వడు కావలి యున్నాడు? ఎవరి యాజ్ఞను నిరీక్షించుచున్నావు? స్వగృహమునందు విచారమేమి? నీ రాజ్యము నీకెట్లో నా యీ రాజ్యము నీకట్లేగాని భేదము తలపవలదు.

శ్లో. కృతకౌతుకసర్వస్వా వేదిమూల ముపాగతాః,
మమ కన్యా మునిశ్రేష్ఠ దీప్తా వహ్నే రివార్చిషః. 15

తా. మునిశ్రేష్ఠుడవగు వసిష్ఠుడా! నా కొమార్తెలు వివాహమునకు కావలసిన మంగళాచారముల నన్నిటిని పొంది, వేదిదగ్గరకు చేరినవారలయి, జ్వలించుచున్న అగ్నులవలె వెలుగొందుచున్నారు.

శ్లో. సజ్జోఽహం త్వత్ప్రతీక్షో స్మి వేద్యా మస్యాం ప్రతిష్ఠితః,
అవిఘ్నం కురుతాం రాజా కిమర్థ హి విలమ్బ్యతే. 16

తా. నేను ఆయితమయి ఈ వేదిదగ్గర మీ కొరకు ఎదురు చూచుచున్నాను. దశరథ మహారాజు అడ్డులేక చేయదగినది చేయుగాక. ఏల జాగుచేయుచున్నాడు?

శ్లో. త ద్వాక్యం జనకే నోక్తం శ్రుత్వా దశరథ స్తదా,
ప్రవేశయామాస సుతాన్ సర్వా నృషిగణా నపి. 17

తా. జనకుడు చెప్పిన ఆ మాటలను విని, దశరథమహారాజు, అప్పుడు కొడుకులను ఋషులనందరను దీసికొని యాగశాల ప్రవేశించెను.

శ్లో. తతో రాజా విదేహానాం వసిష్ఠ మిద మబ్రవీత్

తా. అంత విదేహ దేశమునకు రాజైన జనకుడు వసిష్ఠుని చూచి ఈ మాట చెప్పెను.

కారయస్వ ఋషే సర్వ మృషిభి స్సహధార్మిక. 18

శ్లో. రామస్య లోకరామస్య క్రియాం వైవాహికీం విభో,

తా. ధార్మికుడవు మాకు ప్రభువగు వసిష్ఠ మహర్షీ లోకమును రమింపచేయునట్టి రామునకు వివాహక్రియ అంతయు నీవు ఋషులతోగూడి చేయింపుము.

త థేత్యుక్త్వా తు జనకం వసిష్ఠో భగవా నృషిః. 19

శ్లో. విశ్వామిత్రం పురస్కృత్య శతానన్దం చ ధార్మికమ్
ప్రపామధ్యే తు విధివ ద్వేదిం కృత్వా మహాతపాః. 20

తా. భగవంతుడును గొప్ప తపస్సు గలవాడునగు వసిష్ఠమహర్షి, జనకునితో అట్లేయని చెప్పి విశ్వామిత్రుని ధార్మికుడగు శతానందుని ముందుంచుకొని పందిరినడుమ యథాశాస్త్రముగా వేదిని నిర్మించి,

శ్లో. అలఙ్చకార తాం వేదిం గన్ధపుష్పై స్సమన్తతః,
సువర్ణపాలికాభి శ్చ ఛిద్రకుమ్భైశ్చ సాఙ్కురైః. 21

శ్లో. అఙ్కురాఢ్యై శ్శరావైశ్చ ధూపపాత్రై స్సధూపకైః
శఙ్ఖపాత్రై స్స్రువై స్స్రుగ్భిః పాత్రై రర్ఘ్యాభిపూరితైః. 22

శ్లో. లాజపూర్ణైశ్చ పాత్రీభి రక్షతై రభిసంస్కృతైః

తా. ఆ వేదిచుట్టును గంధపుష్పములచేతను బంగారు పాలికల చేతను జాజాలతో కూడిన అడుగులేని పాత్రల చేతను మూకుళ్ళ చేతను ధూపముతో కూడిన ధూపపాత్రల చేతను, శంఖపాత్రల చేతను స్రుక్స్రువముల చేతను

అర్ఘ్యమునింపిన పాత్రల చేతను పేలాలలో నిండిన పాత్రల చేతను చక్కగా సంస్కారము చేయబడిన అక్షతల చేతను అలంకరించెను.

దర్భై స్సమై స్సమాస్తీర్య విధివన్మన్త్రపూర్వకమ్. 23

శ్లో. అగ్ని మాధాయ వేద్యాం తు విధిమన్త్రపురస్కృతమ్

జుహా వాగ్నౌ మహాతేజా వసిష్ఠో భగవా నృషిః. 24

తా. గొప్ప ప్రభావము గలవాడును భగవంతుడునగు వసిష్ఠమహర్షి వేదియం దగ్నిని ప్రతిష్ఠించి, యథాశాస్త్రముగ సమంత్రకముగా, నొకటి కొకటి హెచ్చుతక్కువలు లేని దర్భలను పరచి విధియందు చెప్పబడిన మంత్రములచే వధూవరుల అభ్యుదయార్థము హోమము చేసెను.

శ్లో. తత స్సీతాం సమానీయ సర్వాభరణభూషితామ్

సమక్ష మగ్నే స్సంస్థాప్య రాఘవాభిముఖే తదా. 25

శ్లో. అబ్రవీ జ్జనకో రాజా కౌసల్యానన్దవర్ధనమ్

తా. అంత జనకమహారాజు సమస్తభూషణముల చేతను అలంకరింపబడియున్న సీతను తోడ్కొనివచ్చి అగ్నిముందర రామున కెదురుగా నిల్పి కౌసల్యకు సంతోషము వృద్ధిబొందించునట్టి రాముని చూచి యిట్లు పలికెను.

'ఇయం సీతా మమ సుతా సహధర్మచరీ తవ. 26

శ్లో. ప్రతీచ్ఛ చైనాం భద్రం తే పాణిం గృహ్ణీష్వ పాణినా,

తా. 'నా కొమార్తె సీత ఇదిగో! ఈ బిడ్డ నీకు ధర్మపత్ని కాగలదు. ఈమెను ప్రతిగ్రహింపుము. నీకు మంగళమగుగాక. నీ హస్తమున ఈమె హస్తము గ్రహింపుము.'

పతివ్రతా మహాభాగా ఛాయేవానుగతా సదా'. 27

శ్లో. ఇత్యుక్త్వా ప్రాక్షిప ద్రాజా మన్త్రపూతం జలం తదా

తా. 'ఈ సీత, పతివ్రతయై మహాభాగ్యముగలదై నిన్ను నీడవలె అనుసరించుచుండగలదు' అని పలికి జనకు డప్పుడు రాముని హస్తమున మంత్రపూర్వకముగా నీటిని విడిచెను.

సాధుసా ధ్వితి దేవానా మృషీణాం వదతాం తదా. 28
శ్లో. దేవదున్దుభినిర్ఘోషః పుష్పవర్షో మహా నభూత్

తా. అప్పుడు, దేవతలును ఋషులును బాగుబాగు అని చెప్పుచుండగా దేవదుందుభుల ధ్వనియు, పుష్పవర్షము అధికముగా కలిగెను.

ఏవం దత్వా తదా సీతాం మన్త్రోదకపురస్కృతామ్. 29
శ్లో. అబ్రవీ జ్జనకో రాజా హర్షేణాభిపరిప్లుతః

తా. అప్పుడిట్లు జనకమహారాజు, సమంత్ర జలపూర్వకముగా, సీతను రామునకొసంగి, సంతోషమున మునిగినవాడై యిట్లు పలికెను.

'లక్ష్మణాగచ్ఛ, భద్రం తే, ఊర్మిళా ముద్యతాం మయా,
శ్లో. ప్రతీచ్ఛ పాణిం గృహ్ణీష్వ మాభూ త్కాలస్య పర్యయః'.

తా. 'లక్ష్మణా రమ్ము నీకు మంగళమగుగాక! నీకు నేనీయ కోరిన ఈ ఊర్మిళను ప్రతిగ్రహింపుము. పాణిగ్రహణము చేయుము. ఆలస్యమువలదు'.

త మేవ ముక్త్వా జనకో భరతం చాభ్యభాషత. 31
శ్లో. 'గృహాణ పాణిం మాణ్డవ్యాః పాణినా రఘునన్దన',

తా. జనకుడు ఇట్లు లక్ష్మణునితో చెప్పి, భరతునితోను ఇట్లు చెప్పెను. భరతుడా! నీవు మాండవి హస్తమును నీ హస్తముతో గ్రహింపుము.

శత్రుఘ్నం చాపి ధర్మాత్మా అబ్రవీ జ్జనకేశ్వరః. 32

శ్లో. 'శ్రుతకీర్త్యా మహాబాహో పాణిం గృహ్ణీష్వ పాణినా'

తా. అంత ధర్మాత్ముడగు జనకమహారాజు శత్రుఘ్నుని చూచి, ఇట్లు పలికెను. 'గొప్ప చేతులుగల శత్రుఘ్నుడా! నీవు శ్రుతకీర్తి హస్తమును నీ హస్తముచే గ్రహింపుము.'

'సర్వే భవన్త స్సౌమ్యాశ్చ సర్వే సుచరితవ్రతాః. 33

శ్లో. పత్నీభి స్సన్తు కాకుత్స్థా మాభూ త్కాలస్య పర్యయః'.

తా. 'కకుత్థ్స వంశమునందు పుట్టిన రామలక్ష్మణ భరత శత్రుఘ్నులారా! మీరందరు సౌమ్యులు. మీరందరు చక్కగా వ్రతముల నాచరించిన వారలు. మీరందరు భార్యలతో కూడినవార లగుదురు గాక. ఆలస్యము వలదు'.

జనకస్య వచ శ్శ్రుత్వా పాణీ౯ పాణీభి రస్పృశ౯. 34

శ్లో. చత్వార స్తే చతసృణాం వసిష్ఠస్య మతే స్థితాః

తా. ఆ రామలక్ష్మణభరతశత్రుఘ్నులు నలుగురు, జనకమహారాజు మాటను విని, వసిష్ఠుని అనుమతి పొందినవారై రాజపుత్రికల నలుగురి హస్తములను తమ హస్తములచే పరిగ్రహించిరి.

అగ్నిం ప్రదక్షిణీకృత్య వేదిం రాజాన మేవ చ. 35

శ్లో. ఋషీం శ్చైవ మహాత్మాన స్సభార్యా రఘుసత్తమాః

యథోక్తేన తదా చక్రు ర్వివాహం విధిపూర్వకమ్. 36

తా. అంతట మహాత్ములగు రామలక్ష్మణభరతశత్రుఘ్నులు తమ భార్యలతో కూడినవారలై అగ్నికిని, వేదికకును, జనకమహారాజునకును, మహర్షులకును ప్రదక్షిణముచేసి, విధిపూర్వకముగా కల్పసూత్రమున చెప్పబడిన విధముగా వివాహము చేసికొనిరి.

శ్లో. (కాకుత్స్థైశ్చ గృహీతేషు లలితేషు చ పాణిషు)
పుష్పవృష్టి ర్మహ త్యాసీ దన్తరిక్షా త్సుభాస్వరా.

తా. అట్లు రాముడు మొదలగువారు, సీత మొదలగువారల సుందరములగు హస్తములను గ్రహింపగానే, ఆకాశమునుండి మిక్కిలి ప్రకాశించెడు గొప్పపూలవాన కురిసెను.

దివ్యదున్దుభినిర్ఘోషై ర్గీతవాదిత్రనిస్స్వనైః. 37
శ్లో. ననృతు శ్చాప్సరస్సఙ్ఘా గన్ధర్వాశ్చ జగుః కలమ్

తా. దివ్యదుందుభుల ధ్వనులతోను పాటలయొక్క వాద్యముల యొక్క ధ్వనులతోను, మధురముగా అప్సరసలాడగా, గంధర్వులు పాడిరి.

వివాహే రఘుముఖ్యానాం త దద్భుత మదృశ్యత. 38

తా. రఘువంశమునందు పుట్టిన వారియందు ఉత్తములయిన రామాదుల వివాహమునందు అట్టియాశ్చర్యము చూడబడెను.

శ్లో. ఈదృశే వర్తమానే తు తూర్యోద్ఘుష్టనినాదితే
త్రి రగ్నిం తే పరిక్రమ్య ఊహు ర్భార్యా మహౌజసః.

తా. ఇట్లు నృత్తగీతవాద్యముల ధ్వనిచే లోకమంతయు శబ్దాయమానమగుచుండగా, అధికమయిన తేజస్సుగల ఆ రామాదులు, మూడు మార్లు అగ్నికి ప్రదక్షిణము చేసి, పెండ్లియాడిరి.

శ్లో. అథోపకార్యాం జగ్ము స్తే సభార్యా రఘునన్దనాః
రాజా ప్యనుయయౌ పశ్య౯ సర్షిసఙ్ఘ స్సబాన్ధవః. 40

తా. అంత, ఆ రామభరతలక్ష్మణశత్రుఘ్నులు భార్యలతో కూడిన వారలై విడిదికి వెడలిపోయిరి. దశరథమహారాజు ఋషి సమూహముతోను,

బంధువులతోను కూడినవాడై భార్యాసహితులగు కొడుకులను చూచుచు వెంబడించి పోయెను.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే
బాలకాణ్డే శ్రీ సీతారామకల్యాణం నామ
త్రిసప్తతితమస్సర్గః.

ఇట్లు ఋషిప్రోక్తమయిన శ్రీమద్రామాయణమనెడి ఆదికావ్యము నందలి బాలకాండమునందు, శ్రీ సీతారామకల్యాణమననొప్పు త్రిసప్తతితమసర్గ ముగిసినది.

శ్లో. అథ రాత్ర్యాం వ్యతీతాయాం విశ్వామిత్రో మహామునిః,
ఆపృచ్ఛ్య తౌ చ రాజానౌ జగా మోత్తరపర్వతమ్.

తా. అంత ఆరాత్రి గడచిన పిమ్మట, విశ్వామిత్ర మహాముని, జనక మహారాజును దశరథ మహారాజును వీడ్కొని, రామలక్ష్మణభరత శత్రుఘ్నులను సీతను, ఊర్మిళను, మాండవిని, శ్రుతకీర్తిని ఆశీర్వదించి, హిమవత్పర్వతమునకు వెళ్ళెను.



# సీతారామ సుఖజీవన సర్గము

శ్లో. గతే రామే ప్రశాన్తాత్మా రామో దాశరథి ర్ధనుః,
వరుణా యాప్రమేయాయ దదౌ హస్తే ససాయకమ్. 1

తా. పరశురాముడు వెళ్ళిన తరువాత రాముడు ఆ ధనుస్సును, బాణమును కొలుచుటకు శక్యముకాని వాడగు వరుణునకు ఇచ్చివేసెను.

శ్లో. అభివాద్య తతో రామో వసిష్ఠప్రముఖా నృషీన్,
పితరం విహ్వాలం దృష్ట్వా ప్రోవాచ రఘునన్దనః. 2

తా. అటు పిమ్మట రాముడు వసిష్ఠుడు మొదలగు మహర్షులకు నమస్కరించి దిగులుతోనున్న తండ్రిని చూచి ఇట్లనెను.

శ్లో. జామదగ్న్యో గతో రామః ప్రయాతు చతురఙ్గిణీ,
అయోధ్యాభిముఖీ సేనా త్వయా నాథేన పాలితా. 3

తా. పరశురాముడు నిష్క్రమించినాడు. మీ సంరక్షణలోనున్న చతురంగ బలములు అయోధ్యవైపునకు ప్రయాణం సాగించుగాక.

శ్లో. సందిశస్వ మహారాజ సేనాం త్వచ్ఛాసనే స్థితాం,
శాసనం కాఙ్క్షతే సేనా చాతకాళి ర్జలం యథా 4

తా. దశరథమహారాజా! మీ ఆజ్ఞను శిరసావహించు సైన్యమును ఆజ్ఞాపింపగలరు. చాతక పక్షులు నీటిని కోరునట్లు సైన్యము మీ శాసనమును కోరుచున్నది.

శ్లో. రామస్య వచనం శ్రుత్వా రాజా దశరథ స్సుతమ్,
బాహుభ్యాం సంపరిష్వజ్య మూర్ధ్ని చాఘ్రాయ రాఘవమ్. 5

శ్లో. గతో రామ ఇతి శ్రుత్వా హృష్టః ప్రముదితో నృపః,
పునర్జాతం తదా మేనే పుత్ర మాత్మాన మేవ చ. 6

తా. దశరథుడు రాముని మాటలు విని అతనిని కౌగిలించుకొని శిరస్సుపై మూర్కొనెను. పరశురాముడు నిష్క్రమించిన వార్త విని మహారాజు ఆనందభరితుడై తాను, తన కుమారులు తిరిగి పుట్టినట్లుగా తలచెను.

శ్లో. చోదయామాస తాం సేనాం జగా మాశు తతః పురీమ్,
పతాకాధ్వజినీం రమ్యాం తూర్యోద్ఘుష్టనినాదితామ్. 7

శ్లో. సిక్తరాజపథాం రమ్యాం ప్రకీర్ణకుసుమోత్కరామ్,
రాజప్రవేశసుముఖైః పౌరై ర్మఙ్గళవాదిభిః. 8

శ్లో. సమ్పూర్ణాం ప్రావిశద్రాజా జనౌఘై స్సమలంకృతామ్,

తా. పిమ్మట దశరథుడు సైన్యమును ముందర నడచుటకై ఆదేశించెను. ప్రయాణము చేసి తొందరగా అయోధ్యా పట్టణమును చేరెను. ఆ పట్టణము చిన్న పెద్ద పతాకములతోను, రమణీయమైన తూర్యానాదములతోను ప్రతిధ్వనించుచుండెను. రాచబాటలను నీటితో తడిపి పూలను చల్లి పురజనులందరును మహారాజును దర్శించుటకై ఆనందముతో ఎదురుచూచుచుండిరి. మంగళవాద్యములు వాయించుచుండిరి.

శ్లో. పౌరైః ప్రత్యుద్గతో దూరం ద్విజైశ్చ పురవాసిభిః.

పుత్రై రనుగత శ్శ్రీమాౕ శ్రీమద్భిశ్చ మహాయశాః,
ప్రవివేశ గృహం రాజా హిమవత్సదృశం పునః. 9

తా. శ్రీమంతుడును, మహాయశస్వియు నగు దశరథుని శ్రీమంతులగు పుత్రులు అతనిని అనుసరించి వెళ్ళిరి. పురజనులు, బ్రాహ్మణులు దూరమునుండి ఎదుర్కొని స్వాగతము పలికిరి. ఈ విధముగా అయోధ్యలో ప్రవేశించి అతడు హిమవత్పర్వతముతో సమానమైన రాజగృహమును ప్రవేశించెను.

శ్లో. ననన్ద స్వజనై రాజా గృహే కామైః సుపూజితః, 10
కౌసల్యా చ సుమిత్రా చ కైకేయీ చ సుమధ్యమా.
వధూప్రతిగ్రహే యుక్తా యా శ్చాన్యా రాజయోషితః. 11

తా. బంధుజనులతో కూడి దశరథమహారాజు నానావిధ భోగ్యవస్తువులతో పూజింపబడి ఆనందించెను.

శ్లో. తత స్సీతాం మహాభాగా మూర్మిళాం చ యశస్వినీమ్,
కుశధ్వజసుతే తే చోభే జగృహు ర్నృపపత్నయః. 12

తా. అంతట మహారాజు ముప్వురు భార్యలు మహాసౌభాగ్యవతి యగు సీతను, కీర్తిమంతురాలగు ఊర్మిళను, మాండవీ శ్రుతకీర్తులను గుర్తించిరి.

శ్లో. మఙ్గళాలాపనై శ్చాపి శోభితాః క్షౌమవాససః,
దేవతాయతనా న్యాశు సర్వా స్తాః ప్రత్యపూజయన్. 13

తా. నవవధువు లందరును మంగళకరమగు వస్తువులను స్వీకరించి, పట్టుబట్టలను ధరించి గృహదైవములను పూజించిరి.

శ్లో. అభివా ద్యాభివాద్యాంశ్చ సర్వా రాజసుతా స్తదా,
స్వం స్వం గృహ మ థాసాద్య కుబేరభవనోపమమ్. 14

గోభి ర్ధనైశ్చ ధాన్యైశ్చ తర్పయిత్వా ద్విజోత్తమాౝ.
రేమిరే ముదితా స్సర్వా భర్తృభిస్సహితా రహః. 15

తా. అపుడు రాజపుత్రికలు వందనమాచరింపదగిన పెద్దలందరకును నమస్కరించి, కుబేర నివాస భవనముతో సరియైన తమ తమ రాజగృహములను చేరి గోధనధాన్యములను బ్రాహ్మణులకు దానము చేసి వారిని తృప్తిపరిచి, ఏకాంతమున పతులతోకూడి ఆనందముగా విహరించిరి.

శ్లో. కుమారాశ్చ మహాత్మానో వీర్యేణాప్రతిమా భువి,
కృతదారాః కృతాస్త్రాశ్చ సధనా స్ససుహృజ్జనాః,
శుశ్రూషమాణాః పితరం వర్తయన్తి నరర్షభాః. 16

తా. మహాత్ములును, పరాక్రమమందు భూలోకమున సాటిలేనివారును, అస్త్రశస్త్రములందు సమర్థులును, ధనము, మిత్రులు మొదలగు సంపదలతో కూడినవారును, మానవులలో శ్రేష్ఠులును అయిన రామలక్ష్మణభరత శత్రుఘ్నులు వివాహము చేసికొని దశరథునికి సేవలు చేయుచు ఆయన ఆజ్ఞను సదా పాటించుచుండిరి.

శ్లో. కస్య చిత్త్వథ కాలస్య రాజా దశరథ స్సుతమ్,
భరతం కైకయీపుత్ర మబ్రవీ ద్రఘునన్దనః. 17

తా. అటుపై కొంతకాలమునకు దశరథుడు కైకేయి పుత్రుడగు భరతునితో ఇట్లనెను.

శ్లో. అయం కేకయరాజస్య పుత్రో వసతి పుత్రక,
త్వాం నేతు మాగతో వీర యుధాజి న్మాతులస్తవ. 18

తా. కుమారా! భరతా! కేకయదేశరాజకుమారుడును, నీ మేనమామయునగు యుధాజిత్తు నిన్ను తోడ్కొని వెళ్ళుటకు వచ్చియున్నాడు.

శ్లో. ప్రార్థిత స్తేన ధర్మజ్ఞ మిథిలాయా మహం తథా,
ఋషిమధ్యే తు తస్య త్వం ప్రీతిం కర్తు మి హార్హసి. 19

తా. ధర్మము తెలిసినవాడవైన భరతా! మిథిలా నగరములో ఋషుల సమక్షములో అతడు నన్ను ఆ విధముగ ప్రార్థించియున్నాడు. అతనికి ఆనందమును కలిగింపుము.

శ్లో. శ్రుత్వా దశరథ స్యైత ద్భరతః కైకయీసుతః 20
అభివాద్య గురుం రామం పరిష్వజ్య చ లక్ష్మణమ్,
గమనాయాభిచక్రామ శత్రుఘ్నసహిత స్తదా. 21

తా. దశరథుని మాటలు విని భరతుడు తండ్రికిని, అన్నగారైన రామునకును నమస్కారము చేసి లక్ష్మణుని కౌగిలించుకొని, శత్రుఘ్నునితోకూడి ప్రయాణమునకు ఉపక్రమించెను.

శ్లో. ఆపృచ్ఛ్య పితరం శూరో రామం చాక్లిష్టకారిణమ్.
మాతౄశ్చాపి నరశ్రేష్ఠ శ్శత్రుఘ్నసహితో యయౌ. 22

తా. శూరుడును, మానవశ్రేష్ఠుడును అగు భరతుడు తండ్రి యొద్దను, సునాయాసముగ పనులు నిర్వర్తించు రాముని యొద్దను, మాతలయొద్దను సెలవు తీసికొని శత్రుఘ్నసమేతుడై బయలుదేరెను.

శ్లో. గతే తు భరతే రామో లక్ష్మణశ్చ మహాబలః,
పితరం దేవసంకాశం పూజయామా తు స్తదా. 23

తా. భరతుడు వెడలిన పిమ్మట రాముడును, బలశాలియగు లక్ష్మణుడును, దైవసమానుడగు తండ్రికి సేవలు చేయుచుండిరి.

శ్లో. పితు రాజ్ఞాం పురస్కృత్య పౌరకార్యాణి సర్వశః,
చకార రామో ధర్మాత్మా ప్రియాణి చ హితాని వ. 24

తా. ధర్మాత్ముడగు రాముడు దశరథుని ఆజ్ఞననుసరించి పురజనులకు ప్రియమైనవి, లాభకరమైనవి అగు కార్యములెన్నింటినో నిర్వర్తించెను.

శ్లో. మాతృభ్యో మాతృకార్యాణి కృత్వా పరమయన్త్రితః,
గురూణాం గురుకార్యాణి కాలేకాలేఽ న్వవైక్షత. 25

తా. రాముడు విధినియమములను సంపూర్ణముగ పాటించుచు, తన తల్లులకు చేయదగు కార్యములను సదా చేయుచు, ఆయా కాలములందు పెద్దలకు, పూజ్యులకు విధిగా చేయవలసిన పనులను పర్యవేక్షణ చేయుచుండెను.

శ్లో. ఏవం దశరథః ప్రీతో బ్రాహ్మణా నైగమా స్తథా,
రామస్య శీలవృత్తేన సర్వే విషయవాసినః. 26

తా. రాముని ఈ శీలమును, ప్రవర్తనను గమనించి దశరథుడు మిక్కిలిగ సంతసించెను. బ్రాహ్మణులును, నగరవాసులును, రాజ్యములోని ఎల్లరును సంతసించిరి.

శ్లో. తేషా మతియశా లోకే రామ స్సత్యపరాక్రమః,
స్వయంభూ రివ భూతానాం బభూవ గుణవత్తరః. 27

తా. లోకమునందు ఘన కీర్తి గలవాడును, నిజమైన పరాక్రమము కలవాడును, అతిశయించిన గుణములు కలవాడును అగు రాముడు తన రాజ్యములోని వారందరకు జీవులకు బ్రహ్మదేవుడెట్లో అట్లుండెను.

శ్లో. రామస్తు సీతయా సార్ధం విజహార బహూ నృతూ౯,
మనస్వీ తద్గత స్తస్యా నిత్యం హృది సమర్పితః. 28

తా. మంచి మనస్సుగల రాముడు సీతాదేవియందే హృదయమును నిలిపెను. ఆమెయు తన హృదయమందు సదా రామునే కొలుచుచుండెను. ఈ విధముగ పరస్పరాసక్తులై సీతారాములు ఎన్నో వసంతములు విహరించిరి.

శ్లో. ప్రియా తు సీతా రామస్య దారాః పితృకృతా ఇతి,
గుణా ద్రూపగుణాచ్చాపి ప్రీతి ర్భూయోఽభ్యవర్ధత. 29

తా. దశరథునిచే అంగీకరింపబడిన బాంధవ్యమగుటచేతను రామునకు సీతపై ప్రేమ అతిశయంచెను. ఆమె తనయొక్క సద్గుణములచేతను, అతిలోక సౌందర్యముచేతను రాముని ప్రేమ మిక్కిలిగ వృద్ధిచెందెను.

శ్లో. తస్యాశ్చ భర్తా ద్విగుణం హృదయే పరివర్తతే,
అంతర్జాతమపి వ్యక్త మాఖ్యాతి హృదయం హృదా. 30

తా. సీత మదిలోవ భర్తయైన రాముడు ద్విగుణీకృతముగ ప్రవర్తించుచుండెను. అంతర్గతముగ నున్న భావములు కూడ ఒకరి హృదయము మరొకరి హృదయముతో స్పష్టముగ వ్యక్తపరచుచుండెను.

శ్లో. తస్య భూయో విశేషేణ మైథిలీ జనకాత్మజా,
దేవతాభి స్సమా రూపే సీతా శ్రీరివ రూపిణీ. 31

తా. అందములో దేవతా స్త్రీని పోలియున్నదియు, లక్ష్మీదేవి వలె అపూర్వ సౌందర్యము కలదియు, సీత రూపమును దాల్చిన మహాలక్ష్మివలె నున్నదియు, మిథిలా నగరమున జన్మించినదియు, జనకమహారాజు కుమార్తెయు అగు సీత రాముని హృదయములో మిక్కిలి ఎక్కువగ సంచరించుచుండెను.

శ్లో. తయా స రాజర్షిసుతో ఽభిరామయా
సమేయివా నుత్తమరాజకన్యయా,
అతీవ రామ శ్శుశుభేఽతికామయా
విభు శ్శ్రియా విష్ణు రి వామరేశ్వరః. 32

తా. దశరథ మహారాజు పుత్రుడగు రాముడు మనోహరురాలగు జనక

మహారాజు కౌమార్తెయగు సీతతో కలిసినవాడై, ఆనందించుచు, మహాలక్ష్మితో గూడిన దేవతా ప్రభువైన మహావిష్ణువు వలె విరాజిల్లెను.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
శ్రీమద్వాల్మీకీయే, చతుర్వింశత్సహస్రికాయాం
సంహితాయాం, బాలకాణ్డే, సప్తసప్తతితమస్సర్గః

శ్రీమద్రామాయణమునందు బాలకాండములో
డెబ్బది ఏడవ సర్గము సమాప్తము.



ఓం శ్రీర్జయతు

ఆపదా మపహర్తారం దాతారం సర్వసమ్పదామ్,
లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమా మ్యహమ్.

శ్రీ సీతా లక్ష్మణ భరత శత్రుఘ్న హనూమ త్సమేత
శ్రీ రామచన్ద్ర పరబ్రహ్మణే నమః॥

వాల్మీకి ప్రోక్తే

# శ్రీమద్రామాయణే సున్దరకాణ్డే

## 1. ప్రథమ స్సర్గః

తతో రావణనీతాయా స్సీతాయా శ్శత్రుకర్శనః,
ఇయేష పద మన్వేష్టుం చారణాచరితే పథి. 1

దుష్కరం నిష్ప్రతిద్వన్ద్వం చికీర్ష న్కర్మ వానరః,
సముదగ్రశిరో గ్రీవో గవామ్పతి రి వాబభౌ. 2

అథ వైడూర్యవర్ణేషు శాద్వలేషు మహాబలః,
ధీర స్సలిలకల్పేషు విచచార యథాసుఖమ్. 3

ద్విజా న్వితాసయ న్ధీమా నురసా పాదపాన్ హరన్,
మృగాంశ్చ సుబహూ న్నిఘ్నన్ ప్రవృద్ధ ఇవ కేసరీ. 4

నీలలోహితమాఞ్జిష్ఠపత్రవర్ణై స్సితాసితైః,
స్వభావవిహితై శ్చిత్రై ర్ధాతుభి స్సమలఙ్కృతమ్. 5

కామరూపిభి రావిష్ట మభీక్ష్ణం సపరిచ్ఛదైః,
యక్ష కింనర గన్ధర్వై ర్దేవకల్పైశ్చ పన్నగైః. 6

స తస్య గిరివర్యస్య తలే నాగవరాయుతే,
తిష్ఠ న్కపివర స్తత్ర హ్రదే నాగ ఇ వాబభౌ. 7

స సూర్యాయ మహేన్ద్రాయ పవనాయ స్వయంభువే,
భూతేభ్య శ్చాఞ్జలిం కృత్వా చకార గమనే మతిమ్. 8

అఞ్జలిం ప్రాఙ్ముఖః కుర్వ న్పవనా యాత్మయోనయే,
తతోఽభివవృధే గన్తుం దక్షిణో దక్షిణాం దిశమ్. 9

ప్లవఙ్గప్రవరై ర్దృష్టః ప్లవనే కృతనిశ్చయః,
వవృధే రామవృద్ధ్యర్థం సముద్ర ఇవ పర్వసు. 10

నిష్ప్రమాణశరీరస్స న్విలఙ్ఘయిషు రర్ణవమ్,
బాహుభ్యాం పీడయామాస చరణాభ్యాం చ పర్వతమ్. 11

స చచా లాచలశ్చాపి ముహూర్తం కపిపీడితః,
తరూణాం పుష్పితాగ్రాణాం సర్వం పుష్ప మశాతయత్. 12

తేన పాదపముక్తేన పుష్పౌఘేణ సుగన్ధినా,
సర్వత స్సంవృత శ్శైలో బభౌ పుష్పమయో యథా. 13

తేన చోత్తమవీర్యేణ పీడ్యమాన స్స పర్వతః
సలిలం సంప్రసుస్రావ మదం మత్త ఇవ ద్విపః. 14

పీడ్యమానస్తు బలినా మహేన్ద్ర స్తేన పర్వతః,
రీతీ ర్నిర్వర్తయామాస కాఞ్చనాఞ్జనరాజతీః. 15

ముమోచ చ శిలా శ్శైలో విశాలా స్సమనశ్శిలాః,
మధ్యమే నార్చిషా జుష్టో ధూమరాజీ రివాఽనలః. 16

గిరిణా పీడ్యమానేన పీడ్యమానాని సర్వతః,
గుహావిష్టాని భూతాని వినేదు ర్వికృతై స్స్వరైః. 17

స మహాసత్త్వ సన్నాద శ్శైలపీడానిమిత్తజః,
పృథివీం పూరయామాస దిశ శ్చోపవనాని చ. 18

శిరోభిః పృథుభి స్సర్పా వ్యక్తస్వస్తికలక్షణై,
వమన్తః పావకం ఘోరం దదంశు ర్దశనై శ్శిలాః. 19

తా స్తదా సవిషై ర్దష్టాః కుపితై స్తై ర్మహాశిలాః,
జజ్వలుః పావకోద్దీప్తా బిభిదుశ్చ సహస్రధా. 20

యాని చౌషధజాలాని తస్మి న్జాతాని పర్వతే,
విషఘ్నా న్యపి నాగానాం న శేకు శ్శమితం విషమ్. 21

భిద్యతేఽయం గిరి ర్భూతై రితి మత్వా తపస్వినః,
త్రస్తా విద్యాధరా స్తస్మా దుత్పేతుః స్త్రీగణై స్సహ. 22

పానభూమిగతం హిత్వా హైమ మాసవభాజనమ్,
పాత్రాణి చ మహార్హాణి కరకాం శ్చ హిరణ్మయాన్. 23

లేహ్యా నుచ్చావచాన్ భక్ష్యాన్ మాంసాని వివిధాని చ,
ఆర్షభాణి చ చర్మాణి ఖడ్గాంశ్చ కనకత్సరూన్. 24

కృతకణ్ఠగుణాః క్షీబా రక్తమాల్యానులేపనాః,
రక్తాక్షాః పుష్కరాక్షా శ్చ గగనం ప్రతిపేదిరే. 25

హారనూపురకేయూరపారిహార్యధరాః స్త్రియః,
విస్మితా స్సస్మితా స్తస్థు రాకాశే రమణైః సహ. 26

దర్శయన్తో మహావిద్యాం విద్యాధరమహర్షయః,
సహితా స్తస్థు రాకాశే వీక్షాంచక్రు శ్చ పర్వతమ్. 27

శుశ్రువు శ్చ తదా శబ్ద మృషీణాం భావితాత్మనామ్,
చారణానాం చ సిద్ధానాం స్థితానాం విమలేఽమ్బరే. 28

ఏష పర్వతసఙ్కాశో హనూమా న్మారుతాత్మజః,
తితీర్షతి మహావేగం సముద్రం మకరాలయమ్. 29

రామార్థం వానరార్థం చ చికీర్ష న్కర్మ దుష్కరమ్,
సముద్రస్య పరం పారం దుష్ప్రాపం ప్రాప్తు మిచ్ఛతి. 30

ఇతి విద్యాధరా శ్శ్రుత్వా వచ స్తేషాం మహాత్మనామ్,
త మప్రమేయం దదృశుః పర్వతే వానరర్షభమ్. 31

దుధువే చ స రోమాణి చకమ్పే చాచలోపమః,
ననాద సుమహానాదం సుమహా నివ తోయదః. 32

ఆనుపూర్వ్యేణ వృత్తం చ లాఙ్గూలం రోమభి శ్చితమ్,
ఉత్పతిష్య న్విచిక్షేప పక్షిరాజ ఇ వోరగమ్. 33

తస్య లాఙ్గూల మావిద్ధ మాత్తవేగస్య పృష్ఠతః,
దదృశే గరుడేనేవ హ్రియమాణో మహోరగః. 34

బాహూ సం స్తమ్భయామాస మహాపరిఘసన్నిభౌ,
ససాద చ కపిః కట్యాం చరణౌ సఙ్చుకోచ చ. 35

సంపృత్య చ భుజౌ శ్రీమాన్ తథైవ చ శిరోధరామ్,
తేజ స్సత్త్వం తథా వీర్య మావివేశ స వీర్యవాన్. 36

మార్గ మాలోకయన్ దూరా దూర్ధ్వం ప్రణిహితేక్షణః,
రురోధ హృదయే ప్రాణా నాకాశ మవలోకయన్. 37

పద్భ్యాం దృఢ మవస్థానం కృత్వా స కపికుఞ్జరః,
నికుఞ్చ్య కర్ణౌ హనుమా నుత్పతిష్య న్మహాబలః. 38

వానరాన్ వానరశ్రేష్ఠ ఇదం వచన మబ్రవీత్,
యథా రాఘవనిర్ముక్త శ్శర శ్శ్వసనవిక్రమః. 39

గచ్ఛే త్తద్వ ద్గమిష్యామి లఙ్కాం రావణపాలితామ్,
న హి ద్రక్ష్యామి యది తాం లఙ్కాయాం జనకాత్మజామ్.

అనేనైవ హి వేగేన గమిష్యామి సురాలయమ్,
యది వా త్రిదివే సీతాం న ద్రక్ష్యా మ్యకృతశ్రమః. 41

బద్ధ్వా రాక్షసరాజాన మానయిష్యామి రావణమ్,
సర్వథా కృతకార్యోఽహ మేష్యామి సహ సీతయా. 42

ఆనయిష్యామి వా లఙ్కాం సముత్పాట్య సరావణామ్,
ఏవ ముక్త్వా తు హనుమా న్వానరా న్వానరోత్తమః. 43

ఉత్పపా తాథ వేగేన వేగవా నవిచారయన్,
సుపర్ణ మివ చాత్మానం మేనే స కపికుఞ్జరః. 44

సముత్పతతి తస్మిం స్తు వేగా త్తే నగరోహిణః,
సంహృత్య విటపాన్ సర్వా న్సముత్పేతు స్సమన్తతః. 45

స మత్తకోయష్టిభకాన్ పాదపా న్పుష్పశాలినః,
ఉద్వహ న్నూరువేగేన జగామ విమలేఽమ్బరే. 46

ఊరువేగోద్ధతా వృక్షా ముహూర్తం కపి మన్వయుః,
ప్రస్థితం దీర్ఘ మధ్వానం స్వబన్ధు మివ బాన్ధవాః. 47

త మూరువేగోన్మథితా స్సాలా శ్చాన్యే నగోత్తమాః,
అనుజగ్ము ర్హనూమన్తం సైన్యా ఇవ మహీపతిమ్. 48

సుపుష్పితాగ్రై ర్బహుభిః పాదపై రన్వితః కపిః,
హనుమా న్పర్వతాకారో బభూ వాద్భుతదర్శనః. 49

సారవన్తోఽథ యే వృక్షా న్యమజ్జ న్లవణామ్భసి,
భయా దివ మహేన్ద్రస్య పర్వతా వరుణాలయే. 50

స నానాకుసుమైః కీర్ణః కపి స్సాఙ్కురకోరకైః,
శుశుభే మేఘసఙ్కాశః ఖద్యోతై రివ పర్వతః. 51

విముక్తా స్తస్యవేగేన ముక్త్వా పుష్పాణి తే ద్రుమాః,
అవశీర్యన్త సలిలే నివృత్తా స్సుహృదో యథా. 52

లఘుత్వే నోపపన్నం తద్విచిత్రం సాగరేఽపతత్,
ద్రుమాణాం వివిధం పుష్పం కపివాయుసమీరితమ్. 53

తారాశత మి వాకాశం ప్రబభౌ స మహార్ణవః,
పుష్పౌఘే నానువిద్ధేన నానావర్ణేన వానరః. 54

బభౌ మేఘ ఇ వాకాశే విద్యుద్గణవిభూషితః,
తస్యవేగసమాధూతైః పుష్పై స్తోయ మదృశ్యత. 55

తారాభి రభిరామాభి రుదితాభి రి వామ్బరమ్,
త స్యామ్బరగతా బాహూ దదృశాతే ప్రసారితౌ. 56

పర్వతాగ్రా ద్వినిష్క్రాన్తౌ పఞ్చాస్యా వివ పన్నగౌ,
పిబ న్నివ బభౌ చాపి సోర్మిమాలం మహార్ణవమ్. 57

పిపాసు రివ చాకాశం దదృశే స మహాకపిః,
తస్యవిద్యుత్ప్రభాకారే వాయుమార్గానుసారిణః. 58

నయనే విప్రకాశేతే పర్వతస్థా వి వానలౌ,
పిఙ్గే పిఙ్గాక్షముఖ్యస్య బృహతీ పరిమణ్డలే. 59

చక్షుషీ సమ్ప్రకాశేతే చన్ద్రసూర్యా వి వోదితౌ,
ముఖం నాసికయా తస్య తామ్రయా తామ్ర మాబభౌ. 60

సన్ధ్యయా సమభిస్పృష్టం యథా తత్సూర్యమణ్డలమ్,
లాఙ్గూలం చ సమావిద్ధం ప్లవమానస్య శోభతే. 61

అమ్బరే వాయుపుత్రస్య శక్రధ్వజ ఇ వోచ్ఛ్రితః,
లాఙ్గూలచక్రేణ మహా౯ శుక్లదంష్ట్రోఽనిలాత్మజః. 62

వ్యరోచత మహాప్రాజ్ఞః పరివేషీవ భాస్కరః,
స్ఫిగ్దేశే నాభితామ్రేణ రరాజ స మహాకపిః. 63

మహతా దారితే నేవ గిరి ర్గైరికధాతునా,
తస్య వానరసింహస్య ప్లవమానస్య సాగరమ్. 64

కక్షాన్తరగతో వాయు ర్జీమూత ఇవ గర్జతి,
ఖే యథా నిపత న్త్యుల్కా హ్యుత్తరాన్తా ద్వినిస్సృతాః. 65

దృశ్యతే సానుబన్ధాచ తథా స కపికుఞ్జరః,
పతత్పతఙ్గసఙ్కాశో వ్యాయత శ్శుశుభే కపిః. 66

ప్రవృద్ధ ఇవ మాతఙ్గః కక్ష్యయా బద్ధమానయా,
ఉపరిష్టా చ్ఛరీరేణ ఛాయయా చావగాఢయా. 67

సాగరే మారుతావిష్టా నౌ రి వాసీ త్తదా కపిః,
యం యం దేశం సముద్రస్య జగామ స మహాకపిః. 68

స స తస్యోరువేగన సోన్మాద ఇవ లక్ష్యతే,
సాగర స్యోర్మిజాలానా మురసా శైలవర్ష్మణామ్. 69

అభిఘ్నం స్తు మహావేగః పుప్లువే స మహాకపిః,
కపివాతశ్చ బలవాన్ మేఘవాతశ్చ నిస్సృతః. 70

సాగరం భీమనిర్ఘోషం కమ్పయామాసతు ర్భృశమ్,
వికర్ష న్నూర్మిజాలాని బృహన్తి లవణామ్భసి. 71

పుప్లువే కపిశార్దూలో వికిర న్నివ రోదసీ,
మేరుమన్దరసఙ్కాశా నుద్ధతాన్ స మహార్ణవే. 72

అతిక్రామ న్మహావేగ స్తరఙ్గాన్ గణయ న్నివ,
తస్య వేగసముద్ధూతం జలం సజలదం తదా. 73

అమ్బరస్థం విబభ్రాజ శారదాభ్ర మివాఽతతమ్,
తిమినక్రఝషాః కూర్మా దృశ్యన్తే వివృతా స్తదా. 74

వస్త్రాపకర్షణే నేవ శరీరాణి శరీరిణామ్,
ప్లవమానం సమీ క్ష్యాథ భుజఙ్గా స్సాగరాలయాః. 75

వ్యోమ్ని తం కపిశార్దూలం సుపర్ణ ఇతి మేనిరే,
దశయోజనవిస్తీర్ణా త్రింశద్యోజన మాయతా. 76

ఛాయా వానరసింహస్య జలే చారుతరాఽభవత్,
శ్వేతాభ్రఘనరాజీవ వాయుపుత్త్రానుగామినీ. 77

తస్య సా శుశుభే ఛాయా వితతా లవణామ్భసి,
శుశుభే స మహాతేజా మహాకాయో మహాకపిః. 78

వాయుమార్గే నిరాలమ్బే పక్షవా నివ పర్వతః,
యే నాసౌ యాతి బలవాన్ వేగేన కపికుఞ్జరః. 79

తేన మార్గేణ సహసా ద్రోణీకృత ఇ వార్ణవః,
ఆపాతే పక్షిసఙ్ఘానాం పక్షిరాజ ఇవ వ్రజన్. 80

హనుమాన్ మేఘజాలాని ప్రకర్షన్ మారుతో యథా,
పాణ్డురారుణవర్ణాని నీల మాఞ్జిష్ఠకాని చ. 81

కపినా కృష్యమాణాని మహాభ్రాణి చకాశిరే,
ప్రవిశ న్నభ్రజాలాని నిష్పతంశ్చ పునఃపునః. 82

ప్రచ్ఛన్న శ్చ ప్రకాశ శ్చ చన్ద్రమా ఇవ లక్ష్యతే,
ప్లవమానం తు తం దృష్ట్వా ప్లవఙ్గం త్వరితం తదా. 83

ప్రవర్షుః పుష్పవర్షాణి దేవ గన్ధర్వ చారణాః,
తతాప న హితం సూర్యః ప్లవన్తం వానరోత్తమమ్. 84

సిషేవే చ తదా వాయూ రామకార్యార్థసిద్ధయే,
ఋషయ స్తుష్టువు శ్చైనం ప్లవమానం విహాయసా. 85

జగుశ్చ దేవగన్ధర్వాః ప్రశంసన్తో మహౌజసమ్,
నాగా శ్చ తుష్టువు ర్యక్షా రక్షాంసి విబుధాః ఖగాః. 86

ప్రేక్ష్య సర్వే కపివరం సహసా విగతక్లమమ్,
తస్మిన్ ప్లవగశార్దూలే ప్లవమానే హనూమతి. 87

ఇక్ష్వాకు కుల మానార్థీ చిన్తయామాస సాగరః,
సాహాయ్యం వానరేన్ద్రస్య యది నాహం హనూమతః. 88

కరిష్యామి భవిష్యామి సర్వవాచ్యో వివక్షతామ్,
అహ మిక్ష్వాకునాథేన సగరేణ వివర్ధితః. 89

ఇక్ష్వాకుసచివ శ్చాయం నావసీదితు మర్హతి,
తథా మయా విధాతవ్యం విశ్రమేత యథా కపిః. 90

శేషం చ మయి విశ్రాన్త స్సుఖే నాతిపతిష్యతి,
ఇతి కృత్వా మతిం సాధ్వీం సముద్ర శ్ఛన్న మమ్భసి. 91

హిరణ్యనాభం మైనాక మువాచ గిరిసత్తమమ్,
త్వ మిహ సురసఙ్ఘానాం పాతాళతలవాసినామ్. 92

దేవరాజ్ఞా గిరిశ్రేష్ఠ పరిఘ స్సన్నివేశితః,
త్వ మేషాం జాతవీర్యాణాం పున రేవోత్పతిష్యతామ్. 93

పాతాళ స్యాప్రమేయస్య ద్వార మావృత్య తిష్ఠసి,
తిర్య గూర్ధ్వ మధశ్చైవ శక్తి స్తే శైల వర్ధితుమ్. 94

తస్మా త్సంచోదయామి త్వా ముత్తిష్ఠ నగసత్తమ,
స ఏష కపిశార్దూల స్త్వా ముపర్యేతి వీర్యవాన్. 95

హనుమా న్రామకార్యార్థం భీమకర్మా ఖ మాప్లుతః,
అస్య సాహ్యం మయా కార్య మిక్ష్వాకుకులవర్తినః. 96

మమ హీక్ష్వాకవః పూజ్యాః పరం పూజ్యతమా స్తవ,
కురు సాచివ్య మస్మాకం న నః కార్య మతిక్రమేత్. 97

కర్తవ్య మకృతం కార్యం సతాం మన్యు ముదీరయేత్,
సలిలా దూర్ధ్వ ముత్తిష్ఠ తిష్ఠ త్వేష కపి స్త్వయి. 98

అస్మాక మతిథి శ్చైవ పూజ్య శ్చ ప్లవతాంవరః,
చామీకరమహానాభ దేవ గన్ధర్వ సేవిత. 99

హనుమాం స్త్వయి విశ్రాన్త స్తత శ్శేషం గమిష్యతి,
కాకుత్స్థ స్యానృశంస్యం చ మైథిల్యాశ్చ వివాసనమ్. 100

శ్రమం చ ప్లవగేన్ద్రస్య సమీ క్ష్యోత్థాతు మర్హసి,
హిరణ్యానాభో మైనాకో నిశమ్య లవణామ్బసః. 101

ఉత్పపాత జలా త్తూర్ణం మహాద్రుమ లతాయుతః,
స సాగరజలం భిత్వా బభూ వాభ్యుత్థిత స్తదా. 102

యథా జలధరం భిత్వా దీప్తరశ్మి ర్దివాకరః,
స మహాత్మా ముహూర్తేన సర్వత స్సలిలావృతః. 103

దర్శయామాస శృఙ్గాణి సాగరేణ నియోజితః
శాతకుమ్భమయై శ్శృఙ్గై స్స కిన్నర మహోరగైః. 104

ఆదిత్యోదయసఙ్కాశై రాలిఖద్భి రి వామ్బరమ్,
తప్తజామ్బూనదై శ్శృఙ్గైః పర్వతస్య సముత్థితైః. 105

ఆకాశం శత్రుసఙ్కాశ మభవ త్కాఞ్చనప్రభమ్,
జాతరూపమయై శ్శృఙ్గై ర్భ్రాజమానై స్స్వయంప్రభైః. **106**

ఆదిత్యశతసఙ్కాశ స్సోఽభవ ద్గిరిసత్తమః,
త ముత్థిత మసంగేన హనూమా నగ్రతస్స్థితమ్. **107**

మధ్యే లవణతోయస్య విఘ్నోఽయ మితి నిశ్చితః,
స తముచ్ఛ్రిత మత్యర్థం మహావేగో మహాకపిః. **108**

ఉరసా పాతయామాస జీమూత మివ మారుతః,
స తథా పాతిత స్తేన కపినా పర్వతోత్తమః. **109**

బుద్ధ్వా తస్య కపే ర్వేగం జహర్ష చ ననన్ద చ,
త మాకాశగతం వీర మాకాశే సముపస్థితః. **110**

ప్రీతో హృష్టమనా వాక్య మబ్రవీ త్పర్వతః కపిమ్,
మానుషం ధారయ న్రూప మాత్మన శ్శిఖరే స్థితః. **111**

దుష్కరం కృతవా న్కర్మ త్వ మిదం వానరోత్తమ,
నిపత్య మమ శృఙ్గేషు విశ్రమస్వ యథాసుఖమ్. **112**

రాఘవస్యకులే జాతై రుదధిః పరివర్ధితః,
స త్వాం రామహితే యుక్తం ప్రత్యర్చయతి సాగరః. **113**

కృతే చ ప్రతికర్తవ్య మేష ధర్మ స్సనాతనః
సోఽయం త త్ప్రతీకారార్థీ త్వత్త స్సమ్మాన మర్హతి. **114**

త్వన్నిమిత్త మనే నాహం బహుమానా త్ప్రచోదితః,
తిష్ఠ త్వం కపిశార్దూల మయి విశ్రమ్య గమ్యతామ్. **115**

తద్ద్వితీయం హనుమతో దృష్ట్వా కర్మ సుదుష్కరమ్,
యోజనానాం శతం చాపి కపి రేష సమాప్లుతః,
తవ సానుషు విశ్రాన్త శ్శేషం ప్రక్రమతా మితి. 116

త దిదం గన్ధవ త్స్వాదు కన్దమూలఫలం బహు,
త దాస్వాద్య హరిశ్రేష్ఠ విశ్రాన్తోఽనుగమిష్యసి. 117

అస్మాక మపి సమ్బన్ధః కపిముఖ్య త్వయాఽస్తి వై,
ప్రఖ్యాత స్త్రిషులోకేషు మహాగుణపరిగ్రహః. 118

వేగవన్తః ప్లవన్తో యే ప్లవగా మారుతాత్మజ,
తేషాం ముఖ్యతమం మన్యే త్వా మహం కపికుఞ్జర. 119

అతిథిః కిల పూజార్హఃప్రాకృతోఽపి విజానతా,
ధర్మం జిజ్ఞాసమానేన కిం పున స్త్వాదృశో మహాన్. 120

త్వం దేహి దేవవరిష్ఠస్య మారుతస్య మహాత్మనః,
పుత్ర స్తస్యైవ వేగేన సదృశః కపికుఞ్జరః. 121

పూజితే త్వయి ధర్మజ్ఞ పూజాం ప్రాప్నోతి మారుతః,
తస్మా త్త్వం పూజనీయో మే శృణు చాప్యత్ర కారణమ్.

పూర్వం కృతయుగే తాత పర్వతాః పక్షిణోఽభవన్,
తేఽభిజగ్ము ర్దిశ స్సర్వా గరుడానిలవేగినః. 123

తత స్తేషు ప్రయాతేషు దేవసఙ్ఘా స్సహర్షిభిః,
భూతాని చ భయం జగ్ము స్తేషాం పతనశఙ్కయా. 124

తతః క్రుద్ధ స్సహస్రాక్షః పర్వతానాం శతక్రతుః,
పక్షాన్ చిచ్ఛేద వజ్రేణ తత్ర తత్ర సహస్రశః. 125

స మా ముపాగతః క్రుద్ధో వజ్ర ముద్యమ్య దేవరాట్,
తతోఽహం సహసా క్షిప్త శ్శ్వసనేన మహాత్మనా. 126

అస్మి న్లవణతోయే చ ప్రక్షిప్తః ప్లవగోత్తమ,
గుప్తపక్షసమగ్ర శ్చ తవ పిత్రాఽభిరక్షితః. 127

తతోఽహం మానయామి త్వాం మాన్యో హి మమ మారుతః
త్వయా మే హ్యేష సమ్బన్ధః కపిముఖ్య మహాగుణః. 128

అస్మి న్నేవం గతే కార్యే సాగరస్య మమైవ చ,
ప్రీతిం ప్రీతిమనాః కర్తుం త్వ మర్హసి మహాకపే. 129

శ్రమం మోక్షయ పూజాం చ గృహాణ కపిసత్తమ,
ప్రీతిం చ బహుమన్యస్వ ప్రీతోఽస్మి తవ దర్శనాత్. 130

ఏవ ముక్తః కపిశ్రేష్ఠ స్తం నగోత్తమ మబ్రవీత్,
ప్రీతోఽస్మి కృత మాతిథ్యం మన్యు రేషోఽపనీయతామ్.

త్వరతే కార్యకాలో మే అహ శ్చాప్యతివర్తతే,
ప్రతిజ్ఞా చ మయా దత్తా న స్థాతవ్య మిహాన్తరే. 132

ఇత్యుక్త్వా పాణినా శైల మాలభ్య హరిపుఙ్గవః,
జగా మాకాశ మావిశ్య వీర్యవాన్ ప్రహస న్నివ. 133

స పర్వత సముద్రాభ్యాం బహుమానా దవేక్షితః,
పూజిత శ్చోపపన్నాభి రాశీర్భి రనిలాత్మజః. 134

అథోర్ధ్వం దూర ముత్ప్లుత్య హిత్వా శైలమహార్ణవౌ,
పితుః పన్థాన మాస్థాయ జగామ విమలేఽమ్బరే. 135

భూయ శ్చోర్ధ్వగతిం ప్రాప్య గిరిం త మవలోకయన్,
వాయుసూను ర్నిరాలమ్బే జగామ విమలేఽమ్బరే. 136

త ద్ద్వితీయం హనుమతో దృష్ట్వా కర్మ సుదుష్కరమ్,
ప్రశశంసు స్సురా స్సర్వే సిద్ధాశ్చ పరమర్షయః. 137

దేవతా శ్చాభవ న్హృష్టా స్తత్రస్థా స్తస్య కర్మణా,
కాఞ్చనస్య సునాభస్య సహస్రాక్ష శ్చ వాసవః. 138

ఉవాచ వచనం ధీమాన్ పరితోషా త్సగద్గదమ్,
సునాభం పర్వతశ్రేష్ఠ వ స్స్వయమేవ శచీపతిః. 139

హిరణ్యనాభశైలేన్ద్ర పరితుష్టోఽస్మి తే భృశమ్,
అభయం తే ప్రయచ్ఛామి తిష్ఠ సౌమ్య! యథాసుఖమ్. 140

సాహ్యం కృతం తే సుమహ ద్విక్రాన్తస్య హనూమతః,
క్రమతో యోజనశతం నిర్భయస్య భయే సతి. 141

రామ స్యైవ హి దూత్యేన యాతి దాశరథే ర్హరిః,
సత్క్రియాం కుర్వతా తస్య తోషితోఽస్మి దృఢం త్వయా.

తతః ప్రహర్ష మగమ ద్విపులం పర్వతోత్తమః
దేవతానాం పతిం దృష్ట్వా పరితుష్టం శతక్రతుమ్. 143

స వై దత్తవర శ్శైలో బభూ వావస్థిత స్తదా,
హనుమాం శ్చ ముహూర్తేన వ్యతిచక్రామ సాగరమ్. 144

తతో దేవా స్సగన్ధర్వా స్సిద్ధాశ్చ పరమర్షయః,
అబ్రువన్ సూర్యసఙ్కాశాం సురసాం నాగమాతరమ్. 145

అయం వాతాత్మజ శ్శ్రీమాన్ ప్లవతే సాగరోపరి,
హనుమా న్నామ తస్య త్వం ముహూర్తం విఘ్న మాచర.
రాక్షసం రూప మాస్థాయ సుఘోరం పర్వతోపమమ్,
దంష్ట్రాకరాళం పిఙ్గాక్షం వక్త్రం కృత్వా నభస్సమమ్. 147
బల మిచ్ఛామహే జ్ఞాతుం భూయ శ్చాస్య పరాక్రమమ్,
త్వాం విజేష్య త్యుపాయేన విషాదం వా గమిష్యతి. 148
ఏవ ముక్తా తు సా దేవీ దైవతై రభిసత్కృతా,
సముద్రమధ్యే సురసా బిభ్రతీ రాక్షసం వపుః. 149
వికృతం చ విరూపం చ సర్వస్య చ భయావహమ్,
ప్లవమానం హనూమన్త మావృ త్యేద మువాచ హ. 150
మమ భక్షః ప్రదిష్ట స్త్వ మీశ్వరై ర్వానరర్షభ,
అహం త్వాం భక్షయిష్యామి ప్రవి శేదం మమాననమ్. 151
ఏవ ముక్త స్సురసయా ప్రాఞ్జలి ర్వానరర్షభః,
ప్రహృష్టవదన శ్శ్రీమా నిదం వచన మబ్రవీత్. 152
రామో దాశరథి ర్నామ ప్రవిష్టో దణ్డకావనమ్,
లక్ష్మణేన సహభ్రాత్రా వైదేహ్యా చాపి భార్యయా. 153
అన్యకార్యవిషక్తస్య బద్ధవైరస్య రాక్షసైః,
తస్య సీతా హృతా భార్యా రావణేన యశస్వినీ. 154
తస్యా స్సకాశం దూతోఽహం గమిష్యే రామశాసనాత్,
కర్తు మర్హసి రామస్య సాహ్యం విషయవాసిని. 155

అథవా మైథిలీం దృష్ట్వా రామం చాక్లిష్టకారిణమ్,
ఆగమిష్యామి తే వక్త్రం సత్యం ప్రతిశృణోమి తే. 156

ఏవ ముక్తా హనుమతా సురసా కామరూపిణీ,
అబ్రవీ న్నాతివర్తే న్మాం కశ్చి దేష వరో మమ. 157

(తం ప్రయాన్తం సముద్వీక్ష్య సురసా వాక్య మబ్రవీత్,
బలం జిజ్ఞాసమానా వై నాగమాతా హనూమతః. 1

ప్రవిశ్య వదనం మేஉద్య గన్తవ్యం వానరోత్తమ,
వర ఏష పురా దత్తో మమ ధా త్రేతి సత్వరా. 2

వ్యాదాయ విపులం వక్త్రం స్థితా సా మారుతేః పురః,
ఏవ ముక్త స్సురసయా క్రుద్ధో వానరపుఙ్గవః. 3

అబ్రవీ త్కురు వై వక్త్రం యేన మాం విషహిష్యసే,
ఇత్యుక్త్వా సురసాం క్రుద్ధో దశయోజన మాయతా. 4

దశయోజనవిస్తారో బభూవ హనుమాం స్తదా,
తం దృష్ట్వా మేఘసఙ్కాశం దశయోజన మాయతమ్. 5

చకార సురసా చాస్యం వింశద్యోజన మాయతమ్,
హనుమాం స్తు తతఃక్రుద్ధ స్త్రింశద్యోజన మాయతః. 6

చకార సురసా వక్త్రం చత్వారింశ త్త థోచ్ఛ్రితమ్,
బభూవ హనుమా న్వీరః పఞ్చాశ ద్యోజనోచ్ఛ్రితః. 7

చకార సురసా వక్త్రం షష్టియోజన మాయతమ్,
తథైవ హనుమా న్వీర స్సప్తతీ యోజనోచ్ఛ్రితః. 8

చకార సురసా వక్త్ర మశీతీయోజనామతమ్,
హనుమా నచలప్రఖ్యో నవతీయోజనో(చ్ఛ్రితః,
చకార సురసా వక్త్రం శతయోజన మాయతమ్. 9

తద్దృష్ట్వా వ్యాదితం వాయుపుత్త్ర స్సుబుద్ధిమాన్,
దీర్ఘజిహ్వాం సురసయా సుఘోరం నరకోపమమ్).
సుసంక్షి ప్యాత్మనః కాయం బభూ వాఙ్గుష్ఠమాత్రకః. 158

సోఽభిప త్యాశు తద్వక్త్రం నిష్పత్య చ మహాజవః,
అన్తరిక్షే స్థిత శ్శ్రీమా నిదం వచన మబ్రవీత్. 159

ప్రవిష్టోఽస్మి హి తే వక్త్రం దాక్షాయణి నమోఽస్తు తే,
గమిష్యే యత్ర వేదేహీ సత్య శ్చాసీ ద్వర స్తవ. 160

తం దృష్ట్వా వదనా న్ముక్తం చన్ద్రం రాహుముఖా దివ,
అబ్రవీ త్సురసా దేవీ స్వేనరూపేణ వానరమ్. 161

అర్థసిద్ధ్యై హరిశ్రేష్ఠ గచ్ఛ సౌమ్య యథాసుఖమ్,
సమానయస్వ వైదేహీ రాఘవేణ మహాత్మనా. 162

త త్తృతీయం హనుమతో దృష్ట్వా కర్మ సుదుష్కరమ్,
సాధుసా ధ్వితి భూతాని ప్రశశంసు స్తదా హరిమ్. 163

స సాగర మనాధృష్య మభ్యేత్య వరుణాలయమ్,
జగా మాకాశ మావిశ్య వేగేన గరుడోపమః. 164

సేవితే వారిధారాభిః పతగైశ్చ నిషేవితే,
చరితే కైశికాచార్యై రైరావత నిషేవితే. 165

సింహ కుఞ్జర శార్దూల పతగోరగ వాహనైః,
విమానై స్సంపతద్భిశ్చ విమలై స్సమలఙ్కృతే. 166

వజ్రాశనిసమాఘాతైః పావకై రుపశోభితే,
కృతపుణ్యై ర్మహాభాగై స్స్వర్గజిద్భి రలఙ్కృతే. 167

వహతా హవ్య మత్యర్థం సేవితే చిత్రభానునా,
గ్రహ నక్షత్ర చన్ద్రార్క తారాగణ విభూషితే. 168

మహర్షిగణ గన్ధర్వ నాగయక్షసమాకులే,
వివిక్తే విమలే విశ్వే విశ్వావసు నిషేవితే. 169

దేవరాజగజాక్రాన్తే చన్ద్రసూర్యపథే శివే,
వితానే జీవలోకస్య వితతే బ్రహ్మనిర్మితే. 170

బహుశ స్సేవితే వీరై ర్విద్యాధరగణై ర్వరైః,
జగామ వాయుమార్గే తు గరుత్మా నివ మారుతిః. 171

ప్రదృశ్యమాన స్సర్వత్ర హనుమాన్ మారుతాత్మజః,
భేజేఽమ్బరం నిరాలమ్బం లమ్బపక్ష ఇవాద్రిరాట్. 172

ప్లవమానం తు తం దృష్ట్వా సింహికానామరాక్షసీ,
మనసా చిన్తయామాస ప్రవృద్ధా కామరూపిణీ. 173

అద్య దీర్ఘస్య కాలస్య భవిష్యా మ్యహ మాశితా,
ఇదం హి మే మహ త్సత్త్వం చిరస్య వశ మాగతమ్. 174

ఇతి సఞ్చిన్త్య మనసా ఛాయా మస్య సమాక్షిపత్,
ఛాయాయాం గృహ్యమాణాయాం చిన్తయామాస వానరః.

సమాక్షిప్తోఽస్మి సహసా పఙ్గూకృతపరాక్రమః,
ప్రతిలోమేన వాతేన మహానౌ రివ సాగరే. 176

తిర్య గూర్ధ్వ మధ శ్చైవ వీక్షమాణ స్తతః కపిః,
దదర్శ సుమహ త్సత్త్వ ముత్థితం లవణామ్బుసి. 177

తద్దృష్ట్వా చిన్తయామాస మారుతి ర్వికృతాననమ్,
కపిరాజేన కథితం సత్త్వ మద్భుతదర్శనమ్. 178

ఛాయాగ్రాహి మహావీర్యం త దిదం నాత్రసంశయః,
స తాం బుద్ధ్వార్థతత్త్వేన సింహికాం మతిమా న్కపిః.

వ్యవర్ధత మహాకాయః ప్రావృషీవ వలాహకః,
తస్య సా కాయ ముద్వీక్ష్య వర్ధమానం మహాకపేః. 180

వక్త్రం ప్రసారయామాస పాతాళాన్తరసన్నిభమ్,
ఘనరాజీవ గర్జన్తీ వానరం సమభిద్రవత్. 181

స దదర్శ తత స్తస్యా వివృతం సుమహ న్ముఖమ్,
కాయమాత్రం చ మేధావీ మర్మాణి చ మహాకపిః. 182

స తస్యా వివృతే వక్త్రే వజ్రసంహననః కపిః,
సంక్షిప్య ముహు రాత్మానం నిష్పపాత మహాబలః. 183

ఆస్యే తస్యా నిమజ్జన్తం దదృశు స్సిద్ధచారణాః,
గ్రస్యమానం యథా చన్ద్రం పూర్ణం పర్వణి రాహుణా. 184

తత స్తస్యా నఖై స్తీక్ష్ణైర్మర్మా ణ్యుత్కృత్య వానరః,
ఉత్పపా తాథ వేగేన మన స్సమ్పాతవిక్రమః. 185

తాం తు దృష్ట్వా చ ధృత్యా చ దాక్షిణ్యేన నిపాత్య చ,
స కపిప్రవరో వేగా ద్వవృధే పున రాత్మవాన్. 186

హృతహృ త్సా హనుమతా పపాత విధురాఽమ్భసి,
తాం హతాం వానరే ణాశు పతితాం వీక్ష్య సింహికామ్.

భూతా న్యాకాశచారీణి త మూచుః ప్లవగోత్తమమ్,
భీమ మద్య కృతం కర్మ మహ త్సత్త్వం త్వయా హతమ్.

సాధ యార్థ మభిప్రేత మరిష్టం ప్లవతాంవర,
యస్య త్వేతాని చత్వారి వానరేన్ద్ర యథా తవ. 189

ధృతి ర్దృష్టి ర్మతి ర్దాక్ష్యం స్వకర్మసు న సీదతి,
స తై స్సమ్భావితః పూజ్యః ప్రతిపన్నప్రయోజనః. 190

జగా మాకాశ మావిశ్య పన్నగాశనవత్కపిః,
ప్రాప్తభూయిష్ఠపారస్తు సర్వతః ప్రతిలోకయన్. 191

యోజనానాం శతస్యాన్తే వనరాజిం దదర్శ సః,
దదర్శ చ పతన్నేవ వివిధద్రుమభూషితమ్. 192

ద్వీపం శాఖామృగశ్రేష్ఠో మలయోపవనాని చ,
సాగరం సాగరానూపం సాగరానూపజా న్ద్రుమాన్. 193

సాగరస్య చ పత్నీనాం ముఖాన్యపి విలోకయన్,
స మహామేఘసఙ్కాశం సమీ క్ష్యాత్మాన మాత్మవాన్. 194

నిరున్ధన్త మి వాకాశం చకార మతిమా న్మతిమ్,
కాయవృద్ధిం ప్రవేగం చ మమ దృష్ట్వైవ రాక్షసాః. 195

మయి కౌతుహలం కుర్యు రితి మేనే మహాకపిః,
తత శ్శరీరం సంక్షిప్య త న్మహీధరసన్నిభమ్. 196

పునః ప్రకృతి మాపేదే వీతమోహ ఇ వాత్మవాన్,
తద్రూప మతిసంక్షిప్య హనుమా న్ప్రకృతౌ స్థితః. 197

త్రీ న్క్రమా నివ విక్రమ్య బలివీర్యహరో హరిః,
స చారునానావిధరూపధారీ పరం సమాసాద్య సముద్రతీరమ్,
పరై రశక్యః ప్రతిపన్నరూప స్సమీక్షితాత్మా సమవేక్షితార్థః. 198
తత స్స లమ్బస్య గిరే స్సమృద్ధే విచిత్రకూటే నిపపాత కూటే,
సకేతకోద్దాలకనారికేలే మహాద్రికూటప్రతిమో మహాత్మా.

తత స్తు సంప్రాప్య సముద్రతీరం,
సమీక్ష్య లఙ్కాం గిరివర్యమూర్ధ్ని,
కపి స్తు తస్మి న్నిపపాత పర్వతే,
విధూయ రూపం వ్యథయ న్మృగద్విజాన్. 200

స సాగరం దానవపన్నగాయుతం
బలేన విక్రమ్య మహోర్మిమాలినమ్,
నిపత్య తీరే చ మహోదధే స్తదా
దదర్శ లఙ్కా మమరావతీ మివ. 201

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, వాల్మీకీయే,
చతుర్వింశత్సహస్రికాయాం, సంహితాయాం,
శ్రీమత్సున్దరకాణ్డే ప్రథమ స్సర్గః

**ఆపదా మపహర్తారం దాతారం సర్వసమ్పదామ్,**
**లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమా మ్యహమ్.**



# మద్రామాయణము సుందరకాండము

## సాగర లంఘనము

తరువాత అంతఃశత్రువులను బాహ్యాశత్రువులను ఇదివరకే గెలిచిన ఆ హనుమంతుడు రావణుడు ఎత్తికొనిపోయిన సీతాదేవి యున్న స్థానమును దేవతలు సంచరించు ఆకాశమార్గమున వెదక తలంచెను.

వానరాధిపతి యగు హనుమానుడు ఇతరులెవ్వరును సుఖముగ చేయలేని, సాటిలేని ఒక మహాకార్యమును చేయదలంచి మీదికెత్తిన శిరస్సు, మెడ కలిగినవాడై మహావృషభము వలె ప్రకాశించెను. వైడూర్యముల వలె మెరయుచున్న, పచ్చగడ్డి మొలచిన నేలల యందు నీటివలె కనబడుచున్న నేలల యందు కొద్దిసేపు ఇటునటు సుఖముగ తిరిగెను.

హనుమానుడు అటుల సంచరించునపుడు ఆతని వక్షస్థలమునకు తగిలి కొన్నిచెట్లు కూలినవి. మహాసింహమును చూచినట్లుగా మృగములు హనుమానుని చూచి బెదరినవి.

హనుమానుడు ఆరోహించిన ఆ మహేంద్రపర్వతమునందలి ధాతువులు కొన్ని నీలవర్ణము కలిగినవై మరికొన్ని ఎఱ్ఱనివై, మరికొన్ని

పసుపుపచ్చనివై, మరికొన్ని ఆకుపచ్చనివై, మరికొన్ని తెల్లనివిగా స్వాభావికమైన వర్ణము కలిగి రమణీయముగ కానవచ్చుచున్నవి. కామరూపులైన యక్షులు, కిన్నరులు, గంధర్వులు దేవతలతో సమానులైన నాగులతో నిండి యుండెను. ఆ కొండనేలయందు ఆ హనుమంతుడు పెద్ద మడుగున నిలిచిన మహాగజమువలె ప్రకాశించెను.

అతడు సూర్యునకు, మహేంద్రునకు, వాయుదేవునకు, భూతకోటికి నమస్కరించి ముందునకు పోవదలంచెను. ప్రాఙ్ముఖుడై (తూర్పుగ నిలిచి) కన్నతండ్రి అయిన వాయుదేవునకు నమస్కరించెను. ఆ తరువాత సమర్థుడైన ఆ ఆంజనేయుడు దక్షిణ దిక్కునకు పోవుటకై ఒడలు పెంచెను. వానరోత్తములు ముందునకు సాగదలంచిన ఆంజనేయుని సాదరముగ చూచిరి. అతడు ఎగురుటకై సిద్ధమయ్యెను.

శ్రీరామచంద్రుని అభ్యుదయమునకై పర్వదినములందు సముద్రము వలె పొంగిపోయెను. పెద్ద శరీరము దాల్చి సముద్రమును దాట దలంచినవాడై తన రెండుకాళ్ళచే, రెండు చేతులచే మహేంద్ర గిరిని అదిమిపట్టెను.

వానరోత్తముడు అదిమిన సమయమున ముహూర్తకాలము మహేంద్ర పర్వతము గజగజ లాడెను. చెట్లనుండి పూవులు జలజల రాలినవి. అటుల రాలిన పూవులచే మహేంద్రపర్వత మంతయు పూలరాశివలె కానవచ్చెను. బలవంతుడైన హనుమానుడు తనపాదములను, చేతులను అదిమినపుడు ఆ ఒత్తిడికి ఆ కొండనుండి

నీటిధారలు వెలువడినవి. నీటిని స్రవించుచున్న ఆ శైలము మదమును స్రవించుచున్న గజేంద్రుని వలె తోచెను. అట్టి ఒత్తిడిచేతనే ఆ కొండపై బంగారువలె పచ్చని, కాటుకవలె నల్లని, వెండివలె తెల్లని రేఖలు కూడ ఏర్పడెను. అగ్ని ధూమరేఖలను విడిచినట్లుగా ఆ కొండ మణిశిలలను కూడ విరజిమ్మెను.

పర్వతమున కలిగిన ఈ ఒత్తిడికి భయపడిన ఆ గుహలలోని ప్రాణికోటి వికృతముగ అఱవఁజొచ్చెను. కొండ ఒత్తిడిచే ప్రాణికోటి చేసిన ఆ ఆర్తనాదము భూమి యందంతట నిండిపోయెను. అచ్చటి సర్పములు తమ స్వస్తికి చిహ్నములచే అలంకృతమైన పడగలతో పాములు నిప్పులు క్రక్కుచు తమ కోరలతో రాళ్ళను కఱచినవి. వెంటనే ఆ మహాశిలలు మండుచు బ్రద్దలై పోయినవి. ఆ కొండపై మొలచిన విషాపహారులగు శిలలు కూడ ఆ విషజ్వాలలను ఉపశమింప జేయలేకపోయినవి. ఏవో ప్రబలప్రాణులు ఈ పర్వతమును బ్రద్దలుకొట్టుచున్నవని అచటి తాపసులు తలంచిరి. విద్యాధరులు భయపడి తమ తమ స్త్రీలతో మీదికి ఎగిరిపోయిరి. వారు పానభూమియందలి బంగారు ఆసనములను, బంగారు పాత్రలను, విలువైన జలపాత్రలను, రకరకములైన లేహ్యములను, భక్ష్యములను, రకరకముల మాంసములను, వృషభచర్మముతో చేసిన డాలులను, బంగారు పిడికిలి గలిగిన ఖడ్గములను విడిచి మత్తుతోడనే ఎఱ్ఱని మాలికలను, ఎఱ్ఱని మైపూతను ధరించి ఎరుపు వారిన నేత్రములతో ఆకాశమునకు ఎగిరిపోయిరి. పర్వతమునకు విహారార్థము వచ్చిన మరికొందరు స్త్రీలు నూపురకేయూరములను ధరించి తమ

ప్రియులతో ఆకాశమున నిలిచి ఈ వింత సంఘటనను ఆశ్చర్యముగ చూచుచుండిరి. విద్యాధర మహర్షులు తమ విద్యా బలముచే ఆకాశమున నిలిచిన వారై ఈ వింతను చూచుచుండిరి.

ఋషులు, సిద్ధులు, చారణులు ఆకాశమునందుండగా వారికి ఈ రీతిగా వినవచ్చెను. ఇదిగో పర్వతాకారుడైన, వాయునందనుడగు హనుమంతుడు శ్రీరాముని కొరకు, వానరుల కొరకు, ఇతరులకు సాధ్యముకాని సముద్రతరణము చేయదలంచి ఉన్నాడు. సామాన్యులకు దుర్లభమైన ఈ సముద్రము యొక్క దక్షిణ తీరమునకు పోదలంచి యున్నాడు. ఈ మాటలను విన్న విద్యాధరులు హనుమానుని అంతులేని బలపరాక్రమములను తలంచి సాదరముగ చూచిరి.

హనుమానుడు తన శరీరము మీద రోమములను దులుపుకొనెను. కొండవంటి ఆ హనుమానుడు కంపించెను. మహామేఘము వలె గర్జించెను. ఆనుపూర్వి కలిగి గుండ్రముగ నున్న రోమములతో కూడిన తోకను వైనతేయుడు పామును వలె ఆకాశములోనికి చాచెను. ఆకాశములోనికి చాచిన అతని తోక గరుత్మంతుడు ఒడిసి పట్టుకొని పోవుచున్న మహాసర్పము వలె కానవచ్చెను. మహా పరిఘలవంటి తన బాహువులను స్తంభింపజేసెను. ప్రతిభాగమున భారమును నిలిపెను. పాదములను సంకోచపరచెను. భుజములను, మెడను కుంచపరచి బలమును, ఉత్సాహశక్తులను కూడగట్టుకొనెను. తల యెత్తి సుదూరముగ దృష్టి పరచుచు తన ప్రాణశక్తుల నన్నింటిని హృదయమున నిలుపుకొనెను. తన పాదములను గట్టిగా నేలనానించి చెవులను రిక్కించి ఎగుర బోవుచు, మహాబలుడైన ఆ వానరోత్తముడు

తన తోడి వానరులతో ఇట్లు పలికెను. శ్రీరామచంద్రుడు విడిచిన వాయువేగముతోపోవు బాణము వలె రావణాసురుడు పాలించుచున్న లంకకు నేను పోయెదను. ఒకవేళ జనకాత్మజను లంకలో చూడలేక పోయినచో అదే వేగముతో దేవలోకమునకు పోయెదను. దేవ లోకమున కూడ సీత కానరానిచో రాక్షసాధిపతి యగు రావణుని అవలీలగ బంధించి తెచ్చెదను. అన్ని విధముల పనిని పూర్తిచేసికొని సీతను వెంటబెట్టుకొని రాగలను. లేదా రావణాసురునితో లంకను ఊడబెరికి తెచ్చెదను.

ఈ రీతిగ తోడి వానరులతో పలికి వానరోత్తము డగు నా హనుమ నిస్సంకోచముగ ఆకాశములోనికి ఎగిరెను. హనుమంతుడు తన్ను గరుత్మంతునిగ భావించుకొని మహావేగమున ఆకాశమునకు ఎగురగా కొమ్మలను విదలించుకొని ఆ పర్వతము నందలి వృక్షములు కూడ హనుమ వెంట బడినవి. ఆతని ఊరు వేగమున నేల పట్టువీడివచ్చిన వృక్షములు తమను విడిచి వెళ్ళుచున్న బంధువును ఆప్తబాంధవులు వెంబడించినట్లుగా, ప్రభువులు సైన్యమును వెంబడించినట్లుగా కొంత దూరము అనుసరించి పోయినవి. బాగుగా పూచిన వృక్షములు వెంబడించి వచ్చుచున్నపుడు పర్వతాకారుడైన హనుమంతుడు చూడముచ్చటగ నుండెను. వెంబడి వచ్చిన వృక్షములతో బరువైనవి ఇంద్రభయముతో సముద్రమున మునిగిన పర్వతముల వలె సముద్రమున మునిగినవి

రంగు రంగుల పూలతో, చిగుళ్ళతో, మొగ్గలతో కప్పబడిన ఆంజనేయుడు మెఱపులతో నిండిన మేఘమువలె ప్రకాశమాను

డయ్యెను. అతని గమనవేగమున పుష్పవర్షము కురిసి చిన్నబోయిన ఆ వృక్షములు ఆత్మీయుని సాగనంపి మరలిన మిత్రుల వలె కానవచ్చెను. వృక్షములు రాల్చిన పూలతో నిండిన ఆ సముద్రము వేలకొలది నక్షత్రములతో కూడిన ఆకాశము వలె దర్శనీయమై ఉండెను. రంగురంగుల పూవులచే ఆవరింపబడిన హనుమంతుడు మెరుపులతో కూడిన మేఘమువలె కానవచ్చెను. హనుమంతుని గమనవేగముచే వెంటబడి వచ్చిన పూవులతో నిండిన సముద్రజలము నక్షత్రములతో కూడిన ఆకాశమువలె కనబడు చుండెను. ఆకాశమున ఎగురుచున్నపుడు ముందునకు చాచిన హస్తములు పర్వతాగ్రము నుండి మీదికి వచ్చిన ఐదుతలల పాముల వలె కనబడుచుండెను.

వానరోత్తముడు ఆకాశమున ముందునకు సాగిపోవుచున్నపుడు పెద్దపెద్ద కెరటములతో కూడిన మహా సముద్రమును త్రాగివేయు చున్నాడా అన్నట్లు తోచెను. ఆంజనేయుని పచ్చని నేత్రములు పర్వతమందు జ్వలించుచున్న రెండు అగ్ని గోళములవలె ఏకకాలమందు ఉదయించిన సూర్యచంద్రుల వలె ప్రకాశించుచుండెను. ఎఱ్ఱని నాసికచే అతని ఎఱ్ఱని ముఖమండలము సంధ్యచే స్పృశింపబడిన సూర్యమండలము వలె ఆకాశమున ప్రయాణించుచు మీదికి ఎత్తిన ఆతని వాలము ఇంద్రధ్వజము వలె తోచెను. తెల్లని దంతములతో కూడిన ఆ వాయునందనుడు పరివేషముతో కూడిన సూర్యునివలె తోచెను. ఎఱ్ఱని పిఱుదులతో,ఆ ఆంజనేయుడు బీటలు వారి గైరికాది ధాతువులతో కూడిన కొండవలె కానవచ్చెను. మహావేగముగా ఆకాశమున ముందునకు పోవుచున్న

ఆ వాయునందనుని రెక్కల సందునుండి వెల్వడి వచ్చిన వాయువు మేఘము వలె గర్జించు చుండెను.

ఆకాశమున పోవుచున్న అతడు ఆకాశమునుండి జారిపడుచున్న ఉల్కవలె కానవచ్చెను. సుదీర్ఘ దేహము కలిగిన మారుతి, మీదినుండి జారిపడుచున్న సూర్యునివలె నుండెను. సముద్రమున మహా వాయువుచే ముందునకు త్రోయ బడుచున్న మహానౌకవలె తోచెను. అతని గమనవేగమునకు సముద్రము కూడ కల్లోలితమగు చుండెను. సాగరతరంగములను సాగర మందలి కొండలను రాపాడు కొనుచు ఆంజనేయుడు ముందునకు సాగిపోవుచుండెను. వానరుని గమనవేగమున జనించిన వాయువును, మేఘజనితమైన వాయువును సముద్రమును కల్లోలిత మొనర్చు చుండెను. మేరుమందరముల వలె మీదికి ఎగసి పడుచున్న సముద్ర తరంగములను లెక్కించుచున్న వాని వలె ఒక్కొక్క తరంగమును అతిక్రమించి పోవుచుండెను. తన వేగముచే మీదికి ఎగసి పడుచున్న సముద్రజలములచే భూమ్యాకాశములు రెంటిని వ్యాప్తమొనరించు చుండెను.

అతని వేగముచే మీదికి చిందిన సముద్ర జలము శరత్కాలపు మేఘమువలె తోచెను. మారుతి గమనవేగముచే సముద్ర జలము అకృష్టమై అల్పజనముతో కూడిన ఆ ప్రదేశమున తిమిజాతి చేపలు, మొసళ్ళు, మరికొన్ని చేపలు, సామాన్య మత్స్యములు వస్త్రము తొలగినపుడు దేహావయవముల వలె కానవచ్చు చుండెను. సాగరాంతర్గతములైన సర్పములు హనుమంతుని చూచి గరుత్మంతుడేమో అని భయపడినవి. ఆ వానరోత్తముని నీడ పదియోజనముల వెడల్పు,

ముప్పది యోజనముల పొడవు గలిగి అతి రమణీయముగ ఉండెను. ఆ వానరోత్తముడు నిరాధారమైన వాయుమార్గమున రెక్కలు కలిగిన కొండవలె తోచెను. ఆ ఆంజనేయుని గమనవేగముచే సముద్రము పాయలు తీర్చి నట్టుండెను. ఆకాశమున సంచరించుచున్న హనుమానుడు ఒకప్పుడు మేఘములచేత తిరోహితుడై మరియొకప్పుడు ప్రత్యక్షమై తోచు చంద్రుని వలే కానవచ్చుచుండెను. ఆకాశమున ముందునకు సాగిపోవుచున్న ఆ వానరోత్తమునిపై దేవతలు పుష్పవృష్టి కురిపించిరి. సూర్యుడు తన తాపమును తగ్గించుకొనెను. రామ చంద్రుని కార్యసిద్ధికై వాయుదేవుడు హనుమానుని సేవించెను. ఋషులు పొగడిరి. మహాశక్తి సంపన్నుడగు ఆంజనేయుని ప్రశంసించుచు దేవతలు, గంధర్వులు పాడిరి. ఇంతదూరము ప్రయాణించినను ఏమాత్రము అలసట చెందని ఆంజనేయుని శక్తిని తలంచి నాగులు, యక్షులు, రాక్షసులు స్తోత్రము చేసిరి. 'వానరోత్తముడగు ఆ హనుమానుడు ఆకాశమున ముందునకు సాగిపోవుచుండగా ఇక్ష్వాకువంశమును సన్మానింప దలంచిన సముద్రుడు ఈ రీతిగ నాలోచించెను'.

'రామకార్యార్థమై పోవుచున్న ఈ వానరాధిపతికి నేను సాయపడనిచో లోకము నన్ను నిందింపవచ్చును. ఇక్ష్వాకువంశమందు పుట్టిన సగర చక్రవర్తి నన్ను పెంచి ఇంతటి వానిగ చేసినాడు. ఇక్ష్వాకు వంశ్యుడగు శ్రీరామునకు సాయపడుటకై పోవుచున్న ఈ హనుమానుడు దీర్ఘప్రయాణములో అలసట చెంది బలహీనపడరాదు. ఈ హనుమ విశ్రమించు పని ఏదైనను నేను చేయవలసి యున్నది. కొలదిసేపు

నావద్ద విశ్రాంతి తీసికొన్నచో సుఖముగ ముందునకు సాగిపోగలడు అని నిశ్చయించుకొని తన నీటిలో దాగి ఉన్న మైనాకునితో ఇట్లు చెప్పెను. 'హిరణ్యనాభ! మైనాక! గిరీంద్ర! నీవు నాలో నుండి పాతాళ వాసులైన అసుర సంఘములు మీదికి రాకుండ పరిఘమువలె నిలిచి ఉంటివి. బలము కూడగట్టుకొని పాతాళము నుండి బయటపడ తలంచిన రాక్షసులు రాకుండ ద్వారము నావరించి నిలిచి యున్నావు. నీవు మీదికి, క్రిందకు, ప్రక్కలకు పెరుగగల శక్తి కలవాడవు. కావున నిన్ను ఒక పనికై ప్రోత్సహించుచున్నాను. పర్వతరాజా! లెమ్ము. వానరోత్తముడు నీవద్దకు వచ్చుచున్నాడు. రామచంద్రుని కొరకై అతి సాహసమును చేయుచున్నాడు. ఆతనికి నేను సాయపడవలసి యున్నది. నాకు ఇక్ష్వాకువంశస్థులు మిక్కిలి పూజనీయులు. నన్నుబట్టి నీకును పూజనీయులు. కార్యము అతిక్రమించిపోకుండ నాకు సాయపడుము. చేయవలసిన పని సరియగు సమయమున చేయనిచో పెద్దలకు కోపము కలిగించును. లెమ్ము. నీటినుండి మీదికి రమ్ము. నీమీద ఈ వానరోత్తముడు కొలదిసేపు విశ్రమించును. ఆతడు మన అతిథి. వానరోత్తముడగు నీతడు పూజనీయుడు. రామచంద్రుని దయాగుణము, సీతాదేవి రామచంద్రునకు దూరమగుట, ఈ వానరోత్తముని శ్రమ, ఆలోచించి తొందరగ మీదికి రమ్ము'.

సాగరుని ఈ మాటలను విని ఆ మైనాకుడు వృక్షములతో, తీగలతో కూడి సాగరజలమును భేదించుకొని మీదికి వచ్చెను. మేఘమును భేదించుకొని వచ్చిన సూర్యునివలె తోచెను. కిన్నరులతో, నాగులతో కూడిన బంగారు శిఖరములు కానవచ్చెను. మీదికి వచ్చిన ఆ బంగారు

శిఖరముచే ఆకాశమంతయు కాంచనప్రభలతో నిండిపోయెను. ఆ సమయమున వందలకొలది సూర్యులు ఒక్కసారిగా ఆకాశమున ఉదయించినట్లు తోచెను.

సముద్రమధ్యమున ఆకస్మికముగ మీదికి వచ్చిన మైనాకుని చూచి ఇది ఏదో తన ప్రయాణమునకు విఘ్నకారి అని తలంచి మహావేగముగ పోవుచున్న హనుమానుడు తన వక్షస్థలమున రాయుచు ముందునకు సాగిపోయెను. వాయు వేగమునకు మేఘమువలె ఆ మైనాకుడు తూలి పడెను. హనుమానుని వేగమునకు మైనాకుడు సంతసించెను. మనుష్య రూపమును ధరించి తన శిఖరమున నిలిచి ఇట్లు పలికెను. 'వానరోత్తమా! ఇతరులకు అసాధ్యమైన గొప్ప పని చేసితివి. నా శిఖరములపై కొలది సేపు విశ్రమించి ముందునకు సాగిపొమ్ము. ఈ రామచంద్రుడు పుట్టిన వంశమునందు పుట్టిన వారే ఈ సముద్రమును పోషించిరి. ఆ కృతజ్ఞతతో సముద్రుడు రామకార్యార్థమై పోవుచున్న నిన్ను ఆరాధింప తలంచి యున్నాడు. ఉపకరించిన వారికి ప్రత్యుపకారము చేయుట సనాతన ధర్మము. ప్రత్యుపకారము చేయదలంచిన సముద్రుడు నీకు ఉపచారము సమర్పించి ఇక్ష్వాకు వంశస్థులు విషయమున తన కృతజ్ఞతాభావమును ప్రకటించుకో తలంచి యున్నాడు. నీయందలి గౌరవముతో నీకు ఉపచారము సమర్పించుటకై నన్ను పంపి యున్నాడు. నూఱు యోజనములు ప్రయాణింప తలంచిన ఈ హనుమంతుడు నీయందు కొలది సేపు విశ్రమించి ముందునకు పోవునట్లు చూడుము అని సాగరుని ఆజ్ఞ! ఇదిగో ఘుమఘుమలాడెడి రుచికరమైన కందమూలఫలములు

సమృద్ధిగ నున్నవి. వానిని కావలసినంత ఆరగించి కొలదిసేపు విశ్రమించి, వానరోత్తమా! ముందునకు సాగిపొమ్ము.

వాయునందనా! నాకును నీతో ప్రాచీనమైన ఒక అనుబంధము కలదు. ఒకప్పుడు అనగా కృతయుగమున పర్వతములు రెక్కలు కలిగి యుండెడివి. మహావేగముతో ఆకాశమున ఎగురుచుండెడివి. ఆ ఎగిరెడి పర్వతములు ఎక్కడ మీద పడునో అని దేవతలు, మనుష్యులు కూడ భయపడుచుండెడివారు. వారి భయమును పోగొట్టుటకై మహేంద్రుడు వజ్రాయుధముతో వాని రెక్కలను ఖండింప నారంభించెను. ఆ ఇంద్రుడు వజ్రమును చేత బట్టి నా వద్దకును వచ్చెను. ఆసమయమున నీ తండ్రి వాయుదేవుడు నన్ను సముద్రమున విసరివైచెను. నా రెక్కలు నాకు దక్కినవి. నీ తండ్రి నన్ను ఏ అపాయము లేకుండ రక్షించెను. నీ తండ్రి నాకు మాననీయుడు. ఆ సంబంధముచే నిన్ను నేను ఆదరించుచున్నాను. ఆంజనేయా! ఇది మన అనుబంధము. నీవిచ్చట విశ్రమించి ముందునకు పోయినచో నేనును, సముద్రుడును చాల సంతోషింతుము. దయయుంచి ఈ అతిథ్యమును స్వీకరింపుము. నీ దర్శనమాత్రముచే నేనెంతగనో సంతోషించుచున్నాను'.

ఆ మాటలు విని హనుమానుడు మైనాకునితో ఇట్లనెను. 'పర్వతరాజా! నేను చాల సంతోషించితిని. నీ ఆతిథ్యమును నేను స్వీకరించినట్లే భావింపుము. నేను తీసికొనలేదని మనసున సంకోచము పెట్టుకొనకుము. నేను పనితొందరలో ఉన్నాను. పగలు గడచిపోవుచున్నది. సముద్రమును దాటెదనని ప్రతిజ్ఞ చేసి యున్నాను.

మధ్యలో ఆగరాదు' అని చెప్పి మైనాకుని తన హస్తమున స్పృశించి ఆకాశములో ముందునకు సాగిపోయెను. మైనాకుడు సముద్రము ఆదర గౌరవములతో హనుమానుని వీక్షించి అంజనేయుని సంకల్పమునకు అనుకూలముగా ఆశీర్వదించిరి. మైనాకుని సాదరముగ చూచుచు ముందునకు సాగిపోయెను.

ఇతరులకు సాధ్యముకాని హనుమంతుని ద్వితీయ దుష్కర కార్యమును చూచి సిద్ధులు, సురలు, పరమ ఋషులు, దేవతలు మిక్కిలి ప్రశంసించిరి. మైనాకుడు హనుమంతుని విషయమున ప్రవర్తించిన తీరును చూచి మహేంద్రుడును ప్రసన్నుడయ్యెను. మైనాకునితో నిట్లు పల్కెను. 'పర్వతరాజా! నీవు అంజనేయుని విషయమున చూపిన ఆదరమునకు నేను మిక్కిలి సంతోషించితిని. నీకు అభయమిచ్చుచున్నాను. రామచంద్రుని కార్యార్థమై పోవుచున్న హనుమానునకు నీవు సాయము చేయబూనుట నన్నెంతో ప్రసన్నునిగ నొనర్చినది'. ఆ మాటలకు పర్వతరాజును మిక్కిలి సంతోషించెను.

ఇంతలో దేవతలు నాగమాతయగు సురసతో ఇట్లనిరి. 'హనుమానుడు సముద్రము మీదుగ లంకకు పోవుచున్నాడు. అతని గమనమునకు నీవొక క్షణకాలము విఘ్నమాచరింపుము. నీవు పెద్ద రూపమును ధరించి కోరలతో భయంకరమైన ఆకాశమంత నోరు తెరచి దారిలో నిలిచియుండుము. ఆంజనేయుని బలము పరాక్రమము ఏపాటివో తెలిసికొనగోరుచున్నాము. ఉపాయమున నిన్ను గెలువగలడో లేక విషాదము నొందునో తెలిసికొన గోరుచున్నాను.'

అంతట ఆ సురస భయంకరమైన రూపమును ధరించి హనుమంతుని మార్గమునకు అడ్డముగ నిలిచి ఇట్లు పలికెను. ‘ ఓ వానరోత్తమా! నాకు నీవు దేవతలచే భక్ష్యముగ నేర్పాటుచేయబడితివి. నీవు నా ముఖమున ప్రవేశింపుము. నిన్ను నేను భక్షించెదను’. రామ కార్యార్థమై పోవుచున్న ఆంజనేయుడు ముఖమున ఆనందము గోచరించుచుండగా చేతులు జోడించి నాగమాతతో నిట్లుపలికెను. ‘దశరథ పుత్రుడైన శ్రీరామ చంద్రుడు సోదరుడగు లక్ష్మణునితో, భార్య అగు సీతతో దండ కారణ్యమున ప్రవేశించెను. కార్యాంతరాసక్తుడైన ఆ రాముని ఏమరించి రావణాసురుడు సీతను అపహరించెను. రామాజ్ఞను స్వీకరించి సీతాదేవి వద్దకు దూతగ పోవుచున్నాను. రామచంద్రుని దేశమున నిలిచి ఉన్న నీవును అతనికి సాయపడవలసి ఉండును. కావున నాకు దారి వదలుము. లేదా రామచంద్రుని పని పూర్తి చేసి వచ్చి నీ నోట ప్రవేశింతును. ఈ మాట యథార్థము. మాట తప్పను’.

ఆ మాట విన్న నాగమాత ‘నేను తినదలంచిన వ్యక్తి నన్నతిక్రమించి పోజాలడు. ఇది నాకు దేవతలిచ్చిన వరము’ అని పెద్దగ నోరు తెఱచెను. ఉపాయశాలి అయిన ఆ హనుమంతుడు పొడవైన నాలుక సుదీర్ఘములైన కోరలతో భయంకరమై యున్న ఆ నాగమాత ముఖమున అతి సూక్ష్మరూపమున ప్రవేశించి బయటకు వచ్చి ఆకాశమున నిలిచి ఇట్లు పలికెను ‘దాక్షాయణీ! నీ నోట ప్రవేశించితిని. నీకు నమస్కారము. వైదేహి ఉన్న చోటికి పోవుచున్నాను. నీ వరమును అమోఘ మొనర్చితిని’. రాహుముఖము నుండి బయటకు వచ్చిన చంద్రుని వలె ప్రకాశమానుడగు ఆ ఆంజనేయుని చూచి భయంకర మగు ఆ రాక్షసాకారమును విడిచి సామాన్య రూపమును ధరించి

హనుమతో నిట్లు పలికెను. 'వానరోత్తమా! నీవు ముందునకు సాగిపొమ్ము. నీకు కార్యసిద్ధి కలుగును. సీతాదేవిని శ్రీరామచంద్రునితో ఒకచోట చేర్పుము'. ఇది హనుమ యొనర్చిన మూడవ అద్భుత కార్యము.

హనుమానుడు ఆకాశమున ముందునకు సాగిపోవు చుండెను. ఆ ఆకాశము సూర్యచంద్రాది గ్రహములతో విద్యాధరాది దేవయోని విశేషులతో అతి సుందరముగ కానవచ్చు చుండెను. ఒకప్పుడు మేఘములకు మీదుగ ఒకప్పుడు క్రిందుగ ముందునకు సాగుచుండెను. అపుడు ఆకాశమున పోవుచున్న హనుమానుని చూచి సింహిక అను ఒక రాక్షసి ఇట్లనుకొనెను. 'చాలకాలము నుండి నేను ఆకలితో నున్నాను. ఈ నాటికి ఒక మహాప్రాణినాకు వశమైనది'. అని మనసులో అనుకొని ఆ ఆంజనేయుని ఛాయను ఆకర్షించెను. సింహిక ఛాయనాకర్షించుచున్న సమయమున ఆంజనేయు డిట్లు అనుకొనెను. ఎదురుగాలిచే మహానౌక ముందునకు సాగలేక వెనుకకు వచ్చినట్లుగా నేను ముందునకు పోలేక పోవుచున్నానేమి?' అని ఆలోచించుచు పైకి, క్రిందకు, ప్రక్కకు చూచెను. సముద్రము నుండి లేచిన ఒక మహాభూతము కానవచ్చెను. దాని ముఖము చాల భయంకరముగ నున్నది. వానర చక్రవర్తి సుగ్రీవ మహారాజు చెప్పిన ఛాయాగ్రాహి మహాభూతము ఇదియే అయి ఉండును. వర్షాకాలము మేఘముల వలె తన దేహమును ఒక్కసారిగ పెంచెను. ఈ పెరిగిన దేహమునకు తగునట్లుగా ఆ రాక్షసి నోరు తెరచెను. దానినోరు పాతాళలోకమంతగ నుండెను. ఉరుములతో కూడిన మేఘముల వలె గర్జించుచు హనుమకు ఎదురుగ పోయెను.

హనుమానుడు తన దేహ పరిమాణమును తగ్గించుకొని, దానినోట ప్రవేశించెను. రాహువు నోట పడుచున్న చంద్రునివలె సింహికా ముఖమున ప్రవేశించుచున్న ఆంజనేయుని సిద్ధ చారణులు చూచిరి. నోట ప్రవేశించిన హనుమ తన తీవ్రమైన నఖములతో సింహిక హృదయమును ప్రేగులను, నాడులను త్రెంచివైచెను. వానరాధిపతి పైకి వచ్చెను. సింహిక సముద్రమున మునిగెను. ఆకాశ చారులగు సిద్ధులు, విద్యాధరులు ఈ భయంకరమైన సింహికను చంపుటవలన ఆంజనేయుని మిక్కిలి పొగడిరి. వానరేంద్రుని ధైర్యము సాహసము, బుద్ధి, దక్షత దేవతలకు కూడ ప్రశంసార్హములైనవి.

మరల ఆంజనేయుడు లంకవైపునకు ఆకాశమార్గమున ముందునకు సాగెను. కొంతసేపటికి సముద్ర తీరము కానవచ్చెను. అచ్చట వనములును కనబడెను. మలయోద్యానములు చూచెను. సాగరతీరము, అచట బయలుదేరిన తోటలు లంకనుండి ప్రవహించి వచ్చుచున్నట్లు గోచరించినవి. ఇంత పెద్ద దేహముతో లంకలో ప్రవేశించిన లంకానగరవాసులు నన్ను వింత చూడవచ్చును. పట్టుకొనుటకై ప్రయత్నింపవచ్చును. అందువల్ల రామకార్యము విఘ్నము కావచ్చునని హనుమ తన రూపమున సూక్ష్మముగ మార్చెను. త్రివిక్రముడు లోకములను కొలిచి సాధారణ రూపము ధరించునట్లయ్యెను. ఆ సూక్ష్మ రూపముతో లంబమను పర్వత శిఖరమున వ్రాలెను. ఆ శిఖరమున నిలిచి తన దృష్టిని లంకానగరముపై ప్రసరింపజేసెను.



# ౨. ద్వితీయ స్సర్గః

స సాగర మనాధృష్య మతిక్రమ్య మహాబలః,
త్రికూటశిఖరే లఙ్కాం స్థితాం స్వస్థో దదర్శ హ. 1

తతః పాదపముక్తేన పుష్పవర్షేణ వీర్యవాన్,
అభివృష్ట స్స్థిత స్తత్ర బభౌ పుష్పమయో యథా. 2

యోజనానాం శతం శ్రీమాం స్తీర్త్వాఽప్యుత్తమవిక్రమః,
అనిశ్శ్వస న్కపి స్తత్ర న గ్లాని మధిగచ్ఛతి. 3

శతా న్యహం యోజనానాం క్రమేయం సుబహూ న్యపి,
కిం పున స్సాగర స్యాన్తం సఙ్ఖ్యాతం శతయోజనమ్. 4

స తు వీర్యవతాం శ్రేష్ఠః ప్లవతా మపి చోత్తమః,
జగామ వేగవా న్లఙ్కాం లఙ్ఘయిత్వా మహోదధిమ్. 5

శాద్వలాని చ నీలాని గన్ధవన్తి వనాని చ,
గణ్డవన్తి చ మధ్యేన జగామ నగవన్తి చ. 6

శైలాంశ్చ తరుసఞ్ఛన్నాన్ వనరాజీశ్చ పుష్పితాః,
అధిచక్రామ తేజస్వీ హనుమాన్ ప్లవగర్షభః. 7

స తస్మి న్నచలే తిష్ఠన్ వనా న్యుపవనాని చ,
స నగాగ్రే చ తాం లఙ్కాం దదర్శ పవనాత్మజః. 8

సరళాన్ కర్ణికారాంశ్చ ఖర్జూరాంశ్చ సుపుష్పితాన్,
ప్రియాళూ న్ముచులిన్దాంశ్చ నీపా న్సప్తచ్ఛదాం స్తథా,
అసనాన్ కోవిదారాంశ్చ కరవీరాంశ్చ పుష్పితాన్. 10

పుష్పభార నిబద్ధాంశ్చ తథా ముకులితా నపి,
పాదపాన్ విహగాకీర్ణాన్ పవనాధూతమస్తకాన్. 11

హంసకారణ్డవాకీర్ణా వాపీః పద్మోత్పలాయుతాః,
ఆక్రీడాన్ వివిధా న్రమ్యా న్వివిధాంశ్చ జలాశయాన్. 12

సన్తతాన్ వివిధై ర్వృక్షై స్సర్వర్తుఫలపుష్పితైః,
ఉద్యానాని చ రమ్యాణి దదర్శ కపికుఞ్జరః. 13

సమాసాద్య చ లక్ష్మీవాన్ లఙ్కాం రావణపాలితామ్,
పరిఘాభి స్సపద్మాభి స్సోత్పలాభి రలఙ్కృతామ్. 14

సీతాపహరణార్థేన రావణేన సురక్షితామ్,
సమన్తా ద్విచరద్భిశ్చ రాక్షసై రుగ్రధన్విభిః. 15

కాఞ్చనే నావృతాం రమ్యాం ప్రాకారేణ మహాపురీమ్,
గృహైశ్చ గ్రహసఙ్కాశై శ్శారదామ్బుదసన్నిభైః. 16

పాణ్డురాభిః ప్రతోళీభి రుచ్చాభి రభిసంవృతామ్,
అట్టాలకశతాకీర్ణాం పతాకాధ్వజమాలినీమ్. 17

తోరణైః కాఞ్చనై ర్దివ్యై ర్లతాపఙ్క్తివిచిత్రితైః,
దదర్శ స లఙ్కాం హనుమాన్ దివి దేవపురీ మివ. 18

గిరిమూర్ధ్ని స్థితాం లఙ్కాం పాణ్డురై ర్భవనై శ్శుభైః,
దదర్శ స కపిశ్రేష్ఠ పుర మాకాశగం యథా. 19

పాలితాం రాక్షసేన్ద్రేణ నిర్మితాం విశ్వకర్మణా,
ప్లవమానా మి వాకాశే దదర్శ హనుమాన్ పురీమ్. 20

వప్ర ప్రాకార జఘనాం విపులామ్బు నవామ్బరామ్,
శతఘ్నీశూలకేశాన్తా మట్టాలకవతంసకామ్. 21

మనసేవ కృతాం లఙ్కాం నిర్మితాం విశ్వకర్మణా,
ద్వార ముత్తర మాసాద్య చిన్తయామాస వానరః. 22

కైలాసశిఖరప్రఖ్యా మాలిఖన్తీ మి వామ్బరమ్,
డీయమానామి వాకాశ ముచ్ఛ్రితై ర్భవనోత్తమైః. 23

సమ్పూర్ణాం రాక్షసై ర్ఘోరై ర్నాగై ర్భోగవతీ మివ,
అచిన్త్యాం సుకృతాం స్పష్టాం కుబేరాధ్యుషితాం పురా. 24

దంష్ట్రిభి ర్బహుభి శ్శూరై శ్శూలపట్టసపాణిభిః,
రక్షితాం రాక్షసై ర్ఘోరై ర్గుహా మాశీవిషై రివ. 25

తస్యాశ్చ మహతీం గుప్తిం సాగరం చ నిరీక్ష్య సః,
రావణం చ రిపుం ఘోరం చిన్తయామాస వానరః. 26

ఆగత్యా పీహ హరయో భవిష్యన్తి నిరర్థకాః,
న హి యుద్ధేన వై లఙ్కా శక్యా జేతుం సురై రపి. 27

ఇమాం తు విషమాం దుర్గాం లఙ్కాం రావణపాలితామ్,
ప్రాప్యాపి స మహాబాహుః కిం కరిష్యతి రాఘవః. 28

అవకాశో న సాన్త్వస్య రాక్షసే ష్వభిగమ్యతే,
న దానస్య న భేదస్య నైవ యుద్ధస్య దృశ్యతే. 29

చతుర్ణామేవ హి గతి ర్వానరాణాం మహాత్మనామ్,
వాలిపుత్రస్య నీలస్య మమ రాజ్ఞశ్చ ధీమతః. 30

యావ జ్జానామి వైదేహీం యది జీవతి వా నవా,
తత్రైవ చిన్తయిష్యామి దృష్ట్వా తాం జనకాత్మజామ్. 31

తత స్స చిన్తయామాస ముహూర్తం కపికుఞ్జరః,
గిరిశృఙ్గే స్థిత స్తస్మిన్ రామ స్యాభ్యుదయే రతః. 32

అనేన రూపేణ మయా న శక్యా రక్షసాం పురీ,
ప్రవేష్టుం రాక్షసై ర్గుప్తా క్రూరై ర్బలసమన్వితైః. 33

ఉగ్రౌజసో మహావీర్యా బలవన్త శ్చ రాక్షసాః,
వఞ్చనీయా మయా సర్వే జానకీం పరిమార్గతా. 34

లక్ష్యాలక్ష్యేణ రూపేణ రాత్రౌ లఙ్కాపురీ మయా,
ప్రవేష్టుం ప్రాప్తకాలం మే కృత్యం సాధయితుం మహత్. 35

తాం పురీం తాదృశీం దృష్ట్వా దురాధర్షాం సురాసురైః,
హనుమా న్చిన్తయామాస వినిశ్చిత్య ముహుర్ముహుః. 36

కేనోపాయేన పశ్యేయం మైథిలీం జనకాత్మజామ్,
అదృష్టో రాక్షసేన్ద్రేణ రావణేన దురాత్మనా. 37

న వినశ్యే త్కథం కార్యం రామస్య విదితాత్మనః,
ఏకా మేకశ్చ పశ్యేయం రహితే జనకాత్మజామ్. 38

సూర్యే చాస్తంగతే రాత్రౌ దేహం సంక్షిప్య మారుతిః,
వృషదంశకమాత్రః సన్ బభూవాద్భుతదర్శనః. 49

ప్రదోషకాలే హనుమాం స్తూర్ణ ముత్ప్లుత్య వీర్యవాన్,
ప్రవివేశ పురీం రమ్యాం సువిభక్తమహాపథామ్. 50

ప్రాసాదమాలావితతాం స్తమ్భైః కాఞ్చనరాజతైః,
శాతకుమ్భమయై ర్జాలై ర్గన్ధర్వనగరోపమామ్. 51

సప్త భౌమాష్టభౌమైశ్చ సందదర్శ మహాపురీమ్,
తలై స్స్ఫటిక సఙ్కీర్ణైః కార్తస్వరవిభూషితైః. 52

వైడూర్యమణిచిత్రై శ్చ ముక్తాజాలవిభూషితైః
తలైః శుశుభిరే తాని భవనా న్యత్ర రక్షసామ్. 53

కాఞ్చనాని చ చిత్రాణి తోరణాని చ రక్షసామ్,
లఙ్కా ముద్యోతయామాసు స్సర్వత స్సమలఙ్కృతామ్. 54

అచిన్త్యా మద్భుతాకారాం దృష్ట్వా లఙ్కాం మహాకపిః,
ఆసీ ద్విషణ్ణో హృష్టశ్చ వైదేహ్యా దర్శనోత్సుకః. 55

స పాణ్డురోద్విద్ధవిమానమాలినీం
మహార్హ జామ్బూనదజాలతోరణామ్,
యశస్వినీం రావణబాహుపాలితాం
క్షపాచరై ర్భీమబలై స్సమావృతామ్ 56

చన్ద్రో౽పి సాచివ్య మివాస్య కుర్వం
స్తారాగణై ర్మధ్యగతో విరాజన్,

జ్యోత్స్నా వితానేన వితత్య లోక
ముత్తిష్ఠతే నైకసహస్రరశ్మిః. 57

శఙ్ఖప్రభం క్షీరమృణాళవర్ణ
ముద్గచ్ఛమానం వ్యవభాసమానమ్,
దదర్శ చన్ద్రం స హరిప్రవీరః
పోప్లూయమానం సరసీవ హంసమ్. 58

ఇత్యార్షే శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, వాల్మీకీయే,
చతుర్వింశత్సహస్రికాయాం, సంహితాయాం,
శ్రీమత్సున్దరకాణ్డే ద్వితీయ స్సర్గః

## శ్రీమద్రామాయణ మాహాత్మ్యమ్

శ్లో. విధిం తే సంప్ర వక్ష్యామి రామనామ విలేఖనే,
సర్వపాప ప్రశమనం సర్వశ్రేయ స్స మద్దిదమ్.

## ౨ వ సర్గము

దరిచేరరాని ఆ సాగరమును అవలీలగ దాటిపోయి, స్వస్థచిత్తుడై త్రికూటశిఖరమున నిర్మితమైన లంకను చూచి వృక్షములు కురిసిన పూలతో ఆ హనుమ ఒక పూలరాశి వలె కనబడుచుండెను. నూఱు యోజనముల దూరమును దాటినను అతడేమియు అలసట చెందలేదు.

### లంకా నగర వర్ణనము

వందలకొలది యోజనములైనను ఆకాశమున ఎగిరిపోగల నాకు ఈ నూఱు యోజనముల సముద్రము ఒక లెక్కయా అనుకొను చుండెను. లంకకు చేరిన హనుమానుడు పచ్చగ పెరిగిన గడ్డి బీడులను, సువాసనలు వెదజల్లుచున్న వనములను, కొండలతో, గండ శిలలతో నిండిన ఆ ప్రదేశములను ఏపుగా పెరిగిన చెట్లతో నిండిన కొండలను, పూచియున్న వన పంక్తులను చూచుచు త్రికూటమున నిలిచి లంకాపట్టణమువంక చూచుచుండెను. ఆ ప్రదేశమున రకరకముల పుష్పవృక్షములు, ఫలవృక్షములు ఏపుగ పెరిగి ఉన్నవి. ఆ వృక్షములందు ఎన్నియో పక్షులు నివసించు చున్నవి. ఆ వృక్షముల చిగురుకొమ్మలు గాలికి కదలాడుచున్నవి. అచ్చట దిగుడుబావులు హంసకారండవాదిపక్షులకు నివాసములైనవి. ఆ వాపికయందు పద్మములు, ఉత్పలములు చక్కగ పూచి ఉన్నవి. ఆ వృక్షములు ఆఱుకాలములు చక్కగ పూయుచు, ఫలించుచు ఉన్నవి. అచటి ఉద్యానవనములు చూడ ముచ్చటగ నున్నవి. లంకానగరము చుట్టును పరిఖలు అనేకములున్నవి. వానిలో కలువలు, తామరలు చక్కగ పూచి దృష్టి నాకర్షించుచున్నవి.

సీతను అపహరించి తెచ్చినట్టి [illegible]డియు లంకాధిపతి లంకలో త్రికూటపర్వత శిఖరముపై [illegible]. [illegible] ద్వారముల వద్ద పెద్ద ధనుస్సులు ధరించి కాపలా కాయుచుండిరి. [illegible] [illegible] ప్రాకారములు [illegible] అత్యున్నత సౌధములు [illegible] కాంతులీను [illegible] విశాలమైన [illegible] వీధులు కానవచ్చుచున్నవి. కోట గోడలయందు వందలకొలదిగ అట్టాలకములు కానవచ్చుచున్నవి. పతాకములతో, ధ్వజములతో నగరము అలంకృతమై యున్నది. కోటలోనికి రాకపోకలకును ఉపయోగించు ద్వారములు బంగారముతో నిర్మితమైనవి. అది ఒక దేవతానగరము వలె తోచుచుండెను. అత్యున్నతమైన త్రికూటశిఖరమున విశ్వకర్మచే నిర్మితమైన ఆ లంక భూమి ఆధారము అక్కరలేకుండ ఆకాశమునన నిర్మితమైనట్లు కానబడుచుండెను. ఒకప్పుడు కుబేరునకు నివాసభూమి అయిన ఈ లంక [illegible] అనిపించు చున్నది. [illegible] కోపముతో భయంకరమైన ఆయుధధారులైన రాక్షసులచే రక్షింపబడుచున్న లంకను [illegible] లంకకు చేరుటకు ప్రతిబంధకముగ [illegible] సముద్రమును తలంచి హనుమంతుడు ఇట్లు ఆలోచింపసాగెను.

వానరులందరు ఇక్కడకు వచ్చి ఏమి చేయగలరు? యుద్ధము చేసి లంకను గెలుచుట సాధ్యముకాదు. దేవతలకును సాధ్యము కాదు. రావణపాలితమైన ఈ లంకను చేరి రాముడు మాత్రము ఏమి చేయగలడు? రాక్షసుల విషయమున సామ, దాన, భేద, దండములు అను ఉపాయములు నాలుగును సఫలము కావు. వానరులలో నేను, సుగ్రీవ మహారాజు, యువరాజు అంగదుడు, నీలుడు ఈ నలుగురకు మాత్రమే లంకను చేరగల శక్తి [illegible] జీవించి[illegible]

ఉన్నదో లేదో తెలిసికొని ఫలసిద్ధి ఉన్నది. జనకాత్మజను చూచిన
తరువాత నా కర్తవ్యమును గుర్తించి ఆలోచించెదను. ఆ కొండ
శిఖరమున కూర్చుండి శ్రీరామచంద్రుని అభ్యుదయమును కోరి
క్షణకాలమాలోచించెను. క్రూర రాక్షస రక్షితమైన ఈ లంకలో ఈ
రూపములో ప్రవేశించుట శక్యముకాదు. ఈ రాక్షసులను వంచించి
నేను సీతను అన్వేషింపవలసి ఉన్నది. అతి సూక్ష్మమైన రూపముతో
లంకలో ప్రవేశింపవలెను. జనకాత్మజను చూచుటకు వెళ్లవలెను.
రాక్షసాధిపతి రావణుని కంట పడరాదు. రామచంద్రుని కార్యము
విఫలము కారాదు. సీతను ఏకాంతమున ఒంటరిగా చూచుటకు వీలైనను
దూత అసమర్థుడైనచో సూర్యోదయమున చీకటి అంతరించి
పోయినట్లుగా ఫలించిన కార్యములును విఫలములగుచుండును.
సాధ్యాసాధ్యములను సరిగ గుర్తింపలేని బుద్ధి మేలుకాదు. అన్నియు
నాకు తెలియునని అహంకరించు దూతలు కార్యములను పాడు
చేయుచుందురు. కార్యము సఫలమగు విధానమేమి? వైకల్యము
కలుగని విధమేమి? ఈ సముద్ర లంఘనము సఫలమగు మార్గమేమి?
నేను రాక్షసుల కంటబడినచో రావణునకు తెలియును. గోచరమైనచో
రామచంద్రుని కార్యము వ్యర్థమగును. నేను రాక్షస రూపము ధరించి
ఉన్నను ఈ రాక్షసులు నన్ను గుర్తింపగలరు. వాయువునకు కూడ ఈ
రాక్షసుల అనుమతి లేనిదే సంచరింప వీలు లేదని నా విశ్వాసము. మహా
బలవంతుడైన ఈ రాక్షసులకు తెలియనిది ఏదియు ఇచట లేదని నా
విశ్వాసము. నేను ఇదే రూపమున ఇక్కడ దాగి ఉన్నచో నాకును
అనర్థమే. రామకార్యము పాడగును. కనుక నేను అతి సూక్ష్మ
రూపమును ధరించి శ్రీరామచంద్రుని కార్యసిద్ధికై లంకలో
ప్రవేశించెదను. ఈ రాత్రివేళ లంకలో ప్రవేశించి ప్రతి గృహము
నందును వెదకుచు సీతాదేవి జాడ తెలిసికొందును.

అని ఆలోచించి హనుమంతుడు సీతాదేవిని ఎప్పుడు చూతునా అను కుతూహలముతో సూర్యాస్తమయమునకై ఎదురు చూచుచుండెను. సూర్యుడు అస్తమింపగనే వాయునందనుడు తన దేహమును కుదించి పిల్లియంత రూపమును దాల్చెను. ప్రదోషకాలమున విశాలమగ రాజమార్గములతో కూడిన లంకవైపునకు సాగిపోయెను. క్రమక్రమముగ లంక స్పష్టముగ కానవచ్చుచుండెను. లంకలోని సౌధములు, హర్మ్యములు స్పష్టముగ కానవచ్చుచున్నవి. ఆ మేడల స్తంభములు బంగారముతో, వెండితో నిర్మితములైనవి. రత్నములు తాపడము చేయబడినవి. కొన్ని మేడల స్తంభములు మేలిమి బంగారముతో ఏనుగు దంతములతో కూడ నిర్మింపబడినవి. ఆ మేడలు ఏడెనిమిది అంతస్తులతో కూడినవి. ఆ మేడలు లంకకు అలంకారముగ నున్నవి. లంకా పట్టణవైభవమును చూచిన హనుమంతునకు హర్షము, విషాదము కూడ ఏకకాలమున కలిగినవి. ఏమైనను ఈ లంకలో సీత జాడను తెలిసికొని తీరవలెనను కుతూహలము కలిగెను.

ఇంతలో హనుమకు సాయపడుటకో అనునట్లుగ చంద్రుడు వెన్నెలను విరజిమ్ముచు వెన్నెల అను చాందినిచే లోకమును అలంకరించుచు ఆకాశమున నుదయించెను. ఆకసమున నుదయించి క్రమక్రమముగా మీదికి ఎగబ్రాకుచున్న చంద్రుడు సరస్సులో కెరటములపై తూగాడుచున్న హంసయో అన్నట్లుండెను.



# ३. తృతీయ స్సర్గః

స లమ్బశిఖరే లమ్బే లమ్బతోయదసన్నిభే,
సత్త్వ మాస్థాయ మేధావీ హనుమా న్మారుతాత్మజః. 1

నిశి లఙ్కాం మహాసత్త్వో వివేశ కపికుఞ్జరః,
రమ్య కానన తోయాఢ్యాం పురీం రావణపాలితామ్. 2

శారదామ్బుధరప్రఖ్యై ర్భవనై రుపశోభితామ్,
సాగరోపమనిర్ఘోషాం సాగరానిల సేవితామ్. 3

సుపుష్టబలసఙ్ఘుష్టాం యథైవ విటపావతీమ్,
చారుతోరణనిర్యూహాం పాణ్డురద్వారతోరణామ్. 4

భుజగాచరితాం గుప్తాం శుభాం భోగవతీ మివ,
తాం స విద్యుద్ఘనాకీర్ణాం జ్యోతిర్మార్గనిషేవితామ్. 5

మన్దమారుతసంచారాం యథేన్ద్ర స్యామరావతీమ్,
శాతకుమ్భేన మహతా ప్రాకారే ణాభిసంవృతామ్. 6

కిఙ్కిణీజాలఘోషాభిః పతాకాభి రలఙ్కృతామ్,
ఆసాద్య సహసా హృష్టః ప్రాకార మభిపేదివాన్. 7

విస్మయావిష్టహృదయః పురీ మాలోక్య సర్వతః,
జామ్బూనదమయై ర్ద్వారై ర్వైడూర్యకృతవేదికైః. 8

వజ్రస్ఫటికముక్తాభి ర్మణికుట్టిమభూషితైః,
తప్తహాటకనిర్యూహై రాజతామలపాణ్డురైః. 9

వైడూర్యకృతసోపానైః స్ఫాటికాన్తరపాంసుభిః,
చారుసఞ్జవనోపేతైః ఖ మివోత్పతితైః శుభైః. 10

క్రౌఞ్చబర్హిణ సఙ్ఘుష్టై రాజహంసనిషేవితైః,
తూర్యాభరణనిర్ఘోషైః సర్వతః ప్రతినాదితామ్. 11

వస్వోకసారాప్రతిమాం సమీక్ష్య నగరీం తతః,
ఖ మివోత్పతితాం లఙ్కాం జహర్ష హనుమాన్ కపిః. 12

తాం సమీక్ష్య పురీం లఙ్కాం రాక్షసాధిపతేః శుభామ్,
అనుత్తమా మృద్ధియుతాం చిన్తయామాస వీర్యవాన్. 13

నేయ మన్యేన నగరీ శక్యా ధర్షయితుం బలాత్,
రక్షితా రావణబలై రుద్యతాయుధధారిభిః. 14

కుముదాఙ్గదయో ర్వాపి సుషేణస్య మహాకపేః,
ప్రసిద్ధేయం భవేద్భూమి ర్మైన్దద్వివిదయో రపి. 15

వివస్వత స్తనూజస్య హరేశ్చ కుశపర్వణః,
ఋక్షస్య కేతుమాలస్య మమ చైవ గతి ర్భవేత్. 16

సమీక్ష్య తు మహాబాహో రాఘవస్య పరాక్రమమ్,
లక్ష్మణస్య చ విక్రాన్త మభవత్ప్రీతిమాన్ కపిః. 17

తాం రత్నవసనోపేతాం గోష్ఠాగారావతంసకామ్,
యన్త్రాగారస్తనీ మృద్ధాం ప్రమదా మివ భూషితామ్. 18

న శక్యా మా మవజ్ఞాయ ప్రవేష్టుం నగరీ త్వయా,
అద్య ప్రాణైః పరిత్యక్త స్స్వప్స్యసే నిహతో మయా. 29

అహం హి నగరీ లఙ్కా స్వయమేవ ప్లవఙ్గమ,
సర్వతః పరిరక్షామి హ్యేత త్తే కథితం మయా. 30

లఙ్కాయా వచనం శ్రుత్వా హనుమాన్ మారుతాత్మజః,
యత్నవాన్ స హరిశ్రేష్ఠ స్స్థిత శ్శైల ఇ వాపరః. 31

స తాం స్త్రీరూపవికృతాం దృష్ట్వా వానరపుఙ్గవః,
ఆబభాషేఽథ మేధావీ సత్త్వవాన్ ప్లవగర్షభః. 32

ద్రక్ష్యామి నగరీం లఙ్కాం సాట్టప్రాకారతోరణామ్,
ఇత్యర్థ మిహ సంప్రాప్తః పరం కౌతూహలం హి మే. 33

వనా న్యుపవనా నీహ లఙ్కాయాః కాననాని చ,
సర్వతో గృహముఖ్యాని ద్రష్టు మాగమనం హి మే. 34

తస్య తద్వచనం శ్రుత్వా లఙ్కా సా కామరూపిణీ,
భూయ ఏవ పున ర్వాక్యం బభాషే పరుషాక్షరమ్. 35

మా మనిర్జిత్య దుర్బుద్ధే రాక్షసేశ్వరపాలితామ్,
న శక్య మద్య తే ద్రష్టుం పు రీయం వానరాధమ. 36

తత స్సకపిశార్దూల స్తా మువాచ నిశాచరీమ్,
దృష్ట్వా పురీ మిమాం భద్రే పున ర్యాస్యే యథాగతమ్. 37

తతః కృత్వా మహానాదం సా వై లఙ్కా భయావహమ్,
త లేన వానరశ్రేష్ఠం తాడయామాస వేగితా. 38

తత స్స కపిశార్దూలో లఙ్కయా తాడితో భృశమ్,
ననాద సుమహానాదం వీర్యవాన్ పవనాత్మజః. 39

తత స్సంవర్తయామాస వామహస్తస్య సోఽఙ్గులీః,
ముష్టినాఽభిజఘా నైనాం హనుమాన్ క్రోధమూర్ఛితః. 40

స్త్రీ చేతి మన్యమానేన నాతిక్రోధ స్స్వయం కృతః,
సా తు తేన ప్రహారేణ విహ్వలాఙ్గీ నిశాచరీ,
పపాత సహసా భూమౌ వికృతాననదర్శనా. 41

తత స్తు హనుమాన్ ప్రాజ్ఞ స్తాం దృష్ట్వా వినిపాతితామ్,
కృపాం చకార తేజస్వీ మన్యమానః స్త్రియం తు తామ్.

తతో వై భృశసంవిగ్నా లఙ్కా సా గద్గదాక్షరమ్,
ఉవా చాగర్వితం వాక్యం హనుమన్తం ప్లవఙ్గమమ్. 43

ప్రసీద సుమహాబాహో త్రాయస్వ హరిసత్తమ,
సమయే సౌమ్య తిష్ఠన్తి సత్త్వవన్తో మహాబలాః. 44

అహం తు నగరీ లఙ్కా స్వయమేవ ప్లవఙ్గమ,
నిర్జితాఽహం త్వయా వీర విక్రమేణ మహాబల. 45

ఇదం తు తథ్యం శృణు వై బ్రువన్త్యా మే హరీశ్వర,
స్వయంభువా పురా దత్తం వరదానం యథా మమ. 46

యదా త్వాం వానరః కశ్చి ద్విక్రమా ద్వశ మానయేత్,
తదా త్వయా హి విజ్ఞేయం రక్షసాం భయ మాగతమ్. 47

యుండెను. క్రౌంచ పక్షులు, నెమళ్ళు, రాజహంసలు మధుర ధ్వనులు ఒనర్చుచున్నవి. ఆభరణ ధ్వనులు, మంగళ వాద్యములతో ఆ నగరము మారుమ్రోగు చుండెను. అమరావతీ నగరము వలె సర్వసమృద్ధమైన ఆ లంకానగరమును చూచి హనుమ చాల ఆనందపడెను. ఆ పట్టణమును పరిశీలనగ చూచి ఇటుల ఆలోచించెను.

'ఈ పట్టణమున ప్రవేశించుట, అక్రమింప చూచుట ఎవ్వరికైనను శక్యమగునా అనిపించుచున్నది. ఈ నగరమును రాక్షస బలములు అతి జాగరూకములై రక్షించుచున్నవి. కుముదుడు, అంగదుడు, సుషేణుడు, మైన్ద ద్వివిదులకు ఈ పట్టణము గురించి తెలిసి యుండవచ్చును. సుగ్రీవ మహారాజు కుశపర్వుడు కేతుమాలుడను భల్లూకపతి నేను మాత్రమే ఈ లంకలో అడుగు పెట్టగలమేమో!' ఇటుల ఆలోచించుచున్న హనుమానునకు రామలక్ష్మణుల పరాక్రమము తలంచినపుడు మరల కొంత అధైర్యము తొలగి తన కర్తవ్యమందు ప్రీతి కలిగెను. అలంకృతమై సుందరమైన ఆ లంకానగరము రత్నాలంకారములచే అలంకరింపబడిన సుందర స్త్రీ వలె భాసించెను. రత్న నిర్మితములైన మహా భవనములు, దీపములు నగరములో ఎక్కడను చీకటి లేకుండ చేయుచున్నవి. ఆ వెలుతురులో లంకానగరము స్పష్టముగ కనిపించుచున్నది.

ప్రాకారము దాటి లోపలకు పోదలంచిన హనుమానుని ఎదుట ఆ లంకానగరాధిదేవత నిజరూపమును ధరించి ఎదుట నిలిచెను. భయంకరముగ అఱచుచు హనుమానుని అడ్డగించి ఇట్లు పలికెను 'నీ వెవడవు? అడవులలో తిరుగవలసిన నీవు ఏ పని మీద ఇచ్చటికి

వచ్చితివి? నీ గొంతులో ప్రాణములు నిలిచి ఉండగనే నాకు సమాధానము చెప్పుము. వానరా! రావణబలముచే రక్షితమైన ఈ లంకలో నీవు ప్రవేశింపలేవు'. ఆ మాటలు విని హనుమానుడు నీవు అడిగితివి కనుక యథార్థము చెప్పుచున్నాను. అంద చందములు లేని వికృతమైన నేత్రములతో ఈ సుందర లంకానగరద్వారదేశమున నీవెవరవు? లోపలకు పోకుండ నన్ను నీవేల అడ్డగించుచున్నావు.'

ఆ హనుమంతుని మాటలు విని కోపముతో పరుషముగా ఆంజనేయునితో పల్కెను. నేను రాక్షస చక్రవర్తి అజ్ఞచే ఈ లంకను రక్షించు చున్నాను. నన్ను కాదని నీవు లంకలో అడుగు పెట్టలేవు. ఒక్క దెబ్బతో నీవు నేల కూలగలవు. నేను లంకను. ఈ లంకా నగరమునకు అధిదేవతను. ఈ లంకా నగరమును సర్వతోముఖముగ రక్షించు చున్నాను.

లంక మాటలను విని హనుమంతుడు ఏ పరిస్థితినైనను ఎదుర్కొనుటకు ధైర్యముగ జాగరూకుడై ఉండెను. అంతేకాక లంకతో ఇట్లు పలికెను. మంచి కోటగోడలు, ప్రాకారము తోరణములు కలిగి అద్భుతముగ తోచుచున్న ఈ లంకానగరమును ఒకసారి చూచుటకై వచ్చితివి. లంకను చూచుటకై నాకు మిక్కిలి కుతూహలముగ నున్నది. అంతేకాదు ఇచటి వనములు, ఉద్యానవనములు, సుందరమైన భవనములు చూడవలెనని వచ్చితిని.

ఆ మాటలు విన్న లంక మరల అతి పరుషముగా మాటలాడ జొచ్చినది. 'ఓరి దుర్మతీ! వానరాధమా! నన్ను గెలువకుండ నీవు రావణ పాలితమైన ఈ లంకలో అడుగు పెట్టలేవు'. ఆ మాటలు విన్న 'హనుమంతుడు ఈ నగరమును ఒకసారి చూచి వచ్చిన దారినే తిరిగి

పోయెదనమ్మా' అని పలికెను. ఆ మాటలు విన్న లంక ఆంజనేయుని తీవ్రముగా అరచేతితో చరచెను. ఆ దెబ్బతిన్న ఆంజనేయుడు పెద్దగ గర్జించి ఎడమచేతి వ్రేళ్ళను ముడిచి, పిడికిలి బిగించి మిక్కిలి కోపముతో ఒక్కపోటు పొడిచెను. కుడిచేతి పిడికిలి అయినచో దెబ్బ గట్టిగా తగిలి వెంటనే చనిపోవునేమో అని ఎడమ చేతి పిడికిలితో కొట్టెను. ఆ దెబ్బకు లంక నేల కూలెను.

నేల కూలిన లంకను చూచినపుడు హనుమంతునికి దయ కలిగెను. ఒక స్త్రీపై చేయి చేసికొంటిని అని ఎంతో బాధపడెను. ఆ లంక హనుమంతునితో ఇట్లనెను. వానరేంద్రా! కోపము విడువుము. ప్రసన్నుడవగుము. రక్షింపుము. పెద్దలు మర్యాద తప్పరు. నేనీ లంకాధిదేవతను. నన్ను నీవు గెలిచితివి. నాకు బ్రహ్మ ఒక వరమిచ్చి యున్నాడు. ఏనాడు వానరుడు వచ్చి నిన్ను జయించునో ఆనాడే రాక్షసులకు కీడు మూడినదని తలంపుము. నాయనా! వానరోత్తమా! బ్రహ్మ మాటలు ఇప్పటికి చరితార్థము లైనవి. ఇప్పు డా సమయము వచ్చినది. బ్రహ్మ మాటలు వృథా కావు. సీతాపహరణము కారణముగా రావణునకు, రావణుని అనుసరించిన రాక్షస వర్గములకు వినాశకాలము వచ్చినది.

వానరోత్తమా! రావణ పాలితమగు ఈ లంకలో ప్రవేశించి నీవు చేయదలచిన పనులను చేసికొనిపొమ్ము. వానరోత్తమా! శాపపీడితమైన ఈ లంకలో ప్రవేశించి నీవు స్వేచ్ఛగా పతివ్రతామతల్లి యగు సీతాదేవిని అన్వేషింపుము. నీకు శుభము, సుఖము కలుగుగాక.



 

# 4. చతుర్థ స్సర్గః

స నిర్జిత్య పురీం శ్రేష్ఠాం లఙ్కాం తాం కామరూపిణీమ్,
విక్రమేణ మహాతేజా హనుమాన్ కపిసత్తమః. 1

అద్వారేణ మహాబాహుః ప్రాకార మభిపుప్లువే,
ప్రవిశ్య నగరీం లఙ్కాం కపిరాజహితంకరః. 2

చక్రేఽథ పాదం సవ్యం చ శత్రూణాం స తు మూర్ధని,
ప్రవిష్ట స్సత్త్వసమ్పన్నో నిశాయాం మారుతాత్మజః. 3

స మహాపథ మాస్థాయ ముక్తాపుష్పవిరాజితమ్,
తత స్తు తాం పురీం లఙ్కాం రమ్యా మభియయౌ కపిః.

హసితోత్కృష్టనినదై స్తూర్యఘోషపురస్సరైః,
వజ్రాఙ్కుశనికాశైశ్చ వజ్రజాలవిభూషితైః. 5

గృహమేధైః పురీ రమ్యా బభాసే ద్యౌ రి వామ్బుదైః,
ప్రజజ్వాల తదా లఙ్కా రక్షోగణగృహై శ్శుభైః. 6

సితాభ్రసదృశై శ్చిత్రైః పద్మస్వస్తికసంస్థితైః,
వర్ధమానగృహై శ్చాపి సర్వత స్సువిభూషితా. 7

తాం చిత్రమాల్యాభరణాం కపిరాజహితంకరః,
రాఘవార్థం చరన్ శ్రీమాన్ దదర్శ చ ననన్ద చ. 8

భవనా ద్భువనం గచ్ఛన్ దదర్శ పవనాత్మజః,
వివిధాకృతిరూపాణి భవనాని తత స్తతః. 9

శుశ్రావ మధురం గీతం త్రిస్థానస్వరభూషితమ్,
స్త్రీణాం మదసమృద్ధానాం దివి చాప్సరసా మివ. 10

శుశ్రావ కాఞ్చీనినదం నూపురాణాం చ నిస్స్వనమ్,
సోపాన నినదాంశ్చైవ భవనేషు మహాత్మనామ్. 11

ఆస్ఫోటితనినాదాం శ్చక్ష్వేళితాం శ్చ తత స్తతః,
శుశ్రావ జపతాం తత్ర మన్త్రాన్ రక్షోగృహేషు వై. 12

స్వాధ్యాయ నిరతాంశ్చైవ యాతుధానా న్దదర్శ సః,
రావణస్తవసంయుక్తాన్ గర్జతో రాక్షసా నపి. 13

రాజమార్గం సమావృత్య స్థితం రక్షోబలం మహత్,
దదర్శ మధ్యమే గుల్మే రావణస్య చరాన్ బహూన్. 14

దీక్షితాన్ జటిలాన్ ముణ్డాన్ గోఽజినామ్బరధారిణః,
దర్భముష్టిప్రహరణా నగ్నికుణ్డాయుధాం స్తథా. 15

కూటముద్గరపాణీంశ్చ దణ్డాయుధధరా నపి,
ఏకాక్షా నేకకర్ణాంశ్చ లమ్బోదర పయోధరాన్. 16

కరాళాన్ భుగ్నవక్త్రాం శ్చ వికటాన్ వామనాం స్తథా,
ధన్వినః ఖడ్గిన శ్చైవ శతఘ్నీముసలాయుధాన్. 17

పరిఘోత్తమహస్తాం శ్చ విచిత్రకవచోజ్జ్వలాన్,
నాతిస్థూలాన్ నాతికృశాన్ నాతిదీర్ఘాతిహ్రస్వకాన్. 18

నాతిగౌరాన్ నాతికృష్ణాన్ నాతికుబ్జాన్ న వామనాన్,
విరూపాన్ బహురూపాం శ్చ సురూపాం శ్చ సువర్చసః. 19

ధ్వజినః పతాకినశ్చైవ దదర్శ వివిధాయుధాన్,
శక్తివృక్షాయుధాంశ్చైవ పట్టసాశనిధారిణః. 20

క్షేపణీ పాశహస్తాం శ్చ దదర్శ స మహాకపిః,
స్రగ్విణ స్త్వనులిప్తాం శ్చ వరాభరణభూషితాన్. 21

నానావేషసమాయుక్తాన్ యథా స్వైరగతాన్ బహూన్,
తీక్ష్ణశూలధరాం శ్చైవ వజ్రిణ శ్చ మహాబలాన్. 22

శత సాహస్ర మవ్యగ్ర మారక్షం మధ్యమం కపిః,
రక్షోధిపతినిర్దిష్టం దద ర్శాన్తఃపురాగ్రతః. 23

స తదా తద్గృహం దృష్ట్వా మహాహాటకతోరణమ్,
రాక్షసేన్ద్రస్య విఖ్యాత మద్రిమూర్ధ్ని ప్రతిష్ఠితమ్. 24

పుణ్డరీకావతంసాభిః పరిఘాభి రలఙ్కృతమ్,
ప్రాకారావృత మత్యన్తం దదర్శ స మహాకపిః. 25

త్రివిష్టపనిభం దివ్యం దివ్యనాదవినాదితమ్,
వాజీహేషితసఙ్ఘుష్టం నాదితం భూషణై స్తథా. 26

రథై ర్యానై ర్విమానై శ్చ తథా హయగజై శ్శుభైః,
వారణై శ్చ చతుర్దన్తై శ్శ్వేతాభ్రనిచయోపమైః. 27

భూషితం రుచిరద్వారం మత్తైశ్చ మృగపక్షిభిః,
రక్షిభి స్సుమహావీర్యై ర్యాతుధానై స్సహస్రశః. 28

రాక్షసాధిపతే ర్గుప్త మావివేశ మహాకపిః,
స హేమ జామ్బూనద చక్రవాళం
మహార్హ ముక్తామణి భూషితాన్తమ్,
పరార్థ్య కాలాగురుచన్దనాక్తం
స రావణాన్తఃపుర మావివేశ. 29

ఇత్యార్షే శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, వాల్మీకియే,
చతుర్వింశత్సహస్రికాయాం, సంహితాయాం,
శ్రీమత్సున్దరకాణ్డే చతుర్థ స్సర్గః.

## శ్రీమద్రామాయణ మాహాత్మ్యమ్

శ్లో. నిర్వర్త్య నిత్యకర్మాణి పూర్వాహ్ణె ప్రాఙ్ముఖ శ్శుచిః,
ప్రణమ్య రామం సంకల్ప్య లిఖే న్నియత మానసః.

# 4వ సర్గము

## హనుమంతుడు లంకలో చూచిన విశేషములు

తన విక్రమముచే కామ రూపిణియగు లంకాధిదేవతను గెలిచి ఆ హనుమంతుఁడు సింహద్వారమునుండి కాక, ప్రాకారము మీదుగ లోనికి దుమికెను. సుగ్రీవుని హితము ఆచరింప తలంచి అతడు ముందుగ తన యెడమ పాదమును మోపెను. మహాబలవంతుడగు నా వానరోత్తముడు ఆ రాత్రి పుష్పములు చల్లియున్న రాజవీథిలో లంకలోనికి పోవుచుండెను. మంగళ వాద్యములు మ్రోగు చున్నవి. రాక్షసుల అట్టహాసములు వినబడుచున్నవి. రతనాల తోరణములతో అలంకతమైన అత్యున్నత భవనములకు ప్రకాశవంతమైన ఆ లంక మేఘమండలములతో నిండిన ఆకాశముతో విరాజిల్లుచుండెను. పద్మములు, స్వస్తికములు, వర్ధమానములు అని ప్రసిద్ధములైన అత్యుత్తమమైన రాక్షస నివాస భవనములతో ఆ లంక చూడ ముచ్చటగా నుండెను.

సుగ్రీవుని హితము కోరిన ఆంజనేయుడు ఆ లంకను, పరిశీలనగా లంకావైభవమును చూచుచు మిక్కిలి ఆనందపడెను. ఒక్కొక్క భవనమునే చూచుచు ముందునకు సాగిపోవుచుండెను. లంకాపురము నందలి స్త్రీల గానము సలక్షణమైన అప్సరసల సంగీతము వలె వినబడుచుండెను. మేడమెట్లు ఎక్కుచున్నపుడు దిగుచున్నపుడు పదధ్వనులు కూడ వినబడు చుండెను.

రాక్షసుల సింహనాదములు, దండలు చరచుకొన్నప్పటి ధ్వనులు, మంత్రములు జపించునప్పటి ధ్వనులు రాక్షస గృహముల నుండి వెలువడుచున్నవి. వేదాధ్యయనము చేయుచున్న రాక్షసులు కనబడిరి. కొందరు రాక్షసులు రాక్షస చక్రవర్తులకు కైవారములు పలుకుచుండిరి. రాక్షస వీరులు రాగల మార్గమంత క్రమ్ముకొని యుండిరి. మధ్యమ ప్రాకారమున రావణాసురుని గూఢచారులుండిరి. కొందరు దీక్షవహించి యున్నట్లు, జడలు ధరించి కొందరు, బోడి గుండులతో కొందరు గొడ్డుచర్మము కప్పుకొని కొందరు, గుప్పిట దర్భలను పట్టుకొని కొందరు, వివిధాయుధదారులు కొందరు, రకరకములైన ఆకారములతో, రకరకములైన దేహములతో, వివిధ వేషములతో సంచరించుచుండిరి.

మధ్యమావరణములో లక్షల కొలది రాక్షసులు రాజాంతఃపురముల ముందు కావలా కాయుచుండిరి. ఆ భవనములు బంగారు తోరణములచే అలంకృతమైయుండెను. తామరలు పూచిన పరిఖలచే ఆవృతమై యుండి, చుట్టును ప్రాకారములతో స్వర్గభవనమువలె నుండెను. మనోహరమైన ధ్వనులు లోపలి పక్షులు మధురముగ కూయుచున్నవి. రాక్షసులచే సురక్షితమైన ఆ రాక్షసరాజు భవనమును హనుమ ఎవరికి తెలియకుండగ చేరెను. ఆ భవనము బంగారు ప్రాకారములు కలిగి యుండెను. నల్ల అగరువు, చందనముతో గోడలు పూతబెట్టబడి యుండెను.



## 5. పఞ్చమ స్సర్గః

తత స్స మధ్యంగత మంశుమన్తం
జ్యోత్స్నావితానవం మహదుద్వమన్తమ్,
దదర్శ ధీమాన్ దివి భానుమన్తమ్.
గోష్ఠే వృషం మత్త మివ భ్రమన్తమే. 1

లోకస్య పాపాని వినాశయన్తం
మహోదధిం చాపి సమేధయన్తమ్
భూతాని సర్వాణి విరాజయన్తం
దదర్శ శీతాంశు మథాభియాన్తమ్. 2

యా భాతి లక్ష్మీ ర్భువి మన్దరస్థా
తథా ప్రదోషేషు చ. సాగరస్థా,
తథైవ తోయేషు చ పుష్కరస్థా
రరాజ సా చారు నిశాకరస్థా. 3

హంసో యథా రాజతపఞ్జరస్థ
స్సింహో యథా మన్దరకన్దరస్థః,
వీరో యథా గర్వితకుఞ్జరస్థ
శ్చన్ద్రో౭పి బభ్రాజ త థామ్బరస్థః. 4

స్థితః కకుద్మానివ తీక్ష్ణశృఙ్గో
మహాచల శ్శ్వేత ఇ వోచ్చశృఙ్గః,
హస్తీవ జామ్బూనదబద్ధశృఙ్గో
రరాజ చన్ద్రః పరిపూర్ణశృఙ్గః. 5

వినష్టశీతామ్బుతుషారపఙ్కో
మహాగ్రహగ్రాహవినష్టపఙ్కః,
ప్రకాశలక్ష్యాశ్రయనిర్మలాఙ్కో
రరాజ చన్ద్రో భగవాన్ శశాఙ్కః. 6

శిలాతలం ప్రాప్య యథా మృగేన్ద్రో
మహారణం ప్రాప్య యథా గజేన్ద్రః,
రాజ్యం సమాసాద్య యథా నరేన్ద్ర
స్తథా ప్రకాశో విరరాజ చన్ద్రః. 7

ప్రకాశ చంన్ద్రోదయనష్టదోషః
ప్రవృద్ధరక్షఃపిశితాశదోషః,
రామాభి రామేరిత చిత్తదోషః
స్వర్గప్రకాశో భగవాన్ ప్రదోషః. 8

తన్త్రీస్వనాః కర్ణసుఖాః ప్రవృత్తా
స్స్వపన్తి నార్యః పతిభి స్సువృత్తాః
నక్తంచరా శ్చాపి తథా ప్రవృత్తా
విహర్తు మత్యద్భుతరౌద్రవృత్తాః. 9

మత్తప్రమత్తాని సమాకులాని
రథాశ్వభద్రాసనసఙ్కులాని,
వీరశ్రియా చాపి సమాకులాని
దదర్శ ధీమాన్ స కపిః కులాని. 10

పరస్పరం చాధిక మాక్షిపన్తి
భుజాం శ్చ పీనా నధివిక్షిపన్తి,
మత్తప్రలాపా నధివిక్షిపన్తి
మత్తాని చాన్యోన్య మధిక్షిపన్తి. 11

రక్షాంసి వక్షాంసి చ విక్షిపన్తి
గాత్రాణి కాన్తాసు చ విక్షిపన్తి,
రూపాణి చిత్రాణి చ విక్షిపన్తి
దృఢాని చాపాని చ విక్షిపన్తి. 12

దదర్శ కాన్తాశ్చ సమాలపన్త్య
స్త థాపరా స్తత్ర పున స్స్వపన్త్యః,
సురూపవక్త్రాశ్చ తథా హసన్త్యః
క్రుద్ధాః పరా శ్చాపి వినిశ్శ్వసన్త్యః. 13

మహాగజై శ్చాపి తథా నదద్భి
స్సుపూజితై శ్చాపి తథా సుసద్భిః,
రరాజ వీరైశ్చ వినిశ్శ్వసద్భి
ర్హ్రదో భుజఙ్గై రివ నిశ్శ్వసద్భిః. 14

బుద్ధిప్రధానాన్ రుచిరాభిధానాన్
సంశ్రద్దధానాన్ జగతఃప్రధానాన్,
నానావిధానాన్ రుచిరాభిధానాన్
దదర్శ తస్యాం పురి యాతుధానాన్. 15

ననన్ద దృష్ట్వా స చ తాన్ సురూపాన్
నానాగుణా నాత్మగుణానురూపాన్,
విద్యోతమానాన్ స తదానురూపాన్
దదర్శ కాంశ్చి చ్చ పున ర్విరూపాన్. 16

తతో వరార్హా స్సువిశుద్ధభావా
స్తేషాం స్త్రియ స్తత్ర మహానుభావాః,
ప్రియేషు పానేషు చ సక్తభావా
దదర్శ తారా ఇవ సుప్రభావాః. 17

శ్రియా జ్వలన్తీ స్త్రపయోపగూఢా
నిశీథకాలే రమణోపగూఢాః,
దదర్శ కాశ్చి త్ప్రమదోపగూఢా
యథా విహఙ్గాః కుసుమోపగూఢాః. 18

అన్యాః పున్హర్మ్యతలోపవిష్టా
స్తత్ర ప్రియాఙ్కేషు సుఖోపవిష్టాః,
భర్తుః ప్రియా ధర్మపరా నివిష్టా
దదర్శ ధీమా౯ మదనాభివిష్టాః. 19

అప్రావృతాః కాఞ్చనరాజివర్ణాః,
కాశ్చి త్పరార్ధ్యా స్తపనీయవర్ణాః,
పున శ్చ కాశ్చి చ్ఛశలక్ష్మవర్ణాః,
కాన్తప్రహీణా రుచిరాఙ్గవర్ణాః. 20

తతః ప్రియాన్ ప్రాప్య మనోభిరామాన్
సుప్రీతియుక్తాః ప్రసమీక్ష్య రామాః,
గృహేషు హృష్టాః పరమాభిరామా
హరిప్రవీర స్స దదర్శ రామాః. 21

చన్ద్రప్రకాశాశ్చ హి వక్త్రమాలా
వక్రాక్షి పక్ష్మాశ్చ సునేత్రమాలాః,
విభూషణానాం చ దదర్శ మాలా
శ్శతహ్రదానా మివ చారుమాలాః. 22

న త్వేవ సీతాం పరమాభిజాతాం
పథి స్థితే రాజకులే ప్రజాతామ్,
లతాం ప్రపుల్లా మివ సాధుజాతాం
దదర్శ తన్వీం మనసాభిజాతామ్. 23

సనాతనే వర్త్మని సన్నివిష్టాం
రామేక్షణాం తాం మదనాభివిష్టామ్,
భర్తుర్మన శ్శ్రీమ దనుప్రవిష్టాం
స్త్రీభ్యో వరాభ్యశ్చ సదా విశిష్టామ్. 24

ఉష్ణార్దితాం సానుసృతాస్రకణ్ఠీం
పురా వరార్హోత్తమనిష్కకణ్ఠీమ్,
సుజాతపక్ష్మా మభిరక్తకణ్ఠీం
వనే ప్రవృత్తా మివ నీలకణ్ఠీమ్. 25

అవ్యక్తరేఖా మివ చన్ద్రరేఖాం
పాంసుప్రదిగ్ధా మివ హేమరేఖామ్,
క్షతప్రరూఢా మివ బాణరేఖాం
వాయుప్రభిన్నా మివ మేఘరేఖామ్. 26

సీతా మపశ్య న్మనుజేశ్వరస్య
రామస్య పత్నీం వదతాం వరస్య,
బభూవ దుఃఖాభిహత శ్చిరస్య
ప్లవఙ్గమో మన్ద ఇ వాచిరస్య. 27

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, వాల్మీకీయే,
చతుర్వింశత్సహస్రికాయాం, సంహితాయాం,
శ్రీమత్సున్దరకాణ్డే పఞ్చమ స్సర్గః

 

# 5వ సర్గము

## చంద్రుని కాంతి వర్ణన

చంద్రుడు ఉదయించి ఆకాశము మీదికి వచ్చుచు వెన్నెల కాంతులు వెదజల్లు చున్నాడు. ఆకాశమున సంచరించు ఆ చంద్రుడు గోష్ఠమున సంచరించు మహావృషభమువలె నుండెను. ఆ చంద్రుని కిరణకాంతిసోకి ప్రాణికోటి హాయిగ నుండెను. సముద్రము పొంగుచుండెను. సమస్తము వెన్నెలకాంతిలో స్పష్టముగ గోచరించుచుండెను.

ఆకసము మీదికి వచ్చిన చంద్రుడు వెండి పంజరములోని హంసవలె, మందరగిరి గుహయందు నిలిచిన సింహమువలె, మత్తేభముపై నధిరోహించిన వీరునివలె ప్రకాశించెను. వాడికొమ్ములు గల తెల్లని ఎద్దువలె, ఉన్నత శిఖరములుగల శ్వేతాచలమువలె, బంగరు తొడుగు వేయబడిన దంతములుగల ఐరావతమువలె పరిపూర్ణుడై చంద్రుడు ప్రకాశించుచుండెను.

సాయంకాలమున సూర్యుని తేజస్సు కూడ చంద్రుని యందు సంక్రమిచెను. అపుడు చంద్రుని తేజస్సు పెరిగెను. మంచురూపమగు మలినములు తొలగి మహాగ్రహమగు సూర్యుని కాంతిని పొందుటచే చంద్రుని మధ్యభాగములోని మచ్చకలిగినప్పటికి ప్రభావశాలిగా ప్రకాశించుచుండెను.

ఉన్నత శిలాతలమును చేరిన సింహమువలెను, రణరంగము చేరిన గజేంద్రుని వలెను రాజ్యాధిపత్యము వహించిన నరేంద్రుని వలెను చంద్రుడు ఆకాశములో ప్రకాశించు చుండెను. చంద్రుడు ఆకాశములో వెన్నెల వెలుగులు విరజిమ్ముచుండ చీకటులు తొలగెను. రాక్షస సంచారము పెరిగెను. భర్తల చాటువాక్యములచే తరుణీమణుల ప్రణయకోపము శాంతించెను.

వీణానాదములు చెవికింపుగా వినబడుచుండెను. పతివ్రతలు తమ పతులతో సుఖముగా శయనించిరి. అపుడు లంక స్వర్గమువలె తోచుచుండెను. రక్షకభటులు అరిలోకభయంకరులై లంకలో సంచరింప దొడంగిరి. రాక్షసవీరులు పరస్పరము పరిహాసము చేసికొనుచున్నారు. దండలు చరచుకొనుచున్నారు. త్రాగిన మత్తులు సందర్భశుద్ధి లేకుండ మాటలాడుచుండ మరికొందరు భార్యలతో శయనాగారములు చేరుచున్నారు. కొందరు రకరకముల వేషములు వేయుచున్నారు. మరికొందరు ధనుస్సులు ఎక్కుపెట్టుచున్నారు.

భర్తల కౌగిలులు విడిచిన స్త్రీలు కొందరు, నిద్రపోవుచున్న స్త్రీలు కొందరు, మంచి యింపయిన ముఖారవిందాలు కలిగిన కాంతలు, మందహాసము చేయుచున్న స్త్రీలు కొందరు, ప్రణయకోపముచే దీర్ఘ నిశ్వాసములు విడుచుచున్న స్త్రీలు కొందరు ఆంజనేయునకు కనిపించిరి.

బుద్ధిమంతులను, మంచిగ మాటలాడుచున్న, మంచి గౌరవము గల అనేక రాక్షసులను చూచెను. ఆ లంకలో హనుమంతునకు రూపవంతులైన వ్యక్తులు, కురూపులైన వ్యక్తులు కూడ కానవచ్చిరి. పరిశుద్ధమైన మనస్సు కలిగిన భర్తకు అనువర్తనముగ సంచరించు కమనీయమైన రూపురేఖలు కలిగిన స్త్రీలుకనబడిరి. భర్తలతో కలసి పాన గోష్ఠులయందు పాల్గొనిన ఆ స్త్రీలు ఆకాశమున నక్షత్రములవలె కానవచ్చిరి. కొందరు స్త్రీలు మేడల పైభాగమున భర్తలకు అత్యంత సన్నిహితముగ కూర్చుండిరి.

వారందరును తమ గృహిణీ ధర్మములను తప్పక భర్త అనురాగమునకు పాత్రలైరి. ఆ స్త్రీలు కొందరు బంగారు కాంతి కలవారు. మరికొందరు చంద్రుని వలె తెల్లనైన వారు. మరికొందరు స్త్రీలు విరహ పరితప్తలై ప్రియాగమనమునకై ఎదురు చూచుచుండిరి. తాము లేచి ఎదురు చూచుచున్న తమ భర్త రాగానే ఆనందించు చుండిరి. సుందరమైన నేత్రములతో, రమణీయమైన దేహసౌష్ఠవముతో మేడలయందు నిలిచి యున్న రమణీయ రాక్షస స్త్రీలు ఆకాశమున మెరయుచున్న మెఱపు తీగల వలె ఆంజనేయుని దృష్టికి గోచరించిరి. అతిలోకసౌందర్యవతి యగు జానకీదేవి మాత్రము ఆతని కనులకు గోచరింపలేదు.

ప్రాచీన పతివ్రతామతల్లుల మార్గమును విడువని, నిరంతరము శ్రీరామ చంద్రునిచే స్మరింపబడుచున్న ఆ సీతాదేవి ఎచ్చటను కానవచ్చుట లేదు. తాను ఋశ్యమూకమున చూచిన వస్తువులను ధరించిన వనితామణి ఆ సీత ఇచ్చట ఉన్నను మబ్బుల చాటున అవ్యక్తముగ నున్న చంద్రరేఖ వలె మట్టి పట్టిన సువర్ణశలాక వలె వాయువేగముచే చెదరిన మేఘరేఖ వలె ఉండునట్టి శ్రీరామపత్ని కానబడక హనుమానుడు మిక్కిలి విషాదము నొందెను.



# ౬. షష్ఠ స్సర్గః

స నికామం విమానేషు విషణ్ణః కామరూపధృత్,
విచచార పున ర్లఙ్కాం లాఘవేన సమన్వితః. 1

ఆససా దాథ లక్ష్మీవాన్ రాక్షసేన్ద్రనివేశనమ్,
ప్రాకారే ణార్కవర్ణేన భాస్వరే ణాభిసంవృతమ్. 2

రక్షితం రాక్షసై ర్ఘోరై స్సింహై రివ మహద్వనమ్,
సమీక్షమాణో భవనం చకాశే కపికుఞ్జరః. 3

రూప్యకోపహితై శ్చిత్రై స్తోరణై ర్హేమభూషితైః,
విచిత్రాభి శ్చ కక్ష్యాభి ర్ద్వారై శ్చ రుచిరై ర్వృతమ్. 4

గజాస్థితై ర్మహామాత్రై శ్శూరైశ్చ విగతశ్రమైః,
ఉపస్థిత మసంహార్యై ర్హయై స్స్యన్దనయాయిభిః. 5

సింహవ్యాఘ్రతనుత్రాణై ర్దాన్తకాఞ్చనరాజతైః,
ఘోషవద్భి ర్విచిత్రైశ్చ సదా విచరితం రథైః. 6

బహురత్నసమాకీర్ణం పరార్థ్యాసనభాజనమ్,
మహారథసమావాసం మహారథమహాస్వనమ్. 7

దృశ్యైశ్చ పరమోదారై స్తైస్తైశ్చ మృగపక్షిభిః,
వివిధై ర్బహుసాహస్రైః పరిపూర్ణం సమన్తతః. 8

వినీతై రన్తపాలైశ్చ రక్షోభి శ్చ సురక్షితామ్,
ముఖ్యాభి శ్చ వరస్త్రీభిః పరిపూర్ణం సమన్తతః. 9

ముదితప్రమదారత్నం రాక్షసేన్ద్రనివేశనమ్,
వరాభరణసంహ్రాదై స్సముద్రస్వననిస్స్వనమ్. 10

తద్రాజగుణసమ్పన్నం ముఖ్యై శ్చాగరుచన్దనైః,
మహాజనై స్సమాకీర్ణం సింహై రివ మహ ద్వనమ్. 11

భేరీమృదఙ్గాభిరుతం శఙ్ఖఘోష నినాదితమ్,
నిత్యార్చితం పర్వహుతం పూజితం రాక్షసై స్సదా. 12

సముద్ర మివ గమ్భీరం సముద్ర మివ నిస్స్వనమ్,
మహాత్మనో మహద్వేశ్మ మహారత్న పరిచ్ఛదమ్. 13

మహారత్నసమాకీర్ణం దదర్శ స మహాకపిః,
విరాజమానం వపుషా గజాశ్వరథసఙ్కులమ్. 14

లఙ్కాభరణ మిత్యేవ సోఽమన్యత మహాకపిః,
చచార హనుమాం స్తత్ర రావణస్య సమీపతః. 15

గృహాద్గృహం రాక్షసానా ముద్యానాని చ వానరః,
వీక్షమాణో హ్యసంత్రస్తః ప్రాసాదాం శ్చ చచార సః. 16

అవప్లుత్య మహావేగః ప్రహస్తస్య నివేశనమ్,
తతోఽన్య త్పుప్లువే వేశ్మ మహాపార్శ్వస్య వీర్యవాన్. 17

అథ మేఘప్రతీకాశం కుమ్భకర్ణనివేశనమ్,
విభీషణస్య చ తథా పుప్లువే స మహాకపిః. 18

మహోదరస్య చ గృహం విరూపాక్షస్య చైవ హి,
విద్యుజ్జిహ్వస్య భవనం విద్యున్మాలే స్తథైవ చ. 19

వజ్రదంష్ట్రస్య చ తథా పుప్లువే స మహాకపిః,
శుకస్య చ మహాతేజా స్సారణస్య చ ధీమతః. 20

తథా చేన్ద్రజితో వేశ్మ జగామ హరియూథపః,
జమ్బుమాలే స్సుమాలే శ్చ జగామ హరిసత్తమః. 21

రశ్మికేతో శ్చ భవనం సూర్యశత్రో స్తథైవ చ,
వజ్రకాయస్య చ తథా పుప్లువే స మహాకపిః. 22

ధూమ్రాక్షస్య చ సమ్పాతే ర్భవనం మారుతాత్మజః,
విద్యుద్రూపస్య భీమస్య ఘనస్య విఘనస్య చ. 23

శుకనాసస్య వక్రస్య శఠస్య వికటస్య చ,
బ్రహ్మకర్ణస్య దంష్ట్రస్య రోమశస్య చ రక్షసః. 24

యుద్ధోన్మత్తస్య మత్తస్య ధ్వజగ్రీవస్య రక్షసః,
విద్యుజ్జి హ్వేన్ద్రజిహ్వానాం తథా హస్తిముఖస్య చ. 25

కరాళస్య పిశాచస్య శోణితాక్షస్య చైవ హి,
క్రమమాణః క్రమేణైవ హనుమా న్మారుతాత్మజః. 26

తేషు తేషు మహార్హేషు భవనేషు మహాయశాః,
తేషా మృద్ధిమతా మృద్ధిం దదర్శ స మహాకపిః. 27

సర్వేషాం సమతిక్రమ్య భవనాని సమన్తతః,
ఆససా దాథ లక్ష్మీవాన్ రాక్షసేన్ద్రనివేశనమ్. 28

రావణ స్యోపశాయిన్యో దదర్శ హరిసత్తమః,
విచరన్ హరిశార్దూలో రాక్షసీ ర్వికృతేక్షణాః. 29

శూలముద్గరహస్తా శ్చ శక్తితోమరధారిణీః,
దదర్శ వివిధా న్గుల్మాం స్తస్య రక్షఃపతే ర్గృహే. 30

రాక్షసాం శ్చ మహాకాయాన్ నానాప్రహరణోద్యతాన్,
రక్తాన్ శ్వేతాన్ సితాం శ్చైవ హరీం శ్చాపి మహాజవాన్. 31

కులీనాన్ రూపసమ్పన్నా న్గజా న్పరగజారుజాన్,
నిష్ఠితా న్గజశిక్షాయా మైరావతసమా న్యుధి. 32

నిహన్తౄ న్పరసైన్యానాం గృహే తస్మిన్ దదర్శ సః,
క్షరతశ్చ యథా మేఘాన్ స్రవత శ్చ యథా గిరీ౯. 33

మేఘస్తనితనిర్ఘోషా న్దుర్ధర్షాన్ సమరే పరైః,
సహస్రం వాహినీ స్తత్ర జామ్బూనదపరిష్కృతాః. 34

హేమజాలపరిచ్ఛన్నా స్తరుణాదిత్యసన్నిభాః,
దదర్శ రాక్షసేన్ద్రస్య రావణస్య నివేశనే. 35

శిబికా వివిధాకారా స్స కపి ర్మారుతాత్మజః,
లతాగృహాణి చిత్రాణి చిత్రశాలాగృహాణి చ. 36

క్రీడాగృహాణి చాన్యాని దారుపర్వతకా నపి,
కామస్య గృహకం రమ్యం దివాగృహక మేవ చ,
దదర్శ రాక్షసేన్ద్రస్య రావణస్య నివేశనే. 37

స మన్దరగిరిప్రఖ్యం మయూరస్థానసంకులమ్,

ధ్వజయష్టిభి రాకీర్ణం దదర్శ భవనోత్తమమ్. 38

అనేకరత్నసఙ్కీర్ణం నిధిజాలసమావృతమ్,
ధీరనిష్ఠితకర్మాన్తం గృహం భూతపతే రివ. 39

అర్చిర్భి శ్చా పి రత్నానాం తేజసా రావణస్య చ,
విరరా జాథ త ద్వేశ్మ రశ్మిమా నివ రశ్మిభిః. 40

జామ్బూనదమయా న్యేవ శయనా న్యాసనాని చ,
భాజనాని చ ముఖ్యాని దదర్శ హరియూథపః. 41

మధ్వాసవకృతక్లేదం మణిభాజనసఙ్కులమ్,
మనోరమ మసంబాధం కుబేర భవనం యథా. 42

నూపురాణాం చ ఘోషేణ కాఞ్చీనాం నినదేన చ,
మృదఙ్గతలఘోషైశ్చ ఘోషవద్భి ర్వినాదితమ్. 43

ప్రాసాదసఙ్ఘాతయుతం స్త్రీరత్నశతసంకులమ్,
సువ్యూఢకక్ష్యం హనుమా న్ప్రవివేశ మహాగృహమ్. 44

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, వాల్మీకియే,
చతుర్వింశత్సహస్రికాయాం, సంహితాయాం,
శ్రీమత్సున్దరకాణ్డే షష్ఠ స్సర్గః

# 6 వ సర్గము

## హనుమంతుడు రావణుని భవనమును చూచుట

హనుమానుడు ఎన్నియో భవనములను చూచెను. సీతాదేవి కానరాలేదు. ఆతడు మిక్కిలి విషణ్ణుడయ్యెను. విషాదము పొందినను అన్వేషణము మానలేదు. క్రమముగ రాక్షసరాజ భవనమునకు వచ్చెను. ఆ భవనము యొక్క ప్రాకారము సూర్య కాంతితో సమానముగ ప్రకాశమానమై యుండెను. ఎందరో రాక్షసులు ఆ భవనమును రక్షించుచుండిరి. ఆ భవన ద్వారములు కొన్ని వెండితో కొన్ని బంగారముతో నిర్మితములై యుండెను.

ఆ భవనము యొక్క ఆవరణములో గజారూఢులు, అశ్వారూఢులు రథికులు అయిన సైనికులు. సింహ, వ్యాఘ్ర, చర్మములచే ఆవృతమైన రథములు కూడ అచ్చట తిరుగుచున్నవి. ఆ రాజభవనము బహువిధరత్నములతో నిండియుండెను. మంచి ఆసనములు కూడ అమర్చబడి యుండెను. మహారథులైన యోధులెందరో అచట ఉండిరి. బయట ఎందరో నిలిచి రాజభవనమును రక్షించుచుండిరి.

ఆ భవనమును స్త్రీలందరు సంతుష్టితో నుండిరి. వారు ధరించిన రత్నాభరణములు కదలినప్పుడెల్ల మధుర ధ్వను లొనరించుచున్నవి. మృదంగాది వాద్యములు, శంఖ ధ్వనులు మిన్నుముట్టుచున్నవి. గంధ పుష్పాదుల చేత నిత్యమును అలంకృతమైయున్నది. హోమాదిక్రియలు నిరంతరము కొనసాగు చుండెను. అటువంటి రాక్షసరాజు భవనమును హనుమానుడు చూచెను. హనుమానుడు లంకలో ఎన్నియో భవనములను చూచెను. కానీ ఇట్టి భవనమును చూడలేదు. ఈ భవనము లంక కంతకు ఆభరణముగ నున్నది.

ఆంజనేయుడు విరామములేక ఆయా రాక్షసభవనములను వాని వాని ఉద్యాన వనములను పరిశీలించి చూచుచు సీతాన్వేషణము కావించుచునే యుండెను. హనుమానుడు ఈ రీతిగ సంచరించుచు లంకలో రాక్షస వీరుల భవనములను వెదకెను. ఎచ్చటను సీత కానరాలేదు. రాక్షస రాజ భవనమున ప్రవేశించి సీతను అన్వేషింప నారంభించెను.

అచ్చట భయంకరరూపము కలిగిన రాక్షస స్త్రీలు ఆయుధములు ధరించి అంతఃపురమును రక్షించుచుండిరి. ఎన్నియెా రక్షణ స్థావరములను చూచెను. బలిష్ఠమైన దేహములతో ప్రబలమైన ఆయుధములు ధరించిన భవన రక్షకులగు రాక్షసులును భవన రక్షణ చేయుచుండిరి. అచ్చట వివిధ వర్ణములు గల అశ్వదళమున్నది. గజదళమున్నది. బంగారు ఆభరణములను ధరించిన సేనలు అప్రమత్తములై యున్నవి. వివిధాకారములు గల శిబిక లున్నవి. లతాగృహములు, చిత్ర శాలలు, క్రీడా గృహములు, దారు శిలా నిర్మితములైన క్రీడా పర్వతములును కూడ ఆంజనేయుడు చూచెను.

ఆ భవనమున ఒకచోట నృత్తమెునరించుచున్న మత్త మయూరములను కూడ చూచెను. ఈ రాక్షస రాజ భవనము ఎంత సుందరమై యున్నది. ఎంత సంపన్నమై యున్నది. ఇచ్చటి ఆసనములును బంగారముతో నిర్మితములై యున్నవి. శయనములును సువర్ణమయములై యున్నవి. ఆ రాజ భవనము కుబేరుని భవనమును మించి యుండెను. స్త్రీలు ధరించిన కాంచీ, నూపురాదుల మధుర ధ్వనులతో పాటు గంభీరములైన మృదంగ ధ్వనులును వినవచ్చుచున్నవి. అట్టి రాజభవనమును హనుమానుడు ప్రవేశించెను.



 

# 7. సప్తమ స్సర్గః

స వేశ్మజాలం బలవాన్ దదర్శ
వ్యాసక్తవైదూర్యసువర్ణజాలమ్,
యథా మహ త్ప్రావృషి మేఘజాలం
విద్యుత్పినద్ధం సవిహఙ్గజాలమ్. 1

నివేశనానాం వివిధా శ్చ శాలాః
ప్రధానశఙ్ఖాయుధచాపశాలాః,
మనోహరా శ్చాపి పునర్విశాలాః
దదర్శ వేశ్మాద్రిషు చన్ద్రశాలాః. 2

గృహాణి నానావసురాజితాని
దేవాసురై శ్చాపి సుపూజితాని,
సర్వైశ్చ దోషైః పరివర్జితాని
కపి ర్దదర్శ స్వబలార్జితాని. 3

తాని ప్రయత్నాభిసమాహితాని
మయేన సాక్షా దివ నిర్మితాని,
మహీతలే సర్వగుణోత్తరాణి
దదర్శ లఙ్కాధిపతే ర్గృహాణి. 4

తతో దద ర్శోచ్ఛ్రితమేఘరూపం
మనోహరం కాఞ్చనచారురూపమ్,
రక్షోఽధిప స్యాత్మబలానురూపం
గృహోత్తమం హ్యప్రతిరూపరూపమ్. 5

మహీతలే స్వర్గ మివ ప్రకీర్ణం
శ్రియా జ్వలన్తం బహురత్నకీర్ణమ్,
నానాతరూణాం కుసుమావకీర్ణం
గిరే రివాగ్రం రజసావకీర్ణమ్. 6

నారీప్రవేకైరివ దీప్యమానం
తటిద్భి రమ్భోదవ దర్చ్యమానమ్,
హంసప్రవేకై రివ వాహ్యమానం
శ్రియా యుతం ఖే సుకృతాం విమానమ్. 7

యథా నగాగ్రం బహు ధాతుచిత్రం
యథా నభశ్చ గ్రహచన్ద్రచిత్రమ్,
దదర్శ యుక్తీకృత మేఘచిత్రం
విమానరత్నం బహురత్నచిత్రమ్. 8

మహీ కృతా పర్వతరాజిపూర్ణా
శైలాః కృతా వృక్షవితానపూర్ణాః,
వృక్షాః కృతాః పుష్పవితానపూర్ణాః
పుష్పం కృతం కేసరపత్రపూర్ణమ్. 9

కృతాని వేశ్మాని చ పాణ్డరాణి
తథా సుపుష్పా ణ్యపి పుష్కరాణి,
పునశ్చ పద్మాని స కేసరాణి
ధన్యాని చిత్రాణి తథా వనాని. 10

పుష్పాహ్వయం నామ విరాజమానం
రత్నప్రభాభి శ్చ వివర్ధమానమ్,
వేశ్మోత్తమానా మపి చోచ్చమానం
మహాకపి స్తత్ర మహావిమానమ్. 11

కృతాశ్చ వైడూర్యమయా విహఙ్గాః
రూప్యప్రవాలైశ్చ తథా విహఙ్గాః,
చిత్రాశ్చ నానావసుభి ర్భుజఙ్గాః
జాత్యానురూపా స్తురగా శ్శుభాఙ్గాః. 12

ప్రవాళ జామ్బూనద పుష్పపక్షా
స్సలీల మావర్జిత జిహ్మపక్షాః,
కామస్య సాక్షా దివ భాన్తి పక్షాః
కృతా విహఙ్గా స్సుముఖా స్సుపక్షాః. 13

నియుజ్యమానా స్తు గజా స్సుహస్తా
స్సకేసరా శ్చోత్పలపత్రహస్తాః,
బభూవ దేవీ చ కృతా సుహస్తా
లక్ష్మీ స్తథా పద్మిని పద్మహస్తా. 14

ఇతీవ తద్గృహ మభిగమ్య శోభనం
సవిస్మయో నగ మివ చారుశోభనమ్,
పునశ్చ తత్పరమసుగన్ధిసున్దరం
హిమాత్యయే నగమివ చారుకన్దరమ్. 15

తత స్స తాం కపి రభిపత్య పూజితాం
చరన్ పురీం దశముఖబాహుపాలితామ్,
అదృశ్య తాం జనకసుతాం సుపూజితాం
సుదుఃఖితః పతిగుణవేగనిర్జితామ్. 16

తత స్తదా బహువిధభావితాత్మనః
కృతాత్మనో జనకసుతాం సువర్త్మనః,
అపశ్యతోఽభవ దతిదుఃఖితం మన
స్సుచక్షుషః ప్రవిచరతో మహాత్మనః. 17

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, వాల్మీకీయే,
చతుర్వింశత్సహస్రికాయాం, సంహితాయాం,
శ్రీమత్సున్దరకాణ్డే, సప్తమ స్సర్గః.

## 7వ సర్గము

### హనుమంతుడు ఇతర భవనములను చూచుట

ఆ రాక్షస రాజ భవనమునకు దగ్గరగా మరికొన్ని భవనములును నిర్మింపబడెను. ఆ భవనముల కిటికీలు బంగారముతో నిర్మింపబడి వైడూర్యములు తాపటము చేయబడెను. అట్టి భవనములు మెఱపులతో పక్షులతో కూడిన వర్షాకాల మేఘముల వలె కానవచ్చుచుండెను. ఆ భవనముల శాలాగృహములందు శంఖములు, ధనుస్సులు ఇతరాయుధములు భద్రపరుపబడి యుండెను. ఆ భవనముల శిరోగృహములు (చంద్రశాలలు) చాల అందముగ నుండెను. ఆ గృహములు రకరకముల సంపదలతో నిండియుండెను.

ఆ భవన నిర్మాణ నైపుణ్యమును చూచి దేవతలు, అసురులు కూడ మెచ్చుకొనుచుందురు. ఆ భవన నిర్మాణమున ఏ దోషమును కానరాదు. అవి అన్నియును రాక్షస చక్రవర్తి నిజ బలమున సంపాదించెను. ఆ భవనములు రాక్షసాధిపతి పేరునకు మాత్రము మయుని నిర్మాతగ నుంచుకొని తానే రచించెను. ఆ భవనములు వానరాధిపతికి భూతలములోని అపూర్వ శిల్ప నిర్మాణము కలదై ఆశ్చర్యకరముగ నుండెను.

 

7 వ సర్గము

## పుష్పక భవన వర్ణన

ఆ గృహము లన్నింటిలో అత్యున్నతమై మేఘమండల పర్యంతము వ్యాపించి బంగారు రంగులీనుచు రాక్షస రాజు యొక్క బలపరాక్రమములు ప్రకటించుచుండెను. అది ఒక భూతల స్వర్గము వలె నుండెను. కాంతులతో మెరయుచుండెను. బహువిధ రత్నములతో నిండి ఉండెను. వివిధములైన వృక్షములు ఆ భవనముపై పూలవాన కురియుచుండెను. పుష్పక విమానమే రాక్షస చక్రవర్తికి భవనముగ వినియోగ పడుచుండెను. మెఱపు తీగల వంటి ఉత్తమ స్త్రీలచే అలంకరింపబడుచుండెను. పుణ్యాత్ముల విమానము వలె హంసలచే మోయబడుచున్నట్లు నిర్మింపబడెను. తారాగ్రహ చంద్రులతో సుందరమైన ఆకాశము వలె బహుధాతు చిత్రితమైన నగాగ్రమువలెరంగు రంగుల కాంతులతో నిండిన మేఘమండలము వలె ఆ పుష్పక (భవన)ము ప్రకాశమానమై యుండెను. ఆ పుష్పకమున భూమి పర్వతములతో కూడినట్లు, పర్వతములు చెట్లతో కూడినట్లు, చెట్లు పూలతో కూడినట్లు, పుష్పములు కేసరములతో కూడినట్లు చిత్రింపబడినవి. ఆ పుష్పకమున తెల్లని మేడలు, పూలు పూచిన చెరువులు, చక్కని కేసర సంపదగల పద్మములు రత్నకాంతులతో ధగధగలాడుచున్న రాక్షస రాజు భవనముగ వినియోగించుచున్న పుష్పక విమానమును ఆంజనేయుడు చూచెను.

ఆ విమాన మందలి శిల్ప సౌందర్యము ఎంత వర్ణించినను తొలగదు. వైడూర్యములతో, వెండితో పగడములతో, పక్షుల చిత్రములు, రెక్కలు చూచుకొని ఎగురుచున్నట్లు, ఆ రెక్కలలోని వంపు సొంపులు చక్కగ చిత్రింప బడినవి. నీట మునిగి లేచిన కలువ రేకులతో వాని కింజల్కములతో కూడినట్లుగా చిత్రింపబడెను. సరోవరమున పద్మమును చేతబట్టి ఉన్నట్లుగా లక్ష్మీదేవి రూపము చిత్రింపబడెను.

ఈ రీతిగ పుష్పకము అను రావణ భవనమును వసంత కాలమున మంచు విరిసి పుష్పఫలభరితమైన పర్వతముల వలె సుగంధిసుందరమైన ఆ రాజభవనమును చేరి స్థూల దృష్టితో హనుమ ఒకసారి చూచెను. సీత జాడ తెలియలేదు. హనుమంతుని మనస్సు మిక్కిలి బాధ పడెను.



## 8. అష్టమ స్సర్గః

స తస్య మధ్యే భవనస్య సంస్థితం
మహ ద్విమానం మణివజ్రచిత్రితమ్,
ప్రతప్తజాబ్బూనదజాలకృత్రిమం
దదర్శ వీరః పవనాత్మజః కపిః.

త దప్రమేయాప్రతికారకృత్రిమం
కృతం స్వయం సాధ్వితి విశ్వకర్మణా,
దివం గతం వాయుపథే ప్రతిష్ఠితం
వ్యరాజ తాఽఽదిత్య పథస్య లక్ష్మవత్.

న తత్ర కించి న్నకృతం ప్రయత్నతో
న తత్ర కించి న్నమహార్ఘరత్నవత్,
న తే విశేషా నియతా స్సురేష్వపి
న తత్ర కించి న్నమహావిశేషవత్.

తప స్సమాధానపరాక్రమార్జితం
మనస్సమాధానవిచారచారిణమ్,
అనేకసంస్థానవిశేషనిర్మితం
తతస్తత స్తుల్యవిశేషదర్శనమ్.

మన స్సమాధాయ తు శీఘ్రగామినం
దురావరం మారుతతుల్యగామినమ్,
మహాత్మనాం పుణ్యకృతాం మహర్ద్ధి నాం
యశస్స్వినా మగ్ర్యముదా మి వాలయమ్. 5

విశేష మాలమ్బ్య విశేషసంస్థితం
విచిత్రకూటం బహుకూటమణ్డితమ్,
మనోభిరామం శరదిన్దునిర్మలం
విచిత్రకూటం శిఖరం గిరే ర్యథా. 6

వహన్తి యం కుణ్డలశోభితాననాః
మహాశనా వ్యోమచరా నిశాచరాః,
వివృత్త విధ్వస్త విశాలలోచనాః
మహాజవా భూతగణా స్సహస్రశః. 7

వసన్తపుష్పోత్కరచారుదర్శనం
వసన్తమాసా దపి కాన్తదర్శనమ్,
స పుష్పకం తత్ర విమాన ముత్తమం
దదర్శ త ద్వానరవీరసత్తమః. 8

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, వాల్మీకీయే,
చతుర్వింశత్సహస్రికాయాం, సంహితాయాం,
శ్రీమత్సున్దరకాణ్డే, అష్టమ స్సర్గః.

## 8 వ సర్గము

### పుష్పక విమాన వర్ణనము

ఆ పుష్పక విమానమును హనుమ మరియొక సారి పరిశీలింప సాగెను. ఆ మహాభవనమున మధ్య భాగమున పుష్పక విమానము ఉండెను. అదియే రాక్షస రాజు నివాసము. దాని యందు వజ్రములు తాపటము చేయబడెను. వాని యందలి చిత్రములు మేలిమి బంగారముతో నిర్మితమైనవి. దాని వైభవము ఊహించుటకు కానీ, చెప్పుటకు గాని కానిదై యుండెను. అది విశ్వకర్మ నిర్మించినది. వాయుమార్గమున నిర్మితమగు సూర్యుడు సంచరించు త్రోవకు గుర్తుగా ఆ భవనముండెను.

ఆ భవనమందలి ప్రతి అంశము ప్రయత్న పూర్వకముగ నిర్మితమై యుండెను. దాని యందలి శిల్ప విశేషములు దేవతా భవనము లందును కానరావు, మహాతపస్సును ఆచరించి పరాక్రమించి ఆ పుష్పకము సంపాదింప బడినది. మనస్సంకల్పానుసారము అది సంచరించును. విమాన గోపురాది సన్నివేశములతో అది నిర్మితమైనది. చూడముచ్చటగా నున్నది. దాని గమనమును ఏదియును అడ్డగింపలేదు. అది వాయు వేగమున సంచరింపగలదు. ఎంతయో సుకృతము చేసికొని మహాకీర్తి సంపన్నులైన మహాత్ముల నివాసము వలెనుండెను.

శరత్కాలపు చంద్రుని వలె మనోహరమైన ముఖములు కలిగిన ఆకాశసంచారులైన నిశాచరులతో వహింపబడుచుండెను. వసంత కాలమున లభించు అనేక పుష్పములచే అలంకృతమైన ఆ విమానము వసంత మాసము కంటె మేలుగా ఆ హనుమ నేత్రములకు ఆనందమును కలిగించెను.



# 9. నవమ స్సర్గః

త స్యాలయవరిష్ఠస్య మధ్యే విపుల మాయతమ్,
దదర్శ భవనశ్రేష్ఠం హనుమా న్మారుతాత్మజః. 1

అర్ధయోజన విస్తీర్ణ మాయతం యోజనం హి తత్,
భవనం రాక్షసేన్ద్రస్య బహుప్రాసాదసంకులమ్. 2

మార్గమాణ స్తు వైదేహీం సీతా మాయతలోచనామ్,
సర్వతః పరిచక్రామ హనుమా నరిసూదనః. 3

ఉత్తమం రాక్షసావాసం హనుమా నవలోకయన్,
ఆససా దాథ లక్ష్మీవా న్రాక్షసేన్ద్రనివేశనమ్. 4

చతుర్విషాణై ర్ద్విరదై స్త్రివిషాణై స్తథైవ చ,
పరిక్షిప్త మసంబాధం రక్ష్యమాణముదాయుధైః. 5

రాక్షసీభి శ్చ పత్నీభీ రావణస్య నివేశనమ్,
అహృతాభి శ్చ విక్రమ్య రాజకన్యాభి రావృతమ్. 6

త న్నక్ర మకరాకీర్ణం తిమిఙ్గిలఝషాకులమ్,
వాయువేగసమాధూతం పన్నగై రివ సాగరమ్. 7

యా హి వైశ్రవణే లక్ష్మీ ర్యా చేన్ద్రే హరివాహనే,
సా రావణగృహే సర్వా నిత్య మే వానపాయినీ. 8

యా చ రాజ్ఞః కుబేరస్య యమస్య వరుణస్య చ,
తాదృశీ తద్విశిష్టా వా ఋద్ధీ రక్షో గృహే ష్విహ. 9

తస్య హర్మ్యస్య మధ్యస్థం వేశ్మ చాన్య త్సునిర్మితమ్,
బహునిర్యూహసంకీర్ణం దదర్శ పవనాత్మజః. 10

బ్రహ్మణో౽ర్థే కృతం దివ్యం దివి య ద్విశ్వకర్మణా,
విమానం పుష్పకం నామ సర్వరత్నవిభూషితమ్. 11

పరేణ తపసా లేభే యత్కుబేరః పితామహాత్,
కుబేర మోజసా జిత్వా లేభే త ద్రాక్షసేశ్వరః. 12

ఈహామృగసమాయుక్తైః కార్తస్వరహిరణ్మయైః,
సుకృతై రాచితం స్తమ్భైః ప్రదీప్తమివ చ శ్రియా. 13

మేరుమన్దరసంకాశై రుల్లిఖద్భి రి వామ్బరమ్,
కూటాగారై శ్శుభాకారై స్సర్వత స్సమలంకృతమ్. 14

జ్వలనార్కప్రతీకాశం సుకృతం విశ్వకర్మణా,
హేమసోపానసంయుక్తం చారుప్రవరవేదికమ్ 15

జాలవాతాయనై ర్యుక్తం కాఞ్చనైః స్ఫాటికై రపి,
ఇన్ద్రనీల మహానీల మణిప్రవర వేదికమ్. 16

విద్రుమేణ విచిత్రేణ మణిభి శ్చ మహాధనైః,
నిస్తులాభి శ్చ ముక్తాభి స్తలే నాభివిరాజితమ్. 17

చన్దనేన చ రక్తేన తపనీయనిభేన చ,
సుపుణ్యగన్ధినా యుక్త మాదిత్య తరుణోపమమ్. 18

కూటాగారై ర్వరాకారై ర్వివిధై స్సమలంకృతమ్,
విమానం పుష్పకం దివ్య మారురోహ మహాకపిః. 19

తత్రస్థ స్స తదా గన్ధం పాన భక్ష్యాన్నసమ్భవమ్,
దివ్యం సమ్మూర్ఛితం జిఘ్ర ద్రూపవన్త మివానిలమ్. 20

స గన్ధ స్తం మహాసత్త్వం బన్ధు ర్బన్ధు మివోత్తమమ్.
ఇత ఏహీత్యువాచేవ తత్ర యత్ర స రావణః. 21

తత స్తాం ప్రస్థిత శ్శాలాం దదర్శ మహతీం శుభామ్,
రావణస్య మనః కాన్తాం కాన్తా మివ వరస్త్రియమ్. 22

మణి సోపాన వికృతాం హేమజాల విభూషితామ్,
స్ఫాటికై రావృతతలాం దన్తాన్తరితరూపికామ్. 23

ముక్తాభి శ్చ ప్రవాళైశ్చ రూప్య చామీకరై రపి,
విభూషితాం మణి స్తమ్భై స్సుబహుస్తమ్భభూషితామ్. 24

సమై ర్ఋజుభి రత్యుచ్చై స్సమన్తా త్సువిభూషితైః,
స్తమ్భైః పక్షై రివాత్యుచ్చై ర్దివం సంప్రస్థితా మివ. 25

మహత్యా కుథయాస్తీర్ణాం పృథివీ లక్షణాఙ్కయా,
పృథివీ మివ విస్తీర్ణాం స రాష్ట్ర గృహమాలినీమ్. 26

నాదితాం మత్తవిహగై ర్దివ్యగన్ధాధివాసితామ్,
పరార్ధ్యా స్తరణోపేతాం రక్షోధిపనిషేవితామ్. 27

ధూమ్రా మగరుధూపేన విమలాం హంసపాణ్డురామ్,
చిత్రాం పుష్పోపహారేణ కల్మాషీ మివ సుప్రభామ్. 28

మనస్సంహ్లాదజననీం వర్ణ స్యాపి ప్రసాదినీమ్,
తాం శోకనాశినీం దివ్యాం శ్రియ స్సంజననీ మివ. 29

ఇన్ద్రియా ణీంద్రియార్థైస్తు పఞ్చపఞ్చభి రుత్తమైః,
తర్పయామాస మాతేవ తదా రావణపాలితా. 30

స్వర్గోఽయం దేవలోకోఽయ మిన్ద్రస్యేయం పురీ భవేత్,
సిద్ధి ర్వేయం పరా హి స్యా ది త్యమన్యత మారుతిః. 31

ప్రధ్యాయత ఇవాపశ్య త్ప్రదీప్తాం స్తత్ర కాఞ్చనాన్,
ధూర్తానివ మహాధూర్తై ర్దేవనేన పరాజితాన్. 32

దీపానాం చ ప్రకాశేన తేజసా రావణస్య చ,
అర్చిర్భి ర్భూషణానాం చ ప్రదీప్తే త్యభ్యమన్యత. 33

తతోఽపశ్య త్కుథాసీనం నానావర్ణామ్బరస్రజమ్,
సహస్రం వరనారీణాం నానావేషవిభూషితమ్. 34

పరివృత్తేఽర్ధరాత్రే తు పాననిద్రావశం గతమ్,
క్రీడి త్వోపరతం రాత్రౌ సుష్వాప బలవ త్తదా. 35

త త్ప్రసుప్తం విరురుచే నిశ్శబ్దాన్తరభూషణమ్,
నిశ్శబ్ద హంసభ్రమరం యథా పద్మవనం మహత్. 36

తాసాం సంవృతదన్తాని మీలితాక్షాణి మారుతిః,
అపశ్య త్పద్మగన్ధీని వదనాని సుయోషితామ్. 37

ప్రబుద్ధానీవ పద్మాని తాసాం భూత్వా క్షపాక్షయే,
పున స్సంవృతపత్రాణి రాత్రా వివ బభు స్తదా. 38

ఇమాని ముఖపద్మాని నియతం మత్తషట్పదాః,
అమ్బుజానీవ ఫుల్లాని ప్రార్థయన్తి పునః పునః. 39

ఇతి చామన్యత శ్రీమా నుపపత్త్యా మహాకపిః,
మేనే హి గుణత స్తాని సమాని సలిలోద్భవైః. 40

సా తస్య శుశుభే శాలా తాభిః స్త్రీభి ర్విరాజితా,
శారదీవ ప్రసన్నా ద్యౌ స్తారాభి రభిశోభితా. 41

స చ తాభిః పరివృత శ్శుశుభే రాక్షసాధిపః,
యథా హ్యుడుపతి శ్శ్రీమాం స్తారాభి రభిసంవృతః. 42

యా శ్చ్యవన్తేఽమ్బరా త్తారాః పుణ్యశేషసమావృతాః,
ఇమా స్తా స్సంగతాః కృత్స్నా ఇతి మేనే హరి స్తదా. 43

తారాణా మివ సువ్యక్తం మహతీనాం శుభార్చిషామ్,
ప్రభా వర్ణ ప్రసాదాశ్చ విరేజు స్తత్ర యోషితామ్. 44

వ్యావృత్త కచపీన స్ర క్ప్రకీర్ణ వరభూషణాః,
పాన వ్యాయామ కాలేషు నిద్రాపహృతచేతసః. 45

వ్యావృత్తతిలకాః కాశ్చి త్కాశ్చి దుద్భ్రాన్త నూపురాః,
పార్శ్వే గళితహారా శ్చ కాశ్చి త్పరమయోషితః. 46

ముక్తాహారావృతా శ్చాన్యాః కాశ్చి ద్విస్రస్తవాససః,
వ్యావిద్ధరశనా దామాః కిశోర్య ఇవ వాహితాః. 47

సుకుణ్డలధరా శ్చా న్యా విచ్ఛిన్నమృదితస్రజః,
గజేన్ద్రమృదితాః ఫుల్లా లతా ఇవ మహావనే. 48

చన్ద్రాంశుకిరణాభాశ్చ హారాః కాసాంచి దుత్కటాః,
హంసా ఇవ బభు స్సుప్తాః స్తనమధ్యేషు యోషితామ్. 49

అపరాసాం చ వైదూర్యాః కాదమ్బా ఇవ పక్షిణః,
హేమసూత్రాణి చాన్యాసాం చక్రవాకా ఇ వాభవన్. 50

హంసకారణ్డవాకీర్ణా శ్చక్రవాకోపశోభితాః,
ఆపగా ఇవ తా రేజు ర్జఘనైః పులినై రివ. 51

కిఙ్కిణీజాలసంకోశా స్తా హేమవిపులామ్బుజాః,
భావగ్రాహా యశస్తీరా స్సుప్తా నద్య ఇ వాబభుః. 52

మృదు ష్వఙ్గేషు కాసాంచి త్కుచాగ్రేషు చ సంస్థితాః,
బభూవు ర్భూషణానీవ శుభా భూషణరాజయః. 53

అంశుకాన్తాశ్చ కాసాంచి న్ముఖమారుతకమ్పితాః,
ఉపర్యుపరి వక్త్రాణాం వ్యాధూయన్తే పునఃపునః. 54

తాః పతాకా ఇవోద్ధూతాః పత్నీనాం రుచిరప్రభాః,
నానావర్ణసువర్ణానాం వక్త్రమూలేషు రేజిరే. 55

వవల్గు శ్చాత్ర కాసాంచి త్కుణ్డలాని శుభార్చిషామ్,
ముఖమారుతసంసర్గా న్మన్దం మన్దం సుయోషితామ్. 56

శర్కరాసవగన్ధై శ్చ ప్రకృత్యా సురభి స్సుఖః,
తాసాం వదననిశ్శ్వాస స్సిషేవే రావణం తదా. 57

రావణాననశఙ్కాశ్చ కాశ్చి ద్రావణయోషితః,
ముఖాని స్మ సపత్నీనా ముపాజిఘ్ర న్పునఃపునః. 58

అత్యర్థం సక్తమనసో రావణే తా వరస్త్రియః,
అస్పృతస్త్రా స్సపత్నీనాం ప్రియమే వాచరం స్తథా. 59

బాహూ నుపనిధా యాన్యాః పారిహార్యవిభూషితాన్,
అంశుకాని చ రమ్యాణి ప్రమదా స్తత్ర శిశ్యిరే. 60

అన్యా వక్షసి చాన్యస్యా స్తస్యాః కాశ్చి త్పునర్భుజమ్,
అపరా త్వఙ్క మన్యస్యా స్తస్యా శ్చా ప్యపరా భుజౌ. 61

ఊరుపార్శ్వకటీపృష్ఠ మన్యోన్యస్య సమాశ్రితాః,
పరస్పరనివిష్టాఙ్గ్యో మదస్నేహవశానుగాః. 62

అన్యోన్యభుజసూత్రేణ స్త్రీమాలాగ్రథితా హి సా,
మాలేవ గ్రథితా సూత్రే శుశుభే మత్తషట్పదా. 63

లతానాం మాధవే మాసి ఫుల్లానాం వాయుసేవనాత్,
అన్యోన్యమాలాగ్రథితం సంసక్తకుసుమోచ్చయమ్. 64

వ్యతివేష్టిత సుస్కన్ధ మన్యోన్యభ్రమరాకులమ్,
ఆసీ ద్వన మి వోద్ధూతం స్త్రీవనం రావణస్య తత్. 65

ఉచితేష్వపి సువ్యక్తం న తాసాం యోషితాం తదా,
వివేక శ్శక్య ఆధాతుం భూషణాఙ్గామ్బరస్రజామ్. 66

రావణే సుఖసంవిష్టే తాః స్త్రియో వివిధప్రభాః,
జ్వలన్తః కాఞ్చనా దీపాః ప్రైక్ష న్తానిమిషా ఇవ. 67

రాజర్షి పితృ దైత్యానాం గన్ధర్వాణాం చ యోషితః,
రాక్షసానాం చ యాః కన్యా స్తస్య కామవశం గతాః. 68

యుద్ధకామేన తా స్సర్వా రావణేన హృతాః స్త్రియః,
సముదా మదనేనైవ మోహితాః కాశ్చి దాగతాః. 69

న తత్ర కాచి త్ప్రమదా ప్రసహ్య
వీర్యోపపన్నేన గుణేన లబ్ధా,
న చాన్యకామాపి నచాన్యపూర్వా
వినా వరార్హాం జనకాత్మజాం తామ్. 70

న చాకులీనా న చ హీనరూపా
నాదక్షిణా నానుపచారయుక్తా,
భార్యాఽభవ త్తస్య న హీనసత్త్వా
న చాపి కాన్తస్య న కామనీయా. 71

బభూవ బుద్ధిస్తు హరీశ్వరస్య
య దీదృశీ రాఘవధర్మపత్నీ,
ఇమా యథా రాక్షసరాజభార్యా
స్సుజాత మస్యేతి హి సాధుబుద్ధేః. 72

పునశ్చ సోఽచిన్తయ దార్తరూపో
ధ్రువం విశిష్టా గుణతో హి సీతా,
అ థాయ మస్యాం కృతవా న్మహాత్మా
లఙ్కేశ్వరః కష్ట మనార్యకర్మ. 73

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, వాల్మీకీయే,
చతుర్వింశత్సహస్రికాయాం, సంహితాయాం,
శ్రీమత్సున్దరకాణ్డే నవమ స్సర్గః

# 9వ సర్గము

## రావణుని అంతఃపురము

ఆ పుష్పక విమాన మధ్యమున అర్ధయోజన విస్తీర్ణమై ఒక యోజనము పొడవు కలిగిన మరియొక భవనము కానవచ్చెను. సీతాదేవిని అన్వేషించుచు హనుమానుడు ఆ భవనమందంతట నిర్భయుడై సంచరించెను. నాలుగు దంతముల ఏనుగులు మూడు దంతముల ఏనుగులు కూడ ఆ భవన ప్రాంగణమున నిలిచి యున్నవి. ఆ భవన ప్రాంగణమున సువిశాల మగుటచే ఎన్ని యేనుగులు నిలిచినను సమ్మర్దముగ తోచుట లేదు.

ఆయుధ ధారులైన సైనికులు రక్షణ క్రియా తత్పరులై యుండిరి. ఆ భవనము రావణుని భార్యలైన రాక్షస స్త్రీల చేతను పరాక్రమించి ఎత్తుకొని వచ్చిన రాజకన్యకలతోను నిండి యుండెను. కుబేరుని సంపదకు, ఇంద్రుని సంపదకు తీసిపోని సమస్త సంపదలు ఆ రావణ భవనము నందుండెను. దిక్పాలకుల ఐశ్వర్యమును మించిన ఐశ్వర్యము ఆ రాక్షస భవనములందు కానవచ్చు చుండెను.

ఆ భవనమునకు మధ్యగా మరియొక భవనమును ఆంజనేయుడు చూచెను. అచ్చట ఎన్నియో శ్రేష్ఠ గజములున్నవి. విశ్వకర్మ బ్రహ్మ కోసమై ఆ పుష్పకమును నిర్మించెను. కుబేరుడు గొప్ప తపస్సు చేసి బ్రహ్మవలన ఆ పుష్పక విమానమును పొందెను. కుబేరుని యుద్ధమున గెలిచి రావణు డా విమానమును సంపాదించెను. బంగారముతో, వెండితో తోడేలు వంటి బొమ్మలను నిర్మించి ఆ స్తంభముల యందు చక్కగ తాపడ మొనర్చిరి. శిఖర భవనములచే ఆకాశము నంటు చున్నట్లు ఉండెను. బంగారముతో మెట్లుకట్టబడినవి.చక్కగ వేదికలు నిర్మింపబడినవి. పగడములతో రత్నములతో గుండ్రని ముత్యాలతో

 



నేలలు చష్టా చేయబడినవి. బంగారు రంగు కలిగిన పరిమళ వంతమైన ఎఱ్ఱచందనముతో అనులిప్తమై ఆ భవనము ఉదయించు సూర్యునివలె ప్రకాశించు చుండెను.

అట్టి రాజభవనము రూపమున నున్న పుష్పక విమానమును వానరోత్తముడు అధిరోహించెను. అప్పుడు పానశాల నుండి, పానీయ భక్ష్యపదార్థముల నుండి వాయువు వీచెను. ఆ పరిమళము బంధువు ఆత్మీయుడైన బంధువును ఇటురమ్మా ఇటు రమ్మా అని పిలిచి నట్లయ్యెను. ఆ వాయువు వీచిన వైపునకు ఆ పానశాల వైపునకు నడచెను. వివిధ రత్నములచే ఖచితమైన పానశాల రాక్షసాధిపతికి అత్యంత ప్రియమైన స్థలముగా మారుతి భావించెను. అచట రత్న కంబళము పరచబడి ఉండెను. అగరు ధూపములు ఘుమఘుమ లాడుచుండెను. నేల యందు పుష్పములు చల్లబడినవి. ఆ ప్రదేశము చూచినంతనే దుఃఖితుల మనస్సునకు కూడ ఆహ్లాదము కలిగించునదిగా నుండెను. రావణ పాలితమైన ఆ పానశాల తల్లివలె పంచేంద్రియతృప్తిని కలిగించునదిగనుండెను. ఆ ప్రదేశము మారుతికి దేవలోకము వలె తోచెను. అఖండముగ వెలుగుచున్న దీపములు జూదములు పెద్ద జూదరుల చేత ఓటమి పొంది ఆలోచనలో పడిన సామాన్య ద్యూతకారులవలె తోచెను. అనేక మహా దీపముల ప్రకాశముచే ఆ భవనము ప్రదీప్తమైనట్లు భావింపబడెను.

## రావణాంతఃపురస్త్రీలు

ఎందరో రావణుని యొక్క అతఃపుర స్త్రీలు పానగోష్ఠిలో పాల్గొని ఆడి ఆడి అర్ధరాత్రము గడవగనే నిద్రావశలైనట్లు కనబడుచుండిరి. నిద్రావశలైన ఆ స్త్రీలచే ఆ పానశాల కూజితములు విరమించిన హంసలతో, భ్రమరములతో కూడిన తామరల తోటవలె

కనబడుచున్నది. సూర్యోదయ కాలమున వికసించి నిశారంభమున ముకుళితమైన తామర పువ్వుల వలె వారి ముఖములు భాసించినవి. శరత్కాలమున నిర్మలమై తారావళితో కూడిన ఆకాశము వలె సుందర స్త్రీముఖారవిందములచే ఆ పానశాలా ప్రదేశము భాసించుచుండెను. ఆ స్త్రీలందరును మైమరచి నిద్రపోవుచుండిరి.

అచ్చట నిద్రించుచున్న అంతఃపురస్త్రీలు రావణుని యందలి ప్రీతితో అనగా అతని పరాక్రమముచేతను, అతని రూపము చేతను, అతని ఐశ్వర్యము చేతను ఆకర్షింపబడి వచ్చిన వారే కానీ బలాత్కరించి తెచ్చినట్లుగా కనబడదు. తన యందు ప్రీతి లేని సీతను మాత్రమే అతడు బలాత్కరించి తెచ్చినాడు. ఈ అంతఃపురము నందున్న ఏ ఒక స్త్రీ ముఖములోను అప్రీతి, అసంతృప్తి గోచరించుట లేదు. శ్రీ రామచంద్రుని ధర్మపత్ని అగు సీతాదేవి కూడా ఈ రాక్షస స్త్రీల వలెనే ఆనందముగ నుండిన ఎంత బాగుండును?.

ఈ భావన మనసులో కలిగినంతనే హనుమానుని మనసు ఎంతయో బాధపడెను. ఈ రాక్షస స్త్రీలు ఎక్కడ, సీత ఎక్కడ. ఈ రాక్షస స్త్రీలు అందరి కంటె సీతాదేవి ఉత్తమ గుణ సంపన్నురాలు. రాక్షస స్త్రీలకు ఆమెకు దేనిలోను పోలికయే లేదు. సీతాదేవి విషయమున ఎంత అపచార పడితిని అనుకొనినాడు మారుతి.



# 10. దశమ స్సర్గః

తత్ర దివ్యోపమం ముఖ్యం స్ఫాటికం రత్నభూషితమ్,
అవేక్షమాణో హనుమాన్ దదర్శ శయనాసనమ్. 1

దాన్తకాఞ్చన చిత్రాఙ్గై ర్వైదూర్యైశ్చ వరాసనైః,
మహార్హా స్తరణోపేతై రుపపన్నం మహాధనైః. 2

తస్య చైకతమే దేశే సోఽగ్రమాలావిభూషితమ్,
దదర్శ పాణ్డరం ఛత్రం తారాధిపతిసన్నిభమ్. 3

జాతరూపపరిక్షిప్తం చిత్రభానుసమప్రభమ్,
అశోకమాలా వితతం దదర్శ పరమాసనమ్. 4

వాలవ్యజనహస్తాభి ర్వీజ్యమానం సమన్తతః,
గన్ధైశ్చ వివిధై ర్జుష్టం వరధూపేన ధూపితమ్. 5

పరమాస్తరణాస్తీర్ణ మావికాజినసంవృతమ్,
దామభి ర్వరమాల్యానాం సమన్తా దుపశోభితామ్. 6

తస్మి న్జీమూతసఙ్కాశం ప్రదీప్తోత్తమకుణ్డలమ్,
లోహితాక్షం మహాబాహుం మహారజతవాససమ్. 7

లోహితే నానులిప్తాఙ్గం చన్దనేన సుగన్ధినా,
సన్ధ్యారక్త మి వాకాశే తోయదం స తటిద్గణమ్. 8

వృత మాభరణై ర్దివ్యై స్సురూపం కామరూపిణమ్,
సవృక్షవనగుల్మాఢ్యం ప్రసుప్త మివ మన్దరమ్. 9

క్రీడి త్వోపరతం రాత్రౌ వరాభరణభూషితమ్,
ప్రియం రాక్షసకన్యానాం రాక్షసానాం సుఖావహమ్. 10

పీత్వాఽప్యుపరతం చాపి దదర్శ స మహాకపిః,
భాస్వరే శయనే వీరం ప్రసుప్తం రాక్షసాధిపమ్. 11

నిశ్శ్వసన్తం యథా నాగం రావణం వానరర్షభః,
ఆసాద్య పరమోద్విగ్న స్సోఽపాసర్ప త్సుభీతవత్. 12

అ థారోహణ మాసాద్య వేదికాన్తర మాశ్రితః,
సుప్తం రాక్షసశార్దూలం ప్రేక్షతేస్మ మహాకపిః. 13

శుశుభే రాక్ష సేన్ద్రస్య స్వపత శ్శయనోత్తమమ్,
గన్ధహస్తిని సంవిష్టే యథా ప్రస్రవణం మహత్. 14

కాఞ్చనాఙ్గదనద్ధౌ చ దదర్శ స మహాత్మనః,
విక్షిప్తౌ రాక్షసేన్ద్రస్య భుజా విన్ద్రధ్వజోపమౌ. 15

ఐరావతవిషాణాగ్రై రాపీడన కృతవ్రణౌ,
వజ్రోల్లిఖిత పీనాంసౌ విష్ణుచక్రపరిక్షతౌ. 16

పీనౌ సమసుజాతాంసౌ సఙ్గతౌ బలసంయుతౌ,
సులక్షణనఖాఙ్గుష్ఠౌ స్వఙ్గు లీతలలక్షితౌ. 17

సఙ్గతౌ పరిఘాకారౌ వృత్తౌ కరికరోపమౌ,
విక్షిప్తౌ శయనే శుభ్రే పఞ్చశీర్షా వివోరగౌ. 18

శశక్షతజకల్పేన సుశీతేన సుగన్ధినా,
చన్దనేన పరార్ధ్యేన స్వనులిప్తౌ స్వలఙ్కృతౌ. 19

ఉత్తమస్త్రీవిమృదితౌ గన్ధోత్తమనిషేవితౌ,
యక్షపన్నగగన్ధర్వ దేవదానవరావిణౌ. 20

దదర్శ స కపి స్తత్ర బాహూ శయనసంస్థితౌ,
మన్దరస్యాన్తరే సుప్తౌ మహాహీ రుషితా వివ. 21

తాభ్యాం స పరిపూర్ణాభ్యాం భుజాభ్యాం రాక్షసేశ్వరః,
శుశుభేఽచలసంకాశ శ్శృఙ్గాభ్యా మివ మన్దరః. 22

చూత పున్నాగ సురభి ర్వకుళోత్తమ సంయుతః,
మృష్టాన్న రస సంయుక్తః పానగన్ధపురస్సరః. 23

తస్య రాక్షససింహస్య నిశ్చక్రామ మహాముఖాత్,
శయానస్య వినిశ్వాసః పూరయ న్నివ తద్గృహమ్. 24

ముక్తామణివిచిత్రేణ కాఞ్చనేన విరాజితమ్,
ముకుటేనాపవృత్తేన కుణ్డలోజ్జ్వలితాననమ్. 25

రక్తచన్దనదిగ్ధేన తథా హారేణ శోభినా,
పీనాయతవిశాలేన వక్షసాభివిరాజితమ్. 26

పాణ్డరేణాపవిద్ధేన క్షౌమేణ క్షత జేక్షణమ్,
మహార్హేణ సుసంవీతం పీతేనోత్తమవాససా. 27

మాషరాశిప్రతీకాశం నిశ్శ్వసన్తం భుజఙ్గవత్,
గాఙ్గే మహతి తోయాన్తే ప్రసుప్తమివ కుఞ్జరమ్. 28

చతుర్భిః కాఞ్చనై ర్దీప్యమానం చతుర్దిశమ్,
ప్రకాశీకృతసర్వాఙ్గం మేఘం విద్యుద్గణై రివ. 29

పాదమూలగతా శ్చాపి దదర్శ సుమహాత్మనః,
పత్నీ స్స ప్రియభార్యస్య తస్య రక్షఃపతే ర్గృహే. 30

శశిప్రకాశవదనా శ్చారుకుణ్డలభూషితాః,
అమ్లానమాల్యాభరణా దదర్శ హరియూథపః. 31

నృత్తవాదిత్రకుశలా రాక్షసేన్ద్రభుజాఙ్కగాః,
వరాభరణధారిణ్యో నిషణ్ణా దదృశే హరిః. 32

వజ్రవైదూర్యగర్భాణి శ్రవణాన్తేషు యోషితామ్,
దదర్శ తాపనీయాని కుణ్డలా న్యఙ్గదాని చ. 33

తాసాం చన్ద్రోపమై ర్వక్త్రై శ్శుభై ర్లలితకుణ్డలైః,
విరరాజ విమానం త న్నభ స్తారాగణై రివ. 34

మదవ్యాయామఖిన్నా స్తా రాక్షసేంద్రస్య యోషితః,
తేషు తే ష్వవకాశేషు ప్రసుప్తా స్తనుమధ్యమాః. 35

అఙ్గహారై స్తథై వా న్యా కోమలై ర్నృత్తశాలినీ,
విన్యస్తశుభసర్వాఙ్గీ ప్రసుప్తా వరవర్ణినీ. 36

కాచి ద్వీణాం పరిష్వజ్య ప్రసుప్తా సంప్రకాశతే,
మహానదీప్రకీర్ణేవ నలినీ పోత మాశ్రితా. 37

అన్యా కక్షగతే నైవ మడ్డుకే నాసితేక్షణా,
ప్రసుప్తా భామినీ భాతి బాలపుత్రేవ వత్సలా. 38

పటహం చారు సర్వాఙ్గీ పీడ్య శేతే శుభస్తనీ,
చిరస్య రమణం లబ్ధ్వా పరిష్వ జ్యేవ భామినీ. 39

కాచి ద్వంశం పరిష్వజ్య సుప్తా కమలలోచనా,
రహః ప్రియతమం గృహ్యా సకామేవ చ కామినీ. 40

విపఞ్చీం పరిగృ హ్యాన్యా నియతా నృత్తశాలినీ,
నిద్రావశ మనుప్రాప్తా సహకాన్తేవ భామినీ. 41

అన్యా కనకసఙ్కాశై ర్మృదు పీనై ర్మనోరమైః,
మృదఙ్గం పరిపీడ్యాఙ్గైః ప్రసుప్తా మత్తలోచనా. 42

భుజపార్శ్వాన్తరస్థేన కక్షగేన కృశోదరీ,
పణవేన సహానిన్ద్యా సుప్తా మదకృతశ్రమా. 43

డిణ్డిమం పరిగృ హ్యాన్యా తథై వాసక్త డిణ్డిమా,
ప్రసుప్తా తరుణం వత్స ముపగూ హ్యేవ భామినీ. 44

కాచి దాడమ్బరం నారీ భుజసంయోగపీడితమ్,
కృత్వా కమలపత్రాక్షీ ప్రసుప్తా మదమోహితా. 45

కలశీ ముపవిద్ధ్యా న్యా ప్రసుప్తా భాతి భామినీ,
వసన్తే పుష్పశబలా మా లేవ పరిమార్జితా. 46

పాణిభ్యాం చ కుచౌ కాచి త్సువర్ణకలశోపమౌ,
ఉపగూ హ్యాబలా సుప్తా నిద్రాబలపరాజితా. 47

అన్యా కమలపత్రాక్షీ పూర్ణేన్దుసదృశాననా,
అన్యా మాలిఙ్గ్య సుశ్రోణీం ప్రసుప్తా మదవిహ్వలా. 48

ఆతోద్యాని విచిత్రాణి పరిష్వజ్య వరస్త్రియః,
నిపీడ్య చ కుచైస్సుప్తాః కామిన్యః కాముకా నివ. 49

తాసా మేకాన్త విన్యస్తే శయానాం శయనే శుభే,
దదర్శ రూపసంపన్నా మపరాం స కపిః స్త్రియమ్. 50

ముక్తామణిసమాయుక్తై ర్భూషణైస్సువిభూషితామ్,
విభూషయన్తీ మివ తత్స్వశ్రియా భవనోత్తమమ్. 51

గౌరీం కనకవర్ణాభా మిష్టా మన్తఃపురేశ్వరీమ్,
కపి ర్మన్దోదరీం తత్ర శయానాం చారురూపిణీమ్. 52

స తాం దృష్ట్వా మహాబాహు ర్భూషితాం మారుతాత్మజః,
తర్కయామాస సీ తేతి రూపయౌవనసంపదా,
హర్షేణ మహతా యుక్తో ననన్ద హరియూథపః. 53

ఆస్ఫోటయామాస చుచుమ్బ పుచ్ఛం
ననన్ద చిక్రీడ జగౌ జగామ,
స్తమ్భా నరోహ న్నిపపాత భూమౌ
నిదర్శయన్ స్వాం ప్రకృతిం కపీనామ్.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, వాల్మీకీయే,
చతుర్వింశత్సహస్రికాయాం, సంహితాయాం,
శ్రీమత్సున్దరకాణ్డే దశమ స్సర్గః.

 

## 10వ సర్గము

### రావణుని శయనాగార వర్ణనము

అచ్చట రత్న నిర్మితమైన ఒక మంచముండెను. దానికి దగ్గరలోనే దంతములతో, బంగారముతో, వైడూర్యాది బహు రత్నాలతో నిర్మితములైన అసనములు మంచి విలువగల ఆస్తరణములతో కూడిన అసనము లుండెను. వానికి దగ్గరగనే చంద్రుని వలె భాసమానమైన శ్వేతచ్ఛత్రము ఉండెను.

అశోక మాలికలచే అలంకృతమై అగరుధూపాదులతో పరిమళితమైన శయనము మేఘవర్ణము కలిగిన ఒక పురుషుడు పరుండి ఉండెను. అతని కుండలముల కాంతి ధగ ధగ లాడుచుండెను. కన్నులు ఎరుపు వారి ఉండెను. బాహువులు దీర్ఘమై ఉండెను. బంగారు వస్త్రములు ధరించి యుండెను. ఎఱ్ఱచందనముచే అతని దేహము అనులిప్తమై యుండెను. అతడు మెఱపులతో కూడి

సంధ్యాకాలమున ఎరుపు వారి యున్న మేఘమువలె నుండెను. ఆభరణకాంతులు అతని దేహమును ప్రకాశింపజేయుచున్నవి. పానగోష్ఠి యందు పాల్గొని రాక్షస స్త్రీలతో విహరించి మైమఱచి నిద్రించుచున్న రాక్షస చక్రవర్తిని చూచి భయపడినవాని వలె ఆంజనేయుడు ప్రక్కకు తిప్పి కొనెను.

రావణుని శయనాగారమున మరియొక శయ్య ఉండెను. ఆ శయ్యపై పరుండి ఉన్న మరియొక స్త్రీని చూచెను. ఆమె దేహము సువర్ణ ఛ్చాయ లీనుచుండెను. వాస్తవమునకు ఆమె రాక్షసచక్రవర్తి సతీమణి మండోదరి. ఆమె సీతయే అనుకొనెను మారుతి. హనుమ ఆనందమునకు మేరలు లేవు. ఆనందముతో దండ చరచుకొనెను. తన తోకను ముద్దు పెట్టుకొనెను. గంతులు వైచెను. తనలో తాను పాడుకొనెను. అటు నిటు తిరిగెను. స్తంభముకు ఎగబ్రాకెను. మరల క్రిందకు దుమికెను. ఆనందపారవశ్యముతో ఎన్నియో కోతిచేష్టలు చేసెను.



# 11. ఏకాదశ స్సర్గః

అవధూయ చ తాం బుద్ధిం బభూ వాస్థిత స్తదా,
జగామ చాపరాం చిన్తాం సీతాంప్రతి మహాకపిః. 1

న రామేణ వియుక్తా సా స్వప్తు మర్హసి భామినీ,
న భోక్తుం నా ప్యలంకర్తుం న పాన ముపసేవితుమ్. 2

నా న్యం నర ముపస్థాతుం సురాణా మపి చేశ్వరమ్,
న హి రామసమః కశ్చి ద్విద్యతే త్రిదశేష్వపి. 3

అన్యే య మితి నిశ్చిత్య పానభూమౌ చచార సః,
క్రీడితే నాపరాః కాన్తాః గీతేన చ తథాఽ పరాః. 4

నృత్తేన చాపరాః క్లాన్తాః పానవిప్రహతా స్తథా,
మురజేషు మృదఙ్గేషు పీఠికాసు చ సంస్థితాః. 5

తథాఽఽస్తరణ ముఖ్యేషు సంవిష్టా శ్చాపరాః స్త్రియః,
అఙ్గనానాం సహస్రేణ భూషితేన విభూషణైః. 6

రూపసల్లాపశీలేన యుక్తగీతార్థభాషిణా,
దేశకాలాభియుక్తేన యుక్తవాక్యాభిధాయినా. 7

రతాభిరతసంసుప్తం దదర్శ హరియూథపః,
తాసాం మధ్యే మహాబాహు శ్శుశుభే రాక్షసేశ్వరః. 8

గోష్ఠే మహతి ముఖ్యానాం గవాం మధ్యే యథా వృషః,
స రాక్షసేన్ద్ర శ్శుశుభే తాభిః పరివృత స్స్వయమ్. 9

కరేణుభి ర్యథాఽరణ్యే పరికీర్ణో మహాద్విపః,
సర్వకామై రుపేతాం చ పానభూమిం మహాత్మనః. 10

దదర్శ హరిశార్దూల స్తస్య రక్షఃపతే ర్గృహే,
మృగాణాం మాహిషాణాం చ వరాహాణాం చ భాగశః. 11

తత్ర న్యస్తాని మాంసాని పానభూమౌ దదర్శ సః,
రౌక్మేషు చ విశాలేషు భాజనే ష్వర్ధభక్షితాన్. 12

దదర్శ హరిశార్దూలో మయూరాన్ కుక్కుటాం స్తథా,
వరాహ వార్ధ్రీణసకాన్ దధిసౌవర్చలాయుతాన్. 13

శల్యా న్మృగమయూరాం శ్చ హనుమా నన్వవైక్షత,
క్రకరా న్వివిధా న్సిద్ధాం శ్చకోరా నర్ధభక్షితాన్. 14

మహిషానేకశల్యాంశ్చ భాగాం శ్చ కృతనిష్ఠితాన్,
లేహ్యా నుచ్చావచాన్ పేయాన్ భోజ్యాని వివిధాని చ. 15

తథామ్లలవణోత్తంసై ర్వివిధై రాగ షాడబైః,
హార నూపురకేయూరై రపవిద్ధై ర్మహాధనైః. 16

పానభాజనవిక్షిప్తైః ఫలై శ్చ వివిధై రపి,
కృత పుష్పోపహారా భూ రధికం పుష్యతి శ్రియమ్. 17

తత్ర తత్ర చ విన్యస్తై స్సుశ్లిష్టై శ్శయనాసనైః,
పానభూమి ర్వినా వహ్నిం ప్రదీప్తే వోపలక్ష్యతే. 18

బహుప్రకారై ర్వివిధై ర్వర సంస్కార సంస్కృతైః,
మాంసైః కుశలసంయుక్తైః పానభూమిగతైః పృథక్. 19

దివ్యాః ప్రసన్నా వివిధా స్సురాః కృతసురా అపి,
శర్క రాసవ మాధ్వీక పుష్పాసవ ఫలాసవాః. 20

వాసచూర్ణై శ్చ వివిధై ర్దృష్టా స్తైః స్తైః పృథక్పృథక్,
సన్తతా శుశుభే భూమి ర్మాల్యైశ్చ బహు సంస్థితైః 21

హిరణ్మయైశ్చ వివిధై ర్భాజనై స్స్ఫాటికై రపి,
జామ్బూనదమయై శ్చాన్యైః కరకై రభిసంవృతా. 22

రాజతేషు చ కుమ్భేషు జామ్బూనదమయేషు చ,
పానశ్రేష్ఠం తదా భూరి కపి స్తత్ర దదర్శ సః. 23

సోఽపశ్య చ్ఛాతకుంభాని శీధో ర్మణిమయాని చ,
రాజతాని చ పూర్ణాని భాజనాని మహాకపిః. 24

క్వచి దర్ధావశేషాణి క్వచి త్పీతాని సర్వశః,
క్వచి న్నైవ ప్రపీతాని పానాని స దదర్శ హ. 25

క్వచి ద్భక్ష్యాం శ్చ వివిధా న్క్వచి త్పానాని భాగశః,
క్వచి దన్నావశేషాణి పశ్యన్ వై విచచార హ. 26

క్వచి త్ప్రభిన్నైః కరకైః క్వచి దాలోలితై ర్ఘటైః,
క్వచి త్సంపృక్తమాల్యాని జలాని చ ఫలాని చ. 27

శయనా న్యత్ర నారీణాం శుభ్రాణి బహుధా పునః,
పరస్పరం సమాశ్లిష్య కాశ్చి త్సుప్తా వరాఙ్గనాః. 28

కాశ్చి చ్చ వస్త్ర మన్యస్యా స్స్వపన్త్యాః పరిధాయ చ,
ఆహృత్య చాబలా స్సుప్తా నిద్రాబలపరాజితాః. 29

తాసా ముచ్ఛ్వాసవాతేన వస్త్రం మాల్యం చ గాత్రజమ్,
నా త్యర్థం స్పన్దతే చిత్రం ప్రాప్య మన్ద మివానిలమ్. 30

చన్దనస్య చ శీతస్య శీధో ర్మధురసస్య చ,
వివిధస్య చ మాల్యస్య ధూపస్య వివిధస్య చ. 31

బహుధా మారుత స్తత్ర గన్ధం వివిధ ముద్వహన్,
రసానాం చన్దనానాం చ ధూపానాం చైవ మూర్ఛితః. 32

ప్రవవౌ సురభి ర్గన్ధో విమానే పుష్పకే తదా,
శ్యామావదాతా స్త త్రాన్యాః కాశ్చి త్కృష్ణా వరాఙ్గనాః. 33

కాశ్చి త్కాఞ్చనవర్ణాఙ్గ్యః ప్రమదా రాక్షసాలయే,
తాసాం నిద్రావశత్వా చ్చ మదనేన విమూర్ఛితమ్. 34

పద్మినీనాం ప్రసుప్తానాం రూప మాసీ ద్యథైవ హి,
ఏవం సర్వ మశేషణ రావణాన్తఃపురం కపిః. 35

దదర్శ సుమహాతేజా న దదర్శ చ జానకీమ్,
నిరీక్షమాణ శ్చ తదా తాః స్త్రియ స్స మహాకపిః,
జగామ మహతీం చిన్తాం ధర్మ సాధ్వస శఙ్కితః. 36

పరదారావరోధస్య ప్రసుప్తస్య నిరీక్షణమ్,.
ఇదం ఖలు మ మాత్యర్థం ధర్మలోపం కరిష్యతి. 37

న హి మే పరదారాణాం దృష్టి ర్విషయవర్తినీ,
అయం చాత్ర మయా దృష్టః పరదారపరిగ్రహః. 38

తస్య ప్రాదురభూ చ్చిన్తా పున రన్యా మనస్వినః,
నిశ్చితైకాన్తచిత్తస్య కార్యనిశ్చయదర్శినః. 39

కామం దృష్టా మయా సర్వా విశ్వస్తా రావణస్త్రియః,
న హి మే మనసః కిం చి ద్వైకృత్య ముపపద్యతే. 40

మనో హి హేతు స్సర్వేషా మిన్ద్రియాణాం ప్రవర్తనే,
శుభాశుభా స్వవస్థాసు తచ్చ మే సువ్యవస్థితమ్. 41

నా న్యత్ర హి మయా శక్యా వేదేహీ పరిమార్గితుమ్,
స్త్రియో హి స్త్రీషు దృశ్యన్తే సదా సంపరిమార్గణే. 42

యస్య సత్త్వస్య యా యోని స్తస్యాం త త్పరిమార్గ్యతే,
న శక్యా ప్రమదా నష్టా మృగీషు పరిమార్గితుమ్. 43

త దిదం మార్గితం తావ చ్ఛుద్ధేన మనసా మయా,
రావణాన్తఃపురం సర్వం దృశ్యతే న చ జానకీ. 44

దేవ గన్ధర్వ కన్యా శ్చ నాగకన్యా శ్చ వీర్యవాన్,
అవేక్షమాణో హనుమాన్ నై వాపశ్యత జానకీమ్. 45

తా మపశ్యన్ కపి స్తత్ర పశ్యం శ్చాన్యా వరస్త్రియః,
అపక్రమ్య తదా వీరః ప్రధ్యాతు ముపచక్రమే. 46

స భూయస్తు పరం శ్రీమాన్ మారుతి ర్యత్న మాస్థితః,
ఆపానభూమి ముత్సృజ్య తాం విచేతుం ప్రచక్రమే. 47

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, వాల్మీకీయే,
చతుర్వింశత్సహస్రికాయాం, సంహితాయాం,
శ్రీమత్సున్దరకాణ్డే ఏకాదశ స్సర్గః.

## 11 వ సర్గము

### హనుమంతుడు రాక్షస స్త్రీని సీతయని శంకించుట

కొలది సేపటికి మారుతి అమెయే సీత అను ఆలోచనను విడిచెను. సీతాదేవిని గురించి స్థిమితముగ ఆలోచింపదొడంగెను. రామచంద్రుని విడిచి సీతాదేవి నిద్రపోదు. భోజనము చేయదు. పానీయము స్వీకరింపదు. అలంకరించుకొనదు. పర పురుషుని సేవింపదు. రాముని వంటి వ్యక్తి దేవతలలోనైనను ఉండునా? ఈమె ఎవరో రావణుని అంతఃపుర స్త్రీలలో ఒక ఆమెయై ఉండవచ్చు. సీత మాత్రము కాదు.

అని నిశ్చయించుకొని హనుమానుడు ఆ పానభూమిలో అటు నిటు తిరుగసాగెను. కొంత దూరమునకు పోయి నిశితముగా అన్వేషించుటకై తిరిగి రావణుని శయనాగారమునకు వచ్చెను. అచ్చట స్త్రీలు కొందరు తమ మృదంగాదివాద్యములను ఆధారము చేసికొని నిద్రపోవుచుండిరి. మరికొందరు మంచి ఆస్తరణములను పరచుకొని నిద్రించుచుండిరి. . అలంకరించుకొన్న వేలకొలది సుందరీ మణులు అచట కలరు. ఆ స్త్రీల మధ్యలో గోవుల మధ్యలో వృషభము వలె రావణుడు ఉండెను. ఆ స్త్రీలచే పరివృతుడైన రావణుడు కరిణీ పరివృతుడైన గజరాజు వలె నుండెను.

ఆ పాన భూమిని మారుతి మరియొక సారి పరిశీలించెను. అచట రాక్షసచక్రవర్తి తన అంతఃపుర స్త్రీలతో కలిసి తినగా మిగిలిన మృగములు, పక్షులు, మాంసములు వివిధములైన రుచ్యములైన ఎన్నియో భక్ష్యపదార్థములు నిండి ఉండును. ఎన్నియో ఆసవములు, తేనెలు, పుష్పరసములు, ఫల రసములు అచ్చట కానవచ్చెను. వెండితో, బంగారముతో, రత్నములతో చేయబడిన వివిధములైన పాత్రలును అచ్చట నున్నవి. పూర్తిగా తిని విడిచిన భోజన పాత్రలు కొన్ని, సగము సగము తిని మిగిలిన పదార్థములతో విడిచిన పాత్రలు

మరికొన్ని కలవు. జలపాత్రలు కొన్ని, అజాగ్రత్త వలన భగ్నములైనవి. ఆ అంతఃపుర మందలి స్త్రీలు బాగుగ తిని మధుపానమొనర్చి ఒడలు తెలియని స్థితిలో గాఢనిద్రలో మునిగి యుండిరి.

ఆ భక్ష్యముల, పానీయముల పరిమళము భవనమంతయు వ్యాపించి యుండెను. ఆ స్త్రీలు అంతఃపురమున గాఢనిద్రావశలై సాయంకాలము ముకుళించిన పద్మలతల వలె నుండిరి. హనుమానుడు రావణాంతఃపురమంతయు వెదకెను. కానీ సీత కానరాలేదు. గాఢనిద్రలో మునిగి ఉన్న రావణాంతఃపుర స్త్రీలను పరిశీలనగా వెదకుచున్న మారుతికి ఎంత వెదకినను సీత కనబడలేదు. అంతఃపురమున భర్తృ సన్నిధిలో మైమఱచి నిద్రించు చున్న ఈ స్త్రీలను పరిశీలనగా చూచుట అధర్మము కదా! ఇట్లు భావించు చుండగనే అతనికి మరియొక ఆలోచన కలిగెను.

నేను రావణాంతః పుర స్త్రీలను ఒడలు తెలియక నిద్రించుచున్న సమయములో చూచిన మాట నిజమే కాని నా మనస్సు ఎట్టి వికారమును కలుగలేదు. నా మనస్సునకు స్థిరమై ఉన్నది. తక్కిన ఇంద్రియముల ప్రవృత్తికి మనస్సే కారణము. నా మనస్సు స్థిరముగ నున్నది. ఎప్పుడైనను ఒక స్త్రీని, స్త్రీలలో వెదకుట ఉచితముకాని ఆడు లేళ్ళలో వెదకిన దొరకునా! పరిశుద్ధమైన మనస్సుతో వెదకిన నాకు పాపము అంటదు. ఎందరో దేవ గంధర్వ కన్యలను, నాగకన్యలను హనుమానుడు చూచెను గాని సీతను కనుగొనలేక పోయెను. చివరకు మారుతి ఆ ప్రదేశమును విడిచి మరియొకచోట సీతాదేవిని వెదకనారంభించెను.



## 12. ద్వాదశ స్సర్గః

స తస్య మధ్యే భవనస్య మారుతి
ర్లతాగృహాం శ్చిత్రగృహాన్ నిశాగృహాన్,
జగామ సీతాంప్రతి దర్శనోత్సుకో
న చైవ తాం పశ్యతి చారుదర్శనామ్. 1

స చిన్తయామాస తతో మహాకపిః
ప్రియా మపశ్యన్ రఘునన్దనస్య తామ్,
ధ్రువం హి సీతా మ్రియతే యథా న మే
విచిన్వతో దర్శన మేతి మైథిలీ. 2

సా రాక్షసానాం ప్రవరేణ జానకీ
స్వశీలసంరక్షణతత్పరా సతీ,
అనేన నూనం ప్రతి దుష్టకర్మణా
హతా భవే దార్యపథే పరే స్థితా. 3

విరూపరూపా వికృతా వివర్చసో
మహాననా దీర్ఘవిరూపదర్శనాః,
సమీక్ష్య సా రాక్షసరాజయోషితో
భయా ద్వినష్టా జనకేశ్వరాత్మజా. 4

సీతా మదృష్ట్వా హ్యనవాప్య పౌరుషం
విహృత్య కాలం సహవానరై శ్చిరమ్,
న మేఽస్తి సుగ్రీవ సమీపగా గతి
స్సుతీక్ష్ణదణ్డో బలవాం శ్చ వానరః. 5

దృష్ట మన్తఃపురం సర్వం దృష్టా రావణయోషితః,
న సీతా దృశ్యతే సాధ్వీ వృథా జాతో మమ శ్రమః. 6

కిం ను మాం వానరా స్సర్వే గతం వక్ష్యన్తి సఙ్గతాః,
గత్వా తత్ర త్వయా వీర కిం కృతం త ద్వదస్వ నః. 7

అదృష్ట్వా కిం ప్రవక్ష్యామి తా మహం జనకాత్మజామ్,
ధ్రువం ప్రాయ ముపైష్యన్తి కాలస్య వ్యతివర్తనే. 8

కిం వా వక్ష్యతి వృద్ధ శ్చ జామ్బవా నఙ్గద శ్చ సః,
గతం పారం సముద్రస్య వానరా శ్చ సమాగతాః. 9

అనిర్వేదశ్శ్రియో మూల మనిర్వేదః పరం సుఖమ్,
అనిర్వేదో హి సతతం సర్వార్థేషు ప్రవర్తకః. 10

కరోతి సఫలం జన్తోః కర్మ యత్తత్కరోతి సః,
తస్మా దనిర్వేదకృతం యత్నం చేష్టే హ ముత్తమమ్. 11

భూయ స్తావ ద్విచేష్యామి దేశా న్రావణపాలితాన్,
ఆపానశాలా విచితా స్తథా పుష్పగృహాణి చ. 12

చిత్రశాలాశ్చ విచితా భూయః క్రీడాగృహాణి చ,
నిష్కుటాన్తరరథ్యాశ్చ విమానాని చ సర్వశః. 13

ఇతి సంచిన్త్య భూయోఽపి విచేతు ముపచక్రమే,
భూమిగృహాం శ్చైత్యగృహా గృహాతిగృహకా నపి. 14

ఉత్పత న్నిష్పతం శ్చాపి తిష్ఠ న్గచ్ఛ న్పునః పునః,
అపావృణ్వం శ్చ ద్వారాణి కవాటా న్యవఘాటయన్. 15

ప్రవిశ న్నిష్పతం శ్చాపి ప్రపత న్నుత్పతన్నపి,
సర్వ మ ప్యవకాశం స విచచార మహాకపిః. 16

చతురఙ్గుళమాత్రోపి నావకాశ స్స విద్యతే,
రావణాన్తఃపురే తస్మిన్ యం కపి ర్నజగామ సః. 17

ప్రాకారాన్తరరథ్యా శ్చ వేదికా శ్చైత్యసంశ్రయాః,
దీర్ఘికాః పుష్కరిణ్య శ్చ సర్వం తే నావలోకితమ్. 18

రాక్షస్యో వివిధాకారా విరూపా వికృతా స్తథా,
దృష్టా హనుమతా తత్ర న తు సా జనకాత్మజా. 19

రూపే ణాప్రతిమా లోకే వరా విద్యాధరస్త్రియః,
దృష్టా హనుమతా తత్ర న తు రాఘవనన్దినీ. 20

నాగకన్యా వరారోహాః పూర్ణచన్ద్రనిభాననాః,
దృష్టా హనుమతా తత్ర న తు సీతా సుమధ్యమా. 21

ప్రమథ్య రాక్షసేన్ద్రేణ నాగకన్యా బలాద్ధృతాః,
దృష్టా హనుమతా తత్ర న సా జనకనన్దినీ. 22

సోఽపశ్యం స్తాం మహాబాహుః పశ్యం శ్చాన్యా వరస్త్రియః,
విషసాద ముహు ర్ధీమాన్ హనుమా న్మారుతాత్మజః. 23

ఉద్యోగం వానరేన్ద్రాణాం ప్లవనం సాగరస్య చ,
వ్యర్థం వీ క్ష్యానిలసుత శ్చిన్తాం పున రుపాగమత్. 24

అవతీర్య విమానా చ్చ హనుమా న్మారుతాత్మజః,
చిన్తా ముపజగా మాథ శోకోపహతచేతనః. 25

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, వాల్మీకీయే,
చతుర్వింశత్సహస్రికాయాం, సంహితాయాం,
శ్రీమత్సున్దరకాణ్డే ద్వాదశ స్సర్గః.

## శ్రీమద్రామాయణ మాహాత్మ్యమ్

శ్లో. రామాయనమ ఇత్యే త దాదౌ శ్రీశబ్ద పూర్వకమ్,
ధ్యాయన్నామం లిఖేన్మన్త్రం శ్రీమద్రామషడక్షరమ్.
ఏవం శతం సహస్రం వా లిఖే న్నియమపూర్వకమ్,
శతశ్యాన్తే శతస్యాన్తే శ్రీరామ శ్శరణం మమ.

## 12 వ సర్గము

### హనుమంతుడు సీతను గానమి విచారించుట

మారుతి ఆ భవన మధ్యమున పూపొదరిండ్లను చిత్రశాలలను రాత్రి వేళ మాత్రమే వినియోగించుకొను గృహములను ఎన్నింటినో వెదకెను. కానీ సీత కానరాలేదు. రాఘవ ధర్మపత్ని కనబడనందున అతని మనసున ఒక ఆలోచన కలిగెను.

జానకీదేవిని ఎంత వెదకినను కానవచ్చుట లేదు. ఒక వేళ మరణించి యుండునా! రావణాసురుని చే అపహరింపబడిన ఆ పతివ్రతా శిరోమణి స్వశీల సంరక్షణ తత్పరయై యుండగా దుర్మార్గుడగు ఈ రాక్షసాధిపతిచే చంపబడి ఉండునా? భయంకర స్వరూపలైన ఇచ్చట రాక్షస స్త్రీలను చూచి భయపడి మరణించి ఉండునా? సీతను చూడక శత్రువుల పరాక్రమమును పరిశీలింపక తోడివానరులతో ఇంతకాలము వ్యర్థముగ గడపి ఇప్పుడు సుగ్రీవుని దగ్గరకు పోవుట సమంజసము కాదు. సుగ్రీవుని ఆజ్ఞను ఉల్లంఘించిన ఆతని దండనము తీవ్రమై ఉండును.

రావణాంతఃపురము అంతయు పరిశోధించితిని. అంతఃపుర స్త్రీలను జాగ్రత్తగా పరిశీలించితిని. సీత కనబడుట లేదు. నా శ్రమ మంతయు వృథ అయినది. సీత జాడ తెలియకుండ తిరిగి పోయిన నన్ను చూచి వానరులు ఏమనుకొందురో? ఆంజనేయా! లంకకు పోయి ఏమి చేసికొనివచ్చితివి. అని వారు అడుగవచ్చు. జానకీ దేవిని చూడకుండ నేను ఏమని జవాబు చెప్పుదును. కాలాతిక్రమమై నందున వారందరకు

మరణము తప్పదు. మా అందరిలో పెద్దవాడు జాంబవంతుడు ఏమనుకొనునో, యువరాజు అంగదుడు ఏమనుకొనునో! తక్కిన వానరులు ఎట్లుగ భావింతురో !

మరల ప్రయత్నింతును. నిరుత్సాహపడరాదు. ఉత్సాహము కార్యసాధక మగును. ఇంతవరకు సీత కనబడలేదని నిరుత్సాహము చెందక మరల మరల రావణపాలితమైన ప్రదేశముల నెల్ల వెదకెదను. పానశాలలు, పుష్పగృహములు, చిత్రశాలలు, క్రీడాగృహములు మరల మరల వెదకెదను. పెరటి తోటలను, సందుగొందులను ఆయా మేడల ఉపరి భాగములను మరల వెదకెదను. అని నిశ్చయించుకొని ఎక్కుచు, దిగుచు ఒక్క చోట నిలిచి చూచుచు మరల ముందునకు సాగుచు తలుపులు తెఱచి లోపలికి పోవుచు ఇవతలకు వచ్చి తలుపులు మూయుచు రావణాంతఃపుర మంతయు పరిశీలించెను.

అతడు త్రొక్కిచూడని నాలుగు అంగుళముల నేలయు అచట ఉండదు అనవచ్చును. దిగుడు బావులు, తామర కొలకులు ప్రాకారము లోపలి వీథులు, విద్యాధర స్త్రీలను, నాగ కన్యలను, కూడ చూచెను. సీత మాత్రము కనబడలేదు. విషణ్ణుడయ్యెను. మా వానరోత్తములు ఎంత శ్రమపడిరి. నేను ఈ సముద్రమును దాటి వచ్చితిని. నా సముద్ర తరణము మా వానరోత్తముల ప్రయత్నము కూడ విఫలమైనదే అనుచు వాయుసూనుడు మిక్కిలి చింతించెను. ఆ విమానము నుండి క్రిందికి దిగెను.



# 13. త్రయోదశ స్సర్గః

విమానా త్తు సుసఙ్క్రమ్య ప్రాకారం హరియూథపః,
హనుమాన్ వేగవా నాసీ ద్యథా విద్యు ద్ఘనాన్తరే. 1
సంపరిక్రమ్య హనుమాన్ రావణస్య నివేశనాత్,
అదృష్ట్వా జానకీం సీతా మబ్రవీ ద్వచనం కపిః. 2
భూయిష్ఠం లోలితా లఙ్కా రామస్య చరతా ప్రియమ్,
న హి పశ్యామి వైదేహీం సీతాం సర్వాఙ్గశోభనామ్. 3
పల్వలాని తటాకాని సరాంసి సరిత స్తథా,
నద్యోఽనూపవనాన్తా శ్చ దుర్గా శ్చ ధరణీధరాః. 4
లోలితా వసుధా సర్వా న తు పశ్యామి జానకీమ్,
ఇహ సమ్పాతినా సీతా రావణస్య నివేశనే. 5
ఆఖ్యాతా గృధ్రరాజేన న చ పశ్యామి తా మహమ్,
కి న్ను సీతాఽథ వైదేహీ మైథిలీ జనకాత్మజా. 6
ఉపతిష్ఠేత వివశా రావణం దుష్టచారిణమ్,
క్షిప్ర ముత్పతతో మన్యే సీతా మాదాయ రక్షసః. 7
బిభ్యతో రామబాణానా మన్తరా పతితా భవేత్,
అథ వా హ్రియమాణాయాః పథి సిద్ధ నిషేవితే. 8

మన్యే పతిత మార్యాయా హృదయం ప్రేక్ష్య సాగరమ్,
రావణ స్యోరువేగేన భుజాభ్యాం పీడితేన చ. 9

తయా మన్యే విశాలాక్ష్యా త్యక్తం జీవిత మార్యయా,
ఉపర్యుపరి వా నూనం సాగరం క్రమత స్తథా. 10

వివేష్టమానా పతితా సముద్రే జనకాత్మజా,
అహో క్షుద్రేణ వాఽనేన రక్షన్తీ శీల మాత్మనః. 11

అబన్ధు ర్భక్షితా సీతా రావణేన తపస్వినీ,
అథవా రాక్షసేన్ద్రస్య పత్నీభి రసితేక్షణా. 12

అదుష్టా దుష్టభావాభి ర్భక్షితా సా భవిష్యతి,
సంపూర్ణచన్ద్రప్రతిమం పద్మపత్రనిభేక్షణమ్. 13

రామస్య ధ్యాయతీ వక్త్రం పఞ్చత్వం కృపణా గతా,
హా రామ లక్ష్మణే త్యేవం హాఽయోధ్యే చేతి మైథిలీ. 14

విలప్య బహు వైదేహీ న్యస్తదేహా భవిష్యతి,
అథవా నిహితా మన్యే రావణస్య నివేశనే. 15

నూనం లాలప్యతే సీతా పఞ్జరస్థేవ శారికా,
జనకస్య సుతా సీతా రామపత్నీ సుమధ్యమా. 16

కథ ముత్పలపత్రాక్షీ రావణస్య వశం వ్రజేత్,
వినష్టా వా ప్రణష్టా వా మృతా వా జనకాత్మజా. 17

రామస్య ప్రియభార్యస్య న నివేదయితుం క్షమమ్,
నివేద్యమానే దోష స్స్యాద్దోష స్స్యా దనివేదనే. 18

కథం ను ఖలు కర్తవ్యం విషమం ప్రతిభాతి మే,
అస్మి న్నేవం గతే కార్యే ప్రాప్తకాలం క్షమం చ కిమ్. 19

భవే దితి మతం భూయో హనుమా న్ప్రవిచారయన్,
యది సీతా మదృష్ట్వాఽహం వానరేన్ద్రపురీ మితః. 20

గమిష్యామి తతః కో మే పురుషార్థో భవిష్యతి,
మ మేదం లఙ్ఘనం వ్యర్థం సాగరస్య భవిష్యతి. 21

ప్రవేశ శ్చైవ లఙ్కాయా రాక్షసానాం చ దర్శనమ్,
కిం మాం వక్ష్యతి సుగ్రీవో హరయో వా సమాగతాః. 22

కిష్కిన్ధాం స మనుప్రాప్తం తౌ వా దశరథాత్మజౌ,
గత్వా తు యది కాకుత్స్థం వక్ష్యామి పరమప్రియమ్. 23

న దృష్టేతి మయా సీతా తత స్త్యక్ష్యతి జీవితమ్,
పరుషం దారుణం క్రూరం తీక్ష్ణ మిన్ద్రియతాపనమ్. 24

సీతానిమిత్తం దుర్వాక్యం శ్రుత్వా స న భవిష్యతి,
తం తు కృచ్ఛ్ర గతం దృష్ట్వా పఞ్చత్వగతమానసమ్. 25

భృశానురక్తో మేధావీ న భవిష్యతి లక్ష్మణః,
వినష్టౌ భ్రాతరౌ శ్రుత్వా భరతోఽపి మరిష్యతి. 26

భరతం చ మృతం దృష్ట్వా శత్రుఘ్నో న భవిష్యతి,
పుత్రా న్మృతా న్సమీక్ష్యా థ న భవిష్యన్తి మాతరః. 27

కౌసల్యా చ సుమిత్రా చ కైకేయీ చ న సంశయః,
కృతజ్ఞ స్సత్యసన్ధ శ్చ సుగ్రీవః ప్లవగాధిపః. 28

రామం తథాగతం దృష్ట్వా తత స్త్యక్ష్యతి జీవితమ్,
దుర్మనా వ్యథితా దీనా నిరానన్దా తపస్వినీ, 29

పీడితా భర్తృశోకేన రుమా త్యక్ష్యతి జీవితమ్,
వాలిజేన తు దుఃఖేన పీడితా శోకకర్శితా. 30

పఞ్చత్వం చ గతే రాజ్ఞి తారాఽపి న భవిష్యతి,
మాతా పిత్రో ర్వినాశేన సుగ్రీవవ్యసనేన చ. 31

కుమారోఽ ప్యఙ్గదః కస్మా ద్ధారయిష్యతి జీవితమ్,
భర్తృజేన తు దుఃఖేన హ్యభిభూతా వనౌకసః. 32

శిరాం స్యభిహనిష్యన్తి తలై ర్ముష్టిభి రేవ చ,
సాన్త్వే నానుప్రదానేన మానేన చ యశస్వినా. 33

లాలితాః కపిరాజేన ప్రాణాం స్త్యక్ష్యన్తి వానరాః,
న వనేషు న శైలేషు న నిరోధేషు వా పునః. 34

క్రీడా మనుభవిష్యన్తి సమేత్య కపికుఞ్జరాః,
సపుత్రదారా స్సామాత్యా భర్తృవ్యసనపీడితాః. 35

శైలాగ్రేభ్యః పతిష్యన్తి సమేత్య విషమేషు చ,
విష ముద్బన్ధనం వాపి ప్రవేశం జ్వలనస్య వా. 36

ఉపవాస మథో శస్త్రం ప్రచరిష్యన్తి వానరాః,
ఘోర మారోదనం మన్యే గతే మయి భవిష్యతి. 37

ఇక్ష్వాకుకులనాశ శ్చ నాశ శ్చై వ వనౌకసామ్,
సోఽహం నైవ గమిష్యామి కిష్కిన్ధాం నగరీ మితః. 38

న చ శక్ష్యా మ్యహం ద్రష్టుం సుగ్రీవం మైథిలీం- వినా,
మయ్యగచ్ఛతి చేహాస్తే ధర్మాత్మానౌ మహారథౌ. 39

ఆశయా తౌ ధరిష్యే తే వానరా శ్చ మనస్వినః,
హస్తాదానో ముఖాదానో నియతో వృక్షమూలికః. 40

వానప్రస్థో భవిష్యామి హ్యదృష్ట్వా జనకాత్మజామ్,
సాగరానూపజే దేశే బహుమూలఫలోదకే. 41

చితాం కృత్వా ప్రవేక్ష్యామి సమిద్ధ మరణీసుతమ్,
ఉపవిష్టస్య వా సమ్య గ్లిఙ్గినీం సాధయిష్యతః. 42

శరీరం భక్షయిష్యన్తి వాయసా శ్శ్వాపదాని చ,
ఇదం మహర్షిభి ర్దృష్టం నిర్యాణ మితి మే మతిః. 43

సమ్య గాపః ప్రవేక్ష్యామి న చే త్పశ్యామి జానకీమ్,
సుజాతమూలా సుభగా కీర్తిమాలా యశస్వినీ. 44

ప్రభగ్నా చిరరా త్రీయం మమ సీతా మపశ్యతః,
తాపసో వా భవిష్యామి నియతో వృక్షమూలికః. 45

నేతః ప్రతిగమిష్యామి తా మదృష్ట్వాఽసితేక్షణామ్,
య దీతః ప్రతిగచ్ఛామి సీతా మనధిగమ్య తామ్. 46

అఙ్గద స్సహ తై స్సర్వై ర్వానరై ర్న భవిష్యతి,
వినాశే బహవో దోషా జీవ న్భద్రాణి పశ్యతి. 47

తస్మా త్ప్రాణా న్ధరిష్యామి ధ్రువో జీవిత సఙ్గమః,
ఏవం బహువిధం దుఃఖం మనసా ధారయ న్ముహుః. 48

నాధ్యగచ్ఛ త్తదా పారం శోకస్య కపికుఞ్జరః,
రావణం వా వధిష్యామి దశగ్రీవం మహాబలమ్. 49

కామ మస్తు హృతా సీతా ప్రత్యాచీర్ణం భవిష్యతి,
అథ వైనం సముత్‌క్షిప్య ఉపర్యుపరి సాగరమ్. 50

రామా యోపహరిష్యామి పశుం పశుపతే రివ,
ఇతి చిన్తాం సమాపన్న స్సీతా మనధిగమ్య తామ్. 51

ధ్యానశోకపరీతాత్మా చిన్తయామాస వానరః,
యావ త్సీతాం హి పశ్యామి రామపత్నీం యశస్వినీమ్. 52

తావ దేతాం పురీం లఙ్కాం విచినోమి పునః పునః,
సమ్పాతివచనా చ్చాపి రామం య ద్యానయా మ్యహమ్.

అపశ్యన్ రాఘవో భార్యాం నిర్దహే త్సర్వవానరాన్,
ఇహైవ నియతాహారో వత్స్యామి నియతేన్ద్రియః. 54

న మత్కృతే వినశ్యేయు స్సర్వే తే నరవానరాః,
అశోకవనికా చేయం దృశ్యతే యా మహాద్రుమా. 55

ఇమా మధిగమిష్యామి న హీయం విచితా మయా,
వసూన్ రుద్రాం స్తథాఽఽదిత్యా నశ్వినౌ మరుతోఽపి చ.

నమస్కృత్వా గమిష్యామి రక్షసాం శోకవర్ధనః,
జిత్వా తు రాక్షసాన్ సర్వా నిక్ష్వాకుకులనన్దినీమ్. 57

సంప్రదాస్యామి రామాయ యథా సిద్ధిం తపస్వినే,
స ముహూర్త మివ ధ్యాత్వా చిన్తా విగ్రథితేన్ద్రియః. 58

ఉదతిష్ఠ న్మహాతేజా హనుమా న్మారుతాత్మజః,
'నమోఽస్తు రామాయ స లక్ష్మణాయ
దేవ్యై చ తస్యై జనకాత్మజాయై,
నమోస్తు రుద్రేన్ద్రయమానిలేభ్యో
నమోస్తు చన్ద్రార్కమరుద్గణేభ్యః'. 59

స తేభ్యస్తు నమస్కృత్య సుగ్రీవాయ చ మారుతిః,
దిశ స్సర్వా స్సమాలోక్య హ్యశోకవనికాం ప్రతి. 60

స గత్వా మనసా పూర్వ మశోకవనికాం శుభామ్,
ఉత్తరం చిన్తయామాస వానరో మారుతాత్మజః. 61

ధ్రువం తు రక్షోబహులా భవిష్యతి వనాకులా,
అశోకవనికా చిన్త్యా సర్వ సంస్కార సంస్కృతా. 62

రక్షిణ శ్చాత్ర విహితా నూనం రక్షన్తి పాదపాన్,
భగవా నపి సర్వాత్మా నాతిక్షోభం ప్రవాతి వై. 63

సంక్షిప్తోఽయం మయాఽఽత్మా చ రామార్థే రావణస్య హి,
సిద్ధిం మే సంవిధాస్యన్తి దేవా స్సర్షిగణా స్త్విహ. 64

బ్రహ్మా స్వయంభూ ర్భగవాన్ దేవాశ్చైవ దిశన్తు మే,
సిద్ధి మగ్ని శ్చ వాయుశ్చ పురుహూతశ్చ వజ్రభృత్. 65

వరుణః పాశహస్త శ్చ సోమాదిత్యౌ తథైవ చ,
అశ్వినౌ చ మహాత్మానౌ మరుత శ్శర్వ ఏవ చ. 66

సిద్ధిం సర్వాణి భూతాని భూతానాం చైవ యః ప్రభుః,
దాస్యన్తి మమ యే చాన్యే హ్యదృష్టాః పథి గోచరాః. 67

త దున్నసం పాణ్డరదన్త మవ్రణం
శుచిస్మితం పద్మపలాశలోచనమ్,
ద్రక్ష్యే తదార్యావదనం కదా న్వహం
ప్రసన్నతారాధిపతుల్యదర్శనమ్. 68

క్షుద్రేణ పాపేన నృశంసకర్మణా
సుదారుణాలఙ్కృతవేషధారిణా,
బలాభిభూతా హ్యబలా తపస్వినీ
కథం ను మే దృష్టిపథేఽద్య సా భవేత్. 69

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, వాల్మీకీయే,
చతుర్వింశత్సహస్రికాయాం, సంహితాయాం,
శ్రీమత్సున్దరకాణ్డే, త్రయోదశ స్సర్గః.

## శ్రీమద్రామాయణ మాహాత్మ్యమ్

శ్లో. ఇమ మష్టాక్షరం మన్త్రం లిఖిత్వైవ సమాపయేత్,
శతం వాపి సహస్రవా నియమాత్ప్రతివాసరమ్.

# 13 వ సర్గము

## సీతను గానని హనుమంతుని వివిధ భావనలు

విమానము నుండి ప్రాకారము మీదకు దిగి వచ్చిన హనుమంతుడు మేఘమున మెఱపు వలె భాసించెను. రావణ భవనము నుండి బయటకు వచ్చిన మారుతి ఇట్లనుకొనసాగెను. శ్రీరామునకు ప్రియము చేయవలెనని లంక అంతయు వెదకితిని. సీత మాత్రము కానరాలేదు.

చిన్న చెరువులు, తటాకములు, సరస్సులు, నదులు, నదీ ప్రాంతములు, దుర్గములు అన్నియు వెదకితిని. సీతాదేవి కనబడలేదే? సంపాతి, సీత లంకలో ఉన్నట్లు చెప్పినాడు కదా! ఒక వేళ సీత పరిస్థితులను బట్టి గత్యంతరము లేక రావణునకు వశవర్తిని అయినదా! సీత నెత్తుకొని రావణుడు సముద్రమును దాటి వచ్చుచున్నప్పుడు రామబాణములకు భయపడిన అతని చేతుల నుండి సముద్రమున జారిపడినదేమో! లేక ఆకాశ మార్గమున రావణుడు ఎత్తుకొని పోవుడుండగా సముద్రమును చూచి ఆమె భయపడి ప్రాణములు విడిచెనా? దుష్టరాక్షసుని స్పర్శచే అవమానిత అయినట్లుగా ప్రాణములు విడిచెనా, ఆకాశమున ప్రయాణించినపుడు రావణుని పట్టు వదలించుకొని సముద్రమున మరణించినదో, లేదా స్వశీల సంరక్షణ తత్పరురాలై ఈ రావణాసురునిచే భక్షితురాలై ఉండవచ్చును.

రావణుడు ఆమెను భక్షింపక పోయినను లేదా అమాయకురాలైన ఆ సీతాదేవి క్రూరులైన రావణుని భార్యలచే భక్షింపబడినను భక్షింపబడి ఉండవచ్చును. తామరల వంటి నేత్రములు కలిగి చంద్రబింబము వంటి రామచంద్రుని ముఖమును ధ్యానము

చేయుచు ప్రాణములు విడిచి ఉండును. రామా! లక్ష్మణా! అయోధ్యానగరమా అనుచు ఆక్రందనము చేయుచు ఆమె దేహ త్యాగము చేసి యుండును. తానే మోహించి ఎత్తుకొని వచ్చిన మిథిలా రాజ తనయను రావణుడు చంపి యుండును. గోరువంకను పంజరమున బంధించినట్లు సీతాదేవిని ఏదో మరియొక భవనమున బంధించి అనునయించుచు ఉండవచ్చును.

జనకపుత్రియు, రామ పత్నియు అయిన ఆ సీతాదేవి రావణునకు వశవర్తిని కాబోదు. ఏ నేల మాలిగలలోనో దాచబడి కనబడక పోయిన సముద్రమున జారిపడి ప్రాణములను వదలెనా? రామచంద్రుని వియోగమును భరింపలేక ప్రాణములను వదలెనా సీతాదేవి యందు అత్యంత ప్రీతి కలిగిన రామచంద్రునకు ఆ విషయము చెప్పదగదు. ఈ విషయము చెప్పుటయు, చెప్పకపోవుటయు రెండును తప్పుగనే తోచుచున్నవి. ఈ పరిస్థితిలో నేనేమి చేయవలసి యుండును? అని మరల ఆలోచింపసాగెను.

సీతను కనుగొనకుండ కిష్కింధకు పోయినందున ప్రయోజననేమి? ఈ సముద్ర లంఘనము, లంకాప్రవేశము, రాక్షసులను చూచుట అంతయు వ్యర్థమే అగును. కార్య సాఫల్యము లేక కిష్కింధకు తిరిగి పోయిన నన్ను చూచి సుగ్రీవ మహారాజు, శ్రీరామ లక్ష్మణులు ఏమందురో? శ్రీరాముని వద్దకు పోయి సీత కనబడలేదు అన్నచో ఈ దుర్వార్త విని శ్రీరాముడు ప్రాణములు విడువ వచ్చును. ఆతడే సర్వస్వమని భావించిన లక్ష్మణుడును ఉండడు. ఈ ఇద్దరిని గురించిన దుర్వార్త విన్న భరతుడును ఉండడు. భరతుడు మృతుడైనచో శత్రుఘ్నుడును బ్రతుకడు.

 



పుత్రమరణ ములను విన్న కౌసల్య, సుమిత్ర, కైకేయి ఉండరు. తనకు పరమోపకారకుడైన రామచంద్రుని మరణమును విన్న లేదా చూచిన సత్యసంధుడు, కృతజ్ఞుడు అగు సుగ్రీవ మహారాజును బ్రతుకడు. సుగ్రీవ మరణమును చూచిన రమ, తారయు ఇద్దరును మరణింతురు. తల్లిదండ్రులును లేక సుగ్రీవ మహారాజును అంతరించినచో యువరాజు అంగదుడును ఉండడు. వానరాధిపతిచే మంచిగా లాలన చేయబడి సన్మానింపబడుచు వచ్చిన వానరోత్తములును సుగ్రీవుడు మరణింపగనే సబాంధవముగ కొండలనుండి క్రింద జారిపడియో, విషము త్రాగియో, అగ్ని ప్రవేశము చేసియో, ఉపవాసము లుండియో, ఆయుధమును ఉపయోగించియో మరణింపవచ్చును.

నేను కృత కృత్యుడను కాకుండ కిష్కింధకు పోయినచో ఇక్ష్వాకు వంశ నాశనము, వానర జాతి నాశనము కొనితెచ్చిన వాడనగుదును. కావున ఈ పరిస్థితిలో కిష్కింధకు వెళ్ళను. మైథిలి జాడ తెలిసికోకుండ సుగ్రీవ దర్శనము చేయను. నేను ఇక్కడనే ఉండినచో రేపో, మాపో హనుమానుడు సీత జాడ తెలిసికొని రాగలను ఆశతో రామ లక్ష్మణులు జీవింపవచ్చును. వానరులందరు బ్రతికి యుండవచ్చును.

తనంత తానుగ నోట పడిన, చేతి కందిన పండో, కాయో తినుచు ఏ చెట్టు మొదటనో కూర్చుండి జీవయాత్ర చేసెదను. లేదా అగ్నిహోత్రమును ప్రవేశించెదను. లేదా ప్రాయోపవేశము చేయుచు ఆత్మ సాక్షాత్కారము చేసెదను. ఆ సమయమున క్రూర జంతువులు. పక్షులు ఈ దేహమును భక్షించి ఆకలి తీర్చుకొనవచ్చును. మొదట లంకాధిష్ఠానదేవతావిజయముచే శుభారంభమై చంద్రోదయముచే రమణీయమై జాగరణముచే సుదీర్ఘ అయిన ఈ లంకా ప్రవేశము

చేసిన నాటి రాత్రి నాకు కీర్తిని ఈయకయే వ్యర్థమైనది. ప్రాణములు విడుచుట కాక ఏదో వృక్షమూలమున నుండి తాపసుడనై కాలము గడపెదను. సీత జాడ తెలిసికొనకుండ కిష్కింధకు వెళ్ళను. ఆత్మ త్యాగము చేసికొన్నచో అనర్థములు చాల ఉన్నవి. బ్రతికి యుండిన ఎప్పటికైనను శుభములు పడయ వచ్చును. కావున బ్రతికియే ఉందును. మున్ముందు శ్రేయస్సు లభింపవచ్చు.

ఇటువంటి అనర్థ పరంపర గురించి ఆలోచించుచున్న హనుమానుని దుఃఖమునకు అవధులు లేకపోయినవి. సీతాపహరణ మునకు ప్రతిక్రియగా రావణుని చంపివేసెదను. లేదా ఆ రావణుని బంధించి తీసికొనిపోయి పశుపతికి పశువును వలె రామునకు కానుకగా సమర్పించెదను.

సీతను కనుగొనలేక చాల శోకముతో నున్న ఆంజనేయుడు మరియొక నిర్ణయమునకు వచ్చెను. మహాపతివ్రత రామపత్నియగు సీత కనబడునంత వరకు లంకలో అన్వేషణము చేయుచునే యుందును. ఒకవేళ సంపాతి వచనములను నమ్మి సీత ఇక్కడనే ఉండవచ్చునను విశ్వాసముతో శ్రీరాముని ఇచ్చటకి తీసికొనివచ్చినచో సీత కనబడనప్పుడు ఆ రోషవశమున వానరుల నందరను కాల్చివేయ వచ్చును. కావున నేను కిష్కింధకు వెళ్ళకుండ ఆహార నియమమును పాటించి ఇంద్రియములను వశవర్తులుగ చేసికొనెదను. పశువులను, రుద్రులను, ఆదిత్యులను, అశ్వినీ దేవతలను, మరుత్తులను నమస్కరించి ఈ రాక్షసులను ఏడిపించుటకై ముందునకు సాగిపోయెదను. తాపసులకు తపస్సిద్ధి లభింప చేసినట్లు ఈ రాక్షస గణము నంతను జయించి రామచంద్రునకు సీతను సమర్పించెదను.

క్షణకాలము ధ్యానించి ఆ ధ్యానముచే ఇంద్రియములు స్తిమిత పడగ హనుమంతుడు లేచెను. రాముునకు నమస్కరించెను. లక్ష్మణునకును నమస్కరించెను. సీతాదేవిని తలంచుకొని నమస్కరించి తల్లీ! జానకీ దేవీ! నీవు ఆనాడు జనకునకు సాక్షాత్కరించినట్లుగా నాకును సాక్షాత్కరింపుము. తల్లీ! నిన్ను నేను వెదకి కనుగొనగలనా? నన్ను అనుగ్రహింపుము అని ప్రార్థించి మరల రుద్రులకు, ఆదిత్యులకు నమస్కరించి, సుగ్రీవునకును నమస్కరించి అశోకవనమునకు పోదలంచెను.

## అశోక వన వర్ణన

అశోక వనము రావణ భవనమునకు పెరటితోట. అది చాల అందమైనది. అచ్చట ఎందరో రాక్షసులు కాపలా కాయుచు నుందురు. ఈ సుందర వనమును రాముని మేలునకు, రావణుని కీడునకు, సూక్ష్మరూపమును ధరించి అతి జాగరూకుడనై అన్వేషించెదను. దేవతలు, ఋషీశ్వరులు, బ్రహ్మ, అగ్ని, వాయువులు, ఇంద్రుడు, వరుణుడు, చంద్రుడు, అశ్వినీ దేవతలు మున్నగు వారందరు నాకు మేలు చేయుదురు గాక! సమస్త భూతములు, మార్గవర్తులైన ఇతరదేవతలు అందరు నాకు మేలు చేయుదురు గాక. ఉన్నతమై తెల్లని దంతములు కలిగి శుచిస్మితయై తామరరేకుల వలె సుందరమైన నేత్రములు కలిగిన ఆ సీతాదేవి యొక్క చంద్రబింబము వంటి ముఖమును ఎప్పటికి చూతునో! ఈ పాపాత్ముడు దొంగ సన్యాసి వేషము వేసికొని బలవంతముగ ఎత్తుకొని వచ్చిన ఆ రామపత్నిని ఈ కనులతో సేవించుకొను భాగ్యమెప్పటికో ! అనుకొన్నాడు హనుమ.



# 14. చతుర్దశ స్సర్గః

స ముహూర్త మివ ధ్యాత్వా మనసా చాధిగమ్య తామ్,
అవప్లుతో మహాతేజాః ప్రాకారం తస్య వేశ్మనః. 1

స తు సంహృష్ట సర్వాఙ్గః ప్రాకారస్థో మహాకపిః,
పుష్పితాగ్రా న్వసన్తాదౌ దదర్శ వివిధా న్ద్రుమాన్. 2

సాలా నశోకా న్భవ్యాంశ్చ చమ్పకాం శ్చ సుపుష్పితా న్,
ఉద్దాలకా న్నాగవృక్షాం శ్చూతా న్కపిముఖా నపి. 3

అ థామ్రవణసఞ్ఛన్నాం లతాశతసమావృతామ్,
జ్యాముక్త ఇవ నారాచః పుప్లువే వృక్షవాటికామ్. 4

స ప్రవిశ్య విచిత్రాం తాం విహగై రభినాదితామ్,
రాజతైః కాఞ్చనై శ్చైవ పాదపై స్సర్వతో వృతామ్. 5

విహగై ర్మృగసఙ్ఘైశ్చ విచిత్రాం చిత్రకాననామ్,
ఉదితాదిత్యసంకాశాం దదర్శ హనుమా న్కపిః. 6

వృతాం నానావిధై ర్వృక్షైః పుష్పోపగఫలోపగైః,
కోకిలై ర్భృఙ్గరాజైశ్చ మత్తై ర్నిత్యనిషేవితామ్. 7

ప్రహృష్టమనుజే కాలే మృగపక్షిసమాకులే,
మత్తబర్హిణ సఙ్ఘుష్టాం నానాద్విజగణాయుతామ్. 8

మార్గమాణో వరారోహాం రాజపుత్రీ మనిన్దితామ్,
సుఖప్రసుప్తా న్విహగా న్బోధయామాస వానరః. 9

ఉత్పతద్భి ర్ద్విజగణైః పక్షై స్సాలా స్సమాహతాః,
అనేకవర్ణా వివిధా ముముచుః పుష్పవృష్టయః. 10

పుష్పావకీర్ణ శ్శుశుభే హనుమా న్మారుతాత్మజః,
అశోకవనికామధ్యే యథా పుష్పమయో గిరిః. 11

దిశ స్సర్వాః ప్రధావన్తం వృక్షషణ్డగతం కపిమ్,
దృష్ట్వా సర్వాణి భూతాని వసన్త ఇతి మేనిరే. 12

వృక్షేభ్యః పతితైః పుష్పై రవకీర్ణా పృథగ్విధైః,
రరాజ వసుధా తత్ర ప్రమదేవ విభూషితా. 13

తరస్వినా తే తరవ స్తర సాభిప్రకమ్పితాః,
కుసుమాని విచిత్రాణి ససృజుః కపినా తదా. 14

నిర్ధూతపత్రశిఖరా శ్శీర్ణపుష్పఫలా ద్రుమాః,
నిక్షిప్త వస్త్రాభరణా ధూర్తా ఇవ పరాజితాః. 15

హనూమతా వేగవతా కమ్పితా స్తే నగోత్తమాః,
పుష్ప పర్ణ ఫలాన్యాశు ముముచుః పుష్పశాలినః. 16

విహఙ్గసఙ్ఘై ర్హీనా స్తే స్కన్ధమాత్రాశ్రయా ద్రుమాః,
బభూవు రగమా స్సర్వే మారుతే నేవ నిర్ధుతాః. 17

నిర్ధూతకేశీ యువతి ర్యథా మృదిత వర్ణకా,
నిష్పీతశుభదన్తోష్ఠీ నఖై ర్దన్తైశ్చ విక్షతా. 18

తథా లాఙ్గూలహస్తైశ్చ చరణాభ్యాం చ మర్దితా,
బభూవాఽశోకవనికా ప్రభగ్న వర పాదపా. 19

మహాలతానాం దామాని వ్యథమ త్తరసా కపిః,
యథా ప్రావృషి విన్ధ్యస్య మేఘజాలాని మారుతః. 20

స తత్ర మణిభూమీశ్చ రాజతీశ్చ మనోరమాః,
తథా కాఞ్చనభూమీశ్చ దదర్శ విచర న్కపిః. 21

వాపీశ్చ వివిధాకారాః పూర్ణాః పరమవారిణా,
మహార్హై ర్మణిసోపానై రుపపన్నా స్తత స్తతః. 22

ముక్తాప్రవాళసికతాః స్ఫాటికాన్తరకుట్టిమాః.
కాఞ్చనై స్తరుభి శ్చిత్రై స్తీరజై రుపశోభితాః. 23

ఫుల్లపద్మోత్పలవనా శ్చక్రవాకోపకూజితాః,
నత్యూహరుత సఙ్ఘుష్టా హంససారసనాదితాః. 24

దీర్ఘాభి ర్ద్రుమయుక్తాభి స్సరిద్భి శ్చ సమన్తతః,
అమృతోపమతోయాభి శ్శివాభి రుపసంస్కృతాః. 25

లతాశతై రవతతా స్సన్తానకుసుమావృతాః,
నానాగుల్మావృతఘనాః కరవీరకృతాన్తరాః. 26

తతోఽమ్బుధరసఙ్కాశం ప్రవృద్ధశిఖరం గిరిమ్,
విచిత్రకూటం కూటై శ్చ సర్వతః పరివారితమ్. 27

శిలాగృహై రవతతం నానావృక్షై స్సమావృతమ్,
దదర్శ హరిశార్దూలో రమ్యం జగతి పర్వతమ్. 28

దదర్శ చ నగా త్తస్మా న్నదీం నిపతితాం కపిః,
అఙ్కా దివ సముత్పత్య ప్రియస్య పతితాం ప్రియామ్. 29

జలే నిపతితాగ్రైశ్చ పాదపై రుపశోభితామ్,
వార్యమాణా మివ క్రుద్ధాం ప్రమదాం ప్రియబన్ధుభిః. 30

పునరావృత్తతోయాం చ దదర్శ స మహాకపిః,
ప్రసన్నా మివ కాన్తస్య కాన్తాం పునరుపస్థితామ్. 31

తస్యాదూరా త్సపద్మిన్యో నానాద్విజగణాయుతాః,
దదర్శ హరిశార్దూలో హనుమా న్మారుతాత్మజః. 32

కృత్రిమాం దీర్ఘికాం చాపి పూర్ణాం శీతేన వారిణా,
మణిప్రవరసోపానాం ముక్తాసికతశోభితామ్. 33

వివిధై ర్మృగసఙ్ఘై శ్చ విచిత్రాం చిత్రకాననామ్,
ప్రాసాదై స్సుమహద్భి శ్చ నిర్మితై ర్విశ్వకర్మణా. 34

కాననైః కృత్రిమై శ్చాపి సర్వత స్సమలంకృతామ్,
యే కేచి త్పాదపా స్తత్ర పుష్పోపగఫలోపగాః. 35

సచ్ఛత్రా స్సవితర్దీకా స్సర్వే సౌవర్ణవేదికాః,
లతాప్రతానై ర్బహుభిః పర్ణైశ్చ బహుభి ర్వృతామ్. 36

కాఞ్చనీం శింశుపా మేకాం దదర్శ హరియూథపః,
వృతాం హేమమయీభిస్తు వేదికాభి స్సమన్తతః. 37

సో౽పశ్య ద్భూమిభాగాం శ్చ గర్తప్రస్రవణాని చ,
సువర్ణవృక్షా నపరాన్ దదర్శ శిఖిసన్నిభాన్. 38

తేషాం ద్రుమాణాం ప్రభయా మేరో రివ దివాకరః,
అమన్యత తదా వీరః కాఞ్చనో ఉస్మీతి వానరః. 39

తాం కాఞ్చనై స్తరుగణై ర్మారుతేన చ వీజితామ్,
కిఙ్కిణీశతనిర్ఘోషాం దృష్ట్వా విస్మయ మాగమత్. 40

స పుష్పితాగ్రాం రుచిరాం తరుణాఙ్కురపల్లవామ్,
తా మారుహ్య మహాబాహు శ్శింశుపాం పర్ణసంవృతామ్. 41

ఇతో ద్రక్ష్యామి వైదేహీం రామదర్శనలాలసామ్,
ఇతశ్చేతశ్చ దుఃఖార్తాం సంపతన్తీం యదృచ్ఛయా. 42

అశోకవనికా చేయం దృఢం రమ్యా దురాత్మనః,
చమ్పకై శ్చన్దనై శ్చాపి వకులైశ్చ విభూషితా. 43

ఇయం చ నళినీ రమ్యా ద్విజసఙ్ఘనిషేవితా,
ఇమాం సా రామమహిషీ నూన మేష్యతి జానకీ. 44

సా రామా రామమహిషీ ర్రాఘవస్య ప్రియా సతీ,
వనసఞ్చారకుశలా నూన మేష్యతి జానకీ. 45

అథ వా మృగశాబాక్షీ వనస్యా స్య విచక్షణా,
వన మేష్యతి సా ఉ ఉర్యే హ రామచిన్తానుకర్శితా. 46

రామశోకాభిసన్తప్తా సా దేవీ వామలోచనా,
వనవాసే రతా నిత్య మేష్యతే వనచారిణీ. 47

వనేచరాణాం సతతం నూనం స్పృహయతే పురా,
రామస్య దయితా భార్యా జనకస్య సుతా సతీ. 48

సన్ధ్యాకాలమనా, శ్శ్యామా ధ్రువ మేష్యతి జానకీ,
నదీం చేమాం శివజలాం సన్ధ్యార్థే వరవర్ణినీ. 49

తస్యా శ్చా ప్యనురూపే య మశోకవనికా శుభా,
శుభా యా పార్థివేన్ద్రస్య పత్నీ రామస్య సమ్మతా. 50

యది జీవతి సా దేవీ తారాధిపనిభాననా,
ఆగమిష్యతి సాఽవశ్య మిమాం శివజలాం నదీమ్. 51

ఏవం తు మత్వా హనుమా న్మహాత్మా
ప్రతీక్షమాణో మనుజేన్ద్రపత్నీమ్,
అవేక్షమాణ శ్చ దదర్శ సర్వం,
సుపుష్పితే పర్ణఘనే నిలీనః. 52

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, వాల్మీకీయే,
చతుర్వింశత్సహస్రికాయాం, సంహితాయాం,
శ్రీమత్సున్దరకాణ్డే, చతుర్దశ స్సర్గః.

## శ్రీమద్రామాయణ మాహాత్మ్యమ్

శ్లో. పూర్వాహ్ణే విలిఖే ద్ధ్యాయ న్రామ పదామ్బుజమ్,
తాని నామాన్య థాభార్ప్య భుఞ్జే ల్లైత న్నివేదితమ్.

 



# 14 వ సర్గము

## హనుమంతుడు అశోకవనమున ప్రవేశించుట

క్షణకాలము సీతాదేవిని మనసా ధ్యానించి ఆ భవనము నుండి ప్రాకారము మీదికి దిగెను. సీతాధ్యాన మాత్రముచే అతని దేహమంతయు పులకరించెను. ప్రాకారమందుండియె వసంత ప్రారంభమున చక్కగ పూచిన వృక్షముల నెన్నింటినో చూచెను. సాల వృక్షములు, అశోకములు చక్కగ పూచిన సంపెంగలు, నాగకేసర ములు, చూతములు కన్నులకు విందునొనరించినవి. మామిడి తోటలతో నిండిన ఆ వృక్షవాటికకు బాణము వలె దూసికొనిపోయెను. తెల్లని, పచ్చని రంగులు కల పూలతో నిండిన ఆ వృక్షములు వెండి లేదా బంగారు వృక్షముల వలె కనబడుచుండెను. ఆ వృక్షవాటిక ఎన్నియో పక్షులకు, ఎన్నియో మృగములకు నివాస భూమియై ఉండెను. ఆ వృక్షములు పూలతో, ఫలములతో నిండి యున్నవి. మావి చిగురులను మేసి కోకిలలు, పుష్పాసవమును త్రావి తుమ్మెదలు, చక్కగ ధ్వనించుచున్నవి. హనుమానుడు వేగముగ అశోక వనమున ప్రవేశించినపుడు వృక్షములు రాల్చిన పుష్పములచే పూలకొండ వలె కానవచ్చెను. రాలిన పూవులచే ఆ వనభూమి అలంకృతయైన స్త్రీ వలె కానబడెను. హనుమానుని గమనవేగముచే ఆకులు, పూవులు, ఫలములు రాలిపోయి మోడులై నిలిచిన ఆ తోటలోని వృక్షములు జూదములో తమ ఆభరణములను కట్టు వస్త్రములను ఓడిపోయిన జూదగాండ్రవలె ఉండెను.

హనుమానుని తోకతో, కాళ్ళతో, చేతులతో మర్దిత అయిన ఆ అశోకవనిక అనుభూతయై జుట్టు చెదరి అంగరాగము మాసిన

 



తరుణీమణి వలె కానవచ్చెను. వర్షాకాలమున వింధ్యము మీద చేరిన మేఘమాలికలను వాయువు వలె అశోకవనమందలి పెద్ద పెద్ద లతాబంధములను కూడ త్రెంచివైచెను. మణులతో తాపటము చేసిన నేలలు వెండి, బంగారు రేకులు పరచిన భూములను కూడ అంజనేయుడు చూచెను.

అత్యున్నతమైన పెద్ద పెద్ద వృక్షములతో కూడి మేఘమండలమంత యెత్తున భాసించుచున్న ఒక మట్టి కొండను కూడ చూచెను. ప్రియుని సన్నిధినుండి ప్రణయ కోపమున వెడలుచున్న మానిని వలె కొండనుండి క్రిందికి ప్రవహించుచున్న ఒక నదిని చూచెను. శాఖాగ్రములు నీటికి అంటునట్లుగ వాలిన వృక్షములను చూచినప్పుడు ప్రణయకుపితయగు తరుణీమణిని బ్రతిమాలుచున్న ఆప్తబంధువులా అను భావన ఆంజనేయునకు కలిగెను. చల్లని నీటితో నిండిన, రత్నసోపానములు గల ముత్యాల ఇసుక తిన్నెలతో కూడిన దిగుడుబావిని కూడ చూచెను. అక్కడ విశ్వకర్మ నిర్మించిన భవనములును కలవు. దట్టముగ పెరిగిన వృక్షములు అచ్చట బంగారు వేదికలకు వితానమువలె (చాందిని) ఉన్నవి. అశోక వనములో పూవులు పూయని, కాయలు కాయని వృక్షములు లేవు.

## హనుమంతుడు శింశుపా వృక్షమును చూచుట

ఆ అశోకవనములోని చిగురు కొమ్మలతో, దట్టముగ పెరిగిన ఆకులతో నుండి బంగారు రంగుతో నిండిన శింశుపా వృక్షము కానవచ్చెను. మేరుశిఖరమున నిలిచిన సూర్యుడు బంగారు రంగుతో ప్రకాశించినట్లే బంగారు రంగు కలిగిన ఆ వృక్షముల మధ్య నిలిచిన హనుమానుని దేహమును సువర్ణ వర్ణమై తోచెను. శింశుపావృక్షము

గాలికి కదలుచున్నపుడు ఆ ఆకుల గలగలలు చిరుమువ్వల మ్రోత వలె విననయ్యెను. చక్కగ పూచి చిగిర్చియున్న ఆ శింశుపావృక్షము నారోహించి హనుమానుడు సీతాన్వేషణము చేయదలంచెను. రామ దర్శన లాలసయై ఆమె కోరిక ఫలింపక దుఃఖార్తయై యున్న సీతాదేవి ఎప్పుడైన దైవికముగ ఇటు రావచ్చును. దురాత్ముడగు రావణుని ఈ అశోక వనము సంపెంగలతో, చందనములతో వకుళములతో (పొగడ) ఎంత రమణీయమైనది.

ఇంత సుందరమైన ఈ వనము సీతకు మనోవినోదహేతువై ఉండును. కావున సీతాదేవి ఎప్పుడైనను ఇచ్చటికి రావచ్చును. సీతాదేవికి వనములనిన చాల ఇష్టము. పతి విశ్లేషముచే కృశించి యున్న సీతకు ఈ వనదర్శనము కొంత ఊరట కలిగింప వచ్చును. ఇచటి పక్షులు, మృగములు కూడ ఆమెకు దర్శనీయములై ఉండవచ్చును. జనకుని వంటి శిష్టుని ఇంటపెరిగి కకుత్స్థ వంశపు కోడలు అయిన సీత పరిశుద్ధమైన జలము కలిగిన ఈ నదికి సంధ్యాసమయమున దేవతానమస్కార మొనరించుకైనను పార్థివేంద్రుడగు రాముని ధర్మపత్ని ఈ నదికి తప్పక రావచ్చునను విశ్వాసముతో హనుమంతుడు చక్కగ పూచి ఆకులతో దట్టముగ వ్యాపించియున్న ఆ శింశుపావృక్షమున ఆకుల మాటున దాగి నిరీక్షించుచుండెను.



# 15. పఞ్చదశ స్సర్గః

స వీక్షమాణ స్తత్రస్థో మార్గమాణ శ్చ మైథిలీమ్,
అవేక్షమాణ శ్చ మహీం సర్వాం తా మన్వవైక్షత. 1

సన్తానకలతాభిశ్చ పాదపై రుపశోభితామ్,
దివ్యగన్ధరసోపేతాం సర్వత స్సమలంకృతామ్. 2

తాం స నన్దనసంకాశాం మృగపక్షిభి రావృతామ్,
హర్మ్య ప్రాసాద సమ్బాధాం కోకిలాకులనిస్స్వనామ్. 3

కాఞ్చనోత్పలపద్మాభి ర్వాపీభి రుపశోభితామ్,
బహ్వాసనకుథోపేతాం బహు భూమిగృహాయుతామ్. 4

సర్వర్తుకుసుమై రమ్యాం ఫలవద్భి శ్చ పాదపైః,
పుష్పితానా మశోకానాం శ్రియా సూర్యోదయప్రభామ్. 5

ప్రదీప్తా మివ తత్రస్థో మారుతి స్సముదైక్షత,
నిష్పత్రశాఖాం విహగైః క్రియమాణా మి వాసకృత్. 6

వినిష్పతద్భి శ్శతశ శ్చిత్రైః పుష్పావతంసకైః,
ఆమూలపుష్పనిచితై రశోకై శ్శోకనాశనైః. 7

పుష్పభారాతిభారైశ్చ స్పృశద్భి రివ మేదినీమ్,
కర్ణికారైః కుసుమితైః కింశుకైశ్చ సుపుష్పితైః. 8

స దేశః ప్రభయా తేషాం ప్రదీప్త ఇవ సర్వతః,
పున్నాగా స్సప్తపర్ణా శ్చ చమ్ప కోద్దాలకా స్తథా. 9

వివృద్ధమూలా బహవ శ్శోభన్తేస్మ సుపుష్పితాః,
శాతకుమ్భనిభాః కేచి త్కేచి దగ్నిశిఖోపమాః. 10

నీలాఞ్జననిభాః కే చి త్తత్రాశోకా స్సహస్రశః,
నన్దనం వివిధోద్యానం చిత్రం చైత్రరథం యథా. 11

అతివృత్త మి వాచిన్త్యం దివ్యం రమ్యం శ్రియావృతమ్,
ద్వితీయ మివ చాకాశం పుష్పజ్యోతిర్గణాయుతమ్. 12

పుష్పరత్నశతై శ్చిత్రం పఞ్చమం సాగరం యథా,
సర్వర్తుపుష్పై ర్నిచితం పాదపై ర్మధుగన్ధిభిః. 13

నానానినాదై రుద్యానం రమ్యం మృగగణై ర్ద్విజైః,
అనేకగన్ధప్రవహం పుణ్యగన్ధం మనోరమమ్. 14

శైలేన్ద్ర మివ గన్ధాఢ్యం ద్వితీయం గన్ధమాదనమ్,
అశోకవనికాయాం తు తస్యాం వానరపుఙ్గవః. 15

స దద ర్శావిదూరస్థం చైత్యప్రాసాద ముచ్ఛ్రితమ్,
మధ్యే స్తమ్భసహస్రేణ స్థితం కైలాసపాణ్డరమ్. 16

ప్రవాళకృతసోపానం తప్తకాఞ్చనవేదికమ్,
ముష్ణన్త మివ చక్షూంషి ద్యోతమాన మివ శ్రియా. 17

విమలం ప్రాంశు భావత్వా దుల్లిఖన్త మి వామ్బరమ్,
తతో మలినసంవీతాం రాక్షసీభి స్సమావృతామ్. 18

ఉపవాసకృశాం దీనాం నిశ్శ్వసన్తీం పునః పునః,
దదర్శ శుక్లపక్షాదౌ చన్ద్రరేఖా మి వామలామ్. 19

మన్ద ప్రఖ్యాయమానేన రూపేణ రుచిరప్రభామ్,
పినద్ధాం ధూమజాలేన శిఖామివ విభావసోః. 20

పీతే నైకేన సంవీతాం క్లిష్టే నోత్తమవాససా,
సపఙ్కా మనలఙ్కారం విపద్మా మివ పద్మినీమ్. 21

వ్రీళితాం దుఃఖసన్తప్తాం పరిమ్లానాం తపస్వినీమ్,
గ్రహే ణాఙ్గారకే పీడితా మివ రోహిణీమ్. 22

అశ్రుపూర్ణముఖీం దీనాం కృశా మనశనేన చ,
శోక ధ్యానపరాం దీనాం నిత్యం దుఃఖపరాయణామ్. 23

ప్రియం జన మపశ్యన్తీం పశ్యన్తీం రాక్షసీగణమ్,
స్వగణేన మృగీం హీనాం శ్వగణాభివృతా మివ. 24

నీలనాగాభయా వేణ్యా జఘనం గతయైకయా,
నీలయా నీరదాపాయే వనరాజ్యా మహీ మివ. 25

సుఖార్హాం దుఃఖసన్తప్తాం వ్యసనానా మకోవిదామ్,
తాం సమీక్ష్య విశాలాక్షీ మధికం మలినాం కృశామ్. 26

తర్కయామాస సీతేతి కారణై రుపపాదిభిః,
హ్రియమాణా తదా తేన రక్షసా కామరూపిణా. 27

యథారూపా హి దృష్టా వై తథారూ పేయ మఙ్గనా,
పూర్ణచన్ద్రాననాం సుభ్రూం చారువృత్తపయోధరామ్. 28

కుర్వన్తీం ప్రభయా దేవీం సర్వా వితిమిరా దిశః,
తాం నీలకేశీం బిమ్బోష్ఠీం సుమధ్యాం సుప్రతిష్ఠితామ్. 29

సీతాం పద్మపలాశాక్షీం మన్మథస్య రతిం యథా,
ఇష్టాం సర్వస్య జగతః పూర్ణచన్ద్రప్రభా మివ. 30

భూమౌ సుతను మాసీనాం నియతా మివ తాపసీమ్,
నిశ్శ్వాసబహుళాం భీరుం భుజగేన్ద్రవధూ మివ. 31

శోకజాలేన మహతా వితతేన న రాజతీమ్,
సంసక్తాం ధూమజాలేన శిఖా మివ విభావసోః. 32

తాం స్మృతీ మివ సన్దిగ్ధా మృద్ధిం నిపతితా మివ,
విహతా మివ చ శ్రద్ధా మాశాం ప్రతిహతా మివ. 33

సోపసర్గాం యథా సిద్ధిం బుద్ధిం సకలుషా మివ,
అభూతే నాపవాదేన కీర్తిం నిపతితా మివ. 34

రామోపరోధవ్యథితాం రక్షోహరణకర్శితామ్,
అబలాం మృగశాబాక్షీం వీక్షమాణాం తతస్తతః. 35

బాష్పామ్బుపరిపూర్ణేన కృష్ణవక్రాక్షిపక్ష్మణా,
వదనే నాప్రసన్నేన నిశ్శ్వసన్తీం పునః పునః. 36

మలపఙ్కధరాం దీనాం మణ్డనార్హా మమణ్డితామ్,
ప్రభాం నక్షత్రరాజస్య కాలమేఘై రి వావృతామ్. 37

తస్య సన్దిదిహే బుద్ధి ర్ముహు స్సీతాం నిరీక్ష్య తు,
ఆమ్నాయా నామయోగేన విద్యాం ప్రశిథిలా మివ. 38

దుఃఖేన బుబుధే సీతాం హనుమా ననలంకృతామ్,
సంస్కారేణ యథా హీనాం వాచ మర్థాన్తరం గతామ్. 39

తాం సమీక్ష్య విశాలాక్షీం రాజపుత్రీ మనిన్దితామ్,
తర్కయామాస సీ తేతి కారణై రుపపాదిభిః. 40

వైదేహ్యా యాని చాఙ్గేషు తదా రామోఽన్వకీర్తయత్,
తా న్యాభరణజాలాని శాఖాశోభీ న్యలక్షయత్. 41

సుకృతౌ కర్ణవేష్టౌ చ శ్వదంష్ట్రౌ చ సుసంస్థితౌ,
మణివిద్రుమచిత్రాణి హస్తే ష్వాభరణాని చ. 42

శ్యామాని చిరయుక్తత్వా త్తథా సంస్థానవన్తి చ,
తా న్యే వైతాని మన్యే ఽహం యాని రామోఽన్వకీర్తయత్.

తత్ర యా న్యవహీనాని తా న్యహం నోపలక్షయే,
యా న్యస్యా నావహీనాని తా నీమాని న సంశయః. 44

పీతం కనకపట్టాభం స్రస్తం త ద్వసనం శుభమ్,
ఉత్తరీయం నగాసక్తం తదా దృష్టం ప్లవఙ్గమైః. 45

భూషణాని చ ముఖ్యాని దృష్టాని ధరణీతలే,
అన య్యై వాపవిద్ధాని స్వనవన్తి మహాన్తి చ. 46

ఇదం చిరగృహీతత్వా ద్వసనం క్లిష్టవత్తరమ్,
తథాఽపి నూనం తద్వర్ణం తథా శ్రీమ ద్యథేతరత్. 47

ఇయం కనకవర్ణాఙ్గీ రామస్య మహిషీ ప్రియా,
ప్రణష్టాపి సతీ యాఽస్య మనసో న ప్రణశ్యతి. 48

ఇయం సా యత్కృతే రామ శ్చతుర్భిః పరితప్యతే,
కారుణ్యే నానృశంస్యేన శోకేన మదనేన చ. 49

స్త్రీ ప్రణష్టేతి కారుణ్యా దాశ్రితే త్యానృశంస్యతః,
పత్నీ నష్టేతి శోకేన ప్రియేతి మదనేన చ. 50

అస్యా దేవ్యా యథారూప మఙ్గప్రత్యఙ్గసౌష్ఠవమ్,
రామస్య చ యథారూపం త స్యేయ మసితేక్షణా. 51

అస్యా దేవ్యా మన స్తస్మిం స్తస్య చాస్యాం ప్రతిష్ఠితమ్,
తే నేయం స చ ధర్మాత్మా ముహూర్త మపి జీవతి. 52

దుష్కరం కృతవా న్రామో హీనో య దనయా ప్రభుః,
ధారయ త్యాత్మనో దేహం న శోకే నావసీదతి. 53

దుష్కరం కురుతే రామో య ఇమాం మత్తకాశినీమ్,
సీతాం వినా మహాబాహు ర్ముహూర్త మపి జీవతి. 54

ఏవం సీతాం తదా దృష్ట్వా హృష్టః పవనసమ్భవః,
జగామ మనసా రామం ప్రశశంస చ తం ప్రభుమ్. 55

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, వాల్మీకీయే,
చతుర్వింశత్సహస్రికాయాం, సంహితాయాం,
శ్రీమత్సున్దరకాణ్డే, పఞ్చదశ స్సర్గః.

 

## 15 వ సర్గము

### హనుమంతుడు శింశుపావృక్షమున గూర్చుండి అశోకవనమును చూచుట

హనుమానుడు శింశుపావృక్షమున కూర్చుండి ఆ అశోకవనభూమి యందు సీతాన్వేషణ మొనరించుచుండెను. అశోక వనమున ఎన్నియో కల్పవృక్షములు నాటబడి ఉన్నవి. దివ్యమైన పరిమళములను ఆ వృక్షములు ప్రసరింపజేయుచున్నవి. మృగ పక్షి సమాకులమై ఎన్నియో భవనములతో నిండి కోకిలల కుహూనినాదములతో నిండి ఉండెను.

బంగారు పద్మములు, కలువలతో నిండిన దిగుడు బావులతో ఎంతో సుందరమై ఉండెను. ఎన్నియో ఆసనములు, ఆస్తరణములు అచ్చట అమర్పబడి యున్నవి. భూగృహములు కూడ కలవు. ఆయా ఋతువులలో మాత్రమే లభించు పుష్పములు కూడ కాలనియమము లేక అచట పూచి యున్నవి. బాగుగ పూచిన అశోక పుష్పముల కాంతితో ప్రభాతకాలమందలి సూర్యుని అరుణ కాంతులు అచట వ్యాపించి అగ్ని జ్వాలలతో ప్రదీప్తమైనట్లు ఉండెను.

ఆకులు కనబడకుండ పక్షులచే ఆ వృక్షములు వ్యాప్తమై ఉండెను. చెట్టునుండి ఎగిరి పోవుచున్న పక్షుల తలలపై పూవులు జారిపడు చుండెను. కొండగోగు చెట్లు, మెండుగ పూసి నేల మీదకు ఒరుగు చుండెను. పూసిన కొండగోగు పూల చేత, మోదుగ పూల చేత ఆ ప్రదేశము అగ్నిపర్వతము వలె కనబడుచుండెను. పున్నాగములు, సప్తవర్ణములు, సంపెంగలు స్కంధ భాగము నుండియు దట్టముగ పూచి యున్నవి. అచ్చటి అశోకములు వివిధ వర్ణముల పూలను పూయుచున్నవి.

ఆ అశోక వనము చైత్ర రథమును, నందన వనమును మించి శోభిల్లు చుండెను. రంగురంగుల పూలతో నిండిన ఆ అశోకవనము రంగురంగుల తారలతో కూడిన మరియొక ఆకాశము వలె నుండెను. పుష్పరత్నములతో కూడిన ఆ అశోకవనిక ఐదవ సముద్రమా అన్నట్లు

ఉండెను. అక్కడ పక్షుల ధ్వనులు శ్రోత్ర పేయములై ఉండెను. రంగు రంగుల పూవులు కనువిందు చేయుచుండెను. పుష్పగంధము ఘ్రాణతర్పణమొనర్చుచుండెను.

ఆ అశోకవనమును పరిశీలనగ చూచుచుండగా సమీపమున ఒక చైత్య ప్రాసాదము కానవచ్చెను. ఆ చైత్యప్రాసాదమునకు వేయిస్తంభము లుండెను. కైలాసము వలె తెల్లగ నుండెను. దానికి పగడములతో మెట్లు నిర్మింపబడి యుండెను. బంగారముతో వేదిక లేర్పాటు చేయబడెను. ఆ ప్రాసాదము కాంతిమంతమైన నేత్రములను ఆకర్షించుచుండెను. అత్యున్నతమై, ఆకాశము నొరయు చుండెను.

## హనుమంతుడు రాక్షస స్త్రీల నడుమ ఒక స్త్రీని గాంచుట

ఆ చైత్య ప్రాసాద సమీపమున ఒక స్త్రీ కానబడెను. ఆమె బట్టలు మాసి ఉండెను. చుట్టు రాక్షస స్త్రీలు చేరియుండిరి. ఉపవాస వ్రతములచే కృశించి యుండెను. దుఃఖ భారముచే కాబోలు నిట్టూర్పులు విడుచుచుండెను. శుక్ల పక్షాది యందలి చంద్రరేఖ వలె అస్పష్టముగ అనిర్ధారిత స్వరూపవై కానవచ్చుచుండెను. ధూమావరుద్ధమైన అగ్నిజ్వాలవలె మాసి, బిరుసువారిన పచ్చని వస్త్రమును ధరించి ఉన్నది. పద్మములు లేక బురద అంటి అందము మాసిన తామర తీగవలె నుండెను. దుష్ట గ్రహము అగు అంగారకునిచే పీడితయైన రోహిణి వలె నుండెను. కన్నీళ్ళు కార్చుచుండెను. భోజనము చేయక కృశించెను. ఎప్పుడును ఏదో ధ్యానించుచు శోక పరాయణయై యుండెను. తనకు ప్రియమైన వ్యక్తిని చూడక అప్రియమైన రాక్షసి గణమునే చూచుచు, తన తోడి లేళ్ళను విడిచి శునకములచే పరివేష్టిత యైన ఆడులేడివలె నుండెను. శరత్కాలమున నల్లని వనపంక్తితో కూడిన భూదేవి వలె నల్లత్రాచు వలె పిఱుదుల పర్యంతము వ్యాపించి ఆమె కేశపాశము ఉండెను.

## హనుమంతుడా స్త్రీ సీతయే యని నిశ్చయించుట

సుఖపడుటయే కాని దుఃఖపడుట ఎఱుగని ఆ విశాలాక్షియగు స్త్రీ సీతయే అని అనేకకారణములచే అనుమానించెను. ఈ అంగనామణియు కామరూపియగు రావణుడు ఎత్తుకొని పోవుచుండగా మేము చూచిన స్త్రీ వలెనె ఉన్నది. పూర్ణ చంద్రుని వంటి ముఖము కలిగియుండి అన్ని దిక్కులను తన దేహకాంతిచే ప్రకాశింప చేయుచున్నది. నీలకేశియు, బింబోష్ఠియు, పద్మ పలాశాక్షియునై సర్వజనుల ఆదరమునకు పాత్రమైన వ్యక్తిగా తోచెను. సందిగ్ధమైన స్మృతివలె, జారిన సంపదవలె, తిరిగిన శ్రద్ధ వలె చెదరిపోయిన ఆశ వలె, విఘ్న ప్రతిఘాతితమైన కార్యసిద్ధి వలె అసత్యమైన అపవాదముచే భ్రష్టమైన కీర్తివలె, రామ ప్రాప్తి లేక బాధపడుచు రావణుడు అపహరించి తెచ్చుటచే నిరంతరము కన్నీరు కార్చుచు అప్రసన్నమైన ముఖముతో కూడుకొని నిట్టూర్పులు విడుచుచున్న ఆమెను ఈమె సీతయే అని అనుకొనెను. అవైదికమైన విద్యవలె వ్యాకరణ సంస్కారము లేక అర్థాంతరమును వచించు వాక్యము వలె నున్న ఆమెను ఈ క్రింది కారణములచే సీతయే అని నిర్ణయించుకొనెను.

వైదేహి ధరించు ఆభరణములుగా శ్రీరాముడు చెప్పిన ఆభరణములు చెట్టు కొమ్మకు తగిలింపబడి యుండెను. కర్ణాభరణములు అశ్వదంష్ట్రములు శ్వదంష్ట్రములో మణులను, పగడములను తాపడము చేసిన హస్తాభరణములు రామచంద్రుడు చెప్పిన ఆభరణములు ఇవి చిరకాలముగా వాడనందువలన, శుభ్రపఱుపనందు వలన మాసినట్లు ఉన్నవి.

ఋశ్యమూకముపై జారవిడిచిన ఆభరణములు ఇచట కనిపించుట లేదు. అచ్చట జారవిడువనివి ఇచ్చట నున్నవి. ఆభరణములను కట్టి ఋశ్యమూకముపై విడిచిన ఉత్తరీయమును ఈమె కట్టుకొనిన చీర రంగులోనే ఉన్నది. ఈమె ధరించిన వస్త్రము చిరకాలముగ ధరించుటచే మాసి యున్నది. ఆ ఉత్తరీయము మాత్రము ఇంతకంటె అల్పకాల ధారణచే ఇంతగ మాసి యుండలేదు. ఈమె సీతయే.

ఈమె రామునకు దూరమైనది కానీ రాముని మనస్సునకు దూరము కాలేదు. తనకు దూరమైన ఈ సీతను గురించి కారుణ్యముతో ఆనృశంస్యముతో శోకముతో, ప్రేమతో పరితపించుచున్నాడు. దేహ సౌష్ఠవమును బట్టి ఈమె రామునకు తగిన భార్య. ఇద్దరి మనస్సులు పరస్పరము ప్రీతి యుక్తమైనవి. కావుననే సీతను విడిచి రాముడును, రాముని విడిచి సీతయును జీవింప గలుగుచున్నారు. ఈ సీతను విడిచి రామచంద్రుడు దేహధారణము చేయుచున్నాడు. అనగా శోకముచే అవసాదము పొందలేదు అన్నచో అది చాల దుష్కర కార్యము చేయుచున్నాడు అన్నమాట.

ఈ సీతను విడిచి రామచంద్రుడు క్షణకాలము జీవించినను అది అసాధ్యమైన కార్యము. ఈ ప్రకారముగా సీతాన్వేషణములో కృతార్థుడైన హనుమానుడు మిక్కిలి సంతోషించెను. అంతేకాదు శ్రీరామచంద్రుని అదృష్ట విశేషమును భాగ్య వైభవమును పెద్దగ ప్రశంసించెను.



# 16. షోడశ స్సర్గః

ప్రశస్య తు ప్రశస్తవ్యాం సీతాం తాం హరిపుఙ్గవః,
గుణాభిరామం రామం చ పున శ్చిన్తాపరోఽభవత్. 1

స ముహూర్త మివ ధ్యాత్వా బాష్పపర్యాకులేక్షణః,
సీతా మాశ్రిత్య తేజస్వీ హనుమా న్విలలాప హ. 2

మాన్యా గురువినీతస్య లక్ష్మణస్య గురుప్రియా,
యది సీతాఽపి దుఃఖార్తా కాలో హి దురతిక్రమః. 3

రామస్య వ్యవసాయజ్ఞా లక్ష్మణస్య చ ధీమతః,
నాత్యర్థం క్షుభ్యతే దేవీ గఙ్గేవ జలదాగమే. 4

తుల్యశీలవయోవృత్తాం తుల్యాభిజనలక్షణామ్,
రాఘవోఽర్హతి వైదేహీం తం చేయ మసితేక్షణా. 5

తాం దృష్ట్వా నవహేమాభాం లోకకాన్త మివ శ్రియమ్,
జగామ మనసా రామం వచనం చేద మబ్రవీత్. 6

అస్యా హేతో ర్విశాలాక్ష్యా హతో వాలీ మహాబలః,
రావణప్రతిమో వీర్యే కబన్ధ శ్చ నిపాతితః. 7

విరాధశ్చ హత స్సఙ్ఖ్యే రాక్షసో భీమవిక్రమః,
వనే రామేణ విక్రమ్య మహేన్ద్రేణేవ శమ్బరః. 8

చతుర్దశసహస్రాణి రక్షసాం భీమకర్మణామ్,
నిహతాని జనస్థానే శరై రగ్నిశిఖోపమైః. 9

ఖరశ్చ నిహత స్సఙ్ఖ్యే త్రిశిరాశ్చ నిపాతితః,
దూషణశ్చ మహాతేజా రామేణ విదితాత్మనా. 10

ఐశ్వర్యం వానరాణాం చ దుర్లభం వాలిపాలితమ్,
అస్యా నిమిత్తే సుగ్రీవః ప్రాప్తవాన్ లోకసత్కృతమ్. 11

సాగరశ్చ మయాక్రాన్త శ్శ్రీమా న్నదనదీపతిః,
అస్యా హేతో ర్విశాలాక్ష్యాః పురీ చేయం నిరీక్షితా. 12

యది రామ స్సముద్రాన్తాం మేదినీం పరివర్తయేత్,
అస్యాః కృతే జగచ్చాపి యుక్త మిత్యేవ మే మతిః. 13

రాజ్యం వా త్రిషు లోకేషు సీతా వా జనకాత్మజా,
త్రైలోక్యరాజ్యం సకలం సీతాయా నాప్నుయా త్కలామ్. 14

ఇయం సా ధర్మశీలస్య మైథిలస్య మహాత్మనః,
సుతా జనకరాజస్య సీతా భర్తృదృఢవ్రతా. 15

ఉత్థితా మేదినీం భిత్త్వా క్షేత్రే హలముఖక్షతే,
పద్మరేణునిభైః కీర్ణా శుభైః కేదారపాంసుభిః. 16

విక్రాన్త స్యార్యశీలస్య సంయుగే ష్వనివర్తినః,
స్నుషా దశరథ స్యైషా జ్యేష్ఠా రాజ్ఞో యశస్వినీ. 17

ధర్మజ్ఞస్య కృతజ్ఞస్య రామస్య విదితాత్మనః,
ఇయం సా దయితా భార్యా రాక్షసీవశ మాగతా. 18

సర్వా న్భోగా న్పరిత్యజ్య భర్తృస్నేహబలాత్కృతా,
అచిన్తయిత్వా దుఃఖాని ప్రవిష్టా నిర్జనం వనమ్. 19

సన్తుష్టా ఫలమూలేన భర్తృశుశ్రూషణే రతా,
యా పరాం భజతే ప్రీతిం వనేఽపి భవనే యథా. 20

సేయం కనకవర్ణాఙ్గీ నిత్యం సుస్మితభాషిణీ,
సహతే యాతనా మేతా మనర్థానా మభాగినీ. 21

ఇమాం తు శీలసమ్పన్నాం ద్రష్టు మర్హతి రాఘవః,
రావణేన ప్రమథితాం ప్రపా మివ పిపాసితః. 22

అస్యా నూనం పునర్లాభా ద్రాఘవః ప్రీతి మేష్యతి,
రాజా రాజ్యపరిభ్రష్టః పునః ప్రాప్యే వ మేదినీమ్. 23

కామభోగైః పరిత్యక్తా హీనా బన్ధుజనేన చ,
ధారయ త్యాత్మనో దేహం త త్సమాగమకాఙ్క్షిణీ. 24

నైషా పశ్యతి రాక్షస్యో నే మా న్పుష్పఫలద్రుమాన్,
ఏకస్థహృదయా నూనం రామ మే వానుపశ్యతి. 25

భర్తా నామ పరం నార్యా భూషణం భూషణా దపి,
ఏషా తు రహితా తేన భూషణార్హా న శోభతే. 26

దుష్కరం కురుతే రామో హీనో య దనయా ప్రభుః,
ధారయ త్యాత్మనో దేహం న దుఃఖే నావసీదతి. 27

ఇమా మసితకేశాన్తాం శతపత్రనిభేక్షణామ్,
సుఖార్హాం దుఃఖితాం దృష్ట్వా మమా పి వ్యథితం మనః.

క్షితిక్షమా పుష్కరసన్నిభాక్షీ
యా రక్షితా రాఘవలక్ష్మణాభ్యామ్,
సా రాక్షసీభి ర్వికృతేక్షణాభి
స్సంరక్ష్యతే సంప్రతి వృక్షమూలే. 29

హిమహతనళినీవ నష్టశోభా
వ్యసనపరమ్పరయా నిపీడ్యమానా,
సహచరరహితేవ చక్రవాకీ
జనకసుతా కృపణాం దశాం ప్రపన్నా. 30

అస్యా హి పుష్పావనతాగ్రశాఖా
శ్శోకం దృఢం వై జనయ న్త్యశోకాః,
హిమ వ్యపాయేన చ మన్దరశ్మి
రభ్యుత్థితో నైకసహస్రరశ్మిః. 31

ఇత్యేవ మర్థం కపి రన్వవేక్ష్య
సీ తేయ మిత్యేవ విశిష్టబుద్ధిః,
సంశ్రిత్య తస్మి న్నిషసాద వృక్షే
బలీ హరీణా మృషభ స్తరస్వీ. 32

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, వాల్మీకీయే,
చతుర్వింశత్సహస్రికాయాం, సంహితాయాం,
శ్రీమత్సున్దరకాణ్డే, షోడశ స్సర్గః.

 

# 16 వ సర్గము

## హనుమంతుడు సీతాదేవి స్థితికి దుఃఖించుట

ఆ వానరోత్తముడు శ్లాఘనీయ అయిన ఆ సీతాదేవిని మిక్కిలి ప్రశంసించి గుణాభిరాముడగు రాముని కూడ మెచ్చుకొని మరల ఆలోచింప సాగెను.

క్షణకాలము మౌనముగ ధ్యానించి కన్నీటితో కన్నులు నిండిన సీతాదేవిని గుఱించి మిక్కిలి విలపించెను. పెద్దలచే సుశిక్షితుడైన లక్ష్మణునిచే మిక్కిలి ఆదరింపబడుచున్న, రామచంద్రునకు ప్రేమపాత్రమైన అయోనిజయగు ఈ జానకీ దేవియే కష్టముల పాలైనదన్నచో కాలమును ఎవరు తప్పించుకొనగలరు?

వర్షాకాలము వచ్చినను సంక్షోభము పొందని గంగానదివలె ధీమంతుడగు లక్ష్మణుని యొక్క, శ్రీరాముని యొక్క పరాక్రమము తెలిసినది కనుక ఏమియు సంక్షోభము పొందుటలేదు. సీతారాములు ఇరువురకు శీలము, వయస్సు, వృత్తము సమానములు. వంశప్రసిద్ధి, సాముద్రిక లక్షణములు సమానములు. రామచంద్రుడు సీతాదేవికి దగిన భర్త. కానీ సీతాదేవి నేత్ర సౌందర్యము, శ్రీరాముని నేత్ర సౌందర్యమును మించి యున్నది. కొత్త మేలిమి బంగారము వలె ఆకర్షణీయమైన వర్ణము కలిగి సర్వమనోభిరామ అయిన లక్ష్మీదేవివలె నున్న సీతాదేవిని సేవించి మనస్సులో రాముని తలంచుకొని మనసులో ఈ రీతిగ అనుకొనెను.

ఈమె కొరకే వాలి చంపబడినాడు. రావణుని యంత బలశాలి యగుకబంధుడును చంపబడినాడు. విక్రమముచే భయంకరుడైన విరాధుడును చంపబడినాడు. అగ్నిజ్వాలల వంటి పదునాలుగు వేలమంది ఖరదూషణాది రాక్షసులును జనస్థానమున చంపబడి

యుండిరి. ఈమె నిమిత్తమే వాలి పాలితమైన కిష్కింధారాజ్యమున సుగ్రీవుని రాజ్యాభిషిక్తుని చేసినాడు. సీతా నిమిత్తమే నేనీ సముద్రమును దాటితిని. ఈమె కొరకే లంకాపట్టణమంతయు అన్వేషించినాడను. ఈమెకొరకే శ్రీరాముడు చతుస్సముద్ర పరివేష్టితమైన భూమినిగానీ, ఈ సమస్త జగత్తును గానీ తలక్రిందులు చేసినను యుక్తమే అగును. ఈ మూడు లోకముల ఆధిపత్యమును కూడ సీతాపతిత్వము చేత లబ్ధమైన అతిశయముతో పదునారవ వంతు కూడ కాదు. మిథిలాధిపతి యగు జనక మహారాజునకు యజ్ఞమునకై భూమిని దున్నుచున్న సమయమున నాగలి కఱ్ఱునకు తగిలి ఈ సీతాదేవి అవతరించినది. ఆ భూమి యందలి ధూళి పద్మకింజల్క పరాగము వలె ఈ సీతాదేవి దేహము నంటి యుండెను.

మహాపరాక్రమ శాలియు, యుద్ధభూమిలో ఎప్పుడును వెనుకడుగు వేయని దశరథ చక్రవర్తి పెద్ద కోడలై ఈమె గొప్ప కీర్తినార్జించినది. ధర్మజ్ఞుడు, కృతజ్ఞుడు, ఆత్మ జ్ఞాన సంపన్నుడు అగు రామచంద్రుని ప్రేమను చూరగొన్న సతీమణి యగు ఈ సీతాదేవి ఈనాడు రాక్షస స్త్రీలచే నిర్బంధింపబడి యున్నది. సర్వభోగములను విడిచి అరణ్యవాసదుఃఖములను లెక్కచేయక భర్తయందలి ప్రేమచే ఈ నిర్జనారణ్యమునకు వచ్చినది. ఫలములు, దుంపలు, మూలములు తినుచు రాజభవనమందు వలెనే అరణ్యవాసమున కూడ సంతోషముతో కాలము గడపినది. బంగారువంటి శరీరచ్ఛాయ కలిగి ఎప్పుడును చిరునవ్వుతో మాటలాడు చుండు ఈ రామపత్ని ఎప్పుడును కష్టములు అనుభవించి ఎరుగనిదైనను ఇచ్చటి కష్టములను ఓరిమితో అనుభవించుచున్నది. దప్పిక కలిగిన వారు చలివేంద్రమును చూచినట్లుగా రావణబాధితయైన ఈ సీతాదేవిని శ్రీరాముడు కటాక్షింపవలసి యున్నది.

రాజ్యమును పోగొట్టుకొనిన మనుష్యుడు తిరిగి తన రాజ్యమును పొందినట్లుగ ఈ సీతాదేవిని తిరిగి పొంది మహానందము పొందగలడు. భోగానుభవములు లేకపోయినను, బంధుజనులకు దూరమైనను ఎప్పటికైనను శ్రీరామ సన్నిధికి చేరగలనను విశ్వాసముతో దేహమును ధరించి యున్నది. ఈ సీతాదేవి చుట్టునున్న రాక్షస స్త్రీలను చూచుట లేదు. పుష్ప ఫలములతో నిండియున్న ఈ వృక్షముల వంక చూచుట లేదు. నిశ్చల చిత్తముతో రాముని ధ్యానించు చున్నది.

ఇట్టి భార్యకు దూరమై దుఃఖ భారముచే అవసాదము నొందక దేహధారణము చేయుచున్నాడన్నచో అందరకు దుష్కరమైన కార్యము రాముడు చేయుచున్నట్లు భావింపవచ్చును. నల్లని కేశాగ్రభాగములు కలిగి తామర రేకులవంటి నేత్రములు కలిగి యుత్తమ సాముద్రిక లక్షణములు కలిగిన ఈ సీతాదేవి యొక్క ప్రస్తుత దుఃఖ స్థితిని చూచి నా మనస్సు కూడ బాధపడుచున్నది. భూదేవి వలె మిక్కిలి క్షమాగుణము కలిగి తామర పువ్వులవంటి నేత్రములు కలిగి రామలక్ష్మణులచే సంరక్షితయగు ఈ సీతాదేవి భయంకరమగు నేత్రములు కలిగిన రాక్షస స్త్రీలచే ఈ చెట్టు నీడలో ఉండి కాపలా కాయబడుచున్నది. మంచు పడి తామర పువ్వులను కోల్పోయి కాంతి హీనమైన తామర తీగవలె కష్టములచే పీడింపబడుచున్న మగ పక్షికి దూరమైన చక్రవాకి వలె చాల దీనావస్థలో నున్నది. పూచిన శాఖలతో వ్రాలి ఉన్న అశోక వృక్షములును ఆమెకు శోకమునే కలిగించుచున్నవి.

వసంత కాలమున చంద్రుడును తన సహస్ర కిరణములతో ఉదయించినట్లు భాసించు చున్నాడు. ఈ రీతిగ బహువిధముల పరిశీలించిన హనుమానుడు ఈమె సీతాదేవియే అని నిర్ణయించుకొని ఆ ఆకుల మాటున ఆ శింశుపావృక్షము మీదనే కూర్చుండి యుండెను.



# 17. సప్తదశ స్సర్గః

తతః కుముదషణ్డాభో నిర్మలో నిర్మలం స్వయమ్,
ప్రజగామ నభ శ్చన్ద్రో హంసో నీల మి వోదకమ్. 1

సాచివ్య మివ కుర్వన్ స ప్రభయా నిర్మలప్రభః,
చన్ద్రమా రశ్మిభి శ్శీతై స్సిషేవే పవనాత్మజమ్. 2

స దదర్శ తత స్సీతాం పూర్ణచన్ద్రనిభాననామ్,
శోకభారై రివ న్యస్తాం భారై ర్నావ మి వామ్బసి. 3

దిదృక్షమాణో వైదేహీం హనుమా న్మారుతాత్మజః,
స దద ర్శావిదూరస్థా రాక్షసీ ర్ఘోరదర్శనాః. 4

ఏకాక్షీ మేకకర్ణాం చ కర్ణప్రావరణాం తథా,
అకర్ణాం శఙ్కుకర్ణాం చ మస్తకోచ్ఛ్వాసనాసికామ్. 5

అతికాయోత్తమాఙ్గీం చ తనుదీర్ఘశిరోధరామ్,
ధ్వస్తకేశీం తథాఽకేశీం కేశకమ్బళధారిణీమ్. 6

లమ్బకర్ణలలాటాం చ లమ్బోదరపయోధరామ్,
లమ్బోష్ఠీం చుబుకోష్ఠీం చ లమ్బాస్యాం లమ్బజానుకామ్. 7

హ్రస్వాం దీర్ఘాం తథా కుబ్జాం వికటాం వామనాం తథా,
కరాళాం భుగ్నవక్త్రాం చ పిఙ్గాక్షీం వికృతాననామ్. 8

వికృతాః పిఙ్గళాః కాళీః క్రోధనాః కలహప్రియాః,
కాలాయసమహాశూలకూటముద్గరధారిణీః. 9

వరాహమృగశార్దూలమహిషాజశివాముఖీః,
గజోష్ట్రహయపాదీశ్చ నిఖాతశిరసోఽపరాః. 10

ఏకహ స్తైకపాదాశ్చ ఖరకర్ణ్యశ్వకర్ణికాః,
గోకర్ణీ ర్హస్తికర్ణీశ్చ హరికర్ణీ స్తథా పరాః. 11

అనాసా అతినాసా శ్చ తిర్యఙ్నాసా వినాసికాః,
గజసన్నిభనాసాశ్చ లలాటోచ్ఛ్వాసనాసికాః. 12

హస్తిపాదా మహాపాదా గోపాదాః పాదచూళికాః,
అతిమాత్రశిరోగ్రీవా అతిమాత్రకుచోదరీః. 13

అతిమాత్రాస్యనేత్రాశ్చ దీర్ఘజిహ్వా నఖా స్తథా,
అజాముఖీ ర్హస్తిముఖీ ర్గోముఖీ సూకరీముఖీః. 14

హయోష్ట్రఖరవక్త్రాశ్చ రాక్షసీ ర్ఘోరదర్శనాః,
శూలముద్గరహస్తాశ్చ క్రోధనాః కలహప్రియాః. 15

కరాళా ధూమ్రకేశీశ్చ రాక్షసీ ర్వికృతాననాః,
పిబన్తీ స్సతతం పానం సదా మాంససురాప్రియాః. 16

మాంస శోణిత దిగ్ధాఙ్గీ ర్మాంసశోణితభోజనాః,
తా దదర్శ కపిశ్రేష్ఠో రోమహర్షణదర్శనాః. 17

స్కన్ధవన్త ముపాసీనాః పరివార్య వనస్పతిమ్,
తస్యాధస్తా చ్చ తాం దేవీం రాజపుత్రీ మనిన్దితామ్. 18

లక్షయామాస లక్ష్మీర్వాం హనుమా జ్జనకాత్మజామ్,
నిష్ప్రభాం శోకసంతప్తాం మలసంకులమూర్ధజామ్. 19

క్షీణపుణ్యాం చ్యుతాం భూమౌ తారాం నిపతితా మివ,
చారిత్రవ్యపదేశాఢ్యాం భర్తృదర్శనదుర్గతామ్. 20

భూషణై రుత్తమై ర్హీనాం భర్తృవాత్సల్యభూషణామ్,
రాక్షసాధిపసంరుద్ధాం బన్ధుభిశ్చ వినాకృతామ్. 21

వియూథాం సింహ సంరుద్ధాం బద్ధాం గజవధూ మివ,
చన్ద్రరేఖాం పయోదాన్తే శారదాభ్రై రి వావృతామ్. 22

క్లిష్టరూపా మసంస్పర్శా దయుక్తా మివ వల్లకీమ్,
సీతాం భర్తృవశే యుక్తా మయుక్తాం రాక్షసీవశే. 23

అశోకవనికామధ్యే శోకసాగర మాప్లుతామ్,
తాభిః పరివృతాం తత్ర సగ్రహా మివ రోహిణీమ్. 24

దదర్శ హనుమా న్దేవీం లతా మకుసుమా మివ,
సా మలేన చ దిగ్ధాఙ్గీ వపుషా చాప్యలంకృతా. 25

మృణాళీ పంకదిగ్ధే వ విభాతి న విభాతి చ,
మలినేన తు వస్త్రేణ పరిక్లిష్టేన భామినీమ్. 26

సంవృతాం మృగశాబాక్షీం దదర్శ హనుమా న్కపిః,
తాం దేవీం దీనవదనా మదీనాం భర్తృతేజసా. 27

రక్షితాం స్వేన శీలేన సీతా మసితలోచనామ్,
తాం దృష్ట్వా హనుమాన్ సీతాం మృగశాబనిభేక్షణామ్. 28

మృగకన్యా మివ త్రస్తాం వీక్షమాణాం సమన్తతః,
దహన్తీ మివ నిశ్శ్వాసై ర్వృక్షా న్పల్లవధారిణః. 29

సఙ్ఘాత మివ శోకానాం దుఃఖ స్యోర్మి మివోత్థితామ్,
తాం క్షామాం సువిభక్తాఙ్గీం వినాభరణశోభినీమ్. 30

ప్రహర్ష మతులం లేభే మారుతిః ప్రేక్ష్య మైథిలీమ్,
హర్షజాని చ సోఽశ్రూణి తాం దృష్ట్వా మదిరేక్షణామ్ 31

ముమోచ హనుమాం స్తత్ర నమశ్చక్రే చ రాఘవమ్,
నమస్కృత్వా చ రామాయ లక్ష్మణాయ చ వీర్యవాన్. 32

సీతాదర్శనసంహృష్టో హనుమాన్ సంవృతో ఽభవేత్.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, వాల్మీకీయే
చతుర్వింశత్సహస్రికాయాం, సంహితాయాం,
శ్రీమత్సున్దరకాణ్డే సప్తదశ స్సర్గః.

## శ్రీమద్రామాయణ మాహాత్మ్యమ్

శ్లో. ఆకోట్యాలక్ష మపివా లిఖే దుద్యాపయే తతః,
ఆపదా మపహర్తారం దాతారం సర్వసమ్పదామ్.
లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహమ్,
ఇత్యాపదు ద్ధర్తృమనుం సర్వసమ్పత్సమృద్ధిదమ్.

## 17 వ సర్గము

హంస నల్లని నీటిలో ముందునకు సాగిపోయినట్లుగా వినీలా కాశమున చంద్రుడును క్రమముగ మీది మీదికి వచ్చెను. చక్కని తెల్లని కాంతులతో వచ్చిన చంద్రుడు హనుమానునకు సాయపడుటకై వచ్చెనో అనునట్లుండెను. తన చల్లని కిరణములచే హనుమానుని సేద తీర్చెను. బరువులతో నీట నిలిచిన నావ వలె శోకభారముచే నిండినను సీతను హనుమానుడు చక్కగ చూడగల్గెను.

సీతకు కావలిగ నిలిచిన రాక్షస స్త్రీలను కొద్ది దూరము నుండి ఆంజనేయుడు చూడగల్గెను. ఆ రాక్షస స్త్రీల రూపములు చాల వికృతముగ నుండెను. ఆ రాక్షస స్త్రీలు వికృతమైన రూపములతో అవయవాది లోపములతో భయంకరమైన ఆయుధములను కూడ ధరించి, మాంసమును, రక్తమును తినగలిగినంత తిని, త్రాగగలిగినంత త్రాగి మిగిలినది దేహమునకు పూసికొని యున్నారు. వారి వికృతాకారములు హనుమంతునికి కూడ రోమాంచము కలిగించినవి. సీతయు స్పష్టముగా కానవచ్చెను.

### దుఃఖించుచున్న సీత వర్ణన

ఆ సీతాదేవియు కాంతి తరిగి యుండెను. శిరోజములు దుమ్ము పట్టి ఉన్నవి. పుణ్యము క్షీణమై ఆకాశము నుండి నేల రాలిన నక్షత్రమువలె నుండెను. ఏ ఆభరణములు ధరింపక పోయినను పతి

ప్రేమను ఆభరణముగా కలిగి యున్నది. మంచి చరిత్ర కలది అయినను భర్తృ దర్శనమునకు దూరమైనది. తన యూథమును విడిచి సింహావరుద్ధయగు గజ వధువు వలె ఏకాకినియై ఉన్నది. వర్షాంతమున శరత్కాలపు మేఘములచే ఆవృత అయిన చంద్రరేఖ వలె ఉండెను. దుమ్ము తుడువక తీగలను సరిచేయక ఉన్న వీణవలె నుండెను. భర్తృ సమీపమున ఉండవలసిన ఆ సీతాదేవి రాక్షసీ వశమున నున్నది. శోక సాగరమున మునిగి యున్నది. దుష్ట గ్రహములచే పరివేష్టిత అయిన రోహిణి వలె ఉండెను.

హనుమంతుని దృష్టిలో ఆ సీత పూవులు పూయని తీగవలె నుండెను. ఒడలంతయును మట్టి పట్టి ఉండెను. అలంకార హీనయై ఉండెను. మలిన వస్త్రములు ధరించిన ఆమె మట్టి అంటి యుండిన తామర తీగవలె నుండెను. దీన వదనయై భర్తృ పరాక్రమముచే ధైర్యము చెడక తన శీలముచే సురక్షితురాలైన సీత బెదరిన లేడి పిల్ల వలె రక్షణ వెదకుచున్న దానివలె నాలుగువైపులకును చూచు చుండెను. తన వేడి నిట్టూర్పులచే అచ్చట నున్న వృక్షములు కాల్చివేయు చున్నట్లుండెను. ఆభరణములను ధరింపక పోయినను సువిభక్తమైన ఆమె దేహము అలంకృతమైనట్టే కానవచ్చుచున్నది.

అట్టి సీతను కనుగొని హనుమ మహానందభరితుడయ్యెను. రామునకు, లక్ష్మణునకు నమస్కరించెను. సీతా దర్శనముచే సంతుష్టుడై తరువాత ఏమి జరుగునో చూచుటకై చెట్టు కొమ్మలలో దాగి ఉండెను.



# 18. అష్టాదశ స్సర్గః

తథా విప్రేక్షమాణస్య వనం పుష్పితపాదపమ్,
విచిన్వత శ్చ వైదేహీం కించి చ్ఛేషా నిశాఽభవత్. 1

షడఙ్గవేదవిదుషాం క్రతుప్రవరయాజినామ్,
శుశ్రావ బ్రహ్మఘోషాం క్రతుప్రవరయాజినామ్. 2

అథ మఙ్గళవాదిత్రై శ్శబ్దై శ్శ్రోత్రమనోహరైః,
ప్రబుధ్యత మహాబాహు ర్దశగ్రీవో మహాబలః. 3

విబుధ్య తు యథాకాలం రాక్షసేన్ద్రః ప్రతాపవాన్,
స్రస్తమాల్యామ్బరధరో వైదేహీ మన్వచిన్తయత్. 4

భృశం నియుక్త స్తస్యాం చ మదనేన మదోత్కటః,
న స తం రాక్షసః కామం శశా కాత్మని గూహితుమ్. 5

స సర్వాభరణై ర్యుక్తో బిభ్ర చ్ఛ్రియ మనుత్తమామ్,
తాం నగై ర్బహుభి ర్జుష్టాం సర్వపుష్పఫలోపగైః. 6

వృతాం పుష్కరిణీభిశ్చ నానాపుష్పోపశోభితామ్,
సదా మదైశ్చ విహగై ర్విచిత్రాం పరమాద్భుతామ్. 7

ఈహామృగై శ్చ వివిధై ర్జుష్టాం దృష్టిమనోహరైః,
వీథీ స్సంప్రేక్షమాణశ్చ మణికాఞ్చనతోరణాః. 8

నానామృగగణాకీర్ణాం ఫలైః ప్రపతితై ర్వృతామ్,
అశోకవనికా మేవ ప్రావిశ త్సంతతద్రుమామ్. 9

అఙ్గనాశతమాత్రం తు తం వ్రజన్త మనువ్రజత్,
మహేన్ద్ర మివ పౌలస్త్యం దేవగన్ధర్వయోషితః. 10

దీపికాః కాఞ్చనీః కాశ్చి జ్జగృహు స్తత్ర యోషితః,
వాలవ్యజనహస్తాశ్చ తాలవృన్తాని చాపరాః. 11

కాఞ్చనై రపి భృఙ్గారై ర్జహ్రు స్సలిల మగ్రతః,
మణ్డలాగ్రాన్ బృసీం చైవ గృహ్యాన్యాః పృష్ఠతో యయుః. 12

కాచి ద్రత్నమయీం స్థాలీం పూర్ణాం పానస్య భామినీ,
దక్షిణాం దక్షిణే నైవ తథా జగ్రాహ పాణినా. 13

రాజహంసప్రతీకాశం ఛత్రం పూర్ణశశిప్రభమ్,
సౌవర్ణదణ్డ మపరా గృహీత్వా పృష్ఠతో యయౌ. 14

నిద్రామదపరీతాక్ష్యో రావణ స్యోత్తమాః స్త్రియః,
అనుజగ్ముః పతిం వీరం ఘనం విద్యుల్లతా ఇవ. 15

వ్యావిద్ధహారకేయూరా స్సమా మృదితవర్ణకాః,
సమాగళితకేశాన్తా స్సస్వేదవదనా స్తథా. 16

ఘూర్ణన్త్యో మదశేషేణ నిద్రయా చ శుభాననాః,
స్వేదక్లిష్టాఙ్గకుసుమా స్సుమాల్యాకులమూర్ధజాః. 17

ప్రయాన్తం నైరృతిపతిం నార్యో మదిరలోచనాః,
బహుమానాచ్చ కామాచ్చ ప్రియా భార్యా స్త మన్వయుః. 18

స చ కామపరాధీనః పతి స్తాసాం మహాబలః,
సీతాసక్తమనా మన్దో మదాఞ్చితగతి ర్బభౌ. 19

తతః కాఞ్చీనినాదం చ నూపురాణాం చ నిస్స్వనమ్,
శుశ్రావ పరమస్త్రీణాం స కపి ర్మారుతాత్మజః. 20

తం చాప్రతిమకర్మాణ మచిన్త్యబలపౌరుషమ్,
ద్వారదేశ మనుప్రాప్తం దదర్శ హనుమా న్కపిః. 21

దీపికాభి రనేకాభి స్సమన్తా దవభాసితమ్,
గన్ధతైలావసిక్తాభి ర్ధ్రియమాణాభి రగ్రతః. 22

కామదర్పమదై ర్యుక్తం జిహ్మతామ్రాయతేక్షణమ్,
సమక్ష మివ కన్దర్ప మపవిద్ధశరాసనమ్. 23

మథితామృతఫేనాభ మరజో వస్త్ర ముత్తమమ్,
సలీల మనుకర్షన్తం విముక్తం సక్తమఙ్గదే. 24

తం పత్రవిటపే లీనః పత్రపుష్పఘనావృతః,
సమీప మివ సంక్రాన్తం నిధ్యాతు ముపచక్రమే. 25

అవేక్షమాణస్తు తతో దదర్శ కపికుఞ్జరః,
రూపయౌవనసంపన్నా రావణస్య వరస్త్రియః. 26

తాభిః పరివృతో రాజా సురూపాభి ర్మహాయశాః,
తన్మృగద్విజసంఘుష్టం ప్రవిష్టః ప్రమదావనమ్. 27

క్షీబో విచిత్రాభరణ శ్శఙ్కుకర్ణో మహాబలః,
తేన విశ్రవసఃపుత్ర స్స దృష్టో రాక్షసాధిపః. 28

వృతః పరమనారీభి స్తారాభి రివ చన్ద్రమాః,
తం దదర్శ మహాతేజా స్తేజోవన్తం మహాకపిః. 29

రావణో౽యం మహాబాహు రితి సంచిన్త్య వానరః,
అవప్లుతో మహాతేజా హనుమా న్మారుతాత్మజః. 30

స తథా౽ప్యుగ్రతేజా స్స న్నిర్ధూత స్తస్య తేజసా,
పత్రగుహ్యాన్తరే సక్తో హనుమా న్సంవృతో౽భవత్. 31

స తా మసితకేశాన్తమ్,
సుశ్రోణీం సంహతస్తనీమ్
దిదృక్షు రసితాపాఙ్గా
ముపావర్తత రావణః. 32

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, వాల్మీకీయే,
చతుర్వింశత్సహస్రికాయాం, సంహితాయాం,
శ్రీమత్సున్దరకాణ్డే అష్టాదశ స్సర్గః.

## శ్రీమద్రామాయణ మాహాత్మ్యమ్

శ్లో. సహస్రాన్తే సహస్రాన్తే విలిఖే ల్లేఖకోజనః,
శ్రీరామ రామరామేతి లిఖే త్సప్తాక్షరీం తువా.

# 18 వ సర్గము

ఆ హనుమంతుడు నాలుగు వైపుల పరిశీలనగ ఆ వనమును చూచుచు సీతాన్వేషణము చేయుచుండగనే రాత్రి చాల భాగము గడచి పోయెను. సాంగవేదాధ్యయన మొనరించిన ఉత్తమ క్రతువు లెన్నింటినో ఆచరించిన బ్రహ్మరాక్షసుల వేదఘోషములు ఆ అపర రాత్రమున విననయ్యెను. తరువాత చెవికి ఇంపైన మంగళ వాద్య ధ్వనులచే దశగ్రీవుడు మేల్కొనెను.

## రావణుడు సీతకడకు వచ్చుట

నిద్రావశమున శిథిలమైన మాలికలు, వస్త్రము కలిగిన రాక్షసేంద్రుడు మేల్కొనగానే సీతను గురించిన ఆలోచన గలిగెను. కామ పరవశుడై సర్వాభరణములు ధరించి విలక్షణమైన దేహశోభ కలిగి పూచి ఫలించి యున్న వృక్షములతో నిండిన అశోక వనమునకు బయలు దేరెను.

మృగములతో, పక్షులతో నిండియున్న ఆ అశోకవనమునకు చేరెను. ఆతని వెంట వందలకొలది స్త్రీలును బయలుదేరిరి. కొందరు బంగారు దీపములను పట్టుకొనిరి. కొందరు చామరములను

వీచుచుండిరి. బంగారు పాత్రములతో మరికొందరు జలమును పట్టుకొనిరి. కొందరు ఆయుధములను తెచ్చుచుండిరి. కొందరు ఆస్తరణములను తెచ్చుచు వెంబడించిరి. ఒక ఆమె పాన పాత్రమును తెచ్చుచుండెను. మరియొక ఆమె చంద్రుని వలె రాజహంస వలె తెల్లనైన ఛత్రమును బట్టెను. మరియొక ఆమె సువర్ణ దండమును పట్టుకొని వెంబడించెను. మేఘమును విద్యుల్లత వలె ప్రియమైన ఆ రావణ స్త్రీలు వెంబడించి వచ్చు చుండిరి. నిద్రమత్తు, త్రాగిన మత్తు వీడకుండగనే రావణుని యందలి గౌరవముతో, ప్రేమతో వెంట వచ్చుచుండిరి. నిద్రమత్తుచేత, మద్యపానము చేత రావణుని నేత్రములు ఎరుపువారి యున్నవి. తెల్లని ఆతని పట్టు ఉత్తరీయము భుజము నుండి జారి అంగదమునకు తగిలి నేలపై జీరాడు చుండగా హనుమానుడు వచ్చిన రాక్షస చక్రవర్తిని దగ్గరనుండి చూడగల్గెను.

ఆ విశ్రవసుని కుమారుడు అగు రావణుడు తన స్త్రీలతో కలిసి తారాగణముతో కూడిన చంద్రుని వలె ప్రకాశించెను. అతడు రావణుడు అని తెలిసికొని ఆతని చేష్టలను చక్కగ పరిశీలించుటకై క్రింది కొమ్మకు దిగి వచ్చెను. రావణుని తేజస్సుచే కొలదిగ చలించిన వాడై చెట్టుకొమ్మల చాటున దాగి యుండెను. నీలవేణియు సుశ్రోణియు అగు ఆ సీతను చూడదలంచి రావణుడు క్రమముగా దగ్గరకు వచ్చెను.



# 19. ఏకోనవింశ స్సర్గః

తస్మిన్నేవ తతః కాలే రాజపుత్రీ త్వనిన్దితా,
రూపయౌవనసంపన్నం భూషణోత్తమభూషితమ్. 1

తతో దృష్ట్వైవ వైదేహీ రావణం రాక్షసాధిపమ్,
ప్రావేపత వరారోహా ప్రవాతే కదలీ యథా. 2

ఆచ్ఛాద్యోదర మూరుభ్యాం బాహుభ్యాం చ పయోధరౌ,
ఉపవిష్టా విశాలాక్షీ రుదన్తీ వరవర్ణినీ. 3

దశగ్రీవస్తు వైదేహీం రక్షితాం రాక్షసీగణైః,
దదర్శ సీతాం దుఃఖార్తాం నావం సన్నా మి వార్ణవే. 4

అసంవృతాయా మాసీనాం ధరణ్యాం సంశితవ్రతామ్,
ఛిన్నాం ప్రపతితాం భూమౌ శాఖా మివ వనస్పతేః. 5

మలమణ్డనచిత్రాఙ్గీం మణ్డనార్హా మమణ్డితామ్,
మృణాలీ పఙ్కదిగ్ధేవ విభాతి న విభాతి చ. 6

సమీపం రాజసింహస్య రామస్య విదితాత్మనః,
సంకల్పహయసంయుక్తై ర్యాన్తీ మివ మనోరథైః. 7

శుష్యన్తీం రుదతీ మేకాం ధ్యానశోకపరాయణామ్,
దుఃఖస్యాన్త మపశ్యన్తీం రామాం రామ మనువ్రతామ్. 8

వేష్టమానాం తథాఽఽవిష్టాం పన్నగేన్ద్రవధూ మివ,
ధూప్యమానాం గ్రహేణేవ రోహిణీం ధూమకేతునా. 9

వృత్తశీలకులే జాతా మాచారవతి ధార్మికే,
పున స్సంస్కార మాపన్నాం జాతా మివ చ దుష్కులే. 10

అభూతే నాపవాదేన కీర్తిం నిపతితా మివ,
ఆమ్నాయానా మయోగేన విద్యాం ప్రశిథిలా మివ. 11

సన్నా మివ మహాకీర్తిం శ్రద్ధా మివ విమానితామ్,
పూజా మివ పరిక్షీణా మాశాం ప్రతిహతా మివ. 12

ఆయతీ మివ విధ్వస్తా మాజ్ఞాం ప్రతిహతా మివ,
దీప్తా మివ దిశం కాలే పూజా మపహృతా మివ. 13

పద్మినీ మివ విధ్వస్తాం హతశూరాం చమూ మివ,
ప్రభా మివ తమోధ్వస్తా ముపక్షీణా మి వాపగామ్. 14

వేదీ మివ పరామృష్టాం శాన్తా మగ్నిశిఖా మివ,
పౌర్ణమాసీ మివ నిశాం రాహుగ్ర స్తేన్దుమణ్డలామ్. 15

ఉత్కృష్టపర్ణకమలాం విత్రాసితవిహఙ్గమామ్,
హస్తిహస్తపరామృష్టా మాకులాం పద్మినీ మివ. 16

పతిశోకాతురాం శుష్కాం నదీం విస్రావితా మివ,
పరయా మృజయా హీనాం కృష్ణపక్షనిశా మివ. 17

సుకుమారీం సుజాతాఙ్గీం రత్నగర్భ గృహోచితామ్,
తప్యమానా మివోష్ణేన మృణాలీ మచిరోద్ధృతామ్. 18

గృహీతా మాలితాం స్తమ్భే యూథపేన వినాకృతామ్,
నిశ్శ్వసన్తీం సుదుఃఖార్తాం గజరాజవధూ మివ. 19

ఏకయా దీర్ఘయా వేణ్యా శోభమానా మయత్నతః,
నీలయా నీరదాపాయే వనరాజ్యా మహీ మివ. 20

ఉపవాసేన శోకేన ధ్యానేన చ భయేన చ,
పరిక్షీణాం కృశాం దీనా మల్పాహారాం తపోధనామ్. 21

ఆయాచమానాం దుఃఖార్తాం ప్రాఞ్జలిం దేవతా మివ,
భావేన రఘుముఖ్యస్య దశగ్రీవపరాభవమ్. 22

సమీక్షమాణాం రుదతీ మనిన్దితాం
సుపక్ష్మతామ్రాయత శుక్లలోచనామ్,
అనువ్రతాం రామ మతీవ మైథిలీమ్
ప్రలోభయామాస వధాయ రావణః. 23

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, వాల్మీకీయే,
చతుర్వింశత్సహస్రికాయాం, సంహితాయాం,
శ్రీమత్సున్దరకాణ్డే ఏకోనవింశ స్సర్గః

## 19 వ సర్గము

### రావణుడు వచ్చినప్పటి సీత దుస్థితి

మహాపతివ్రతయగు ఆ సీతాదేవి ఆ సమయమున ఉత్తమాలంకారములను అలంకరించుకొని తన దగ్గరకు వచ్చిన రావణాసురుని చూచి పెనుగాలికి అరటి చెట్టువలె వణకిపోయెను. తన ఊరువులచే ఉదరమును, హస్తములచే వక్షఃస్థలమును ఆచ్ఛాదించుకొని ఆ సుందరి సీతాదేవి ఏడ్చుచు ఉండెను. రాక్షస స్త్రీలచే రక్షితురాలై కటిక నేలపై (అస్తరణము లేని) కూర్చుండి, విరిగి నేలపై పడిన మహా వృక్షము యొక్క కొమ్మ వలె నుండెను.

ఎన్నియో అలంకారములను ధరింప తగిన ఆమె ఏ అలంకారము లేక ఉండెను. మట్టి అంటిన తామర తీగవలె ప్రకాశింపక పోవుటయు లేదు. మిక్కిలి ప్రకాశించుటయు లేదు. సంకల్పములను, గుఱ్ఱములను కట్టిన కోరికలు అను రథముపై కూర్చుండి రాజసింహుడగు రామచంద్రుని సన్నిధికి పోవుచున్నట్లు ఉండెను.

కేతుగ్రహగ్రస్తమైన రోహిణి వలె కాంతి మాసి యుండెను. కృశించి నిరంతరము రామునే ధ్యానించుచు శోక పరాయణయై ఉండెను. ముందునకు సాగిపోలేక ఉన్నచోటనే మెదలుచు నున్న నాగ వధువు

వలె నుండెను. మంచి వృత్తశీలములు కలిగిన ఆచారవంతమైన యజ్ఞాదిక్రియలు ఆచరించిన సద్వంశమున పుట్టి పునః సంస్కార యోగ్యమైన దుష్కులమునందు అవతరించిన దాని వలె నుండెను. అసత్యమైన అపవాదముచే జారిన కీర్తివలె నుండెను.

వేద సంబంధము లేక శైథిల్యము నొందిన బాహ్య విద్య వలెను, క్షీణించిన మహాకీర్తి వలెను, అవమానింపబడిన శ్రద్ధవలెను, పరిక్షీణమైన పూజవలెను, నిష్ఫలమైన ఆశ వలెను, ధ్వస్తమైన ధనలాభము వలెను, పాలింపబడని ఆజ్ఞ వలెను, అపహృత ద్రవ్య అయిన పూజవలెను, త్రెంచి పారవైచిన పద్మిని వలెను, శూరులు మరణించిన సేనవలెను, చిక్కని చీకటి క్రమ్మిన కాంతి వలెను, నీరు లేని నది వలెను, అనర్హులచే స్పృశింపబడిన యజ్ఞవేదిక వలెను, ఆరిన అగ్నిజ్వాల వలెను, చంద్రమండలమునకు గ్రహణము పట్టిన పూర్ణిమా రాత్రి వలెను, కరికరముచే అకృష్టమై రేకలు ఊడిన తామర పువ్వులతో కూడిన నీటి ప్రవాహము లేని నది వలెను సుకుమారియై రత్న ఖచితములైన గృహములందు నివసింపదగిన ఆ సీత యూథపతికి దూరము చేసి, స్తంభమున బంధించిన గజరాజ వధువు వలె నున్న ఏకవేణియై యున్న తన్ను రామ సన్నిధికి చేర్పుమని కోరుచున్న ఆ సీతాదేవిని ప్రలోభ పెట్టుటకై కొన్ని మాటలను పలికెను.



# ౨౦. వింశ స్సర్గః

స తాం పతివ్రతాం దీనాం నిరానన్దాం తపస్వినీమ్,
సాకారై ర్మధురై ర్వాక్యై ర్న్యదర్శయత రావణః. 1

మాం దృష్ట్వా నాగనాసోరు గూహమానా స్తనోదరమ్,
అదర్శన మివాత్మానం భయా న్నేతుం త్వ మిచ్ఛసి. 2

కామయే త్వాం విశాలాక్షి బహుమన్యస్వ మాం ప్రియే,
సర్వాఙ్గగుణసంపన్నే సర్వలోకమనోహరే. 3

నేహ కేచి న్మనుష్యా వా రాక్షసాః కామరూపిణః,
వ్యపసర్పతు తే సీతే భయం మత్త స్సముత్థితమ్. 4

స్వధర్మో రక్షసాం భీరు సర్వదైవ న సంశయః,
గమనం వా పరస్త్రీణాం హరణం సంప్రమథ్య వా. 5

ఏవం చైత దకామాం తు న త్వాం స్ప్రక్ష్యామి మైథిలి,
కామం కామ శ్శరీరే మే యథాకామం ప్రవర్తతామ్. 6

దేవి నేహ భయం కార్యం మయి విశ్వసిహి ప్రియే,
ప్రణయస్వ చ తత్త్వేన మైవం భూ శ్శోకలాలసా. 7

ఏకవేణీధరా శయ్యా ధ్యానం మలిన మమ్బరమ్,
అస్థానే ప్యుపవాస శ్చ నైతా న్యౌపయికాని తే. 8

విచిత్రాణి చ మాల్యాని చన్దనా న్యగరూణి చ,
వివిధాని చ వాసాంసి దివ్యా న్యాభరణాని చ. 9

మహార్హాణి చ పానాని శయనా న్యాసనాని చ,
గీతం నృత్తం చ వాద్యం చ లభ మాం ప్రాప్య మైథిలి.

స్త్రీరత్న మసి మైవం భూః కురు గాత్రేషు భూషణమ్,
మాం ప్రాప్య హి కథం ను స్యా స్త్వ మనర్హా సువిగ్రహే.

ఇదం తే చారు సంజాతం యౌవనం వ్యతివర్తతే,
య దతీతం పున ర్నైతి స్రోత శ్శీఘ్ర మపా మివ. 12

త్వాం కృత్వోపరతో మన్యే రూపకర్తా స విశ్వసృట్,
న హి రూపోపమా త్వన్యా త వాస్తి శుభదర్శనే. 13

త్వాం సమాసాద్య వైదేహి రూపయౌవనశాలినీమ్,
కః పుమా నతివర్తేత సాక్షాదపి పితామహః. 14

య ద్య త్పశ్యామి తే గాత్రం శీతాంశుసదృశాననే,
తస్మింస్తస్మి న్పృథుశ్రోణి చక్షు ర్మమ నిబధ్యతే. 15

భవ మైథిలి భార్యా మే మోహ మేనం విసర్జయ,
బహ్వీనా ముత్తమస్త్రీణా మాహృతానా మితస్తతః. 16

సర్వాసామేవ భద్రం తే మ మాగ్రమహిషీ భవ,
లోకేభ్యో యాని రత్నాని సంప్రమథ్యాహృతాని వై. 17

తాని మే భీరు సర్వాణి రాజ్యం చైత దహం చ తే,
విజిత్య పృథివీం సర్వాం నానానగరమాలినీమ్. 18

జనకాయ ప్రదాస్యామి తవ హేతో ర్విలాసిని,
నే హ పశ్యామి లోకేఽన్యం యో మే ప్రతిబలో భవేత్.

పశ్య మే సుమహ ద్వీర్య మప్రతిద్వన్ద్వ మాహవే,
అసకృ త్సంయుగే భగ్నా మయా విమృదితధ్వజాః. 20

అశక్తాః ప్రత్యనీకేషు స్థాతుం మమ సురాసురాః,
ఇచ్ఛయా క్రియతా మద్య ప్రతికర్మ త వోత్తమమ్. 21

సప్రభా ణ్యవసజ్యన్తాం తవాఙ్గే భూషణాని చ,
సాధు పశ్యామి తే రూపం సంయుక్తం ప్రతికర్మణా. 22

ప్రతికర్మాభిసంయుక్తా దాక్షిణ్యేన వరాననే,
భుఙ్క్ష్వభోగా న్యథాకామం పిబ భీరు రమస్వ చ. 23

యథేష్టం చ ప్రయచ్ఛ త్వం పృథివీం వా ధనాని చ,
లలస్వ మయి విస్రబ్ధా ధృష్ట మాజ్ఞాపయస్వ చ. 24

మత్ప్రసాదాల్లలన్త్యా శ్చ లలన్తాం బాన్ధవా స్తవ,
బుద్ధిం మ మానుపశ్య త్వం శ్రియం భద్రే యశ శ్చ మే.

కిం కరిష్యసి రామేణ సుభగే చీరవాససా,
నిక్షిప్తవిజయో రామో గతశ్రీ ర్వనగోచరః. 26

వ్రతీ స్థండిలశాయీ చ శఙ్కే జీవతి వా న వా,
న హి వైదేహి రామ స్త్వాం ద్రష్టుం వా ప్యుపలప్స్యతే. 27

పురో బలాకై రసితై ర్మేఘై ర్జ్యోత్స్నా మి వావృతామ్,
న చాపి మమ హస్తా త్త్వాం ప్రాప్తు మర్హతి రాఘవః. 28

హిరణ్యకశిపుః కీర్తి మిన్ద్రహస్తగతా మివ,
చారుస్మితే చారుదతి చారునేత్రే విలాసిని. 29

మనో హరసి మే భీరు సుపర్ణః పన్నగం యథా,
క్లిష్టకౌశేయవసనాం తన్వీ మ ప్యనలఙ్కృతామ్. 30

త్వాం దృష్ట్వా స్వేషు దారేషు రతిం నోపలభా మ్యహమ్,
అన్తఃపురనివాసిన్యః స్త్రియ స్సర్వగుణాన్వితాః. 31

యావన్త్యో మమ సర్వాసా మైశ్వర్యం కురు జానకి,
మమ హ్యసితకేశాన్తే త్రైలోక్యప్రవరా స్త్రియః. 32

తా స్త్వాం పరిచరిష్యన్తి శ్రియ మప్సరసో యథా,
యాని వైశ్రవణే సుభ్రు రత్నాని చ ధనాని చ. 33

తాని లోకాం శ్చ సుశ్రోణి మాం చ భుజ్క్ష్వయథాసుఖమ్,
న రామ స్తపసా దేవి న బలేన న విక్రమైః. 34

న ధనేన మయా తుల్య స్తేజసా యశసాఽపి వా,
పిబ విహర రమస్వ భుఙ్క్ష్వ భోగా
ధననిచయం ప్రదిశామి మేదినీం చ,
మయి లల లలనే యథాసుఖం త్వం
త్వయి చ సమేత్య లలన్తు బాన్ధవా స్తే. 35

కుసుమితతరుజాలసంతతాని
భ్రమరయుతాని సముద్రతీరజాని,
కనకవిమలహారభూషితాఙ్గీ
విహర మయాసహ భీరు కాననాని. 36

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, వాల్మీకీయే,
చతుర్వింశత్సహస్రికాయాం, సంహితాయాం,
శ్రీమత్సున్దరకాణ్డే, వింశ స్సర్గః.

## 20వ సర్గము

### రావణుడు సీతతో సంభాషించుట

ఆ రావణుడు పతివ్రతయు, దీనురాలై ఆనంద రహితయై యున్న ఆ సీతను గురించి ఆకర్షణీయమైన విధముగా ఇట్లు మాటాడ జొచ్చెను. నన్ను చూచి అన్యథా భావించి నీ దేహ సౌందర్యమును కనబడకుండ దాచుకొనెదవేల? నిన్ను నేను కోరుచున్నాను. నన్ను ఆదరింపుము. అతిలోక సౌందర్యవతివి, సత్యలోక మనోహరవు.

ఇక్కడ ఇతర మనుష్యులు కానీ కామరూపులైన ఇతర రాక్షసులు కానీ ఎవ్వరును లేరు. నా వలన నీవు భయపడ నక్కరలేదు. పరస్త్రీ గమనము బలవంతముగ నైన పరస్త్రీలను ఎత్తుకొని వచ్చుట రాక్షసులకు ధర్మమే, నాకు నీయందు ఎంత వ్యామోహమున్నను నాయందు ప్రీతి లేని నిన్ను స్పృశింపనైన స్పృశింపను.

ఇక్కడ నీకేమియు భయము లేదు. నా యందు విశ్వాస ముంచుము. నన్ను ప్రేమింపుము. నీ విచ్చట దుఃఖింపవలసిన అవసరము లేదు. తల దువ్వుకొనక, మాసిన వస్త్రమును ధరించుచు ఏదో ధ్యానించుకొనుచు కటిక నేలను పరుండనేల? ఈ ఉపవాసములేల? ఇచ్చట ఇవి నీకు తగినవి కావు. విచిత్రముగ

 


నిర్మించిన పూలమాలికలున్నవి. చందనము మున్నగు పైపూతలున్నవి. అగరు మున్నగు సుగంధ ద్రవ్యములున్నవి.

దివ్యములైన వస్త్రములు, దివ్యములైన ఆభరణములు, అమూల్యములైన పానీయములు, మంచి శయ్యలు, ఆసనములు కలవు. మంచి గీతములను వినవచ్చును. నృత్తములను చూడవచ్చును. మంచి వాద్యములను వాయించుకొనవచ్చును. లేదా వాద్య ధ్వనులను వినవచ్చును. ఇవి అన్నియు నన్ను స్వీకరించినపుడు నీకు సులభములు. నీవు ఉత్తమ స్త్రీవి. అంకారములు లేక ఉండవలదు. ఆభరణములను అలంకరించుకొనుము.

నా ఇంట నున్న నీవు అలంకారహీనవై యుండుట ఏమి? నదిలో ప్రవాహవేగమున క్రిందికి పోయిన నీరు తిరిగి వెనుకకు రానట్టే జీవితములో గడచిన యౌవనము తిరిగి రాదు. బ్రహ్మ తన చిరకాలాను భవముచే నిన్ను సృజించి తన సృష్టివ్యాపారమును విరమించి ఉండును. లేనిచో నీవంటి సుందరీమణి మరియొక్కతె కానరాదేమి? రూప యౌవనశాలినివి యైన నీవంటి వ్యక్తిని ఏ పురుషుడు వదలుకొనగలడు? నీ యొక్క అవయవశోభను తిలకించిన నా దృష్టి అచ్చటనే నిబద్ధయగుచున్నది.

నీవు నాకు భార్యవై యుండుము. నేను అంతఃపుర స్త్రీల కందరకును నిన్ను ప్రధాన వ్యక్తిగ చేసెదను. నేను సంపాదించిన ద్రవ్యము, రాజ్యము చివరకు నేనును నీకు విధేయులమై యుందుము. ఈ భూమి అంతయు గెలిచి నీ తండ్రి జనక

మహారాజునకు ఇచ్చెదను. నన్ను ఎదిరించి నిలువగల శక్తి ఈ లోకమున ఎవ్వరికిని లేదు. యుద్ధమున నాతో పోరాడగల శక్తియు ఎవ్వరికిని లేదు. దేవతలు, రాక్షసులు కూడ నాతో అనేక పర్యాయములు పోరాడి అపజయము పొంది యున్నారు. యుద్ధభూమిలో దేవతలు గానీ, రాక్షసులు కానీ నా ఎదుట నిలువ లేరు.

అలంకృతమైన నీరూపమును చూడగోరుచున్నాను. అలంకరించుకొని నాయందు దాక్షిణ్యముంచి సర్వభోగములను నీవు అనుభవింపుము. నీవు కావలసినంతగా మధువును, ఆసవములను సేవింపవచ్చును. ఈ భూమినిగానీ, ధనమును గానీ ఇష్టమైన వారికి ఇష్టమైనంత ఈయవచ్చును. నాయందు విశ్వాసముంచి ప్రీతి కలిగి ఉండుము. నన్ను ఆజ్ఞాపింపవచ్చును. నీ ఆజ్ఞకు విధేయుడనై ఉందును. నీవే కాదు, నీ బంధువులును ఇచ్చట ఆనందముగ జీవయాత్ర చేయవచ్చును.

నా ఐశ్వర్యము, కీర్తి ప్రతిష్ఠలు నీకే దత్త మగుచున్నవి. నారచీరలు ధరించిన ఆకృతార్థుడైన వనవాస దుఃఖమును అనుభవించుచున్న రామునితో ఏమి ప్రయోజనము? వనవాస వ్రతమాచరించు కటిక నేలను పరుండుచు కాలము గడపుచున్న ఆ రాముడు ఇపుడు జీవించి ఉన్నాడో లేడో కూడ చెప్పలేము.

వైదేహీ! మహామేఘముల చేత అచ్ఛన్నమైన వెన్నెలను చూడలేనట్లే ఈ లంకలో బందీకృతయైన నిన్ను రాముడు కనుగొనలేడు.

ఇంద్రహస్తగతమైన కీర్తిని హిరణ్యకశిపుడు పొందలేనట్లే నా చేతికి చిక్కిన నిన్ను రాముడును పొందలేడు. గరుత్మంతుడు పామును హరించుకొని పోయినట్లుగా నీ గాత్రసౌందర్యము నా మనస్సును హరించుచున్నది. నేను దేశాంతరము నుండి, లోకాంతరము నుండి అపహరించుకొని వచ్చిన అంతఃపుర స్త్రీలెందరో లక్ష్మీదేవిని అప్సరసల వలె నిన్ను ఆరాధింపగలరు. ఆ రాముడు తపస్సు చేతగానీ, బలము చేతగానీ, పరాక్రమము చేతగానీ, తేజస్సు చేతగానీ, కీర్తి చేతగానీ నాతో సమానుడు కాడు. నీకు కావలసినంతగా మధుపానము చేయవచ్చును. స్వేచ్ఛగా విహరింప వచ్చును. ఆనందింప వచ్చును. భోగములను అనుభవింపవచ్చును.

నా ధనమును, నా రాజ్యమును నీకిచ్చు చున్నాను. నాయందు ప్రీతి కలిగి ఉండుము. నీ బంధువులందఱును కలిసి ఇచ్చట సుఖముగ జీవయాత్ర సాగించినను నాకు అభ్యంతరము లేదు. చక్కగ పుష్పించి మధుకర ఝుంకారములకు నిలయమై సముద్రతీర భాగముల పుట్టి పెరిగి సుందరమైన వనములలో నాతో స్వేచ్ఛగా విహరింపుము.



 

# 21. ఏకవింశ స్సర్గః

తస్య తద్వచనం శ్రుత్వా సీతా రౌద్రస్య రక్షసః,
ఆర్తా దీనస్వరా దీనం ప్రత్యువాచ శనై ర్వచః. 1

దుఃఖార్తా రుదతీ సీతా వేపమానా తపస్వినీ,
చిన్తయన్తీ వరారోహా పతి మేవ పతివ్రతా. 2

తృణ మన్తరతః కృత్వా ప్రత్యువాచ శుచిస్మితా,
నివర్తయ మనో మత్త స్స్వజనే క్రియతాం మనః. 3

న మాం ప్రార్థయితుం యుక్తం సుసిద్ధి మివ పాపకృత్,
అకార్యం న మయా కార్య మేకపత్న్యా విగర్హితమ్. 4

కులం సంప్రాప్తయా పుణ్యం కులే మహతి జాతయా,
ఏవ ముక్త్వా తు వైదేహీ రావణం తం యశస్వినీ. 5

రాక్షసం పృష్ఠతః కృత్వా భూయో వచన మబ్రవీత్,
నాహ మౌపయికీ భార్యా పరభార్యా సతీ తవ. 6

సాధు ధర్మ మవేక్షస్వ సాధు సాధువ్రతం చర,
యథా తవ త థాన్యేషాం దారా రక్ష్యా నిశాచర. 7

ఆత్మాన ముపమాం కృత్వా స్వేషు దారేషు రమ్యతామ్,
అతుష్టం స్వేషు దారేషు చపలం చలితేన్ద్రియమ్. 8

నయన్తి నికృతిప్రజ్ఞం పరదారాః పరాభవమ్,
ఇహ సన్తో న వా సన్తి సతో వా నానువర్తసే. 9

తథా హి విపరీతా తే బుద్ధి రాచారవర్జితా,
వచో మిథ్యాప్రణీ తాత్మా పథ్య ముక్తం విచక్షణైః. 10

రాక్షసానా మభావాయ త్వం వా న ప్రతిపద్యసే,
అకృతాత్మాన మాసాద్య రాజాన మనయే రతమ్. 11

సమృద్ధాని వినశ్యన్తి రాష్ట్రాణి నగరాణి చ,
త థేయం త్వాం సమాసాద్య లఙ్కా రత్నౌఘసంకులా. 12

అపరాధా త్త వైకస్య న చిరా ద్వినశిష్యతి,
స్వకృతై ర్హన్యమానస్య రావణాదీర్ఘదర్శినః. 13

అభినన్దన్తి భూతాని వినాశే పాపకర్మణః,
ఏవం త్వాం పాపకర్మాణం వక్ష్యన్తి నికృతా జనాః. 14

ది ష్ట్యైత ద్వ్యసనం ప్రాప్తో రౌద్ర ఇత్యేవ హర్షితాః,
శక్యా లోభయితుం నాహ మైశ్వర్యేణ ధనేన వా. 15

అనన్యా రాఘవే ణాహం భాస్కరేణ ప్రభా యథా,
ఉపధాయ భుజం తస్య లోకనాథస్య సత్కృతమ్. 16

కథం నా మోపధాస్యామి భుజ మన్యస్య కస్యచిత్,
అహ మౌపయికీ భార్యా తస్యైవ వసుధాపతేః. 17

వ్రతస్నాతస్య విప్రస్య విద్యేవ విదితాత్మనః,
సాధు రావణ రామేణ మాం సమానయ దుఃఖితామ్. 18

వనే వాశితయా సార్థం కరేణ్వేవ గజాధిపమ్,
మిత్ర మౌపయికం కర్తుం రామ స్థానం పరీప్సతా. 19

వధం చానిచ్ఛతా ఘోరం త్వయాఽసౌ పురుషర్షభః,
విదిత స్సహి ధర్మజ్ఞ శ్శరణాగతవత్సలః. 20

తేన మైత్రీ భవతు తే యది జీవితు మిచ్ఛసి,
ప్రసాదయస్వ త్వం చైనం శరణాగతవత్సలమ్. 21

మాం చాస్మై ప్రయతో భూత్వా నిర్యాతయితు మర్హసి,
ఏవం హి తే భవే త్స్వస్తి సంప్రదాయ రఘూత్తమే. 22

అన్యథా త్వం హి కుర్వాణో వధం ప్రాప్స్యసి రావణ,
వర్జయే ద్వజ్ర ముత్సృష్టం వర్జయే దన్తక శ్చిరమ్. 23

త్వద్విధం తు న సంక్రుద్ధో లోకనాథ స్స రాఘవః,
రామస్య ధనుష శ్శబ్దం శ్రోష్యసి త్వం మహాస్వనమ్. 24

శతక్రతువిసృష్టస్య నిర్ఘోష మశనే రివ,
ఇహ శీఘ్రం సుపర్వాణో జ్వలితాస్యా ఇ వోరగాః. 25

ఇషవో నిపతిష్యన్తి రామలక్ష్మణలక్ష్మణాః,
రక్షాంసి పరినిఘ్నన్తః పుర్యా మస్యాం సమన్తతః. 26

అసంపాతం కరిష్యన్తి పతన్తః కఙ్కవాససః,
రాక్షసేన్ద్ర మహాసర్పాన్ స రామగరుడో మహాన్. 27

ఉద్ధరిష్యతి వేగేన వైనతేయ ఇ వోరగాన్,
అపనేష్యతి మాం భర్తా త్వత్త శ్శీఘ్ర మరిందమః. 28

అసురేభ్య శ్శ్రియం దీప్తాం విష్ణు స్త్రిభి రివ క్రమైః,
జనస్థానే హతస్థానే నిహతే రక్షసాం బలే. 29

అశక్తేన త్వయా రక్షఃకృత మేత దసాధు వై,
అశ్రమం తు తయో శ్శూన్యం ప్రవిశ్య నరసింహయోః.30

గోచరం గతయో ర్భ్రాత్రో రపనీతా త్వయాఽధమ,
న హి గన్ధ ముపాఘ్రాయ రామలక్ష్మణయో స్త్వయా. 31

శక్యం సందర్శనే స్థాతుం శునా శార్దూలయో రివ,
తస్య తే విగ్రహే తాభ్యాం యుగగ్రహణ మస్థిరమ్. 32

వృత్ర స్యే వేన్ద్రబాహుభ్యాం బాహో రేకస్య నిగ్రహః,
క్షిప్రం తవ సనాథో మే రామ స్సౌమిత్రిణా సహ. 33

తోయ మల్ప మి వాదిత్యః ప్రాణా నాదాస్యతే శరైః,
గిరిం కుబేరస్య గతోఽపధాయ వా
సభాం గతో వా వరుణస్య రాజ్ఞః,
అసంశయం దాశరథే ర్నమోక్ష్యసే
మహాద్రుమః కాలహతోఽశనే రివ. 34

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, వాల్మీకీయే,
చతుర్వింశత్సహస్రికాయాం, సంహితాయాం,
శ్రీమత్సున్దరకాణ్డే ఏకవింశ స్సర్గః

## 21వ సర్గము

### సీత రావణునితో మాటలాడుట

రావణుని ఆ మాటలను విని సీతాదేవి చాల బాధపడినది. ఆమె గజగజవణకుచు తన భర్త రామచంద్రుని ధ్యానించుచు మెల్లగా సమాధానము చెప్పెను. రావణునకు తనకు మధ్య భాగములో ఒక గడ్డిపరకను ఉంచి పవిత్రమైన చిరునవ్వుతో నా మీది మనస్సును మరలింపుము. నీ స్వజనము నందు మనసు నిలుపుకొనుము. పాపాత్ముడు సిద్ధిని కోరుటకు తగనట్లే నీవును నన్ను కోరదగవు. పతివ్రత నయిన ఉత్తమ వంశమందు పుట్టిన నేను నీవు చెప్పిన అకృత్యమును చేయజాలను.

ఇట్లు పలికిన సీత ఆ రావణుని వెనుక వేసికొని వచ్చి మరియొక మాటను చెప్పెను. పరభార్యనై పతివ్రతనైన నేను నీకు భార్యను కాదగను. ధర్మమును గురించి ఆలోచింపుము. సజ్జనుల ఆచరణమును ఆదర్శముగా తీసికొనుము. నీ భార్యలను నీవు రక్షించుకొన్నట్లే ఇతరుల భార్యలను రక్షింపవలసి ఉండును. నీకు తగిన నీ భార్యలతో కాలము గడపుము. చపలుడై తన భార్యలతో తృప్తిపడని, జితేంద్రియుడు కాని పురుషుని పర స్త్రీలు పరాభవింతురు

రావణా! ఈ లంకలో సజ్జనులు లేరా? ఉన్నను వారికి అనువర్తన చేయువా? ఆచార- హీనమైన నీ విపరీత బుద్ధి సజ్జనులను అనువర్తనము చేయుట లేదు అను విషయమును వెల్లడి చేయుచున్నది. ఆ సజ్జనులు చెప్పిన మాటయందు ప్రామాణ్యము లుంచక రాక్షస వినాశనమునకై ఆమోదించుట లేదుగా? శిష్టుల మాటలను వినని మూర్ఖుడగు రాజును పొంది సంపత్ సమృద్ధములైన రాజ్యములు, నగరములు కూడ వినాశనము నొందును.

ఆ రీతిగనే నీ ఒక్కని అపరాధముచే సంపత్ సమృద్ధమైన రత్న రాసులతో నిండిన ఈ లంకయు నశించును. నీ అకృత్యాచరణముచే, దూరదృష్టి లేని నీవు చేసిన పాపకర్మములే నిన్ను నాశనము చేయగలవు.

పాపాత్ముడవగు నీవు వినాశము పొందినపుడు ప్రజలందరు సంతోషింతురు. లోకమంతయు సంతోషించును. నీచే అపకారము పొందిన జనులు రావణుని పాపమే రావణుని నాశనము చేసినదని చెప్పుకొందురు. అదృష్ట వశమున రావణుడు చచ్చినాడని చెప్పినచో లోకము సంతోషించును. నీ అంతఃపుర స్త్రీలపై అధిపత్యము ఇచ్చిగానీ, ఆభరణాదులు ఇచ్చిగానీ నన్ను వంచించుట నీకు వశముగాదు. సూర్యుని నుండి కాంతిని వేరు చేయుట శక్యము కానట్లే రాముని నుండి నన్ను వేరుచేయుటయు నీకు శక్యము కాదు. రాముని విడిచి నేను వేరుగ ఉండదగిన దానను కాను. లోకనాథుడైన రామచంద్రుని లోకముచే శ్లాఘింపబడిన భుజమును ఉపధానముగ స్వీకరించి ఇప్పుడు మరియొకని భుజమును ఉపధానముగ

చేసికొందునా? సాంగ వేదాధ్యయన మొనర్చిన ఆత్మజ్ఞాన సంపన్నుడైన బ్రాహ్మణోత్తముని యొక్క ఆధ్యాత్మిక విద్య అతనికే ఉపయోగపడునట్లు శ్రీరామునికే ఉపయుక్తురాలైన భార్యను నేను. రావణా! నన్ను రామచంద్రుని సన్నిధికి చేర్పుము.

నీ లంకాధిపత్యమును నిలుపుకొనవలెనన్నచో నీ పుత్రపౌత్రుల మరణమును నీవు చూడ గోరనిచో ఈ రామచంద్రునితో మైత్రిని చేసికొనుము. ధర్మజ్ఞుడైన ఆ రాముడు శరణాగత వత్సలుడుగా లోకమున ప్రసిద్ధిపొంది యున్నాడు. నీవు బ్రతుక గోరినచో ఆతనితో మైత్రి చేసికొనక తప్పదు. శరణాగత వత్సలుడైన రామచంద్రుని ప్రసన్నుని చేసికొనుము. మంచి మనస్సుతో నన్ను ఆ శ్రీరామచంద్రునికి అప్పగింపుము. నన్ను రామచంద్రునికి సమర్పించినపుడే నీకు మేలు కలుగును. లేనిచో నీవు చావక తప్పదు.

వజ్రము తన లక్ష్యమును తప్పవచ్చును. యముడు కూడ తాను చంపదలంచిన వానిని చంపక పోవచ్చును. కోపించిన రామచంద్రుడు నీవంటి వానిని ఎప్పుడును విడువడు. తొందరలో నీవు ఇంద్రుని వజ్రఘోషమును వినగలవు. మంచి పర్వభాగములు కలిగిన పదనైన రామ లక్ష్మణుల బాణములు వారి నామాంకితములై నిరంతరముగ నీలంకలో పడగలవు.

ఎడతెరపి లేకుండ లంకయందు అంతటను పడుచున్న వారి బాణములు కదలుటకు, మెదలుటకు అవకాశము లేకుండ చేయగలవు. వైనతేయుడు మహాసర్పముల వలె శ్రీరాముడును,

గరుత్మంతుడును నీ రాక్షస సేనాధిపతులను హరించి వేయగలడు. విష్ణువు మూడడుగులు వైచి రాక్షసుల నుండి సిరిని (శ్రీదేవి) కొనునట్లుగా నీ దగ్గర నుండి నన్ను తీసికొని పోగలడు.

జనస్థానమున రాక్షస బలమంతయు రామునిచే నిహతము కాగా ప్రతిక్రియ చేయలేని అసమర్థుడవైన నీవు ఈ అకృత్యమాచరించితివి. రామ లక్ష్మణులు ఇద్దరును అడవిలోనికి పోగా పురుష శూన్యమైన ఆశ్రమమున ప్రవేశించి నన్ను ఎత్తుకొని వచ్చితివి. పెద్దపులుల ఎదుట కుక్క నిలువలేనట్లు నీవును రామ లక్ష్మణుల యెదుట నిలువలేవు. అట్టి నీవు రామలక్ష్మణులతో పోరాడి గెలువగలవా? వృత్రాసురుడు తన ఏక బాహుద్వయ పరాక్రమముచే ఇంద్రుని బాహుద్వయ బలమును గెలువలేనట్లుగా నీవు రామలక్ష్మణులను గెలుచుట సాధ్యము కాదు.

నా భర్త శ్రీరాముడు లక్ష్మణునితో వచ్చి సూర్యుడు జలమును హరించినట్లు నీ ప్రాణములను తీయగలడు. నీవు కైలాసమును గడచిపోయినను, వరుణుని సభకు పోయినను రాముని బాణములకు గురికాక తప్పదు. కాలవశమున పిడుగు పడి మహావృక్షము నేలకూలినట్లుగా నీవును మృత్యువు వాత పడక తప్పదు.



# ౨౨. ద్వావింశ స్సర్గః

సీతాయా వచనం శ్రుత్వా పరుషం రాక్షసాధిపః,
ప్రత్యువాచ తత స్సీతాం విప్రియం ప్రియదర్శనామ్. 1

యథాయథా సాన్త్వయితా వశ్య స్త్రీ(స్త్రీ)ణాం తథాతథా,
యథాయథా ప్రియం వక్తా పరిభూత స్తథాతథా. 2

సంనియచ్ఛతి మే క్రోధం త్వయి కామ స్సముత్థితః,
ద్రవతోఽమార్గ మాసాద్య హయా నివ సుసారథిః. 3

వామః కామో మనుష్యాణాం యస్మి న్కిల నిబధ్యతే,
జనే తస్మిం స్త్వనుక్రోశ స్స్నేహశ్చ కిల జాయతే. 4

ఏతస్మా త్కారణా న్న త్వాం ఘాతయామి వరాననే,
వధార్హా మవమానార్హాం మిథ్యాప్రవ్రజితే రతామ్. 5

పరుషా ణీహ వాక్యాని యాని యాని బ్రవీషి మామ్,
తేషు తేషు వధో యుక్త స్తవ మైథిలి దారుణః. 6

ఏవ ముక్త్వా తు వైదేహీం రావణో లాక్షసాధిపః,
క్రోధసంరమ్భసంయుక్త స్సీతా ముత్తర మబ్రవీత్. 7

ద్వౌ మాసౌ రక్షితవ్యౌ మే యోఽవధి స్తే మయా కృతః,
తత శ్శయన మారోహ మమ త్వం వరవర్ణిని. 8

ద్వాభ్యా మూర్ధ్వం తు మాసాభ్యాం భర్తారం మా మనిచ్ఛతీమ్,
మమ త్వాం ప్రాతరాశార్థ మాలభన్తే మహానసే. 9

తాం తర్జ్యమానాం సంప్రేక్ష్య రాక్షసేన్ద్రేణ జానకీమ్,
దేవగన్ధర్వకన్యా స్తా విషేదు ర్వికృతేక్షణాః. 10

ఓష్ఠప్రకారై రపరా వక్త్రనేత్రై స్తథాపరాః,
సీతా మాశ్వాసయామాసు స్తర్జితాం తేన రక్షసా. 11

తాభి రాశ్వాసితా సీతా రావణం రాక్షసాధిపమ్,
ఉవా చాత్మహితం వాక్యం వృత్తశౌణ్డీర్యగర్వితమ్. 12

నూనం న తే జనః కశ్చి దస్తి నిశ్శ్రేయసే స్థితః,
నివారయతి యో న త్వాం కర్మణోఽస్మా ద్విగర్హితామ్ 13

మాం హి ధర్మాత్మనః పత్నీం శచీ మివ శచీపతేః,
త్వ దన్య స్త్రిషు లోకేషు ప్రార్థయే న్మనసాఽపి కః. 14

రాక్షసాధమ రామస్య భార్యా మమితతేజసః,
ఉక్తవా నసి య త్పాపం క్వ గత స్తస్య మోక్ష్యసే. 15

యథా దృప్తశ్చ మాతఙ్గ శ్శశ శ్చ సహితా వనే,
తథా ద్విరదవ ద్రామ స్త్వం నీచశశవత్ స్మృతః. 16

స త్వ మిక్ష్వాకునాథం వై క్షిప న్నిహ న లజ్జసే,
చక్షుషో ర్విషయం తస్య న తావ దుపగచ్ఛసి. 17

ఇమే తే నయనే క్రూరే విరూపే కృష్ణపిఙ్గలే,
క్షితౌ న పతితే కస్మా న్మా మనార్య నిరీక్షతః. 18

 

తస్య ధర్మాత్మనః పత్నీం స్నుషాం దశరథస్య చ,
కథం వ్యాహరతో మాం తే న జిహ్వా వ్యవశీర్యతే. 19

అసన్దేశాత్తు రామస్య తపస శ్చానుపాలనాత్,
న త్వాం కుర్మి దశగ్రీవ భస్మ భస్మార్హతేజసా. 20

నాపహర్తు మహం శక్యా త్వయా రామస్య ధీమతః,
విధి స్తవ వధార్థాయ విహితో నాత్ర సంశయః. 21

శూరేణ ధనదభ్రాత్రా బలై స్సముదితేన చ,
అపోహ్య రామం కస్మా ద్ధి దారచౌర్యం త్వయా కృతమ్.

సీతాయా వచనం శ్రుత్వా రావణో రాక్షసాధిపః,
వివృత్య నయనే క్రూరే జానకీ మన్వవైక్షత. 23

నీల జీమూతసంకాశో మహాభుజశిరోధరః,
సింహసత్త్వగతి శ్శ్రీమాన్ దీప్తజిహ్వాగ్రలోచనః. 24

చలాగ్రమకుటప్రాంశు శ్చిత్రమాల్యానులేపనః,
రక్తమాల్యామ్బరధర స్తప్తాఙ్గదవిభూషణః. 25

శ్రోణిసూత్రేణ మహతా మేచకేన సుసంవృతః,
అమృతోత్పాదనద్ధేన భుజగే నేవ మన్దరః. 26

తాభ్యాం స పరిపూర్ణాభ్యాం భుజాభ్యాం రాక్షసేశ్వరః,
శుశుభే ఽచలసంకాశ శ్శృఙ్గాభ్యా మివ మన్దరః. 27

తరుణాదిత్యవర్ణాభ్యాం కుణ్డలాభ్యాం విభూషితః,
రక్తపల్లవపుష్పాభ్యా మశోకాభ్యా మి వాచలః. 28

స కల్పవృక్షప్రతిమో వాస్తవ ఇవ మూర్తిమాగ్,
శ్మశానచైత్యప్రతిమో భూషితోఽపి భయంకరః. 29

అవేక్షమాణో వైదేహీం కోపసంరక్తలోచనః,
ఉవాచ రావణ స్సీతాం భుజఙ్గ ఇవ నిశ్శ్వసగ్. 30

అనయే నాభిసంపన్న మర్థహీన మనువ్రతే,
నాశయా మ్యహ మద్య త్వాం సూర్య స్సన్ధ్యా మి వౌజసా.

ఇత్యుక్త్వా మైథిలీం రాజా రావణ శ్శత్రురావణః,
సందిదేశ తత స్సర్వా రాక్షసీ ర్ఘోరదర్శనాః. 32

ఏకాక్షీ మేకకర్ణాం చ కర్ణప్రావరణాం తథా,
గోకర్ణీం హస్తికర్ణీం చ లమ్బకర్ణీ మకర్ణికామ్. 33

హస్తిపాద్యశ్వపాద్యౌ చ గోపాదీం పాదచూళికామ్,
ఏకాక్షీ మేకపాదీం చ పృథుపాదీ మపాదికామ్. 34

అతిమాత్రశిరోగ్రీవా మతిమాత్ర కుచోదరీమ్,
అతిమాత్రాస్యనేత్రాం చ దీర్ఘజిహ్వా మజిహ్వికామ్. 35

అనాసికాం సింహముఖీం గోముఖీం సూకరీముఖీమ్,
యథా మద్వశగా సీతా క్షిప్రం భవతి జానకీ,
తథా కురుత రాక్షస్య స్సర్వాః క్షిప్రం సమేత్య చ. 36

ప్రతిలోమానులోమైశ్చ సామదానాదిభేదనైః,
ఆవర్జయత వైదేహీం దణ్డ స్యోద్యమనేన చ. 37

ఇతి ప్రతిసమాదిశ్య రాక్షసేన్ద్రః పునఃపునః,
కామమన్యుపరీతాత్మా జానకీం పర్యతర్జయత్. 38

ఉపగమ్య తతః క్షిప్రం రాక్షసీ ధాన్యమాలినీ,
పరిష్వజ్య దశగ్రీవ మిదం వచన మబ్రవీత్. 39

మయా క్రీడ మహారాజ సీతయా కిం త వానయా,
వివర్ణయా కృపణయా మానుష్యా రాక్షసేశ్వర. 40

నూన మస్యా మహారాజ న దివ్యా న్భోగసత్తమా౯,
విదధా త్యమరశ్రేష్ఠ స్తవ బాహుబలార్జితా౯. 41

అకామాం కామయానస్య శరీర ముపతప్యతే,
ఇచ్ఛన్తీం కామయానస్య ప్రీతి ర్భవతి శోభనా. 42

ఏవ ముక్తస్తు రాక్షస్యా సముత్క్షిప్త స్తతో బలీ,
ప్రహస న్మేఘసంకాశో రాక్షస స్స న్యవర్తత. 43

ప్రస్థిత స్స దశగ్రీవః కమ్పయ న్నివ మేదినీమ్,
జ్వలద్భాస్కరవర్ణాభం ప్రవివేశ నివేశనమ్. 44

దేవగన్ధర్వకన్యా శ్చ నాగకన్యా శ్చ సర్వతః,
పరివార్య దశగ్రీవం వివిశు స్తద్గృహోత్తమమ్. 45

స మైథిలీం ధర్మపరా మవస్థితాం
ప్రవేపమానాం పరిభర్త్స్య రావణః,
విహాయ సీతాం మదనేన మోహిత
స్స్వమేవ వేశ్మ ప్రవివేశ భాస్వరమ్. 46

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, వాల్మీకీయే,
చతుర్వింశత్సహస్రికాయాం, సంహితాయాం,
శ్రీమత్సున్దరకాణ్డే, ద్వావింశ స్సర్గః.

 



# 22వ సర్గము

## రావణుడు సీతతో పరుషముగ మాటలాడుట

సీతాదేవి మాటలు విని రావణుడు చూడముచ్చటయైన ఆ సీతాదేవితో అప్రియమైన మాటలను పలుక దొడంగెను. పురుషుడు సాంత్వన వాక్యములు పలుకుచున్నకొలది స్త్రీకి లోకువ అగుచుండును. ప్రియవచనములు పలుకుచున్న కొలది అతడు పరాభవింపబడుచునే యుండును. నీ యందు కలిగిన ప్రేమ నాకోపమును అమార్గమున పరుగులు పెట్టుచున్న గుఱ్ఱములను సారథివలె అదుపుచేయుచున్నది.

ఈ కామము చాల చిత్రమైనది. ఎవని యందు కామము నిలుచునో వానియందే దయ, స్నేహము పెరుగుచుండును. ఆ కారణముచేతనే మాటిమాటికి పరుషములు పలుకుచున్న, వనవాస వృత్తిని ఆశ్రయించిన ఆ రాముని యందు ప్రేమను మాని నాయందు ప్రీతి కలిగి యుండక పరుష వాక్యములు పలుకుచున్న నిన్ను అవమానింప వలసి ఉన్నది. మన్నింప దగదు. నీవు పలికిన ప్రతి మాటకు మరణ దండనము విధింపవలసినదే.

### రావణుని ప్రతివచనము

తరువాత రావణుడు మరియు ఇట్లు పలికెను. నీకు రెండు మాసములు గడువుగ నిచ్చుచున్నాను. ఆ తరువాత నీవు నాకు భార్యవై నాతో సహశయన మాచరింప వలసి ఉండును. రెండు మాసముల అనంతరము నన్ను భర్తగ నీవు స్వీకరింపకపోయినచో మా వంటవాండ్రు నా ప్రాతర్భోజనమునకై నిన్ను ఖండించి వేయుదురు.

రావణుడు ఈ రీతిగ సీతను బెదరించు చుండగా రావణుని వెంట వచ్చిన దేవ గంధర్వ కన్యలు మిక్కిలి విషాదమొందిరి. వారు ఆమెను పెదవుల కదలికతో తమ ముఖములతో, నేత్రములతో కూడ ఓదార్చిరి. దేవ గంధర్వ కన్యకలచే ఓదార్పబడ్డిన ఆ సీతాదేవి తనకు క్షేమకరము అయిన తన పాతివ్రత్య బలముచే గంభీర మగునట్లు పలికెను.

## సీత రావణుని నిందించుట

రావణా! సజ్జనులచే నిందనీయమైన ఇట్టి అకృత్యము నుండి మరలించువారు నీ శ్రేయమును కోరువారు ఒక్కరును లేరు. ఇంద్రపత్ని యగు శచీదేవితో సమానురాలనైన రామపత్నినగు నన్ను కోరువారు నీవు తప్ప మరియొకడు ఈ ప్రపంచమున లేడు. రాక్షసాధమా! మహాతేజశ్శాలి యగు రాముని పత్ని యగు నన్ను గూర్చి ఇట్టి నీచ వచనములను పలికి నీవు ఎచ్చటికి పోయినను రాముడు నిన్ను విడువడు.

రామునకును, నీకును సాదృశ్యము ఎక్కడ? ఒకే అడవిలో ఉన్నంత మాత్రమున చెవులపిల్లి ఏనుగుతో సమానమగునా? నీవు చెవులపిల్లి వంటి వాడవు. రామచంద్రుడు గజేంద్రునివంటివాడు. మహాపరాక్రమవంతుడగు శ్రీరాముని అక్షేపించుటకు నీవేల సంకోచింపవు? నీవంత మహాపరాక్రమ వంతుడవైనచో రామచంద్రుని ఎదుట పడవేమి?

నీచుడా! నన్ను దుర్బుద్ధితో చూచుచున్నావు. క్రూరములగు నీనేత్రములు ఏల రాలి పడవో? దశరథుని కోడలనై, రామచంద్రుని భార్యనైన నన్ను గురించి ఇట్టి దుష్టవచనములు పలుకుచున్న నీ నాలుక ఎందులకు ముక్కలుగా చెక్కలుగా రాలి పడదో? ఏనాడో

నా పాతివ్రత్య తేజముచే నిన్ను భస్మముగ చేసి యుందును. కానీ రామచంద్రుని ఆజ్ఞలేక, నీవు బ్రహ్మరుద్రాదుల గురించి చేసిన తపస్సును అనుపాలనము చేయవలసి యున్నందున నిన్ను శపించి భస్మము చేయుట లేదు.

రామచంద్రుని నుండి నన్ను దూరము చేయుట వాస్తవముగా నీకు శక్యమైన విషయము కాదు. కానీ నీకు చావు దగ్గర పడినందువల్లనే ఆ పని అట్లు జరిగినది. శూరుడవు, వీరుడవు ఐనచో నీవు నన్ను దొంగతనముగా ఎత్తుకొని వచ్చితివేల?

సీత మాటలను విని రాక్షసాధిపతి రావణుడు కన్నులు పెద్దవి చేసి సీత వంక చూచెను. నల్లని మేఘము వంటి దేహము కలిగి పెద్ద భుజములు, మెడలు కలిగినవాడై నేత్రములు కూడ కోపముతో ఎరుపెక్కగా కిరీటము కదలాడుచుండగా రంగురంగుల పుష్పమాలలు, మైపూతలచే అలంకృతుడైన ఆ రావణుడు నల్లని పెద్దదైన కటిబంధముచే అమృతోత్పాదన సమయమున వాసుకిచే అలంకృతమగు మందర పర్వతమును తలపించుచుండెను. చక్కని కుండలములు చెవులను అలంకరించి ఉండెను. ఎన్ని రీతుల అలంకరించికొనినను శ్మశాన మంటపము వలె భయంకరుడై ఉండెను.

కోపముతో సీతను చూచుచు ఆ రావణుడు ఇట్లు పలికెను. సీతా! నీవు మంచి చెడ్డలు తెలియని దానవు. అర్థహీనుడు నీతి తెలియని వాడు అగును. రాముని యందే బుద్ధిని నిలుపుకొనిన నిన్ను సూర్యుడు సంధ్యనువలె నాశనము చేసెదను. అని చెప్పి అచ్చట సీతకు కావలి కాయుచున్న భయంకరాకారులగు రాక్షస స్త్రీలను ఇట్లు ఆదేశించెను.

## రావణుడు రాక్షసస్త్రీల నాదేశించుట

ఈ సీత తొందరలో నాకు వశవర్తిని అగునట్లు ప్రయత్నిం పుడు. ఎవరికి వారు కాక మీరందరును కలిసి ప్రయత్నింపుడు. ఈ రాక్షస రాజును వరించుటలో కలుగు మేలును వరింపనందు వలన వచ్చు అనర్థములను చెప్పి సామ, దాన, భేదముల ఉపయోగించి చివరకు దండింతునని బెదరించియు ఆమె నాకు అనుకూల యగునట్లు చేయుడు. అని రాక్షస స్త్రీలతో చెప్పి రావణుడు తిరిగి కామక్రోధములు మేరమీరగ సీతను బెదరించెను.

ఆ సమయమున ధాన్యమాలిని అను రావణ పత్ని వచ్చి రావణుని ఆలింగనము చేసికొని ఇట్లు పలికెను. రాజా!వైవర్ణ్యము కలిగి దురదృష్టవంతురాలైన ఈ మనుష్య స్త్రీతో మీకేమి ప్రయోజనము? మీరు బాహుబలముచే ఆర్జించిన దివ్య భోగములను అనుభవించు భాగ్యము అమెకు లేదు. మీయందు ప్రేమలేని స్త్రీని మోహించిన మీకేమి ఆనందము కలుగును? ఆ మాటలను విని నవ్వుకొనుచు రావణుడు సపరివారముగ వెనుతిరిగెను. నేల కంపించునట్లు అడుగులు వేసికొనుచు సూర్య సన్నిభమైన తప భవనమునకు బయలు దేరెను. అతని వెంట వచ్చిన దేవ, గంధర్వ, నాగ కన్యకలును తమతమ అంతఃపురములకు చేరిరి.



# ౨౩. త్రయోవింశ స్సర్గః

ఇత్యుక్త్వా మైథిలీం రాజా రావణ శ్శత్రురావణః,
సందిశ్య చ తత స్సర్వా రాక్షసీ ర్నిర్జగామ హ. 1

నిష్క్రాన్తే రాక్షసేన్ద్రే తు పున రన్తఃపురం గతే,
రాక్షస్యో భీమరూపా స్తా స్సీతాం సమభిదుద్రువుః. 2

తత స్సీతా ముపాగమ్య రాక్షస్యః క్రోధమూర్ఛితాః,
పరం పరుషయా వాచా వైదేహీ మిద మబ్రువన్. 3

పౌలస్త్యస్య వరిష్ఠస్య రావణస్య మహాత్మనః,
దశగ్రీవస్య భార్యా త్వం సీతే న బహుమన్యసే. 4

తత స్త్వేకజటా నామ రాక్షసీ వాక్య మబ్రవీత్,
ఆమన్త్ర్య క్రోధతామ్రాక్షీ సీతాం కరతలోదరీమ్. 5

ప్రజాపతీనాం షణ్ణాం తు చతుర్థో యః ప్రజాపతిః,
మానసోబ్రహ్మణఃపుత్రః పులస్త్య ఇతి విశ్రుతః. 6

పులస్త్యస్య తు తేజస్వీ మహర్షి ర్మానస స్సుతః,
నామ్నా స విశ్రవా నామ ప్రజాపతిసమప్రభః. 7

తస్య పుత్రో విశాలాక్షి రావణ శ్శత్రురావణః,
తస్య త్వం రాక్షసేన్ద్రస్య భార్యా భవితు మర్హసి. 8

మయోక్తం చారు సర్వాఙ్గి వాక్యం కిం నానుమన్యసే,
తతో హరిజటా నామ రాక్షసీ వాక్య మబ్రవీత్. 9

వివర్త్య నయనే కోపా న్మార్జారసదృశేక్షణా,
యేన దేవా స్త్రయస్త్రింశ ద్దేవరాజ శ్చ నిర్జితాః. 10

తస్య త్వం రాక్షసేన్ద్రస్య భార్యా భవితు మర్హసి,
తత స్తు ప్రఘసా నామ రాక్షసీ క్రోధమూర్ఛితా. 11

భర్త్సయన్తీ తదా ఘోర మిదం వచన మబ్రవీత్,
వీర్యోత్సిక్తస్య శూరస్య సంగ్రామే ష్వనివర్తినః. 12

బలినో వీర్యయుక్తస్య భార్యా త్వం కిం న లప్స్యసే,
ప్రియాం బహుమతాం భార్యాం త్యక్త్వా రాజా మహాబలః.

సర్వాసాం చ మహాభాగాం త్వా ముపైష్యతి రావణః,
సమృద్ధం స్త్రీసహస్రేణ నానారత్నోపశోభితమ్. 14

అన్తఃపురం సముత్సృజ్య త్వా ముపైష్యతి రావణః,
అన్యా తు వికటా నామ రాక్షసీ వాక్య మబ్రవీత్. 15

అసకృద్దేవతాయుద్ధే నాగగన్ధర్వదానవాః,
నిర్జితా స్సమరే యేన స తే పార్శ్వ ముపాగతః. 16

తస్య సర్వసమృద్ధస్య రావణస్య మహాత్మనః,
కి మద్య రాక్షసేన్ద్రస్య భార్యా త్వం నేచ్ఛసేஉధమే. 17

తత స్తు దుర్ముఖీ నామ రాక్షసీ వాక్య మబ్రవీత్,
యస్య సూర్యో న తపతి భీతో యస్య చ మారుతః. 18

న వాతి స్మామయతాపాఙ్గే కిం త్వం తస్య న తిష్ఠసి,
పుష్పవృష్టిం చ తరవో ముముచు ర్యస్య వై భయాత్. 19

శైలాశ్చ సుభ్రు పానీయం జలదాశ్చ యదేచ్ఛతి,
తస్య నైర్ఋతరాజస్య రాజరాజస్య భామిని. 20

కిం త్వం న కురుషే బుద్ధిం భార్యార్థే రావణస్య హి,
సాధు తే తత్త్వతో దేవి కథితం సాధు భామిని. 21

గృహాణ సుస్మితే వాక్య మన్యథా న భవిష్యసి.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, వాల్మీకీయే,
చతుర్వింశత్సహస్రికాయాం, సంహితాయాం,
శ్రీమత్సున్దరకాణ్డే, త్రయోవింశ స్సర్గః.

## శ్రీమద్రామాయణ మాహాత్మ్యమ్

శ్లో. ఉక్తేనైవ ప్రకారేణ య స్స ముచ్యేత బన్ధనాత్,
శ్రీరామేతి త్ర్యక్షరం వా మహాపాతక నాశనమ్.

## 23వ సర్గము

### రాక్షసస్త్రీలు సీతను బెదరించుట

సీతతో ఈ రీతిగ మాటలాడి సీతను తనకు వశవర్తినిగ చేయుమని రాక్షస స్త్రీలకు ఆదేశమిచ్చి రావణుడు వెడలి పోయెను. రాక్షసాధిపతి తన అంతఃపురమునకు చేరగనే ఆ రాక్షస స్త్రీలందరు సీతవైపునకు బయలుదేరిరి. సీతాదేవి వద్దకు వచ్చి పెరిగిన కోపముతో ఈ రీతిగ పరుషములు పలికిరి.

అందులో ఏకజట అను ఒక రాక్షస కుల ప్రజాపతి యొక్క పౌత్రుడు, విశ్రవసుని పుత్రుడు అయిన ఈ రావణుడు శత్రు భయంకరుడు. రాక్షసుల కందరకును అతడు చక్రవర్తి. ఆతనికి భార్యవై యుండుట న్యాయము. నీవు అందులకు అంగీకరింపవేమి? మేము చెప్పిన మాటలను అంగీకరింపవేమి? అన్నది.

తరువాత హరిజట అను ఒక రాక్షసి తన పిల్లి కన్నులను గుండ్రముగ త్రిప్పుచు ఈ రాక్షస రాజుచే ముప్పదిముగ్గురు దేవతలు

ఇంద్రుడును జయింపబడిరి. అట్టి రావణునకు నీవు భార్యవై యుండుట మంచిది. మహావీరుడు, శూరుడు, యుద్ధభూమిలో ఎప్పుడును వెనుకంజవేయనివాడు రావణుడు నిన్ను భార్యగా స్వీకరింప దలంచి ఉన్నాడు. నీవు భార్యవైనచో తన అంతఃపుర స్త్రీలను విడిచి నీ వద్దనే ఉండును అన్నది వికట అను మరియొక రాక్షసి

అనేక పర్యాయములు దేవతలు, నాగులు, గంధర్వులు, దానవులు మా చక్రవర్తిచేత జయింప బడినారు. అతడు నీవద్దకు వచ్చి నిన్ను ప్రార్థించుచున్నాడు. ఆతని కోరికను నీవు తిరస్కరించు చున్నావు. నీవు చాల దురదృష్టవంతురాలవు అన్నది. తరువాత దుర్ముఖి అన్నది.

మా మహారాజునకు భయపడి సూర్యుడు వేడి వెలుగులు ప్రసరింప జేయడు. గాలి విసురుగ వీచడు. నీ వాతని మాట వినవేమి? మా చక్రవర్తికి భయపడి మేఘములెప్పుడును వర్షించుచుండెను. కొండలు సెలయేరులు పారించుచుండెను. ప్రభువులకు ప్రభువైన, రాజులకు రాజైన మా రాక్షస చక్రవర్తికి భార్యవై యుండుటకు సమ్మతింపుము. మేము చెప్పిన మంచి మాట వినుము. లేనిచో నీవు బ్రతుక లేవు అన్నది.



# 24. చతుర్వింశ స్సర్గః

తత స్సీతా ముపాగమ్య రాక్షస్యో వికృతాననాః,
పరుషం పరుషా నార్య ఊచు స్తాం వాక్య మప్రియమ్. 1

కిం త్వ మన్తఃపురే సీతే సర్వభూతమనోహరే,
మహార్హశయనోపేతే న వాస మనుమన్యసే. 2

మానుషీ మానుషస్యైవ భార్యాత్వం బహు మన్యసే,
ప్రత్యాహర మనో రామా న్నత్వం జాతు భవిష్యసి. 3

త్రైలోక్య వసుభోక్తారం రావణం రాక్షసేశ్వరమ్,
భర్తార ముపసఙ్గమ్య విహరస్వ యథాసుఖమ్. 4

మానుషీ మానుషం తం తు రామ మిచ్ఛసి శోభనే,
రాజ్యా ద్భ్రష్ట మసిద్ధార్థం విక్లబం త్వ మనిన్దితే. 5

రాక్షసీనాం వచ శ్శ్రుత్వా సీతా పద్మనిభేక్షణా,
నేత్రాభ్యా మశ్రుపూర్ణాభ్యా మిదం వచన మబ్రవీత్. 6

య దిదం లోకవిద్విష్ట ముదాహరథ సఙ్గతాః,
నైత న్మనసి వాక్యం మే కిల్బిషం ప్రతిభాతి వః. 7

న మానుషీ రాక్షసస్య భార్యా భవితు మర్హతి,
కామం ఖాదత మాం సర్వా న కరిష్యామి వో వచః. 8

దీనో వా రాజ్యహీనో వా యో మే భర్తా స మే గురుః,
తం నిత్య మనురక్తాఽస్మి యథా సూర్యం సువర్చలా. 9

యథా శచీ మహాభాగా శక్రం సముపతిష్ఠతి,
అరున్ధతీం వసిష్ఠం చ రోహిణీ శశినం యథా. 10

లోపాముద్రా యథాఽగస్త్యం సుకన్యా చ్యవనం యథా,
సావిత్రీ సత్యవన్తం చ కపిలం శ్రీమతీ యథా. 11

సౌదాసం మదయన్తీవ కేశినీ సగరం యథా,
నైషధం దమయ న్తీవ భైమీ పతి మనువ్రతా. 12

తథాఽహ మిక్ష్వాకువరం రామం పతి మనువ్రతా,
సీతాయా వచనం శ్రుత్వా రాక్షస్యః క్రోధమూర్ఛితాః. 13

భర్త్సయన్తి స్మ పరుషై ర్వాక్యై రావణచోదితాః,
అవలీన స్స నిర్వాక్యో హనుమా న్శింశుపాద్రుమే. 14

సీతాం సంతర్జయన్తీ స్తా రాక్షసీ రశృణో త్కపిః,
తా మభిక్రమ్య సంక్రుద్ధా వేపమానం సమన్తతః. 15

భృశం సంలిలిహు ర్దీప్తా న్ప్రలమ్బా న్దశనచ్ఛదాన్,
ఊచుశ్చ పరమక్రుద్ధాః ప్రగృ హ్యాశు పరశ్వధాన్. 16

నేయ మర్హతి భర్తారం రావణం రాక్షసాధిపమ్,
సా భర్త్స్యమానా భీమాభీ రాక్షసీభి ర్వరాననా. 17

సా బాష్ప మపమార్జన్తీ శింశుపాం తా ముపాగమత్,
తత స్తాం శింశుపాం సీతా రాక్షసీభి స్సమావృతా. 18

అభిగమ్య విశాలాక్షీ తస్థౌ శోకపరిప్లుతా,
తాం కృశాం దీనవదనాం మలినామ్బరధారిణీమ్. 19

భర్త్సయాంచక్రిరే సీతాం రాక్షస్య స్తాం సమన్తతః,
తత స్తాం వినతా నామ రాక్షసీ భీమదర్శనా. 20

అబ్రవీ త్కుపితాకారా కరాళా నిర్ణతోదరీ,
సీతే పర్యాప్త మేతావ ద్భర్తు స్స్నేహో నిదర్శితః. 21

సర్వ త్రాతికృతం భద్రే వ్యసనా యోపకల్పతే,
పరితుష్టాస్మి భద్రం తే మానుష స్తే కృతో విధిః. 22

మ మాపి తు వచః పథ్యం బ్రువన్త్యాః కురు మైథిలి,
రావణం భజ భర్తారం భర్తారం సర్వరక్షసామ్. 23

విక్రాన్తం రూపవన్తం చ సురేశ మివ వాసవమ్,
దక్షిణాం త్యాగశీలం చ సర్వస్య ప్రియదర్శనామ్. 24

మానుషం కృపణం రామం త్యక్త్వా రావణ మాశ్రయ,
దివ్యాఙ్గరాగా వైదేహి దివ్యాభరణభూషితా. 25

అద్యప్రభృతి సర్వేషాం లోకానా మీశ్వరీ భవ,
అగ్నే స్స్వాహా యథా దేవీ శచీ వేన్ద్రస్య శోభనే. 26

కిం తే రామేణ వైదేహి కృపణేన గతాయుషా,
ఏత దుక్తం చ మే వాక్యం యది త్వం న కరిష్యసి. 27

అస్మి న్ముహూర్తే సర్వా స్త్వాం భక్షయిష్యామహే వయమ్,
అన్యా తు వికటా నామ లమ్బమానపయోధరా. 28

అబ్రవీ త్కుపితా సీతాం ముష్టి ముద్యమ్య గర్జతీ,
బహూ న్యప్రియరూపాణి వచనాని సుదుర్మతే. 29

అనుక్రోశా న్మృదుత్వాచ్చ సోఢాని తవ మైథిలి,
న చ నః కురుషే వాక్యం హితం కాలపురస్కృతమ్. 30

ఆనీతాऽసి సముద్రస్య పార మన్యై ర్దురాసదమ్,
రావణాన్తఃపురం ఘోరం ప్రవిష్టా చాసి మైథిలి. 31

రావణస్యగృహే రుద్ధా మస్మాభి స్తు సురక్షితామ్,
న త్వాం శక్తః పరిత్రాతు మపి సాక్షా త్పురన్దరః. 32

కురుష్వ హితవాదిన్యా వచనం మమ మైథిలి,
అల మశ్రుప్రపాతేన త్యజ శోక మనర్థకమ్. 33

భజ ప్రీతిం చ ప్రహర్షం చ త్య జైతాం నిత్యదైన్యతామ్,
సీతే రాక్షసరాజేనసహ క్రీడ యథాసుఖమ్. 34

జానాసి హి యథా భీరు స్త్రీణాం యౌవన మధ్రువమ్,
యావ న్న తే వ్యతిక్రామే త్తావ త్సుఖ మవాప్నుహి. 35

ఉద్యానాని చ రమ్యాణి పర్వతోపవనాని చ,
సహ రాక్షసరాజేన చర త్వం మదిరేక్షణే. 36

స్త్రీసహస్రాణి తే సప్త వశే స్థాస్యన్తి సున్దరి,
రావణం భజ భర్తారం భర్తారం సర్వరక్షసామ్. 37

ఉత్పాట్య వాతే హృదయం భక్షయిష్యామి మైథిలి,
యది మే వ్యాహృతం వాక్యం న యథావ త్కరిష్యసి. 38

తత శ్చణ్డోదరీ నామ రాక్షసీ క్రోధమూర్ఛితా,
భ్రామయన్తీ మహచ్ఛూల మిదం వచన మబ్రవీత్. 39

ఇమాం హరిణలోలాక్షీం త్రాసోత్కమ్పిపయోధరామ్,
రావణేన హృతాం దృష్ట్వా దౌహృదో మే మహా నభూత్.

యకృత్ ప్లీహ మథో త్క్రోడం హృదయం చ సబన్ధనమ్,
అన్త్రాణ్యపి తథా శీర్షం ఖాదేయ మితి మే మతిః. 41

తత స్తు ప్రఘసానామ రాక్షసీ వాక్య మబ్రవీత్,
కణ్ఠ మస్యా నృశంసాయాః పీడయామ కి మాస్యతే. 42

నివేద్యతాం తతో రాజ్ఞే మానుషీ సా మృతేతి హ,
నాత్ర కశ్చన సన్దేహః ఖాదతేతి స వక్ష్యతి. 43

తత స్త్వజాముఖీనామ రాక్షసీ వాక్య మబ్రవీత్,
విశ స్యేమాం తత స్సర్వా స్సమా న్కురుత పీలుకాన్. 44

విభజామ తత స్సర్వా వివాదో మే న రోచతే,
పేయ మానీయతాం క్షిప్రం లేహ్య ముచ్చావచం బహు.45

తత శ్శూర్పణఖా నామ రాక్షసీ వాక్య మబ్రవీత్,
అజాముఖ్యా య దుక్తం హి తదేవ మమ రోచతే. 46

సురా చానీయతాం క్షిప్రం సర్వశోకవినాశినీ,
మానుషం మాంస మాస్వాద్య నృత్యామోఽథ నికుంభిలామ్.

ఏవం సంభర్త్స్యమానా సా సీతా సురసుతోపమా,
రాక్షసీభి స్సుఘోరాభి ర్ధైర్య ముత్సృజ్య రోదితి. 48

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, వాల్మీకీయే,
చతుర్వింశత్సహస్రికాయాం, సంహితాయాం,
శ్రీమత్సున్దరకాణ్డే చతుర్వింశ స్సర్గః

## 24వ సర్గము

రాక్షసస్త్రీలు సహజసిద్ధముగనే పరుషప్రవృత్తి కలిగినవారై అప్రియమైన మాటలను సీతతో పలికిరి. సీతా! సర్వ ప్రాణులకు మనోహరమైన విలువైన శయ్యాదికము - గల రావణుని అంతఃపుర మున ఉండుటకు ఏల అంగీకరింపవు. మనుష్యస్త్రీ మనుష్యునకు భార్యయై ఉండుటను గొప్పగా తలంచెదవేల? శ్రీరామచంద్రుని నుండి నీ మనస్సును మార్చుకొనుము. లేదా నీ ప్రాణములు దక్కవు. మూడులోకముల లోను సిరి సంపదలకు అధిపతియై మహాసుఖములను అనుభవించుచున్న రాక్షసాధిపతి యగు రావణుని భర్తగా అంగీకరింపుము. మనుష్య స్త్రీ మనుష్యుని భర్తగ స్వీకరింపవలయునను లేనిపోని నియమమును నమ్మి రాజ్యభ్రష్టుడు, అకృతార్థుడు, దీనుడు అయిన రాముని కోరెదవేల?

### సీత సమాధానము

ఆ రాక్షస స్త్రీల ఈ పరుషవచనములను కనులవెంట నీళ్ళు కార్చుచు ఇట్లు పలికెను. లోకమంతయు అసహ్యించుకొను ఈ మాటలను చెప్పితిరేల? ఈ పాపపు మాటలు నా మనస్సునకు నచ్చవు. మనుష్య స్త్రీ ఎప్పుడును రాక్షసునకు భార్య కాదగదు. నన్ను చంపి మీరు తినివేసినను మీమాట నేనంగీకరింపను. ధీరుడైనను, అధీరుడైనను, రాజ్యము ఉన్నను, లేక పోయినను రాముడే నాకు భర్త ఆయనయందే నా కనురాగ మున్నది. సువర్చల సూర్యునివలె, శచీదేవి ఇంద్రుని వలె, అరుంధతి వశిష్ఠుని వలె, రోహిణి చంద్రుని

వలె, లోపాముద్ర అగస్త్యుని వలె, సావిత్రి సత్యవంతుని వలె, సుకన్య చ్యవనుని వలె, శ్రీమతి కపిలుని వలె, కేశినీ దేవి సగరుని వలె, దమయంతి నలుని వలె, నేనును ఇక్ష్వాకు వంశోత్తముడైన శ్రీరాముని అనుసరించుదానను.

ఈ సీతావచనములను విని ఆ రాక్షస స్త్రీలు ఒడలు తెలియని కోపముతో రావణాజ్ఞను శిరసావహించి సీతతో పరుషములు పలుక జొచ్చిరి.

హనుమ శింశుపా వృక్షమున నిశ్శబ్దముగ కూర్చుండి రాక్షస స్త్రీల మాటలను వినుచుండెను. భయముతో వణకుచున్న సీత దగ్గరకు పోయి గొడ్డలి వంటి ఆయుధమును చేత బట్టి, "రాక్షస చక్రవర్తి భార్యయగు భాగ్యము ఈమెకు లేదు. అను ఇట్టి బెదరింపు మాటలను వినలేక కన్నీరు కార్చుచు సీత శింశుపావృక్షము వద్దకు వచ్చెను. శోకించుచు అచ్చటనే ఉండెను. మాసిన వస్త్రములతో కృశాంగియు దీన వదనయు అయిన ఆ సీతను అచ్చట కూడ చుట్టుముట్టి పరుష వాక్యములు పలుక జొచ్చిరి.

## రాక్షస స్త్రీలు సీతను బెదరించుట

వినత అను ఒక రాక్షసి మిక్కిలి కోపముతో చూడ భయంకరమైన ఆకారముతో ఇట్లనెను. సీతా! నాకు నీ భర్త యందు ప్రేమ ఉన్నది సంతోషము. ఏదైనను మితిమీరి ఉన్నచో అనర్థము తెచ్చిపెట్టును. నేను చెప్పిన మాట కూడ వినుము. రాక్షసులందరకు ప్రభువైన రావణుని భర్తగ స్వీకరింపుము. అతడు పరాక్రమవంతుడు.

రూపవంతుడు. మహేంద్రునకు తక్కువకాని సిరిసంపదలు కలిగిన వాడు. అందరి యందు దాక్షిణ్య బుద్ధి కలవాడు. త్యాగశీలి. దిక్కులేని మనుష్య మాత్రుడైన రాముని విడిచి రావణుని భర్తగ స్వీకరింపుము. దివ్యమైన అంగరాగములను రాసికొనుచు దివ్యాభరణభూషితమై ఈ రోజు మొదలుకొని మూడులోకములకు మహారాణివై ఉండుము. దీనుడు, అల్పాయుష్కుడు అయిన రామునితో ఏమి ప్రయోజనము? మేము చెప్పిన ఈ మాట నీవు విననిచో మేమందరము కలసి నిన్ను భక్షించివైచెదము.

వికట అను మరియొక రాక్షసి కోపముతో పిడికిలి బిగించి సీతతో ఇట్లనెను. నీవు పలికిన సహింపరాని దుర్భాషలను ఎన్నింటినో ఇంతవరకు వినియున్నాను. దయతో ఆ మాటలను సహించితిని. సమయోచితముగ ఎన్ని హితవచనములు మేము చెప్పినను నీవు వినుట లేదు. ఇతరులెవ్వరును చేరరాని సముద్రమును దాటించి లంకకు తీసికొన రాబడితివి. ఈ అంతఃపురమును విడిచి నీవు ఎక్కడకును పోలేవు. రావణాంతఃపురమున నిర్బంధింపబడి మాచే కావలి కాయబడుచున్న నిన్ను ఇంద్రుడు కూడ రక్షింపలేడు. నేను నీకు హితము చెప్పుచున్నాను. నా మాట వినుము కన్నీళ్ళు కార్చవద్దు. ఈ నిరర్థకమైన శోకమును విడువుము. ఆనందముగ నుండుము. ఈ నిత్య దైన్యమును విడిచి పెట్టుము. రావణునితో కలిసి సుఖముగా జీవితము గడపుము.

యౌవనము శాశ్వతము కాదు. యౌవనము ఉన్నపుడే సుఖభోగములను పొందుము. ఉద్యానములో పర్వత ప్రాంతమందలి వనములో నీవు సంతోషముగ రాక్షసరాజుతో కలసి విహరింపవచ్చును. ఏడువేలమంది రాక్షస స్త్రీలు నీకు వశవర్తినులై ఉండగలరు. రాక్షసాధిపతియగు రావణుని భర్తగ స్వీకరింపుము. లేనిచో నీ హృదయము పెల్లగించి తినివేసెదము.

తరువాత చండోదరి అను ఒక రాక్షసి క్రోధపరవశురాలై ఆకాశమున శూలమును గిరగిర తిప్పుచు ఇట్లనెను. నేను గర్భవతిని. ఈమె యొక్క యకృత్ ప్లీహము, హృదయము అంత్రములో తినవలెనని బుద్ధిపుట్టినది. తరువాత ప్రహస అను రాక్షసి ఈ సీత గొంతుక నొక్కివేసెదను. తరువాత మీరు తెచ్చిన మానవ స్త్రీ సీత మరణించినదని మహారాజునకు నివేదించినచో చచ్చిన ఆమెను తినివేయుమని మనకు ఆజ్ఞ నిచ్చును - అన్నది.

తరువాత అజాముఖి అను రాక్షసి ఇట్లన్నది. ఈ సీతను చంపి ముక్కలుగ చేసికొని పంచుకొనవచ్చును. తరువాత సురాపానము చేయవచ్చును. మనుష్య మాంసమును తిని నికుంభిళాదేవి వద్ద నాట్యము చేయవచ్చును. రాక్షస స్త్రీల ఈ బెదరింపులను చూచి విని సీతాదేవి అధైర్యపడి ఏడ్వజొచ్చెను.



## ౨౫. పఞ్చవింశః సర్గః

తథా తాసాం వదన్తీనాం పరుషం దారుణం బహు,
రాక్షసీనా మసౌమ్యానాం రురోద జనకాత్మజా. 1

ఏవ ముక్తా తు వైదేహీ రాక్షసీభి ర్మనస్వినీ,
ఉవాచ పరమత్రస్తా బాష్పగద్గదయా గిరా. 2

న మానుషీ రాక్షసస్య భార్యా భవితు మర్హతి,
కామం ఖాదత మాం సర్వా న కరిష్యామి వో వచః. 3

సా రాక్షసీమధ్యగతా సీతా సురసుతోపమా,
న శర్మ లేభే దుఃఖార్తా రావణేన చ తర్జితా. 4

వేపతే స్మాధికం సీతా విశన్తీ వాఙ్గ మాత్మనః,
వనే యూథపరిభ్రష్టా మృగీ కోకై రివార్దితా. 5

సా త్వశోకస్య విపులాం శాఖా మాలమ్బ్య పుష్పితామ్,
చిన్తయామాస శోకేన భర్తారం భగ్నమానసా. 6

సా స్నాపయన్తీ విపులా స్తనా నేత్రజలస్రవైః,
చిన్తయన్తీ న శోకస్య తదాన్త మధిగచ్ఛతి. 7

సా వేపమానా పతితా ప్రవాతే కదలీ యథా,
రాక్షసీనాం భయత్రస్తా వివర్ణవదనాఽభవత్. 8

తస్యా స్సా దీర్ఘవిపులా వేపన్త్యా సీతయా తదా,
దదృశే కమ్పినీ వేణీ వ్యాళీవ పరిసర్పతీ. 9

సా నిశ్వసన్తీ దుఃఖార్తా శోకోపహతచేతనా,
ఆర్తా వ్యసృజ దశ్రూణి మైథిలీ విలలాప హ. 10

హా రామేతి చ దుఃఖార్తా హా పున ర్లక్ష్మణేతి చ,
హా శ్వశ్రు మమ కౌసల్యే హా సుమిత్రేతి భామినీ. 11

లోకప్రవాద స్సత్యోఽయం పణ్డితై స్సముదాహృతః,
అకాలే దుర్లభో మృత్యుః స్త్రియా వా పురుషస్య వా.

య త్రాహ మేవం క్రూరాభీ రాక్షసీభి రిహార్దితా,
జీవామి హీనా రామేణ ముహూర్త మపి దుఃఖితా. 13

ఏషాఽ ల్పపుణ్యా కృపణా వినశిష్యా మ్యనాథవత్,
సముద్రమధ్యే నౌః పూర్ణా వాయువేగై రి వాహతా. 14

భర్తారం త మపశ్యన్తీ రాక్షసీవశ మాగతా,
సీదామి ఖలు శోకేన కూలం తోయహతం యథా. 15

తం పద్మదళపత్రాక్షం సింహవిక్రాన్తగామినమ్,
ధన్యాః పశ్యన్తి మే నాథం కృతజ్ఞం ప్రియవాదినమ్. 16

సర్వథా తేన హీనాయా రామేణ విదితాత్మనా,
తీక్ష్ణం విష మి వాస్వాద్య దుర్లభం మమ జీవితమ్. 17

కీదృశం తు మయా పాపం పురా జన్మాన్తరే కృతమ్,
యే నేదం ప్రాప్యతే దుఃఖం మయా ఘోరం సుదారుణం.

జీవితం త్యక్తు మిచ్ఛామి శోకేన మహతా వృతా,
రాక్షసీభిశ్చ రక్షన్త్యా రామో నాసాద్యతే మయా. 19

ధి గస్తు ఖలు మానుష్యం ధి గస్తు పరవశ్యతామ్,
న శక్యం యత్పరిత్యక్తు మాత్మచ్ఛందేన జీవితమ్. 20

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, వాల్మీకీయే,
చతుర్వింశత్సహస్రికాయాం, సంహితాయాం,
శ్రీమత్సున్దరకాణ్డే, పంచవింశ స్సర్గః.

## శ్రీమద్రామాయణ మాహాత్మ్యమ్

శ్లో. లిఖిన్మను మవాప్నోతి యథోక్త విధినా ప్రియే,
యథోద్దిష్టం సమాప్తేతు రామనామ విలేఖనే.

శ్లో. శ్రుత్వా రామాయణ కథాం పూర్వోక్తవిధి నాదరాత్,
శతాంశంవా దశాంశం వా కృత్వాఽగ్నిముఖ మాదితః.

# 25వ సర్గము

## రాక్షసస్త్రీల బెదరింపులకు సీత దుఃఖించుట

సౌమ్యత లేని ఆ రాక్షస స్త్రీలు పై రీతిగ పరుషవచనములు పలుకుచుండగా ఉత్తమ పవిత్రయగు ఆ సీత మిక్కిలి విలపించెను. మిక్కిలి భయపడుచు గద్గదస్వరముతో ఇటుల పలికినది. మనుష్య స్త్రీ రాక్షసునకు భార్య కాజాలదు. నన్ను ముక్కలుగ జేసి తినివేసినను నేను నీ మాట విననను. రావణునిచే బెదరింపబడిన దేవకన్య వంటి ఆ సీత ఆ రాక్షస స్త్రీల మధ్య ఏమియు స్తిమితముగా ఉండలేక పోయెను. తమ జట్టు నుండి విడిపోయి తోడేళ్ళ గుంపులో పడిన ఆడులేడి మిక్కిలి భయముతో గడగడ వణికి పోవుచుండెను.

ఆమె ఆ అశోక వృక్షము యొక్క పుష్పించిన ఒక కొమ్మను పట్టుకొని చిత్తస్థైర్యములేక భర్తయగు శ్రీరామచంద్రుని గుఱించి ఆ రాక్షస స్త్రీల మాటలకు, చేష్టలకు మిక్కిలి భయపడుచుండెను. ముఖమున వైవర్ణ్యము కానవచ్చెను. కన్నీరు కాలువలై వక్షస్థలము మీదుగా జారి పడుచుండెను. పెద్ద గాలిచే అరటిచెట్టు వలె గజగజ లాడుచుండెను. ఆమె భయముతో వణకుచున్నపుడు శిథిలమైన ఆమె కేశపాశము నల్లత్రాచువలె ఇటునటు కదలాడుచుండెను. పెద్దగ నిట్టూర్పులు విడుచుచు శోకవేగమున మిక్కిలి పీడితురాలై ధైర్యము చెడి కన్నీళ్లు కార్చుచు ఏడ్వజొచ్చెను.

రామచంద్రా! లక్షణా! కౌసల్యాదేవీ! అని భర్తను, మఱది అయిన లక్ష్మణుని అత్తలు కౌసల్యా సుమిత్రలను తలంచుకొనుచు విలపించెను. లోకములో చెప్పుకొనుచుండు ఈ పండితుల ప్రవాదము స్త్రీకి కాని పురుషునకు కాని అకాలము నందు మరణము దుర్లభము.

అనుమాట యథార్థముగ తోచుచున్నది. ఏమనగా ఇంతటి క్రౌర్యము గల రాక్షస స్త్రీలుపలుకుచున్న దుర్భాషలను వినుచు నేను ముహూర్తకాలమైనను బ్రతికియుండుట తలంచుకొన్నచో ఆ పెద్దల మాట యథార్థమని తలంచుచున్నాను.

కొద్దిపాటి పుణ్యము చేసికొని రామచంద్రుని వివాహమాడి, సముద్ర మధ్యమున సరకులతో నిండుగ నుండి పెద్ద కెరటముల దెబ్బలకు తలక్రిందులగుచున్న నౌక వలె నేనును దిక్కులేని దాననై వినాశనమొందుచున్నాను. నా భర్త రామచంద్రుని సేవించుకొనలేక ఈ రాక్షస స్త్రీల మధ్య పడిఉండి ప్రవాహ వేగమున విరిగిపడుచున్న నది గట్టువలె అవసాదము నొందుచున్నాను. తామర రేకుల వంటి నేత్రములు కలిగి, సింహగమనముతో విరాజిల్లుచు కృతజ్ఞుడు, ప్రియవాదియునగు నా భర్తను ఎంతో పుణ్యము చేసికొన్న మహాత్ములు చూడగలరు. తీవ్రమైన విషము త్రాగిన మనుష్యుని జీవితము దుర్లభమయినట్లుగా రామచంద్రుని వియోగమును అనుభవించుచు నేను బ్రతికి యుండుటయు దుర్లభమే.

పూర్వజన్మమున నేను ఎంతటి పాపమును చేసి యుంటినో ఈ జన్మలో ఇప్పుడు భర్తకు దూరమై రాక్షసావాసమైన ఈ లంకానగరమున ఈ రాక్షస స్త్రీల మధ్య వారి దుర్భాషలను వినుచు బ్రతికి యుండవలసి వచ్చినది. ఈ రాక్షస స్త్రీల మధ్య నుండి రామచంద్రునకు దూరమైన నాకు బ్రతికియుండవలెనను తలంపులేదు. పరాధీనతను, ఈ మనుష్య జన్మమును తలంచుకొనిన నా కెంతయో బాధ కలుగుచున్నది. స్వచ్ఛందముగా చచ్చిపోవుటకైనను వీలు లేకున్నదే.



# ౨౬. షడ్వింశ స్సర్గః

ప్రసక్తాశ్రుముఖీ త్యేవం బ్రువన్తీ జనకాత్మజా,
అధోముఖముఖీ బాలా విలప్తు ముపచక్రమే. 1

ఉన్మత్తేవ ప్రమత్తేవ భ్రాన్తచిత్తేవ శోచతీ,
ఉపావృత్తా కిశోరీవ వివేష్టన్తీ మహీతలే. 2

రాఘవస్య ప్రమత్తస్య రక్షసా కామరూపిణా,
రావణేన ప్రమ థ్యాహ మానీతా క్రోశతీ బలాత్. 3

రాక్షసీవశ మాపన్నా భర్త్స్యమానా సుదారుణమ్,
చిన్తయన్తీ సుదుఃఖార్తా నాహం జీవితు ముత్సహే. 4

న హి మే జీవితే నార్థో నైవార్థై ర్న చ భూషణైః,
వసన్త్యా రాక్షసీమధ్యే వినా రామం మహారథమ్. 5

అశ్మసార మిదం నూన మథవా ప్యజరామరమ్,
హృదయం మమ యే నేదం న దుఃఖే నావశీర్యతే. 6

ధిఙ్మా మనార్యా మసతీం యాఽహం తేన వినాకృతా,
ముహూర్త మపి రక్షామి జీవితం పాపజీవితా. 7

కా చ మే జీవితే శ్రద్ధా సుఖే వా తం ప్రియం వినా,
భర్తారం సాగరాన్తాయా వసుధాయాః ప్రియంవదమ్. 8

భిద్యతాం భక్ష్యతాం వాపి శరీరం విసృజా మ్యహమ్,
న చా ప్యహం చిరం దుఃఖం స హేయం ప్రియవర్జితా. 9

చరణేనాపి సవ్యేన న స్పృశేయం నిశాచరమ్,
రావణం కిం పున రహం కామయేయం విగర్హితమ్. 10

ప్రత్యాఖ్యాతం న జానాతి నాత్మానం నాత్మనః కులమ్,
యో నృశంసస్వభావేన ప్రార్థయితు మిచ్ఛతి. 11

ఛిన్నా భిన్నా విభక్తా వా దీప్తే వాఽ గ్నౌ ప్రదీపితా,
రావణం నోపతిష్ఠేయం కిం ప్రలాపేన వ శ్చిరమ్. 12

ఖ్యాతః ప్రాజ్ఞ శ్చ సానుక్రోశశ్చ రాఘవః,
సద్వృత్తో నిరనుక్రోశ శ్శఙ్కే మద్భాగ్యసంక్షయాత్. 13

రాక్షసానాం సహస్రాణి జనస్థానే చతుర్దశ,
యే నైకేన నిరస్తాని మాం కిం నాభిపద్యతే. 14

నిరుద్ధా రావణే నాహ మల్పవీర్యేణ రక్షసా,
సమర్థః ఖలు మే భర్తా రావణం హన్తు మాహవే. 15

విరాధో దణ్డకారణ్యే యేన రాక్షసపుఙ్గవః,
రణే రామేణ నిహత స్స మాం కిం నాభిపద్యతే. 16

కామం మధ్యే సముద్రస్య లఙ్కేయం దుష్ప్రధర్షణా,
న తు రాఘవబాణానాం గతిరో ధీహ విద్యతే. 17

కిన్ను తత్కారణం యేన రామో దృఢపరాక్రమః,
రక్షసాపహృతాం భార్యా మిష్టాం నాభ్యపద్యతే. 18

ఇహస్థాం మాం న జానీతే శఙ్కే లక్ష్మణపూర్వజః,
జాన న్నపి హి తేజస్వీ ధర్షణం మర్షయిష్యతి. 19

హృతేతి యోఽధిగత్వా మాం రాఘవాయ నివేదయేత్,
గృధ్రరాజోఽపి స రణే రావణేన నిపాతితః. 20

కృతం కర్మ మహ త్తేన మాం తథాభ్యవపద్యతా,
తిష్ఠతా రావణద్వన్ద్వే వృద్ధేనాపి జటాయుషా. 21

యది మా మిహ జానీయా ద్వర్తమానాం స రాఘవః,
అద్య బాణై రభిక్రుద్ధః కుర్యా ల్లోక మరాక్షసమ్. 22

విధమే చ్చ పురీం లఙ్కాం శోషయే చ్చ మహోదధిమ్,
రావణస్య చ నీచస్య కీర్తిం నామ చ నాశయేత్. 23

తతో నిహతనాథానాం రాక్షసీనాం గృహేగృహే,
య థాహ మేవం రుదతీ తథా భూయో న సంశయః. 24

అన్విష్య రక్షసాం లఙ్కాం కుర్యా ద్రామ స్సలక్ష్మణః,
న హి తాభ్యాం రిపు ర్దృష్టో ముహూర్త మపి జీవతి. 25

చితా ధూమాకులపథా గృధ్రమణ్డలసంకులా,
అచిరేణ తు లఙ్కేయం శ్మశానసదృశీ భవేత్. 26

అచిరేణైవ కాలేన ప్రాప్స్యా మ్యేవ మనోరథమ్,
దుష్ప్రస్థానోఽయ మాఖ్యాతి సర్వేషాం వో విపర్యయమ్. 27

యాదృశాని హి దృశ్యన్తే లఙ్కాయా మశుభాని వై,
అచిరేణ తు కాలేన భవిష్యతి హతప్రభా. 28

నూనం లఙ్కా హతే పాపే రావణే రాక్షసాధమే,
శోషం యాస్యతి దుర్ధర్షా ప్రమదా విధవా యథా. 29

పుణ్యోత్సవసముత్థా చ నష్టభర్త్రీ సరాక్షసీ,
భవిష్యతి పురీ లఙ్కా నష్టభర్త్రీ య థాఙ్గనా. 30

నూనం రాక్షసకన్యానాం రుదన్తీనాం గృహే గృహే,
శ్రోష్యామి న చిరాదేవ దుఃఖార్తానా మిహ ధ్వనిమ్. 31

సాన్ధకారా హతద్యోతా హతరాక్షసపుఙ్గవా,
భవిష్యతి పురీ లఙ్కా నిర్దగ్ధా రామసాయకైః. 32

యది నామ స శూరో మాం రామో రక్తాన్తలోచనః,
జానీయా ద్వర్తమానాం హి రావణస్య నివేశనే. 33

అనేన తు నృశంసేన రావణే నాధమేన మే,
సమయో య స్తు నిర్దిష్ట స్తస్య కాలో ఽయ మాగతః. 34

అకార్యం మే నజానన్తి నైరృతాః పాపకారిణః,
అధర్మాత్తు మహోత్పాతో భవిష్యతి హి సామ్ప్రతమ్. 35

నైతే ధర్మం విజానన్తి రాక్షసాః పిశితాశనాః,
ధ్రువం మాం ప్రాతరాశార్థే రాక్షసః కల్పయిష్యతి. 36

సాఽహం కథం కరిష్యామి తం వినా ప్రియదర్శనమ్,
రామం రక్తాన్తనయన మపశ్యన్తీ సుదుఃఖితా. 37

యది కశ్చి త్ప్రదాతా మే విష స్యాద్య భవే దిహ,
క్షిప్రం వైవస్వతం దేవం పశ్యేయం పతినా వినా. 38

నాజానా జ్జీవతీం రామ స్స మాం లక్ష్మణపూర్వజః,
జానన్తౌ తా నకుర్యాతాం నోర్వ్యాం హి మమ మార్గణమ్.
నూనం మమైవ శోకేన స వీరో లక్ష్మణాగ్రజః,
దేవలోక మితో యాత స్త్యక్త్వా దేహం మహీతలే. 40
ధన్యా దేవా స్సగన్ధర్వా స్సిద్ధాశ్చ పరమర్షయః,
మమ పశ్యన్తి యే నాథం రామం రాజీవలోచనమ్. 41
అథవా న హి తస్యార్థో ధర్మకామస్య ధీమతః,
మయా రామస్య రాజర్షే ర్భార్యయా పరమాత్మనః. 42
దృశ్యమానే భవే త్ప్రీతి స్సౌహృదం నా స్త్యపశ్యతః,
నాశయన్తి కృతఘ్నా స్తు న రామో నాశయిష్యతి. 43
కిన్ను మే న గుణాః కేచి త్కిం వా భాగ్యక్షయో మమ,
యాఽహం సీదామి రామేణ హీనా ముఖ్యేన భామినీ. 44
శ్రేయో మే జీవితా న్మర్తుం విహీనాయా మహాత్మనః,
రామా దక్లిష్టచారిత్రా చ్ఛూరా చ్ఛత్రునిబర్హణాత్. 45
అథవా న్యస్తశస్త్రౌ తౌ వనే మూలఫలాశినౌ,
భ్రాతరౌ హి నరశ్రేష్ఠౌ సంవృత్తౌ వనగోచరౌ. 46
అథవా రాక్షసేన్ద్రేణ రావణేన దురాత్మనా,
ఛద్మనా సాదితౌ శూరౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ. 47
సాహ మేవం గతే కాలే మర్తు మిచ్ఛామి సర్వథా,
న చ మే విహితో మృత్యు రస్మిన్ దుఃఖేఽపి వర్తతి. 48

ధన్యాః ఖలు మహాత్మానో మునయ స్త్యక్తకిల్బిషాః,
జితాత్మానో మహాభాగా యేషాం న స్తః ప్రియాప్రియే. 49

ప్రియా న్న సంభవే ద్దుఃఖ మప్రియా దధికం భయమ్,
తాభ్యాం హి యే వియుజ్యన్తే నమ స్తేషాం మహాత్మనామ్.

సాఽహం త్యక్తా ప్రియార్హేణ రామేణ విదితాత్మనా,
ప్రాణాం స్త్యక్ష్యామి పాపస్య రావణస్య గతా వశమ్. 51

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, వాల్మీకీయే,
చతుర్వింశత్సహస్రికాయాం, సంహితాయాం,
శ్రీమత్సున్దరకాణ్డే షడ్వింశ స్సర్గః.

## శ్రీమద్రామాయణ మాహాత్మ్యమ్

శ్లో. స్వాహాన్తయా షడక్షరా హ్యా జ్యేన జుహుయాత్తతః,
రామస్య ప్రతిమాం హైమీం సింహాసన నిషాదితామ్.

# 26వ సర్గము

## సీతరాముని తలచుకొని దుఃఖించుట

సీతాదేవి పిచ్చిదానివలె, అవహితచిత్తకాక కన్నీరు కార్చుచు అలసట చెందిన ఆడుగుఱ్ఱము అలసట తీరుటకై నేలపై పడి దొర్లినట్లుగా ఆ సీతయు నేలపై పడి దొర్లనారంభించెను. శ్రీరామచంద్రుడు ఏమరి ఉండినపుడు దుర్మార్గుడు కామరూపి అగు రావణుడు నన్ను బలాత్కారముగా ఎత్తుకొని వచ్చినాడు. నేనెంతగ ఆక్రోశించినను ఫలితములేకపోయినది. ఈ లంకలో పెట్టినాడు. భర్తకు దూరమై పర స్థలమున నుండి ఈ రాక్షస స్త్రీల బెదరింపులను వినుచు చూచుచు నాకు బ్రతుకుపై ఆశ సన్నగిల్లినది.

మహాపరాక్రమ శాలియగు రామచంద్రునకు దూరమై ఈ రాక్షస స్త్రీల మధ్య పడి ఉన్న నేను జీవించి ఏమి ప్రయోజనము? నాకు ధనములు అక్కరలేదు. ఆభరణములు అక్కరలేదు. బ్రతికి యుండుట కూడ అనవసరమనిపించుచున్నది. ఇంతటి దుఃఖదశలో కూడ నా హృదయము ముక్కలు చెక్కలు కాకుండ ఉన్నది. నా హృదయము శిలారూపమైనదన్నంత వాస్తవము. ఇట్టి నిష్ఠుర హృదయమునకు జరామరణములు లేవు. నేను ఎంత పాపాత్మురాలను? ఆ రాముని విడిచి ముహూర్తకాలము జీవించి ఉన్నను అది నాపాపాతిశయమును సూచించుచుండెను. చతుస్సముద్రపరివృతమైన ఆ భూమికెల్ల ప్రభువగు ఆ రాముని విడిచి ఎట్టి సుఖమందును నాకు ఆశలేదు. శ్రద్ధలేదు.

ఓ రాక్షసులారా నన్ను మీరు ముక్కలుగ చేసికొని తినివేసినను నాకు అభ్యంతరము లేదు. శ్రీరామునకు దూరమై నా ఎడమకాలితో తన్నుటకైనను ఇష్టపడని రావణుని నేను ప్రేమింపగలనా!

తిరస్కరించినను అర్థము చేసికొనడు. కులమర్యాదలను పాటింపడు. ఆ రావణుడు క్రూరస్వభావముతో నన్ను కోరుచున్నాడేమి అది ఎట్లు తగును. నన్ను ముక్కల క్రింద కోసినను, అగ్నితో కాల్చివేసినను రావణుని చేరను. ఇక మీరు పది మాటలు పలుకనేల?

శ్రీరాముని దయ, కృతజ్ఞత, సర్వజ్ఞత అన్నియును ప్రసిద్ధములు. నా దురదృష్టముచేత కావచ్చు. నాయందు దయలేని వాడయ్యెను. జనస్థానమున ఒంటరియై పోరాడి ఖరదూషణాది రాక్షసుల పదునాల్గువేల మందిని చీల్చి చెండాడిన శ్రీరాముడు నన్ను చూచుటకు రాడేమి? మహాశూరుడైన రాముడు పిరికిపంద అసమర్థుడునైన ఆ రావణుని సంహరింపతలంపడేమి? మహాబలశాలి యగు విరాధుని నాకోసమై సంహరించిన ఆ రాముడు ఈ రాక్షస స్త్రీల మధ్య మిక్కిలి వేదన పడుచున్న నన్ను రక్షింపకున్నాడేమి?

మహాసముద్రమధ్యమున నిర్మితమగు ఈ లంకకు రామచంద్రుడు రాలేకపోవచ్చు. ఆతని బాణములు రాలేవా! రాక్షసునిచే అపహృత అయిన తన భార్యను రక్షించుకొనుటకై ఏల ప్రయత్నము చేయడో తెలియరాదు. ఒకవేళ నేను ఇచ్చట లంకలో ఉన్నట్లు ఆ లక్ష్మణాగ్రజునకు తెలిసి ఉండకపోవచ్చు. తెలిసినచో ఈ అవమానమును సహించి ఇంతకాలముండునా? లంకలో నున్న నా ఈ దురవస్థను చెప్పిన వారును ఎవ్వరును లేక పోయియుండురు. నన్ను రక్షించుటకై అడ్డగించిన జటాయు మహారాజును వధింపబడెను. కదా. వృద్ధుడై బలహీనుడైన జటాయువును అకృత్య మాచరించుచున్న రావణుని అడ్డగించి భీకరముగా అంతసేపు పోరాడెనే. నేనిక్కడ

బంధింపబడియున్న విషయము రామచంద్రునికే తెలిసి ఉండినచో బాణములతో నాశనము చేయకుండునా! సముద్రమును తన బాణముచే ఆర్పివేయకుండునా!

## సీత పరితపించుట

ఆ రాముడు తలచుకొన్నచో ఈ రావణుని ఊరు, పేరు ప్రతిష్ఠ లేకుండ నాశనము చేయగలడు. తరువాత దిక్కులేని ఈ రాక్షస స్త్రీలందఱును ఇంటింట నావలెనే ఏడ్చుచు కాలము గడపగలరు. నన్ను వెదకి నా జాడ తెలిసికొని శ్రీరామచంద్రుడు లక్ష్మణునితో కలిసి వచ్చి ఈ లంకను అంకావాసులను వినాశమొందింపగలడు.

ఆ రామ లక్ష్మణుల కంటబడిన శత్రువు బ్రతికి బట్టకట్టలేడు. క్షణకాలమైనను బ్రతుకజాలడు. ప్రతి వీథియు చితాధూమముతో నిండి ఆకాశమున గ్రద్దలు ఎగురుచుండగా కొద్దికాలములో ఈ లంక అంతయు శ్మశానముగ మాఱిపోగలదు. ఈ రాక్షసుల దుర్మార్గము, దురాచారము లంకకు రాబోవు అనర్థమును సూచించుచున్నవి. ఇచ్చట చూచుచున్న దుర్నిమిత్తములు కూడ లంకకు కలుగబోవు దుర్దశను సూచించుచున్నవి.

పరమ నీచుడగు ఈ రావణుడు మరణింపగనే శత్రువు అడుగు పెట్టరాని ఈ లంకయు భర్తలేని స్త్రీవలె తొందరలో ఏ వైభవమును లేనిది అయిపోగలదు. ప్రభువులేని ఈ లంక పవిత్రమైన ఉత్సవములకు దూరమై భర్తృహీనయైన స్త్రీ వలెనే కళాహీనమై పోవును. ప్రతి ఇంటను రాక్షసకన్యకల ఏడ్పులను తొందరలోనే నేను వినగలను. శ్రీరాముని బాణాగ్నిచే ఈ లంక అంతయు దగ్ధమై కాంతిహీనమై అంధకారములో మునిగిపోగలదు.

నేను రావణుని నివాసమున ఉన్నట్లు తెలిసిన వెంటనే రామచంద్రుని నేత్రములు కోపముతో అరుణకాంతులను చిమ్మగలవు. ఆనాడు లంకకు దుస్థితి తప్పదు. పాపాత్ముడగు ఆ రావణుడు అవధిగ ఇచ్చిన సమయము దగ్గఱ పడుచున్నది. ఈ రాక్షసులు అధర్మముల నాచరించుచున్నారు. ఆ పాపఫలము అనుభవించు సమయము తొందరలో రాగలదు.

మాంసభోజనులైన ఈ రాక్షసులకు ధర్మాధర్మపరిజ్ఞానము లేదు. తన మాట వినని నన్ను రావణుడు ప్రాతఃకాలపు భోజనముగ తినివేయగలడు. పద్మదళాయతాక్షుడైన శ్రీరాముని చూడకుండ దుఃఖసాగరమున మునిగి ఉన్న నేను ఎటుల కాలముగడపగలను? ఇచ్చట నెవరైన విషమిచ్చినచో అది త్రాగి రాముడు లేకుండగనే యమలోకమునకు పోవుట సంభవమై యుండును.

ఆ రామచంద్రుడు నేను జీవించి ఉన్నట్లు విశ్వాసము లేని వాడయ్యెనా! కావుననే సోదరునితో కలిసి నన్ను అన్వేషించుట మానినాడా! నా వియోగదుఃఖముతో ఆ లక్ష్మణాగ్రజుడు దేహమును విడిచి ఈ భూలోకమును విడిచిపోయెనా! లోకాంతరగతుడై నా భర్తను సేవించుకొను భాగ్య మబ్బిన ఆ దేవతలు, గంధర్వులు. సిద్ధులు. మహర్షులు ఎంత అదృష్టవంతులో, పురుషార్థములలో ధర్మమును ఆదరించిన ధర్మాత్ముడు రాజర్షియగు రామచంద్రునకు నాతో ఏమి పని?

లోకములో సామాన్యజనులకు దృష్టిపథమున తిరుగుచున్న వారి యందు ప్రీతి మెండుగ నుండును. దృష్టి పథమునకు దూరమైనచో ఆ ప్రీతియు సౌహార్దమును తఱిగిపోవుట సంభవము. ఇది కృతఘ్నుల

స్వభావము. కాని శ్రీరాముడు కృతజ్ఞులలో పరిగణింపబడినవాడు కానీ, కృతఘ్నులలో కాదు. నేను గుణహీనురాలనా, భాగ్యహీనురాలనా, రామునికి దూరమై ఇట్టి దురవస్థలను అనుభవింపవలసి వచ్చుచున్నది. సచ్చరిత్రుడు అక్రూరుడు, శత్రునిఘూదనుడు అగు రామచంద్రునకు దూరమై జీవించుట కంటె నాకు మరణమే మేలు.

ఒక వేళ అరణ్యవాసము చేయుచున్న రామలక్ష్మణులు ఇరువురును అరణ్యములో కంద, మూల, ఫలములను తినుచు అస్త్ర, శస్త్రములను విడిచి ఉండిరా! లేక మాయావి అగు ఈ రాక్షసుడు ఏదో మాయచేసి రామలక్ష్మణుల నిద్దరిని చంపియుండునా! ఇట్టి చెడ్డకాలమున నేను బ్రతికి యుండుట కంటె మరణించి యుండుట మేలు. ఇంతటి కష్టములో నున్నను నాకు మరణము కూడ లభించుట లేదు.

ప్రియాప్రియముల నెఱుగని జితేంద్రియులైన మహాత్ములగు మునులు ఎంతటి ధన్యులో ! అప్రియము వలన భయము కలుగుచుండును. ప్రియవియోగము వలన దుఃఖము కలుగుచుండును. ఈ ప్రియాప్రియములకు దూరమైన జితేంద్రియులకు ఆ మహాత్ములకు నా నమస్కారములు. నా స్వరూపము, నా స్వభావము చక్కగ తెలిసిన రామచంద్రునిచే ఉపేక్షింపబడి ఈ రావణుని చెరలో పడియున్నాను. నేను జీవించి ఉండి ఏమి ప్రయోజనము?



# 27. సప్తవింశ స్సర్గః

ఇత్యుక్తా స్సీతయా ఘోరా రాక్షస్యః క్రోధమూర్ఛితాః,
కా శ్చి జ్జగ్ము స్త దాఖ్యాతుం రావణస్య తరస్వినః. 1

తత స్సీతా ముపాగమ్య రాక్షస్యో ఘోరదర్శనాః,
పునః పరుష మేకార్థ మనర్థార్థ మ థాబ్రువన్. 2

అ ద్యేదానీం త వానార్యే సీతే పాపవినిశ్చయే,
రాక్షస్యో భక్షయిష్యన్తి మాంస మేత ద్యథాసుఖమ్. 3

సీతాం తాభి రనార్యాభి ర్దృష్ట్వా సంతర్జితాం తదా,
రాక్షసీ త్రిజటా వృద్ధా శయానా వాక్య మబ్రవీత్. 4

ఆత్మానం ఖాదతా నార్యా న సీతాం భక్షయిష్యథ,
జనకస్య సుతా మిష్టాం స్నుషాం దశరథస్య చ. 5

స్వప్నో హ్యద్య మయా దృష్టో దారుణో రోమహర్షణః,
రాక్షసానా మభావాయ భర్తు రస్యా జయాయ చ. 6

ఏవ ముక్తా స్త్రిజటయా రాక్షస్యః క్రోధమూర్ఛితాః,
సర్వా ఏవ బ్రువన్ భీతా స్త్రిజటాం తా మిదం వచః. 7

కథయస్వ త్వయా దృష్ట స్స్వప్నోఽయం కీదృశో నిశి,
తాసాం శ్రుత్వా తు వచనం రాక్షసీనాం ముఖాచ్చ్యుతమ్. 8

ఉవాచ వచనం కాలే త్రిజటా స్వప్నసంశ్రితమ్,
జగదన్తమయీం దివ్యాం శిబికా మన్తరిక్షగామ్. 9

యుక్తాం హంససహస్రేణ స్వయ మాస్థాయ రాఘవః,
శుక్లమాల్యామ్బరధరో లక్ష్మణేన సహాగతః. 10

స్వప్నే చాద్య మయా దృష్టా సీతా శుక్లామ్బరావృతా,
సాగరేణ పరిక్షిప్తం శ్వేతం పర్వత మాస్థితా. 11

రామేణ సఙ్గతా సీతా భాస్కరేణ ప్రభా యథా,
రాఘవశ్చ మయా దృష్ట శ్చతుర్దన్తం మహాగజమ్,
ఆరూఢ శ్శైలసఙ్కాశం చచార సహ లక్ష్మణః. 12

తత స్తౌ నరశార్దూలౌ దీప్యమానౌ స్వతేజసా,
శుక్లమాల్యామ్బరధరౌ జానకీం పర్యుపస్థితౌ. 13

తత స్తస్య నగస్యాగ్రే హ్యాకాశస్థస్య దన్తినః,
భర్త్రా పరిగృహీతస్య జానకీ స్కన్ధమాశ్రితా. 14

భర్తు రఙ్కా త్సముత్పత్య తతః కమలలోచనా,
చన్ద్రసూర్యౌ మయా దృష్టా పాణినా పరిమార్జతీ. 15

తత స్తాభ్యాం కుమారాభ్యా మాస్థిత స్స గజోత్తమః,
సీతయా చ విశాలాక్ష్యా లఙ్కాయా ఉపరి స్థితః. 16

పాణ్డురర్షభ యుక్తేన రథే నాష్టయుజా స్వయమ్,
ఇ హోపయాతః కాకుత్స్థ స్సీతయాసహ భార్యయా. 17

లక్ష్మణేనసహ భ్రాత్రా సీతయా సహ వీర్యవాన్,
ఆరుహ్య పుష్పకం దివ్యం విమానం సూర్యసన్నిభమ్. 18

ఉత్తరాం దిశ మాలోక్య జగామ పురుషోత్తమః. 19

ఏవం స్వప్నే మయా దృష్టో రామో విష్ణుపరాక్రమః,
లక్ష్మణేనసహ భ్రాత్రా సీతయాసహ రాఘవః. 20

న హి రామో మహాతేజా శ్శక్యో జేతుం సురాసురైః,
రాక్షసై ర్వాపి చాన్యై ర్వా స్వర్గః పాపజనై రివ. 21

రావణశ్చ మయా దృష్టః క్షితౌ తైల సముక్షితః,
రక్తవాసాః పిబ న్మత్తః కరవీరకృతస్రజః. 22

విమానా త్పుష్పకా దద్య రావణః పతితో భువి,
కృష్యమాణః స్త్రియా దృష్టో ముణ్డః కృష్ణామ్బరః పునః23

రథేన ఖరయుక్తేన రక్తమాల్యానులేపనః,
పిబం స్తైలం హస న్నృత్య౯ భ్రాన్తచి త్తాకులేన్ద్రియః. 24

గర్దభేన యయౌ శీఘ్రం దక్షిణాం దిశ మాస్థితః,
పున రేవ మయా దృష్టో రావణో రాక్షసేశ్వరః. 25

పతితోఽవాక్శిరా భూమౌ గర్దభా ద్భయమోహితః,
సహ సోత్థాయ సంభ్రాన్తో భయార్తో మదవిహ్వలః. 26

ఉన్మత్త ఇవ దిగ్వాసా దుర్వాక్యం ప్రలప న్బహు,
దుర్గన్ధం దుస్సహం ఘోరం తిమిరం నరకోపమమ్. 27

మలపఙ్కం ప్రవి శ్యాశు మగ్న స్తత్ర స రావణః,
కణ్ఠే బద్ధ్వా దశగ్రీవం ప్రమదా రక్తవాసినీ. 28

కాళీ కర్దమలిప్తాఙ్గీ దిశం యామ్యాం ప్రకర్షతి,
ఏవం తత్ర మయా దృష్టః కుమ్భకర్ణో నిశాచరః. 29

రావణస్య సుతా స్సర్వే దృష్టా స్తైలసముక్షితాః,
వరాహేణ దశగ్రీవ శ్శింశుమారేణ చేన్ద్రజిత్. 30

ఉష్ట్రేణ కుమ్భకర్ణశ్చ ప్రయాతా దక్షిణాం దిశమ్,
ఏక స్తత్ర మయా దృష్ట శ్శ్వేతచ్ఛత్రో విభీషణః. 31

శుక్లమాల్యామ్బరధర శ్శుక్లగన్ధానులేపనః,
శఙ్ఖదున్దుభినిర్ఘోషై ర్నృత్తగీతై రలఙ్కృతః. 32

ఆరుహ్య శైలసఙ్కాశం మేఘస్తనితనిస్స్వనమ్,
చతుర్దన్తం గజం దివ్య మాస్తే తత్ర విభీషణః. 33

చతుర్భి స్సచివై స్సార్ధం వైహాయస ముపస్థితః,
సమాజశ్చ మయా దృష్టో గీతవాదిత్రనిస్స్వనః. 34

పిబతాం రక్తమాల్యానాం రక్షసాం రక్తవాససామ్,
లఙ్కా చేయం పురీ రమ్యా స వాజిరథకుఞ్జరా. 35

సాగరే పతితా దృష్టా భగ్న గోపుర తోరణా,
లఙ్కా దృష్టా మయా స్వప్నే రావణే నాభిరక్షితా. 36

దగ్ధా రామస్య దూతేన వానరేణ తరస్వినా,
పీత్వా తైలం ప్రనృత్తాశ్చ ప్రహసన్తో మహాస్వనాః. 37

లఙ్కాయాం భస్మరూక్షాయాం ప్రవిష్టా రాక్షసస్త్రియః,
కుమ్భకర్ణాదయ శ్చేమే సర్వే రాక్షసపుఙ్గవాః. 38

రక్తం నివసనం గృహ్యా ప్రవిష్టా గోమయహ్రదే,
అపగచ్ఛత నశ్యధ్వం సీతా మాప స రాఘవః. 39

ఘాతయే త్పరమామర్షీ సర్వై స్సార్థం హి రాక్షసైః,
ప్రియాం బహుమతాం భార్యాం వనవాస మనుప్రతామ్. 40

భర్త్సితాం తర్జితాం వాపి నానుమంస్యతి రాఘవః,
త దలం క్రూరవాక్యై ర్వ స్సాన్త్వ మేవాభిధీయతామ్. 41

అభియాచామ వైదేహీ మేతద్ధి మమ రోచతే,
యస్యా మేవంవిధ స్స్వప్నో దుఃఖితాయాం ప్రదృశ్యతే. 42

సా దుఃఖై ర్వివిధై ర్ముక్తా ప్రియం ప్రాప్నో త్యనుత్తమమ్,
భర్త్సితా మపి యాచధ్వం రాక్షస్యః కిం వివక్షయా. 43

రాఘవాద్ధి భయం ఘోరం రాక్షసానా ముపస్థితమ్,
ప్రణిపాతప్రసన్నా హి మైథిలీ జనకాత్మజా. 44

అల మేషా పరిత్రాతుం రాక్షస్యో మహతో భయాత్,
అపి చాస్యా విశాలాక్ష్యా న కించి దుపలక్షయే. 45

విరూప మపి చాఙ్గేషు సుసూక్ష్మ మపి లక్షణమ్,
ఛాయా వైగుణ్యమాత్రం తు శంకే దుఃఖ ముపస్థితామ్. 46

అదుఃఖార్హా మిమాం దేవీం వైహాయస ముపస్థితామ్,
అర్థసిద్ధిం తు వైదేహ్యాః పశ్యా మ్యహ ముపస్థితామ్. 47

రాక్షసేన్ద్రవినాశం చ విజయం రాఘవస్య చ,
నిమిత్తభూత మేతత్తు శ్రోతు మస్యా మహత్ప్రియమ్. 48

ధృశ్యతే చ స్ఫురచ్చక్షుః పద్మపత్ర మి వాయతమ్,
ఈష చ్చ హృషితో వాస్యా దక్షిణాయా హ్యదక్షిణః. 49

అకస్మాదేవ వైదేహ్యా బాహు రేకః ప్రకమ్పతే,
కరేణుహస్తప్రతిమ స్సవ్య శ్చోరు రనుత్తమః. 50

పక్షీ చ శాఖానిలయం ప్రవిష్టః,
పునఃపున శ్చోత్తమ సాన్త్వవాదీ,
సుస్వాగతాం వాచ ముదీరయానః,
పునఃపున శ్చోదయతీవ హృష్టః. 51

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, వాల్మీకీయే,
చతుర్వింశత్సహస్రికాయాం, సంహితాయాం,
శ్రీమత్సున్దరకాణ్డే సప్తవింశ స్సర్గః.

## శ్రీమద్రామాయణ మాహాత్మ్యమ్

శ్లో. ప్రదద్యా ద్గురవే దివ్యాం భోజయే ద్బ్రాహ్మణానథ,
ఐహికాముష్మికీ సిద్ధీ లభతే నాత్ర సంశయః.

శ్లో. దేహావసానే ప్రాప్నోతి తద్విష్ణోః పరమం పదమ్,
శ్రీరామ చరణా మ్బోజ శరణాగతి తత్పరః.

 

## 27వ సర్గము

సీతాదేవి అనుకొనుచున్న ఈ మాటలను విని విపరీతమైన కోపము చెందిన కొంతమంది రాక్షస స్త్రీలు ఈ సంగతిని రావణునకు తెలియజేయుటకై పోయిరి. మరికొందరు వెనుక చెప్పిన మాటలు మరల చెప్పుటకై ఉపక్రమించిరి.

సీతా! ఈ రాక్షస స్త్రీలందరు హాయిగా నిన్ను భక్షించి వేయుదురు. అని సీతాదేవిని భయపెట్టుచున్న రాక్షసస్త్రీలను చూచి విభీషణుని కొమార్తెయు సచ్చరిత్రయు అగు త్రిజట అను రాక్షస కన్యక పరుండియే వారితో ఇట్లనెను.

### త్రిజట పలుకులు

మిమ్ములను మీరే తినుండి. జనక పుత్రికయు దశరథుని ప్రియమైన కోడలు అగు ఈ సీతను తినుటకై ప్రయత్నింపవలదు. నాకు ఒక దారుణమైన స్వప్నము వచ్చినది. ఆ స్వప్నములో చూచిన విషయములను తలంచుకొన్నచో ఇప్పటికి అనగా మెలకువ వచ్చిన తరువాత కూడ ఒడలు గడుర్పొడుచుచున్నది. ఆస్వప్నవృత్తము రాక్షసులకు భయంకరమును ఈమె భర్త రామచంద్రునకు అభయంకరముగను తోచుచున్నది. అని చెప్పగనే భయపడిన ఆ రాక్షస స్త్రీలు త్రిజటతో ఆ స్వప్న వృత్తాంత మేమి? అని అడిగిరి.

### త్రిజట స్వప్నవృత్తాంతము

అప్పుడు త్రిజట స్వప్న గాథను ఇటుల చెప్పనారంభించినది. వేయి హంసలు మోయుచున్న ఏనుగుదంతముతో తయారుచేసిన పల్లకిని ఎక్కితెల్లని వస్త్రములను ధరించిన రాముడు లక్ష్మణునితో కలిసి ఆకాశమార్గమున లంకకు వచ్చెను. నా స్వప్నములో ఈ సీతయు కొండపై నిలిచి ఉన్నది. తరువాత ఆకాశమార్గమున వచ్చుచున్న

రాముని, కాంతి సూర్యుని చేరినట్లుగా చేరినది. తరువాత రామచంద్రుడు పర్వతమువలె అత్యున్నతమైన తెల్లని ఏనుగును లక్ష్మణునితో అధిరోహించి విహరించెను. తరువాత వారిరువురును సీతకు దగ్గఱగ వచ్చిరి. రాముడు ఆరోహించిన గజమును సీతయు ఆరోహించెను. భర్త సన్నిధిలో సీత చంద్రసూర్యులను తన హస్తమున మార్జనము చేయుచున్నట్లు కానవచ్చెను. ఆ తరువాత సీతారాములు లక్ష్మణుడు తెల్లని ఎద్దులను కట్టిన శకటముపై ఈ లంకకు వచ్చిరి. ఆ తరువాత సూర్య సమాన కాంతి కల్గిన దివ్యమగు పుష్పక విమానమును ఆరోహించి ఉత్తర దిక్కునకు వెడలిపోయిరి.

ఈ విధముగ సీతతో, లక్ష్మణునితో పురుషోత్తముడగు రాముడు ఉత్తర దిక్కునకు వెళ్ళినట్లుగా కల వచ్చినది. పాపాత్ములకు స్వర్గము దుర్లభమగునట్లు శ్రీరాముని గెలుచుట దేవతలకు గాని, రాక్షసులకు గాని సాధ్యము కాదు. మఱియొక విషయము. రావణుడు దేహమునకు నూనె రాచుకొని ఎఱ్ఱని వస్త్రము ధరించి కరవీర పుష్పముల మాలికలు ధరించి పుష్పకవిమానమునుండి క్రిందకు జారిపడి ఒక స్త్రీచే ఈడ్వబడు చున్నట్లు కనబడెను. మరియు నల్లని వస్త్రములు ఎఱ్ఱని మాలికలను ఎఱ్ఱని చందనమును ధరించి నూనెను త్రాగుచు నవ్వుచు గంతులు వేయుచు వ్యాకులమైన చిత్తవృత్తులు కల్గి గాడిదను ఎక్కి దక్షిణ దిక్కునకు ప్రయాణమై పోయెను.

మరల ఆ రావణుడే గాడిద మీద నుండి తలక్రిందులుగా క్రిందకు పడెను. మరల తొందరగా లేచి భయము మత్తు పీడక పిచ్చివానివలె దిగంబరుడై ఏవో ఏవో చెడ్డ మాటలను నోటికి వచ్చునట్లు వాగుచు దుర్గంధభూయిష్ఠమైన మహానరకము వంటి బురదలో పడి మునిగిపోయెను. అట్టి రావణుని మెడకు త్రాడుకట్టి ఎఱ్ఱని

వస్త్రములను ధరించిన ఒక నల్లని స్త్రీ దక్షిణ దిక్కునకు ఈడ్చుకొని పోవుచుండెను.

కుంభకర్ణుడు కూడ రావణుని వలెనే దురవస్థల పాలై కనబడెను. రావణుని కుమారులు కూడ శరీరమునకు నూనె రాసికొని కనబడిరి. రావణుడు వరాహము నెక్కియు, ఇంద్రజిత్తు మొసలినెక్కియు, కుంభకర్ణుడు ఒంటె నెక్కియు దక్షిణదిక్కునకు పోయిరి.

విభీషణుడు మాత్రము అట్లుకాక శ్వేతచ్ఛత్రము కల్గి, తెల్లని మాలలు, వస్త్రము ధరించి, తెల్లని గంధమును పూసికొని శంఖములు, దుందుభులు మ్రోగుచుండగా నర్తకులు నృత్యము చేయుచుండగా గాయకులు పాడుచుండగా నాల్గు దంతములు కల్గిన పర్వత సన్నిభమయిన తెల్లని ఏనుగులు ఆరోహించి నల్గురు మంత్రులతో ఆకాశమున నిల్చిఉన్నట్లు కనబడెను. రాక్షసులందరు ఎఱ్ఱని వస్త్రములు ధరించి ఎఱ్ఱని మాలికలను ధరించి మద్యపానము చేయుచు కానవచ్చిరి.

ఈ లంక అంతయు రాముని దూత అగు వానరునిచే కాల్పబడి గోపురములు తోరణములు భగ్నమై సముద్రమున కలిసినట్లు కనబడినది. భస్మావశేషమయిన ఈ లంకలో రాక్షస స్త్రీలందఱు త్రాగి గంతులు వేయుచు వికటాట్టహాసము చేయుచు కానవచ్చిరి.

ఓ రాక్షసులారా కనబడకుండ పొండు. సీత సన్నిధికి రాముడు తప్పక వచ్చును. సీత తప్పక రాముని చేరగలదు. తనకు ప్రీతిపాత్రమై రాజభవనమును సమస్త భోగములను విడిచి తన వెంట అరణ్యా వాసమునకు వచ్చిన సీతను మీరు మీ చేష్టల చేకాని, మాటలచే కాని ఏ మాత్రము బాధించినను సహింపక రాముడు రాక్షసులతోపాటు మిమ్ములను కూడ చంపివేయును. మీరు ఏమైనను చెప్పదలచు

కొన్నచో పరుషములు పలుకక, భయపెట్టు మృదువైన మాటలతో నచ్చచెప్పవచ్చును. ఇంతకంటె నా దృష్టిలో సీత సన్నిధిలో క్షమాపణ కోరుకొనుట మంచిది.

ఎవరి విషయమున స్వప్నములో ఇటువంటి సంఘటనలు కానవచ్చునో వారికి దుఃఖములు తొలగి శుభములు లభించును.

రాక్షసులందరకును గొప్ప ఆపద రాబోవుచున్నది. నీవు ఎంత తిట్టినను, ఎంత బెదరించినను, నమస్కరించినంత మాత్రమునకే ఈ సీతాదేవి ప్రసన్నురాలగును. ఆమె ఒక్కతెయే రాక్షసులను ఈ మహాభయమునుండి రక్షింపగలదు.

సాముద్రిక దృష్టితో చూచినను ఆమె దేహమున ఎట్టి వైరూప్యము కానరాదు. కొలదిగా కాంతి వైకల్యమే కనబడుచున్నది. సీత కోరుకొనుచున్న భర్త సాన్నిధ్యము ఆమెకు లభించును. రాముడు జయించును. రావణుడు మరణించును.

సీతాదేవికి శుభ శకునములు కానవచ్చుచున్నవి. పద్మము వంటి ఆమె ఎడమ కన్ను అదరుచున్నది. ఆమె ఎడమ బాహువు కంపించుచున్నది. ఎడమ తొడయు కంపించుచున్నది. ఈ మూడును ఆమెకు శుభ నిమిత్తములు. శుభము కల్గునని సూచించుచున్నవి. పక్షులను చెట్టుకొమ్మపై కూర్చుండి ఆనందముతో మాటిమాటికి సాంత్వన వచనములు పలుకుచున్నవి. ఆత్మీయుల ఆగమనమును సూచించుచున్నవి.



# ౨౮. అష్టావింశ స్సర్గః

సా రాక్షసేన్ద్రస్య వచో నిశమ్య
తద్రావణ స్యాప్రియ మప్రియార్తా,
సీతా వితత్రాస యథా వనాన్తే
సింహాభిపన్నా గజరాజకన్యా. 1

సా రాక్షసీమధ్యగతా చ భీరు
ర్వాగ్భి ర్భృశం రావణతర్జితా చ,
కాన్తారమధ్యే విజనే విసృష్టా
బాలేవ కన్యా విలలాప సీతా. 2

సత్యం బ తేదం ప్రవదన్తి లోకే
నాకాలమృత్యు ర్భవతీతి సన్తః,
య త్రాహ మేవం పరిభర్త్స్యమానా
జీవామి కించిత్ క్షణ మ ప్యపుణ్యా. 3

సుఖా ద్విహీనం బహుదుఃఖపూర్ణ
మిదం తు నూనం హృదయం స్థిరం మే,
విశీర్యతే య న్న సహస్రధాఽద్య
వజ్రాహతం శృఙ్గ మివాఽచలస్య. 4

నైవాస్తి దోషో మమ నూన మత్ర
వధ్యాహ మస్యాఽప్రియదర్శనస్య,
భావం న చాస్యా హ మనుప్రదాతు
మలం ద్విజో మన్త్ర మి వాద్విజాయ. 5

నూనం మమాజ్ఞా న్యచిరా దనార్య
శ్శస్త్రై శ్శితై శ్ఛేత్స్యతి రాక్షసేన్ద్రః,
తస్మి న్ననాగచ్ఛతి లోకనాథే
గర్భస్థజన్తో రివ శల్యకృన్తః. 6

దుఃఖం బతేదం మమ దుఃఖితాయా
మాసౌ చిరా యాధిగమిష్యతో ద్వౌ,
బద్ధస్య వధ్యస్య తథా నిశాన్తే
రాజాపరాధా దివ తస్కరస్య. 7

హా రామ హా లక్ష్మణ హా సుమిత్రే
హా రామమాత స్సహ మే జనన్యా,
ఏషా విపద్యా మ్యహ మల్పభాగ్యా
మహార్ణవే నౌరివ మూఢవాతా. 8

తరస్వినౌ ధారయతా మృగస్య
సత్త్వేన రూపం మనుజేన్ద్రపుత్రౌ,
నూనం విశస్తౌ మమకారణా త్తౌ
సింహర్షభౌ ద్వావివ వైద్యుతేన. 9

నూనం స కాలో మృగరూపధారీ
మా మల్పభాగ్యాం లులుభే తదానీమ్,
య త్రార్యపుత్రం విససర్జ మూఢా
రామానుజం లక్ష్మణపూర్వజం చ. 10

హా రామ సత్యవ్రత దీర్ఘబాహో
హా పూర్ణచన్ద్రప్రతిమానవక్త్ర,
హా జీవలోకస్య హితః ప్రియశ్చ
వధ్యాం న మాం వేత్సి హి రాక్షసానామ్. 11

అనన్యదైవత్వ మియం క్షమా చ
భూమౌ చ శయ్యా నియమశ్చ ధర్మే,
పతివ్రతాత్వం విఫలం మ మేదం
కృతం కృతఘ్నే ష్వివ మానుషాణామ్. 12

మోఘో హి ధర్మ శ్చరితో మయాఽయం
తథైకపత్నీత్వ మిదం నిరర్థమ్,
యా త్వాం న పశ్యామి కృశా వివర్ణా
హీనా త్వయా సఙ్గమనే నిరాశా. 13

పితు ర్నిదేశం నియమేన కృత్వా
వనా న్నివృత్త శ్చరితవ్రతశ్చ,
స్త్రీభిస్తు మన్యే విపులేక్షణాభి
స్త్వం రంస్యసే వీతభయః కృతార్థః. 14

అహం తు రామ త్వయి జాతకామా
చిరం వినాశాయ నిబద్ధభావా,
మోఘం చరిత్వా చ తపోవ్రతం చ
త్యక్ష్యామి ధిగ్జీవిత మల్పభాగ్యా. 15

సా జీవితం క్షిప్ర మహం త్యజేయమ్
విషేణ శస్త్రేణ శితేన వాపి,
విషస్య దాతా న హి మేఽస్తి కశ్చి
చ్ఛస్త్రస్య వా వేశ్మని రాక్షసస్య. 16

ఇతీవ దేవీ బహుధా విలప్య
సర్వాత్మనా రామ మనుస్మరన్తీ,
ప్రవేపమానా పరిశుష్కవక్త్రా
నగోత్తమం పుష్పిత మాససాద. 17

శోకాభితప్తా బహుధా విచిన్త్య
సీతాఽథ వేణ్యుద్గ్రథనం గృహీత్వా,
ఉద్బధ్య వేణ్యుద్గ్రథనేన శీఘ్ర
మహం గమిష్యామి యమస్య మూలమ్. 18

ఉపస్థితా సా మృదుసర్వగాత్రీ
శాఖాం గృహీత్వాథ నగస్య తస్య,
తస్యాస్తు రామం ప్రవిచిన్తయన్త్యా
రామానుజం స్వం చ కులం శుభాఙ్గ్యాః. 19

శోకా నిమిత్తాని తథా బహూని
ధైర్యార్జితాని ప్రవరాణి లోకే,
ప్రాదు ర్నిమిత్తాని తదా బభూవుః
పురాపి సిద్ధా న్యుపలక్షితాని. 20

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, వాల్మీకీయే,
చతుర్వింశత్సహస్రికాయాం, సంహితాయాం,
శ్రీమత్సున్దరకాణ్డే, అష్టావింశ స్సర్గః.

## శ్రీమద్రామాయణ మాహాత్మ్యమ్

శ్లో. అత్రాచార్యో భవేద్దేవి నాన్య స్సంకీర్ణ ధర్మవాన్,
శ్రీరామాయణ సారజ్ఞః శ్రీరామార్చన తత్పరః.

శ్లో. అత్రాచార్యశ్చ శిష్యశ్చ భవేన్నా న్యపరాయణః,
విష్ణోర్నామాం సహస్రస్య పఠనం కురు సర్వదా.

 

## 28వ సర్గము

### సీతరాముని రామికి అనేకవిధముల పరితపించుట

రాక్షసాధిపతియగు రావణుని ఆ అప్రియములగు మాటలను విని తలంచుకొని సీత సింహముచే నాక్రాంతమగు గజరాజ కన్యవలె మిక్కిలి భయపడెను. రావణుని మాటలకు భయపడినదై జనర హితమైన ఆ అశోక వనములో రాక్షస మధ్యగతమైన ఆ జానకి పసిబిడ్డవలె మిక్కిలి విలపించెను.

లోకములో సమయముకాని సమయమున ఎవ్వరికిని మృత్యువు రాదు అనుమాట యథార్థముగనే తోచుచున్నది. పాపాత్మురాలనగు నేను ఈ లంకలో ఈ రాక్షస స్త్రీల మధ్య ఇన్ని బాధలుపడుచు బ్రతికి యున్నాను గదా. సుఖములకు దూరమై దుఃఖములతో నిండియున్న నా మనసు వజ్రపాతమునకు గుఱి అయిన కొండవలె ఛిన్నమై భిన్నమై ఉండిపోవలసినదే. అట్లు ఎట్లు కాలేదో. నా దోషము ఏమిలేక పోయినను ఈ రాక్షసునకు నేను హంతవ్యురాలనైతిని. అయినను ద్విజుడుకాని వానికి మంత్రమువలె నా మనసు నాతనికి సమర్పింప జాలను. సమయములో శ్రీరామచంద్రుడు ఇచ్చుటకి రానిచో శస్త్ర చికిత్సచేయువాడు గర్భస్థ శిశువును ముక్కలుగా కోసినట్లు రాజవిషయమున అపచారపడి బద్ధుడై మఱునాడు ఉదయమున మరణదండనము అనుభవింపవలసిన వాని దుస్థితి వలె ఉన్నది నా దుస్థితి. రావణుడు పెట్టిన గడువు గడచిపోవుచున్నది.

రామచంద్రా! లక్ష్మణా! ఓ సుమిత్రాదేవీ. ఓ కౌసల్యా దేవీ తల్లీ వసుంధరాదేవీ! మహావాయువునకు సముద్రమున తిరుగబడిన

నౌకవలె హీనపుణ్యనగు నేను పెద్ద ఆపదలో పడి ఉన్నాను. మృగ రూపమును ధరించిన ఒకానొక ప్రాణిచే మహాబలసంపన్నులైన రామలక్ష్మణులు నాకారణమున జంట సింహములు జంట వృషభములు పిడుగు పాటుచే నేలకూలినట్లు బాధితులై ఉండవచ్చును. మృత్యువే మృగ రూపమును ధరించి దురదృష్ట వంతురాలనైన నా మనసున ఆశ పుట్టించినది. మూఢురాలనైన నేను వెనుకముందులు గమనింపక రామలక్ష్మణులను దూరము చేసికొంటిని. పూర్ణచంద్రుని వంటి ముఖసౌందర్యము కల్గి ఆజానుబాహువైన ఓ రామచంద్రా! నీవు నిరంతరము లోకమునకు హితమును ప్రియమును ఆచరించుచుందువు.

ఈ రాక్షసులు నన్ను చంపదలంచుట నీవెఱుగవా. రామచంద్రా నీవే దైవమని నమ్మియున్నాను. ఎన్ని కష్టములు వచ్చినను ఓరిమి వహించిఉన్నాను. కటిక నేలపై శయనించుచున్నాను. ఎన్నో నియమములను పాటించుచున్నాను. పాతివ్రత్య ధర్మములు ఆచరించుచున్నాను. ఇంత చేసినను కృతఘ్నుల విషయమున చేసిన ఉపకారము వలె నేను ఆచరించిన ధర్మములన్నియు అనుకూల ఫలముల నీయక నిరర్థకములగుచున్నవేమి? నీ వియోగముతో కృశించిన దాననై దేహకాంతియు తఱిగి నిన్ను చేరగలనన్న ఆశయు మిగులక ఉన్నాను. నీ తండ్రి యగు దశరథుని ఆజ్ఞను పాటించి అరణ్యమునుండి తిరిగి వచ్చిన నీకు ఎందరో స్త్రీలు ఆనందముగా ఉపచారము చేయగలరు. పిత్రాజ్ఞా పరిపాలనముచే నీవును

నిర్భయముగా ఆనందముగా జీవితము కొనసాగింపగలవు. నేను మాత్రము నీ యందే మనస్సు కల్గి పూర్వజన్మ సుకృతమేమియు లేక ఈ జన్మములో ఆచరించిన వ్రత సుకృతాదులు వెనువెంటనే ఫలించునవి కాకుండుటయే ఇట్టి దురవస్థల పాలై యుంటిని. ఈ రాక్షసావాసమున విషము త్రాగి కాని, కత్తితో ఖండించుకొని కాని మరణింపదలంచినను ఆ విషమును, ఖడ్గమును ఇచ్చువారెవరును ఇచట కానరారు.

## సీతా మరణ ప్రయత్నము

శోకవేగము పెరిగి మిక్కిలి విలపించి సర్వవిధముల రామునే తలంచుకొనుచు గజగజ వణకి పోవుచు వాడిపోయిన ముఖముతో చక్కగా పూచి ఉన్న శింశుపావృక్షము వద్దకు చేరెను. దుఃఖ పూర్ణురాలగు ఆ సీత మరణ సాధనమగు విషముకాని శస్త్రము కాని ఏదియు లభింపనందున తన శిరోజములనే శింశుపావృక్షపు కొమ్మ మీదుగా రానిచ్చి మెడకు చుట్టుకొని వ్రేలాడి మరణింపదలంచెను. రామచంద్రుని తలంచుచు తమ వంశ గౌరవములను తలంచు కొనుచున్న సీతకు శుభశకునములు కొన్ని కావవచ్చెను.



# 29. ఏకోనత్రింశ స్సర్గః

తథా గతాం తాం వ్యథితా మనిన్దితాం
వ్యపేతహర్షాం పరిదీనమానసామ్,
శుభాం నిమిత్తాని శుభాని భేజిరే
నరం శ్రియా జుష్ట మివోపజీవినః. 1

తస్యా శ్శుభం వామ మరాళపక్ష్మ
రాజీవృతం కృష్ణవిశాలశుక్లమ్,
ప్రాస్పన్ద తైకం నయనం సుకేశ్యా
మీనాహతం పద్మ మి వాభితామ్రమ్. 2

భుజశ్చ చార్వఞ్చిత పీనవృత్తః
పరార్ధ్యకాలాగరుచన్దనార్హః,
అనుత్తమే నాధ్యుషితః ప్రియేణ
చిరేణ వామ స్సమవేపతాఽశు. 3

గజేన్ద్రహస్తప్రతిమశ్చ పీన
స్తయో ర్ద్వయో స్సంహతయో స్సుజాతః,
ప్రస్పన్దమానః పున రూరు రస్యా
రామం పురస్తాత్ స్థిత మాచచక్షే. 4

శుభం పున ర్హేమసమానవర్ణ
మీష ద్రజోధ్వస్త మి వామలాక్ష్యాః,
వాస స్స్థితాయా శ్శిఖరాగ్రదత్యాః
కించి త్పరిస్రంసత చారుగాత్ర్యాః. 5

ఏతై ర్నిమిత్తై రపరైశ్చ సుభ్రూ
స్సంబోధితా ప్రాగపి సాధుసిద్ధైః,
వాతాతపక్లాన్త మివ ప్రణష్టం
వర్షేణ బీజం ప్రతిసంజహర్ష. 6

తస్యాః పున ర్బిమ్బఫలాధరోష్ఠం
స్వక్షిభ్రుకేశాంత మరాళపక్ష్మ,
వక్త్రం బభాసే సితశుక్లదంష్ట్రం
రాహో ర్ముఖా చ్చన్ద్ర ఇవ ప్రముక్తః. 7

సా వీతశోకా వ్యపనీతతన్ద్రీ
శాన్తజ్వరా హర్షవివృద్ధసత్త్వా,
అశోభ తార్యా వదనేన శుక్లే
శీతాంశునా రాత్రి రి వోదితేన. 8

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, వాల్మీకీయే,
చతుర్వింశత్సహస్రికాయాం, సంహితాయాం,
శ్రీమత్సున్దరకాణ్డే, ఏకోనత్రింశ స్సర్గః.

## 29వ సర్గము

### సీత శుభ శకునములను గాంచుట

ఈ రీతిగ దుఃఖమును అనుభవించుచు హర్షమునకు దూరమై దైన్యముతో నిండియున్న సీతకు మరల భాగ్యదశనొందిన మనుష్యుని ఒకప్పుడు విడిచిపోయిన పరిచారకులు (జీతగాండ్రు) ఆశ్రయించినట్లు శుభశకునములు కనబడసాగెను.

సీతాదేవి ఎడమ కన్ను మీన సంచారముచే కదలిన తామరపువ్వు వలె సుందరమైన శ్రేష్ఠమైన ఒకప్పుడు అగరుచందనాది లేపనములకు అర్హమైన ఆమె ఎడమ బాహువు అదరజొచ్చెను. గజేంద్ర హస్త సదృశమైన ఆమె ఎడమ ఊరువును (తొడ) కంపించుచు శ్రీరామచంద్రుడు తొందరగా వచ్చి సీత ఎదుట నిలిచి ఉండబోవునట్లు కనిపించెను. బంగారు రంగు కల్గిన కొలదిగ మాసి ఉన్న ఆమె కట్టుకొని ఉన్న వస్త్రము కొలదిగ శిథిలమై తొందరలో భర్తృ సమాగమము కల్గబోవుచున్నట్లు సూచించెను.

ఇటువంటి శుభశకునములచేత కొలది కాలము వియోగానంతరము భర్తసమాగమము లభించునని చెప్పిన మాట గాలిచే, ఎండచే శోషిల్లిన బీజము వర్షముచే ప్రఫుల్లమైనట్లుగా ఆమెయు దైన్యము విడిచి సంతుష్టురాలయ్యెను. బింబఫలము వంటి అధరము చక్కని నేత్రములు మంచి కనుబొమ్మలు ఆరాళ పక్ష్మములు కలిగి తెల్లని పలువరుసలు కల్గిన ఆమె ముఖము గ్రహణము వీడిన చంద్రబింబము వలె ప్రకాశించినది.

ఆమె. శోకమును విడిచి జడత్వమును విడిచి వికసిత మనస్కమై సంతోషవంతమైన ముఖముతో శుక్ల పక్ష చంద్రునిచే రాత్రివలె ప్రకాశించెను.



## ౩౦. త్రింశ స్సర్గః

హనుమానపి విక్రాన్త స్సర్వం శుశ్రావ తత్త్వతః,
సీతాయా స్త్రిజటాయాశ్చ రాక్షసీనాం చ తర్జనమ్. 1

అవేక్షమాణ స్తాం దేవీం దేవతామివ నన్దనే,
తతో బహువిధాం చిన్తాం చిన్తయామాస వానరః. 2

యాం కపీనాం సహస్రాణి సుబహూ న్యయుతాని చ
దిక్షు సర్వాసు మార్గన్తే సేయ మాసాదితా మయా. 3

చారేణ తు సుయుక్తేన శత్రో శ్శక్తి మవేక్షతా,
గూఢేన చరతా తావ దవేక్షిత మిదం మయా. 4

రాక్షసానాం విశేషశ్చ పురీ చేయ మవేక్షితా,
రాక్షసాధిపతే రస్య ప్రభావో రావణస్య చ. 5

యుక్తం తస్యాప్రమేయస్య సర్వసత్త్వదయావతః,
సమాశ్వాసయితుం భార్యాం పతిదర్శనకాఙ్క్షిణీమ్. 6

అహ మాశ్వాసయా మ్యేనాం పూర్ణచన్ద్రనిభాననామ్,
అదృష్టదుఃఖాం దుఃఖార్తాం దుఃఖ స్యాన్త మగచ్ఛతీమ్. 7

యద్య ప్యహ మిమాం దేవీం శోకోపహతచేతనామ్,
అనాశ్వాస్య గమిష్యామి దోషవ ద్గమనం భవేత్. 8

గతే హి మయి తత్రే యం రాజపుత్రీ యశస్వినీ,
పరిత్రాణ మవిన్దన్తీ జానకీ జీవితం త్యజేత్. 9

మయా చ స మహాబాహుః పూర్ణచన్ద్రనిభాననః,
సమాశ్వాసయితుం న్యాయ్య స్సీతాదర్శనలాలసః. 10

నిశాచరీణాం ప్రత్యక్ష మన్వర్హం చాపి భాషణమ్,
కథం ను ఖలు కర్తవ్య మిదం కృచ్ఛ్రగతో హ్యహమ్. 11

అనేన రాత్రిశేషేణ యది నాశ్వాస్యతే మయా,
సర్వథా నాస్తి సన్దేహః పరిత్యక్షతి జీవితమ్. 12

రామశ్చ యది పృచ్ఛే న్మాం కిం మాం సీతాఽబ్రవీ ద్వచః,
కి మహం తం ప్రతిబ్రూయా మసంభాష్య సుమధ్యమామ్.

సీతాసన్దేశరహితం మా మిత స్త్వరయా గతమ్,
నిర్దహే దపి కాకుత్థ్సః క్రుద్ధ స్తీవ్రేణ చక్షుషా. 14

యది చోద్యోజయిష్యామి భర్తారం రామకారణాత్,
వ్యర్థ మాగమనం తస్య ససైన్యస్య భవిష్యతి. 15

అన్తరం త్వహ మాసాద్య రాక్షసీనా మిహస్థితః,
శనై రాశ్వాసయిష్యామి సన్తాపబహుళా మిమామ్. 16

అహం త్వతితనుశ్చైవ వానరశ్చ విశేషతః,
వాచం చోదాహరిష్యామి మానుషీ మిహ సంస్కృతామ్. 17

యది వాచం ప్రదాస్యామి ద్విజాతి రివ సంస్కృతామ్,
రావణం మన్యమానా మాం సీతా భీతా భవిష్యతి. 18

వానరస్య విశేషేణ కథం స్యా దభిభాషణమ్,
అవశ్యమేవ వక్తవ్యం మానుషం వాక్య మర్థవత్. 19

మయా సాన్త్వయితుం శక్యా నాన్య థేయ మనిన్దితా,
సేయ మాలోక్య మే రూపం జానకీభాషితం తథా. 20

రక్షోభి స్త్రాసితా పూర్వం భూయ స్త్రాసం గమిష్యతి,
తతో జాతపరిత్రాసా శబ్దం కుర్యా న్మనస్వినీ. 21

జానమానా విశాలాక్షీ రావణం కామరూపిణమ్,
సీతయా చ కృతే శబ్దే సహసా రాక్షసీ గణః. 22

నానాప్రహరణో ఘోర స్సమేయా దన్తకోపమః,
తతో మాం సంపరిక్షిప్య సర్వతో వికృతాననాః. 23

వధే చ గ్రహణే చైవ కుర్యు ర్యత్నం యథాబలమ్,
గృహ్య శాఖాః ప్రశాఖాశ్చ స్కన్ధాం శ్చోత్తమశాఖినామ్. 24

దృష్ట్వా విపరిధావన్తం భవేయు ర్భయశఙ్కితాః,
మమ రూపంచ సంప్రేక్ష్య వనే విచరతో మహత్. 25

రాక్షస్యో భయవిత్రస్తా భవేయు ర్వికృతాననాః,
తతః కుర్యు స్సమాహ్వానం రాక్షస్యో రక్షసా మపి. 26

రాక్షసేన్ద్రనియుక్తానాం రాక్షసేన్ద్రనివేశనే,
తే శూలశక్తినిస్త్రింశ వివిధాయుధపాణయః. 27

ఆపతేయు ర్విమర్దేఽస్మి న్వేగే నోద్విగ్నకారిణః,
సంరుద్ధ స్తైస్తు పరితో విధమ్య రక్షసాం బలమ్. 28

శక్నుయాం న తు సంప్రాప్తుం పరం పారం మహోదధేః,
మాం వా గృహ్ణీయు రాప్లుత్య బహవ శ్శీఘ్రకారిణః. 29

స్యా దియం చాగృహీతార్థా మమ చ గ్రహణం భవేత్,
హింసాభిరుచయో హింస్యు రిమాం వా జనకాత్మజామ్. 30

విపన్నం స్యా త్తతః కార్యం రామసుగ్రీవయో రిదమ్,
ఉద్దేశే నష్టమార్గేఽస్మి న్రాక్షసైః పరివారితే. 31

సాగరేణ పరిక్షిప్తే గుప్తే వసతి జానకీ,
విశస్తే వా గృహీతే వా రక్షోభి ర్మయి సంయుగే. 32

నాన్యం పశ్యామి రామస్య సాహాయ్యం కార్యసాధనే,
విమృశంశ్చ న పశ్యామి యో హతే మయి వానరః. 33

శతయోజనవిస్తీర్ణం లఙ్ఘయేత మహోదధిమ్,
కామం హన్తుం సమర్థోఽస్మి సహస్రాణ్యపి రక్షసామ్. 34

న తు శక్ష్యామి సంప్రాప్తుం పరం పారం మహోదధేః,
అసత్యాని చ యుద్ధాని సంశయో మే న రోచతే. 35

కశ్చ నిస్సంశయం కార్యం కుర్యా త్ప్రాజ్ఞ స్ససంశయమ్,
ప్రాణత్యాగశ్చ వైదేహ్యా భవే దనభిభాషణే. 36

ఏష దోషో మహా న్హి స్యా న్మమ సీతాభిభాషణే,
భూతా శ్చార్థా వినశ్యన్తి దేశకాలవిరోధితాః. 37

విక్లబం దూత మాసాద్య తమ స్సూర్యోదయే యథా,
అర్థానర్థాన్తరే బుద్ధి ర్నిశ్చితాపి న శోభతే. 38

ఘాతయన్తి హి కార్యాణి దూతాః పణ్డితమానినః,
న వినశ్యే త్కథం కార్యం వైక్లబ్యం న కథం భవేత్. 39

లఙ్ఘనంచ సముద్రస్య కథంను న వృథా భవేత్,
కథంను ఖలు వాక్యం మే శృణుయా న్నోద్విజేత వా. 40

ఇతి సంచిన్త్య హనుమాం శ్చకార మతిమా న్మతిమ్,
రామ మక్లిష్టకర్మాణం స్వబన్ధు మనుకీర్తయన్. 41

నైనా ముద్వేజయిష్యామి తద్బన్ధుగతమానసామ్,
ఇక్ష్వాకూణాం వరిష్ఠస్య రామస్య విదితాత్మనః. 42

శుభాని ధర్మయుక్తాని వచనాని సమర్పయన్,
శ్రావయిష్యామి సర్వాణి మధురాం ప్రబ్రువన్ గిరమ్.
శ్రద్ధాస్యతి యథా హీయం తథా సర్వం సమాదధే. 43

ఇతి స బహువిధం మహానుభావో
జగతిపతేః ప్రమదా మవేక్షమాణః,
మధుర మవితథం జగాద వాక్యం
ద్రుమవిటపాన్తర మాస్థితో హనూమాన్. 44

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, వాల్మీకీయే,
చతుర్వింశత్సహస్రికాయాం, సంహితాయాం,
శ్రీమత్సున్దరకాణ్డే, త్రింశ స్సర్గః.

## 30వ సర్గము

## సీత దుస్థితిని చెట్టుపై నుండి చూచిన హనుమంతుని ఆలోచన

మహాపరాక్రమవంతుడగు హనుమంతుడు సీత మాటలను వినెను. త్రిజట స్వప్నవృత్తాంతమును వినెను. రాక్షస స్త్రీల బెదరింపు మాటలను, చేష్టలను గమనించెను. నందనవనమందలి దేవకాంతవలె ఆ అశోకవనమందలి సీతను చూచి ఎన్నియో విధములుగా ఆలోచించెను.

లక్షలకొలది వానరులు వెదకుచున్న సీతను నేను కనుగొనగలిగితిని చేరగలిగితిని. శత్రువు యొక్క శక్తిని బాగుగ అర్థము చేసికొని రహస్యముగ సంచరించుచున్న నాచే ఈ సీత జాడ తెలిసికొనబడినది. అ ప్రమేయమైన శక్తిసామర్థ్యములు గల సర్వప్రాణులయందు మిక్కిలి దయతో ప్రవర్తించు శ్రీరామచంద్రుని భార్య అగు సీతాదేవిని, పతిదర్శనకాంక్షతో పరితపించుచున్న సీతాదేవిని ఊరడింపక ఉండుట ధర్మము కాదు. పూర్ణచంద్రుని వంటి ముఖము కల్గిన ఈ సీతాదేవి ఎప్పుడును దుఃఖపడి ఉంగలేదు. ఇప్పుడు ఈమె దుఃఖమునకు అంతము కనబడుట లేదు. ఇంత దుఃఖములో ఉన్న సీతను ఊరడింపకుండ నేను వెళ్ళిపోయినచో అది పొరపాటగును. ఈమెను ఊరడింపకుండ నేను వెళ్ళిపోయినచో తన జన్మచరిత్రాదులచే ప్రసిద్ధి వహించిన ఈ జానకీ దేవి ఎట్టి రక్షణమును లేక మరణింపవచ్చును.

పూర్ణచంద్రాననుడు మహాబాహువు సీతాదర్శనలాలసుడు అయిన శ్రీరామునికి సీతాదేవిని చూచి సీతాదేవి సందేశమును కూడ గొనిపోయి చెప్పుట న్యాయము. ఇంతమంది రాక్షసస్త్రీల ఎదుట సీతాదేవితో మాటలాడుట అమె యోగ క్షేమములు తెలిసికొని రామచంద్రుని

స్థితిగతులను ఆమెకు వినిపించి ఆమె సందేశమును తీసికొనుట అంత సాధ్యముగా తోచుట లేదు. పరిస్థితి విషమముగా ఉన్నది. ఏమి చేయవలయునో తోచుట లేదు. ఈ మిగిలిన రాత్రిభాగములో సీతను పలుకరించి ఊరడింపక పోయినచో ఈమె తప్పక మరణించును. సీత ఏమి అన్నది అని రాముడు అన్నచో సీతతో మాటాడకుండ పోయినను క్రోధముతో ఎఱ్ఱవారిన కన్నులచే నన్ను కాల్చివేయును. రాముని కోసమై సుగ్రీవ మహారాజును ప్రోత్సహించి సైన్యముతో తీసికొని వచ్చినను సీత బ్రతికి ఉండనిచో ఏమి ప్రయోజనము?

ఇచ్చటనే ఉండి అవకాశము చూచికొని మిక్కిలిదుఃఖించుచున్న ఈ సీతాదేవిని ఓదార్పవలసి ఉన్నది. సామాన్యమానవులు మాటలాడు ఒకపాటి కొద్ది సంస్కారముగల భాషలో మాటలాడుదును: ఒకవేళ బ్రాహ్మణునివలె స్థాన ప్రయత్న భేదమెఱిగి మంచి స్పష్టమైన ఉచ్చారణము గల భాషలో మాటలాడినచో నేను రావణుడే అనుకొని సీత భయపడుట సంభవించును. అతిసూక్ష్మమైన వానరుడనై సీతతో ఏరీతిగా మాటలాడెవలెనో! నేను కోసలదేశవాసులైన సామాన్యజనులు మాటలాడు భాషలోనే మాటలాడుట ప్రయోజనకరముగ ఉండును. అట్టి భాషతోడనే నేను ఎదుట నిలిచి మాటలాడుటయు సమంజసము కాదు. నా రూపమును చూచి సంస్కారవంతమయిన మాటలు విని ఇదివఱకే రాక్షసులచే భయపెట్టబడిన ఆమె మఱింత భయ పడవచ్చును. సీతకేకలు విని ఈ రాక్షస స్త్రీలందఱు పెద్ద పెద్ద ఆయుధములు దాల్చి నన్ను ముట్టడించి చంపుటకు గాని, బంధించుటకు కాని ప్రయత్నింతురు. చెట్లు కొమ్మలను చెట్ల

 



మొదళ్ళను పట్టుకొని ఎదిరించు నన్ను ప్రతిఘటింపలేక నా రూపమును చూచి భయపడి రాక్షసులను కొంతమందిని సహాయముగా పిలుచుకొని రావచ్చును.

ఆ రాక్షసులు శూలము, శక్తి, ఖడ్గము మున్నగు ఆయుధములతో రావచ్చును. వారితో యుద్ధము జరిగినప్పుడు వారిని నిగ్రహించుట సంభవమే కాని సముద్రమును దాటి తిరిగి రామసన్నిధికి పోవుటకు శ్రమకరముగా ఉండవచ్చును. లేదా వారు నన్ను వేగముగ బంధించినను బంధింపవచ్చును. సీతాదేవితో నేను చెప్పవలసినది చెప్పలేకపోవుట రాక్షసులచే బద్ధుడనగుటయు సంభవమే. రాక్షసులు నన్ను బంధించి హింసింపవచ్చును. లేదా సీతను బాధింపవచ్చును. అందువలన రామ సుగ్రీవుల కార్యము ఆపదలో పడును. రాక్షసులచే వ్యాప్తమై సముద్రముచే ఆవరింపబడిన గుప్తప్రదేశమగు ఈ లంకలో సీత ఉన్నది. ఇక్కడకు చేరుటకు ఏదారియు లేదు. నన్ను ఈ రాక్షసులు చంపినచో లేదా బంధించినచో రామునకు సాయపడుచు ఈ లంకకు రాగల మఱియొకడు కానరాడు.

నేను ఇచట మరణించినచో శతయోజనవిస్తీర్ణమైన ఈ సముద్రమును దాటగల వానరుడు మరెవ్వడును లేడు. వేలకొలది రాక్షసులను నేను చంపగలను కాని ఈ మహోదధిని దాటి అవతలిగట్టును చేరగలనో లేనో! యుద్ధములో జయాపజయములు ఏ ఒక్కరికిని నిశ్చితములు కావు. సంశయగ్రస్తమైన విషయము నాకు రుచింపదు. తెలివిగల వాడెవ్వడును కలిసి మాటలాడనిచో సీతాదేవి మరణించుట తప్పదు. నేను ఎదుటబడి మాటలాడినను అనర్థమే కల్గవచ్చును.

అసమర్థుడైన బుద్ధిహీనుడైన దూతవలన పూర్తికానున్న కార్యములు కూడ దేశకాలములు అనుకూలముకాక సూర్యోదయకాలమున మంచువలె చెడిపోవుటయు సంభవమే. ఏది కర్తవ్యమో అను విషయమును ప్రభువు మంత్రులతో చక్కగా ఆలోచించి చేసిన నిర్ణయము కూడఅసమర్థులైన దూతలయొక్క దురహంకారముచే నెఱవేరక పోవుటయు కాగలదు. కార్యము నష్టము కాకుండ బుద్ధిమాంద్యము లేకుండ సముద్రలంఘనము వృథ కాకుండ ఉండు మార్గమేమో భయపడకుండ నా మాటలను ఈ సీతాదేవి విను పద్ధతి ఏమో అని బహువిధములుగా ఆలోచించి చివరకు హనుమానుడు ఒక నిశ్చయమునకు వచ్చెను.

ఈమె ఎప్పుడు రామచంద్రుని గుఱించియే తలంచుకొనుచున్నది. శ్రీరాముడు ఎప్పుడును తన చేష్టలచే ఇతరుల మనస్సు నొప్పించి ఎరుగడు. కావున నేను శ్రీరాముని గుఱించి ప్రస్తావించినచో ఈమె భయపడవలసిన అవసరముండదు. ఇక్ష్వాకు వంశస్థులలో సర్వోత్తముడైన శ్రీరామచంద్రుని ధర్మబద్ధమైన మాటలను వినిపించెదను. చెవికి ఇంపైన ఆ మాటలను శ్రద్ధ వహించి ఈ సీతాదేవి వినగలదు.

హనుమంతుడు ఆ చెట్టు కొమ్మలలో నుండియే సీతాదేవి వైఖరిని జాగ్రత్తగా పరిశీలించుచు మధురాతి మధురమగు వాస్తవమైన వచనములు పలికెను



## 31. ఏకత్రింశ స్సర్గః

ఏవం బహువిధాం చిన్తాం చిన్తయిత్వా మహాకపిః,
సంశ్రవే మధురం వాక్యం వైదేహ్యా వ్యాజహార హ. 1

రాజా దశరథో నామ రథకుఞ్జరవాజిమాన్,
పుణ్యశీలో మహాకీర్తి ర్ఋజు రాసీ న్మహాయశాః. 2

రాజర్షీణాం గుణశ్రేష్ఠ స్తపసా చర్షిభి స్సమః,
చక్రవర్తికులే జాతః పురన్దరసమో బలే. 3

అహింసారతి రక్షుద్రో ఘృణీ సత్యపరాక్రమః,
ముఖ్య శ్చేక్ష్వాకువంశస్య లక్ష్మీవాన్ లక్ష్మివర్ధనః. 4

పార్థివవ్యఞ్జనై ర్యుక్తః పృథుశ్రీః పార్థివర్షభః,
పృథివ్యాం చతురన్తాయాం విశ్రుత స్సుఖద స్సుఖీ. 5

తస్య పుత్రః ప్రియో జ్యేష్ఠ స్తారాధిపనిభాననః,
రామోనామవిశేషజ్ఞ శ్శ్రేష్ఠ స్సర్వధనుష్మతామ్. 6

రక్షితా స్వస్య ధర్మస్య స్వజనస్య చ రక్షితా,
రక్షితా జీవలోకస్య ధర్మస్య చ పరంతపః. 7

తస్య సత్యాభిసన్ధస్య వృద్ధస్య వచనా త్పితుః,
సభార్య స్సహచ భ్రాత్రా వీరః ప్రవ్రాజితో వనమ్. 8

తేన తత్ర మహారణ్యే మృగయాం పరిధావతా,
రాక్షసా నిహతా శ్శూరా బహవః కామరూపిణః. 9

జనస్థానవధం శ్రుత్వా హతౌ చ ఖరదూషణౌ,
తత స్త్వమర్షాపహృతా జానకీ రావణేన తు. 10

వఞ్చయిత్వా వనే రామం మృగరూపేణ మాయయా,
స మార్గమాణ స్తాం దేవీం రామ స్సీతా మనిన్దితామ్. 11

ఆససాద వనే మిత్రం సుగ్రీవం నామ వానరమ్,
తత స్స వాలినం హత్వా రామః పరపురంజయః. 12

ప్రాయచ్ఛ త్కపిరాజ్యం త త్సుగ్రీవాయ మహాబలః,
సుగ్రీవేణా పి సందిష్టా హరయః కామరూపిణః. 13

దిక్షు సర్వాసు తాం దేవీం విచిన్వన్తి సహస్రశః,
అహం సంపాతి వచనా చ్ఛతయోజన మాయతమ్. 14

అస్యా హేతో ర్విశాలాక్ష్యా స్సాగరం వేగవా౯ ప్లుతః,
యథారూపాం యథావర్ణాం యథాలక్ష్మీం చ నిశ్చితామ్.

అశ్రౌషం రాఘవ స్యాహం సే య మాసాదితా మయా,
విరరా మైవ ముక్త్వా సౌ వాచం వానరపుఙ్గవః. 16

జానకీ చాపి తచ్ఛ్రుత్వా పరం విస్మయ మాగతా,
తత స్సా వక్రకేశాన్తా సుకేశీ కేశసంవృతమ్. 17

ఉన్నమ్య వదనం భీరు శ్శింశుపావృక్ష మైక్షత,
నిశమ్య సీతా వచనం కపేశ్చ

దిశశ్చ సర్వాః ప్రదిశశ్చ వీక్ష్య,
స్వయం ప్రహర్షం పరమం జగామ
సర్వాత్మనా రామ మనుస్మరన్తీ. **18**

సా తిర్యగూర్ధ్వం చ తథా ప్యధస్తా,
న్నిరీక్షమాణా త మచిన్త్యబుద్ధిమ్,
దదర్శ పిఙ్గాధిపతే రమాత్యం,
వాతాత్మజం సూర్య మివోదయస్థమ్. **19**

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, వాల్మీకీయే,
చతుర్వింశత్సహస్రికాయాం, సంహితాయాం,
శ్రీమత్సున్దరకాణ్డే, ఏకత్రింశ స్సర్గః.

## శ్రీమద్రామాయణ మాహాత్మ్యమ్

శ్లో. లిఖిత్వారామ నామాని నియతా మోక్ష్యసేఽ ంహసః,
నామ్నోఽస్తి యావతీ శక్తిః పాప నిర్మూలన క్షమా.

శ్లో. తావత్కర్తుం నశక్నోతి పాతకం పాతకీ జనః
తపాంసి యజ్ఞాః క్రతవ స్తీర్థాన్య వశనం తథా.

## 31వ సర్గము

### హనుమంతుడు సీతతో పలుకుట

ఆ వానరేంద్రుడు బహుముఖముగ బాగుగ ఆలోచించి సీతాదేవి చక్కగ వినుటకై పై కొమ్మనుండి క్రింది కొమ్మపైకి దిగివచ్చి చెప్ప దొడంగెను.

దశరథు డను ప్రసిద్ధుడైన ఒక రాజుకలడు. ఆతనికి అపారమైన అశ్వరథగజసేనలు గలవు. పవిత్రమగు స్వభావము కలవాడు. దానధర్మములు చేసి గొప్ప కీర్తిని గడించినవాడు. అనేక దేవాసురయుద్ధములలో తన పరాక్రమమును ప్రదర్శించి రాక్షసులను నిర్జించి దేవతలకు విజయమును చేకూర్చినవాడు. ఆతని ఆర్జవము చాల గొప్పది. తపస్సులో ఋషులకు తీసిపోనివాడు. రాజర్షులందరిలో ఉత్తముడు. చక్రవర్తుల వంశమున పుట్టినవాడు. బలములో ఇంద్రతుల్యుడు. అహింసాపరుడు. అల్పబుద్ధులు లేనివాడు. దయగలవాడు అమోఘమైన పరాక్రమముగలవాడు రాజలక్షణములతో కూడినవాడు. రాజులలో ముఖ్యుడుగా పరిగణింపబడుచున్నవాడు. నేల నాలుగు చెరగుల ప్రసిద్ధి గలవాడు. ఇతరులను సుఖపెట్టి తాను సుఖపడువాడు.

ఇట్టి దశరథ మహారాజు పుత్రులలో చంద్రాననుడైన రామచంద్రుడు పెద్దవాడు. ఆరాముడు చాల విషయములు తెలిసినవాడు. ధనుస్సు చేతపట్టి యుద్ధము చేయువారలలో ఆ రాముడు మొట్టమొదట పేర్కొనదగినవాడు. తన ధర్మమును రక్షించుకొనువాడు. తనవారి ధర్మమును కూడ రక్షించువాడు. జీవకోటి ధర్మమును కూడ చక్కగా పరిరక్షించువాడు. ఆడి తప్పని ఆ రాముడు తండ్రి ఆజ్ఞానుసారము భార్యతో సోదరునితో అరణ్యమునకు బయలుదేరెను. అక్కడ ఆ మహారణ్యములో మృగములను వేటాడుచు సంచరించుచుండగా

కామరూపులైన రాక్షసులు ఎందరో చంపబడిరి. ఖరదూషణులు కూడ జనస్థానమున జరిగిన యుద్ధములో మరణించుటను విన్న రావణుడు రాముని మాయామృగముచే వంచించి రాముని భార్యయగు జానకీ దేవిని ఎత్తుకొని పోయెను.

ఆ రాముడు అనిందిత యగు సీతాదేవిని వెదకు కొనుచు సుగ్రీవు డను వానరాధిపతిని చేరుకొని మైత్రిచేసికొనెను. ఆ తరువాత రాముడు వాలిని సంహరించి వానరరాజ్యమును సుగ్రీవునకు అప్పగించెను. సుగ్రీవుని ఆదేశమును స్వీకరించి వేలకొలది వానరులతో నాలుగు దిక్కుల యందు ఆ సీతాదేవిని వెదకుచున్నారు. వారిలో నేను సంపాతి మాటలను స్వీకరించి నూరు యోజనముల వెడల్పు కల్గిన సముద్రమును దాటి లంకకు వచ్చితిని. గుర్తుకై రామచంద్రుడు చెప్పిన రూపము వర్ణము కాంతి కల్గిన ఆమెను (రామపత్నియగు సీతను) చూడగల్గితిని. వానరోత్తముడు పై మాటలు చెప్పి విరమించెను.

సీతాదేవి ఆ మాటలను విని మిక్కిలి ఆశ్చర్యపడెను. ముఖము మీదకు జాఱీపడుచున్న ఉంగరాల జుట్టును కొలదిగ తీసికొని తల ఎత్తి శింశుపావృక్షము వైపునకు చూచెను. హనుమంతుని మాటలను విని సీత నాల్గుదిక్కులను నాల్గుమూలలను పరిశీలనగా చూచి నిరంతరము రామునే స్మరించు చున్న ఆమె రామచంద్రుని గుఱించిన వార్తను ఇన్నాళ్ళకు విని పరమానందభరితురాలయ్యెను. ఆ సీతాదేవి ప్రక్కలకు చూచి మీదికి చూచి క్రిందికి చూచి చివరకు శింశుపావృక్షమున కూర్చుండి యున్న వానరాధిపతియగు సుగ్రీవుని మంత్రివర్యుడగు వాయునందనుని చూచెను. అతడు ఉదయ పర్వతమున ఉదయించుచున్న సూర్యునివలె ప్రకాశమానుడై ఉండెను.



## ౩౨. ద్వాత్రింశ స్సర్గః

తత శ్శాఖాన్తరే లీనం దృష్ట్వా చలితమానసా,
వేష్టితార్జునవస్త్రం తం విద్యుత్సఙ్ఘాతపిఙ్గలమ్. 1

సా దదర్శ కపిం తత్ర ప్రశ్రితం ప్రియవాదినమ్,
ఫుల్లాశోకోత్కరాభాసం తప్తచామీకరేక్షణామ్. 2

మైథిలీ చిన్తయామాస విస్మయం పరమం గతా,
అహో భీమ మిదం రూపం వానరస్య దురాసదమ్. 3

దుర్నిరీక్ష మితి జ్ఞాత్వా పునరేవ ముమోహ సా,
విలలాప భృశం సీతా కరుణం భయమోహితా. 4

రామ రామేతి దుఃఖార్తా లక్ష్మణేతి చ భామినీ,
రురోద బహుధా సీతా మన్దం మన్దస్వరా సతీ. 5

సా తం దృష్ట్వా హరిశ్రేష్ఠం వినీతవ దుపస్థితామ్,
మైథిలీ చిన్తయామాస స్వప్నోఽయ మితి భామినీ. 6

సా వీక్షమాణా పృథుభుగ్నవక్త్రం
శాఖామృగేన్ద్రస్య యథోక్తకారమ్,
దదర్శ పిఙ్గాధిపతే రమాత్యం
వాతాత్మజం బుద్ధిమతాం వరిష్ఠమ్. 7

సా తం సమీక్ష్యైవ భృశం విసంజ్ఞా
గతాసుకల్పేవ బభూవ సీతా,
చిరేణ సంజ్ఞాం ప్రతిలభ్య భూయో
విచిన్తయామాస విశాలనేత్రా. 8

స్వప్నే మయాఽయం వికృతోఽద్య దృష్ట
శ్శాఖామృగ శ్శాస్త్రగణై ర్నిషిద్ధః,
స్వస్త్యస్తు రామాయ సలక్ష్మణాయ
తథా పితు ర్మే జనకస్య రాజ్ఞః. 9

స్వప్నోఽపి నాయం న హి మేఽస్తి నిద్రా
శోకేన దుఃఖేన చ పీడితాయాః,
సుఖం హి మే నాస్తి యతోఽస్మి హీనా
తే నేన్దుపూర్ణప్రతిమాననేన. 10

రామేతి రామేతి సదైవ బుద్ధ్యా
విచిన్త్య వాచా బ్రువతీ త మేవ,
తస్యానురూపాం చ కథాం తమర్థ
మేవం ప్రపశ్యామి తథా శృణోమి. 11

అహం హి త స్యాద్య మనోభవేన
సంపీడితా తద్గతసర్వభావా,
విచిన్తయన్తీ సతతం త మేవ
తథైవ పశ్యామి తథా శృణోమి. 12

మనోరథ స్స్య దితి చిన్తయామి
తథాపి బుద్ధ్యా చ వితర్కయామి,
కిం కారణం తస్య హి నాస్తిరూపం
సువ్యక్తరూపశ్చ వద త్యయం మామ్. 13

నమోఽస్తు వాచస్పతయే స వజ్రిణే
స్వయంభువే చైవ హుతాశనాయ చ,
అనేన చోక్తం య దిదం మమాగ్రతో
వనౌకసా తచ్చ తథాస్తు నాన్యథా. 14

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, వాల్మీకీయే,
చతుర్వింశత్సహస్రికాయాం, సంహితాయాం,
శ్రీమత్సున్దరకాణ్డే, ద్వాత్రింశ స్సర్గః

## శ్రీమద్రామాయణ మాహాత్మ్యమ్

శ్లో. రామమన్త్రస్య నార్థన్తికలాం కోటితమీ మపి,
రామనామ లిఖిత్వా చ శ్రుత్వా రామాయణం తతః.

# 32వ సర్గము

## సీత చెట్టుపై నున్న హనుమంతుని చూచుట

కొమ్మల మధ్య దాగి ఉన్న వానరోత్తముని చూడగనే ఆమె మనస్సు కంగారుపడెను. మరల పరిశీలనగ చూచెను. చెట్టుపై తెల్లని పస్త్రమును ధరించినట్టియు మెఱపులు ఒకచోట రాశీభూతమైనట్లును బంగారురంగుతో మెఱయుచున్న వానరుని చూచెను. అతడే తనకు ప్రియమైన రామవృత్తాంతమును తెలిపినవాడనియు గ్రహించెను.

వికసించిన అశోకములు ఒక్కచోట రాశీకృతమైనట్లు ఉన్నాడు. నేత్రములు మేలిమి బంగారము వలె పచ్చగ ఉన్నవి. మైథిలి ఆశ్చర్యపడుచు ఇట్లు తలంచుకొనెను. ఈ వానరుని రూపము చాల భయంకరముగ నున్నది. దరి చేరుటకు గాని చూచుటకు గాని సాధ్యము కాకున్నది. అనుకొని ఆమె మరల మూర్ఛపోయినది. రామా లక్ష్మణా అనుచు ఆమె చాల దయనీయముగా విలపించెను. ఆమె మెల్లగా మందస్వరముతో ఏడ్వజొచ్చెను.

## హనుమంతుని చూచిన సీత భావన

పునీతుడైన తన వద్దకు వచ్చిన ఆ వానరోత్తముని చూచి అది స్వప్నావస్థ అనియు స్వప్నములోనే వానరుని చూచితిననియు వంకరమూతి కల్గియు వానరాధిపతికి అత్యంత విధేయుడైన మహామతియగు ఆ వానరోత్తముని మరల పరీక్షగ చూచెను. ఆ రీతిగా చూచుచునే తెలివిలేనిదై మృతప్రాయముగా ఉండిపోయెను. చాల సేపటికి తెలివి తెచ్చుకొని విశాలదృష్టియగు ఆ సీతాదేవి మరల ఆలోచింప దొడంగెను.

నిమిత్త శాస్త్రజ్ఞులు స్వప్నములో చూడరాదని చెప్పిన వానరుని నేను స్వప్నములో చూచితిని. స్వప్నమున ఈ వానర దర్శనము ఆత్మీయులకు ఏమి అనర్థము తెచ్చునో! రామునకు లక్ష్మణునకు మా తండ్రి జనక మహారాజునకు స్వస్తి కలుగుగాక. ఇది స్వప్నము కాదు. నాకు నిద్రయులేదు. ఇంత శోకములో దుఃఖముతో నాకు నిదురవచ్చునా? చంద్రాననుడగు రామునకు దూరమైన నాకు సుఖము ఎక్కడ నిద్రయెక్కడ. నిరంతరము రామునే తలంచు చున్నందువల్ల ఆ భావనాప్రకాశముచే ఆతనిని చూచుచున్నట్లు ఆతని గుఱించి కథలను వినుచున్నట్లును నాకు ఆభాసించుచున్నది. ఆ రామచంద్రుడు ఎదుట కానవచ్చుట లేదు. స్పష్టమైన రూపముతో ఈ వానరుడు నాతో మంచిమాటలాడుచున్నాడు.

ఇది స్వప్నవృత్తమో, యథార్థమో తెలియకున్నది. వాచస్పతికి ఇంద్రునకు బ్రహ్మకు అగ్నిహోత్రునకు నమస్కరించుచున్నాను. వారందరు నా యందు దయ ఉంచి ఈ వానరుడు నా ఎదుట చెప్పిన మాటలను యథార్థము చేయుదురు గాక.



# ౩౩. త్రయస్త్రింశ స్సర్గః

సోఽవతీర్య ద్రుమా త్తస్మా ద్విద్రుమప్రతిమాననః,
వినీతవేషః కృపణః ప్రణిప త్యోపసృత్య చ. 1

తా మబ్రవీ న్మహాతేజా హనుమా న్మారుతాత్మజః,
శిర స్యఞ్జలి మాధాయ సీతాం మధురయా గిరా. 2

కా ను పద్మపలాశాక్షి క్లిష్టకౌశేయవాసిని,
ద్రుమస్య శాఖా మాలమ్బ్య తిష్ఠసి త్వ మనిన్దితే. 3

కిమర్థం తవనేత్రాభ్యాం వారి స్రవతి శోకజమ్,
పుణ్డరీక పలాశాభ్యాం విప్రకీర్ణ మివోదకమ్. 4

సురాణా మసురాణాం వా నాగగన్ధర్వరక్షసామ్,
యక్షాణాం కిన్నరాణాం వా కా త్వం భవసి శోభనే. 5

కా త్వం భవసి రుద్రాణాం మరుతాం వా వరాననే,
వసూనాం వా వరారోహే దేవతా ప్రతిభాసి మే. 6

కిన్ను చన్ద్రమసా హీనా పతితా విబుధాలయాత్,
రోహిణీ జ్యోతిషాం శ్రేష్ఠా శ్రేష్ఠ సర్వగుణాన్వితా. 7

కా త్వం భవసి కల్యాణి త్వ మనిన్దితలోచనే,
కోపా ద్వా యది వా మోహా ద్భర్తార మసితేక్షణే. 8

వసిష్ఠం కోపయిత్వా త్వం నాసి కల్యా ణ్యరున్ధతీ,
కో ను పుత్రః పితా భ్రాతా భర్తా వా తే సుమధ్యమే. 9

అస్మాల్లోకా దముం లోకం గతం త్వ మనుశోచసి,
రోదనా దతినిశ్శ్వాసా ద్భూమిసంస్పర్శనా దపి. 10

న త్వాం దేవీ మహం మన్యే రాజ్ఞ స్సంజ్ఞావధారణాత్,
వ్యఞ్జనాని చ తే యాని లక్షణాని చ లక్షయే. 11

మహిషీ భూమిపాలస్య రాజకన్యాసి మేమతా,
రావణేన జనస్థానా ద్బలా దపహృతా యది. 12

సీతా త్వ మసి భద్రం తే తన్మ మాచక్ష్వ పృచ్ఛతః,
యథా హి తవ వై దైన్యం రూపం చా ప్యతిమానుషమ్,
తపసా చాన్వితో వేష స్త్వం రామమహిషీ ధ్రువమ్. 13

సా తస్య వచనం శ్రుత్వా రామకీర్తనహర్షితా,
ఉవాచ వాక్యం వైదేహీ హనుమన్తం ద్రుమాశ్రితమ్. 14

పృథివ్యాం రాజసింహానాం ముఖ్యస్య విదితాత్మనః,
స్నుషా దశరథ స్యాహం శత్రుసైన్యప్రతాపినః. 15

దుహితా జనక స్యాహం వైదేహస్య మహాత్మనః,
సీతా చ నామ నామ్నాఽహం భార్యా రామస్య ధీమతః.

సమా ద్వాదశ తత్రాహం రాఘవస్య నివేశనే,
భుఞ్జానా మానుషా౯ భోగా౯ సర్వకామసమృద్ధినీ. 17

తత్ర త్రయోదశే వర్షే రాజ్యే నేక్ష్వాకునన్దనమ్,
అభిషేచయితుం రాజా సోపాధ్యాయః ప్రచక్రమే. 18

తస్మిన్ సంభ్రియమాణే తు రాఘవ స్యాభిషేచనే,
కైకేయీ నామ భర్తారం దేవీ వచన మబ్రవీత్. 19

న పిబేయం న ఖాదేయం ప్రత్యహం మమ భోజనమ్,
ఏష మే జీవితస్యాన్తో రామో య ద్యభిషిచ్యతే. 20

యత్తదుక్తం వాక్యం ప్రీత్యా నృపతిసత్తమ,
తచ్చే న్నవితథం కార్యం వనం గచ్ఛతు రాఘవః. 21

స రాజా సత్యవా గ్దేవ్యా వరదాన మనుస్మరన్,
ముమోహ వచనం శ్రుత్వా కైకేయ్యాః క్రూర మప్రియమ్.

తతస్తు స్థవిరో రాజా సత్యే ధర్మే వ్యవస్థితః,
జ్యేష్ఠం యశస్వినం పుత్రం రుద న్రాజ్య మయాచత. 23

స పితుర్వచనం శ్రీమా నభిషేకాత్పరం ప్రియమ్,
మనసా పూర్వ మాసాద్య వాచా ప్రతిగృహీతవాన్. 24

దద్యా న్నప్రతిగృహ్ణీయా న్నబ్రూయా త్కించి దప్రియమ్,
అపి జీవిత హేతో ర్వా రామ స్సత్యపరాక్రమః. 25

స విహా యోత్తరీయాణి మహార్హాణి మహాయశాః
విసృజ్య మనసా రాజ్యం జనన్యై మాం సమాదిశత్. 26

సాహం తస్యాగ్రత స్తూర్ణం ప్రస్థితా వనచారిణీ,
న హి మే తేన హీనాయా వాస స్స్వర్గేఽపి రోచతే. 27

ప్రాగేవ తు మహాభాగ స్సౌమిత్రి ర్మిత్రనన్దనః,
పూర్వజ స్యానుయాత్రార్థే ద్రుమచీరై రలంకృతః. 28

తే వయం భర్తు రాదేశం బహుమాన్య దృఢవ్రతాః,
ప్రవిష్టాః స్మ పురాఽదృష్టం వనం గమ్భీరదర్శనమ్. 29

వసతో దణ్డకారణ్యే త స్యాహ మమితౌజసః,
రక్షసాఽపహృతా భార్యా రావణేన దురాత్మనా. 30

ద్వౌ మాసౌ తేన మే కాలో జీవితానుగ్రహః కృతః,
ఊర్ధ్వం ద్వాభ్యాం తు మాసాభ్యాం తత స్త్యక్ష్యామి జీవితమ్.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, వాల్మీకీయే,
చతుర్వింశత్సహస్రికాయామ్, సంహితాయామ్,
శ్రీమత్సున్దరకాణ్డే త్రయస్త్రింశ స్సర్గః.

## శ్రీమద్రామాయణ మాహాత్మ్యమ్

శ్లో. ధనినో వా దరిద్రావా దేవి రామాయణ శ్రుతౌ,
అధికుర్వన్తి సర్వేఽపి నాత్ర కశ్చన సంశయః.

32 వ సర్గము

# 33 వ సర్గము

## హనుమంతుడు సీతతో మాటలాడుట

హనుమానుడు తానున్న చోటినుండి క్రింది కొమ్మ మీదికి దిగి వచ్చి వినీతవేషుడై సీతాదుర్దశను చూచి దీనుడై ఇట్లు చెప్పదొడంగెను. సీతా దర్శనముచేత ఆతని ముఖమున విలక్షణమైన ఒక తేజస్సు కూడ కానవచ్చుచుండెను. జోడించిన హస్తములను శిరస్సున ఉంచుకొని సీతాదేవితో శ్రవణమధురముగ ఇట్లు చెప్పదొడంగెను.

ఎవరమ్మా నీవు తామర రేకుల వంటి కన్నులు కల్గి మాసిన పట్టు వస్త్రమును ధరించి ఈ చెట్టు కొమ్మను పట్టుకొని యున్నావు. నిందనీయమైన అంశమేదియు నీలో కానబడదు. తామర రేకుల నుండి నీటి బిందువులు జారిపడినట్లుగా, నీ కన్నుల నుండి దుఃఖాశ్రువులు ఏల జారి పడుచున్నవి? దేవతలలో అసురులలో, నాగగంధర్వరాక్షసులలో యక్షులలో కిన్నరులలో ఏ జాతి స్త్రీవై యుందువు? లేక రుద్రులలో, మరుత్తులలో, వసువులలో ఏ జాతికి చెంది ఉందువు? నీవు దేవతాస్త్రీ వలె కనబడుచున్నావు.

ఉత్తమ గుణాన్వితవైన నీవు నక్షత్రములలో ఉత్తమమైన రోహిణి చంద్రుని విడిచి దేవలోకము నుండి భూమిపై పడినదో అన్నట్లు ఉన్నావు. కోపము చేతనో, అజ్ఞానము చేతనో వశిష్ఠుని ఆగ్రహమునకు గుఱియై వచ్చిన అరుంధతివలె ఈ లోకము నుండి పరలోకమునకు ఏగిన పుత్రుడు, తండ్రి, సోదరుడు, భర్త వీరిలో ఎవరినైన గూర్చి ఏడ్చుచున్నావా? ఏడ్చుట వలన, నిట్టూర్పుల వలన, భూమి స్పర్శ వలన నిన్ను దేవకాంతగా నేను భావించుట లేదు. నీ లక్షణములను పరిశీలించినచో నిన్ను రాజపుత్రివనియు, రాజమహిషివనియు

తలంచుచున్నాను. నిన్ను ప్రశ్నించుచున్న నాకు సరియైన సమాధానము నిమ్ము. జనస్థానమునుండి రావణునిచే అపహరింపబడిన సీతాదేవివా నీవు? నీకు మేలు కలుగుగాక. నీ దీనస్థితి ఈ అతిమానుషమైన రూపము తపోనురూపమైన వేషము చూచినచో నీవు రామపత్నివే అను నిశ్చయజ్ఞానము కలుగుచున్నది.

**సీత హనుమంతునితో మాటలాడుట**

ఆ సీతాదేవి ఆ వాయునందనుని మాటలను విని రాముని గుఱించి చెప్పిన మాటలకు చాల సంతోషించినదై చెట్టుపై నున్న హనుమంతునితో ఇట్లు చెప్పదొడగెను. ఈ భూమి యందలి మహారాజులందరిలో ఉత్తమునిగా ప్రసిద్ధినొందిన, శత్రుసైన్యమును చీల్చి చెండాడగల్గిన పరాక్రమము కల్గిన దశరథ చక్రవర్తికి కోడలను. విదేహదేశాధిపతి యగు జనక మహీపతికి  కొమార్తెను. మహాబుద్ధిశాలి మహాధైర్యవంతుడు అగు రామునకు భార్యను, నాపేరు సీత. శ్రీరాముని రాజభవనమున పండ్రెండు సంవత్సరముల కాలము దివ్య భోగములను అనుభవించుచు దేనికి లోపము లేకుండగా మహానందముగ ఉంటిని. మా వివాహానంతరము పదుమూడవ సంవత్సరమున దశరథ చక్రవర్తి నా భర్త శ్రీరామునకు యౌవ రాజ్యాభిషేకము చేయదలంచెను. మంత్రి పురోహితులతో  కలిసి తగు  ప్రయత్నము  సలిపెను.  ఈప్రకారము శ్రీరాముని యౌవరాజ్యాభిషేక ప్రయత్నములు జరుగుచుండగా కైకేయీ దేవి దశరథ చక్రవర్తితో ఇటుల అనెను.

శ్రీరామునకు యౌవ రాజ్యాభిషేకము జరిగినచో నేను అన్నము తినను. మంచి నీళ్ళు త్రాగను. ఆకలి దప్పులతో కాలము వెళ్ళబుచ్చుచు

మరణింతును. నీవు నాకిచ్చిన వరము యథార్థము కావలెనన్నచొ రాముని అరణ్యమునకు పంపుము. సత్యవచనుడగు ఆ దశరథ చక్రవర్తి ఒకనాడు తాను ఇచ్చిన వరములను ఇప్పుడు కైకేయి తాను నెఱవేర్చుకొనుటను తలంచి దశరథ చక్రవర్తి మూర్ఛపోయెను.

తరువాత వృద్ధుడు సత్యవచనుడు అగు రాజు ఆడిన మాట తప్పలేక కీర్తిమంతుడు జ్యేష్ఠ పుత్రుడు అగు శ్రీరాముని రాజ్యము యాచించెను. శ్రీరాముడు తండ్రి మాటను రాజ్యాభిషేకము కంటె ప్రియమైనదిగ తలంచెను. రాముడు సత్య పరాక్రముడు. ఇచ్చునే కాని పుచ్చుకొనడు. అప్రియముగ మాటలాడడు. ప్రాణాపాయము సంభవించినను ఆడి తప్పడు. ఆ రాముడు విలువైన తన వస్త్రములను విడిచి నార చీరలను ధరించెను. చేతికందిన రాజ్యమును త్యజించెను. నన్ను తల్లియగు కౌసల్యాదేవి వద్ద ఉంచదలంచెను. నేను అంతకు ముందే వనవాసమునకు సంసిద్ధురాలనై యుంటిని.

నేను రాముని విడిచి స్వర్గమును కూడ ఆక్షేపింపను. లక్ష్మణుడు కూడ ముందే నారచీరలను ధరించి వనవాసమునకు సిద్ధమయ్యెను. నేను దశరథ చక్రవర్తి ఆజ్ఞను స్వీకరించి ఏమియును సందేహింపక ఎప్పుడును చూచి ఎఱుగని గంభీరమగు అరణ్యమున ప్రవేశించితిని. దండకారణ్యమున వసించుచుండగా దుర్మార్గుడగు రావణునిచే అపహరింపబడితివి. రాక్షసచక్రవర్తి నాకు రెండు మాసములు గడువిచ్చి ఉన్నాడు. ఆ తరువాత అతని మాట విననిచో నేను ప్రాణత్యాగము చేయక తప్పదు.



# 34. చతుస్త్రింశ స్సర్గః

తస్యా స్తద్వచనం శ్రుత్వా హనుమా౯ హరియూథపః,
దుఃఖా ద్దుఃఖాభిభూతాయా స్సాన్త్వ ముత్తర మబ్రవీత్. 1

అహం రామస్య సందేశా ద్దేవి దూత స్తవాగతః,
వైదేహి కుశలీ రామ స్త్వాం చ కౌశల మబ్రవీత్. 2

యో బ్రహ్మ మస్త్రం వేదాంశ్చ వేదవేదవిదాం వరః,
స త్వాం దాశరథీ రామో దేవి కౌశల మబ్రవీత్. 3

లక్ష్మణశ్చ మహాతేజా భర్తు స్తేఽనుచరః ప్రియః,
కృతావా౯ శోకసంతప్త శ్శిరసా తేఽభివాదనమ్. 4

సా తయోః కుశలం దేవీ నిశమ్య నరసింహయోః,
ప్రీతిసంహృష్టసర్వాఙ్గీ హనుమన్త మ థాబ్రవీత్. 5

కల్యాణీ బత గాథేయం లౌకికీ ప్రతిభాతి మా,
ఏతి జీవన్త మానన్దో నరం వర్షశతా దపి. 6

తయా సమాగతే తస్మి౯ ప్రీతి రుత్పాదితాఽద్భుతా,
పరస్పరేణ చాలాపం విశస్తౌ తౌ ప్రచక్రతుః. 7

తస్యా స్తద్వచనం శ్రుత్వా హనుమాన్ హరియూథపః,
సీతాయా శ్శోకదీనాయా స్సమీప ముపచక్రమే. 8

యథా యథా సమీపం స హనుమా నుపసర్పతి,
తథా తథా రావణం సా తం సీతా పరిశజ్కతే. 9

అహో ధి గ్దుష్కృత మిదం కథితం హి య దస్య మే,
రూపాన్తర ముపాగమ్య స ఏ వాయం హి రావణః. 10

తా మశోకస్య శాఖాం సా విముక్త్వా శోకకర్శితా,
తస్యా మే వానవద్యాఙ్గీ ధరణ్యాం సముపావిశత్. 11

హనుమానపి దుఃఖార్తాం తాం దృష్ట్వా భయమోహితామ్,
అవన్దత మహాబాహు స్తత స్తాం జనకాత్మజామ్. 12

సా చైనం భయవిత్రస్తా భూయో నైవాభ్యుదైక్షత,
తం దృష్ట్వా వన్దమానం తు సీతా శశినిభాననా. 13

మాయాం ప్రవిష్టో మాయావీ యది త్వం రావణ స్స్వయమ్,
ఉత్పాదయసి మే భూయ స్సన్తాపం త న్న శోభనమ్. 14

స్వం పరిత్యజ్య రూపం యః పరివ్రాజకరూపధృత్,
జనస్థానే మయా దృష్ట స్త్వం స ఏ వాసి రావణః. 15

ఉపవాసకృశాం దీనాం కామరూప నిశాచర,
సంతాపయసి మాం భూయ స్సంతప్తాం త న్న శోభనమ్.

అథవా నైత దేవం హి యన్మయా పరిశఙ్కితమ్,
మనసో హి మమ ప్రీతి రుత్పన్నా తవ దర్శనాత్. 17

యది రామస్య దూత స్త్వ మాగతో భద్ర మస్తు తే,
పృచ్ఛామి త్వాం హరిశ్రేష్ఠ ప్రియా రామకథా హి మే. 18

గుణా న్రామస్య కథయ ప్రియస్య మమ వానర,
చిత్తం హరసి మే సౌమ్య నదీకూలం యథా రయః. 19

అహో స్వప్నస్య సుఖతా యాహ మేవం చిరాహృతా,
ప్రేషితం నామ పశ్యామి రాఘవేణ వనౌకసమ్. 20

స్వప్నేఽపి య ద్యహం వీరం రాఘవం సహలక్ష్మణమ్,
పశ్యేయం నావసీదేయం స్వప్నోఽపి మమ మత్సరీ. 21

నాహం స్వప్న మిమం మన్యే స్వప్నే దృష్ట్వా హి వానరమ్,
న శక్యోఽభ్యుదయః ప్రాప్తుం ప్రాప్త శ్చాభ్యుదయో మమ.

కిన్ను స్యా చ్చిత్తమోహోఽయం భవే ద్వాతగతి స్త్వియమ్,
ఉన్మాదజో వికారో వా స్యా దియం మృగతృష్ణికా. 23

అథవా నాయ మున్మాదో మోహోఽప్యున్మాదలక్షణః,
సంబుధ్యే చాహ మాత్మాన మిమం చాపి వనౌకసమ్. 24

ఇత్యేవం బహుధా సీతా సంప్రధార్య బలాబలమ్,
రక్షసాం కామరూపత్వా న్మేనే తం రాక్షసాధిపమ్. 25

ఏతాం బుద్ధిం తదా కృత్వా సీతా సా తనుమధ్యమా,
న ప్రతివ్యాజహారాథ వానరం జనకాత్మజా. 26

సీతాయా శ్చిన్తితం బుద్ధ్వా హనుమా న్మారుతాత్మజః,
శ్రోత్రానుకూలై ర్వచనై స్తదా తాం సంప్రహర్షయత్. 27

ఆదిత్య ఇవ తేజస్వీ లోకకాన్త శ్శశీ యథా,
రాజా సర్వస్య లోకస్య దేవో వైశ్రవణో యథా. 28

విక్రమే ణోపపన్నశ్చ యథా విష్ణు ర్మహాయశాః,
సత్యవాదీ మధురవా గ్దేవో వాచస్పతి ర్యథా. 29

రూపవాన్ సుభగ శ్శ్రీమా౯ కన్దర్ప ఇవ మూర్తిమా౯,
స్థానక్రోధః ప్రహర్తా చ శ్రేష్ఠో లోకే మహారథః. 30

బాహుచ్ఛాయా మవష్టబ్ధో యస్య లోకో మహాత్మనః,
అపకృ ష్యాశ్రమపదా న్మృగరూపేణ రాఘవమ్. 31

శూన్యే యే నాపనీతాసి తస్య ద్రక్ష్యసి యత్ఫలమ్,
న చిరా ద్రావణం సఙ్ఖ్యే యో వధిష్యతి వీర్యవా౯. 32

రోషప్రముక్తై రిషుభి ర్జ్వలద్భి రివ పావకైః,
తే నాహం ప్రేషితో దూత స్త్వత్సకాశ మిహాగతః. 33

తద్వియోగేన దుఃఖార్త స్స త్వాం కౌశల మబ్రవీత్,
లక్ష్మణశ్చ మహాతేజా స్సుమిత్రానన్దవర్ధనః. 34

అభివాద్య మహాబాహు స్స త్వాం కౌశల మబ్రవీత్. 35

రామస్య చ సఖా దేవి సుగ్రీవో నామ వానరః,
రాజా వానరముఖ్యానాం స త్వాం కౌశల మబ్రవీత్. 36

నిత్యం స్మరతి రామ స్త్వాం ససుగ్రీవ స్సలక్ష్మణః,
దిష్ట్యా జీవసి వైదేహి రాక్షసీవశ మాగతా. 37

న చిరా ద్ద్రక్ష్యసే రామం లక్ష్మణం చ మహాబలమ్,
మధ్యే వానరకోటీనాం సుగ్రీవం చామితౌజసమ్. 38

అహం సుగ్రీవసచివో హనుమా న్నామ వానరః,
ప్రవిష్టో నగరీం లఙ్కాం లఙ్ఘయిత్వా మహోదధిమ్. 39

కృత్వా మూర్ధ్ని పదన్యాసం రావణస్య దురాత్మనః,
త్వాం ద్రష్టు ముపయాతోఽహం సమాశ్రిత్య పరాక్రమమ్.

నాహ మస్మి తథా దేవి యథా మా మవగచ్ఛసి,
విశఙ్కా త్యజ్యతా మేషా శ్రద్ధత్స్వ వదతో మమ. 41

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, వాల్మీకీయే,
చతుర్వింశత్సహస్రికాయామ్, సంహితాయామ్,
శ్రీమత్సున్దరకాణ్డే, చతుస్త్రింశ స్సర్గః.

## శ్రీమద్రామాయణ మాహాత్మ్యమ్

శ్లో. నరస్య ధనసంపత్తి ర్యావతీ యస్య విద్యతే,
తాం నైవా ఫలపేచ్ఛక్తిం విప్రగుర్వచ్యుతార్చనే.

# 34వ సర్గము

## హనుమంతుడు సీత ననునయించుట

తరువాత హనుమానుడు తాను మిక్కిలి దుఃఖపడి మహా దుఃఖితురాలగు సీతతో ఇటుల సాంత్వన వచనములను పలుకజొచ్చెను. జానకీదేవీ! శ్రీరామచంద్రుని సందేశమును స్వీకరించి నీ సన్నిధికి రామదూతనై వచ్చితిని. అతడు నీ క్షేమ మడిగినాడు. మహాతేజస్వియు రామకైంకర్యనిరతుడును అగు లక్ష్మణుడు నీకు అభివాదము చేయుచున్నాడు. ఆ రామ లక్ష్మణుల క్షేమ వార్తను విని సర్వాంగములు ప్రీతిని, ఆనందమును నిండుగ వ్యక్తము చేయుచుండగా హనుమంతునితో ఇట్లు పలికెను.

## సీత హనుమంతునితో పలుకుట

'బ్రతికి యుండినచో' నూఱేండ్లకైనను శుభములు పడయవచ్చు అను లోకోక్తి నా విషయమున యథార్థమై తోచుచున్నది. తన వద్దకు వచ్చిన రాముని కుశల వార్త ఎఱిగించిన ఆ హనుమంతుని యందు చాల ప్రీతి కల్గినది. సీతాదేవి వాయునందనుడు పరస్పరవిశ్వాసముతో సీతాదేవి మాటలను విని హనుమంతుడు ఆమె సమీపమునకు రా దలంచెను.

తన సమీపమునకు వచ్చుచున్న ఆంజనేయుని చూచి రావణుడని శంకింప దొడంగెను. అయ్యో నేను ఎంత పొరపాటు చేసితిని. పరపురుషునితో మాటలాడితిని. రావణుడే ఈ వానరరూపమున వచ్చియుండును. అని తలంచి ఆ సీత ఆ శింశుపా వృక్ష శాఖను విడిచి నేలపై కూర్చుండెను. ఆంజనేయుడును దుఃఖార్తురాలైన మిక్కిలి భీతయై వాస్తవమును గ్రహింపలేకపోవుచున్న ఆ జానకీ దేవికి నమస్కరించెను. ఆ సీతాదేవి మిక్కిలి భయపడినదై అతని వంక సరిగ చూడలేదు.

## సీత ఆంజనేయునితో పలుకుట

నమస్కరించుచున్న ఆ ఆంజనేయుని చూచి దీర్ఘముగ నిట్టూర్చి మధురస్వరముతో పలికినది. నీవు మాయావి అయి. రూపమును మార్చుకొని వచ్చితివి. నీకిది మేలు కాదు. వాస్తవమైన రాక్షసరూపము విడిచి భిక్షువేషమును జనస్థానమున నాకు కనబడిన రావణుడవే అయి ఉందువు. కామరూపి వయిన ఓ రావణా ఉపవాసముచే కృశించి దీనురాలనై యున్న నన్ను బాధించినవో నీకు కీడే కల్గును. నేను అనుమానించునట్లు కాక నీవు రామదూతవే అయినచో నా మనస్సులో ప్రీతిని, శాంతిని కల్గించితివి కనుక నీకు మేలు కల్గును. నీవు రామదూతవు కానిచో నీ యందు నాకింత ప్రీతి కల్గదు. రామచంద్రుని గాథ నాకెంతో ఇష్టమయినది.

ఓ వానరోత్తమా! ఆ రామచంద్రుని గుణములను గుఱించి మఱికొంత కాలము చెప్పుము. నదీ ప్రవాహము గట్టును ఆకర్షించుచునట్లు నీవు నా మనస్సును ఆకర్షించుచున్నావు. స్వప్నమైనను ఎంత సుఖమును కల్గించినది. రామచంద్రునిచే పంపబడిన వానరుని చూడగల్గు చున్నాను. స్వప్నములో నైనను లక్ష్మణసహితుడైన రామచంద్రుని చూడవలెనని తలంచినను ఆ స్వప్నము కూడ నాయందు మాత్సర్యము వహించినది. స్వప్నములో వానరుడు కనిపించినచో అనర్థము కల్గుట వాస్తవము. కాని ఈ వానర దర్శనముచే రామ లక్ష్మణుల క్షేమము తెలిసి అభ్యుదయము కల్గినది. కనుక ఈ వానర దర్శనము స్వప్నము నందు కల్గినది కాదు.

ఈ వికారము ఉన్మాదముచే కల్గినది? ధాతు క్షయాదులచే కల్గినదా? చిత్త భ్రాంతియా? మృగతృష్ణికయా? ఇవి ఏవియు కావు.

నన్ను నేను సరిగా ఎఱుగుదును. వానరుడును నా ఎదుట నిలిచి ఉన్నాడు. నన్ను చూడగల్గుచున్నాను. ఇన్ని వికల్పములతో ఆలోచించి చూచియు రాక్షసులు కామరూపులు కనుక రావణాసురుడే ఈ రూపమున వచ్చి ఉండును కదా అని ఆలోచించి హనుమానునితో ఏమియు మాటలాడకయుండెను.

## హనుమంతుడు సీతతో పలుకుట

తనతో ఏమియు బదులు పల్కని సీతాదేవి మనస్సును అర్థము చేసికొని చెవికి ఇంపైన మాటలతో ఈ రీతిగ పలుకజొచ్చెను. అమ్మా సీతాదేవీ! శ్రీరాముడు సూర్యుని వలె మహాతేజోవంతుడు. చంద్రుని వలె లోక మనోహరుడు. కుబేరుని వలె సర్వలోకాధిపతి. మహాకీర్తిమంతుడగు విష్ణువు వలె విక్రమ సంపన్నుడు. సత్యవచనుడు. బృహస్పతివలె మధురముగ మాటలాడువాడు. సౌందర్యవంతుడు. రమణీయుడు, కాంతిమంతుడు. కోపింపవలసిన సమయమున కోపించువాడు. తన కోపమునకు గుఱి అయిన వానిని దండించువాడు. మహారథులలో ఉత్తముడుగా పేరొందినవాడు.

ఇట్టి గుణగణములు కల్గినవాడు శ్రీరాముడు. రామచంద్రుని బాహుచ్ఛాయ నాశ్రయించి లోకమంతయు నిలిచి యున్నది. అట్టి శ్రీరామచంద్రుని మాయా మృగమును చూపి వంచించి రామలక్ష్మణులు లేని ఆశ్రమము నుండి రావణుడు నిన్ను అపహరించినాడు. ఆ కార్యమునకు రావణుడు ఎట్టి ఫలమును అనుభవింపగలడో నీవు తొందరలో చూడగలవు.

అగ్నిహోత్రమువలె జ్వలించుచున్న బాణములను ప్రయోగించి యుద్ధభూమిలో రాముడు రావణుని చంపగలడు. ఆ రాముడు నీ వద్దకు నన్ను దూతగా పంపగా వచ్చియున్నాను. నీ వియోగకాలమున అత్యంతదుఃఖితుడైన రాముడు నీ క్షేమ మడిగినాడు. సుమిత్రానందవర్ధనుడగు లక్ష్మణుడు కూడ నీకు అభివాదమొనర్చి నీ క్షేమ మడిగినాడు. వానరాధిపతియు రామచంద్రునికి ఆప్తమిత్రుడైన సుగ్రీవమహారాజు కూడ నీ క్షేమ మడిగినాడు. సుగ్రీవ మహారాజు లక్ష్మణుడు ఈ ఇద్దరితో కలిసినప్పుడెల్ల రాముడు నిన్నే గుర్తునకు తెచ్చుకొనుచు ఉండును.

అమ్మా వైదేహీ! ఇంతమంది రాక్షసస్త్రీల మధ్యలో ఎవరి అదృష్టమో నీవు జీవించియున్నావు. తొందరలోనే రాముని, మహాబలుడగు లక్ష్మణుని, వానరబలములతో కూడిన మహాశక్తిమంతుడగు సుగ్రీవుని, చూడగలవు. నేను సుగ్రీవుని మంత్రిని. సముద్రమును దాటి లంకలో ప్రవేశించితిని. ఈ లంకాధిపతియు దురాత్ముడు అగు రావణుని తలపై కాలుపెట్టి నిన్ను చూచుటకు వచ్చితిని. నా పరాక్రమముతో నిన్ను చూడదలచి ఇక్కడకు వచ్చితిని. నీవు తలంచినట్లు నేను రావణుడను కాను. నీ వా శంక విడువుము. నా మాటలను శ్రద్ధగా వినుము. నా మాటలను విశ్వసింపుము. నాయందు విశ్వాసము కల్గి ఉండుము.



# ౩౫. పఞ్చత్రింశ స్సర్గః

తాం తు రామకథాం శ్రుత్వా వైదేహీ వానరర్షభాత్,
ఉవాచ వచనం సాన్త్వ మిదం మధురయా గిరా. 1

క్వ తే రామేణ సంసర్గః కథం జానాసి లక్ష్మణమ్,
వానరాణాం నరాణాం చ కథ మాసీ త్సమాగమః. 2

యాని రామస్య లిఙ్గాని లక్ష్మణస్య చ వానర,
తాని భూయ స్సమాచక్ష్వ న మాం శోక స్సమావిశేత్. 3

కీదృశం తస్య సంస్థానం రూపం రామస్య కీదృశమ్,
కథ మూరూ కథం బాహూ లక్ష్మణస్య చ శంస మే. 4

ఏవ ముక్తస్తు వైదేహ్యా హనుమా న్మారుతాత్మజః,
తతో రామం యథాతత్త్వ మాఖ్యాతు ముపచక్రమే. 5

జానన్తీ బత దిష్ట్యా మాం వైదేహీ పరిపృచ్ఛసి,
భర్తుః కమలపత్రాక్షి సంస్థానం లక్ష్మణస్య చ. 6

యాని రామస్య చిహ్నాని లక్ష్మణస్య చ యాని వై,
లక్షితాని విశాలాక్షి వదత శ్శృణు తాని మే. 7

రామః కమలపత్రాక్ష స్సర్వసత్వమనోహరః,
రూపదాక్షిణ్యసంపన్నః ప్రసూతో జనకాత్మజే. 8

తేజసాऽऽదిత్య సఙ్కాశః క్షమయా పృథివీసమః,
బృహస్పతిసమో బుద్ధ్వా యశసా వాసవోపమః. 9

రక్షితా జీవలోకస్య స్వజన స్యాభిరక్షితా,
రక్షితా స్వస్య వృత్తస్య ధర్మస్య చ పరంతపః. 10

రామో భామిని లోకస్య చాతుర్వర్ణ్యస్య రక్షితా,
మర్యాదానాం చ లోకస్య కర్తా కారయితా చ సః. 11

అర్చిష్మా నర్చితోऽత్యర్థం బ్రహ్మచర్యవ్రతే స్థితః,
సాధూనా ముపకారజ్ఞః ప్రచారజ్ఞశ్చ కర్మణామ్. 12

రాజవిద్యావినీతశ్చ బ్రాహ్మణానా ముపాసితా,
శ్రుతవా ఞ్ఛీలసంపన్నో వినీతశ్చ పరంతపః. 13

యజుర్వేదవినీత శ్చ వేదవిద్భి స్సుపూజితః,
ధనుర్వేదే చ వేదేషు వేదాఙ్గేషు చ నిష్ఠితః. 14

విపులాంసో మహాబాహుః కమ్బుగ్రీవ శ్శుభాననః,
గూఢజత్రు స్సుతామ్రాక్షో రామో దేవి జనై శ్శ్రుతః. 15

దున్దుభిస్వననిర్ఘోష స్స్నిగ్ధవర్ణః ప్రతాపవాౕ,
సమ స్సమవిభక్తాఙ్గో వర్ణం శ్యామం సమాశ్రితః. 16

త్రిస్థిర స్త్రిప్రలమ్బశ్చ త్రిసమ స్త్రిషు చోన్నతః,
త్రితామ స్త్రిషు చ స్నిగ్ధో గమ్భీర స్త్రిషు నిత్యశః. 17

త్రివలీవాం స్త్ర్యవనత శ్చతుర్వ్యఙ్గ స్త్రిశీర్షవాన్,
చతుష్కళ చతుర్లేఖ శ్చతుష్కిష్కు శ్చతుస్సమః. 18

చతుర్దశసమద్వన్ద్వ శ్చతుర్దంష్ట్ర శ్చతుర్గతిః,
మహోష్ఠ హను నాసశ్చ పఞ్చస్నిగ్ధో ఽష్టవంశవాన్. 19

దశపద్మో దశబృహ త్రిభి ర్వ్యాప్తో ద్విశుక్లవాన్,
షడున్నతో నవతను స్త్రిభి ర్వ్యాప్నోతి రాఘవః. 20

సత్యధర్మ శ్శ్రీమాన్ సంగ్రహానుగ్రహే రతః,
దేశకాలవిభాగజ్ఞ స్సర్వలోకప్రియంవదః. 21

భ్రాతా చ తస్య ద్వైమాత్ర స్సౌమిత్రి రపరాజితః,
అనురాగేణ రూపేణ గుణై శ్చైవ తథావిధః. 22

తా వుభౌ నరశార్దూలౌ త్వద్దర్శనసముత్సుకౌ,
విచిన్వన్తౌ మహీం కృత్స్నా మస్మాభి రభిసఙ్గతౌ. 23

త్వా మేవ మార్గమాణౌ తౌ విచరన్తౌ వసుంధరామ్,
దదర్శతు ర్మృగపతిం పూర్వజే నావరోపితమ్. 24

ఋశ్యమూకస్య పృష్ఠే తు బహుపాదపసంకులే,
భ్రాతు ర్భయార్త మాసీనం సుగ్రీవం ప్రియదర్శనమ్. 25

వయం తు హరిరాజం తం సుగ్రీవం సత్యసంగరమ్,
పరిచర్యాస్మహే రాజ్యా త్పూర్వజే నావరోపితమ్. 26

తత స్తౌ చీరవసనౌ ధనుఃప్రవరపాణినౌ,
ఋశ్యమూకస్య శైలస్య రమ్యం దేశ ముపాగతౌ. 27

స తౌ దృష్ట్వా నరవ్యాఘ్రౌ ధన్వినౌ వానరర్షభః,
అవప్లుతో గిరే స్తస్య శిఖరం భయమోహితః. 28

తత స్స శిఖరే తస్మిం వానరేన్ద్రో వ్యవస్థితః,
తయో స్సమీపం మా మేవ ప్రేషయామాస సత్వరమ్. 29

తా వహం పురుషవ్యాఘ్రౌ సుగ్రీవ వచనా త్ప్రభూ,
రూపలక్షణసమ్పన్నౌ కృతాఞ్జలి రుపస్థితః. 30

తౌ పరిజ్ఞాతతత్త్వార్థౌ మయా ప్రీతిసమన్వితౌ,
పృష్ఠ మారోప్య తం దేశం ప్రాపితౌ పురుషర్షభౌ. 31

నివేదితౌ చ తత్త్వేన సుగ్రీవాయ మహాత్మనే,
తయో రన్యోన్యసల్లాపా ద్భృశం ప్రీతి రజాయత. 32

తత స్తౌ ప్రీతిసంపన్నౌ హరీశ్వరనరేశ్వరౌ,
పరస్పరకృతాశ్వాసౌ కథయా పూర్వవృత్తయా. 33

తత స్స సాన్త్వయామాస సుగ్రీవం లక్ష్మణాగ్రజః,
స్త్రీహేతో ర్వాలినా భ్రాత్రా నిరస్త మురుతేజసా. 34

తత స్త్వన్నాశజం శోకం రామ స్యాక్లిష్టకర్మణః,
లక్ష్మణో వానరేన్ద్రాయ సుగ్రీవాయ న్యవేదయత్. 35

స శ్రుత్వా వానరేన్ద్రస్తు లక్ష్మణే నేరితం వచః,
తదాసీ న్నిష్ప్రభో ఽ త్యర్థం గ్రహగ్రస్త ఇ వాంశుమాన్. 36

తత స్త్వద్గాత్రశోభీని రక్షసా హ్రియమాణయా,
యా న్యాభరణజాలాని పాతితాని మహీతలే. 37

తాని సర్వాణి రామాయ ఆనీయ హరియూథపాః,
సంహృష్టా దర్శయామాసు ర్గతిం తు న విదు స్తవ. 38

తాని రామాయ దత్తాని మయైవోపహృతాని చ,
స్వనవ న్త్యవకీర్ణాని తస్మి న్విగతచేతసి. 39

తా న్యఙ్క్తే దర్శనీయాని కృత్వా బహువిధం తవ,
తేన దేవప్రకాశేన దేవేన పరిదేవితమ్. 40

పశ్యత స్తాని రుదత స్తామ్యత శ్చ పునఃపునః,
ప్రాదీపయ న్దాశరథే స్తాని శోకహుతాశనమ్. 41

శయితం చ చిరం తేన దుఃఖార్తేన మహాత్మనా,
మయాఽపి వివిధై ర్వాక్యైః కృచ్ఛ్రా దుత్థాపితః పునః. 42

తాని దృష్ట్వా మహాబాహు ర్దర్శయిత్వా ముహుర్ముహుః,
రాఘవ స్సహసౌమిత్రి స్సుగ్రీవే స న్యవేదయత్. 43

స తవాదర్శనా దార్యే రాఘవః పరితప్యతే,
మహతా జ్వలతా నిత్య మగ్నినే వాగ్నిపర్వతః. 44

త్వత్కృతే త మనిద్రా చ శోక శ్చిన్తా చ రాఘవః,
తాపయన్తి మహాత్మాన మగ్న్యగార మి వాగ్నయః. 45

త వాదర్శన శోకేన రాఘవః ప్రవిచాల్యతే,
మహతా భూమికమ్పేన మహా నివ శిలోచ్చయః. 46

కాననాని సురమ్యాణి నదీః ప్రస్రవణాని చ,
చర న్న రతి మాప్నోతి త్వా మపశ్య న్నృపాత్మజే. 47

స త్వాం మనుజశార్దూలః క్షిప్రం ప్రాప్స్యతి రాఘవః,
సమిత్రబాన్ధవం హత్వా రావణం జనకాత్మజే. 48

సహితౌ రామసుగ్రీవా వుభా వకురుతాం తదా,
సమయం వాలినం హన్తుం తవ చాన్వేషణం తథా. 49

తత స్తాభ్యాం కుమారాభ్యాం వీరాభ్యాం స హరీశ్వరః,
కిష్కిన్ధాం సముపాగమ్య వాలీ యుద్ధే నిపాతితః. 50

తతో నిహత్య తరసా రామో వాలిన మాహవే,
సర్వర్క్షహరిసఙ్ఘానాం సుగ్రీవ మకరో త్పతిమ్. 51

రామసుగ్రీవయో రైక్యం దే వ్యేవం సమజాయత,
హనుమన్తం చ మాం విద్ధి తయో ర్దూత మిహాగతమ్. 52

స్వరాజ్యం ప్రాప్య సుగ్రీవ స్సమానీయ హరీశ్వరా౯,
త్వదర్థం ప్రేషయామాస దిశో దశ మహాబలా౯. 53

ఆదిష్టా వానరేన్ద్రేణ సుగ్రీవేణ మహౌజసా,
అద్రిరాజప్రతీకాశా స్సర్వతః ప్రస్థితా మహీమ్. 54

తత స్తే మార్గమాణా వై సుగ్రీవవచనాతురాః,
చరన్తి వసుధాం కృత్స్నాం వయ మన్యే చ వానరాః. 55

అఙ్గదో నామ లక్ష్మీవాన్ వాలిసూను ర్మహాబలః,
ప్రస్థితః కపిశార్దూల స్త్రిభాగబలసంవృతః. 56

తేషాం నో విప్రణష్టానాం విన్ధ్యే పర్వతసత్తమే,
భృశం శోకపరీతానా మహోరాత్రగణా గతాః. 57

తే వయం కార్యనైరాశ్యా త్కాల స్యాతిక్రమేణ చ,
భయాచ్చ కపిరాజస్య ప్రాణాం స్త్యక్తుం వ్యవస్థితాః. 58

విచిత్య వనదుర్గాణి గిరిప్రస్రవణాని చ,
అనాసాద్య పదం దేవ్యాః ప్రాణాం స్త్యక్తుం సముద్యతాః.59

దృష్ట్వా ప్రాయోపవిష్టాంశ్చ సర్వాన్ వానరపుఙ్గవాన్,
భృశం శోకార్ణవే మగ్నః పర్యవేదయ దఙ్గదః. 60

తవ నాశం చ వైదేహి వాలినశ్చ వధం తథా,
ప్రాయోపవేశ మస్మాకం మరణం చ జటాయుషః. 61

తేషాం న స్స్వామిసన్దేశా న్నిరాశానాం ముమూర్షతామ్,
కార్యహేతో రివాయాత శ్శకుని ర్వీర్యవా న్మహాన్. 62

గృధ్రరాజస్య సోదర్య స్సంపాతి ర్నామ గృధ్రరాట్,
శ్రుత్వా భ్రాతృవధం కోపా దిదం వచన మబ్రవీత్. 63

యవీయాన్ కేన మే భ్రాతా హతః క్వచ నిపాతితః,
ఏత దాఖ్యాతు మిచ్ఛామి భవద్భి ర్వానరోత్తమాః. 64

అఙ్గదోఽకథయ త్తస్య జనస్థానే మహద్వధమ్,
రక్షసా భీమరూపేణ త్వా ముద్దిశ్య యథాతథమ్. 65

జటాయుషో వధం శ్రుత్వా దుఃఖిత స్సోఽరుణాత్మజః,
త్వాం శశంస వరారోహే వసన్తీం రావణాలయే. 66

తస్య తద్వచనం శ్రుత్వా సంపాతేః ప్రీతివర్ధనమ్,
అఙ్గదప్రముఖా స్తూర్ణం తత స్సంప్రస్థితా వయమ్. 67

విన్ధ్యా దుత్థాయ సంప్రాప్తా స్సాగరస్యాన్త ముత్తరమ్,
త్వద్దర్శనకృతోత్సాహా హృష్టా స్తుష్టాః ప్లవఙ్గమాః. 68

అఙ్గదప్రముఖా స్సర్వే వేలోపాన్త ముపస్థితాః,
చిన్తాం జగ్ముః పున ర్భీతా స్త్వద్దర్శనసముత్సుకాః. 69

అథాహం హరిసైన్యస్య సాగరం ప్రేక్ష్య సీదతః,
వ్యవధూయ భయం తీవ్రం యోజనానాం శతం ప్లుతః.70

లఙ్కా చాపి మయా రాత్రౌ ప్రవిష్టా రాక్షసాకులా,
రావణ శ్చ మయా దృష్ట స్త్వం చ శోకపరిప్లుతా. 71

ఏత త్తే సర్వ మాఖ్యాతం యథావృత్త మనిన్దితే,
అభిభాషస్వ మాం దేవి దూతో దాశరథే రహమ్. 72

తం మాం రామకృతోద్యోగం త్వన్నిమిత్త మిహాగతమ్,
సుగ్రీవసచివం దేవి బుద్ధ్యస్వ పవనాత్మజమ్. 73

కుశలీ తవ కాకుత్స్థ స్సర్వశస్త్రభృతాం వరః,
గురో రారాధనే యుక్తో లక్ష్మణశ్చ సులక్షణః. 74

తస్య వీర్యవతో దేవి భర్తు స్తవ హితే రతః,
అహ మేకస్తు సంప్రాప్త స్సుగ్రీవవచనా దిహ. 75

మ యేయ మసహాయేన చరతా కామరూపిణా,
దక్షిణా ది గనుక్రాన్తా త్వన్మార్గవిచయైషిణా. 76

దిష్ట్యాహం హరిసైన్యానాం త్వన్నాశ మనుశోచతామ్,
అపనేష్యామి సంతాపం తవాభిగమశంసనాత్. 77

దిష్ట్యా హి మమ న వ్యర్థం దేవి సాగరలఙ్ఘనమ్,
ప్రాప్స్య మ్యహ మిదం దిష్ట్యా త్వద్దర్శనకృతం యశః.78

రాఘవశ్చ మహావీర్యః క్షిప్రం త్వా మభిపత్స్యతే,
సమిత్రబాన్ధవం హత్వా రావణం రాక్షసాధిపమ్. 79

మాల్యవా న్నామ వైదేహి గిరీణా ముత్తమో గిరిః,
తతో గచ్ఛతి గోకర్ణం పర్వతం కేసరీ హరిః. 80

స చ దేవర్షిభి ర్దిష్టః పితా మమ మహాకపిః,
తీర్థే నదీపతేః పుణ్యే శమ్బసాదన ముద్ధరత్. 81

త స్యాహం హరిణః క్షేత్రే జాతో వాతేన మైథిలి,
హనుమా నితి విఖ్యాతో లోకే స్వేనైవ కర్మణా. 82

విశ్వాసార్థం తు వైదేహి భర్తు రుక్తా మయా గుణాః,
అచిరా ద్రాఘవో దేవి త్వా మితో నయితాఽనఘే. 83

ఏవం విశ్వాసితా సీతా హేతుభి శ్శోకకర్శితా,
ఉపపన్నై రభిజ్ఞానై ర్దూతం త మవగచ్ఛతి. 84

అతులం చ గతా హర్షం ప్రహర్షేణ చ జానకీ,
నేత్రాభ్యాం వక్రపక్ష్మభ్యాం ముమోచాఽఽనన్దజం జలమ్.

చారు త ద్వదనం తస్యా స్తామ్రశుక్లాయతేక్షణమ్,
అశోభత విశాలాక్ష్యా రాహుముక్త ఇ వోడురాట్. 86

హనుమన్తం కపిం వ్యక్తం మన్యతే నాన్యథేతి సా,
అ థోవాచ హనూమాం స్తాం ముత్తరం ప్రియదర్శనామ్.87

ఏత త్తే సర్వ మాఖ్యాతం సమాశ్వసిహి మైథిలి,
కిం కరోమి కథం వా తే రోచతే ప్రతియా మ్యహమ్.88

హతేఽసురే సంయతి శమ్బసాదనే
కపిప్రవీరేణ మహర్షిచోదనాత్,
తతోఽస్మి వాయుప్రభవో హి మైథిలి
ప్రభావత స్తత్ప్రతిమశ్చ వానరః. 89

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, వాల్మీకీయే,
చతుర్వింశత్సహస్రికాయాం, సంహితాయాం,
శ్రీమత్సున్దరకాణ్డే, పంచత్రింశ స్సర్గః.

## శ్రీమద్రామాయణ మాహాత్మ్యమ్

శ్లో. అకిఞ్చనోఽపి రామస్య కథాం శ్రుత్వా ప్రయత్నతః,
విహితే ష్వష్టమాంశం వా షోడశాంశ మథాపివా.

శ్లో. దద్యా దేవ యథాశక్తి దక్షిణాదిక మాదరాత్,
శక్తిం నాపలపే ద్దేవి ప్రాణైః కణ్ఠగతైరపి.

## 35 వ సర్గము

### సీత హనుమంతునితో పలుకుట

జానకీ దేవి ఆ వానరోత్తముని నుండి శ్రీరామచంద్రుని గాథను విని సాంత్వనముగా తీయని మాటలతో మాటలాడ దొడంగెను. నీకు రామచంద్రునితో, లక్ష్మణునితో పరిచయము ఎట్లు ఏర్పడెను? వానరులకు నరులకు స్నేహము ఎట్లు ఏర్పడెను? రామచంద్రుని గుర్తులేమి? లక్ష్మణునకు గుర్తులేమి? వారిని గురించి నీవు విపులముగా చెప్పుము. అప్పుడు నాకు కలిగిన శంక తొలంగును. రామచంద్రుని అవయవసన్నివేశమెట్టిది? రూపమెట్టిది? కాంతి ఎట్టిది? లక్ష్మణుని అవయవసన్నివేశ, రూప, వర్ణాదులను గూర్చి స్పష్టముగ చెప్పుము. సీతాదేవి ఇట్లు పలుకగనే లోకమాన్యుడు రామచంద్రుని గుఱించి ఇట్లు చొప్పదొడంగెను.

### హనుమంతుడు సీతతో రామలక్ష్మణుల గుర్తులను చెప్పుట

జానకీదేవీ! శ్రీరాముని లక్ష్మణుని దేహ నిర్మాణ రూపవర్ణాదులను గూర్చి బాగుగ తెలిసియు నా వలన తిరిగి వినగోరుచున్నావా? రామలక్ష్మణుల యొక్క గుర్తులు నేను గ్రహించినంత వరకు చెప్పుచున్నాను. శ్రద్ధగా ఆలకింపుము. శ్రీరాముడు సర్వాంగ

సుందరుడు. తామర రేకుల వంటి నేత్రములు కల్గినవాడు. సర్వప్రాణులకు మనోహరుడు. తిర్యగ్ జాతిలోన పుట్టి ఒక కొమ్మ మీది నుండి మరియొక కొమ్మ మీదికి దుముకుచు జీవించు వానరజాతిలో పుట్టిన నావంటి వాని మనస్సును కూడ ఆకర్షించినవాడు. రూపాది దేహ గుణములు దాక్షిణ్యాది ఆత్మగుణములు పూర్ణముగ కలిగి అవతరించినవాడు.

అతడు తేజస్సులో సూర్యునకు, క్షమా గుణములో భూమికి, బుద్ధిలో బృహస్పతికి, యశస్సులో ఇంద్రునకు సమానుడు, జీవలోకమును రక్షించువాఁడు, స్వజనులను ఉపేక్షింపక వారిని కూడ రక్షించువాడు. తన వృత్తమును, ధర్మమును కూడ రక్షించుకొనువాడు. నాలుగు వర్ణముల వారిని వారి వారి వర్ణ ధర్మములను అతిక్రమింపకుండ చూచువాడు. లోక మర్యాదలను తాను ఆచరించి ఆచరింపజేయు చుండును. తేజోవంతుడు. అందరిచే గౌరవింపబడువాడు.

గృహస్థుడైనను బ్రహ్మచర్య వ్రతమును ఆచరించువాడు. సజ్జనుల యొక్క ఉపకారమును తెలిసినవాడు. ఐహికాముష్మికకర్మముల యొక్క విధానమును ఫలములను తెలిసిన వాడు. రాజవిద్యలైన అన్వీక్షకి త్రయి వార్త దండనీతి అనువానియందు చక్కని అభ్యాసము చేసినవాడు. బ్రాహ్మణులను ఆరాధించువాడు. వేదాధ్యయనము చేసినవాడు. సదాచార సంపన్నుడు. వినయము కలవాడు. శత్రువులను తపింప చేయువాడు. యజుర్వేదమును బాగుగా అధ్యయనము చేసినవాడు. వేదవేత్తలచేత పూజింపబడినవాడు. వేదములందు. వేదాంగములందు. ధనుర్వేదమునందు గొప్ప ప్రజ్ఞ కలవాడు.

విశాలమైన భుజ శిరస్సులు కలవాడు. దీర్ఘములైన బాహువులు కలవాడు. శంఖము వంటి కంఠము గలవాడు. సుందరమైన ముఖము గలవాడు. పైకి కనబడని జత్రులు (కంటి ఎముక) కలవాడు. ఎఱ్ఱని నేత్రములు కలవాడు. దుందుభిధ్వనితో సమానమైన కంఠధ్వని కలవాడు. దర్శనీయమైన దేహవర్ణము కలవాడు. ఒడ్డు పొడుగులు సరిగ ఉన్న దేహము కలవాడు. సమముగ విభక్తమయిన అవయవములు కలవాడు. నల్లని దేహ వర్ణము కలవాడు.

మూడు స్థానములందు స్థిరత్వము గలవాడు. మూడింటి యందు దైర్ఘ్యము కలవాడు. మూడిట సమానత గలవాడు. మూడు స్థానము లందు ఔన్నత్యము గలవాడు. మూడింట ఎఱ్ఱదనము గలవాడు. మూడింట నైగనిగ్యము గలవాడు. మూడింట గాంభీర్యము గలవాడు. వళిత్రయము గలవాడు. అవనతమైన మూడు భాగములు కలవాడు. వైకల్యయుక్తమైన నాలుగు అవయవములు కలవాడు. త్రిలక్షణయుత మయిన శిరస్సు కలవాడు.

చతుర్వేదాధ్యయనమును సూచించు రేఖలు కలవాడు. ఎనిమిది అడుగుల పొడవుగల దేహము గలవాడు. నాలుగింట సమత కలవాడు. పదునాల్గు అవయవములందు కూడ సమత కలవాడు. సింహ శార్దూల గజ వృషభ గతులను తలపించు గమనము కలవాడు. నాలుగు దంతములు (కోరలు) కలవాడు. ఎఱ్ఱనై సుందరమగు పెదవులు బలిష్ఠమైన హనువు కలవాడు. ఉన్నతమైన దీర్ఘమైన నాసిక కలవాడు. నిగనిగలాడు వాక్య వక్త్ర నఖలోమ చర్మములు కలవాడు. ఆఱింటి యందు ఔన్నత్యము తొమ్మిదింటి యందు అల్పత

మూడింట వ్యాప్తి కలవాడు. రాముడు. ఆర్జించుట సత్పాత్రదానము చేయుట బాగుగ తెలిసినవాడు.

దేశకాల విభాగము బాగుగ తెలిసినవాడు. సర్వజనులకు ప్రియమైన మాటలను పలుకువాడు. కౌసల్యా, సుమిత్ర లిద్దరి చేత తమ పుత్రుడనియే భావింపబడుచున్నవాడు. పరాజయము ఎరుగని లక్ష్మణుడును అనురాగము చేత, రూపము చేత, గుణముల చేత రామచంద్రునితో సమానుడే.

ఆ సోదరులిద్దరును నీ జాడ తెలిసి కొనవలెనన్న తలంపుతో ఆయా ప్రదేశములందు అంతటను వెదకుచు మా వద్దకు వచ్చిరి. అప్పటికే మా సుగ్రీవ మహారాజు అన్నగారిచే రాజ్యమునుండి తరిమి వేయబడి బహుపాదప సంకులమైన ఋశ్యమూకమును ఆక్రమించుకొని ఉండెను. ఆడి తప్పని ఆ సుగ్రీవ మహారాజును రాజ్యభ్రష్టుడైనను మేమందరమును విడువక సేవించుచున్నాము.

తరువాత నార చీరలను కట్టి మహాధనుస్సు చేత ధరించిన రామలక్ష్మణులను చూచి మా ప్రభువు సుగ్రీవుడు భయపడి కొండ శిఖరమెక్కి కూర్చుండెను. అప్పుడు సుగ్రీవుడు వచ్చుచున్న వారెవరో తెలిసికొనుటకై నన్ను పంపెను. రూప లక్షణ సంపన్నులయిన ఆ రామలక్ష్మణుల వద్దకు మా సుగ్రీవాజ్ఞచే కృతాంజలినై వెళ్ళితిని. వాస్తవములు తెలిసికొని ప్రేమమూర్తులు అయిన వారి ఇద్దరిని నా భుజములపై కూర్చుండ బెట్టుకొని సుగ్రీవ సన్నిధికి చేర్చితిని.

రామలక్ష్మణులను సుగ్రీవునకు పరిచయము చేసినాను. అన్యోన్య సంలాపము చేత వారికి పరస్పరము ప్రీతి కలిగినది. ఆ నరేశ్వర

కపీశ్వరులు ఇద్దరును పరస్పరము ప్రీతిని, విశ్వాసమును కల్గి ఉండిరి. ఒకరినొకరు ఊరడించుకొని ఉండిరి. వాలి తన భార్యను అపహరింపగా మిక్కిలి దుఃఖితుడైయున్న సుగ్రీవుని రాముడు ఊరడించెను. నీవు కనబడనందున అతిదుఃఖితుడై యున్న రాముని శోకమును గూర్చి లక్ష్మణుడు సుగ్రీవునకు ఎఱిగించెను.

లక్ష్మణుని మాటలను విన్న తరువాత క్షణకాలము తేజో విహీనుడయిన సుగ్రీవుడు రావణాసురుడు నిన్ను అపహరించి తీసికొనిపోవు చున్నపుడు వస్త్రమున మూటకట్టి పడవైచిన వస్తువులను సుగ్రీవుని యాజ్ఞచే వానర యూథపతులు శ్రీరామునికి చూపిరి. నీవు ఉన్న ప్రదేశమును గూర్చి చెప్పలేకపోయిరి. వానరులు తెచ్చిన ఆ ఆభరణములను రాముని సన్నిధికి తెచ్చి ఎదుట ఉంచితిని. తన సమీపమున ఉన్న దర్శనీయములయిన ఆ వస్తువులను చూచి శ్రీరాముడు మిక్కిలి విలపించెను. ఆ వస్తువులను పరీక్షగా చూచుచున్నపుడు పరితాపముతో ఏడ్చుచున్నప్పుడు రాముని శోకాగ్ని పెరిగెను. దుఃఖార్తుడైన ఆ శ్రీరాముడు నేలపై వాలిపోయెను. నేను ఉపచారము చేయుచు సాంత్వన వచనములు పలుకుచు ఆ కష్టము నుండి తప్పించితిని. ఆ వస్తువులను చూచి మాటిమాటికి సుగ్రీవునకు చూపించుచు తెలియపఱిచెను.

అగ్నిచే అగ్ని పర్వతము వలె నీ వియోగముచే శ్రీరాముడు మిక్కిలి పరితపించుచున్నాడు. త్రేతాగ్నులచే అగ్ని గృహము వలె నీ కొరకై ఆ రాముని నిదురలేమి, శోకము, నిన్ను గురించిన ఆలోచన పరితపింపచేయుచున్నవి. భూకంపముచే పర్వతము వలె నీవు

కనబడనందువలన కలిగిన శోకముచే రాముడు చలించిపోవుచున్నాడు. జానకీమాతా! అందమైన అడవులు ఈ జీవ నదులు గలగల ప్రవహించు సెలయేళ్ళు శ్రీరామచంద్రునకు ఊరట కలిగించుటలేదు. సమిత్ర పుత్ర బాంధవముగా రావణుని సంహరించి రాముడు నిన్ను చేరగలడు.

రామ సుగ్రీవులిద్దరును స్నేహము చేసికొని వాలిని సంహరించుటకు రాముడు, నిన్ను వెదకుటకై సుగ్రీవుడు ప్రతిజ్ఞ చేసికొన్నారు. తరువాత రామ లక్ష్మణులతో వచ్చి ఆసుగ్రీవుడు వాలితో పోరాడెను. వాలి నిహతుడయ్యెను. వాలి సంహారానంతరము సుగ్రీవుని శ్రీరాముడు కిష్కింధారాజ్యాధిపతిని చేసెను. రామసుగ్రీవుల మైత్రి ఈ రీతిగ జరిగినదమ్మా!

నాపేరు హనుమంతుడు. వారి దూతగా నన్ను తెలిసికొనుము. వానర రాజ్యమును స్వీకరించి వానరోత్తములను పిలిపించి మహా బలిష్ఠులయిన మావంటి వానరులను భూమియందున అంతటను అన్వేషించుటకై పంపించెను. వారు నిన్ను వెదకుచున్నారు. వాలి కుమారుడును, యువరాజును అగు అంగదుడు పెద్ద సేనను వెంటపెట్టుకొని మా అందరికి అధిపతియై దక్షిణ దిక్కున అన్వేషించుచున్నాడు.

వింధ్యపర్వతమున దారి తప్పి తిరుగుచున్నపుడు చాల దినములు గడచిపోయినవి. నిరాశచేత, కాలము గడచిపోయినందున, సుగ్రీవుని వలన భయముచేత మేమందరమును ప్రాణత్యాగము చేయుటకై సిద్ధపడితిమి. ఎన్ని ఘోరారణ్యములు తిరిగినను పర్వత ప్రాంతములు

వెదకినను, నీ జాడ తెలియక ప్రాణములు త్యజింప బూనితిమి. ప్రాయోపవేశమొనర్చుచున్న మమ్ములను చూచి యువరాజు అంగదుడు మిక్కిలి విలపించెను. సుగ్రీవుని ఆజ్ఞలు తలంచుకొను సమయమున సీతాన్వేషణము చేయలేకపోయితిమి సమయాతి క్రమణము చేసియు, సీత జాడ కనుగొనని మమ్ములను ప్రభువు క్షమింపడు అని తలంచి ప్రాయోపవేశమునకు ఉద్యుక్తులమైన మమ్ములను చూచి మిక్కిలి దుఃఖితుడై విలపించిన యువరాజు అంగదుడు మాటలలో నీవు కనబడకపోవుట, వాలివధ, మా ప్రాయోపవేశము, జటాయువు మరణము ప్రస్తావనకు వచ్చినవి.

అదే సమయమున జటాయువు సోదరుడు సంపాతి అచ్చటికి వచ్చెను. సోదరుని వధను గూర్చి విన్న సంపాతి నా తమ్ముని చంపినదెవరు అని అడిగెను. అప్పుడు జనస్థానము నుండి రావణుడు నిన్ను అపహరించుట దారిలో వచ్చి జటాయువు రావణుని ప్రతిఘటించుట రావణునితో జరిగిన యుద్ధములో జటాయువు వీరమరణము నొందుట అంగదుడు సంపాతికి చెప్పెను. ఆ అరుణకుమారుడగు సంపాతి, లంకలో రావణుని గృహమున సీత ఉన్నదని చెప్పెను.

ఆ సంపాతి మాటలను విని మేమందరమును వింధ్య పర్వతము నుండి బయలుదేరితిమి. దక్షిణ సముద్ర తీరమునకు చేరితిమి. ఈ మహాసముద్రమును దాటుట ఎట్లు అనుకొన్న వానరులు నిన్ను చూడవలెనని ఎంత ఆసక్తి ఉన్నను నిరుత్సాహపడిరి. మహాసముద్రమును దాటుట సాధ్యముకాదని నిరుత్సాహపడుచున్న వానరుల భయమును తొలగించుచు నూఱు యోజనముల సముద్రమును దాటి ఈ రాత్రి నేను లంకను చేరితిని.

నేను రామణుని చూచితిని. శోక సముద్రములో నిమగ్నురాలవైన నిన్ను చూచితిని. నీవడిగిన అంశములన్నియును విశదముగ చెప్పితిని. నేను రామచంద్రుని దూతను. శ్రీరాముని ఆజ్ఞచే ఎంతగనో ప్రయత్నించి శ్రమపడి నీ సన్నిధికి వచ్చిన నన్ను సుగ్రీవుని మంత్రిగా వాయుకుమారునిగా తెలిసికొనుము. సర్వ శస్త్రాస్త్ర కోవిదులలో ఉత్తముడయిన కకుత్థ్సవంశోత్తముడు రామచంద్రుడు క్షేమముగా ఉన్నాడు. సర్వవిధకైంకర్యములను సమర్పించుకొనుచున్న లక్ష్మణుడును క్షేమముగా ఉన్నాడు.

రాముని యొక్క, నీ యొక్క హితమును కోరి సుగ్రీవుని యొక్క ఆజ్ఞను శిరసావహించి అసహాయుడనై నీవున్న చోటు తెలిసికొనుటకై ఇచ్చటికి వచ్చితిని. నీవు కనబడక అత్యంత దుఃఖితులై యున్న వానరుల దుఃఖమును నీ జాడ తెలిసినది అను శుభవార్త తెలిపి తొలగించెదను. అదృష్ట వశమున నా సముద్ర లంఘనము వృథా కాలేదు. హనుమంతుడు సీతాదేవి జాడ తెలిసికొన్నాడు అను యశస్సు నాకు దక్కగలదు. మహావీరుడగు రాముడు సమిత్ర బాంధవముగా రావణుని సంహరించి నిన్ను చేరగలడు.

వైదేహీ! మాల్యవంతమను ఒక పర్వత శ్రేష్ఠము గలదు. అచ్చటి నుండి కేసరి అను వానరోత్తముడు గోకుల పర్వతమునకు పోవుచుండెను. మా తండ్రి అగు కేసరి మహర్షుల యొక్క ఆదేశముచే పవిత్రమైన సముద్ర తీరములో శంబసాదనుడు అను రాక్షసుని సంహరించెను. అతని భార్యయగు అంజనకు వాయుదేవుని వలన నేను జన్మించితిని.

నాయొక్క విలక్షణమైన ఒక క్రియచే హనుమాన్ అని ప్రసిద్ధి వహించి ఉన్నాను. నీకు విశ్వాసము కలిగించుటకై రామచంద్రుని

యొక్క గుణగణములను కీర్తించి ఉన్నాను. తొందరలోనే శ్రీరాముడు ఏ పాపము ఎఱుగని నిన్ను తీసికొని అయోధ్యకు చేరగలడు.

శోకముచే కృశించి యున్న ఆ సీతాదేవి హనుమానుడు చూపించిన హేతువులచే, గుర్తులచే, అభిజ్ఞానముచే అతనిని రామదూత అని గుర్తించెను. ఆమె గొప్పగ ఆనందించెను.

అప్పుడు ఆమె నేత్రముల నుండి ఆనంద బాష్పములు జాలువారెను. ఆనందముచే ఎరుపు వారిన తెల్లని నేత్రములు కల్గిన ఆమె ముఖము రాహు విముక్తమయిన చంద్రబింబము వలె భాసించెను. ఇతడు రాక్షసుడు కాని, రాక్షసాధిపతి కాని కాడు. రామదూత అయిన రామదూతయే అని విశ్వాసము కలిగెను.

## హనుమంతుడు సీతను కర్తవ్యమడుగుట

ప్రసన్నురాలైన ఆ సీతను గూర్చి హనుమంతుడు మఱియు ఇట్లు పలికెను. మైథిలీ! నీవడిగిన ప్రశ్నలన్నింటికి సమాధానము చెప్పితిని. నీవు ఊరట వహింపుము. నేను ఇక చేయవలసినది ఏమి? పోవుదునా అని అడిగెను. మహర్షుల ఆజ్ఞను వహించి యుద్ధమున శంబసాదనుడు అను రాక్షసుని సంహరించిన వానరాధిపతి కేసరి కుమారుడను. నీవు ఏమి చేయుమని ఆజ్ఞాపించినను వాయుపుత్రుడను వాయుసమానుడను అయిన నేను చేసి చూపగలను.



# ౩౬. షట్త్రింశ స్సర్గః

భూయ ఏవ మహాతేజా హనుమా న్మారుతాత్మజః,
అబ్రవీ త్ప్రశ్రితం వాక్యం సీతాప్రత్యయకారణాత్. 1

వానరోఽహం మహాభాగే దూతో రామస్య ధీమతః,
రామనామాఙ్కితం చేదం పశ్య దే వ్యఙ్గులీయకమ్. 2

ప్రత్యయార్థం తవాఽఽనీతం తేన దత్తం మహాత్మనా,
సమాశ్వసిహి భద్రం తే క్షీణదుఃఖఫలా హ్యసి. 3

గృహీత్వా ప్రేక్షమాణా సా భర్తుః కరవిభూషణమ్,
భర్తార మివ సంప్రాప్తా జానకీ ముదితాఽభవత్. 4

చారు త ద్వదనం తస్యా స్తామ్రశుక్లాయతేక్షణమ్,
అశోభత విశాలాక్ష్యా రాహుముక్త ఇ వోడురాట్. 5

తత స్సా హ్రీమతీ బాలా భర్తృసన్దేశహర్షితా,
పరితుష్టా ప్రియం కృత్వా ప్రశశంస. మహాకపిమ్. 6

విక్రాన్త స్త్వం సమర్థ స్త్వం ప్రాజ్ఞ స్త్వం వానరోత్తమ,
యే నేదం రాక్షసపదం త్వయైకేన ప్రధర్షితమ్. 7

శతయోజనవిస్తీర్ణ స్సాగరో మకరాలయః,
విక్రమశ్లాఘనీయేన క్రమతా గోష్పదీకృతః. 8

న హి త్వాం ప్రాకృతం మన్యే వానరం వానరర్షభ,
యస్య తే నాస్తి సంత్రాసో రావణా న్నాపి సంభ్రమః. 9

అర్హాసే చ కపిశ్రేష్ఠ మయా సమభిభాషితుమ్,
యద్యపి ప్రేషిత స్తేన రామేణవిదితాత్మనా. 10

ప్రేషయిష్యతి దుర్ధర్షో రామో న హ్యపరీక్షితమ్,
పరాక్రమ మవిజ్ఞాయ మత్సకాశం విశేషతః. 11

దిష్ట్యా చ కుశలీ రామో ధర్మాత్మా సత్యసఙ్గరః,
లక్ష్మణ శ్చ మహాతేజా స్సుమిత్రానన్దవర్ధనః. 12

కుశలీ యది కాకుత్స్థః కిన్ను సాగరమేఖలామ్,
మహీం దహతి కోపేన యుగాన్తాగ్ని రి వోత్థితః. 13

అథవా శక్తిమన్తౌ తౌ సురాణా మపి నిగ్రహే,
మమైవ తు న దుఃఖానా మస్తి మన్యే విపర్యయః. 14

కచ్చి న్నవ్యథితో రామః కచ్చి న్నపరితప్యతే,
ఉత్తరాణి చ కార్యాణి కురుతే పురుషోత్తమః. 15

కచ్చి న్న దీన స్సంభ్రాన్తః కార్యేషు చ న ముహ్యతి,
కచ్చి త్పురుషకార్యాణి కురుతే నృపతే స్సుతః. 16

ద్వివిధం త్రివిధోపాయ ముపాయ మపి సేవతే,
విజిగీషు స్సుహృ త్కచ్చి న్మిత్రేషు చ పరంతపః. 17

కచ్చి న్మిత్రాణి లభతే మిత్రై శ్చాప్యభిగమ్యతే,
కచ్చి త్కల్యాణమిత్రశ్చ మిత్రై శ్చాపి పురస్కృతః. 18

కచ్చి దాశాస్తి దేవానాం ప్రసాదం పార్థివాత్మజః,
కచ్చి త్పురుషకారం చ దైవం చ ప్రతిపద్యతే. 19

కచ్చి న్న విగతస్నేహః ప్రవాసా న్మయి రాఘవః,
కచ్చి న్మాం వ్యసనా దస్మా న్మోక్షయిష్యతి వానర. 20

సుఖానా ముచితో నిత్య మసుఖానా మనూచితః,
దుఃఖ ముత్తర మాసాద్య కచ్చి ద్రామో న సీదతి. 21

కౌసల్యాయా స్తథా కచ్చి త్సుమిత్రాయా స్తథైవ చ,
అభీక్ష్ణం శ్రూయతే కచ్చి త్కుశలం భరతస్య చ. 22

మన్నిమిత్తేన మానార్హః కచ్చి చ్ఛోకేన రాఘవః,
కచ్చి న్నాన్యమనా రామః కచ్చి న్మాం తారయిష్యతి. 23

కచ్చి దక్షౌహిణీం భీమాం భరతో భ్రాతృవత్సలః,
ధ్వజినీం మన్త్రిభి ర్గుప్తాం ప్రేషయిష్యతి మత్కృతే. 24

వానరాధిపతి శ్శ్రీమాన్ సుగ్రీవః కచ్చి దేష్యతి,
మత్కృతే హరిభి ర్వీరై ర్వృతో దన్తనఖాయుధైః. 25

కచ్చి చ్చ లక్ష్మణ శ్శూర స్సుమిత్రానన్దవర్ధనః,
అస్త్రవి చ్ఛరజాలేన రాక్షసా న్విధమిష్యతి. 26

రౌద్రేణ కచ్చి దస్త్రేణ జ్వలతా నిహతం రణే,
ద్రక్ష్యా మ్యల్పేన కాలేన రావణం ససుహృజ్జనమ్. 27

కచ్చి న్న త ద్ధేమసమానవర్ణం
త స్యాననం పద్మసమానగన్ధి,

మయా వినా శుష్యతి శోకదీనం
జలక్షయే పద్మ మి వాతపేన. 28

ధర్మాపదేశా త్త్యజత శ్చ రాజ్యం
మాం చాప్యరణ్యం నయతః పదాతిమ్,
న సీ ద్వ్యథా యస్య న భీ ర్నశోకః
కచ్చి చ్చ ధైర్యం హృదయే కరోతి. 29

న చాస్య మాతా న పితా చ నాన్యః
స్నేహా ద్విశిష్టోఽస్తి మయా సమో వా,
తావ త్త్వహం దూత జిజీవిషేయం
యావ త్ప్రవృత్తిం శృణుయాం ప్రియస్య. 30

ఇతీ వ దేవీ వచనం మహార్థం
తం వానరేన్ద్రం మధురార్థ ముక్త్వా,
శ్రోతుం పున స్తస్య వచోఽభిరామం
రామార్థయుక్తం విరరామ రామా. 31

సీతాయా వచనం శ్రుత్వా మారుతి ర్భీమవిక్రమః,
శిర స్యఞ్జలి మాధాయ వాక్య ముత్తర మబ్రవీత్. 32

న త్వ మిహస్థాం జానీతే రామః కమలలోచనే,
తేన త్వాం నానయ త్యాశు శచీ మివ పురన్దరః. 33

శ్రుత్వైవ తు వచో మహ్యం క్షిప్ర మేష్యతి రాఘవః,
చమూం ప్రకర్ష న్మహతీం హర్యృక్షగణసంకులామ్. 34

విష్టమ్భయిత్వా బాణౌఘై రక్షోభ్యం వరుణాలయమ్,
వరిష్యతి పురీం లఙ్కాం కాకుత్స్థ శ్శాన్తరాక్షసామ్. 35

తత్ర యద్యన్తరా మృత్యు ర్యది దేవా స్సహాసురాః,
స్థాస్యన్తి పథి రామస్య స తా నపి వధిష్యతి. 36

త వాదర్శనజే నార్యే శోకేన స పరిప్లుతః,
న శర్మ లభతే రామ స్సింహార్దిత ఇవ ద్విపః. 37

మలయేన చ విన్ధ్యేన మేరుణా మన్దరేణ చ,
దర్దురేన చ తే దేవి శపే మూలఫలేన చ. 38

యథా సునయనం వల్గు బిమ్బోష్ఠం చారుకుణ్డలమ్,
ముఖం ద్రక్ష్యసి రామస్య పూర్ణచన్ద్ర మివోదితమ్. 39

క్షిప్రం ద్రక్ష్యసి వైదేహి రామం ప్రస్రవణే గిరౌ,
శతక్రతు మివాసీనం నాకపృష్ఠస్య మూర్ధని. 40

న మాంసం రాఘవో భుఙ్క్తే న చాఽపి మధు సేవతే,
వన్యం సువిహితం నిత్యం భక్త మశ్నాతి పఞ్చమమ్. 41

నైవ దంశా న్న మశకా న కీటా న సరీసృపాః,
రాఘవో ఽపనయే ద్గాత్రా త్త్వద్గతే నాన్తరాత్మనా. 42

నిత్యం ధ్యానపరో రామో నిత్యం శోకపరాయణః,
నా న్య చ్చిన్తయతే కించి త్స తు కామవశం గతః. 43

అనిద్ర స్సతతం రామ స్సుప్తోఽపి చ నరోత్తమః,
సీతేతి మధురాం వాణీం వ్యాహర న్ప్రతిబుధ్యతే. 44

దృష్ట్వా ఫలం వా పుష్పం వా యద్వాఽన్య త్సుమనోహరమ్,
బహుశో హా ప్రియే త్యేవం శ్వసం స్త్వా మభిభాషతే. 45

స దేవి నిత్యం పరితప్యమాన
స్త్వా మేవ సీతే త్యభిభాషమాణః,
ధృతవ్రతో రాజసుతో మహాత్మా
తవైవ లాభాయ కృత ప్రయత్నః. 46

సా రామసంకీర్తన వీతశోకా
రామస్య శోకేన సమానశోకా,
శరన్ముఖే సామ్బుదశేషచన్ద్రా
నిశేవ వైదేహసుతా బభూవ. 47

ఇత్యార్షే, శ్రీమద్రామయణే, ఆదికావ్యే, వాల్మీకీయే,
చతుర్వింశత్సహస్రికాయాం, సంహితాయాం,
శ్రీమత్సున్దరకాణ్డే, షట్త్రింశ స్సర్గః.

## శ్రీమద్రామాయణ మాహాత్మ్యమ్

శ్లో. అశక్తా వప్రధానేతు ప్రత్యవైతి న కశ్చన,
శక్తా వప్యదద స్మర్త్యో భవ త్యాత్మాప హారకః.

## 36 వ సర్గము

సీతాదేవి జాడ తెలిసినందువలన తాను రామదూతనని సీతాదేవికి విశ్వాసము కల్గింపగలిగినందువలన ఆంజనేయుడు మహాతేజోవంతుడయ్యెను. సీతాదేవిని ఇంకను గట్టి విశ్వాసము కలిగించుటకై ఇంకను మాటాడనారంభించెను.

### హనుమంతుడు సీతకు రామాంగుళీయకము నిచ్చుట

ఓ అదృష్టశాలినివయిన సీతాదేవీ! నేను రామచంద్రుని దూతగా వచ్చిన వానరుడను. మహాబుద్ధిశాలి అయిన రామచంద్రుడు నా చేత తన పేరితో కూడిన ఉంగరమును కూడ పంపియున్నాడు. ఇదిగో రామచంద్రుని అంగుళీయకమును చూడుము. మహాత్ముడయిన రామచంద్రుడు ఇచ్చిన అంగుళీయకమును అతిభద్రముగా తెచ్చియున్నాను. ఊరడిల్లుము. నీకు మేలు కలుగును. కష్టకాలము గడచిపోయినది. రామచంద్రుని వ్రేలికి తొడుగబడి వ్రేలికేకాక హస్తమునకు కూడ ఆభరణముగా ప్రకాశమానమగు ఆ ఉంగరమును తీసికొని అత్యంత ప్రీతితో సీతాదేవి చూడనారంభించినది. రాముని ఉంగరము కాక రాముడే తన వద్దకు వచ్చినట్లుగా మిక్కిలి సంతోషభరితురాలయ్యెను.

ఆమె తెల్లని నేత్రములందు రాగరేఖలు ఉదయించెను. సుందరమైన ఆమె ముఖము రాహువు విడిచిన చంద్రబింబము వలె శోభించెను. ఆమె ఉంగరమును పరిశీలించు సమయమున్న బాలిక వలె తోచెను. హ్రీమతి అయ్యెను. చాల సంతోషము కలిగినదై ఆ వానరేంద్రుని ప్రీతిపూర్వకముగా ప్రశంసించెను.

## సీత హనుమంతునకు తన సంతోషము చెప్పట

వానరోత్తమా! నీవు విక్రమము కలవాడవు. సమర్థుడవు. బాగుగా తెలిసిన వాడవు. ఈ రాక్షసా వాసమునకు నీవు ఒక్కడవు బయలుదేరి రాగలుగుట అసాధారణమైన విషయము. నూఱు యోజనముల విస్తీర్ణమయిన ఈ మహా సముద్రము నీ విక్రమ శక్తికి గోష్పదమయినది. రావణుడు అన్న నీకు భయము లేదు. ఆందోళన లేదు. ఇంతటి ధైర్య సాహసములతో లంకలో ప్రవేశించిన నిన్ను సామాన్యవానరునిగా ఊహింపలేను. రామచంద్రునిచే దూతగ పంపింపబడిన నీవు నాతో సంభాషింప దగుదువు.

మహాశక్తిమంతుడయిన శ్రీరాముడు శౌర్యపరాక్రమాదులను పరీక్షించి తెలిసికొనకుండ నా వద్దకు పంపడు. ఆడి తప్పని శ్రీరాముడు అదృష్టవశమున క్షేమముగా ఉన్నాడు కదా! సుమిత్రానందవర్ధనుడు, మహాతేజోవంతుడగు లక్ష్మణుడు క్షేమముగా ఉన్నాడు కదా! రామచంద్రుడు ప్రళయాగ్నివలె నుద్యుక్తుడై సాగర మేఖల యగు ఈ భూమిని కోపముచే దహించివేయునా? దేవతల నందఱను నిగ్రహింప గల్గిన శక్తియుక్తులు కలిగిన ఆ రామలక్ష్మణులు ఏల ఉపేక్షించుచున్నారు? నా దుఃఖానుభవకాలము ఇంకను పూర్తి కాలేదేమో! శ్రీరాముడు నా వియోగదుఃఖముచే కృశింపలేదు కదా! పరితాపమును పొందలేదు కదా!

నన్ను తన వద్దకు చేర్చుకొనుటకై ఆ పురుషోత్తముడు తగు కార్యములు చేయుచున్నాడా అధైర్యము చేతగాని సంభ్రమము చెందికాని కార్యచరణములో అనుచిత నిర్ణయమును చేయుటలేదు కదా! అదృష్టముపై ఆధారపడక పురుషప్రయత్నమును తగురీతిగ

చేయుచున్నాడా? ఇతరులకు తాను ఉపకరించి మిత్రులుగా చేసికొని ఆ మిత్రుల సాహాయమును పొందు తలంపులో ఉన్నాడా? పురుష ప్రయత్నముతోపాటు దేవానుగ్రహమును కూడ పొందగోరుచున్నాడా? ఇంతకాలము విశ్లేషమును పొంది ఉన్నందున శ్రీరామునకు నాపై గల స్నేహము తగ్గలేదు గదా. అన్ని కష్టములనుండి గట్టెక్కించునా? (విడిపించునా) కష్టమనునది ఎరుగక ఎప్పుడును సుఖానుభవమును పొందిన రాముడు అంతము కనబడని ఈ దుఃఖముతో అవసాదము (నిరుత్సాహమును) నొందుట లేదు కదా? కౌసల్యా సుమిత్రుల భరతుని క్షేమము తెలియుచున్నదా. నామూలమున కలిగిన ఈ శోకముచే కార్యాంతరాసక్తుడు కాలేదు కదా? తొందరలో నన్ను కష్టముల నుండి దూరము చేయునా?

అన్నగారి యందు ప్రీతి కలిగిన భరతుడు గొప్ప శౌర్య విక్రమములు కలిగిన ఒక అక్షౌహిణీ సేనను రామునకు సహాయముగా పంపించునా? ఆ సేనతో సంరక్షులుగా మంత్రులను కూడ పంపించునా? వానరాధిపతి యగు సుగ్రీవుడు దంత నఖాయుధులగు వానరులను వెంటబెట్టుకొని వచ్చునా? సుమిత్రానందనుడు అస్త్రవేత్తయు శూరుడగు లక్ష్మణుడు తన బాణములచే రాక్షస సంహారమును చేయునా? భయంకరమగు నిప్పులను కురింపించుచున్న రామప్రయుక్తమగు అస్త్రముచే యుద్ధరంగమున నేలగూలిన ఈ రావణుని ఎప్పుడు చూతునో?

నీటికి దూరమయిన పద్మమువలె నాకు. దూరమైన రామచంద్రుని పద్మ సమాన గంధమగు కమనీయమైన ముఖము వాడిపోవుట లేదుకదా? ధర్మమును ఆచరించుటకై రాజ్యత్యాగము చేయునప్పుడు నన్ను అరణ్యమునకు కాలినడకను తీసికొని పోవుచున్నప్పుడు భయపడని బాధపడని శ్రీరాముడు నావియోగదశయందు కూడ

ధైర్యముగా ఉన్నాడా! శ్రీరాముని ప్రేమకు నేను పాత్రమైనంతగా తండ్రికాని తల్లి కాని ఎవ్వరైన కాని ప్రేమపాత్రులు కాజాలరు. కావుననే రామచంద్రుని వృత్తాంతము తెలియునంతవరకు జీవించుచున్నాను.

**హనుమంతుడు సీతతో పలుకుట**

సీతాదేవి ఈ రీతిగ మహార్థయుక్తమగు మాటలను పలికి మరల రామదూతయగు ఆంజనేయునివలన రామవృత్తమును తెలియగోరి తన ప్రసంగమును ముగించెను. సీతాదేవి మాటలను విన్న తరువాత మహాపరాక్రమ సంపన్నుడగు మారుతి చేతులు జోడించి ఈవిధముగ పలుక దొడంగెను. సీతాదేవీ! నేను ఇచ్చట ఉన్నట్లు శ్రీరామునకు తెలియదు. అందువలననే నిన్ను తీసికొని పోవుటలో ఆలస్యము జరుగుచున్నది.

అనుహ్లాదుడు అపహరించిన శచీదేవిని తెచ్చు కొనుటలో జాడ తెలియక పోవుట కారణముగా మొదట ఆలస్యమయినను జాడ తెలిసిన వెంటనే ఇంద్రుడు శచీదేవిని తీసికొని పోలేదా. నీజాడ తెలిసినది కనుక శ్రీరాముడు వచ్చి నిన్ను తీసికొని వెళ్లగలడు. నా వలన ఇచటి సంగతులను తెలిసికొని శ్రీరామచంద్రుడు గొప్ప వానర సేనను వెంటపెట్టుకొని ఈ లంకకు రాగలడు. తన బాణవర్షముచే సముద్రుడు ఆర్చివేయగలడు. ఈ లంకను రాక్షసరహితము చేయును. యముడుకాని దేవతలుకాని, రాక్షసులు కాని ఎవరు అడ్డమై వచ్చినను వారిని కూడ వధించువాడు.

నీవు కనబడనందు వలన కలిగిన శోకముచే సింహముచే దెబ్బతిన్న మదగజమువలె శ్రీరాముడు బాధపడుచున్నాడు. మలయపర్వతమున. వింధ్య పర్వతము. మేరు పర్వతము. మందర పర్వతము. దర్దుర పర్వతము మీదను మూలఫలముల మీదను ఒట్టు వేసికొని

చెప్పుచున్నాడు. చక్కని నేత్ర సౌందర్యము. బింబాధరము. సుందర కుండలాలంకృతము అయిన ఉదయించిన పూర్ణచంద్రునితో సమానమగు శ్రీరాముని ముఖమును నీవు తొందరలోనే చూడగలవు. స్వర్గమును అధిష్ఠించిన ఇంద్రుని వలె ప్రస్రవణగిరియందు వేంచేసియున్న రామచంద్రుని తొందరలో చూడగలవు.

శ్రీరాముడు నీవియోగకాలమున మాంసభోజనము మానినాడు. మధుపానీయము మానినాడు. ఎప్పుడో సాయంకాలపు వేళ లక్ష్మణుడు బలవంత పెట్టగా మూలఫలాదులను పరిమితముగా తీసికొనుచున్నాడు. నీయందు మనస్సు నిలుపుకొని పరాకుగా ఉన్న రాముడు ఈగలనుకాని, దోమలనుగాని, కీటకములనుగాని, సరీసృపములను కాని దేహమునుండి తొలగించుకొనుటలేదు. నీయందలి ప్రీతి విశేషముచే నిన్నే ధ్యానించు కొనుచున్నాడు. మూర్తీభవించిన శోకమువలె ఉన్నాడు. ఇతర విషయములు ఏమియు పట్టించుకొనుట లేదు. నిద్రలేక కొద్దిపాటి నిద్ర లభించినను సీతా అని పలుకుచు వెంటనే మేల్కొను చున్నాడు. ఫలమును కాని పుష్పమును కాని మనోహరమగు మఱియొక వస్తువును కాని చూచి హా సీతా అనుచు నీపేరే పలుకు చున్నాడు. నిన్ను సీతా అని పరితపించుచు నిన్ను పొందుటకై తగు ప్రయత్నము చేయుచున్నాడు.

హనుమంతుడు శ్రీరాముని గుఱించి చెప్పిన మాటలచేత కొంత విశ్లేషదుఃఖము తరిగినను రాముని వియోగ కాలమున రామునితో సమాన శోకమును కలిగినదై శరత్ కాలారంభమున మేఘ శకలాచ్ఛన్నుడయిన చంద్రునితో కూడిన రాత్రివలె ఉండెను.



# 37. సప్తత్రింశ స్సర్గః.

సీతా త ద్వచనం శ్రుత్వా పూర్ణచన్ద్రనిభాననా,
హనూమన్త మువా చేదం ధర్మార్థసహితం వచః. 1

అమృతం విషసంసృష్టం త్వయా వానర భాషితమ్,
యచ్చ నాన్యమనా రామో యచ్చ శోకపరాయణః. 2

ఐశ్వర్యే వా సువిస్తీర్ణే వ్యసనే వా సుదారుణే,
రజ్జ్వేవ పురుషం బద్ధ్వా కృతాన్తః పరికర్షతి. 3

విధి ర్నూన మసంహార్యం ప్రాణినాం ప్లవగోత్తమ,
సౌమిత్రిం మాం చ రామం చ వ్యసనైః పశ్య మోహితాన్.

శోక స్యాస్య కదా పారం రాఘవోఽధిగమిష్యతి,
ప్లవమానః పరిశ్రాన్తో హతనౌ స్సాగరే యథా. 5

రాక్షసానాం వధం కృత్వా సూదయిత్వా చ రావణమ్,
లజ్కా మున్మూలితాం కృత్వా కదా ద్రక్ష్యతి మాం పతిః.6

స వాచ్య స్సంత్వర స్వేతి యావ దేవ నిపూర్యతే,
అయం సంవత్సరః కాల స్తావద్ధి మమ జీవితమ్. 7

వర్తతే దశమో మాసో ద్వౌ తు శేషౌ ప్లవఙ్గమ,
రావణేన నృశంసేన సమయో యః కృతో మమ. 8

విభీషణేన చ భ్రాత్రా మమ నిర్యాతనం ప్రతి,
అనునీతః ప్రయత్నేన న చ తత్కురుతే మతిమ్. 9

మమ ప్రతిప్రదానం హి రావణస్య న రోచతే,
రావణం మార్గతే సఙ్ఖ్యే మృత్యుః కాలవశంగతమ్. 10

జ్యేష్ఠా కన్యా నలా నామ విభీషణసుతా కపే,
తయా మమేద మాఖ్యాతం మాత్రా ప్రహితయా స్వయమ్.

అసంశయం హరిశ్రేష్ఠ క్షిప్రం మాం ప్రాప్స్యతే పతిః,
అన్తరాత్మా హి మే శుద్ధ స్తస్మిం శ్చ బహవో గుణాః. 12

ఉత్సాహః పౌరుషం సత్త్వ మానృశంస్యం కృతజ్ఞతా,
విక్రమశ్చ ప్రభావశ్చ సన్తి వానర రాఘవే. 13

చతుర్దశ సహస్రాణి రాక్షసానాం జఘాన యః,
జనస్థానే వినా భ్రాత్రా శత్రుః క స్తస్య నోద్విజేత్. 14

న స శక్య స్తులయితుం వ్యసనైః పురుషర్షభః,
అహం తస్య ప్రభావజ్ఞా శక్ర స్యేవ పులోమజా. 15

శరజాలాంశుమా నిఞ్చూరః కపే రామదివాకరః,
శత్రురక్షోమయం తోయ ముపశోషం నయిష్యతి. 16

ఇతి సంకల్పమానాం తాం రామార్థే శోకకర్శితామ్,
అశ్రుసంపూర్ణనయనా ముపాచ వచనం కపిః. 17

శ్రుత్వైవ తు వచో మహ్యం క్షిప్ర మేష్యతి రాఘవః,
చమూం ప్రకర్ష న్మహతీం హర్యృక్షగణసంకులామ్. 18

అథవా మోచయిష్యామి త్వా మద్యైవ వరాననే,
అస్మా ద్దుఃఖా దుపారోహ మమ పృష్ఠ మనిన్దితే. 19

త్వాం హి పృష్ఠగతాం కృత్వా సంతరిష్యామి సాగరమ్,
శక్తి రస్తి హి మే వోఢుం లఙ్కా మపి సరావణామ్. 20

అహం ప్రస్రవణస్థాయ రాఘవా యాద్య మైథిలి,
ప్రాపయిష్యామి శక్రాయ హవ్యం హుత మి వానలః. 21

ద్రక్ష్య స్యద్యైవ వైదేహి రాఘవం సహ లక్ష్మణమ్,
వ్యవసాయసమాయుక్తం విష్ణుం దైత్యవధే యథా. 22

త్వద్దర్శనకృతోత్సాహ మాశ్రమస్థం మహాబలమ్,
పురన్దర మివాసీనం నాకరాజస్య మూర్ధని. 23

పృష్ఠ మారోహ మే దేవి మా వికాఙ్క్షస్వ శోభనే,
యోగ మన్విచ్ఛ రామేణ శశాఙ్కేనేవ రోహిణీ. 24

కథయన్తీవ చన్ద్రేణ సూర్యేణ చ మహార్చిషా,
మత్పృష్ఠ మధిరుహ్య త్వం తరాకాశమహార్ణవౌ. 25

న హి మే సంప్రయాతస్య త్వా మితో నయతోఽఙ్గనే,
అనుగన్తుం గతిం శక్తా స్సర్వే లఙ్కానివాసినః. 26

య థై వాహ మిహ ప్రాప్త స్తథై వాహ మసంశయః,
యాస్యామి పశ్య వైదేహి త్వా ముద్యమ్య విహాయసమ్. 27

మైథిలీ తు హరిశ్రేష్ఠా చ్ఛ్రుత్వా వచన మద్భుతమ్,
హర్షవిస్మితసర్వాఙ్గీ హనుమన్త మథాబ్రవీత్. 28

హనుమా౯ దూర మధ్వానం కథం మాం వోఢు మిచ్ఛసి,
త దేవ ఖలు తే మన్యే కపిత్వం హరియూథప. 29

కథం వా ల్పశరీర స్త్వం మా మితో నేతు మిచ్ఛసి,
సకాశం మానవేన్ద్రస్య భర్తు ర్మే ప్లవగర్షభ. 30

సీతాయా వచనం శ్రుత్వా హనుమా న్మారుతాత్మజః,
చిన్తయామాస లక్ష్మీవా న్నవం పరిభవం కృతమ్. 31

న మే జానాతి సత్త్వం వా ప్రభావం వాఽసితేక్షణా,
తస్మా త్పశ్యతు వైదేహీ యద్రూపం మమ కామతః. 32

ఇతి సంచిన్త్య హనుమాం స్తదా ప్లవగసత్తమః,
దర్శయామాస వైదేహ్యా స్స్వరూప మరిమర్దనః. 33

స తస్మా త్పాదపా ద్ధీమా నాప్లుత్య ప్లవగర్షభః,
తతో వర్ధితు మారేభే సీతాప్రత్యయకారణాత్. 34

మేరుమన్దరసఙ్కాశో బభౌ దీప్తానలప్రభః,
అగ్రతో వ్యవతస్థే చ సీతాయా వానరోత్తమః. 35

హరిః పర్వతసఙ్కాశ స్తామ్రవక్త్రో మహాబలః,
వజ్రదంష్ట్రనఖో భీమో వైదేహీ మిద మబ్రవీత్. 36

స పర్వతవనోద్దేశాం సాట్టప్రాకారతోరణామ్,
లఙ్కా మిమాం సనాథాం వా నయితుం శక్తి రస్తి మే. 37

త దవస్థాప్యతాం బుద్ధి రలం దేవి వికాఙ్క్షయా,
విశోకం కురు వైదేహి రాఘవం సహలక్ష్మణమ్. 38

తం దృష్ట్వా భీమసఙ్కాశ మువాచ జనకాత్మజా,
పద్మపత్రవిశాలాక్షీ మారుత స్యౌరసం సుతమ్. 39

తవ సత్త్వం బలం చైవ విజానామి మహాకపే,
వాయో రివ గతిం చాపి తేజ శ్చాగ్నే రివాద్భుతమ్. 40

ప్రాకృతోఽన్యః కథం చేమాం భూమి మాగన్తు మర్హతి,
ఉదధే రప్రమేయస్య పారం వానరపుఙ్గవ. 41

జానామి గమనే శక్తిం నయనే చాపి తే మమ,
అవశ్యం సంప్రధా ర్యాశు కార్యసిద్ధి ర్మహాత్మనః. 42

అయుక్తం తు కపిశ్రేష్ఠ మమ గన్తుం త్వయాఽనఘ,
వాయువేగసవేగస్య వేగో మాం మోహయే త్తవ. 43

అహ మాకాశ మాపన్నా హ్యుపర్యుపరిసాగరమ్,
ప్రపతేయం హి తే పృష్ఠా ద్భయా ద్వేగేన గచ్ఛతః. 44

పతితా సాగరే చాహం తిమినక్రఝషాకులే,
భవేయ మాశు వివశా యాదసా మన్న ముత్తమమ్. 45

న చ శక్ష్యే త్వయాసార్ధం గన్తుం శత్రువినాశన,
కళత్రవతి సన్దేహ స్త్వయ్యపి స్యా దసంశయః. 46

హ్రియమాణాం తు మాం దృష్ట్వా రాక్షసా భీమవిక్రమాః,
అనుగచ్ఛేయు రాదిష్టా రావణేన దురాత్మనా. 47

తై స్త్వం పరివృత శ్శూరై శ్శూలముద్గరపాణిభిః,
భవే స్త్వం సంశయం ప్రాప్తో మయా వీరకళత్రవాన్. 48

సాయుధా బహవో వ్యోమ్ని రాక్షసా స్త్వం నిరాయుధః,
కథం శక్యసి సంయాతుం మాం చైవ పరిరక్షితుమ్. 49

యుధ్యమానస్య రక్షోభి స్తవ తైః క్రూరకర్మభిః,
ప్రపతేయం హి తే పృష్ఠా ద్భయార్తా కపిసత్తమ. 50

అథ రక్షాంసి భీమాని మహాన్తి బలవన్తి చ,
కథంచి త్సామ్పరాయే త్వాం జయేయుః కపిసత్తమ. 51

అథవా యుధ్యమానస్య పతేయం విముఖస్య తే,
పతితాం చ గృహీత్వా మాం నయేయుః పాపరాక్షసాః. 52

మాం వా హరేయు స్త్వద్ధస్తా ద్విశసేయు రథాపి వా,
అవ్యవస్థౌ హి దృశ్యేతే యుద్ధే జయాపరాజయౌ. 53

అహం వాపి విపద్యేయం రక్షోభి రభితర్జితా,
త్వత్ప్రయత్నో హరిశ్రేష్ఠ భవే న్నిష్ఫల ఏవ తు. 54

కామం త్వమసి పర్యాప్తో నిహన్తుం సర్వరాక్షసాన్,
రాఘవస్య యశో హీయే త్త్వయా శస్తైస్తు రాక్షసైః. 55

అథవాఽఽదాయ రక్షాంసి న్యసేయు స్సంవృతే హి మామ్,
యత్ర తే నాభిజానీయు ర్హరయో నాపి రాఘవౌ. 56

ఆరమ్భస్తు మదర్థోఽయం తత స్తవ నిరర్థకః,
త్వయా హి రామస్య మహా నాగమనే గుణః. 57

మయి జీవిత మాయత్తం రాఘవస్య మహాత్మనః,
భ్రాతౄణాం చ మహాబాహో తవ రాజకులస్య చ. 58

తా నిరాశా మదర్థం తు శోకసంతాపకర్శితా,
సహ సర్వర్క్ష హరిభి స్త్యక్ష్యతః ప్రాణసంగ్రహమ్. 59

భర్తృభక్తిం పురస్కృత్య రామా దన్యస్య వానరః,
న స్పృశామి శరీరం తు పుంసో వానరపుఙ్గవ. 60

య దహం గాత్రసంస్పర్శం రావణస్య బలాద్గతా,
అనీశా కిం కరిష్యామి వినాథా వివశా సతీ. 61

యది రామో దశగ్రీవ మిహ హత్వా సబాన్ధవమ్,
మా మితో గృహ్య గచ్ఛేత త త్తస్య సదృశం భవేత్. 62

శ్రుతా హి దృష్టాశ్చ మయా పరాక్రమా
మహాత్మన స్తస్య రణావమర్దినః,
న దేవ గన్ధర్వభుజఙ్గరాక్షసా
భవన్తి రామేణ సమా హి సంయుగే. 63

సమీక్ష్య తం సంయతి చిత్రకార్ముకం
మహాబలం వాసవతుల్యవిక్రమమ్,
సలక్ష్మణం కో విషహేత రాఘవం
హుతాశనం దీప్తమి వానిలేరితమ్. 64

సలక్ష్మణం రాఘవ మాజిమర్దనం
దిశాగజం మత్త మివ వ్యవస్థితమ్,
సహేత కో వానరముఖ్య సంయుగే
యుగాన్తసూర్యప్రతిమం శరార్చిషమ్. 65

స మే హరిశ్రేష్ఠ సలక్ష్మణం పతిం
సయూథపం క్షిప్ర మి హోపపాదయ,
చిరాయ రామంప్రతి శోకకర్శితాం
కురుష్వ మాం వానరముఖ్య హర్షితామ్. 66

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, వాల్మీకీయే,
చతుర్వింశత్సహస్రికాయాం, సంహితాయాం,
శ్రీమత్సున్దరకాణ్డే, సప్తత్రింశ స్సర్గః.

## శ్రీమద్రామాయణ మాహాత్మ్యమ్

శ్లో. శక్తా సత్యామపి శ్రీమాన్నాస్తి నాస్తీతి యో వదేత్,
ఆ కల్పం దేహి దేహీతి స భిక్షేత న సంశయః.

## 37 వ సర్గము

### సీత హనుమంతునితో పలుకుట

ఆంజనేయుడు చెప్పిన మాటలు విన్న తరువాత సీతాదేవి ముఖము పూర్ణచంద్రునివలె ప్రకాశించెను. ధర్మమునకు, అర్థమునకు దూరముకాని రీతిగా ఆంజనేయుని ఉద్దేశించి పలికెను. ఆంజనేయా! నీవు అమృతము విషము రెంటిని కలిపి నా ఎదుట బెట్టితివి. అమృతమని సంతోషింతునా? విషమని దుఃఖింతునా? శ్రీరాముడు అన్యసక్తమనస్కుడు కాక నాయందే మనస్సు కలిగి ఉన్నాడు. అన్న మాట అమృతము వలె తోచుచున్నది. నాకొరకై దుఃఖించుచు నిద్రింపక, ఆహారము స్వీకరింపక కృశించిపోవుచున్నాడు అనుమాట విషమువలె బాధించుచున్నది.

కాపురుషుడు గొప్ప ఐశ్వర్యము వైపునకు కాని దారుణమైన ఆపద వైపునకు కాని మనుష్యుని మెడలో త్రాడు కట్టి లాగుచుండెను. ఎవ్వరును దైవ నిర్ణయమును తప్పించుకొనలేరు. అంజనేయా! దురవస్థల పాలయిన నా స్థితి లక్ష్మణుని స్థితి, రాముని స్థితి చూచితివి కదా. సముద్రమున నౌక బ్రద్దలై పరిశ్రాంతుడయిన పురుషుని వలె శ్రీరాముడు ఈ శోక సముద్రమునుండి ఎప్పటికి గట్టెక్కును? రాక్షసులను అందఱిని చంపి రావణుని చంపి ఈ లంకను ధ్వంసము చేసి నన్ను కటాక్షించు శుభ సమయము ఎప్పటికి వచ్చును?

రాముని విడిచి వచ్చిన ఈ సంవత్సరరము పూర్తి యగు నంతవఱకును మాత్రమే నేను జీవింతును. తరువాత మరణము తప్పదు. ఈ లోపలనే రామచంద్రుని తొందర చేయుము. నేను లంకకు చేరి పది మాసములు అగుచున్నవి. సంవత్సరమునకు ఇక రెండు మాసములు మిగిలియున్నవి. అంతవఱకే రావణుడు నాకు గడువు ఇచ్చియున్నాడు. తరువాత అతడు నన్ను చంపి వేయును.

రావణ సోదరుడగు విభీషణుడు కూడ నన్ను శ్రీరామునికి అప్పగించి వేయుమని ఎన్నో విధములుగా చెప్పియున్నాడు. ఎందరు ఎన్ని విధములుగ చెప్పినను నన్ను తిరిగి రామునికి అప్పగించుట రావణునికి రుచించుట లేదు. రావణునకు చావుకాలము సమీపించినది మృత్యుదేవత యుద్ధభూమిలో రావణుని కొఱకు వెదకుచున్నది.

అనల అను విభీషణుని కొమార్తెచే ఆమె తల్లి సరమ వార్త పంపినది. నిస్సందేహముగా నా భర్త శ్రీరామచంద్రుడు తప్పక నావద్దకు రాగలడు. ఆనృశంస్యము. కృతజ్ఞత మున్నగు ఉత్తమ గుణములు ఎన్నియెా రామచంద్రుని యందు ఉన్నవి. జనస్థానమున అసహాయశూరుడై నాలుగు వేల మంది రాక్షసులను సంహరించెను. ఆ పరాక్రమము శత్రుభయంకరము. ఆ ఆపదలేవియు అతని అసమర్థుని చేయలేవు. శచీదేవి ఇంద్రుని విక్రమమును ఎఱుగు నట్లుగా నేను శ్రీరాముని విక్రమమును బాగుగా ఎఱుగుదును. శూరుడగు ఈ రామదివాకరుడు బాణము లను కిరణములు కలిగి శత్రురాక్షసులు అనెడి నీటని హరించి ఆర్పివేయగలడు.

## ఆంజనేయుడు సీతను గొంపోవుదునని పలుకుట

ఇట్లు పలుకుచున్న, రామ వియోగముచే కృశించి కన్నీరు కార్చుచున్న, ఆ సీతను చూచి అంజనేయుడు పలికెను. సీతాదేవీ! నీవు లంకలో ఉన్న విషయమును నేను విన్నవించిన వెంటనే వానరులతో భల్లూక గణముతో నిండిన సేనను వెంట బెట్టుకొని వెంటనే బయలుదేరి రాగలను. లేదా సీతాదేవి! ఈ క్షణముననే ఇక్కడ నుండి విముక్తిని కలిగించెదను. నా వీపుపై కూర్చుండుము. నిన్ను వీపుపై కూర్చుండ బెట్టుకొని శతయోజన విస్తీర్ణమయిన సముద్రమును దాటి పోగలను. నిన్నే కాదు రావణుని లంకను కూడ మోసికొనిపోవు శక్తి నాకు ఉన్నది. అగ్నిహోత్రుడు ఇంద్రునకు హవిర్ద్రవ్యమును అందచేసినట్లుగా నిన్ను తీసికొని పోయి ప్రస్రవణగిరి యందున్న రామునకు అందచేయగలను.

ఈ రోజుననే విదేహరాజకుమారీ నీవు రాముని, లక్ష్మణుని చూడగలవు. విష్ణువు దైత్యవధకై ప్రయత్నించినట్లుగా రాముడును ఈ రావణాది రాక్షస వధకై నిశ్చయించుకొనియున్నాడు. ఆ రామచంద్రుడును నిన్ను కటాక్షించుటకై తగు ప్రయత్నములో ఉన్నాడు. నావీపున కూర్చుండి చంద్రునితో తేజోవంతుడగు సూర్యునితో సల్లాపము ఒనర్చు చున్నట్లుగా అత్యున్నతమైన వాయుమార్గమున ఆకాశ మహార్ణవముల రెంటిని దాటి పోవచ్చును. నేను నిన్ను తీసికొని ఆకాశమున ప్రయాణించుచున్నప్పుడు నన్ను వెంబడించుటకు ఈ లంకాధివాసు లెవరికిని సాధ్యముకాదు. ఏరీతిగ

ఆకాశమార్గమున నేను సముద్రమును దాటి పోగలను? సీతాదేవి ఆశ్చర్యకరమయిన ఆంజనేయుని మాటలను విన్నదై హర్షాశ్చర్యములకు గుఱియై హనుమంతునితో ఈ రీతిగ పలికెను.

## సీత సమాధానము

హనుమాన్! వాయునందనా! నన్ను మోసికొని శతయోజన విస్తీర్ణమయిన ఈ సముద్రమును ఎట్లు దాటి పోయెదవు. నీ మాటలు నీ వానరత్వమును సూచించుచున్నవి. ఇంత చిన్న శరీరముతో కూడిన నీవు నన్ను మానవేంద్రుడగు నా భర్త సన్నిధికి తీసికొని పోగలవా?

## హనుమంతుడు సీతకు నిజ రూపమును జూపుట

వాయునందనుడగు ఆ హనుమంతుడు సీతాదేవి మాటలచే తనకు తొలిసారిగా పరాభవము జరిగినట్లు భావించెను.

ఈ సీతాదేవి నా బలమును కాని నా ప్రభావమును కాని ఎఱుగదు. ఆమెకు నా మహోన్నతమయిన రూపమును ఒకసారి చూపింప వలయును. అని భావించి వానరోత్తముడగు హనుమానుడు ఆ వృక్షము క్రిందకు దూకి పై పైకి పెరుగ నారంభించెను. సీతకు విశ్వాసము కలిగించుటకై ఆ రూపము మేరు మందర సమానమై మహోన్నతముగ ఉండెను.

అతడు అట్టిరూపముతో సీతాదేవికి ఎదుట నిలిచి ఉండెను. అతడు ఒక పర్వతము వలె ఉండెను. ముఖము ఎరుపు వారెను. అతని కోరపండ్లు (దంతములు) నఖములు వజ్రముల వలె కనిపించినవి. అతడు భయంకరుడై ఉండెను. మఱియు సీతతో ఇట్లు

పలికెను. ఈ పర్వతములతో కోటగోడలతో తోరణములతో రావణునితో ఈ లంక నంతను తీసికొని పోగల శక్తి నాకు ఉన్నది. సీతాదేవీ నాదేహము చిన్నదని నేను శక్తి హీనుడనని తలంపకుము ఆ భావనను విడిచిపెట్టుము. నీవు నా వెంట వచ్చి రామలక్ష్మణులను శోక రహితులుగా చేయుము. అని పలుకుచున్న ఆంజనేయుని భయంకరమగు రూపమును చూచి ఆశ్చర్యముతో కన్నులను బాగుగా తెఱచి చూచుచు ఇట్లు పలికెను.

## సీత హనుమతో వెడలుటలో గల అనర్థములను చెప్పట

ఆంజనేయా! నీ బల పరాక్రమములు నాకు తెలియవా. అగ్ని యొక్క తేజము వాయువు యొక్క వేగము నీకు ఉన్నవి. సామాన్య వానరుడవయినచో సముద్రమును దాటి ఈ లంకకు చేరగలవా! నన్ను తీసికొనిపోయి రామచంద్రుని సన్నిధికి చేర్పగల శక్తియుక్తులు నీకు ఉన్నవని నాకు తెలియదా! ఎంత పెద్ద వారలైనను సాధ్యాసాధ్యములు బాగుగా ఆలోచించి కార్యసిద్ధిని నిశ్చయింపవలసి ఉండును.

ఆంజనేయా! నేను నీవెంట వచ్చుట తగదు. నేను నీ వీపుపై కూర్చుండి మహా వేగముతో పోవుచున్న నీ వీపు నుండి సంభ్రమముతో సముద్రమున పడవచ్చును. క్రిందబడిన నన్ను వెంటనే సముద్రములోని పెద్దచేపలు. మొసళ్ళు తినివేయవచ్చును. జలచరములకు నేను ఆహారమయి పోవచ్చు. నీవు ఎంత శత్రుసంహారకుడవయినను నీవెంట రాలేను. నీవు నన్ను రక్షించుకొనుచు నిన్ను రక్షించుకొన వలసి

ఉన్నది. నన్ను నీవు తీసికొనిపోవుచున్నప్పుడు దుర్మార్గుడగు రావణునిచే పంపబడిన రాక్షసులు నిన్ను వెంబడింపవచ్చును. ఆయుధ ధారులైన ఆ రాక్షసులు నిన్ను చుట్టుముట్టవచ్చును. నిన్నే నీవు రక్షించు కొనవలసిన స్థితిలో నన్ను కూడ రక్షించుట కష్టసాధ్యమగును. ఆ రాక్షసులందరును శూల ముద్గరా ద్యాయుధధారులు. నీవు నిరాయుధుడవు. అప్పుడు నీవు ముందునకు పోవుటకు నన్ను రక్షించుటకు నీకు శక్తి చాలునా దుర్మార్గులగు రాక్షసులతో నీవు యుద్ధము చేయుచున్నప్పుడు నేను జారి క్రిందపడవచ్చును. బలవంతులగు ఆ రాక్షసులు నిన్ను గెలిచినను గెలువవచ్చును. నన్ను తీసికొనిపోయి తిరిగి లంకలో బంధించినను బంధింపవచ్చును. నన్ను చంపినను చంపవచ్చును.

యుద్ధరంగమున జయాపజయములు అవ్యవస్థితములై ఉండును. నేను ఆపదలలో పడవచ్చును. నీవు సముద్రము దాటి వచ్చి లంకలో ప్రవేశించి చేసిన అన్వేషణప్రయత్నమంతయు వృథా కావచ్చును. నీవు మహాశక్తి సంపన్నుడవై రాక్షసుల నందరిని చంపివేసినచో రామచంద్రుని కీర్తి తరిగిపోదా. నన్ను రాక్షసులు తీసికొనిపోయి అత్యంత నిగూఢమైన ప్రదేశమున దాచివేసినచో ఈ వానరులు గాని నీవు గాని రామ లక్ష్మణులు గాని అన్వేషించి కనుగొనుట సాధ్యమగునా. నా కోసమై నీవు పడిన శ్రమ మంతయు వృథాకాదా!

శ్రీరాముని జీవితము నాయందు ఆధారపడియున్నది. సోదరుల జీవితము రామునియందు ఆధారపడియున్నది. నీ రాజకుటుంబము రామునిపైనే ఆధారపడి ఉన్నది. నేను లభింపనప్పుడు లేదా

కనబడనప్పుడు ఆ రామ లక్ష్మణులు నిరాశులై శోకతాపములతో కృశించి ఈ వానరులందరితో ప్రాణములు విడువగలరు. అంతేకాక భర్తృభక్తిని పురస్కరించుకొని వానరోత్తమా! అన్యవ్యక్తిని నేను స్పృశింపను.

రావణుడు నన్ను అపహరించి తీసికొనిపోవునప్పుడు ఆతని దేహస్పర్శను దిక్కులేక చేయునదిలేక వివశురాలనై సహించితిని. రామచంద్రుడు లంకకు వచ్చి ఈ రావణుని బంధుమిత్ర సమేతముగా సంహరించి నన్ను తీసికొనిపోయినచో ఇది ఆతనికి తగి ఉండును.

మహాత్ముడగు రామచంద్రుని పరాక్రమును నేనే బాగుగా ఎఱుగుదును. దేవతలు, గంధర్వులు, నాగులు, రాక్షసులు, ఎవ్వరయినను యుద్ధభూమిలో రాముని ఎదుట నిలువజాలరు. వాయుసహాయుడై ప్రజ్వలించుచున్న అగ్నిని ఎవ్వరును దరిచేరనట్లు లక్ష్మణసహాయుడయి యుద్ధ భూమిలో నిలిచిన ఇంద్రతుల్య పరాక్రముడగు రామచంద్రుని ఎవరు ప్రతిఘటింపగలరు. యుగాంత సూర్యుని వలె మహాతేజస్కుడయి వెలుగొందుచు యుద్ధరంగమున శత్రుసంహారమొనర్చుచు మదించిన దిగ్గజమువలె వీరవిహార మొనర్చుచున్న లక్ష్మణసహాయుడగు రామ చంద్రుని యుద్ధభూమిలో ఎదురొడ్డి నిలువగల వారెవరు?

వానరేంద్రా! నీవు నన్ను అచ్చటికి తీసికొనిపోవుట యుక్తము కాదు. రామలక్ష్మణులనే ఇచ్చటకి తీసికొనివచ్చి రామవియోగముచే కృశించియున్న నాకు హర్షము కలిగింపుము.



# 38. అష్టత్రింశ స్సర్గః

తత స్స కపిశార్దూల స్తేన వాక్యేన హర్షితః,
సీతా మువాచ తచ్ఛ్రుత్వా వాక్యం వాక్యవిశారదః. 1

యుక్తరూపం త్వయా దేవి భాషితం శుభదర్శనే,
సదృశం స్త్రీస్వభావస్య సాధ్వీనాం వినయస్య చ. 2

స్త్రీత్వం న తు సమర్థం హి సాగరం వ్యతివర్తితుమ్,
మా మధిష్ఠాయ విస్తీర్ణం శతయోజన మాయతమ్. 3

ద్వితీయం కారణం యచ్చ బ్రవీషి వినయాన్వితే,
రామా దన్యస్య నార్హామి సంస్పర్శ మితి జానకి. 4

ఏత త్తే దేవి సదృశః పత్న్యా స్తస్య మహాత్మనః,
కా హ్యన్యా త్వామృతే దేవి బ్రూయా ద్వచన మీదృశమ్. 5

శ్రోష్యతే చైవ కాకుత్స్థ స్సర్వం నిరవశేషతః,
చేష్టితం యత్త్వయా దేవి భాషితం మమ చాగ్రతః. 6

కారణై ర్బహుభి ర్దేవి రామప్రియచికీర్షయా,
స్నేహప్రసన్నమనసా మ యైత త్సముదీరితమ్. 7

లజ్జాయా దుష్ప్రవేశత్వా ద్దుస్తరత్వా న్మహోదధేః,
సామర్థ్యా దాత్మనశ్చైవ మ యైత త్సముదీరితమ్. 8

ఇచ్ఛామి త్వాం సమానేతు మద్యైవ రఘుబన్ధునా,
గురుస్నేహేన భక్త్యా చ నాన్య థైత దుదాహృతమ్. 9

యది నోత్సహసే యాతుం మయాసార్థ మనిన్దితే,
అభిజ్ఞానం ప్రయచ్ఛత్వం జానీయా ద్రాఘవో హి తత్. 10

ఏవ ముక్తా హనుమతా సీతా సురసుతోపమా,
ఉవాచ వచనం మన్దం బాష్పప్రగ్రథితాక్షరమ్. 11

ఇదం శ్రేష్ఠ మభిజ్ఞానం బ్రూయా స్త్వం తు మమ ప్రియమ్,
శైలస్య చిత్రకూటస్య పాదే పూర్వోత్తరే పురా. 12

తాపసాశ్రమవాసిన్యాః ప్రాజ్యమూలఫలోదకే,
తస్మిన్ సిద్ధాశ్రమే దేశే మన్దాకిన్యా హ్యదూరతః. 13

తస్యోపవనషణ్డేషు నానాపుష్పసుగన్ధిషు,
విహృత్య సలిలక్లిన్నా తవాఙ్కే సముపావిశమ్. 14

తతో మాంససమాయుక్తో వాయసః పర్యతుణ్డయత్,
త మహం లోష్ట ముద్యమ్య వారయామి స్మ వాయసమ్.

దారయన్ స చ మాం కాక స్తత్రైవ పరిలీయతే,
న చా ప్యుపారమ న్మాంసా ద్భక్షార్థీ బలిభోజనః. 16

ఉత్కర్షన్త్యాం చ రశనాం క్రుద్ధాయాం మయి పక్షిణి,
స్రస్యమానే చ వసనే తతో దృష్టా త్వయా హ్యహమ్. 17

త్వయాఽపహసితా చాహం క్రుద్ధా సంలజ్జితా తదా,
భక్షగృధ్నేన కాకేన దారితా త్వా ముపాగతా. 18

ఆసీనస్య చ తే శ్రాన్తా పున రుత్సఙ్గ మావిశమ్,
క్రుధ్యన్తీ చ ప్రహృష్టేన త్వయాఽహం పరిసాన్త్వితా. 19

బాష్పపూర్ణముఖీ మన్దం చక్షుషీ పరిమార్జతీ,
లక్షితాఽహం త్వయా నాథ వాయసేన ప్రకోపితా. 20

పరిశ్రమాత్ప్రసుప్తా చ రాఘవాఙ్కేఽప్యహం చిరమ్,
పర్యాయేణ ప్రసుప్తశ్చ మమాఙ్కే భరతాగ్రజః. 21

స తత్ర పున రేవాథ వాయస స్సముపాగమత్,
తత స్సుప్తప్రబుద్ధాం మాం రామస్యాఙ్కా త్సముత్థితామ్. 22

వాయస స్సహసాఽగమ్య విదదార స్తనాన్తరే,
పునఃపున ర థోత్పత్య విదదార స మాం భృశమ్. 23

తత స్సముత్థితో రామో ముక్తై శ్శోణితబిన్దుభిః,
వాయసేన తత స్తేన బలవత్ క్లిశ్యమానయా. 24

స మయా బోధిత శ్శ్రీమాన్ సుఖసుప్తః పరంతపః,
స మాం దృష్ట్వా మహాబాహు ర్వితున్నాం స్తనయో స్తదా.

ఆశీవిష ఇవ క్రుద్ధః శ్వసన్ వాక్య మభాషత,
కేన తే నాగనాసోరు విక్షతం వై స్తనాన్తరమ్. 26

కః క్రీడతి సరోషేణ పఞ్చవక్త్రేణ భోగినా,
వీక్షమాణ స్తత స్తం వై వాయసం సముదైక్షత. 27

నఖై స్సరుధిరై స్తీక్ష్ణై ర్మా మే వాభిముఖం స్థితమ్,
పుత్రః కిల స శక్రస్య వాయసః పతతాం వరః. 28

ధరాన్తరగత శ్శీఘ్రం పవనస్య గతౌ సమః,
తత స్తస్మి న్మహాబాహుః కోపసంవర్తితేక్షణః. 29

వాయసే కృతవా౯ క్రూరాం మతిం మతిమతాం వరః,
స దర్భం సంస్తరా ద్గృహ్య బ్రాహ్మే ణాస్త్రేణ యోజయత్.

స దీప్త ఇవ కాలాగ్ని ర్జజ్వా లాభిముఖో ద్విజమ్,
స తం ప్రదీప్తం చిక్షేప దర్భం తం వాయసం ప్రతి. 31

తత స్తం వాయసం దర్భ స్సోఽమ్బరేఽనుజగామ హ,
అనుసృష్ట స్తదా కాకో జగామ వివిధాం గతిమ్. 32

లోకకామ ఇమం లోకం సర్వం వై విచచార హ,
స పిత్రా చ పరిత్యక్త స్సురైశ్చ సమహర్షిభిః. 33

త్రీ న్లోకా న్స పరిక్రమ్య తమేవ శరణం గతః,
స తం నిపతితం భూమౌ శరణ్య శ్శరణాగతమ్. 34

వధార్హ మపి కాకుత్స్థః కృపయా పర్యపాల యత్,
న శర్మ లబ్ధ్వా లోకేషు త మేవ శరణం గతః. 35

పరిద్యూనం విషణ్ణం చ స త మాయాన్త మబ్రవీత్,
మోఘం కర్తుం న శక్యం తు బ్రాహ్మ మస్త్రం తదుచ్యతామ్.

హినస్తు దక్షిణాక్షి త్వచ్ఛర ఇ త్యథ సోఽబ్రవీత్,
తత స్తస్యాక్షి కాకస్య హినస్తిస్మ స దక్షిణమ్. 37

దత్త్వా స దక్షిణం నేత్రం ప్రాణేభ్యః పరిరక్షితః,
స రామాయ నమస్కృత్వా రాజ్ఞే దశరథాయ చ. 38

విసృష్ట స్తేన వీరేణ ప్రతిపేదే స్వమాలయమ్,
మత్కృతే కాకమాత్రే తు బ్రహ్మాస్త్రం సముదీరితమ్. 39

కస్మా ద్యో మాం హరే త్త్వత్తః క్షమసే తం మహీపతే,
స కురుష్వ మహోత్సాహః కృపాం మయి నరర్షభ. 40

త్వయా నాథవతీ నాథ హ్యనాథా ఇవ దృశ్యతే,
ఆనృశంస్యం పరో ధర్మ స్త్వత్త ఏవ మయా శ్రుతః. 41

జానామి త్వాం మహావీర్యం మహోత్సాహం మహాబలమ్,
అపారపార మక్షోభ్యం గాంభీర్యా త్సాగరోపమమ్. 42

భర్తారం ససముద్రాయా ధరణ్యా వాసవోపమమ్,
ఏవ మస్త్రవిదాం శ్రేష్ఠ స్సత్యవా న్బలవా నపి. 43

కి మర్థ మస్త్రం రక్షస్సు న యోజయతి రాఘవః,
న నాగా నాపి గన్ధర్వా నాసురా న మరుద్గణాః,
రామస్య సమరే వేగం శక్తాః ప్రతిసమాధితుమ్. 44

తస్య వీర్యవతః కశ్చి ద్య ద్యస్తి మయి సంభ్రమః,
కిమర్థం న శరై స్తీక్ష్ణైః క్షయం నయతి రాక్షసాన్. 45

భ్రాతు రాదేశ మాదాయ లక్ష్మణో వా పరంతపః,
కస్య హేతో ర్నమాం వీరః పరిత్రాతి మహాబలః. 46

యది తౌ పురుషవ్యాఘ్రౌ వాయ్వగ్నిసమతేజసౌ,
సురాణా మపి దుర్ధర్షౌ కిమర్థం మా ముపేక్షతః. 47

మ మైవ దుష్కృతం కించి న్మహ దస్తి న సంశయః,
సమర్థావపి తౌ యు న్మాం నావేక్షేతే పరంతపౌ. 48

వైదేహ్యా వచనం శ్రుత్వా కరుణం సాశ్రుభాషితమ్,
అ థాబ్రవీ న్మహాతేజా హనుమా న్మారుతాత్మజః. 49

త్వచ్ఛోకవిముఖో రామో దేవి సత్యేన మే శపే,
రామే దుఃఖాభిపన్నే చ లక్ష్మణః పరితప్యతే. 50

కథం చి ద్భవతీ దృష్టా న కాలః పరిశోచితుమ్,
ఇమం ముహూర్తం దుఃఖానాం ద్రక్ష్య స్యన్త మనిన్దితే. 51

తా వుభౌ పురుష వ్యాఘ్రౌ రాజపుత్రౌ మహాబలౌ,
త్వద్దర్శనకృతోత్సాహౌ లఙ్కాం భస్మీకరిష్యతః. 52

హత్వా చ సమరే క్రూరం రావణం సహబాన్ధవమ్,
రాఘవ స్త్వాం విశాలాక్షి నేష్యతి స్వాం పురీం ప్రతి. 53

బ్రూహి య ద్రాఘవో వాచ్యో లక్ష్మణశ్చ మహాబలః,
సుగ్రీవో వాపి తేజస్వీ హరయోఽపి సమాగతాః. 54

ఇత్యుక్తవతి తస్మిం స్తు సీతా సురసుతోపమా,
ఉవాచ శోకసన్తప్తా హనుమన్తం ప్లవఙ్గమమ్. 55

కౌసల్యా లోకభర్తారం సుషువే యం మనస్వినీ,
తం మమార్థే సుఖం పృచ్ఛ శిరసా చాభివాదయ. 56

స్రజశ్చ సర్వరత్నాని ప్రియాయాశ్చ వరాఙ్గనాః,
ఐశ్వర్యఞ్చ విశాలాయాం పృథివ్యామపి దుర్లభమ్. 57

పితరం మాతరం చైవ సంమా న్యాభిప్రసాద్య చ,
అనుప్రవ్రజితో రామం సుమిత్రా యేన సుప్రజాః. 58

ఆనుకూల్యేన ధర్మాత్మా త్యక్త్వా సుఖ మనుత్తమమ్,
అనుగచ్ఛతి కాకుత్స్థం భ్రాతరం పాలయ న్వనే. 59

సింహస్కన్ధో మహాబాహు ర్మనస్వీ ప్రియదర్శనః,
పితృవ ద్వర్తతే రామే మాతృవ న్మాం సమాచరన్. 60

హ్రియమాణం తదా వీరో న తు మాం వేద లక్ష్మణః.

వృద్ధోపసేవీ లక్ష్మీవాన్ శక్తో న బహుభాషితా,
రాజపుత్రః ప్రియశ్రేష్ఠ స్సదృశ శ్శ్వశురస్య మే. 62

మమ ప్రియతరో నిత్యం భ్రాతా రామస్య లక్ష్మణః,
నియుక్తో ధురి యస్యాం తు తా ముద్వహతి వీర్యవాన్.

యం దృష్ట్వా రాఘవో నైవ వృత్త మార్య మనుస్మరేత్,
స మమార్థాయ కుశలం వక్తవ్యో వచనా న్మమ. 64

మృదు ర్నిత్యం శుచి ర్దక్షః ప్రియో రామస్య లక్ష్మణః,
యథా హి వానరశ్రేష్ఠ దుఃఖక్షయకరో భవేత్. 65

త్వ మస్మి న్కార్యనిర్యోగే ప్రమాణం హరిసత్తమ,
రాఘవ స్త్వత్సమారమ్భా న్మయి యత్నపరో భవేత్. 66

ఇదం బ్రూయాశ్చ మే నాథం శూరం రామం పునః పునః,
జీవితం ధారయిష్యామి మాసం దశరథాత్మజ. 67

ఊర్ధ్వమాసా న్న జీవేయం సత్యే నాహం బ్రవీమి తే,
రావణో నోపరుద్ధాం మాం నికృత్యా పాపకర్మణా,
త్రాతు మర్హసి వీరత్వం పాతాళాదికౌశికీమ్. 68

తతో వస్త్రగతం ముక్త్వా దివ్యం చూడామణిం శుభమ్,
ప్రదేయో రాఘవా యేతి సీతా హనుమతే దదౌ. 69

ప్రతిగృహ్య తతో వీరో మణిరత్న మనుత్తమమ్,
అఙ్గుళ్యా యోజయామాస న హ్యస్య ప్రాభవ ద్భుజః.70

మణిరత్నం కపివరః ప్రతిగృహ్యాఽభివాద్య చ,
సీతాం ప్రదక్షిణం కృత్వా ప్రణతః పార్శ్వత స్థ్సితః. 71

హర్షేణ మహతా యుక్త స్సీతాదర్శనజేన సః,
హృదయేన గతో రామం శరీరేణ తు విష్ఠితః. 72

మణివర ముపగృహ్య తం మహార్హం
జనకనృపాత్మజయా ధృతం ప్రభావాత్,
గిరి రివ పవనావధూతముక్త
స్సుఖితమనాః ప్రతిసంక్రమం ప్రపేదే. 73

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, వాల్మీకీయే,
చతుర్వింశత్సహస్రికాయాం, సంహితాయాం,
శ్రీమత్సున్దరకాణ్డే, అష్టత్రింశ స్సర్గః.

## 38 వ సర్గము

## హనుమంతుడు సీతతో పలుకుట

తరువాత వాక్పైపుణ్యము (మాటకారితనము) కలిగిన ఆ వానరోత్తముడు సీతాదేవి చెప్పిన మాటలను విని చాల సంతోషించిన వాడయి ఇట్లు పలుక నారంభించెను! 'దేవీ నీవు మాటలాడినది చాల బాగున్నది. స్త్రీ స్వభావమునకు పతివ్రతామణుల వినయమునకు తగి ఉన్నది. నా వీపుపై కూర్చుండి శతయోజనవిస్తీర్ణమయిన సముద్రమును దాటిపోవుట స్త్రీలకు శక్యము కాదు. నీవు చెప్పిన రెండవ కారణము "రామచంద్రుని తప్ప మరియొకరిని స్పృశింపను' . అన్న మాట మహాత్ముని రామచంద్రుని భార్యవైన నీకే తగును. నీవుతప్ప మరియొక్క స్త్రీ ఎవ్వరును ఇట్టి పరిస్థితులో అట్టి మాట మాటాడలేరు. నా ఎదుట నీ చేష్ట, నీవు పలికిన మాట శ్రీరాముడు పూర్తిగా వినగలడు. అనేకకారణములచేత, శ్రీరామచంద్రునకు ప్రియ మాచరింపవలెనను తలంపుతో స్నేహముచే జ్వలించిన మనస్సు గల వాడనై నే నారీతిగా పలికితిని.

సముద్రమును దాటి వచ్చుట కష్టమగుటచేతను, లంకలో అడుగుపెట్టుట అంతకంటె ఎక్కువ కష్టమగుటచేతను, సముద్రమును దాటి పోయి నిన్ను సురక్షితముగా శ్రీరాముని సన్నిధికి చేర్పగల

శక్తిసామర్థ్యములు నాకు ఉండుట చేతను నేను అట్లు పలికితిని, పెద్దలయందలి స్నేహము చేత ఈ వేళనే నిన్ను రామచంద్రుని సన్నిధికి చేర్పవలెనను అత్యాదరముచేత అట్లు పలికితిని కాని వేరొకబుద్ధితో కాదు. నీవు నా వెంట వచ్చుటకు ఇష్టపడనిచో శ్రీరాముడు గుర్తు పట్టదగిన అభిజ్ఞానమును దేనినైనను ఇమ్మ అని ఆంజనేయుడు పలికినంతనే కంటనీరు పెట్టుకొనుచు మెల్లగ ఒక్క మాటచెప్పెను.

## సీత ఆంజనేయునితో కాకాసుర వృత్తాంతమును చెప్పట

నా రామునకు గూర్చి నాకును రామునకి మాత్రమే తెలిసిన, లక్ష్మణునికి కూడ తెలియని ఈ అభిజ్ఞానమును రామునికి నివేదింపుము. చిత్రకూట పర్వతమునకు ఈశాన్యమున ఒక ప్రత్యంతపర్వతమున్నది. అది మందాకినీనదికి చాల సమీపభాగము. అచట సిద్ధులు కూడ వచ్చి ఉందురు. మూల ఫలములు జలమును సమృద్ధిగా దొరకును. ఇచ్చటి వనములో చాలసేపు విహరించి జలక్రీడలతో కాలము గడపి ఆ సమీపమున కూర్చుండి యుంటిని.

అంతలో ఒక వాయసము (కాకి) వచ్చి మాంసార్థియై నన్ను పొడుచుటకు ఆరంభించినది. ఆ కాకిని మట్టిబెడ్డను తీసికొని కొట్టుచుంటిని. కాని ఆ కాకి తన ప్రయత్నమును విరమింపలేదు. నాకు కోపము పెరిగి రశన (మొలనూలు) తీసి కాకిని కొట్టుట నారంభించితిని. ఆ సమయమున వస్త్రము శిథిలమయ్యెను. నన్ను చూచి నా వ్యర్థప్రయాసములను చూచి నన్ను అపహసించితివి. కాకిపై నా కోపము పెరిగినది. కట్టిన వస్త్రము జారుట చేత ప్రయత్న వైఫల్యమును చూచి సిగ్గుపడితిని. కాకి తన ప్రయత్నము మానలేదు.

ఆ వృథా ప్రయత్నముచే అలసి నీ సన్నిధికి వచ్చితిని. నీవు ఓదార్చితివి. కన్నీళ్ళు కార్చుచు ఆర్ద్రము అయిన నేత్రములను తుడుచుకొనుచు నీ సన్నిధికి నీఉత్సంగముపై (తొడ) తల ఉంచి నిద్రపోయితిని.

అప్పుడు కాకి ఏమియు చేయలేదు. దరికి రాలేదు. మరికొద్దిసేపటికి నేను మేల్కొని నీవు నా తొడపై తల ఉంచి నిదురపోవుచున్నప్పుడు మరల ఆ వాయసము వచ్చి వక్షస్థలముపై చీరెను. ఆ సమయమున రక్తబిందువులు పడి నీకు మెలకువవచ్చెను. సుఖముగ నిద్రపోవుచున్న శ్రీరాముడు మేలుకొని వక్షస్థలమున గాయపడిన నన్ను చూచి మిక్కిలి కోపగించెను. సీతా! నీ వక్షస్థలమున గాయము చేసినదెవరు? ఈ ఐదుతలలపాముతో చెలగాటము ఆడుచున్నదెవరు? అని అడిగి నా నోటితో నేను ఏమియును చెప్పక పోయినను రక్తసిక్తములైన గోళ్ళతో ఎదుట నిలిచి ఉన్న కాకి రూపమున నిలిచిన ఇంద్రకుమారుని చూచెను.

మహా కోపముతో రాముడు ఆసనము నుండి ఒక దర్భను తీసి బ్రహ్మాస్త్రముగ మంత్రించి ప్రయోగించెను. ఆ కాకి పారిపోవదొడంగెను. బ్రహ్మాస్త్రము వెంబడించెను. తల్లిని రక్షింపుమని ప్రార్థించెను. ఆమె ఉపేక్షించెను. తండ్రియును, దేవవతలును, ఋషులును ఆతనిని ఉపేక్షించిరి. మూడు లోకములను మూడు పర్యాయములు తిరిగి ఎక్కడను రక్షణ లేక శ్రీరాముని సన్నిధికి వచ్చి సాగిలపడెను. అప్పుడు శ్రీరాముడు కాకాసురుని వధార్హుడయినను పరమకృపతో రక్షించెను. దిక్కులేని ఆ కాకాసురుడు రామునిచే రక్షితుడయ్యెను. కాని రాముడు కాకాసురునితో నా అస్త్రము అమోఘము. నేను ఊరకున్నను అస్త్రము

శాంతింపదు. నిష్కృతి (ప్రాయశ్చిత్తము) రూపమున నీవు ఏమి చేయదలంచితివి. అనగా నాకుడికంటిని ఆ అస్త్రము తీసికొనవచ్చును అనెను. అప్పుడు ఆ బ్రహ్మాస్త్రము కాకాసురుని కుడికంటిని తీసికొనెను. కాకాసురుడు కన్ను లొట్టపోయినను చావుతప్పి రామునకును, రాముని తండ్రి దశరథునకును నమస్కారములు చేయుచు తన లోకమునకు పోయెను.

నా కొఱకై కాకిపై బ్రహ్మాస్త్రమును ప్రయోగించిన శ్రీరాముడు తన దగ్గర నుండి ఎత్తుకొని పోయిన వియోగ దుఃఖమునకు గురిచేసిన ఈ రావణుని ఏల సహించుచున్నాడో తెలియరాకున్నది. కర్తవ్య విషయమున ఎప్పుడును నిరుత్సాహపడక మహోత్సాహముతో ఉండు రామచంద్రా ! నా యందు ఏల దయచూపవు. నీవే దిక్కని భావించిన నాకు లంక నుండి విముక్తిని కలిగించి రక్షింపుము. దిక్కులేక బాధపడుచున్నాను. ఇతరుల బాధలను చూచి ఓర్వలేక, రక్షించుట పరమధర్మమని నీవు చెప్పుచుండగా విని ఉన్నాను.

నీవు మహా వీరుడవని, మహోత్సాహుడవని, మహాబలుడవని. సముద్రము వలె మహాగంభీరుడవని, చతుస్సముద్ర ముద్రితమయిన ఈ భూమికెల్ల నీవే రక్షకుడవని అస్త్రవేత్తలలో నెల్ల గొప్పవాడవని ఆడితప్పవని నాకు తెలియును. ఇట్టి నీవు మహాపరాధులగు రాక్షసులపై ఏల బాణము సంధింపవో తెలియకున్నది. అని నేను పలికితినని రామునితో చెప్పుము.

నాగజాతివారు కాని, గంధర్వులుకాని, అసురులు కాని యుద్ధభూమిలో రామచంద్రుని వేగమును తట్టుకొనలేరు.

రామచంద్రునకు నాయందు ప్రీతి ఉన్నచో తన బాణములచే ఈ రక్కసి మూకను ఏల ధ్వంసము చేయడు! అన్నగారి ఆజ్ఞను స్వీకరించి లక్ష్మణుడైనను ఏల నన్ను రక్షింపప్రయత్నింపరు. మహాబలుడు పరంతపుడు అగు ఆ లక్ష్మణుడు ఏల ఉపేక్షించుచున్నాడు. కారణము తెలియకున్నది. వాయువు, అగ్నివలె మహాబలతేజస్సులు కలిగిన ఆ రామ లక్ష్మణులు ఇరువురును దేవతలకైనను ప్రతిఘటించుటకు సాధ్యము కానివారే. అట్టి వారయిననను నన్ను ఏల ఉపేక్షించు చున్నారు. నేను చేసికొన్న మహాపాపమేది వారి కరుణకు ప్రతిబంధకమై ఉండవచ్చు. సమర్థులు, శత్రువును ఎప్పుడును ఉపేక్షించి ఎరుగని ఆ ఇరువురును నాదురవస్థలను ఎందులకు ఉపేక్షించుచున్నారో అర్థము కాకున్నది. కన్నీరు కార్చుచు అతి దీనముగా పలికిన వైదేహి వచనములను విని మహాతేజముతో విరాజిల్లుచున్న వాయు నందనుడు ఇట్లు పలికెను.

## హనుమంతుని ప్రతివచనము

సీతాదేవీ నీ శోకమును వదలించుట ఎట్లో అని శ్రీరాముడు ఆలోచించు చున్నాడమ్మా, ఇది యథార్ధము అని ఒట్టువేసి చెప్పుచున్నాను. రాముని దుఃఖమును చూచి లక్ష్మణుడును పరితపించుచున్నాడు. నీవు చాల కాలమునకు కనిపించితివి. ఇది దుఃఖింప వలసిన కాలము కాదు. నీవు దుఃఖింపవలసిన కాలము గడచిపోయినది. నీకు శుభకాలము ఆరంభమైనది. పురుషోత్తములు, రాజపుత్రులు. మహాబలులు అగు ఆ రామలక్ష్మణులు నీ జాడ తెలిసినంత మాత్రముననే, మహోత్సవముతో కూడినవారై ఈ లంక

అంతయును భస్మము చేసివేయుదురు. యుద్ధభూమిలో రావణుని, రావణుని పుత్రమిత్రాదులను సంహరించెదరు. తొందరలో నిన్ను రాముడు అయోధ్యానగరమునకు తీసికొని పోగలరు. రామునకు, లక్ష్మణునకు. వానరోత్తములకు ఏమేమి చెప్పుమందువో. చెప్పుము.

## సీత సందేశము

ఆంజనేయుడు ఇట్లు చెప్పగనే దేవకన్యకవంటి ఈ సీతాదేవి వానరోత్తముడగు ఆంజనేయునితో ఇట్లు పలికెను. కౌసల్యాదేవి సర్వలోకాధిపతి కాదగిన ఎవరిని తన కుమారునిగా కన్నదో ఆ రాముని నా మాటగా సుఖము అడుగుము. తలవంచి అభివాదము చేయుము. ఐశ్వర్యము, భోగద్రవ్యములు సర్వశ్రేష్టవస్తువులు ధర్మపత్నిని తన యందు ప్రీతి కలిగిన ఇతరస్త్రీలను తండ్రిని తల్లిని ఆదరించి ప్రసన్నలను చేసికొని శ్రీరాముని వెంట అరణ్యమునకు బయలు దేరి వచ్చిన సుమిత్రానందనుడు చాల ధర్మాత్ముడు. గొప్ప సుఖములను కూడవిడిచినవాడు. అభిమానవంతుడు.

అన్నగారికి సంరక్షకుడై అన్నగారి మాటను శిరసా వహించుచు మాతోపాటు అరణ్యవాసము చేసినవాడు. శ్రీరాముని తండ్రిగా, నన్ను తల్లిగా భావించువాడు. నన్ను రావణాసురుడు అపహరించినపుడు అతడు అక్కడలేడు. పెద్దలయందు గౌరవాభిమానములు కలవాడు. ఎప్పుడును అతిప్రసంగము చేయనివాడు. మామగారిని పోలినవాడు రామచంద్రునకు నన్ను మించి ప్రీతిపాత్రమయినవాడు. అన్నగారి మాటను ఎంత కష్టమైనను ఆచరించితీరువాడు లక్ష్మణుడు దగ్గరగా ఉండి దశరథ మహారాజు నిర్వహించు పనులను అన్నిటినీ

నిర్వహించుటచే శ్రీరాముడు తండ్రిని కూడ మఱచినాడు. అట్టి లక్ష్మణుని నాకు బదులుగ నీవు క్షేమము అడుగుము. మార్దవము, త్రికరణశుద్ధి, సామర్థ్యము కలిగి రామచంద్రునకు ప్రీతిపాత్రమైన ఆ లక్ష్మణుడు నా దుఃఖమును నివారించుటకై ప్రయత్నవంతు డగునట్లుగా చేయుము.

ఈ విషయమున నిన్నే నమ్మి ఉన్నాను. శ్రీరామచంద్రుడు నీవు ఉత్సాహపరచినచో నా విముక్తికై తగు ప్రయత్నము చేయును. నా భర్తయగు శ్రీరామచంద్రునితో ఒక మాసమే జీవింతుననియు, మాసము తరువాత జీవించి ఉండననియు కూడచెప్పుము. పగబట్టిన రావణుడు నన్ను లంకలో బంధించినాడు. పాతాళమునుండి కౌశికను రక్షించునట్లుగా నన్ను కూడ రక్షింపుము. అని రామచంద్రునితో నా మాటలుగా విన్నపము చేయుము.

### సీత హనుమంతునకు చూడామణి నిచ్చుట

తరువాత తనవస్త్రమున కట్టి ఉంచిన చూడామణిని తీసి శ్రీరామునికి సమర్పింపుమని ఆంజనేయుని చేత పెట్టెను. ఆ చూడామణిని తన వ్రేలికి తొడిగికొని భద్రపఱిచెను. ఈ చూడామణిని తీసికొని సీతకు నమస్కరించి ప్రదక్షిణము చేసి పార్శ్వభాగమున నిలిచి ఉండెను. సీతాదర్శనముచేత కలిగిన ఆనందమునకు అవధులు లేకపోయినవి. హనుమానుడు సీత సన్నిధిలోనే ఉన్నప్పటికిని ఆతని మనస్సు శ్రీరాముని వద్దకు పోయెను. సీత ఇచ్చిన అమూల్యమయిన చూడామణిని స్వీకరించి స్తిమితచిత్తుడై తిరుగు ప్రయాణమునకై సంసిద్ధుడయ్యెను.



# 39. ఏకోనచత్వారింశ స్సర్గః

మణిం దత్త్వా తత స్సీతా హనుమన్త మథాఽబ్రవీత్,
అభిజ్ఞాన మభిజ్ఞాత మేత ద్రామస్య తత్త్వతః. 1

మణిం తు దృష్ట్వా రామో వై త్రయాణాం సంస్మరిష్యతి,
వీరో జనన్యా మమ చ రాజ్ఞో దశరథస్య చ. 2

స భూయ స్త్వం సముత్సాహే చోదితో హరిసత్తమ,
అస్మిన్ కార్యసమారమ్భే ప్రచిన్తయ యదుత్తరమ్. 3

త్వ మస్మి న్కార్యనిర్యోగే ప్రమాణం హరిసత్తమ,
హనుమ న్యత్న మాస్థాయ దుఃఖక్షయకరో భవ. 4

తస్య చిన్తయతో యత్నో దుఃఖక్షయకరో భవేత్,
స తథేతి ప్రతిజ్ఞాయ మారుతి ర్భీమవిక్రమః. 5

శిరసా వన్ద్య వైదేహీం గమనా యోపచక్రమే,
జ్ఞాత్వా సంప్రస్థితం దేవీ వానరం మారుతాత్మజమ్. 6

బాష్పగద్గదయా వాచా మైథిలీ వాక్య మబ్రవీత్,
కుశలం హనుమ న్బ్రూయాః స్సహితౌ రామలక్ష్మణౌ. 7

సుగ్రీవం చ సహామాత్యం వృద్ధా న్సర్వాంశ్చ వానరాన్,
బ్రూయా స్త్వం వానరశ్రేష్ఠ కుశలం ధర్మసంహితమ్. 8

యథా స చ మహాబాహు ర్మాం తారయతి రాఘవః,
అస్మా ద్దుఃఖామ్బుసంరోధా త్త్వం సమాధాతు మర్హసి. 9

జీవన్తీం మాం యథా రామ స్సమ్భావయతి కీర్తిమాన్,
త త్తథా హనుమ న్వాచం వాచా ధర్మ మవాప్నుహి. 10

నిత్య ముత్సాహయుక్తాశ్చ వాచ శ్శ్రుత్వా త్వ యేరితాః,
వర్ధిష్యతే దాశరథేః పౌరుషం మ దవాప్తయే. 11

మత్సందేశయుతా వాచ స్త్వత్త శ్శ్రుత్వా చ రాఘవః,
పరాక్రమవిధిం వీరో విధివ త్సంవిధాస్యతి. 12

సీతాయా వచనం శ్రుత్వా హనుమా న్మారుతాత్మజః,
శిర స్యఞ్జలి మాధాయ వాక్య ముత్తర మబ్రవీత్. 13

క్షిప్ర మేష్యతి కాకుత్స్థో హర్యృక్షప్రవరై ర్వృతః,
యస్తే యుధి విజిత్యారీ న్ శోకం వ్యపనయిష్యతి. 14

న హి పశ్యామి మర్త్యేషు వాఽసురేషు సురేషు వా,
య స్తస్య క్షిపతో బాణాన్ స్థాతు ముత్సహతేఽగ్రతః. 15

అప్యర్కమపి పర్జన్య మపి వైవస్వతం యమమ్,
స హి సోఢుం రణే శక్త స్తవ హేతో ర్విశేషతః. 16

స హి సాగరపర్యన్తాం మహీం శాసితు మీహతే,
త్వన్నిమిత్తో హి రామస్య జయో జనకనన్దిని. 17

తస్య తద్వచనం శ్రుత్వా సమ్యక్సత్యం సుభాషితమ్,
జానకీ బహుమేనేఽథ వచనం చేద మబ్రవీత్. 18

తత స్తం ప్రస్థితం సీతా వీక్షమాణా పునఃపునః,
భర్తృస్నేహాన్వితం వాక్యం సౌహార్దా దనుమానయత్. 19

యది వా మన్యసే వీర వసై కాహ మరిన్దమ,
కస్మిం శ్చి త్సంవృతే దేశే విశ్రాన్త శ్శ్వో గమిష్యసి. 20

మమ చే దల్పభాగ్యాయా స్సాన్నిధ్యా త్తవ వానర,
అస్య శోకస్య మహతో ముహూర్తం మోక్షణం భవేత్. 21

గతే హి హరిశార్దూల పున రాగమనాయ తు,
ప్రాణానా మపి సన్దేహో మమ స్యా న్నాత్ర సంశయః. 22

త వాదర్శనజ శ్శోకో భూయో మాం పరితాపయేత్,
దుఃఖా ద్దుఃఖపరామృష్టాం దీపయన్నివ వానర. 23

అయం చ వీర సన్దేహ స్తిష్ఠతీవ మమాగ్రతః,
సుమహాం స్త్వత్సహాయేషు హర్యక్షేషు హరీశ్వర. 24

కథం ను ఖలు దుష్పారం తరిష్యన్తి మహోదధిమ్,
తాని హర్యక్ష సైన్యాని తౌ వా నరవరాత్మజౌ. 25

త్రయాణా మేవ భూతానాం సాగరస్యాస్య లఙ్ఘనే,
శక్తి స్స్యా ద్వైనతేయస్య తవ వా మారుతస్య వా. 26

త దస్మి న్కార్యనిర్యోగే వీ రైవం దురతిక్రమే,
కిం పశ్యసి సమాధానం త్వం హి కార్యవిదాంవరః. 27

కామ మస్య త్వ మేవైకః కార్యస్య పరిసాధనే,
పర్యాప్తః పరవీరఘ్న యశస్య స్తే ఫలోదయః. 28

బలై స్సమగ్రై ర్యది మాం రావణం జిత్య సంయుగే,
విజయీ స్వపురం యాయా త్తత్తు మే స్యా ద్యశస్కరమ్.

శరైస్తు సఙ్కులాం కృత్వా లఙ్కాం పరబలార్దనః,
మాం నయే ద్యది కాకుత్స్థ స్త త్తస్య సదృశం భవేత్. 30

త ద్యథా తస్య విక్రాన్త మనురూపం మహాత్మనః,
భవే దాహవశూరస్య తథా త్వ ముపపాదయ. 31

త దర్థోపహితం వాక్యం సహితం హేతుసంహితమ్,
నిశమ్య హనుమా౯ శేషం వాక్య ముత్తర మబ్రవీత్. 32

దేవి హర్యృక్షసైన్యానా మీశ్వరః ప్లవతాంవరః,
సుగ్రీవ స్సత్త్వసమ్పన్న స్తవార్థే కృతనిశ్చయః. 33

స వానర సహస్రాణాం కోటిభి రభిసంవృతః,
క్షిప్ర మేష్యతి వైదేహి రాక్షసానాం నిబర్హణః. 34

తస్య విక్రమసంపన్నా స్సత్త్వవన్తో మహాబలాః,
మన స్సంకల్పసంపాతా నిదేశే హరయ స్థ్సితాః. 35

యేషాం నోపరి నాధస్తా న్న తిర్య క్సజ్జతే గతిః,
న చ కర్మసు సీదన్తి మహ త్స్వమితతేజసః. 36

అసకృ త్తై ర్మహోత్సాహై స్ససాగరధరాధరా,
ప్రదక్షిణీకృతా భూమి ర్వాయుమార్గానుసారిభిః. 37

మద్విశిష్టాశ్చ తుల్యాశ్చ సన్తి తత్ర వనౌకసః,
మత్తః ప్రత్యవరః కశ్చి న్నాస్తి సుగ్రీవసన్నిధౌ. 38

అహం తావ దిహ ప్రాప్తః కింపున స్తే మహాబలాః,
న హి ప్రకృష్టాః ప్రేష్యన్తే ప్రేష్యన్తే హీతరే జనాః. 39

త దలం పరితాపేన దేవి శోకో వ్యపైతు తే,
ఏకోత్పాతేన తే లఙ్కా మేష్యన్తి హరియూథపాః. 40

మమ పృష్ఠగతౌ తౌ చ చన్ద్రసూర్యా వి వోదితౌ,
త్వత్సకాశం మహాసత్త్వౌ నృసింహా వాగమిష్యతః. 41

తతో వీరౌ నరవరౌ సహితౌ రామలక్ష్మణౌ,
ఆగమ్య నగరీం లఙ్కాం సాయకై ర్విధమిష్యతః. 42

సగణం రావణం హత్వా రాఘవో రఘునన్దనః,
త్వా మాదాయ వరారోహే స్వపురం ప్రతియాస్యతి. 43

త దాశ్వసిహి భద్రం తే భవ త్వం కాలకాఙ్క్షిణీ,
న చిరాద్ద్రక్ష్యసే రామం ప్రజ్వలన్త మి వానలమ్. 44

నిహతే రాక్షసేన్ద్రేఽస్మిన్ సపుత్రామాత్యబాన్ధవే,
త్వం సమేష్యసి రామేణ శశాఙ్కే నేవ రోహిణీ. 45

క్షిప్రం త్వం దేవి శోకస్య పారం యాస్యసి మైథిలి,
రావణం చైవ రామేణ నిహతం ద్రక్ష్యసేఽచిరాత్. 46

ఏవ మాశ్వాస్య వైదేహీం హనుమా న్మారుతాత్మజః,
గమనాయ మతిం కృత్వా వైదేహీం పున రబ్రవీత్. 47

త మరిఘ్నం కృతాత్మానం క్షిప్రం ద్రక్ష్యసి రాఘవమ్,
లక్ష్మణం చ ధనుష్పాణిం లఙ్కాద్వార ముపస్థితమ్. 48

నఖదంష్ట్రాయుధా న్వీరాన్ సింహశార్దూలవిక్రమా౯,
వానరా న్వారణేన్ద్రాభాన్ క్షిప్రం ద్రక్ష్యసి సంగతాన్. 49

శైలామ్బుదనికాశానాం లఙ్కామలయసానుషు,
నర్దతాం కపిముఖ్యానా మార్యే యూథా న్యనేకశః. 50

స తు మర్మణి ఘోరేణ తాడితో మన్మథేషుణా,
న శర్మ లభతే రామ స్సింహార్దిత ఇవ ద్విపః. 51

మా రుదో దేవి శోకేన మాభూ త్తే మనసోఽప్రియమ్,
శ చీవ పత్యా శక్రేణ భర్త్రా నాథవతీ హ్యసి. 52

రామా ద్విశిష్టః కోఽన్యోఽస్తి కశ్చి త్సౌమిత్రిణా సమః,
అగ్నిమారుతకల్పౌ తౌ భ్రాతరౌ తవ సంశ్రయౌ. 53

నాస్మిం శ్చిరం వత్స్యసి దేవి దేశే,
రక్షోగణై రధ్యుషితేఽతిరౌద్రే,
న తే చిరా దాగమనం ప్రియస్య
క్షమస్వ మత్సఙ్గమ కాలమాత్రమ్. 54

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, వాల్మీకీయే,
చతుర్వింశత్సహస్రికాయాం, సంహితాయాం,
శ్రీమత్సున్దరకాణ్డే ఏకోనచత్వారింశ స్సర్గః.

## 39వ సర్గము

### సీతపలుకులు

సీతాదేవి చూడామణిని ఇచ్చి ఆంజనేయునితో ఇట్లనెను. ఇది శ్రీరామునకు బాగుగా తెలిసిన అభిజ్ఞానము. ఈ మణిని చూసిన వెంటనే నన్ను నా తల్లిని స్మరించును. వానరోత్తమా తరువాత కర్తవ్యము విషయమై చక్కగ ఆలోచింపుము. ఆ తరువాత కార్యము విషయమై నిన్నే నమ్మియున్నాను. శ్రీరాముని ఉత్సాహపరచి తరువాత విషయమునకు ప్రోత్సహించి నా దుఃఖమును తొలగింపుము. నీవు ప్రయత్నించి రామచంద్రుని ఉత్సాహపరిచినచో నా దుఃఖము తొలగిపోవును.

అప్రతిహత విక్రముగడు హనుమానుడు అట్టేచేసెదనని ప్రతిజ్ఞ చేసి సీతాదేవికి తలవంచి నమస్కారము చేసి ప్రయాణమునకు ఉద్యుక్తుడయ్యెను.

వాయుపుత్రుడు బయలుదేర బోవుచున్న సమయమున సీత బాష్పగద్గదమైన మాటలతో ఇట్లనెను. రామ లక్ష్మణులను క్షేమమ డుగుము. సుగ్రీవుని అతని మంత్రులను ఇంకను పెద్దలగు వానరులను క్షేమముడుగుము. రాముని ప్రోత్సహించి నన్నీ దుఃఖసముద్రము నుండి దాటించునటుల చూడుము. నేను జీవించి ఉండగనే రామడు వచ్చినన్న కటాక్షించునట్లు చూడుము. నీచాతుర్యముచే ఈ ధర్మమును నిర్వహింపుము. ఉత్సాహము కలిగించు మాటలను విని శ్రీరామునకు నన్ను తన వద్దకు చేర్చుకొనుటకై గట్టి ప్రయత్నము చేయగలడు. నా సందేశముతో కూడిన నీ మాటలు విన్నంతనే ఉత్సాహవంతుడై పరాక్రమింపగలడు.

సీత మాటలను విని మారుతి శిరసున అంజలి చేసి సమాధాన పరిచెను. శ్రీరామచంద్రుడు వానరాధిపతులలో భల్లూక పతులతో తొందరలో రాగలడు. యుద్ధభూమిలో శత్రువును జయించి నీశోకమును నిలువరింపగలడు. మనుష్యులలోగాని అసురలలో గాని, దేవతలలో గాని రాముడు బాణ ప్రయోగము చేయుచుండగా ఎదుటపడి నిలువ గలిగిన వారెవరును లేరు. నీకొరకై శ్రీరాముడు సూర్యునయినను, ఇంద్రునినయినను, సూర్యకుమారుడగు యమునయినను ఎదిరింపగల శక్తి కలవాడు. ఆ రామచంద్రుడు నాలుగు సముద్రములకు మధ్యలో ఉన్న ఈ భూమిని అంతను శాసింపగలడు.  జానకీదేవీ! నిన్ను గురించి చేయుచున్న ఈ ప్రయత్నము సఫలమై జయము లభించును.

ఆంజనేయుని ఆ మాటలు విని జానకీ దేవి ప్రయాణమునకు ఉద్యుక్తుడయిన ఆంజనేయుని కన్నార్పక చూచుచు భర్తృస్నేహముతో కూడిన వాక్యమును సౌహర్దముతో సమ్మాన పూర్వకముగా ఆదరముతో ఇట్లుపలికెను. మహావీరుడవయిన ఆంజనేయా! అవకాశము చేసికొని ఒక్క దినమయిన ఇక్కడ ఉండుము. శత్రువులనిన భయములేని వాడవు. చెట్లతో దట్టమయిన ఆకులతో ఆవృతమైన ప్రదేశమున ఎక్కడనో ఒక చోట నేడు విశ్రమించి రేపు నీవు బయలుదేరి వెళ్ళవచ్చును. కొద్దిపాటి పుణ్యము చేసికొన్న నాకు క్షణమాత్ర కాలమయిన ఈ శోకము నుండి విముక్తి కలుగును. మరల వచ్చుటకయి నీవు వెళ్ళినను నీవులేని సమయమున నా జీవితమే సంశయములో పడును. నీవు కనబడనప్పుడు మిక్కిలి దుఃఖితురాలనయిన నన్ను శోకము మిక్కిలి పరితపింపచేయును.

ఆంజనేయా! నాకొక పెద్ద సందేహము కలుగుచున్నది. ఈ విశాలమగు సముద్రమును నీతోడి వానరాధిపతులు ఎట్లు దాటిరాగలరు. వానర సైన్యము ఈ లంకకు ఎట్లు చేరును. రామలక్ష్మణులు మాత్రమే సముద్రమునెట్లు దాటి లంకకు రాగలరు. ఈ సముద్రము దాటి రాగల శక్తి వినతాసుతుడగు గరుత్మంతునకు, వాయుదేవునకు, వాయు కుమారుడవగు నీకు మాత్రమే కలదని నా అభిప్రాయము. అసాధ్యమయిన ఈ కార్యనిర్వహణలో నీవు ఏమి ఉపాయము ఆలోచించితివి. కర్తవ్యమును గురించి బాగుగా ఆలోచించి నిర్వహింపగల వారిలో నీవు ఉత్తముడవు. ఈ పనిని సాధించుటలో నీవొక్కడవే సమర్థుడవు నీవు చూపట్టిన కార్యము అందరును సాగించు రీతిలో ఫలించుచుండెను.

పెద్ద సేనలను వెంట పెట్టుకొని వచ్చి యుద్ధభూమిలో రావణుని జయించి రామచంద్రుడు విజయముతో అయోధ్యా నగరమునకు వేంచేసినచో అది నాకు కీర్తిని కలిగించును. పరంతపుడగు రాముడు తన బాణములతో లంకను ధ్వంసము చేసి నన్ను తీసికొని పోయినచో యుద్ధభూమిలో ఎన్నడును వెనుకంజ వేయని శ్రీరామచంద్రుని యొక్క శౌర్య విక్రములలకు హానిరాని రీతిలో నీవు మార్గనిర్దేశము చేయుము.

## హనుమంతుని ప్రతివచనము

సహేతుకములును అర్థవంతములునైన హితముతో కూడిన సీతాదేవి మాటలను విని హనుమానుడు ఇట్లు సమాధాన పరచెను. సీతాదేవీ! వానర భల్లూక సేనలకు అధిపతి అయిన సుగ్రీవ మహారాజు మహాబలశాలి నిన్ను శ్రీరామచంద్రుని సన్నిధికి చేర్చుటకై

ప్రతిజ్ఞయొనరించి ఉన్నాడు. కోట్ల కొలదీ అయిన వానరసేనలతో తొందరలో రాగలడు. రాక్షసులను చూపుమాపగలడు. విక్రమ సంపన్నులు, మహాబలులు, మనోవేగముతో ముందునకు సాగిపోగల వానరులెందరో సుగ్రీవుని ఆజ్ఞా నిర్వహణకై సన్నద్ధులయి ఉన్నారు. ఆకాశమున కాని, భూమిపై గాని వారి గమనమును నిరోధింపగల శక్తి ఎవరికిని లేదు. ఆ వానరులు మహాతేజస్సంపన్నులు, ఎంత పరిశ్రమించినను అలసట కాని అవసాధముకాని పొందరు. ఆ వానరులు మహోత్సాహముతోసాగరములలో, కొండలతో నిండిన భూమి అంతయు ప్రదక్షణము చేసి వచ్చిరి. సుగ్రీవుని సన్నిధిలో నాకంటె గొప్పవారు నాతో సమానులు ఉన్నారే గాని నాకంటె తక్కువ వారు ఎవరును లేరు.

ఆ వానరులలో సామాన్యుడనయినను సముద్రమును దాటి లంకకు వచ్చితిని. మహాబలులగు పెద్ద వానరులను గూర్చి ఏమిచెప్పగలను. సందేశము నందించుట అను చిన్న పనికి చిన్నవారే కాని పెద్దవారు పంపబడరు కదా! నీవు శోకింపవలదు. పరితాపము వలదు. మావానరసేనా నాయకులు ఒక్క గంతులో సముద్రమును దాటి లంకకు చేరగలరు. నావీపు పై కూర్చుండి ఉదయించిన సూర్యచంద్రుల వలె మహాబలాఢ్యులగు ఆ రామ లక్ష్మణులు నీదగ్గరకు రాగలరు. మహావీరులగు ఆ రామ లక్ష్మణులు తమ బాణములచే ఈలంకను ధ్వంసము చేయగలరు. బంధుమిత్రులతో రావణుని వధించి రఘువంశ్యవనుడు శ్రీరాముడు అయోధ్యా నగరమునకు వేంచేయగలడు. నీవు ఊరడిల్లుము. నీకు మేలు కలుగును. కొద్ది కాలము నిరీక్షింపుము.

ప్రజ్వలించుచున్న అగ్ని వలే ప్రకాశమానుడగు రామచంద్రుని చూడగలవు. రాక్షసాధిపతులతో, మంత్రులతో, బాంధవులతో రావణుడు సంహరింపబడిన తరువాత రోహిణీ నక్షత్రము చంద్రుని కలసినట్లుగా నీవును రాముని చేరగలవు. మైథిలీ! తొందరలో శోకసాగరము దాటి పోగలవు.

హనుమంతుడు బయలుదేర బోవుచు సీతాదేవితో ఇట్లనెను. తొందరలో రామలక్ష్మణులు ఇరువురును ధనుర్ధరులై లంకాద్వారమున నిలిచి ఉండగా చూడగలవు. మా వానరులు సింహశార్దూలముల వలె విక్రమింపగలరు. ఐరావతముతో సమానమగు దేహ పరిమాణము గలవారు. సమూహముగా కదలి వచ్చిన వానరులను చూడగలవు. శైలముల వలె మేఘముల వలె అత్యున్నతమయిన దేహములు గల వానరులు లంకలో ప్రవేశించి మలయ పర్వత సానువులందు సింహనాదములు చేయుచుండగా చూడగలవు. కోట్లకొలది గుంపులు గుంపులుగా రాగలరు.

నిన్ను విడిచి రామచంద్రుడు నీ విశ్లేషము భరింపలేక సుఖముగ ఉండుట లేదు. నిన్ను చూచుటకు నిన్ను కలియుటకు వేగిరపడుచున్నాడు. నీవు ఏడ్వకుము. మనస్సులో కూడ బాధపడవద్దు. అనాథయై ఉన్నావని బాధపడవద్దు. శ్రీరామచంద్రుని భర్తగా బడసిన నీకు దిక్కులేక పోవుట ఏమి! రామునితో లక్ష్మణునితో సమానులయిన వారే ఎక్కడ ఉండరు. అట్టిచో అధికులు ఎక్కడ ఉందురు? ఆ రాక్షస భూమిలో నీవు చిరకాలము ఉండనక్కరలేదు. అచిరకాలములోనే శ్రీరాముడు రాగలడు. ఓపిక పట్టుము.



# 40. చత్వారింశ స్సర్గః

శ్రుత్వా తు వచనం తస్య వాయుసూనో ర్మహాత్మనః,
ఉవా చాత్మహితం వాక్యం సీతా సురసుతోపమా. 1

త్వాం దృష్ట్వా ప్రియవక్తారం సంప్రహృష్యామి వానర,
అర్ధసంజాతసస్యేవ వృష్టిం ప్రాప్య వసున్ధరా. 2

యథా తం పురుషవ్యాఘ్రం గాత్రై శ్శోకాభికర్శితైః,
సంస్పృశేయం సకామాహం తథా కురు దయాం మయి.

అభిజ్ఞానం చ రామస్య దద్యాం హరిగణోత్తమ,
క్షిప్తా మిషీకాం కాకస్య కోపా దేకాక్షిశాతనీమ్. 4

మనశ్శిలాయా స్తిలకో గణ్డపార్శ్వే నివేశితః,
త్వయా ప్రణష్టే తిలకే తం కిల స్మర్తు మర్హసి. 5

స వీర్యవా న్కథం సీతాం హృతాం సమనుమన్యసే,
వసన్తీం రక్షసాం మధ్యే మహేన్ద్రవరుణోపమః. 6

ఏష చూడామణి ర్దివ్యో మయా సుపరిరక్షితః,
ఏతం దృష్ట్వా ప్రహృష్యామి వ్యసనే త్వా మివానఘ. 7

ఏష నిర్యాతిత శ్శ్రీమా న్మయా తే వారిసమ్భవః,
అతఃపరం న శక్ష్యామి జీవితుం శోకలాలసా. 8

అసహ్యాని చ దుఃఖాని వాచ శ్చ హృదయచ్ఛిదః,
రాక్షసీనాం సుఘోరాణాం త్వత్కృతే మర్షయా మ్యహమ్. 9

ధారయిష్యామి మాసం తు జీవితం శత్రుసూదన,
ఊర్ధ్వం మాసా న్న జీవిష్యే త్వయా హీనా నృపాత్మజ. 10

ఘోరో రాక్షసరాజోఽయం దృష్టిశ్చ న సుఖా మయి,
త్వాం చ శ్రుత్వా విషజ్జన్తం న జీవేయ మహం క్షణమ్.

వైదేహ్యా వచనం శ్రుత్వా కరుణం సాశ్రుభాషితం,
అ థాబ్రవీ న్మహాతేజా హనూమా న్మారుతాత్మజః. 12

త్వచ్ఛోకవిముఖో రామో దేవి సత్యేన తే శపే,
రామే దుఃఖాభిభూతే తు లక్ష్మణః పరితప్యతే. 13

కథంచి ద్భవతీ దృష్టా న కాలః పరిశోచితుమ్,
ఇమం ముహూర్తం దుఃఖానా మన్తం ద్రక్ష్యసి భామిని. 14

తా వుభౌ పురుషవ్యాఘ్రౌ రాజపుత్రా వరిన్దమౌ,
త్వద్దర్శన కృతోత్సాహౌ లఙ్కాం భస్మీకరిష్యతః. 15

హత్వా తు సమరే క్రూరం రావణం సహబాన్ధవమ్,
రాఘవౌ త్వాం విశాలాక్షి స్వాం పురీం ప్రాపయిష్యతః. 16

యత్తు రామో విజానీయా దభిజ్ఞాన మనిన్దితే,
ప్రీతిసంజననం తస్య భూయ స్త్వం దాతు మర్హసి. 17

సాఽబ్రవీ ద్దత్తమేవేతి మయాభిజ్ఞాన ముత్తమమ్,
ఏతదేవ హి రామస్య దృష్ట్వా మత్కేశభూషణమ్. 18

శ్రద్ధేయం హనుమ న్వాక్యం తవ వీర భవిష్యతి,
స తం మణివరం గృహ్య శ్రీమా న్ప్లవగసత్తమః. 19

ప్రణమ్య శిరసా దేవీం గమనా యోపచక్రమే,
త ముత్పాతకృతోత్సాహ మవేక్ష్య హరిపుఙ్గవమ్. 20

వర్ధమానమహావేగ ముువాచ జనకాత్మజా, . .
అశ్రుపూర్ణముఖీ దీనా బాష్పగద్గదయా గిరా. 21

హనుమన్ సింహసంకాశౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ,
సుగ్రీవం చ సహామాత్యం సర్వా న్బ్రూయా హ్యనామయమ్.

యథా చ స మహాబాహు ర్మాం తారయతి రాఘవః,
అస్మా ద్దుఃఖామ్బుసంరోధా త్త్వం సమాధాతు మర్హసి. 23

ఇమం చ తీవ్రం మమ శోకవేగమ్
రక్షోభి రేభిః పరిభర్త్సనం చ,
బ్రూయాస్తు రామస్య గత స్సమీపమ్
శివశ్చ తేఽధ్వాస్తు హరిప్రవీర. 24

స రాజపుత్ర్యా ప్రతివేదితార్థః
కపిః కృతార్థః పరిహృష్టచేతాః,
అల్పావశేషం ప్రసమీక్ష్య కార్యం
దిశం హ్యుదీచీం మనసా జగామ. 25

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, వాల్మీకీయే,
చతుర్వింశత్సహస్రికాయాం, సంహితాయాం,
శ్రీమత్సున్దరాకాణ్డే చత్వారింశ స్సర్గః.

# 40వ సర్గము

## సీత పలుకుట

మహాత్ముడగు వాయునందనుని మాటలను విని తన దుఃఖమును శాంతింపచేయు హితకరమైన మాటలు పలికెను.

వానరోత్తమా ! సగము తయారయిన సస్యము గల చేను వర్షములచే తేరుకొన్నట్లుగా నీ మాటలను విని నేను ఆనందపడుచున్నాను. శోకముచే కృశించిన ఈ అవయములతో పురుషోత్తముడగు శ్రీరాముని స్పృశించు భాగ్యము కలుగునట్లుగా నీవు నా యందు దయచూపుము. నా విషయమున అపచారపడిన కాకాసురునిపై కోపముతో ఇషీకము (దర్భ) బ్రహ్మాస్త్రముగా ప్రయోగించి ఒక కన్నును పరిహారముగా తీసికొన్న విషయమును కూడ గుర్తుగచెప్పుము. నా ముఖమున తిలకము చెరిగిపోగా చిత్రకూటపార్శ్వమున విహరించిన సమయమున రమణిశిలను శ్రీరాముడు తిలకముగా దిద్దిన విషయమును కూడ గుర్తుగ చెప్పుము.

మహేంద్రునితో వరుణునితో సమాన ప్రభావము కలిగిన మహావీరుడయిన ఆ రామచంద్రుడు ఈ రాక్షసుల మధ్య ఇన్ని బాధలు పడుచుండగా ఏల సహించి ఊరకొనుచున్నాడో తెలియకున్నది. నిన్ను విడిచి ఆపత్కాలములో ఉన్న సీతాదేవి చూచుకొని కాలము వెళ్ళబుచ్చుచున్నదో ప్రాణప్రదముగా ఇంత వరకు దేనిని దాచి ఉంచుకొన్నదో ఆ చూడామణిని నీకు విశ్వాసము కలుగుటకయి

అభిజ్ఞానముగా పంపించుచున్న క్రూరాత్మలగు ఈ రాక్షస స్త్రీల దారుణ వాక్యములను కూడ ఎప్పటికయిన నీదర్శనము కలుగగలదను ఆశతో సహించుచున్నాను.

శత్రుసూదనా! ఒక్క మాస కాలము మాత్రము ఏదో రీతిగా జీవింతును. నిన్ను విడిచి ఒక మాసము తరువాత జీవింపలేను. ఈ రాక్షసాధిపతి చాల దారుణుడు. నాపై అతని దృష్టి సుఖకరముగ లేదు. నీవును నన్ను విడిచి దుఃఖపడుచున్నావని విన్న తర్వాత ఇకపై ఒక్క క్షణము కూడ జీవించుట మిక్కిలి కష్టముగ తోచుచున్నది, జాలి కలిగించు సీతాదేవి మాటలను విన్న తరువాత వాయునందనుడు ఇట్లు పలికెను.

### హనుమంతుని పలుకులు

నీ విశ్లేషముచే రాముడు మిక్కిలి దుఃఖముపడుచున్నాడు. రాముని దుఃఖమును చూచి లక్ష్మణుడును పరితపించుచున్నాడు. ఎన్నో, శ్రమములకు ఓర్చి ఇంతకాలమునకు నిన్ను చూడగలిగితిని. ఇది దుఃఖపడవలసిన కాలము కాదు. ఇప్పటి నుండి క్రమముగా నీ దుఃఖములు తొలగిపోవు కాలము ఆసన్నమైనది. ఎప్పుడును శత్రువులను అణచివేయు స్వభావము గల పురుషోత్తములయిన ఆ రాజకుమారులు ఇద్దరును నీ జాడ తెలిసినందున ఉత్సాహవంతులై ఈ లంక అంతయును భస్మముగ చేసి వేయుదురు.

యుద్ధభూమిలో బాంధవ సహితముగా రావణుని సంహరించి ఆ రాజకుమారు లిరువురును నిన్ను అయోధ్యకు గొనిపోవుదురు. రామచంద్రునకు మిక్కిలి ప్రీతి కలిగింపగల ఉత్తమమైన అభిజ్ఞానమును (గుర్తు) ఈయవలసినదిగా హనుమానుడు కోరగా

వాయునందనా! నా శిరోభూషణమయిన ఈ చూడామణిని చూడగానే నీ మాటయందు శ్రీరామునకు గొప్ప విశ్వాసము కలుగును. ఇంతకంటె మరియొక్క అభిజ్ఞానము (గుర్తు) అక్కరలేదు అని చెప్పెను.

## హనుమంతుడు సీతను వీడుట

సీతాదేవికి తలవంచి నమస్కరించి హనుమానుడు ప్రయాణము నకు సిద్ధమయ్యెను. దేహము పెంచెను. ఆకాశములోనికి ఎగురుటకు సిద్ధముగ ఉండెను. ఆ సమయమున కన్నుల వెంట నీరు జాలువారు చుండగా బాష్పగద్గదమయిన స్వరముతో దైన్యముతోచునట్లుగా సీత హనుమంతునితో పలికెను.

వాయుకుమారా! సింహసమాన పరాక్రములగు రామలక్ష్మణులతో సుగ్రీవుని మంత్రులతో నేను కుశలమడిగినట్లు చెప్పుము. మహాబాహుడగు ఆ రామచంద్రుడు నన్నీదుఃఖసముద్రము నుండి దాటించునట్లుగా ఉత్సాహపఱచి కార్యోన్ముఖుని చేయు బాధ్యత వహింపవలసినదిగా నిన్ను కోరుచున్నాను. నా దుఃఖస్థితి ఈ రాక్షసులు చేయు బెదరింపులు అన్నియును నీవు శ్రీరాముని సన్నిధికి పోయి పూర్తిగ విశదీకరింపుము. నీవు పోవు మార్గము నీకు సుఖకరమయి మంగళకరమై ఉండుగాక.

ఆ హనుమానుడు సీతాదేవి చెప్పి మాటలన్నిటిని స్వీకరించి కృతార్థుడయి, సంతుష్టాంతరుంగుడయి కొలదిగా మిగిలిన కార్యము ను గుఱించి ఉత్తర దిక్కును గూర్చి తన మనస్సును మరల్చెను.



# 41. ఏకచత్వారింశ స్సర్గః

స చ వాగ్భిః ప్రశస్తాభి ర్గమిష్య న్పూజిత స్తయా,
తస్మాద్దేశా దపక్రమ్య చిన్తయామాస వానరః. 1

అల్పశేష మిదం కార్యం దృష్టేయ మసితేక్షణా,
త్రీ నుపాయా నతిక్రమ్య చతుర్థ ఇహ దృశ్యతే. 2

న సామ రక్షస్సు గుణాయ కల్పతే
న దాన మర్థోపచితేషు యుజ్యతే,
న భేదసాధ్యా బలదర్పితా జనాః
పరాక్రమస్త్వేవ మ మేహ రోచతే. 3

న చాస్య కార్యస్య పరాక్రమాదృతే
వినిశ్చయః కశ్చి దిహోపపద్యతే,
హతప్రవీరా హి రణే హి రాక్షసాః
కథం చి దీయు ర్య దిహాద్య మార్దవమ్. 4

కార్యే కర్మణి నిర్దిష్టే యో బహూ న్యపి సాధయేత్,
పూర్వకార్యావిరోధేన స కార్యం కర్తు మర్హతి. 5

న హ్యేక స్సాధకో హేతు స్స్వల్ప స్యాపీహ కర్మణః,
యో హ్యర్థం బహుధా వేద స సమర్థోఽర్థసాధనే. 6

ఇహైవ తావ త్కృతనిశ్చయో హ్యహమ్
యది వ్రజేయం ప్లవగేశ్వరాలయమ్,
పరాత్మసంమర్దవిశేషతత్త్వవి
త్తతః కృతం స్యా న్మమ భర్తృశాసనమ్. 7

కథం ను ఖ ల్వద్య భవే త్సుఖాగతం
ప్రసహ్య యుద్ధం మమ రాక్షసై స్సహ,
తథైవ ఖ ల్వాత్మబలం చ సారవ
త్సం మానయే న్మాం చ రణే దశాననః. 8

తత స్సమాసాద్య రణే దశాననమ్
సమన్త్రివర్గం సబలప్రయాయినమ్,
హృది స్థితం తస్య మతం బలం చ వై
సుఖేన మత్వాహ మితఃపున ర్వ్రజే. 9

ఇద మస్య నృశంసస్య నన్దనోపమ ముత్తమమ్
వనం నేత్ర మనఃకాన్తం నానాద్రుమలతాయుతమ్. 10

ఇదం విధ్వంసయిష్యామి శుష్కం వన మి వానలః,
అస్మి న్భగ్నే తతః కోపం కరిష్యతి దశాననః. 11

తతో మహ త్సాశ్వమహారథద్విపం
బలం సమాదేక్ష్యతి రాక్షసాధిపః,
త్రిశూలకాలాయసపట్టిసాయుధం
తతో మహద్యుద్ధ మిదం భవిష్యతి. 12

అహం తు తై స్సంయతి చణ్డవిక్రమై
స్సమేత్య రక్షోభి రసహ్యవిక్రమః,
నిహత్య త ద్రావణచోదితం బలం
సుఖం గమిష్యామి కపీశ్వరాలయమ్. 13

తతో మారుతవ త్క్రుద్ధో మారుతి ర్భీమవిక్రమః,
ఊరువేగేన మహతా ద్రుమా న్క్షేప్తు మ థారభత్. 14

తతస్తు హనుమా న్వీరో బభఞ్జ ప్రమదావనమ్,
మత్తద్విజసమాఘుష్టం నానాద్రుమలతాయుతమ్. 15

త ద్వనం మథితై ర్వృక్షై ర్భిన్నై శ్చ సలిలాశయైః,
చూర్ణితైః పర్వతాగ్రైశ్చ బభూ వాప్రియదర్శనమ్. 16

నానాశకున్తవిరుతైః ప్రభిన్నై స్సలిలాశయైః,
తామ్రైః కిసలయైః క్లాన్తైః క్లాన్తద్రుమలతాయుతమ్. 17

న బభౌ తద్వనం తత్ర దావానలహతం యథా,
వ్యాకులావరణా రేజు ర్విహ్వలా ఇవ తా లతాః. 18

లతాగృహై శ్చిత్రగృహైశ్చ నాశితై
ర్మహోరగై ర్వ్యాళమృగైశ్చ నిర్ధుతైః,
శిలాగృహై రున్మథితై స్తథాగృహైః
ప్రణష్టరూపం త దభూ న్మహద్వనమ్. 19

సా విహ్వలా శోకలతాప్రతానా
వనస్థలీ శోకలతాప్రతానా,

జాతా దశాస్యప్రమదావనస్య
కపే ర్బలార్ద్ధి ప్రమదావనస్య. 20

స తస్య కృత్వార్థపతే ర్మహాకపిః
ర్మహ ద్వ్యలీకం మనసో మహాత్మనః,
యుయుత్సు రేకో బహుభి ర్మహాబలైః
శ్రియా జ్వల న్తోరణ మాస్థితః కపిః. 21

1

2

3

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, వాల్మీకీయే,
చతుర్వింశత్సహస్రికాయాం, సంహితాయాం,
శ్రీమత్సున్దరకాణ్డే, ఏకచత్వారింశ స్సర్గః.

4

శ్లో. మాని షాద ప్రతిష్ఠాంత్వ మితిశ్లోకస్య వైశ్రుతేః,
వాగ్మినాం ప్రథమో మర్త్యో లోకేభూత్వా చరిష్యతి.

5

శ్లో. తస్మాదిదం బాలకానాం పాఠ్యమాద రతః పురా,
కృత్స్న శాస్త్రేషు నిపుణ స్సర్వశాస్త్రేషు వల్లభః.

6

అయోధ్యావర్ణనం శ్రుత్వా ముచ్యేత సకలాఘతః,
మహాభూత సముత్థానం యే శృణ్వన్తి మహీతలే.

7

– తత్త్వ సంగ్రహరామాయణే ఉత్తరకాణ్డే

8

## 41వ సర్గము

### హనుమంతు డనంతర కర్తవ్యము నాలోచించుట

ప్రశస్తమయిన మాటలతో సీతాదేవిచే అభినందింపబడిన ఆ హనుమానుడు ఆ ప్రదేశము నుండి మరియొక చోటికి కదలిపోయి ఇట్లు ఆలోచించెను.

ఇక చేయవలసిన పని కొద్దిగ మిగిలి ఉన్నది. సీతాదేవి కనబడినది. నాలుగు ఉపాయములలో నాల్గవ ఉపాయమే ఇచట అనుకూల మగునట్లు తోచుచున్నది. రాక్షసుల విషయమయి సామోపాయము కార్యకారి కాదు. అర్థసంపన్నుల విషయమున దానోపాయమును సఫలము కాదు. మహాబలముచే పొగరెక్కి ఉన్న ఈ రాక్షసుల విషయమున భేదమును సాధ్యము కాదు. నాల్గవదగు దండోపాయమే ఉత్తమ సాధనము. మహావీరులు యుద్ధభూమిలో మరణింపగా తక్కిన రాక్షసులు తమ పారుష్యమును వీడి మార్దవమును వహింపవచ్చును.

సాధింపవలసిన పనితోపాటుగా పూర్వ కార్యమునకు విరోధము లేకుండ సాధించువాడు మంచి కార్యసాధకుడుగా చెప్పదగును. ఒక

ప్రయోజనము సాధించుటకు బహుముఖములుగా ఆలోచించి నిర్ణయము తీసికొనుట మంచిది. అట్లు ఆలోచించువాడే కార్యసాధకుడగును.

ఇంత మాత్రముచే అనగా సీతాదర్శనమాత్రముచే తృప్తిపడి నేను సుగ్రీవమహారాజు వద్దకు పోయినచో ప్రభువు యొక్క ఆజ్ఞను పూర్తిగా నిర్వహించినట్లు అగునా! నిజ బలమును, శత్రుబలమును సరిగా అంచనా వేసికొని వెళ్ళుట మంచిది. ఈ రాక్షసులతో యుద్ధము సుఖముగ లభించు సాధనమేమి? నా బలమేదో కొంత అయిన ప్రదర్శింపక పోయినచో నన్ను అనాదరింపక రావణుడు గొప్పగ చూచునా? ఆ యుద్ధములో మంత్రులతో సేనలతో వచ్చిన దశాననుని ఎదుర్కొని ఆతని అభిప్రాయము బలము తెలిసికొని సుఖముగ నేను సుగ్రీవుని సన్నిధికి ఆతని అభిప్రాయము బలము తెలిసికొని సుఖముగ నేను సుగ్రీవుని సన్నిధికి బయలుదేరి పోయెదను.

పాపాత్ముడగుఈ రావణాసురుని యొక్క నందనవనతుల్యమయిన రకరకముల వృక్షములతో కూడిన నేత్ర మనః కాంతమగు అశోకవనమును విధ్వంసము చేసెదను. ఈ వనము విధ్వంసమయి నప్పుడు రావణునికి కోపము రాక తప్పదు. ఆ కోపముచే దశాననుడు ఏనుగులతో గుఱ్ఱాలతో రథములతో కూడిన పెద్ద సేనను యుద్ధభూమికి పంపగలడు. భయంకరమయిన త్రిశూలా యుధములతో వచ్చిన ఆ సేనతో నేను పోరాడక తప్పదు. వారికి దుస్సహమయిన నా పరాక్రమమును చూపి ఆ సేనలను రూపుమాపి నేను సుఖముగా సుగ్రీవ మహారాజు సన్నిధికి పోదును అని హనుమంతుడు నిశ్చయించుకొన్నాడు.

41 వ సర్గము

## అశోకవన విధ్వంసము

ఆతడు వేగముగా సంచరించునపుడు ఆ ఊరువేగమునకు కొన్ని చెట్లు నేల కూలినవి. కొన్నింటిని విరుగ గొట్టెను. మరికొన్నింటిని పెల్లగించి వైచెను. ఆ అశోకవనమంతయు హనుమానుని, వీరవిహారమునకు గురి అయి విఱిగిన వృక్షములతో గట్లు తెగిన జలాశయములతో దర్శనీయము కాకపోయినది. చెట్లు విఱిగినందున ఆశ్రయములేక పక్షులు అఱవనారంభించినవి. జలాశయములు గట్లు తెగి నిర్జలములయినవి. చెట్ల చిగుళ్ళు వృక్షముల నాక్రమించుకొని ఎగబ్రాకిన లతలు వాడిపోయినవి. అశోకవనమంతయు లతా గృహములు, చిత్రశాలలు నాశనమయినవి. సర్పములతో, క్రూరమృగములతో నిండియున్న శిలాగృహములు కూడ ధ్వస్తములయినవి. రావణాసురుని యొక్క ప్రమదవనమయిన అంతఃపురవాసులకు విహారస్థలమైన ఆ అశోక వనము శోకలతలచే వ్యాప్తమయి ఉన్నది.

అశోకవనమును ధ్వస్తమొనర్చి రావణాసురుడు పంపిన సేనలతో పోరాట మొనర్చుటకై నగరబహిర్ద్వారమున యుద్ధ సన్నద్ధుడయ్యెను.



## 42. ద్విచత్వారింశ స్సర్గః

తతః పక్షినినాదేన వృక్షభఙ్గస్వనేన చ,
బభూవు స్త్రాససంభ్రాన్తా స్సర్వే లఙ్కానివాసినః.

విద్రుతాశ్చ భయత్రస్తా వినేదు ర్మృగపక్షిణః,
రక్షసాం చ నిమిత్తాని క్రూరాణి ప్రతిపేదిరే.

తతో గతాయాం నిద్రాయాం రాక్షస్యో వికృతాననాః,
తద్వనం దదృశు ర్భగ్నం తం చ వీరం మహాకపిమ్.

స తా దృష్ట్వా మహాబాహు ర్మహాసత్త్వో మహాబలః,
చకార సుమహద్రూపం రాక్షసీనాం భయావహమ్.

తత స్తం గిరిసంకాశ మతికాయం మహాబలమ్,
రాక్షస్యో వానరం దృష్ట్వా పప్రచ్ఛు ర్జనకాత్మజామ్.

కోఽయం కస్య కుతో వాయం కిన్నిమిత్త మిహాగతః,
కథం త్వయాసహానేన సంవాదః కృత ఇత్యుత.

ఆచక్ష్వ నో విశాలాక్షి మా భూ త్తే సుభగే భయమ్,
సంవాద మసితాపాఙ్గే త్వయా కిం కృతవా నయమ్.

అ థాబ్రవీ న్మహాసాధ్వీ సీతా సర్వాఙ్గసున్దరీ,
రక్షసాం భీమరూపాణాం విజ్ఞానే మమ కా గతిః.

యూయ మేవాభిజానీత యోఽయం యద్వా కరిష్యతి,
అహి రేవ హ్యహేః పాదా న్విజానాతి న సంశయః. 9

అహ మప్యస్య భీతాస్మి నైనం జానామి కోఽన్వయమ్,
వేద్మి రాక్షస మేవం కామరూపిణ మాగతమ్. 10

వైదేహ్యా వచనం శ్రుత్వా రాక్షస్యో విద్రుతా దిశః,
స్థితాః కాశ్చి ద్గతాః కాశ్చి ద్రావణాయ నివేదితుమ్. 11

రావణస్య సమీపే తు రాక్షస్యో వికృతాననాః,
విరూపం వానరం భీమ మాఖ్యాతు ముపచక్రముః. 12

అశోకవనికామధ్యే రాజన్ భీమవపుః కపిః,
సీతయా కృతసంవాద స్తిష్ఠ త్యమితవిక్రమః. 13

న చ తం జానకీ సీతా హరిం హరిణలోచనా,
అస్మాభి ర్బహుధా పృష్టా నివేదయితు మిచ్ఛతి. 14

వాసవస్య భవే ద్దూతో దూతో వైశ్రవణస్య వా,
ప్రేషితో వాపి రామేణ సీతాన్వేషణకాఙ్క్షయా. 15

తేన త్వద్భుతరూపేణ యత్త త్తవ మనోహరమ్,
నానామృగగణాకీర్ణం ప్రమృష్టం ప్రమదావనమ్. 16

న తత్ర కశ్చి దుద్దేశో యస్తేన న వినాశితః,
యత్ర సా జానకీ సీతా స తేన న వినాశితః. 17

జానకీ రక్షణార్థం వా శ్రమా ద్వా నోపలభ్యతే,
అథవా క శ్శ్రమ స్తస్య సైవ తేనాభిరక్షితా. 18

చారుపల్లవపుష్పాఢ్యం యం సీతా స్వయ మాస్థితా,
ప్రవృద్ధ శ్శింశుపావృక్ష స్స చ తేనాభిరక్షితః. 19

తస్యోగ్రరూప స్యోగ్ర! త్వం దణ్డ మాజ్ఞాతు మర్హసి,
సీతా సంభాషితా యేన తద్వనం చ వినాశితుమ్. 20

మనఃపరిగృహీతాం తాం తవ రక్షోగణేశ్వర,
క స్సీతా మభిభాషేత యో న స్యా త్త్యక్తజీవితః. 21

రాక్షసీనాం వచ శ్శ్రుత్వా రావణో రాక్షసేశ్వరః,
హుతాగ్ని రివ జజ్వాల కోపసంవర్తితేక్షణః. 22

తస్య క్రుద్ధస్య నేత్రాభ్యాం ప్రాపత న్నస్రబిన్దవః,
దీప్తాభ్యా మివ దీపాభ్యాం సార్చిష స్స్నేహబిన్దవః. 23

ఆత్మన స్సదృశా ఞ్శూరా న్కిఙ్కరా న్నామ రాక్షసా౯,
వ్యాదిదేశ మహాతేజా నిగ్రహార్థం హనూమతః. 24

తేషా మశీతిసాహస్రం కిఙ్కరాణాం తరస్వినామ్,
నిర్యయు ర్భవనా త్తస్మా త్కూటముద్గరపాణయః. 25

మహోదరా మహాదంష్ట్రా ఘోరరూపా మహాబలాః,
యుద్ధాభిమనస స్సర్వే హనుమద్గ్రహణోద్యతాః. 26

తే కపీన్ద్రం సమాసాద్య తోరణస్థ మవస్థితమ్,
అభిపేతు ర్మహావేగాః పతఙ్గా ఇవ పావకమ్. 27

తే గదాభి ర్విచిత్రాభిః పరిఘైః కాఞ్చనాఙ్గదైః,
ఆజఘ్ను ర్వానరశ్రేష్ఠం శరై శ్చాదిత్యసన్నిభైః. 28

ముద్గరైః పట్టిసై శ్శూలైః ప్రాసతోమరశక్తిభిః,
పరివార్య హనూమన్తం సహసా తస్థు రగ్రతః. 29

హనుమా నపి తేజస్వీ శ్రీమా న్పర్వతసన్నిభః,
క్షితా వావిధ్య లాఙ్గూలం ననాద చ మహాస్వనమ్. 30

స భూత్వా సుమహాకాయో హనుమా న్మారుతాత్మజః,
ధృష్ట మాస్ఫోటయామాస లఙ్కాం శబ్దేన పూరయన్. 31

త స్యాస్ఫోటితశబ్దేన మహతా సానునాదినా,
పేతు ర్విహఙ్గా గగనా దుచ్చై శ్చేద మఘోషయత్. 32

జయ త్యతిబలో రామో లక్ష్మణశ్చ మహాబలః,
రాజా జయతి సుగ్రీవో రాఘవేణాభిపాలితః. 33

దాసోఽహం కోసలేన్ద్రస్య రామ స్యాక్లిష్టకర్మణః,
హనుమా ఞ్ఛత్రుసైన్యానాం నిహన్తా మారుతాత్మజః. 34

న రావణసహస్రం మే యుద్ధే ప్రతిబలం భవేత్,
శిలాభిస్తు ప్రహరతః పాదపైశ్చ సహస్రశః. 35

అర్దయిత్వా పురీం లఙ్కా మభివాద్య చ మైథిలీమ్,
సమృద్ధార్థో గమిష్యామి మిషతాం సర్వరక్షసామ్. 36

తస్య సన్నాదశబ్దేన తేఽభవ న్భయశఙ్కితాః,
దదృశు శ్చ హనూమన్తం సన్ధ్యామేఘ మివోన్నతమ్. 37

స్వామిసన్దేశనిశ్శఙ్కా స్తత స్తే రాక్షసాః కపిమ్,
చిత్రైః ప్రహరణై ర్భీమై రభిపేతు స్తతస్తతః. 38

స తైః పరివృత శ్శూరై స్సర్వత స్సమహాబలః,
ఆససా దాఽఽయసం భీమం పరిఘం తోరణాశ్రితమ్. 39

స తం పరిఘ మాదాయ జఘాన రజనీచరాన్,
స పన్నగ మివాదాయ స్ఫురన్తం వినతాసుతః,
విచచా రామ్బరే వీరః పరిగృహ్య చ మారుతిః. 40

స హత్వా రాక్షసా న్వీరా న్కిఙ్కరా న్మారుతాత్మజః,
యుద్ధకాఙ్క్షీ పున ర్వీర స్తోరణం సముపాశ్రితః. 41

తత స్తస్మా ద్భయా న్ముక్తాః కతిచి త్తత్ర రాక్షసాః,
నిహతా న్కిఙ్కరా న్సర్వాన్ రావణాయ న్యవేదయన్. 42

స రాక్షసానాం నిహతం మహద్బలం
నిశమ్య రాజా పరివృత్తలోచనః,
సమాదిదే శాప్రతిమం పరాక్రమే
ప్రహస్తపుత్రం సమరే సుదుర్జయమ్. 43

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, వాల్మీకీయే,
చతుర్వింశత్సహస్రికాయాం, సంహితాయాం,
శ్రీమత్సున్దరకాణ్డే, ద్విచత్వారింశ స్సర్గః.

## 42వ సర్గము

## రాక్షస స్త్రీలు సీతను హనుమంతుని గూర్చి ప్రశ్నించుట

తరువాత పక్షుల ధ్వనిచేత, వృక్షములు కూలుటవల్ల అయిన ధ్వనిచేత లంకావాసులందరు మిక్కిలి భయపడిరి. మృగములు పక్షులు భయపడి పారిపోవుచు అఱచుటకు ఆరంభించినవి. రాక్షసుల కందరకు భయంకరమైన దుర్నిమిత్తములు తోచినవి. నిద్రలేచిన రాక్షస స్త్రీలందరు వికృతమయిన ముఖములతో భగ్నమయిన అశోకవనమును ఆ మహావానరుని చూచిరి.

ఆ రాక్షస స్త్రీలను చూచి వారందరు భయపడునట్లుగా తన రూపమును చాల పెద్దదిగా చేసెను. పర్వతము వలె మహాకాయుడయిన ఆ వానరుని చూచి ఆ రాక్షస స్త్రీలు సీతను అడిగిరి. ఈ వానరుడెవడు? ఎక్కడి నుండి వచ్చెను? ఎందుకొరకై వచ్చెను? ఆతనితో నీవేమి మాటాడితివి? సీతా! మాకు చెప్పుము. నీకేమియును భయము లేదు. అతడు నీతో ఏమి మాటలాడెనో అదికుడ మాతో చెప్పుము. సర్వాంగసుందరియు పరమ సాధ్వియు అగు ఆ సీతాదేవి ఇట్లు పలికినది.

భయంకరరూపులైన రాక్షసులను గూర్చి నాకేమి తెలియును? తెలిసికొనుటకు అశక్తురాలను. ఆతడెవరో ఎందులకు వచ్చెనో ఏమి చేయునో మీరే తెలిసికొనగలరు. పాము కాళ్ళను పామే తెలిసికొనగలదు. ఈ విషయమున ఏమియు సంశయము అక్కరలేదు. నేనే భయపడుచున్నాను. ఈతడెవరో నాకును తెలియుటలేదు. రాక్షసుడే వానరరూపమున వచ్చియున్నాడని తలంచుచున్నాను.

42వ సర్గము

## రాక్షస స్త్రీలు రావణునితో అశోకవన వినాశనమును గూర్చి చెప్పట

సీతాదేవి మాటలను విని రాక్షసస్త్రీలు వేరు వేరు దిక్కులకు పరుగులు పెట్టిరి. కొంతమంది సీతాదేవి వద్దనే ఉండిరి. కొందరు రావణునికి తెలియజేయుటకై పోయిరి.

రావణుని సమీపమునకు పోయిన రాక్షస స్త్రీలు వికృతములయిన ముఖములతో వికృతరూపములతో రావణునితో చెప్పిరి. మహావిక్రముడయిన వానరుడు భయంకరమయిన రూపముతో అశోకవనమునకు వచ్చి ఉన్నాడు. సీతతో ఏదో సంభాషించినాడు. ఎంత అడిగినను ఆతడెవరో సీత చెప్పుట లేదు. ఇంద్రుని దూతయో, కుబేరుని దూతయో సీతాన్వేషణమునకై రాముడు పంపిన వానరుడో తెలియుట లేదు.

నానా మృగ పక్షులతో నిండి మనోహరమయి ఉన్న నీ ప్రమదా వనము ధ్వంసము చేయబడినది. సీత ఉన్న ప్రదేశము తప్ప తక్కిన ప్రదేశమంతయు నాశనము చేయబడినది. సీత ఉన్న వృక్షమును అలసట చేత పాడుచేయలేదో సీతకు ఆ చెట్టు నీడ కావలయును కనుక నాశనము చేయలేదో తెలియదు. అంత మహావనమును ధ్వంసము చేసిన ఆ వానరుడు ఆ శింశుపావృక్షమును పడగొట్టుట శ్రమకరమా? సీతకు నీడ నిచ్చుచున్నది కనుక సీతకు ఆశ్రయమయి ఉన్నది కనుక చల్లదనమును ఇచ్చుచున్నది కనుక చక్కని చిగురులతో, పువ్వులతో నిండి ఉన్న శింశుపావృక్షము మాత్రము పడగొట్టక వదలెను. భయంకరరూపుడగు ఆ వానరునకు ఆ రాక్షసునకు నీవు దండన విధింపవలసి ఉన్నది. నీవు మనస్ఫూర్తిగా పరిగ్రహించిన సీతతో మాటలాడినాడు. నీవు ప్రేమించిన సీతతో మాటలాడిన ఆ వానరుడు ఇంకను బ్రతికియుండుటయా?

## రావణుని క్రోధము

ఆ రాక్షస స్త్రీల మాటలు విన్న తరువాత ఆహుతులచే మంచిన అగ్నిహోత్రుని వలె ఆతడు మండిపడెను. కృద్ధుడైన ఆతని నేత్రముల నుండి దీపము నుండి మండుచున్న నూనె బిందువుల వలె రక్తబిందువులు జారిపడినవి. మహాబలపరాక్రమములు కలిగిన కింకరులను, రాక్షసులను హనుమంతుని బంధించుటకై పంపించెను

## రావణకింకరులు హనుమ నెదుర్కొనుట

ఎనుబదివేలమంది కింకరులు కూటముశరాది ఆయుధము లన చేతబట్టి పెద్ద పొట్టలు కలిగిన పెద్ద పెద్ద కోరలతో భయంకరు లయిన మహాబలులు అయిన ఆ కింకరుల హనుమంతునితో పోరాడి ఆతని బంధించుటకై లంకా బహిర్ద్వారముపై నిలిచి ఉన్న ఆంజనేయుని సమీపించిరి. విచిత్రములయిన గదలు, పరిఘలు, బాణములు ముద్గరములు, పట్టసములు,శూలములు మొదలగు ఆయుధము లతో హనుమంతుని చుట్టుముట్టిరి.

## హనుమంతుడు రాక్షసవీరులకు యుద్ధము

పర్వతసన్నిభమయిన దేహముతో కూడిన హనుమంతుడు తోకను నేలపై కొట్టి భయంకరముగా సింహనాదము చేసెను. ఆ వాయునందనుడు లంక అంతయు ప్రతిధ్వనించునట్లు దండ చఱచెను. ఆ దండ చఱచుటచే కలిగిన శబ్దముచే ఆకాశమందు తిరుగుచున్న ఎన్నియో పక్షులు నేల కూలినవి. అతిబలుడైన రామచంద్రుడు మహాబలుడైన లక్ష్మణుడు సర్వోత్కర్షగ ఉన్నారు రాముని అనుగ్రహమునకు పాత్రుడయిన సుగ్రీవ మహారాజును సర్వోత్కర్షగ ఉన్నాడు.

ఇతరులకు క్లేశము కలిగింప కుండ స్వధర్మాచరణము చేయగల కోసలాధిపతి యగు రామ చంద్రునకు నేను దాసభూతుడను. నాపేరు హనుమంతుడు. వాయు పుత్రుడను. శత్రుసైన్యసంహారమును కర్తవ్యముగా చేసికొన్న వాడను. వేయిమంది రావణులయినను యుద్ధభూమిలో నా ఎదుట నిలువలేరు. వేలకొలదిగా రాళ్ళతో వృక్షములతో యుద్ధము చేయుచున్న నాకు ఈ రావణుడు ఒక లెక్కకాదు. ఈ లంకనంతను పీడించి సీతాదేవికి నమస్కరించి ఈ రాక్షసులందరు చూచుచుండగా కర్తవ్యమును నిర్వహించి ఈ లంకనుండి వెడలిపోయెదను. హనుమంతుని ఘోషణమును విని రాక్షసులందరు భయపడిరి.

హనుమంతుడు తోరణముపై సంధ్యాకాలమున ఎరుపువారు మేఘము వలె ఉన్నాడు. రాక్షసప్రభువు ఆజ్ఞను శిరసావహించి కింకరులగు ఆ రాక్షసులందరు వివిధములయిన ఆయుధములు తీసికొని ఆంజనేయుని ఎదిరించిరి. ఆ తోరణద్వారమున కున్న భయంకరమయిన ఇనుప పరిఘమును చేతపట్టి ఆ వచ్చిన రాక్షసులనందరిని చావగొట్టెను. ఈ కింకరరాక్షసులు ఆంజనేయుని దెబ్బలకు చచ్చిరి. భయముతో కొంతమంది తప్పించుకొని పారిపోయి రావణునితో కింకరులగు రాక్షసుల మరణ వార్తను చెప్పిరి. ఆ వార్తను విన్న రావణుడు ప్రహస్తపుత్రుడగు జంబుమాలిని ఆంజనేయుని బంధించుటకై పంపెను.



# 43. త్రిచత్వారింశ స్సర్గః

తత స్స కిఙ్కరా న్హత్వా హనుమా న్ధ్యాన మాస్థితః,
వనం భగ్నం మయా చైత్యప్రాసాదో న వినాశితః. 1

తస్మా త్ప్రాసాద మప్యేనం భీమం విధ్వంసయా మ్యహమ్,
ఇతి సంచిన్త్య మనసా హనుమా న్దర్శయ న్బలమ్. 2

చైత్యప్రాసాద మాప్లుత్య మేరుశృఙ్గ మివోన్నతమ్,
ఆరురోహ కపిశ్రేష్ఠో హనుమా న్మారుతాత్మజః. 3

ఆరుహ్య గిరిసంకాశం ప్రాసాదం హరియూథపః,
బభౌ స సుమహాతేజాః ప్రతిసూర్య ఇవోదితః. 4

సంప్రధృష్య చ దుర్ధర్షం చైత్యప్రాసాద ముత్తమమ్,
హనుమా న్ప్రజ్వల౯ లక్ష్మ్యా పారియాత్రోపమో௨ భవత్5

స భూత్వా సుమహాకాయః ప్రభావా న్మారుతాత్మజః,
ధృష్ట మాస్ఫోటయామాస లఙ్కాం శబ్దేన పూరయ౯. 6

తస్యాస్ఫోటితశబ్దేన మహతా శ్రోత్రఘాతినా,
పేతు ర్విహఙ్గమా స్తత్ర చైత్యపాలాశ్చ మోహితాః. 7

అస్త్రవిజ్జయతాం రామో లక్ష్మణశ్చ మహాబలః,
రాజా జయతి సుగ్రీవో రాఘవే ణాభిపాలితః. 8

దాసోఽహం కోసలేన్ద్రస్య రామ స్యాక్లిష్టకర్మణః,
హనుమా ఞ్ఛత్రుసైన్యానాం నిహన్తా మారుతాత్మజః. 9

న రావణసహస్రం మే యుద్ధే ప్రతిబలం భవేత్,
శిలాభిస్తు ప్రహరతః పాదపైశ్చ సహస్రశః. 10

అర్దయిత్వా పురీం లఙ్కా మభివాద్య చ మైథిలీమ్,
సమృద్ధార్థో గమిష్యామి మిషతాం సర్వరక్షసామ్. 11

ఏవ ముక్త్వా విమానస్థ శ్చైత్యస్థా న్హరియూథపః,
ననాద భీమనిర్హ్రాదో రక్షసాం జనయ న్భయమ్. 12

తేన శబ్దేన మహతా చైత్యపాలా శ్శతం యయుః,
గృహీత్వా వివిధా నస్త్రా న్ప్రాసా న్ఖడ్గా న్పరశ్వధాన్. 13

విసృజన్తో మహాకాయా మారుతిం పర్యవారయన్,
తే గదాభి ర్విచిత్రాభిః పరిఘైః కాఞ్చనాఙ్గదైః. 14

అజఘ్ను ర్వానరశ్రేష్ఠం బాణై శ్చాదిత్యసన్నిభైః,
ఆవర్త ఇవ గఙ్గాయా స్తోయస్య విపులో మహాన్. 15

పరిక్షిప్య హరిశ్రేష్ఠం స బభౌ రక్షసాం గణః,
తతో వాతాత్మజః క్రుద్ధో భీమం రూపం సమాస్థితః. 16

ప్రాసాదస్య మహాన్తస్య స్తమ్భం హేమపరిష్కృతమ్,
ఉత్పాటయిత్వా వేగేన హనుమా న్పవనాత్మజః. 17

తత స్తం భ్రామయామాస శతధారం మహాబలః,
తత్ర చాగ్ని స్సమభవ త్ప్రాసాద శ్చా ప్యదహ్యత. 18

దహ్యమానం తతో దృష్ట్వా ప్రాసాదం హరియూథపః,
స రాక్షసశతం హత్వా వజ్రేణేన్ద్ర ఇ వాసురాన్. 19

అన్తరిక్షే స్థిత శ్శ్రీమా నిదం వచన మబ్రవీత్,
మాదృశానాం సహస్రాణి విసృష్టాని మహాత్మనామ్. 20

బలినాం వానరేన్ద్రాణాం సుగ్రీవవశవర్తినామ్,
అటన్తి వసుధాం కృత్స్నాం వయ మన్యే చ వానరాః. 21

దశనాగబలాః కేచి త్కేచి ద్దశగుణోత్తరాః,
కేచి న్నాగసహస్రస్య బభూవు స్తుల్యవిక్రమాః. 22

సన్తి చౌఘబలాః కేచి త్కేచి ద్వాయుబలోపమాః,
అప్రమేయబలా శ్చాన్యే తత్రాస న్హరియూథపాః. 23

ఈదృగ్విధైస్తు హరిభి ర్వృతో దన్తనఖాయుధైః,
శతై శ్శతసహస్రైశ్చ కోటిభి రయుతై రపి,
ఆగమిష్యతి సుగ్రీవ స్సర్వేషాం వో నిషూదనః. 24

నేయ మస్తి పురీ లఙ్కా న యూయం న చ రావణః,
యస్మా దిక్ష్వాకునాథేన బద్ధం వైరం మహాత్మనా. 25

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, వాల్మీకీయే,
చతుర్వింశత్సహస్రికాయాం, సంహితాయాం,
శ్రీమత్సున్దరకాణ్డే, త్రిచత్వారింశ స్సర్గః

## 43వ సర్గము

### హనుమ చైత్యప్రాసాదమును భగ్నమొనరించుట

తరువాత కింకరరాక్షసులనందరను చంపి హనుమంతుడు ఆలోచింప సాగెను. అశోక వనము భగ్నమొనరించితిని. అశోకవనము నందలి చైత్య ప్రాసాదమును భగ్నము చేయలేదు. ఈ ప్రాసాదమున కూడ పడగొట్టవలసి ఉన్నది అని ఆలోచించి తన బలమును చూపుచు మేరు శిఖరము వలె అత్యున్నతమయిన చైత్య ప్రాసాదమును ఆరోహించెను. చైత్య ప్రాసాదమును ఆరోహించిన హనుమానుడు పారియాత్రమను కులపర్వతమును వలె ఆరోహించెను. హనుమంతుడు భుజాస్ఫాలనము చేసెను. ఆ శబ్దము లంకయందు అంతట ప్రతిధ్వనించెను. ఆ ధ్వనిని విన్న పక్షులు నేలకూలినవి. భవనసంరక్షులు దిక్కు తోచనివారయిరి. తరువాత ఆంజనేయుడు రామునికి జయమగుగాక. లక్ష్మణునకు జయమగుగాక, సుగ్రీవునకు జయమగుగాక. నేను రామచంద్రునకు దాసుడను. హనుమంతుడను. వాయునందనుడను. రాళ్ళను విసరుచు వృక్షములను విసరుచు యుద్ధము చేయుచున్న నా ఎదుట వేయిమంది రావణులు అయినను నిలువలేరు. లంకా పట్టణమును నాశనము చేసి సీతాదేవికి

అభివాదము చేసి ఈ రాక్షసులందరు చూచుచుండగా కృతార్థుడనై తిరిగిపోయెదను.

ఆ ప్రాసాదమునకు పై అంతస్తున నిలిచి పెద్దగ గర్జించెను. ఆ ధ్వనిచే సన్నద్ధులయిన చైత్య పాలకులు వందమంది ఆంజనేయునిపై బాణములను, అస్త్రములను, ఆయుధములను ప్రయోగించిరి. ఎదిరించిరి, ఆంజనేయుని చుట్టుముట్టిరి. అపుడు ఆంజనేయుడు అత్యున్నతమయిన ఆ ప్రాసాదము యొక్క ఒక బలమయిన స్తంభమును పెఱికి గిరగిర త్రిప్పదొడంగెను. ఆ స్తంభమునకు ఇతర స్తంభములతో సంఘర్షణముచే నిప్పు పుట్టినది. ఆ ప్రాసాదము దగ్ధమయ్యెను. ఇంద్రుడు వజ్రముతో అసురులను సంహరించినట్లు హనుమ ఆ స్తంభముచే రాక్షసులను సంహరించెను.

ఆకాశము లోనికి ఎగిరి ఈ రీతిగ ఘోషణ మొనరించినాడు. వానరాధిపతి అయిన సుగ్రీవ మహారాజునకు వానరులు వేల కొలది ఈ భూమియందు తిరుగుచు సీతాన్వేషణ మొనరించుచున్నారు. మహాబలశాలులు అగు కోట్ల కొలది వానరులను వెంటపెట్టుకొని ఈ లంకకు రాగలడు. ఈ రాక్షస వీరులందరిని వధింపగలడు. ఈ లంక నిలువదు. మీరు ఉండరు. రావణుడు ఉండడు. దీనికంతకు మూలము శ్రీరామునితో రావణుడు వైరము పెట్టుకొనుటయే.



# 44. చతుశ్చత్వారింశ స్సర్గః

సందిష్టో రాక్షసేన్ద్రేణ ప్రహస్తస్య సుతో బలీ,
జమ్బుమాలీ మహాదంష్ట్రో నిర్జగామ ధనుర్ధరః. 1

రక్తమాల్యామ్బరధర స్స్రగ్వీ రుచిరకుణ్డలః,
మహా న్వివృత్తనయన శ్చణ్డ స్సమరదుర్జయః. 2

ధను శ్శక్రధనుఃప్రఖ్యం మహ ద్రుచిరసాయకమ్,
విస్ఫారయానో వేగేన వజ్రాశనిసమస్వనమ్. 3

తస్య విస్ఫారఘోషేణ ధనుషో మహతా దిశః,
ప్రదిశశ్చ నభశ్చైవ సహసా సమపూర్యత. 4

రథేన ఖరయుక్తేన త మాగత ముదీక్ష్య సః,
హనుమా న్వేగసమ్పన్నో జహర్ష చ ననాద చ. 5

తం తోరణవిటఙ్కస్థం హనుమన్తం మహాకపిమ్,
జమ్బుమాలీ మహాబాహు ర్వివ్యాధ నిశితై శ్శరైః. 6

అర్ధచన్ద్రేణ వదనే శిరస్యే కేన కర్ణినా,
బాహ్వో ర్వివ్యాధ నారాచై ర్దశభి స్తం కపీశ్వరమ్. 7

తస్య త చ్ఛుశుభే తామ్రం శరే ణాభిహతం ముఖమ్,
శరదీవామ్బుజం ఫుల్లం విద్ధం భాస్కరరశ్మినా. 8

తత్తస్య రక్తం రక్తేన రఞ్జితం శుశుభే ముఖమ్,
యథాకాశే మహాపద్మం సిక్తం చన్దనబిన్దుభిః. 9

చుకోప బాణాభిహతో రాక్షసస్య మహాకపిః,
తతః పార్శ్వేఽతివిపులాం దదర్శ మహతీం శిలామ్. 10

తరసా తాం సముత్పాట్య చిక్షేప బలవద్బలీ,
తాం శరై ర్దశభిః క్రుద్ధ స్తాడయామాస రాక్షసః. 11

విపన్నం కర్మ తద్దృష్ట్వా హనుమాం శ్చణ్డవిక్రమః,
సాలం విపుల ముత్పాట్య భ్రామయామాస వీర్యవా౯. 12

భ్రామయన్తం కపిం దృష్ట్వా సాలవృక్షం మహాబలమ్,
చిక్షేప సుబహూ౯ బాణా౯ జమ్బుమాలీ మహాబలః. 13

సాలం చతుర్భి శ్చిచ్ఛేద వానరం పఞ్చభి ర్భుజే,
ఉర స్యేకేన బాణేన దశభిస్తు స్తనాన్తరే. 14

స శరైః పూరితతనుః క్రోధేన మహతా వృతః,
త మేవ పరిఘం గృహ్య భ్రామయామాస వేగితః. 15

అతివేగోఽతివేగేన భ్రామయిత్వా బలోత్కటః,
పరిఘం పాతయామాస జమ్బుమాలే ర్మహోరసి. 16

తస్య చైవం శిరో నాస్తి న బాహూ న చ జానునీ,
న ధను ర్న రథో నాశ్వా స్త త్రాదృశ్యన్త నేషవః. 17

స హత స్సహసా తేన జమ్బుమాలీ మహాబలః,
పపాత నిహతో భూమౌ చూర్ణితాఙ్గవిభూషణః. 18

జమ్బుమాలం చ నిహతం కిఙ్కరాంశ్చ మహాబలాన్,
చుక్రోధ రావణ శ్శ్రుత్వా కోప సంరక్తలోచనః. **19**

స రోషసంవర్తితతామ్రలోచనః,
ప్రహస్తపుత్రే నిహతే మహాబలే,
అమాత్యపుత్రా నతివీర్యవిక్రమాన్
సమాదిదే శాశు నిశాచరేశ్వరః. **20**

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, వాల్మీకీయే,
చతుర్వింశత్సహస్రికాయాం, సంహితాయాం,
శ్రీమత్సున్దరకాణ్డే చతుశ్చత్వారింశ స్సర్గః.

శ్లో. ఋషేః పూజాం సమాకర్ణ్య ఋణాన్ముక్తో భవేన్నరః
తాటాకాఖ్యాన మాకర్ణ్య పాపం తరతి మానవః.

శ్లో. ఇమౌకుమారా విత్యాది జనకేన సుభాషితమ్,
హరేఃస్తవం సమాకర్ణ్య ముచ్యతే సర్వబన్ధనాత్.

– తత్త్వ సంగ్రహ రామాయణే, ఉత్తరకాణ్డే

## 44వ సర్గము

### జంబుమాలి హనుమతో యుద్ధము చేయుట

రాక్షసచక్రవర్తి ఆజ్ఞ తీసికొని ప్రహస్తుని కుమారుడు పెద్ద కోరలు కలిగిన జంబుమాలి ధనుస్సును ధరించినవాడై కోటనుండి బయలుదేరెను. ఆతడు ఎఱ్ఱని మాలలను ఎఱ్ఱని వస్త్రములను ధరించెను. చెవికి ధరించిన కుండలములు తళతళ లాడుచున్నవి. ఎప్పుడు యుద్ధములో విజయము కాంచుచు అపజయము ఎఱుగని జంబుమాలి ఇటునటు చూచుచు యుద్ధభూమికి వచ్చుచుండెను.

ఇంద్రధనుస్సు వంటి ఆతని ధనుస్సును ఆరోపించి నారిని సారించుచుండగా పిడుగుల మ్రోత వలె ధ్వనించుచుండెను. ఆ ధ్వని దశదిక్కులయందు వ్యాపించుచుండెను. కంచర గాడిదలు కట్టిన రధమును ఆరోహించి వచ్చుచున్న జంబుమాలిని చూచి హనుమానుడు చాల సంతోషించెను. యుద్ధసన్నద్ధుడయి సింహనాదము చేసెను. తోరణ విటంకమున కూర్చున్న హనుమంతుని మీద ఆ జంబుమాలి పడనయిన బాణములను ప్రయోగించెను. అర్ధచంద్రబాణముచే ముఖమున మరొక బాణముచే శిరస్సున పదిబాణములచే బుజములందు కొట్టెను. బాణాభిహతమయిన ఆంజనేయుని ముఖమున సూర్యరశ్మిచే వికసించిన శారదాంభోజము వలె ఉండెను. అంతేకాదు. రక్తసిక్తమయిన ఆ అంజనేయుని

ముఖము ఆకాశమందు బాగుగ వికసించి రక్త చందన బిందువులచే సిక్తమయిన మహాపద్మము వలె ఉండెను

జంబుమాలి ప్రయోగించిన బాణములు తగిలినందువలన ఆంజనేయుడు మిక్కిలి కృద్ధుడయ్యెను. ప్రక్కన ఒక మహాశిల కనిపింపగా దానిని తీసి జంబుమాలిపై విసరెను. తన మీదకు వచ్చుచున్న ఆ శిలను జంబుమాలి పది బాణములచే ముక్కలుగా చేసెను. తాను ప్రయోగించిన శిల గమ్యమును చేరకుండగనే శిథిలమయిపోవుటను గమనించి హనుమానుడు ఒక సాలవృక్షమును ఊడపెరికి జంబుమాలిపైకి ప్రయోగింప యత్నించుచుండగా జంబుమాలి నాలుగు బాణములచే ఆ చెట్టును నరకి ఐదు బాణములను భుజమునందు వక్షః స్థలమున ఒక బాణముచేత గుండె మధ్య భాగమున పదిబాణములచే కొట్టెను.

ఆ దెబ్బలకు కుపితుడయిన ఆంజనేయుడు పరిఘమును జంబుమాలి వక్షస్థలమునకు తగులునట్లు విసిరెను. ఆ దెబ్బతో జంబుమాలి శిరస్సు, బాహువులు, మోకాళ్ళు, ధనుస్సు, రథము, అశ్వములు, బాణములు ఏమియు స్వరూపము కూడ కనబడకుండ నష్టమయినవి. మిగిలిన జంబుమాలి కళేబరము నేలపై పడెను. ఆ భరణములన్నియు చూర్ణమయి పోయినవి. కింకరుల యొక్క మరణమును, జంబుమాలి యొక్క మరణమును విని మిక్కిలి కృద్ధుడయి మహాపరాక్రమవంతులు అయిన మంత్రిపుత్రులను వానరుని బంధించుటకై యుద్ధభూమికి పంపించెను.



# 45. పఞ్చచత్వారింశ స్సర్గః

తత స్తే రాక్షసేన్ద్రేణ చోదితా మన్త్రిణ స్సుతాః,
నిర్యయు ర్భవనా త్తస్మా త్సప్తసప్తార్చివర్చసః. 1

మహాబలపరీవారా ధనుష్మన్తో మహాబలాః,
కృతాస్త్రాస్త్రవిదాం శ్రేష్ఠాః పరస్పరజయైషిణః. 2

హేమజాలపరిక్షిప్తై ర్ధ్వజవద్భిః పతాకిభిః,
తోయదస్వననిర్ఘోషై ర్వాజియుక్తై ర్మహారథైః. 3

తప్తకాఞ్చనచిత్రాణి చాపా న్యమితవిక్రమాః,
విస్ఫారయన్త స్సంహృష్టా స్తటిత్వన్త ఇవామ్బుదాః. 4

జనన్యస్తు తత స్తేషాం విదిత్వా కిఙ్కరా న్హతాన్,
బభూవు శ్శోకసంభ్రాన్తా స్సబాన్ధవసుహృజ్జనాః. 5

తే పరస్పరసంఘర్షా త్తప్తకాఞ్చనభూషణాః,
అభిపేతు ర్హనూమన్తం తోరణస్థ మవస్థితమ్. 6

సృజన్తో బాణవృష్టిం తే రథగర్జితనిస్స్వనాః,
వృష్టిమన్త ఇవామ్భోదా విచేరు ర్నైరృతామ్బుదాః. 7

అవకీర్ణ స్తత స్తాభి ర్హనుమా ఞ్ఛరవృష్టిభిః,
అభవ త్సంవృతాకార శ్శైలరా డివ వృష్టిభిః. 8

స శరా న్మోఘయామాస తేషా మాశుచరః కపిః,
రథవేగం చ వీరాణాం విచర న్విమలేమ్బరే. 9

స తైః క్రీడ న్ధనుష్మద్భి ర్వ్యోమ్ని వీరః ప్రకాశతే,
ధనుష్మద్భి ర్యథా మేఘై ర్మారుతః ప్రభు రమ్బరే. 10

స కృత్వా నినదం ఘోరం త్రాసయం స్తాం మహాచమూమ్,
చకార హనుమా న్వేగం తేషు రక్షస్సు వీర్యవాన్. 11

తలే నాభ్యహన త్కాంశ్చి త్పద్భిః కాంశ్చి త్పరంతపః,
ముష్టి నాభ్యహన త్కాంశ్చి న్నఖైః కాంశ్చి ద్వ్యదారయత్.

ప్రమమా థోరసా కాంశ్చి దూరుభ్యా మపరా న్కపిః,
కేచి త్తస్య నినాదేన తత్రైవ పతితా భువి. 13

తత స్తే ష్వవసన్నేషు భూమౌ నిపతితేషు చ,
తత్సైన్య మగమ త్సర్వం దిశోదశ భయార్దితమ్. 14

వినేదు ర్విస్వరం నాగా నిపేతు ర్భువి వాజినః,
భగ్ననీడధ్వజచ్ఛత్రై ర్ధూశ్చ కీర్ణాఽభవ ద్రథైః. 15

స్రవతా రుధిరే ణాథ స్రవన్తో దర్శితాః పథి,
వివిధైశ్చ స్వరై ర్లఙ్కా ననాద వికృతాం తదా. 16

స తా న్ప్రవృద్ధా న్వినిహత్య రాక్షసా
న్మహాబల శ్చణ్డపరాక్రమః కపిః,
యుయుత్సు రన్యైః పునరేవ రాక్షసై
స్త మేవ వీరోఽభిజగామ తోరణమ్. 17

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, వాల్మీకీయే,
చతుర్వింశత్సహస్రికాయాం, సంహితాయాం,
శ్రీమత్సున్దరకాణ్డే పఞ్చచత్వారింశ స్సర్గః.

## 45వ సర్గము

### రావణుని ఏడుగురు మంత్రి పుత్రులతో హనుమ యుద్ధము

రాక్షస చక్రవర్తి యొక్క ఆజ్ఞను శిరసావహించి మంత్రి పుత్రులు ఏడుగురును యుద్ధభూమికి బయలుదేరిరి. పెద్ద సేనలను వెంటపెట్టుకొని అస్త్రవిద్యలో నిపుణులయిన ఆ ఏడుగురు ఆ వానరుని నేనే గెలిచెదను నేనే గెలిచెదనని అహమహమిక చూపుచు యుద్ధభూమికి వచ్చుచుండిరి.

బంగారముతో నిర్మితమై ప్రకాశమాన ములయిన ధనుస్సులతో వారు మెఱపులతో కూడిన మేఘముల వలె కానవచ్చుచుండిరి. ఈ వీరుల తల్లులు అందరును ఇంతకు పూర్వము వానరునితో యుద్ధమునకు పోయిన వారు తిరిగి రాకుండుటచే ఈ మంత్రికుమారుల ఏడుగురి సంగతి ఏమగునో అని మిక్కిలి భయపడసాగిరి.

యుద్ధభూమికి రాగానే మంత్రి కుమారులు హనుమానునిపై బాణవర్షము కురిపించిరి. ఆ బాణ వర్షముచే ఆంజనేయుడు పూర్తిగా

కప్పివేయబడెను. బాణములు తనకు తగులకుండ జాగ్రత్తగా ఆకాశమున విహరింపసాగెను.

ఆంజనేయుడు కొద్దిసేపు ఆకాశమున విహరించిన తరువాత శత్రు సేనలు భయపడునట్లుగా పెద్దగా గర్జించెను. కొందరను చేతితో చరచెను. మరికొందరిని కాళ్ళతో తన్నెను. మరికొంతమందిని పిడికిలితో పొడిచెను. మరికొంతమందిని గోళ్ళతో చీల్చివేసెను. మరికొంతమందిని వక్షస్థలములో ఊరువులతో రాచివేసెను. మరికొంతమంది ఆతని అఱపులకే భయపడి నేలపై పడి చచ్చిరి. కొందరు యుద్ధభూమి నుండి పారిపోయిరి. విఱిగిన రథములతో చచ్చిన ఏనుగులతో గుఱ్ఱములతో నేలపై పడిన ధ్వజములతో ఛత్రములతో యుద్ధభూమి అంతయు నిండి పోయినది.

గాయపడిన సైనికుల ఆర్తధ్వనులచే లంక అంతయు ప్రతిధ్వనించినది. వచ్చిన సైనికులను చంపి రాబోవు సైనికులకయి ఎదురు చూచుచు ఆంజనేయుడు మరల తోరణమును ఆరోహించెను.



# 46. షట్చత్వారింశ స్సర్గః

హతా౯ మన్త్రిసుతా౯ బుద్ధ్వా వానరేణ మహాత్మనా,
రావణ స్సంవృతాకార శ్చకార మతి ముత్తమామ్. 1

స విరూపాక్ష యూపాక్షౌ దుర్ధరం చైవ రాక్షసామ్,
ప్రఘసం భాసకర్ణం చ పఞ్చ సేనాగ్రనాయకా౯. 2

సందిదేశ దశగ్రీవో వీరా న్నయవిశారదా౯,
హనుమద్గ్రహణవ్యగ్రా న్వాయువేగసమా న్యుధి. 3

యాతసేనాగ్రగా స్సర్వే మహాబలపరిగ్రహాః,
సవాజిరథమాతఙ్గా స్స కపి శ్శాస్యతా మితి. 4

యత్తైశ్చ ఖలు భావ్యం స్యా త్త మాసాద్య వనాలయమ్,
కర్మచాపి సమాధేయం దేశకాలవిరోధినమ్. 5

న హ్యహం తం కపిం మన్యే కర్మణా ప్రతితర్కయ౯,
సర్వథా తన్మహద్భూతం మహాబలపరిగ్రహమ్. 6

భవే దిన్ద్రేణ వా సృష్ట మస్మదర్థం తపోబలాత్,
సనాగయక్షగంధర్వా దేవాసురమహర్షయః. 7

యుష్మాభి స్సహితై స్సర్వై ర్మయా సహ వినిర్జితాః,
తై రవశ్యం విధాతవ్యం వ్యలీకం కించిదేవ నః. 8

తదేవ నాత్ర సన్దేహః ప్రసహ్య పరిగృహ్యతామ్,
నావమాన్యో భవద్భి శ్చ హరి ర్ధీరపరాక్రమః. 9

దృష్టా హి హరయః పూర్వం మయా విపులవిక్రమాః,
వాలీచ సహసుగ్రీవో జామ్బవాంశ్చ మహాబలః. 10

నీల స్సేనాపతిశ్చైవ యే చాన్యే ద్వివిదాదయః,
నైనం తేషాం గతి ర్భీమా న తేజో న పరాక్రమః. 11

న మతి ర్న బలోత్సాహా న రూపపరికల్పనమ్,
మహ త్సత్త్వ మిదం జ్ఞేయం కపిరూపం వ్యవస్థితమ్. 12

ప్రయత్నం మహ దాస్థాయ క్రియతా మస్య నిగ్రహః,
కామం లోకా స్త్రయ స్సేన్ద్రా స్సురాసురమానవాః. 13

భవతా మగ్రతః స్థాతుం న పర్యాప్తా రణాజిరే,
తథాపి తు నయజ్ఞేన జయకాఙ్క్షతా రణే. 14

ఆత్మా రక్ష్యః ప్రయత్నేన యుద్ధసిద్ధి ర్హి చఞ్చలా,
తే స్వామివచనం సర్వే ప్రతిగృహ్య మహౌజసః. 15

సముత్పేతు ర్మహావేగా హుతాశసమతేజసః,
రథై ర్మత్తైశ్చ మాతఙ్గై ర్వాజిభిశ్చ మహాజవైః. 16

శస్త్రైశ్చ వివిధై స్తీక్ష్ణై స్సర్వై శ్చోపచితా బలైః,
తత స్తం దదృశు ర్వీరా దీప్యమానం మహాకపిమ్. 17

రశ్మిమన్త మివోద్యన్తం స్వతేజోరశ్మిమాలినమ్,
తోరణస్థం మహోత్సాహం మహాసత్త్వం మహాబలమ్. 18

మహామతిం మహావేగం మహాకాయం మహాబలమ్,
తం సమీక్ష్యైవ తే సర్వే దిక్షు సర్వా స్వవస్థితాః. 19

తై స్తైః ప్రహర్షణై ర్భీమై రభిపేతు స్తతస్తతః,
తస్య పఞ్చాయసా స్తీక్ష్ణా శ్శితాః పీతముఖా శ్శరాః. 20

శిర స్యుత్పలపత్రాభా దుర్ధరేణ నిపాతితాః,
స తైః పఞ్చభి రావిద్ధ శ్శరై శ్శిరసి వానరః,
ఉత్పపాత నద న్వ్యోమ్ని దిశో దశ వినాదయన్. 21

తత స్తు దుర్ధరో వీర స్సరథ స్సజ్యకార్ముకః,
కిరన్ శరశతై స్తీక్ష్ణై రభిపేదే మహాబలః. 22

స కపి ర్వారయామాస తం వ్యోమ్ని శరవర్షిణమ్,
వృష్టిమన్తం పయోదాన్తే పయోద మివ మారుతః. 23

అర్ద్యమాన స్తత స్తేన దుర్ధరే ణానిలాత్మజః,
చకార కదనం భూయో వ్యవర్ధత చ వేగవాన్. 24

స దూరం సహసోత్పత్య దుర్ధరస్య రథే హరిః,
నిపపాత మహావేగో విద్యుద్రాశి ర్గిరావివ. 25

తత స్సమథితాష్టాశ్వం రథం భగ్నాక్షకూబరమ్,
విహాయ న్యపత ద్భూమౌ దుర్ధర స్త్యక్తజీవితః. 26

తం విరూపాక్షయూపాక్షౌ దృష్ట్వా నిపతితం భువి,
సఞ్జాతరోషౌ దుర్ధర్షౌ వుత్పేతతు రరిన్దమౌ. 27

స తాభ్యాం సహసోత్పత్య విష్ఠితో విమలేఽమ్బరే,
ముద్గరాభ్యాం మహాబాహు ర్వక్ష స్యభిహతః కపిః. 28

తయో ర్వేగవతో ర్వేగం వినిహత్య మహాబలః,
నిపపాత పున ర్భూమౌ సుపర్ణసమవిక్రమః. 29

స సాలవృక్ష మాసాద్య త ముత్పాట్య చ వానరః,
తా వుభౌ రాక్షసౌ వీరౌ జఘాన పవనాత్మజః. 30

తత స్తాం స్త్రీ న్హతా౯ జ్ఞాత్వా వానరేణ తరస్వినా,
అభిపేదే మహావేగః ప్రసహ్య ప్రఘసో హరిమ్. 31

భాసకర్ణశ్చ సంక్రుద్ధ శ్శూల మాదాయ వీర్యవా౯,
ఏకతః కపిశార్దూలం యశస్విన మవస్థితమ్. 32

పట్టిసేన శితాగ్రేణ ప్రఘసః ప్రత్యయోధయత్,
భాసకర్ణశ్చ శూలేన రాక్షసః కపిసత్తమమ్. 33

స తాభ్యాం విక్షతై ర్గాత్రై రసృగ్దిగ్ధతనూరుహః,
అభవ ద్వానరః క్రుద్ధో బాలసూర్యసమప్రభః. 34

సముత్పాట్య గిరే శ్శృఙ్గం సమృగవ్యాళపాదపమ్,
జఘాన హనుమా న్వీరో రాక్షసౌ కపికుఞ్జరః. 35

తత స్తే ష్వవసన్నేషు సేనాపతిషు పఞ్చసు,
బలం త దవశేషం చ నాశయామాస వానరః. 36

అశ్వై రశ్వా౯ గజై ర్నాగా౯ యోధై ర్యోధా౯ రథై రథా౯,
స కపి ర్నాశయామాస సహస్రాక్ష ఇ వాసురాన్. 37

హతై ర్నాగైశ్చ తురగై ర్భగ్నాక్షై శ్చ మహారథైః,
హతైశ్చ రాక్షసై ర్భూమీ రుద్ధమార్గా సమన్తతః. 38

తతః కపి స్తాం ధ్వజినీపతీ న్రణే
నిహత్య వీరా న్సబలా న్సవాహనాన్,
సమీక్ష్య వీరః పరిగృహ్య తోరణం
కృతక్షణః కాల ఇవ ప్రజాక్షయే. 39

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, వాల్మీకీయే,
చతుర్వింశత్సహస్రికాయాం, సంహితాయాం,
శ్రీమత్సున్దరకాణ్డే షట్చత్వారింశ స్సర్గః.

శ్లో. విశ్వామిత్ర స్స ధర్మాత్మే త్య త్రాద్యక్షర సంశ్రవాత్,
నష్టకామో విదోష స్సన్ సోమలోకే మహీయతే.

శ్లో. ప్రసామ ధ్యేత్యుపక్రమ్య జానక్యా మఙ్గళోత్సవమ్,
శ్రుత్వా వివాహసమయే భర్తా దీర్ఘాయు రాప్నుయాత్.

శ్లో. రామ దాశరథేవీర వీర్యం తే శ్రూయతేఽద్భుతమ్,
ఇత్యాది శ్రవణా త్పుంసాం బ్రహ్మతేజో వివర్ధతే.

-తత్త్వ సంగ్రహ రామాయణే, ఉత్తరకాణ్డే.

## 46వ సర్గము

### రావణుని సేనానాయకులతో హనుమ యుద్ధము

యుద్ధభూమిలో వానరునిచేత మంత్రికుమారులు ఏడుగురును మరణించిన వార్త తెలిసికొనియు మనస్సులోని ఆందోళనను పైకి వెల్లడికాకుండ గంభీరాకారుడై యుండి తన సేనానాయకులయిన విరూపాక్షుని, యూపాక్షుని, దుర్ధరుని, ప్రఘసుని, భాసకర్ణుని ఈ ఐదుగురు సేనానాయకులను ఆంజనేయుని బంధించుటకయి యుద్ధభూమికి పంపించెను.

వారు రావణుని ఆజ్ఞను స్వీకరించి యుద్ధభూమికి బయలు దేరినపుడు రావణుడు వారిని ఈ రీతిగ హెచ్చరించెను. మీరు ఆ వానరుని వద్దకు పోయినప్పుడు చాల జాగ్రత్తగ ఉండవలెను. దేశకాలములకు విరుద్ధమయిన ఆ వానరుని చేష్టలకు మీరు ప్రతికారము చేయవలెను.

ఆ వానరుని చేష్టలు చూచినచో అతడు వానర మాత్రునిగతోచుటలేదు. మహాబలవంతుడయిన ఈ వానరుని ఒకవేళ

ఇంద్రుడు నన్ను నిగ్రహించుటకయి తన తపోబలమున సృష్టించెనేమో. నేను మీ సాహాయ్యముతో నాగులను, యక్షులను, గంధర్వులను, దేవతలను, అసురులను, మహర్షులను నిగ్రహించి ఉన్నాను. వారందరు కలిసి నన్ను బంధించుటకయి లేదా నన్ను అవమానించుటకయి ఈ వానరు డను భూతమును సృజించి ఉండవచ్చును. అదియే వాస్తవమయి ఉండును. మహా పరాక్రముడయిన ఆ వానరుని సామాన్యునిగా భావింపవద్దు. అతని బలపరాక్రమములను తక్కువగా ఊహింపవద్దు. ఇంతకు పూర్వము చాలమంది వానరులను ఎరుగుదును. వారి యొక్క బలపరాక్రమములు కూడ నాకు తెలియును.

వాలి, సుగ్రీవుడు, జాంబవంతుడు, సేనాధిపతి యగు నీలుడు, మైంద ద్వివిదులు వీరందరిని నేను ఎరుగుదును. వారి ప్రవృత్తి ఇట్టిది కాదు. వారి తేజము పరాక్రమము కూడ ఇట్టివి కావు. వారి బుద్ధిబలము, ఉత్సాహము, రూపము కూడ ఇట్టివి కావు. ఏదియో మహాభూతము కపిరూపమును ధరించి వచ్చినది. గొప్ప ప్రయత్నము చేసి ఆ వానరుని బంధింపవలయును.

మూడు లోకములు గాని ఇంద్రుని నాయకత్వమున వచ్చిన సురాసుర మానవులు కాని యుద్ధభూమిలో మీ ఎదుట నిలువలేరు. అయినను యుద్ధనీతి తెలిసిన వ్యక్తి తన జయమును కోరుచు జాగరూకుడయి వర్తింపవలెను. ఆత్మరక్షణము చేసికొనవలసి ఉన్నది. యుద్ధమున విజయము సర్వత్ర లభించుననుట వాస్తవము కాదు.

జయము ఒకప్పుడు లభించును. వానర గ్రహణమున మీరు జాగ్రత్తగా వర్తింపవలసి ఉన్నది.

ప్రభువు ఆజ్ఞను స్వీకరించి అగ్నితో సమానమైన తేజస్సు కలిగినవారయి మహావేగముతో చతురంగబలములను తీసికొని సర్వాయుధ సన్నద్ధులయి యుద్ధభూమికి చేరిరి. అచట లంక బహిర్ద్వారము మీద నిలిచిన వాడయి ఉదయించుచున్న సూర్యునివలె ఉన్న అంజనేయుని చూచిరి. అంజనేయుని బుద్ధి చాల గొప్పది. అతని వేగము సాటిలేనిది. అతని దేహము మహాపరిమాణము గలది. వానరాధిపతులందరిలో అతడు చాల గొప్పవాడు. యుద్ధభూమికి వచ్చిన రాక్షస సేనాధిపతులు తమ సేనలతో అన్నివైపుల నుండి ముట్టడించిరి.

## దుర్ధరునితోడి యుద్ధము

ముందుగ దుర్ధరుడు అను సేనాధిపతి ఐదు బాణములను అంజనేయుని శిరస్సుపై ప్రయోగించెదను. ఆ బాణము తగిలినంతనే తన గర్జనలచే పది దిక్కులను ప్రతిధ్వనింప చేయుచు ఆకాశములోనికి వెళ్ళెను. ఆకాశమున ఎగురుచున్న వానరునిపై దుర్ధరుడు బాణ వర్షము కురిపించుచుండెను. తనపై బాణ వర్షమును కురిపించుచున్న దుర్ధరుని చేష్టకు కోపించి ఆంజనేయుడు ఆకాశమునుండి అతని రథము పైకి ఉఱికెను. ఆ ఉఱికిన సమయమున ఆ రథమునకు కట్టిన ఎనిమిది గుఱ్ఱములు చచ్చినవి. రథము విఱిగిపోయినది. దుర్ధరుడు చచ్చి రథము పై నుండి క్రింద పడెను.

 

46 వ సర్గము

## విరూపాక్ష రూపాక్షులతో యుద్ధము

దుర్ధరుడు మరణింపగనే విరూపాక్ష రూపాక్షులు ఆకాశములోనికి ఎగిరిరి. హనుమంతుడును ఆకాశమునకు ఎగిరెను. విరూపాక్ష రూపాక్షులు తమ ముద్గరములతో ఆంజనేయుని వక్షస్థలమున కొట్టిరి. అదే సమయమున హనుమానుడు వేగముగా భూమికి వచ్చి ఒక సాల వృక్షమును ఊడబెరికి దానిచే ఆ ఇద్దరి రాక్షసులను చంపెను.

## ప్రఘసభాసకర్ణులతోడి యుద్ధము

ముగ్గురు రాక్షసులు నిహతులు కాగానే ప్రఘసుడు, భాసకర్ణుడు యుద్ధమునకు ఉద్యుక్తులు అయిరి. ప్రఘసుడు పట్టసముతో కొట్టెను. భాసకర్ణుడు శూలముతో పొడిచెను. ఆ దెబ్బలకు హనుమంతుని దేహము రక్తసిక్తమయ్యెను. ఆదెబ్బలకు కోపగించిన హనుమంతుడు ఒక కొండ శిఖరమును వారిపై విసరెను. ఆ దెబ్బకు ప్రఘసుడు, భాసకర్ణుడు ఇద్దరును చచ్చిరి. తరువాత ఆంజనేయుడు వారి సేనలను కూడ చంపెను. ఏనుగులు, గుఱ్ఱములు, రథములు రాక్షసుల దేహములు. వానితో యుద్ధభూమి నిండిపోయెను. వారిని అందరిని ఈ రీతిగ సంహరించి యథాప్రకారము ఆంజనేయుడు తోరణద్వారమును అధిరోహించెను.



# 47. సప్తచత్వారింశ స్సర్గః

సేనాపతీ న్పఞ్చ స తు ప్రమాపితా౯
హనూమతా సానుచరా న్సవాహనా౯,
సమీక్ష్య రాజా సమరోద్ధతోన్ముఖం
కుమార మక్షం ప్రసమైక్ష తాగ్రతః. 1

స తస్య దృష్ట్యర్పణ సంప్రచోదితః
ప్రతాపవా న్కాఞ్చనచిత్రకార్ముకః,
సముత్పపా తాథ సద స్యుదీరితో
ద్విజాతిముఖ్యై ర్హవిషేవ పావకః. 2

తతో మహ ద్బాలదివాకరప్రభం
ప్రతప్తజామ్బూనదజాలసంతతమ్,
రథం సమాస్థాయ యయౌ స వీర్యవా౯
మహాహరిం తంప్రతి నైర్ఋతర్షభః. 3

తత స్తపస్సంగ్రహసఞ్చయార్జితం
ప్రతప్తజామ్బూనదజాలశోభితమ్,
పతాకినం రత్నవిభూషితధ్వజం
మనోజవాష్టాశ్వవరై స్సుయోజితమ్. 4

సురాసురాధృష్య మసఙ్గచారిణం
రవిప్రభం వ్యోమచరం సమాహితమ్,
సతూణ మష్టాసినిబద్ధబన్ధురం
యథాక్రమావేశితశక్తితోమరమ్. 5

విరాజమానం ప్రతిపూర్ణవస్తునా
సహేమదామ్నా శశిసూర్యవర్చసా,
దివాకరాభం రథ మాస్థిత స్తత
స్స నిర్జగా మామరతుల్యవిక్రమః. 6

స పూరయన్ఖం చ మహీం చ సాచలాం
తురఙ్గ మాతఙ్గ మహారథస్వనైః,
బలై స్సమేతై స్సహ తోరణస్థితమ్
సమర్థ మాసీన ముపాగమ త్కపిమ్. 7

స తం సమాసాద్య హరిం హరీక్షణో
యుగాన్తకాలాగ్ని మివ ప్రజాక్షయే,
అవస్థితం విస్మితజాతసంభ్రమ
స్సమైక్షతాక్షో బహుమానచక్షుషా. 8

స తస్య వేగం చ కపే ర్మహాత్మనః
పరాక్రమం చారిషు పార్థివాత్మజః,
విచారయన్ స్వం చ బలం మహాబలో
హిమక్షయే సూర్య ఇ వాభివర్ధతే. 9

స జాతమన్యుః ప్రసమీక్ష్య విక్రమం
స్థిరం స్థిత స్సంయతి దుర్నివారణమ్,
సమాహితాత్మా హనుమన్త మాహవే
ప్రచోదయామాస శరై స్త్రిభి శ్శితైః. 10

తతః కపిం తం ప్రసమీక్ష్య గర్వితం
జితశ్రమం శత్రుపరాజయోర్జితమ్,
అవైక్షతాక్ష స్సముదీర్ణమానస
స్సబాణపాణిః ప్రగృహీతకార్ముకః. 11

స హేమనిష్కాఙ్గదచారుకుణ్డల
స్సమాససా దాఽఽశుపరాక్రమః కపిమ్,
తయో ర్బభూ వాప్రతిమ స్సమాగమ
స్సురాసురాణా మపి సంభ్రమప్రదః. 12

రరాస భూమి ర్నతతాప భానుమా
న్వవౌ న వాయుః ప్రచచాల చాచలః,
కపేః కుమారస్యచ వీక్ష్య సంయుగం
ననాద చ ద్యౌ రుదధిశ్చ చుక్షుభే. 13

తత స్స వీర స్సుముఖా న్పతత్రిణ
స్సువర్ణపుఙ్ఖా న్సవిషా నివోరగాన్,
సమాధిసంయోగవిమోక్షతత్త్వవి
చ్ఛరా నథ త్రీ న్కపిమూ ర్ధ్న్యపాతయత్. 14

స తై శ్శరై ర్మూర్ధ్ని సమం నిపాతితైః
క్షర న్న సృగ్దిగ్ధవివృత్తలోచనః,
నవోదితాదిత్యనిభ శ్శరాంశుమా
న్వ్యరాజ తాదిత్య ఇ వాంశుమాలికః. 15

తత స్స పిఙ్గాధిపమన్త్రిసత్తమ
స్సమీక్ష్య తం రాజవరాత్మజం రణే,
ఉదగ్రచిత్రాయుధచిత్రకార్ముకం
జహర్ష చాపూర్యత చాహవోన్ముఖః. 16

స మన్దరాగ్రస్థ ఇ వాంశుమాలికో
వివృద్ధకోపో బలవీర్యసంయుతః,
కుమార మక్షం సబలం సవాహనం
దదాహ నేత్రాగ్నిమరీచిభి స్తదా. 17

తత స్స బాణాసనచిత్రకార్ముక
శ్శరప్రవర్షో యుధి రాక్షసామ్బుదః,
శరా న్ముమోచా శు హరీశ్వరాచలే
వలాహకో వృష్టి మి వాచలోత్తమే. 18

తతః కపి స్తం రణచణ్డవిక్రమం
వివృద్ధతేజో బలవీర్యసంయుతమ్,
కుమార మక్షం ప్రసమీక్ష్య సంయుగే
ననాద హర్షా ద్ఘనతుల్యవిక్రమమ్. 19

స బాలభావా ద్యుధి వీర్యదర్పితః
ప్రవృద్ధమన్యుః క్షతజోపమేక్షణః,
సమాససా దాప్రతిమం కపిం రణే
గజో మహాకూప మి వావృతం తృణైః. 20

స తేన బాణైః ప్రసభం నిపాతితై
శ్చకార నాదం ఘననాదనిస్స్వనః,
సముత్పపా తాశు నభ స్సమారుతి
ర్భుజోరువిక్షేపణఘోరదర్శనః. 21

సముత్పతన్తం సమభిద్రవ ద్బలీ
స రాక్షసానాం ప్రవరః ప్రతాపవాౕ,
రథీ రథిశ్రేష్ఠతమః కిర న్శరైః
పయోధర శ్శైల మి వాశ్మవృష్టిభిః. 22

స తాౕ శరాం స్తస్య హరి ర్విమోక్షయౕ
చచార వీరః పథి వాయుసేవితే,
శరాన్తరే మారుతవ ద్వినిష్పత
న్మనోజవ స్సంయతి చణ్డవిక్రమః. 23

త మాత్తబాణాసన మాహవోన్ముఖం
ఖ మాస్తృణన్తం విశిఖై శ్శరోత్తమైః,
అవైక్ష తాక్షం బహుమానచక్షుషా
జగామ చిన్తాం చ స మారుతాత్మజః. 24

తత శ్శరై ర్భిన్నభుజాన్తరః కపిః
కుమారవీరేణ మహాత్మనా నదన్,
మహాభుజః కర్మవిశేషతత్త్వవి
ద్విచిన్తయామాస రణే పరాక్రమమ్. 25

అబాలవ ద్బాలదివాకరప్రభః
కరో త్యయం కర్మ మహా న్మహాబలః,
న చాస్య సర్వాహవకర్మశోభినః
ప్రమాపణే మే మతి రత్ర జాయతే. 26

అయం మహాత్మా చ మహాంశ్చ వీర్యత
స్సమాహిత శ్చాతిసహశ్చ సంయుగే,
అసంశయం కర్మ గుణోదయా దయం
సనాగయక్షై ర్మునిభి శ్చ పూజితః. 27

పరాక్రమోత్సాహవివృద్ధమానస
స్సమీక్షతే మాం ప్రముఖాగత స్థ్సితః,
పరాక్రమో హ్యస్య మనాంసి కమ్పయే
త్సురాసురాణా మపి శీఘ్రగామినః. 28

న ఖల్వయం నాభిభవే దుపేక్షితః
పరాక్రమో హ్యస్య రణే వివర్ధతే,
ప్రమాపణం త్వేవ మమాస్య రోచతే
న వర్ధమానోఽగ్ని రుపేక్షితుం క్షమః. 29

ఇతి ప్రవేగం తు పరస్య తర్కయన్
స్వకర్మయోగం చ విధాయ వీర్యవాన్,
చకార వేగం తు మహాబల స్తదా
మతిం చ చక్రేఽస్య వధే మహాకపిః. 30

స తస్య తా నష్టహయా న్మహాజవాన్
సమాహితా న్భారసహా న్వివర్తనే,
జఘాన వీరః పథి వాయుసేవితే
తలప్రహారైః పవనాత్మజః కపిః. 31

తత స్తలే నాభిహతో మహారథః
స్స తస్య పిఙ్గాధిపమన్త్రినిర్జితః,
ప్రభగ్ననీడః పరిముక్తకూబరః
పపాత భూమౌ హతవాజి రమ్బరాత్. 32

స తం పరిత్యజ్య మహారథో రథం
స కార్ముకః ఖడ్గధరః ఖ ముత్పతన్,
తపోఽభియోగా దృషి రుగ్రవీర్యవా
న్విహాయ దేహం మరుతా మివాలయమ్. 33

తతః కపి స్తం విచరన్త మమ్బరే
పతత్రిరాజానిల సిద్ధసేవితే,
సమేత్య తం మారుతతుల్యవిక్రమః
క్రమేణ జగ్రాహ సపాదయో ర్దృఢమ్. 34

స తం సమావిధ్య సహస్రశః కపి
ర్మహోరగం గృహ్య ఇ వాణ్డజేశ్వరః,
ముమోచ వేగా త్పితృతుల్యవిక్రమో
మహీతలే సంయుతి వానరోత్తమః. 35

స భగ్న బాహూరుకటీశిరోధరః
క్షర న్నసృ జ్నిర్మథితాస్థిలోచనః,
స భగ్నసన్ధిః ప్రవికీర్ణ బన్ధనో
హతః క్షితౌ వాయుసుతేన రాక్షసః. 36

మహాకపి ర్భూమితలే నిపీడ్య తం
చకార రక్షోధిపతే ర్మహద్భయమ్. 37

మహర్షిభి శ్చక్రచరై ర్మహావ్రతై
స్సమేత్య భూతైశ్చ సయక్షపన్నగైః,
సురైశ్చ సేన్ద్రై ర్భృశజాతవిస్మయై
ర్హతే కుమారే స కపి ర్నిరీక్షితః. 38

నిహత్య తం వజ్రిసుతోపమప్రభం
కుమార మక్షం క్షతజోపమే క్షణమ్,
తమేవ వీరోఽభిజగామ తోరణం
కృతక్షణః కాల ఇవ ప్రజాక్షయే. 39

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, వాల్మీకీయే,
చతుర్వింశత్సహస్రికాయాం, సంహితాయాం,
శ్రీమత్సున్దరకాణ్డే, సప్తచత్వారింశ స్సర్గః.

# 47వ సర్గము

## అక్షకుమారునితోడి యుద్ధము

ఐదుగురు సేనాధిపతులు సేనలతో మరణించుట సేనలు రథవాజికుంజరాదులు ధ్వంసమగుటను తలంచి రావణుడు సమరోన్ముఖు డయిన తన కుమారుడు అక్షుని వంక చూచెను.

యాజకులగు బ్రాహ్మణులు హవిర్ద్రవ్యములను ఉంచగనే ప్రజ్వరిల్లు అగ్నిహోత్రుని వలె ఆ అక్షుడు ఒక్కసారిగ లేచి నిలబడెను. తన సువర్ణ కార్ముకమును చేత పట్టెను. బంగారముచే నిర్మితమై ఉదయించు సూర్యుని వలె మెఱసిపోవుచున్న రథమును ఆరోహించి హనుమంతుని నిగ్రహించుటకై యుద్ధభూమికి బయలుదేరెను.

ఆ రథము మహాతపస్సు చేసి ఆర్జింపబడినది. బంగారముతోవ నిర్మితమయినది. అందమైన జెండాలు కలిగినది. రత్నాలంకృత మయిన ధ్వజము కలిగినది. మనోవేగముతో పరుగెత్తగల గుఱ్ఱములను కట్టినది. దేవతలు కాని రాక్షసులు కాని చేరరానిది. సూర్యకాంతితో ఆకాశమున కూడ సంచరింప శక్తి గలది. ఎచ్చటను గతి నిరోధము లేనిది. అమ్ముల పొదులు. ఖడ్గములు.

శక్తితోమరములు యథాక్రమముగా సర్ది ఉంచబడినది. యుద్ధమునకు కావలసిన ఆయుధ సామగ్రి అంతయు మిలమిల మెఱయు బంగారు త్రాటితో కట్టి ఉంచబడినది.

సూర్యుని వలె మెఱయుచున్న రథమును ఆరోహించి రాక్షస రాజకుమారుడు, అక్షుడు యుద్ధభూమికి చేరెను. తన సేనలతో భూమ్యాకాశములను పూరించుచు (నిండించుచు) ఆంజనేయుడు ఉన్న ప్రదేశమునకు చేరెను.

ఆంజనేయుడు ప్రళయ కాలపు అగ్నిహోత్రుని వలె తోరణమున ప్రకాశమానుడై ఉండెను. అట్టి హనుమానుని అక్షుడు సాదరముగా సబహుమానముగా చూచెను. ఎదుటి వాని బలమును తన బలమును తలంచుకొని మంచుకాలము గడచిన తరువాత తీవ్రతను వహించు సూర్యునివలె వర్ధమానుడయ్యెను. ఆంజనేయుని చూచి అక్షుడు ముందుగా మూడు బాణములను ప్రయోగించెను. ఆ తరువాత వాయునందనునకు రాక్షస నందనునకు ఘోరమయిన యుద్ధము జరిగినది. భూమి చలించెను. సూర్యుడు తపించుట మానెను. గాలి కదలలేదు. పర్వతము కంపించెను. ఆకాశము ధ్వనించెను. సముద్రము సంక్షుభితమయ్యెను.

తరువాత అక్షకుమారుడు బంగారుపిడి కలిగి మంచి పదను కలిగిన బాణములను మూడింటిని ఆంజనేయుని శిరస్సునందు ప్రయోగించెను. ఆంజనేయుని తలకు గాయమయి ఆ గాయము నుండి కారిన రక్తముతో కన్నులు తడిసెను. తరుణాదిత్యుని వలె

తోరణముపై ఆంజనేయుడు ప్రకాశించెను. తనపై వాడి బాణములు ప్రయోగించిన రాక్షస రాజకుమారుని శస్త్ర ప్రయోగ నైపుణ్యమునకు వానరోత్తముడు ఎంతయో సంతోషించెను. బాణ ప్రయోగ చాతుర్యమునకు సంతోషించినను అతడు కొట్టిన దెబ్బకు కోపించెను. కోపముతో కూడిన హనుమానుడు తన నేత్రాగ్నులచే అక్షుని, అక్షుని సేనలను దహించివేయుచున్నట్లు ఉండెను. అక్షుడు ఆంజనేయునిపై బాణవర్షమును కురిపించుచునే ఉండెను. మేఘము పర్వతముపై ఎంతగ వర్షించినను పర్వతము స్థిరముగ ఉన్నట్లే ఈ బాణవర్షమునకు ఆంజనేయుడు చలింపలేదు. ఆతని బాణ ప్రయోగ చాతుర్యమును హనుమానుడు మెచ్చుకొనుచునే ఉండెను. గడ్డితో కప్పిన ఒక మహాకూపమును (పెద్ద గోతిని) ఏనుగు చేరునట్లుగా మహాశూరుడగు వానరుని వద్దకు అక్షకుమారుడు చేరెను.

తనపై వాడి బాణములు వర్షము వలె పడుచుండగా ఆంజనేయుడు పెద్దగ గర్జించుచు ఆకాశములోనికి చేతులు జూచుకొనుచు ఎగిరెను. అతనితోపాటు రాజకుమారులుమ రథముతో పాటు ఆకాశమున చేరెను. ఆంజనేయుడును అక్షుని బాణములు తనకు తగులకుండగా ఆకాశమున విహరింపసాగెను. రాక్షసరాజకుమారుడు తన బాణముతో ఆకాశమంతయు ఆవరించుచుండగా అతని హస్త లాఘవమునకు ఎంతయో మెచ్చుకొనెను. కొన్ని బాణములు హనుమంతుని వక్షస్థలమున

ఈతని బాణప్రయోగచాతుర్యము నాకు ఎంతయో ముచ్చట గొలుపుచున్నది. కాని ఉపేక్షించిన కొలది ఈతని బలము పెరుగుచున్నది. ఉపేక్షించిన కొలది అగ్ని పెరుగునట్లుగా ఈతని పరాక్రమమును పెరుగుచున్నది. ఈతని ఈయుద్ధమున వధించుటయే మేలు.

ఆంజనేయుడు విజృంభించెను. అరచేతితో చరచి ఆతని ఎనిమిది గుఱ్ఱములను చంపెను. మరియొక అరచేతి దెబ్బతో రథమును నేలకూల్చెను. తపశ్శక్తిచే దేహమును విడిచి దేవలోకమునకు పోవునట్లుగా కూలుచున్న రథమును విడిచి రాక్షస రాజకుమారుడు ఆకాశమున నిలిచెను. ఆకాశమున నిలిచి ఉన్న ఆ రాక్షస కుమారుని దరిచేరి కాళ్ళు పట్టుకొని వేలకొలది పర్యాయములు గిరగిర త్రిప్పి నేలపైకి విసరి కొట్టెను.

అంతట ఆ అక్షకుమారుడు సంధి బంధములు ఊడినవాడై ఎముకలు విఱిగి కన్నులు చెదరి నేలపై పడి చచ్చెను. అక్షకుమారుని నేలపై విసరి కొట్టి చంపిన వార్త తెలియగనే రాక్షసచక్రవర్తికి ఎంతయో భయము కలిగెను. అక్షకుమారుని వధ వార్త విని దేవతలు, రాక్షసులు, యక్షులు, నాగులు ఎంతయో ఆశ్చర్యపడిరి.

రాక్షసరాజ కుమారుని చంపి ప్రజాక్షయమునకు దీక్ష వహించిన కాలపురుషునివలె ఆంజనేయుడు యథాపూర్వముగా తోరణమును అధివసించెను.



# 48. అష్టచత్వారింశ స్సర్గః

తత స్స రక్షోధిపతి ర్మహాత్మా
హనూమతాఽక్షే నిహతే కుమారే,
మన స్సమాధాయ త దేన్ద్రకల్పం
సమాదిదే శేన్ద్రజితం సరోషమ్. 1

త్వ మస్త్రవి చ్ఛస్త్రవిదాం వరిష్ఠ
స్సురాసురాణామపి శోకదాతా,
సురేషు సేన్ద్రేషు చ దృష్టకర్మా
పితామహారాధనసంచితాస్త్రః. 2

తవాస్త్రబల మాసాద్య నాసురా న మరుద్గణాః,
న శేకు స్సమరే స్థాతుం సురేశ్వరసమాశ్రితాః. 3

న కశ్చి త్త్రిషు లోకేషు సంయుగే న గతశ్రమః,
భుజవీర్యాదిగుప్తశ్చ తపసా చాభిరక్షితః,
దేశకాల విభాగజ్ఞ స్త్వ మేవ మతిసత్తమః. 4

న తేఽస్త్యశక్యం సమరేషు కర్మణా
న తేఽస్త్యకార్యం మతిపూర్వమన్త్రణే
న సోఽస్తి కశ్చి త్త్రిషు సంగ్రహేషు వై
న వేద యస్తేఽస్త్రబలం బలం చ తే. 5

మమానురూపం తపసో బలం చ
పరాక్రమ శ్చాస్త్రబలంచ సంయుగే,
న త్వాం సమాసాద్య రణావమర్దే
మన శ్శ్రమం గచ్ఛతి నిశ్చితార్థమ్. 6

నిహతాః కిఙ్కరా స్సర్వే జమ్బుమాలీ చ రాక్షసః. 7

అమాత్యపుత్రా వీరాశ్చ పఞ్చ సేనాగ్రయాయినః,
బలాని సుసమృద్ధాని సాశ్వనాగరథాని చ. 8

సహోదర స్తే దయితః కుమారోఽక్షశ్చ సూదితః,
న హి తేష్వేవ మే సారో య స్త్వ య్యరినిషూదన. 9

ఇదం హి దృష్ట్వా మతిమ న్మహద్బలం
కపేః ప్రభావం చ పరాక్రమం చ,
త్వ మాత్మన శ్చాపి సమీక్ష్య సారం
కురుష్వ వేగం స్వబలానురూపమ్. 10

బలావమర్ద స్త్వయి సన్నికృష్టే
యథా గతే శామ్యతి శాన్తశత్రౌ,
తథా సమీ క్ష్యాత్మబలం పరంచ
సమారభ స్వాస్త్రవిదాం వరిష్ఠ. 11

న వీర సేనా గణశోచ్యవన్తి
న వజ్ర మాదాయ విశాలసారమ్,
న మారుత స్యాస్య గతేః ప్రమాణం
న చాగ్నికల్పః కరణేన హన్తుమ్. 12

త మేవ మర్థం ప్రసమీక్ష్య సమ్యక్
స్వకర్మ సామ్యా ద్ధి సమాహితాత్మా,
స్మరం శ్చ దివ్యం ధనుషోఽస్త్రవీర్యం
ప్రజాక్షతం కర్మ సమారభస్వ. 13

న ఖల్వియం మతి శ్శ్రేష్ఠా యత్త్వాం సంప్రేషయా మ్యహమ్.
ఇయం చ రాజధర్మాణాం క్షత్రస్య చ మతి ర్మతా. 14

నానాశస్త్రై శ్చ సంగ్రామవైశారద్య మరిన్దమ,
అవశ్య మేవ యోద్ధవ్యం కామ్యశ్చ విజయో రణే. 15

తతః పితు స్త ద్వచనం నిశమ్య ప్రదక్షిణం దక్షసుతప్రభావః.
చకార భర్తార మదీనసత్త్వో రణాయ వీరః ప్రతిపన్నబుద్ధిః.

తత స్తై స్స్వగణై రిష్టై రిన్ద్రజి త్ప్రతిపూజితః,
యుద్ధోద్ధతః కృతోత్సాహ స్సంగ్రామం ప్రత్యపద్యత. 17

శ్రీమా న్పద్మపలాశాక్షో రాక్షసాధిపతే స్సుతః,
నిర్జగామ మహాతేజా స్సముద్ర ఇవ పర్వసు. 18

స పక్షిరాజోపమతుల్యవేగై
ర్వ్యాళై శ్చతుర్భి స్సితతీక్ష్ణదంష్ట్రైః,
రథం సమాయుక్త మసఙ్గవేగం
సమారురో హేన్ద్రజి దిన్ద్రకల్పః. 19

స రథీ ధన్వినాంశ్రేష్ఠ శ్శస్త్రజ్ఞోఽస్త్రవిదాం వరః,
రథే నాభియయౌ క్షిప్రం హనుమా న్యత్ర సోఽభవత్. 20

స తస్య రథనిర్ఘోషం జ్యాస్వనం కార్ముకస్య చ,
నిశమ్య హరివీరోఽసౌ సంప్రహృష్టతరోఽభవత్. 21

సుమహచ్చాప మాదాయ శితశల్యాంశ్చ సాయకాన్,
హనుమన్త మభిప్రేత్య జగామ రణపణ్డితః. 22

తస్మిం స్తత స్సంయతి జాతహర్షే
రణాయ నిర్గచ్ఛతి బాణపాణౌ,
దిశశ్చ సర్వాః కలుషా బభూవు
ర్మృగాశ్చ రౌద్రా బహుధా వినేదుః. 23

సమాగతా స్తత్ర తు నాగయక్షా
మహర్షయ శ్చక్రచరాశ్చ సిద్ధాః,
నభ స్సమావృత్య చ పక్షిసఙ్ఘా
వినేదు రుచ్చైః పరమప్రహృష్టాః. 24

ఆయాన్తం స రథం దృష్ట్వా తూర్ణ మిన్ద్రజితం కపిః,
విననాద మహానాదం వ్యవర్ధత చ వేగవాన్. 25

ఇన్ద్రజి త్తు రథం దివ్య మాస్థిత శ్చిత్రకార్ముకః,
ధను ర్విస్ఫారయామాస తటిదూర్జితనిస్స్వనమ్. 26

తత స్సమేతా వతితీక్ష్ణవేగౌ మహాబలౌ తౌ రణనిర్విశఙ్కౌ,
కపి శ్చ రక్షోధిపతేశ్చ పుత్ర స్సురాసురేన్ద్రావివ బద్ధవైరౌ. 27

స తస్య వీరస్య మహారథస్య ధనుష్మత స్సంయతి సమ్మతస్య,
శరప్రవేగం వ్యహన త్ప్రవృద్ధ శ్చచార మార్గే పితు రప్రమేయే.

తత శ్శరా నాయతతీక్ష్ణ శల్యా
సుపత్రిణః కాఞ్చనచిత్రపుఙ్ఖాన్,
ముమోచ వీరః పరవీరహన్తా
సుసన్నతా వజ్రనిపాతవేగా. 29

తతస్తు తత్స్యన్దననిస్స్వనంచ మృదఙ్గభేరీపటహస్వనం చ,
వికృష్యమాణస్య చ కార్ముకస్య నిశమ్య ఘోషం పున రుత్పపాత
శరాణా మన్తరే ష్వాశు వ్యవర్తత మహాకపిః,
హరి స్తస్యాభిలక్ష్యస్య మోఘయ లక్ష్యసఙ్గ్రహమ్. 31

శరాణా మగ్రత స్తస్య పున స్సమభివర్తత,
ప్రసార్య హస్తౌ హనుమా నుత్పపా తానిలాత్మజః. 32

తా వుభౌ వేగసంపన్నౌ రణకర్మవిశారదౌ,
సర్వభూత మనోగ్రాహి చక్రతు ర్యుద్ధ ముత్తమమ్. 33

హనూమతో వేద న రాక్షసోఽన్తరం
స మారుతి స్తస్య మహాత్మనో ఽన్తరమ్,
పరస్పరం నిర్విషహౌ బభూవతు
స్సమేత్య తౌ దేవసమానవిక్రమౌ. 34

తతస్తు లక్ష్యే స విమన్యమానే
శరే ష్వమోఘేషు చ సంపతత్సు,
జగామ చిన్తాం మహతీం మహాత్మా
సమాధి సంయోగ సమాహితాత్మా. 35

తతో మతిం రాక్షసరాజసూను
శ్చకార తస్మి హరివీరముఖ్యే,

అవధ్యతాం తస్య కపే స్సమీక్ష్య
కథం నిగచ్ఛే దితి నిగ్రహార్థమ్. 36

తతః పైతామహం వీర స్సోఽస్త్ర మస్త్రవిదాంవరః,
సందధే సుమహాతేజా స్తం హరిప్రవరం ప్రతి. 37

అవధ్యోఽయమితి జ్ఞాత్వా త మస్త్రేణాస్త్రతత్త్వవిత్,
నిజగ్రాహ మహాబాహు ర్మారుతాత్మజ మిన్ద్రజిత్. 38

తేన బద్ధ స్తతోఽస్త్రేణ రాక్షసేన స వానరః,
అభవ న్నిర్విచేష్టశ్చ పపాత చ మహీతలే. 39

తతోఽథ బద్ధ్వా స తదాస్త్రబన్ధం
ప్రభోః ప్రభావా ద్విగతాత్మవేగః,
పితామహానుగ్రహ మాత్మనశ్చ
విచిన్తయామాస హరిప్రవీరః. 40

తత స్స్వాయంభువై ర్మన్త్రై ర్బ్రహ్మాస్త్ర మభిమన్త్రితమ్,
హనుమాం శ్చిన్తయామాస వరదానం పితామహాత్. 41

న మేఽస్త్రబన్ధస్య చ శక్తిరస్తి
విమోక్షణే లోకగురోః ప్రభావాత్,
ఇత్యేవ మత్వా విహితోఽస్త్రబన్ధో
మ యాత్మయోనే రనువర్తితవ్యః. 42

స వీర్య మస్త్రస్య కపి ర్విచార్య
పితామహానుగ్రహ మాత్మనశ్చ,

విమోక్షశక్తిం పరిచిన్తయిత్వా
పితామహాజ్ఞా మనువర్తతేస్మ. **43**

అస్త్రేణాపి హి బద్ధస్య భయం మమ న జాయతే,
పితామహ మహేన్ద్రాభ్యాం రక్షిత స్యానిలేన చ. **44**

గ్రహణే చాపి రక్షోభి ర్మహా న్మే గుణదర్శనః,
రాక్షసేన్ద్రేణ సంవాద స్తస్మా ద్గృహ్ణన్తు మాం పరే. **45**

స నిశ్చితార్థః పరవీరహన్తా
సమీక్ష్యకారీ వినివృత్తచేష్టః,
పరైః ప్రసహ్యాభిగతై ర్నిగృహ్య
ననాద తైస్తైః పరిభర్త్స్యమానః. **46**

తత స్తం రాక్షసా దృష్ట్వా నిర్విచేష్ట మరిన్దమమ్,
బబన్ధు శ్శణవల్కైశ్చ ద్రుమచీరైశ్చ సంహతైః. **47**

స రోచయామాస పరైశ్చ బన్ధనం
ప్రసహ్య వీరై రభినిగ్రహం చ,
కౌతూహలా న్మాం యది రాక్షసేన్ద్రో
ద్రష్టుం వ్యవస్యే దితి నిశ్చితార్థః. **48**

స బద్ధ స్తేన వల్కేన విముక్తోఽస్త్రేణ వీర్యవాన్,
అస్త్రబన్ధ స్సచాన్యం హి న బన్ధ మనువర్తతే. **49**

అ థేన్ద్రజి త్తు ద్రుమచీరబద్ధం
విచార్య వీరః కపిసత్తమం తమ్,

విముక్త మస్త్రేణ జగామ చిన్తాం
నాన్యేన బద్ధో హ్యనువర్తతేఽస్త్రమ్. 50

అహో మహత్కర్మ కృతం నిరర్థకమ్
న రాక్షసై ర్మన్త్రగతి ర్విమృష్టా,
పునశ్చ నాస్త్రే విహతేఽస్త్ర మన్య
త్ప్రవర్తతే సంశయితాస్స్మ సర్వే. 51

అస్త్రేణ హనుమా న్ముక్తో నాత్మాన మవబుధ్యత,
కృష్యమాణస్తు రక్షోభి స్తైశ్చ బన్ధై ర్నిపీడితః. 52

హన్యమాన స్తతః క్రూరై రాక్షసైః కాష్ఠముష్టిభిః,
సమీపం రాక్షసేన్ద్రస్య ప్రాకృష్యత స వానరః. 53

అ థేన్ద్రజి త్తం ప్రసమీక్ష్య ముక్త
మస్త్రేణ బద్ధం ద్రుమచీరసూత్రైః,
వ్యదర్శయ త్తత్ర మహాబలం తం
హరిప్రవీరం సగణాయ రాజ్ఞే. 54

తం మత్తమివ మాతఙ్గం బద్ధం కపివరోత్తమమ్,
రాక్షసా రాక్షసేన్ద్రాయ రావణాయ న్యవేదయన్. 55

కోఽయం కస్య కుతోవాఽత్ర కిం కార్యం కో వ్యపాశ్రయః,
ఇతి రాక్షసవీరాణాం తత్ర సంజజ్ఞిరే కథాః. 56

హన్యతాం దహ్యతాం వాఽపి భక్ష్యతా మితి చాపరే,
రాక్షసా స్తత్ర సంక్రుద్ధాః పరస్పర మథాబ్రువన్. 57

అతీత్య మార్గం సహసా మహాత్మా
స తత్ర రక్షోఽధిప పాదమూలే,
దదర్శ రాజ్ఞః పరిచారవృద్ధాన్
గృహం మహారత్న విభూషితం చ. 58

స దదర్శ మహాతేజా రావణః కపిసత్తమమ్,
రక్షోభి ర్వికృతాకారైః కృష్యమాణ మితస్తతః. 59

రాక్షసాధిపతిం చాపి దదర్శ కపిసత్తమః,
తేజోబలసమాయుక్తం తపన్త మివ భాస్కరమ్. 60

స రోషసంవర్తితతామ్రదృష్టి
ర్దశానన స్తం కపి మన్వవేక్ష్య,
అథోపవిష్టాన్ కులశీలవృద్ధాన్
సమాదిశ త్తంప్రతి మన్త్రిముఖ్యాన్. 61

యథాక్రమం తై స్స కపి ర్విపృష్టః
కార్యార్థ మర్థస్య చ మూల మాదౌ,
నివేదయామాస హరీశ్వరస్య
దూత స్సకాశా దహ మాగతోఽస్మి. 62

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, వాల్మీకీయే,
చతుర్వింశత్సహస్రికాయాం, సంహితాయాం,
శ్రీమత్సున్దరకాణ్డే, అష్టచత్వారింశ స్సర్గః.

# 48వ సర్గము

## రావణుడు ఇంద్రజిత్తును ఆంజనేయునిపైకి పంపుట

హనుమంతునిచే తన కుమారుడు అక్షుడు నిహతుడైనందులకు రాక్షసచక్రవర్తి రావణుడు మొదట కొంత బాధపడినను తరువాత ధైర్యము తెచ్చుకొని ఇంద్రునితో సమానుడయిన ఇంద్రజిత్తును గూర్చి ఇట్లు ఆదేశించెను.

కుమారా మేఘనాథా! నీవు అస్త్రవేత్తలలో శస్త్రవేత్తలలో అగ్రగణ్యుడవు. దేవతలు రాక్షసులు కూడ నీతో పోరాడి పరాజయము పొంది దుఃఖితులయిరి. దేవతలు అందరికీ నీ శక్తి సామర్థ్యములు తెలిసినవే. నీవు బ్రహ్మను ఆరాధించి బ్రహ్మాస్త్రము మున్నగు వానిని పొందితివి. ఎన్నియో వరములు పొందితివి. రాక్షసులు, దేవతలు కూడ అస్త్రబలము కారణముగా నీ ఎదుట నిలువలేకపోయిరి.

ఈ మూడు లోకములందు నీతో పోరాడి పరాజయము పొందనివాడు లేడు. భుజబలము చేత తపస్సు చేత ఏ అనర్థమును పొందక సురక్షితుడవు. వివేకముతో ఆలోచనచేయు నీకు తెలియని కార్యమేదియులేదు. యుద్ధభూమిలో నీకు సాధ్యముకానిది లేదు. మూడు లోకములందు నీ దేహబలము అస్త్రబలము తెలియనివాడు లేడు. నీ తపస్సు, బలము, పరాక్రమము యుద్ధతంత్రపరిజ్ఞానము చాల గొప్పవి. పై వానిలో నీవు నాకు సమానుడవు. నీ సాహాయ్య సంపదల చేతనే ఎంతటి యుద్ధములోను ఎట్టి పరిస్థితిలోను ధైర్యముగా ఉన్నాను. వానరునితో జరగుచున్న యుద్ధములో కింకరులు ఎనుబదివేల మంది, జంబుమాలి, మంత్రిపుత్రులు ఏడుగురు, సేనాధిపతులు ఐదుగురు, నీ తమ్ముడు అక్షకుమారుడు

కూడ మరణించిరి. నేను వారి బలశక్తులమీదనే ఆధారపడి లేను. నేను నీపై విశ్వాసము కలిగి ఉన్నాను.

మహామతి వయిన ఓ మేఘనాథా! ఆ వానరుని యొక్క బలము ప్రభావము పరాక్రమము నీ బలము జాగ్రత్తగ చూచుకొని యుద్ధభూమిలో ముందునకు సాగిపొమ్ము. నీవు శత్రువును నిగ్రహించి సేనానాశము కాకుండచూడుము. నీవు గొప్ప శస్త్రములు గలవాడవు. శత్రువుల బలము నీ బలము తెలిసికొని ఎంతమంది సైనికులు వెళ్ళినను యుద్ధభూమిలో ప్రయోజనము కలుగలేదు. మహాసారమగు వజ్రము కూడ నిష్ప్రయోజనము.

అతని వేగమందు వాయువేగము కూడ అల్పవే. అగ్నిసమానుడయిన ఆ వానరుని విషయమై ముష్టిఘాతాదులు కూడ పనికిరావు. కర్తవ్యమును చక్కగా నిర్వహించుకొని ఏకాగ్రచిత్తుడవయి నీ అస్త్రబలమును సమయమున వినియోగించుచు అమోఘముగా నీ కర్తవ్యమును నిర్వహింపుము. తండ్రినయిన నేను రాజభవనములో ఉండి కుమారుడవయిన నిన్ను భయంకరమగు వానరునితో యుద్ధమునకై పంపుట న్యాయము కాదు. ఇది రాజధర్మము. రాజనీతి. అనేకములయిన శస్త్రాస్త్రములను ప్రయోగించి యుద్ధతంత్రమున నైపుణ్యము చూపి విజయము కాంక్షింపవలసియున్నది.

### ఇంద్రజిత్తు హనుమపై దండెత్తుట

తండ్రియొక్క ఉపదేశమును విని దివ్యమయిన ప్రభావ సంపన్నుడయిన ఆ ఇంద్రజిత్తు తండ్రికి ప్రదక్షిణము చేసి యుద్ధభూమికి పోవ సన్నద్ధుయ్యెను. ఆతని సేనలు ఆతనిని గొప్పగ గౌరవించినవి. తన తండ్రి రాక్షసాధిపతి యుద్ధభూమికి పోవలసినదిగా

ఆజ్ఞాపించిన వెంటనే ఆ మేఘనాథుడు పర్వదినమున సముద్రము వలె పొంగిపోయెను. అతనిలో కొత్త తేజస్సు గోచరించినది. అతని నేత్రములు తామర రేకులవలె అరుణ కాంతులను వెదజల్లినవి. తెల్లని తీక్ష్ణములయిన దంతములు కలిగిన నాలుగు సింహములను తన రథమునకు కట్టుకొనెను. ఆ సింహములు గరుత్మంతుని వలె వేగముగా ముందునకు సాగగలవు. శస్త్రాస్త్ర విశారదుడయిన ఆ ఇంద్రజిత్తు హనుమానుడు ఉన్న చోటికి బయలుదేరి పోయెను. మేఘనాథుని రథఘోషమునకు ధనుష్టంకారమునకు వానరోత్తముడు చాల సంతోషించెను.

యుద్ధతంత్రమున మహానిపుణుడయిన ఇంద్రజిత్తు అస్త్ర శస్త్రములతో యుద్ధభూమికి పోవుచున్నపుడు దిక్కులన్నియు ధూళి ధూసరితములయినవి. మృగములు భయంకరముగా అరచుట ఆరంభించినవి. నాగులు, యక్షులు, మహర్షులు, సిద్ధులు ఆ యుద్ధమును చూచుటకయి ఆకాశమున నిలిచి ఉండిరి. గొప్ప యుద్ధమును చూచు అవకాశము కలిగినదని ఆకాశమున నిలిచిన వారందరు మహాసంతోషముగ నుండిరి.

రథమును ఆరోహించి ఇంద్రజిత్తు వింటినారిని బిగించి ధనుష్టంకారము చేసెను. అప్పుడు పిడుగు పడిన చప్పుడయ్యెను. వాయుపుత్రుడు రావణ పుత్రుడు యుద్ధమునకు జంకక పరస్పర జయాకాంక్షతో తలపడిరి. ఇంద్రజిత్తు పిడుగుల వంటి బాణములను ప్రయోగించెను. హనుమ ఆ బాణములు తనకు తగులకుండ ఆకాశమున విహరింపసాగెను. ఆ వీరులిద్దరు వేగవంతులు. యుద్ధ నైపుణ్యము గలవారు. అందరు ఆశ్చర్యపడునట్లుగా యుద్ధము

చేయదొడంగిరి. ఇద్దరు ఒకరి కొకరు అవకాశమీయక పోరాడుచుండిరి. ఎన్ని బాణములు ప్రయోగించినను హనుమంతుని పట్టుట శక్యము కాకున్నది. ఏ రీతిగనైనను ఈతనిని నిగ్రహించుట సాధ్యము కాకున్నది. ఇతర శస్త్రాస్త్రములచే ఈతడు అవధ్యుడై ఉన్నాడు కనుక బ్రహ్మాస్త్రము ప్రయోగింపవలసిఉన్నది. ఆ అస్త్రము తప్ప మరియొక అస్త్రము ఈతనిపై ఉపయోగింప నవసరము లేదు.

## ఇంద్రజిత్తు హనుమపై బ్రహ్మాస్త్రమును ప్రయోగించుట

అప్పుడు ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రమును ప్రయోగించెను. ఆ అస్త్రముచే అంజనేయుడు బద్ధుడయ్యెను. కదలలేక మెదలలేక చేష్టలుడిగి హనుమంతుడు నేలపై పడెను. ఆ సమయమున వాయునందనునకు బ్రహ్మ ఇచ్చిన వరము గుర్తునకు వచ్చినది. ఈ అస్త్రముచే నిబద్ధుడనయినను నాకు ప్రాణభయము లేదు. ఈ అస్త్రబంధము తప్పించుకొనుటయు సాధ్యము కాదు. పితామహుని మాటలను తలంచుకొని ఆంజనేయుడు ఏ చేష్టలు చేయలేదు. బ్రహ్మ, ఇంద్రుడు, వాయుదేవుడు నాయందు అనుగ్రహము కలిగి ఉన్నారు కనుక నేనేమియు భయపడనక్కరలేదు. ఈ రాక్షసులు నన్ను బంధించి రావణుని వద్దకు తీసికొనిపోయెదరు. అపుడు రావణదర్శనము, రావణునితో మాటలాడుట అను ప్రయోజనములు కలుగును అని తలంచి హనుమానుడు కదలక మెదలక ఉండెను.

వారు కొట్టినను తిట్టినను ఏమియు ప్రతిక్రియ చేయక ఉండెను. అట్లు కదలక ఉన్న అంజనేయుని ఆ రాక్షసులు జనుపనార త్రాళ్ళతో చెట్లనుండి లభించిన వల్కలములతో మరల బంధించిరి. అప్పుడు బ్రహ్మాస్త్రము తన పట్టు వీడెను. తెలిసియు రావణుని చూడగోరిన ఆంజనేయుడు మునుపటి వలెనె ఉండెను.

## హనుమ ద్బంధనము

హనుమంతుని నార చీరలతో కట్టిన రాక్షసుల అవివేక చర్యను చూచి ఇంద్రజిత్తు మిక్కిలి విచారించెను. ఎంత పొరపాటు జరిగినది? బ్రహ్మాస్త్రబంధనము మరియొక బంధనమును సహింపదు. ఇప్పుడు ఈ వానరుడు లేచి విజృభించినచో ఆతనిపై మరియొక అస్త్రము పనిచేయదు. అయినను చేష్టలుడిగి ఉన్న ఆ రాక్షసులు హనుమానుని కొట్టుచు రావణుని వద్దకు ఈడ్చుకొనిపోయిరి.

నార త్రాళ్ళతో, నారచీరలతో బంధించి తెచ్చిన (బద్ధమైన) మహాగజము వలె ఉన్న హనుమానుని ఇంద్రజిత్తు రావణునికి చూపించెను. రాక్షసులు అందరు రావణాసురునికి నివేదించిరి. ఎవరీ వానరుడు? ఎక్కడి నుండి వచ్చెను? పని ఏమి? ఎవరికి సంబంధించినవాడు? అని రాక్షసులు అనుకొనుచుండిరి. మరికొందరు రాక్షసులు తమలో తాము ఈ వానరుని చంపివేయుడు కాల్చివేయుడు భక్షించివేయుడు అని తమలో తాము అనుకొనుచుండిరి.

### హనుమను రాక్షసులు బంధించి రావణుని కడకు తీసికొనివచ్చుట

రావణుని వద్దకు తీసికొనిరాబడిన ఆంజనేయుడు రత్న విభూషితమయిన రాజభవనమును అచట ఉన్న మంత్రి సామంతాదులను పరిశీలనగ చూచెను. రాక్షసులు ఈడ్చుకొని వచ్చిన హనుమంతుని చూచెను. ఆంజనేయుడును మట్టమధ్యాహ్నపు సూర్యుని వలె ప్రకాశమానుడయి ఉన్న రావణుని చూచెను. కోపముతో ఎరుపువారిన నేత్రములు కల్గిన ఆ రావణుడు కులముచే, శీలముచే వృద్ధులయిన మంత్రి ముఖ్యులను వానరుని గురించి తెలిసికొన వలసినదిగా ఆజ్ఞాపించెను.

ఆ మంత్రి ముఖ్యులు నిన్ను ఎవరు పంపిరి? ఎందులకు వచ్చితివి అని అడుగగా సుగ్రీవుడు నన్ను దూతగా పంపగా వచ్చితిని అనెను.



# 49. ఏకోనపఞ్చాశ స్సర్గః

తత స్స కర్మణా తస్య విస్మితో భీమవిక్రమః,
హనుమా న్రోషతామ్రాక్షో రక్షోధిప మవైక్షత. 1

భ్రాజమానం మహార్హేణ కాఞ్చనేన విరాజతా,
ముక్తాజాలావృతే నాథ మకుటేన మహాద్యుతిమ్. 2

వజ్రసంయోగసంయుక్తై ర్మహార్హమణివిగ్రహైః,
హైమై రాభరణై శ్చిత్రై ర్మనసేవ ప్రకల్పితైః. 3

మహార్హక్షౌమసంవీతం రక్తచన్దనభూషితమ్,
స్వనులిప్తం విచిత్రాభి ర్వివిధాభిశ్చ భక్తిభిః. 4

వివృతై ర్దర్శనీయైశ్చ రాక్షసై ర్భీమవిక్రమైః,
దీప్తతీక్ష్ణమహాదంష్ట్రైః ప్రలమ్బదశనచ్ఛదైః. 5

శిరోభి ర్దశభి ర్వీరం భ్రాజమానం మహౌజసమ్,
నానావ్యాళసమాకీర్ణై శ్శిఖరై రివ మన్దరమ్. 6

నీలాఞ్జనచయప్రఖ్యం హారే ణోరసి రాజతా,
పూర్ణచన్ద్రాభవక్త్రేణ సబలాక మివామ్బుదమ్. 7

బాహుభి ర్బద్ధకేయూరైః శ్చన్దనోత్తమ రూషితైః,
భ్రాజమానాఙ్గదైః పీనైః పఞ్చశీర్షై రివోరగైః. 8

మహతి స్ఫాటికే చిత్రే రత్నసంయోగ సంస్కృతే,
ఉత్తమాస్తరణాస్తీర్ణే సూపవిష్టం వరాననే. 9

అలఙ్కృతాభి రత్యర్థం ప్రమదాభి స్సమన్తతః,
వాలవ్యజనహస్తాభి రారా త్సముపసేవితమ్. 10

దుర్ధరేణ ప్రహస్తేన మహాపార్శ్వేన రక్షసా,
మన్త్రిభి ర్మన్త్రతత్త్వజ్ఞై ర్నికుమ్భేన చ మన్త్రిణా. 11

సుఖోపవిష్టం రక్షోభి శ్చతుర్భి ర్బలదర్పితైః,
కృత్స్నః పరివృతో లోక శ్చతుర్భి రివ సాగరైః. 12

మన్త్రిభి ర్మన్త్రతత్త్వజ్ఞై రన్యైశ్చ శుభబుద్ధిభిః,
అన్వాస్యమానం రక్షోభి స్సురై రివ సురేశ్వరమ్. 13

అపశ్య ద్రాక్షసపతిం హనుమా నతితేజసమ్,
విష్ఠితం మేరుశిఖరే సతోయమివ తోయదమ్. 14

న తై స్సంపీడ్యమానోఽపి రక్షోభి ర్భీమవిక్రమైః,
విస్మయం పరమం గత్వా రక్షోఽధిప మవైక్షత. 15

భ్రాజమానం తతో దృష్ట్వా హనుమా న్రాక్షసేశ్వరమ్,
మనసా చిన్తయామాస తేజసా తస్య మోహితః. 16

అహో రూప మహో ధైర్య మహో సత్త్వ మహో ద్యుతిః,
అహో రాక్షసరాజస్య సర్వలక్షణయుక్తతా. 17

య ద్యధర్మో న బలవా న్స్యా దయం రాక్షసేశ్వరః,
స్యా దయం సురలోకస్య సశక్రస్యాపి రక్షితా. 18

అస్య క్రూరై ర్నృశంసైశ్చ కర్మభి ర్లోకకుత్సితైః,
తేన బిభ్యతి ఖ ల్వస్మా ల్లోకా స్సామరదానవాః. 19

అయం హ్యుత్సహతే క్రుద్ధః కర్తు మేకార్ణవం జగత్,
ఇతి చిన్తాం బహువిధా మకరో న్మతిమా న్హరిః,
దృష్ట్వా రాక్షసరాజస్య ప్రభావ మమితౌజసః. 20

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, వాల్మీకీయే,
చతుర్వింశత్సహస్రికాయాం, సంహితాయాం,
శ్రీమత్సున్దరకాణ్డే, ఏకోనపఞ్చాశ స్సర్గః.

శ్లో. రఘునాథస్య మాతుశ్చ భరతస్య సుభాషితమ్,
శృణ్వతాం సర్వకార్యాణి సిధ్యన్త్యేవ న సంశయః

శ్లో. అత్రి పత్న్యాతు వైదేహ్యా అఙ్గరాగార్పణాదికమ్,
శ్రుత్వా కన్యా సుభర్తారం లభ తేఽరున్ధతీ యథా

– తత్త్వ సంగ్రహరామాయణే, అయోధ్యకాణ్డే

# 49 వ సర్గము

తరువాత రావణాసురుడు వానరాధిపతియగు సుగ్రీవుని ప్రధాన సచివుడయిన తనతోనేరుగా మాటాడక తన సేవ చేయుచున్న వారిచే సామాన్యులచేత తన విషయమును గురించి ప్రశ్నింపచేయగా అందులకు ఆంజనేయుడు మిక్కిలి క్రుద్ధుడయ్యెను. కోపముచే ఎరుపువారిన నేత్రములతో రావణుని పరిశీలనగా చూచెను.

## రావణుని వర్ణన

ముత్యాల జాలర్లతో కూడిన కిరీటమును శిరస్సున ధరించెను. వజ్రఖచితమయిన ఎన్నియో బంగారు ఆభరణములు ధరించెను. ఆ ఆభరణముల నిర్మాణమును చూచినచో అవి చేతులతో నిర్మింపబడినవి కాక మనస్సంకల్పముచే నిర్మింపబడినవానివలె తోచుచున్నవి. విలువయిన పట్టు వస్త్రములు ధరించి ఉండెను. తాను వక్షస్థలమునకు రాసికొన్న రక్త చందనము ఆ పట్టు వస్త్రమునకు కూడ అంటుకొని ఉన్నది.

రంగురంగుల అనులేపనములను అతడు దేహమునకు పూసికొని ఉండెను. కన్నులు ఎరుపెక్కి భయంకరముగ ఉండెను. కోరపండ్లు తీక్ష్ణములయి తేజోవంతములయి ఉన్నవి. మొరటయిన పెదవులు క్రిందకు వ్రేలాడుచున్నవి. పది శిరస్సులు కలిగి ఆ రావణుడు క్రూర మృగములతో వ్యాప్తమయిన శిఖరములతో మేరుపర్వతము వలె రాశీభూతమయిన కాటుకవలె ఉన్న ఆ రావణుడు కొంగలతో కూడిన వర్షకాలపు మేఘము వలె ఉండెను.

బాహువులకు భుజకీర్తులు ధరించి ఉండెను. ఇట్లు అలంకృత మయిన అతని బాహువులు అయిదు తలల పాముల వలె ఉండెను.

ఎన్నియో రత్నములచేత అలంకృతమయిన స్ఫటిక నిర్మితము మంచి ఆస్తరణము పరచి ఉన్న ఆసనముచే ఆ రావణుడు కూర్చుండి ఉండెను. అలంకృతలయిన స్త్రీలు వింజామరములను చేత బట్టి ఆతనిని సేవించుచుండిరి.

దుర్ధరుడు, ప్రహస్తుడు, మహాపార్శ్వుడు, నికుంభుడు ఈ నలుగురు మంత్రులు రావణునికి దగ్గరగా కూర్చుండిరి. అపుడు రావణుడు నాలుగు సముద్రములచే పరివేష్టితమయిన లోకమువలె ఉండెను. మేరు శిఖరమున నిలిచిన సజల మేఘము వలె ఆ రావణుడు ఉండెను.

ఆ రాక్షసులు తన్ను ఎంత పీడించినను ఆంజనేయుడు ఆశ్చర్యముతో రావణుని వంక తదేకదీక్షగ చూచుచుండెను. మహాతేజోవంతుడయి మహైశ్వర్యముతో వెలిగిపోవుచున్న రావణుని చూచి ముగ్ధుడయ్యెను.

ఓహో! ఏమి రూపము? ఏమి ధైర్యము ! ఏమి బలము ! ఏమి తేజస్సు! ఈ రాక్షసరాజునందు సర్వ లక్షణములు సంపన్నములై ఉన్నవే. ఈ రాక్షస రాజు ప్రబలమయిన అధర్మములు ఆచరింపకపోయినచో స్వర్గలోకమునకు, స్వర్గలోకాధిపతి అగు ఇంద్రునకు కూడ రక్షకుడు అయి ఉండును. లోకమంతయు నిందించుచున్న ఈతని క్రూరకర్మనులచే ఈ మనుష్య లోకము, దేవలోకము దానవులు కూడ మిక్కిలి భయపడుచున్నారు. ఈ రాక్షస రాజు మహోత్సాహముతో కోపము వచ్చిన వేళ ఈ జగత్తు సర్వమును సముద్రము నందు ముంచివేయునట్లు కనబడుచున్నాడు. మహా తేజస్వి అగు రావణుని చూచి ఆంజనేయుడు పై విధముగ తలంచెను.



# ౫౦. పఞ్చాశ స్సర్గః

త ముద్వీక్ష్య మహాబాహుః పిఙ్గాక్షం పురత స్స్థితమ్,
కోపేన మహతాఽఽవిష్టో రావణో లోకరావణః. 1

శఙ్కాహతాత్మా దధ్యౌ స కపీన్ద్రం తేజసా వృతమ్,
కి మేష భగవా న్నన్దీ భవే త్సాక్షా దిహాగతః. 2

యేన శప్తోఽస్మి కైలాసే మయా సంచాలితే పురా,
సోఽయం వానరమూర్తి స్స్యా త్కింస్వి ద్బాణోఽపి వాఽసురః.

స రాజా రోషతామ్రాక్షః ప్రహస్తం మన్త్రిసత్తమమ్,
కాలయుక్త మువా చేదం వచో విపుల మర్థవత్. 4

దురాత్మా పృచ్ఛ్యతా మేష కుతః కింవాఽస్య కారణమ్,
వనభఙ్గే చ కోఽస్యార్థో రాక్షసీనాం చ తర్జనే. 5

మత్పురీ మప్రధృష్యాం వాఽఽగమనే కిం ప్రయోజనమ్,
ఆయోధనే వా కిం కార్యం పృచ్ఛ్యతా మేష దుర్మతిః. 6

రావణస్య వచ శ్శ్రుత్వా ప్రహస్తో వాక్య మబ్రవీత్,
సమాశ్వసిహి భద్రం తే న భీః కార్యా త్వయా కపే. 7

యది తావ త్త్వ మిన్ద్రేణ ప్రేషితో రావణాలయమ్,
తత్త్వ మాఖ్యాహి మాభూ త్తే భయం వానర మోక్ష్యసే. 8

యది వైశ్రవణస్య త్వం యమస్య వరుణస్య చ,
చారరూప మిదం కృత్వా ప్రవిష్టో నః పురీ మిమామ్. 9

విష్ణునా ప్రేషితో వాఽపి దూతో విజయకాఙ్క్షిణా,
న హి తే వానరం తేజో రూపమాత్రం తు వానరమ్. 10

తత్త్వతః కథయస్వాఽద్య తతో వానర మోక్ష్యసే,
అనృతం వదత శ్చాపి దుర్లభం తవ జీవితమ్. 11

అథవా యన్నిమిత్తం తే ప్రవేశో రావణాలయే,
ఏవ ముక్తో హరిశ్రేష్ఠ స్తదా రక్షోగణేశ్వరమ్. 12

అబ్రవీ న్నాస్మి శక్రస్య యమస్య వరుణస్య వా,
ధనదేన న మే సఖ్యం విష్ణునా నాస్మి చోదితః. 13

జాతి రేవ మమ త్వేషా వానరోఽహ మిహాగతః,
దర్శనే రాక్షసేన్ద్రస్య దుర్లభే తదిదం మయా. 14

వనం రాక్షసరాజస్య దర్శనార్థే వినాశితమ్,
తత స్తే రాక్షసాః ప్రాప్తా బలినో యుద్ధకాఙ్క్షిణః. 15

రక్షణార్థం తు దేహస్య ప్రతియుద్ధా మయా రణే,
అస్త్రపాశై ర్న శక్యోఽహం బద్ధుం దేవాసురై రపి. 16

పితామహాదేవ వరో మమా ప్యేషోఽభ్యుపాగతః,
రాజానం ద్రష్టుకామేన మయా ఽస్త్ర మనువర్తితమ్. 17

విముక్తో హ్యహ మస్త్రేణ రాక్షసై స్త్వభిపీడితః,
కేనచి ద్రాజకార్యేణ సంప్రాప్తోఽస్మి తవాన్తికమ్. 18

దూతోఽహ మితి విజ్ఞేయో రాఘవ స్యామితౌజసః,
శ్రూయతాం చాపి వచనం మమ పథ్య మిదం ప్రభో. 19

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, వాల్మీకీయే,
చతుర్వింశత్సహస్రికాయాం, సంహితాయాం,
శ్రీమత్సున్దరకాణ్డే, పఞ్చాశ స్సర్గః.

శ్లో. యో విరాధవధం నిత్యం శృణోతి శ్రావయేత వా,
తస్య సర్వాణి పాపాని లయం యాన్తి న సంశయః

శ్లో. శరభఙ్గాశ్రమ గతిం రాఘవస్య మహాత్మనః,
శృణ్వన్ త్రిదశలోకం వై ప్రాప్నోత్యేవ న సంశయః.

శ్లో. అద్యాహం జీవితం జహ్యాం త్వాం వా సీతేసలక్ష్మణామ్,
ఇత్యాది శ్రవణా న్మర్త్యో రామా త్కాఙ్క్షిత మాప్నుయాత్.

శ్లో. శ్రుత్వా శ్రీరామవిజయం పాపబన్ధా ద్విముచ్యతే,
తథైవ శృఙ్ఖలాబన్ధా దృణబన్ధాచ్చ మానవః

శ్లో. శ్రుత్వా పుష్పవతీ నారీ లభతే తనయం వరమ్,
భరత స్యార్య పుత్ర స్యే త్యత్రత్యనవమాక్షరమ్.

– తత్త్వ సంగ్రహరామాయణే, అరణ్యకాణ్డే

## 50వ సర్గము

### తనయెదుటనున్న హనుమను జూచి రావణుడు ఆలోచించుట

తన ఎదుట నిలిచిన మహాబాహువగు ఆంజనేయుని చూచి మిక్కిలి కృద్ధుడై లోకకంటకుడైన ఆ రావణుడు హనుమానుని తేజస్సు పరిశీలించి కొంత ఆలోచింపసాగెను. పూర్వము నేను కైలాసమునకు పోయిన సందర్భమున నా దుశ్చేష్టలను చూచి నా దుర్వాక్యములను విని శపించిన నంది స్వయముగ వానరరూపమున ఇచ్చటికి వచ్చియున్నాడా? లేదా బాణాసురుడే వచ్చినాడా? అని తలంచుకొని కోపముతో కన్నులు ఎరుపువారి యుండగా తన ముఖ్యమంత్రి యగు ప్రహస్తునితో అర్థవంతము సమయోచితమునగు ఒక మాటను చెప్పెను.

ఈ అశోకవనభంగము చేయుటకు కారణమేమి? రాక్షస స్త్రీలను ఏల భయపెట్టెను. ఎవ్వరు దరిచేరరాని ఈ లంకానగరమున కేల వచ్చెను? నా సైనికులతో యుద్ధము ఏల చేసెను? ఈ విషయములు దుష్టుడగు ఈ వానరుని అడిగి తెలిసికొనుడు.

### ప్రహస్తుడు హనుమతో పలుకుట

రావణుని ఆజ్ఞను స్వీకరించి వానరా! 'నీవు ఊరట వహింపుము. నీకు మేలు కలుగును. భయపడవలసిన అవసరము లేదు. ఇంద్రుడు నిన్ను ఈ లంకకు పంపినాడా? ఏమియు భయపడక యథార్థము చెప్పుము. లేక కుబేరుడు కానీ, యముడు గానీ, వరుణుడు గానీ నిన్ను గూఢచారునిగ పంపగా ఈ లంకకు వచ్చితివా? లేక రావణుని జయింపగోరి విష్ణువు పంపించిన దూతవా! నీ ఆకారమును చూచి వానరుడవని మేము తలంచినను నీ తేజస్సును చూచిన నిన్ను వానరుడని విశ్వసింపలేకున్నాము.

యథార్థము చెప్పుము. ఇప్పుడే నిన్ను విడిచిపెట్టగలము. అసత్య మాడినచో నీకు చావు తప్పదు. లేదా ఎందుకొరకు నీవీ లంకలో అడుగుపెట్టితివి.

## హనుమంతుని ప్రతివచనము

అప్పుడు హనుమంతుడు రాక్షస సేనాధిపతియగు ప్రహస్తునకు ఇట్లు బదులు చెప్పెను. ఇంద్రునితో, యమునితో, వరుణునితో, కుబేరునితో నాకు స్నేహమేమియు లేదు. నాజాతి వానరజాతి. నా పుట్టుకయే అంత. నేను విష్ణుదూతను కూడ కాదు. దుర్లభమైన రాక్షస రాజ దర్శనమును కోరి అశోకవనమును భగ్నము ఒనరించితిని. రాక్షస సైనికులు యుద్ధమునకు రాగా ఆత్మరక్షణార్థమై వారిని సంహరించితిని. దేవతలుగానీ, రాక్షసులు గానీ పాశములచేత గానీ అస్త్రముల చేతగాని నన్ను బంధింపలేరు. బ్రహ్మయే నాకీ వరము ఇచ్చియున్నాడు. రాక్షసులు కట్టిన బంధములచే బ్రహ్మాస్త్రము పట్టు విడిచినను రాక్షస రాజును చూడవలెనను కోరికతో అస్త్రబద్ధుడనైనట్లు నటించితిని.

ఈ రాక్షసుల బంధముచే అస్త్రబంధము యొక్క బలము ఎప్పుడో నన్ను విడిచినది. ఒకానొక రాజకార్యము పురస్కరించుకొని నీ వద్దకు వచ్చితిని. నేను మహాబలుడగు రాముని దూతను. ఓ రాక్షసరాజా! నేను నీకు హితవచనములు చెప్పుచున్నాను. శ్రద్ధగ వినుము.



# 51. ఏకపఞ్చాశ స్సర్గః

తం సమీక్ష్య మహాసత్త్వం సత్త్వవా న్హరిసత్తమః,
వాక్య మర్థవదవ్యగ్ర స్త ముచాచ దశాననమ్. 1

అహం సుగ్రీవ సన్దేశా దిహ ప్రాప్త స్తవాలయమ్,
రాక్షసేన్ద్ర హరీశ స్త్వాం భ్రాతా కుశల మబ్రవీత్. 2

భ్రాతు శ్శృణు సమాదేశం సుగ్రీవస్య మహాత్మనః,
ధర్మార్థోపహితం వాక్య మిహ చాముత్ర చ క్షమమ్. 3

రాజా దశరథోనామ రథకుఞ్జరవాజిమా న్,
పితేవ బన్ధు ర్లోకస్య సురేశ్వరసమద్యుతిః. 4

జ్యేష్ఠ స్తస్య మహాబాహుః పుత్రః ప్రియకరః ప్రభుః,
పితు ర్నిదేశా న్నిష్క్రాన్తః ప్రవిష్టో దణ్డకావనమ్. 5

లక్ష్మణేన సహభ్రాత్రా సీతయా చాపి భార్యయా,
రామో నామ మహాతేజా ధర్మ్యం పన్థాన మాశ్రితః. 6

తస్య భార్యా వనే నష్టా సీతా పతిమనువ్రతా,
వైదేహస్య సుతా రాజ్ఞో జనకస్య మహాత్మనః. 7

స మార్గమాణ స్తాం దేవీం రాజపుత్ర స్సహానుజః,
ఋశ్యమూక మనుప్రాప్త స్సుగ్రీవేణ సమాగతః. 8

తస్య తేన ప్రతిజ్ఞాతం సీతాయాః పరిమార్గణమ్,
సుగ్రీవస్యాపి రామేణ హరిరాజ్యం నివేదితమ్. 9

తత స్తేన మృధే హత్వా రాజపుత్రేణ వాలినమ్,
సుగ్రీవః స్థాపితో రాజ్యే హర్యృక్షగణాంగణేశ్వరః. 10

త్వయా విజ్ఞాతపూర్వశ్చ వాలీ వానరపుఙ్గవః,
రామేణ నిహత స్సఙ్ఖ్యే శరే ణైకేన వానరః. 11

స సీతామార్గణే వ్యగ్ర స్సుగ్రీవ స్సత్యసఙ్గరః,
హరీ న్సంప్రేషయామాస దిశ స్సర్వా హరీశ్వరః. 12

తాం హరీణాం సహస్రాణి శతాని నియుతాని చ,
దిక్షు సర్వాసు మార్గన్తే హ్యధశ్చోపరి చామ్బరే. 13

వైనతేయసమాః కేచి త్కేచి త్తత్రానిలోపమాః,
అసఙ్గగతయః శ్శీఘ్రా హరివీరా మహాబలాః. 14

అహం తు హనుమాన్నామ మారుతస్యౌరసస్సుతః,
సీతాయా స్తు కృతే తూర్ణం శతయోజన మాయతమ్. 15

సముద్రం లఙ్ఘయిత్వైవ తాం దిదృక్షు రిహాఽఽగతః,
భ్రమతా చ మయా దృష్టా గృహే తే జనకాత్మజా. 16

త ద్భవా న్దృష్టధర్మార్థ స్తపఃకృతపరిగ్రహః,
పరదారా న్మహాప్రాజ్ఞ నోపరోద్ధుం త్వ మర్హసి. 17

న హి ధర్మవిరుద్ధేషు బహ్వపాయేషు కర్మసు,
మూలఘాతిషు సజ్జన్తే బుద్ధిమన్తో భవద్విధాః. 18

కశ్చ లక్ష్మణముక్తానాం రామకోపానువర్తినామ్,
శరాణా మగ్రతః స్థాతుం శక్తో దేవాసురే ష్వపి. 19

న చాపి త్రిషు లోకేషు రాజ న్విద్యేత కశ్చన,
రాఘవస్య వ్యలీకం యః కృత్వా సుఖ మవాప్నుయాత్. 20

త త్త్రికాలహితం వాక్యం ధర్మ్య మర్థానుబన్ధి చ,
మన్యస్వ నరదేవాయ జానకీ ప్రతిదీయతామ్. 21

దృష్టా హీయం మయా దేవీ లబ్ధం య దిహ దుర్లభమ్,
ఉత్తరం కర్మ య చ్ఛేషం నిమిత్తం తత్ర రాఘవః. 22

లక్షి తేయం మయా సీతా తథా శోకపరాయణా,
గృహ్య యాం నాభిజానాసి పఞ్చాస్యా మివ పన్నగీమ్. 23

నేయం జరయితుం శక్యా సాసురై రమరై రపి,
విషసంసృష్ట మత్యర్థం భుక్త మన్న మివౌజసా. 24

తపస్సన్తాపలబ్ధస్తే యోఽయం ధర్మపరిగ్రహః,
న స నాశయితుం న్యాయ్య ఆత్మప్రాణపరిగ్రహః. 25

అవధ్యతాం తపోభి ర్యాం భవా న్స మనుపశ్యతి,
ఆత్మన స్సాసురై ర్దేవై ర్హేతు స్తత్రాప్యయం మహాన్. 26

సుగ్రీవో నహి దేవోయం నాసురో న చ రాక్షసః,
న దానవో న గన్ధర్వో న యక్షో న చ పన్నగః. 27

తస్మా త్ప్రాణపరిత్రాణం కథం రాజ న్కరిష్యసి,
న తు ధర్మోపసంహార మధర్మఫల సంహితమ్. 28

త దేవ ఫల మన్వేతి ధర్మ శ్చాధర్మనాశనః,
ప్రాప్తం ధర్మఫలం తావ ద్భవతా నాత్ర సంశయః. 29

ఫల మస్యా ప్యధర్మస్య క్షిప్రమేవ ప్రపత్స్యసే,
జనస్థానవధం బుద్ధ్వా బుద్ధ్వా వాలివధం తథా. 30

రామసుగ్రీవసఖ్యంచ బుధ్యస్వ హిత మాత్మనః,
కామం ఖ ల్వహ మ ప్యేక స్సవాజిరథకుఞ్జరామ్. 31

లఙ్కాం నాశయితుం శక్త స్త స్యైష తు న నిశ్చయః,
రామేణ హి ప్రతిజ్ఞాతం హర్యృక్షగణసన్నిధౌ. 32

ఉత్సాదన మమిత్రాణాం సీతా యై స్తు ప్రధర్షితా,
అపకుర్వన్తి రామస్య సాక్షా దపి పురన్దరః. 33

న సుఖం ప్రాప్నుయా దన్యః కిం పున స్త్వద్విధో జనః,
యాం సీతే త్యభిజానాసి యేయం తిష్ఠతి తే వశే. 34

కాళరాత్రీతి తాం విద్ధి సర్వలఙ్కావినాశినీమ్,
త దలం కాలపాశేన సీతావిగ్రహరూపిణా. 35

స్వయం స్కన్ధావసక్తేన క్షమ మాత్మని చిన్త్యతామ్,
సీతాయా స్తేజసా దగ్ధాం రామకోపప్రపీడితామ్. 36

దహ్యమానా మిమాం పశ్య పురీం సాట్టప్రతోళికామ్,
స్వాని మిత్రాణి మన్త్రీంశ్చ జ్ఞాతీ న్భ్రాతౄ న్సుతా న్హితా న్.

భోగా న్దారాంశ్చ లఙ్కాంచ మా వినాశ ముపానయ,
సత్యం రాక్షసరాజేన్ద్ర శృణుష్వ వచనం మమ. 38

రామదాసస్య దూతస్య వానరస్య విశేషతః,
సర్వాన్ లోకా న్సుసంహృత్య సభూతా న్సచరాచరా న్. 39

పునరేవ తథా స్రష్టుం శక్తో రామో మహాయశాః,
దేవాసురనరేన్ద్రేషు యక్షరక్షోగణేషు చ. 40

విద్యాధరేషు సర్వేషు గన్ధర్వే ష్వురగేషు చ,
సిద్ధేషు కిన్నరేన్ద్రేషు పతత్రిషు చ సర్వతః. 41

సర్వభూతేషు సర్వత్ర సర్వకాలేషు నాస్తి సః,
యో రామం ప్రతియుధ్యేత విష్ణుతుల్యపరాక్రమమ్. 42

సర్వలోకేశ్వర స్యైవం కృత్వా విప్రియ ముత్తమమ్,
రామస్య రాజసింహస్య దుర్లభం తవ జీవితమ్. 43

దేవాశ్చ దైత్యాశ్చ నిశాచరేన్ద్ర
గన్ధర్వ విద్యాధర నాగయక్షాః,
రామస్య లోకత్రయనాయకస్య
స్థాతుం న శక్తా స్సమరేషు సర్వే. 44

బ్రహ్మా స్వయమ్భూ శ్చతురాననో వా
రుద్ర స్త్రిణేత్ర స్త్రిపురాన్తకో వా
త్రాతుం న శక్తా యుధి రామవధ్యమ్. 45

స సౌష్ఠవోపేత మదీనవాదినః
కపే ర్నిశ మ్యాప్రతిమోఽప్రియం వచః,
దశాననః కోపవివృత్తలోచన
స్సమాదిశ త్తస్య వధం మహాకపేః. 46

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, వాల్మీకీయే,
చతుర్వింశత్సహస్రికాయాం, సంహితాయాం,
శ్రీమత్సున్దరకాణ్డే, ఏకపఞ్చాశ స్సర్గః.

## 51వ సర్గము

### హనుమంతుడు రావణునితో తనవృత్తాంతమును చెప్పట

మహాబలుడగు హనుమానుడు మహాబలుడగు రావణుని పరిశీలనగ చూచి తడబడకుండ అర్థవంతమైన మాటను చెప్పసాగెను. నా సోదరతుల్యుడైన సుగ్రీవుని ఆజ్ఞను పురస్కరించుకొని నీ లంకకు వచ్చితిని. మహాత్ముడగు సుగ్రీవుడు సందేశముగా పంపిన ఆదేశమును శ్రద్ధగ వినుము.

ధర్మార్థములను చేకూర్చగలిగినట్టియు ఐహికమును, ఆముష్మికమును చేకూర్చునట్టి సందేశము వినిపించుచున్నాను. శ్రద్ధగ వినుము

అపరిమితమైన రథసేన, వాజిసేన, గజసేన కలిగి లోకబంధువై నట్టియు ఇంద్రసమతేజుడైన దశరథ చక్రవర్తి సుప్రసిద్ధుడు. మీ అందరకు తెలిసిన వాడు. మహాబాహువైన ఆతని పెద్దకుమారుడు తండ్రి యొక్క ప్రమోదమునకు పాత్రుడైనవాడు. తండ్రి యొక్క ఆజ్ఞను స్వీకరించి దండకావనమును ప్రవేశించెను. ఆతని సోదరుడు లక్ష్మణుడు, భార్య సీతయు ఆతని వెంట అరణ్యమునకు వచ్చిరి. వనవాసము చేయుచుండగా మహాపతివ్రతయు, విదేహదేశాధి పతియగు జనక చక్రవర్తి పుత్రికయగు ఆ సీత కనబడలేదు.

ఆ రాజకుమారుడు రామచంద్రుడు తమ్మునితో కలసి సీతాదేవిని వెదకుచు ఋశ్యమూక పర్వతప్రాంతమునకు వచ్చెను. సుగ్రీవునితో స్నేహము చేసికొనెను. సీతను వెదకి ఇచ్చెదనని సుగ్రీవుడు రామునకు వాగ్దానము చేసెను. రాముడును సుగ్రీవుని వానరరాజ్యమునకు అధిపతిని చేసెదనని వాగ్దానమొనరించెను. తరువాత వాలిని సంహరించి సుగ్రీవుని వానర రాజ్యమున ప్రతిష్ఠితుని చేసెను. వానరోత్తముడగు వాలి నీకు బాగుగ తెలిసినవాడే. ఆతని పరాక్రమము కూడ నీకు బాగుగ తెలియును. ఆ వాలిని రాముడు ఒక బాణముచే సంహరించెను.

ఆడిన మాట తప్పని సుగ్రీవ మహారాజు సీతాన్వేషణమునకై ప్రయత్నము చేయుచున్నాడు. నాలుగు దిక్కులకు వానరులను పంపించినాడు. సుగ్రీవునిచే ఆదేశింపబడిన ఆ వానరులు నాలుగు దిక్కుల యందు వెదకుచున్నారు. ఈ వానరులు కొందరు గరుత్మంతునితో సమానమగు వేగము కలవారు. మరొకొందరు వాయుసమానులు. వారి గమనమును ఎవరు అడ్డువారు లేదు.

నాపేరు హనుమంతుడు వాయుదేవుని ఔరస పుత్రుడను. సీతకోసమై శతయోజనవిస్తీర్ణమగు సముద్రమును దాటి లంకకు వచ్చితిని. నేను ఈ లంకలో వెదకుచుండగా నీ గృహమున జానకీదేవి కనబడినది. కావున ధర్మార్థములను బాగుగా తెలిసిన వాడవు.మహాతపస్సంపన్నుడవు. పరభార్యను చెఱబట్టుట నీకు తగదు. బుద్ధిమంతులయిన నీవంటి వారు మొదటికే మోసము తెచ్చు ఆపత్కరమగు అధర్మకార్యముల యందు ఆసక్తి కలిగి ఉండరాదు.

శ్రీరాముని కోపమును అనుసరించి లక్ష్మణుడు ప్రయోగించు బాణముల ఎదుట నిలువ గల శక్తి దేవదానవులలో ఎవరికిని లేదు. శ్రీరామచంద్రునకు కష్టము కలిగించి సుఖపడగలవారు ఈ మూడు లోకములందు ఎవ్వరు ఉండరు. ధర్మబద్ధము హితకరములయి, భూత, భవిష్యద్, వర్తమానములందే మేలుచేసి పెట్టగల మంచి మాటలు చెప్పుచున్నాను.

## హనుమ రావణునకు చేసిన హితబోధ

రామచంద్రుని భార్యను రామచంద్రునకు అప్పచెప్పుము. సీతాదేవి ఈలంకలో కనబడినది. దొరకదు దొరకదు అనుకొన్న వ్యక్తి ఇచ్చట దొరికినది. తరువాతి కర్తవ్య విషయమున రామచంద్రునిదే నిర్ణయము. నీ లంకలో నేను సీతను చూచి ఉన్నాను. ఆమె ఇక్కడ సుఖముగ లేదు. నిరంతరము ఏడ్చుచున్నది. ఆమె ఐదు తలల మహా సర్పము వంటిది. ఆమె ఒక భోగ వస్తువు కాదు. దేవతలకు కాని రాక్షసులకు కాని అమెకు వ్రతభంగము చేయుట ఎవ్వరికిని సాధ్యము కాదు.

మహా విషపూరితమయిన అన్నమును తిని జీర్ణము చేసికొనుట కష్టమయినట్లే ఈ సీతను అనుకూలవతిగా చేసికొనుట నీకు సాధ్యము కాదు. మహాతపస్సును ఆచరించి ఆ తపఃఫలముగా ఇంతటి ఐశ్వర్యమును ఇన్ని భోగసాధనములను లభించి ఉన్నావు. ఇంతటి ఉత్తమమయిన జీవితమునకు ఆ తపశ్చర్యయే కారణము. ఈ అధర్మ కార్యాచరణముచే ఆ ధర్మఫలమును నాశనము చేసికొనకుము.

నీవు గొప్ప తపస్సులు చేసి దేవతలచేత రాక్షసులచేత మరణము లేకుండునట్లు వరమును పొందితివి. ఈ సుగ్రీవుడు దేవతలలోని

వాడు కాడు. అసురుడు కాడు. రాక్షసుడు కాడు. దానవుడు కాడు, గంధర్వుడు కాడు. యక్షుడు కాడు. ఇట్టి పరిస్థితిలో వానరుని వల్ల నుండి ఎటుల ప్రాణములు రక్షించుకొనగలవు? ధర్మఫలము అధర్మఫలముతో కూడి ఉన్నను ధర్మము అధర్మమును అణచి తన ఫలమును అనుభవింప చేయుచుండును.

రావణా! ఇంతవరకు నీవు ధర్మ ఫలమును అనుభవించితివి. నీవు తొందరలో అధర్మఫలమును కూడ అనుభవింపవలసిఉండును. జనస్థానమున ఖరాది రాక్షస సంహారమును తెలిసికొని తరువాత వాలి వధను కూడ తెలిసికొని రామసుగ్రీవుల తరుగని మైత్రిని తెలిసికొని నీ హితమును గురించి బాగుగ ఆలోచింపుము. నేనొక్కడనయినను చతురంగ బలముతో కూడి ఉన్న లంకను నాశనముచేయుటకు శక్తి కలవాడనే కాని సీతాపహారము చేసిన దుష్ట రాక్షసులను ఆ శ్రీరాముడే స్వయముగా చంపదలంచి ఉన్నాడు. అందుచే నేను రాక్షస వధను ఇంతటితో విరమించి ఉంటిని.

శ్రీరాముని విషయములో అపచార పడి ఇంద్రాదులు కూడ సుఖముగా బ్రతుకలేరు అన్నచో ఇక నీవు ఏపాటి వాడవు? నీవు ఎత్తుకొని వచ్చిన స్త్రీ సీతా విగ్రహ రూపమున కాలుని పాశము నీ మెడకు చుట్టుకొని ఉన్నది. ఏది సముచితమో కర్తవ్య నిర్ణయము చేసికొనుము. రాముని కోపమునకు గుటియై సీతాపాతివ్రత్య తేజమున మేడలతో మిద్దెలతో కూడిన సుందరమైన లంకావీదులన్నియు తొందరలోనే దగ్ధమయి పోవును. నీ మిత్రులను, మంత్రులను,

జ్ఞాతులను, సోదరులను, పుత్రులను, హితులను, భోగములను, భార్యలను, ఈ లంకను నాశనము చేయకుము.

ఓ రాక్షస రాజా! నామాట యథార్థము. నీ మేలునకై చెప్పుచున్నాను. నేను రాముని దూతను. విశేషించి వానరుడను. శ్రీరాముడు ఈ చరాచరప్రపంచమును ఉపసంహరించి తిరిగి యథాపూర్వముగ సృజించు శక్తి గలవాడు. దేవతలలోకాని, రాక్షసులో, మనుష్యులలో, విద్యాధరులలో మరి ఏరేనివిశేషులలో కాని, సర్వభూతములలో సర్వకాలములలో విష్ణుతుల్యపరాక్రముడగు రాముని ఎదుట నిలిచి యుద్ధము చేయగలవాడు ఎవ్వడును లేడు.

సర్వలోకేశ్వరుడయిన రాజసింహుడగు రామునకు ఇంతటి అప్రియమును ఆచరించి బ్రతికి యుండుట నీకు సాధ్యము కానిపని. స్వయంభువై, నాలుగు ముఖములతో నాలుగు వేదములను నిరంతరము ఉచ్చరింపగల బ్రహ్మగాని, త్రినేత్రుడై త్రిపురాంతకుడయిన రుద్రుడుకాని, సర్వదేవతానాయకుడయి గొప్ప పరమైశ్వర్యముతో కూడిన ఇంద్రుడు కాని రామచంద్రుడు చంపదలంచుకొన్న వ్యక్తిని రక్షింపలేదు.

నిర్భయముగా సౌష్ఠవోపేతముగ పలికిన ఆ రామదూత పలుకులను విని దశాననుడు మహాకోపముతో ఆ వానరుని వధింపవలసినదిగా ఆజ్ఞాపించెను.



# 52. ద్విపఞ్చాశ స్సర్గః

తస్య త ద్వచనం శ్రుత్వా వానరస్య మహాత్మనః
ఆజ్ఞాపయ ద్వధం తస్య రావణః క్రోధమూర్ఛితః. 1

వధే తస్య సమాజ్ఞప్తే రావణేన దురాత్మనా,
నివేదితవతో దౌత్యం నానుమేనే విభీషణః. 2

తం రక్షోధిపతిం క్రుద్ధం తచ్చ కార్య ముపస్థితమ్,
విదిత్వా చిన్తయామాస కార్యం కార్యవిధౌ స్థితః. 3

నిశ్చితార్థ స్తత స్సామ్నా పూజ్య శత్రుజి దగ్రజమ్,
ఉవాచ హిత మత్యర్థం వాక్యం వాక్యవిశారదః. 4

క్షమస్వ రోషం త్యజ రాక్షసేన్ద్ర
ప్రసీద మద్వాక్య మిదం శృణుష్వ,
వధం న కుర్వన్తి పరావరజ్ఞాః
దూతస్య సన్తో వసుధాధిపేన్ద్రాః. 5

రాజధర్మవిరుద్ధం చ లోకవృత్తేశ్చ గర్హితమ్,
తవ చాసదృశం వీర కపే రస్య ప్రమాపణమ్. 6

ధర్మజ్ఞశ్చ కృతజ్ఞశ్చ రాజధర్మవిశారదః,
పరావరజ్ఞో భూతానాం త్వ మేవ పరమార్థవిత్. 7

గృహ్ణన్తే యది రోషేణ త్వాదృశోఽపి విపశ్చితః,
తత శ్శాస్త్రవిపశ్చిత్త్వం శ్రమ ఏవ హి కేవలమ్. 8

తస్మా త్ప్రసీద శత్రుఘ్న రాక్షసేన్ద్ర దురాసద,
యుక్తాయుక్తం వినిశ్చిత్య దూతదణ్డో విధీయతామ్. 9

విభీషణవచ శ్శ్రుత్వా రావణో రాక్షసేశ్వరః,
రోషేణ మహతాఽఽవిష్టో వాక్య ముత్తర మబ్రవీత్. 10

న పాపానాం వధే పాపం విద్యతే శత్రుసూదన,
తస్మా దేనం వధిష్యామి వానరం పాపచారిణమ్. 11

అధర్మమూలం బహురోషయుక్త
మనార్యజుష్టం వచనం నిశమ్య,
ఉవాచ వాక్యం పరమార్థతత్త్వం
విభీషణో బుద్ధిమతాం వరిష్ఠః. 12

ప్రసీద లఙ్కేశ్వర రాక్షసేన్ద్ర
ధర్మార్థయుక్తం వచనం శృణుష్వ,
దూతా నవధ్యా న్సమయేషు రాజ
న్సర్వేషు సర్వత్ర వదన్తి సన్తః. 13

అసంశయం శత్రు రయం ప్రవృద్ధః
కృతం హ్యనేనాప్రియ మప్రమేయమ్,
న దూతవధ్యాం ప్రవదన్తి సన్తో
దూతస్య దృష్టా బహవో హి దణ్డాః. 14

వైరూప్య మఙ్గేషు కశాభిఘాతో
మౌణ్డ్యం తథా లక్షణసన్నిపాతః,

ఏతా న్హి దూతే ప్రవదన్తి దణ్డాన్
వధస్తు దూతస్య న నః శ్రుతోఽపి. 15

కథం చ ధర్మార్థవినీతబుద్ధిః
పరావరప్రత్యయనిశ్చితార్థః,
భవద్విధః కోపవశే హి తిష్ఠే
త్కోపం నియచ్ఛన్తి హి సత్త్వవన్తః. 16

న ధర్మవాదే న చ లోకవృత్తే
న శాస్త్రబుద్ధిగ్రహణేషు చాపి,
విద్యేత కశ్చి త్తవ వీర తుల్య
స్త్వం హ్యుత్తమ స్సర్వ సురాసురాణామ్. 17

న చాప్యస్య కపే ర్ఘాతే కంచి త్పశ్యా మ్యహం గుణమ్,
తే ష్వయం పాత్యతాం దణ్డో యై రయం ప్రేషితః కపిః. 
సాధు ర్వా యది వాఽసాధుః పరై రేష సమర్పితః,
బ్రువ న్పరార్థం పరవా న్న దూతో వధ మర్హతి. 19
అపి చాస్మిన్ హతే రాజ న్నాన్యం పశ్యామి ఖేచరమ్,
ఇహ యః పున రాగచ్ఛే త్పరం పారం మహోదధేః. 20
తస్మా న్నాస్య వధే యత్నః కార్యః పరపురఞ్జయ,
భవా న్సేన్ద్రేషు దేవేషు యత్న మాస్థాతు మర్హతి. 21

అస్మి న్వినష్టే న హి దూత మన్యం
పశ్యామి య స్తౌ నరరాజపుత్రౌ,
యుద్ధాయ యుద్ధప్రియ దుర్వినీతా
వుద్యోజయే ద్దీర్ఘపథావరుద్ధౌ. 22

పరాక్రమోత్సాహ మనస్వినాం చ
సురాసురాణా మపి దుర్జయేన,
త్వయా మనోనన్దన నైరృతానాం
యుద్ధాయతి ర్నాశయితుం న యుక్తా. 23

హితాశ్చ శూరాశ్చ సమాహితాశ్చ
కులేషు జాతాశ్చ మహాగుణేషు,
మనస్విన శ్శస్త్రభృతాం వరిష్ఠాః
కోట్యగ్రత స్తే సుభృతాశ్చ యోధాః. 24

తదేకదేశేన బలస్య తావ
త్కేచి త్తవాఽదేశ కృతోఽభియాన్తు,
తా రాజపుత్రా వినిగృహ్య మూఢా
పరేషు తే భావయితుం ప్రభావమ్. 25

నిశాచరాణా మధిపోఽనుజస్య
విభీషణ స్యోత్తమవాక్య మిష్టమ్,
జగ్రాహ బుద్ధ్యా సురలోకశత్రు
ర్మహాబలో రాక్షసరాజముఖ్యః. 26

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, వాల్మీకీయే,
చతుర్వింశత్సహస్రికాయాం, సంహితాయాం,
శ్రీమత్సున్దరకాణ్డే, ద్విపఞ్చాశ స్సర్గః.

# 52వ సర్గము

## విభీషణుడు దూతవధ పనికిరాదనుట

ముందు వెనుకలు కానలేని ఆవేశముతో రాక్షసచక్రవర్తి ఆంజనేయుని వధింపవలసినదిగా ఆజ్ఞాపింపగనే దూతగా వచ్చిన వానిని చంపుట ధర్మము కాదని విభీషణుడు ప్రతిఘటించెను. రాక్షసాధిపతి మిక్కిలి క్రోధముగా ఉండుటను ప్రస్తుత కర్తవ్యమగు కార్యమును గురించి బాగుగ అవగాహన చేసికొని కర్తవ్యమేమా అని ఏ రీతిగ చెప్పిన దూతవధ ఆగిపోవును అను విషయము బాగుగ ఆలోచించి, మాటకారి అయిన విభీషణుడు అన్నగారికి సామ పూర్వకముగా హితమును పలుక నారంభించెను.

రాక్షసేంద్రా! నీకు ఎదురు పలుకుచున్న నన్ను క్షమింపుము. రాజసమును విడువుము. ప్రసన్నుడవయి నా మాటలు వినుము. దౌత్యమర్యాదలు తెలిసిన మహారాజులు దూతవధను ఆజ్ఞాపింపరు. దూత వధ రాజధర్మమునకు విరుద్ధమయినది. లోకప్రవృత్తి చేత కూడ నిందనీయమయినది. నీవంటి మహావీరుడు దూతగా వచ్చిన వానరుని వధించుట ఏ మాత్రమును తగినపని కాదు. నీవు రాజధర్మమును బాగుగ తెలిసి ఇది తగును ఇది తగదు అని నిర్దేశింపదగినవాడవు. నీ కన్నియు తెలిసినవే. నీవంటి రాజనీతిపండితులుకూడ కోపమునకు వశవర్తులయినచో శాస్త్రపాండిత్యము నిష్ప్రయోజనమయిన శ్రమమే అగును.

ఎందరో శత్రువులను నీవు ఇదివరకే సంహరించితివి. ఈ విషయమున అపచారపడి నీ సన్నిధికి చేరగలిగిన వారెవ్వరున్నారు? యుక్తాయుక్తములను బాగుగ పరిశీలించి దూతకు దండనము విధింపుము.

 



## దూతవధ విషయమై రావణ విభీషణుల సంవాదము

విభీషణుని మాటలు విన్న రాక్షసేంద్రుడు గొప్ప కోపావేశముతో ఇట్లు పలికెను. పాపాత్ములను దండించుటలో తప్పులేదు. కావుననే పాపాచారుడయిన ఈ వానరుని వధింపుమని ఆజ్ఞాపించుచున్నాను. అధర్మమూలమయిన, మహాదోషయుక్త మయిన, పెద్దలు మెచ్చుకొనని, అన్నగారి మాటలను విని బుద్ధిమంతులలో ఉత్తముడయిన విభీషణుడు వాస్తవమయిన ఒక వాక్యము నిట్లు పలికెను.

లంకేశ్వరా! రాక్షసేంద్రా! కోపము విడువుము. ప్రసన్నుడ వగుము. ధర్మార్థయుక్తమయిన నా మాట నాలకింపుము. ఏదేశమందయినను ఏ కాలమందయినను దూతవధ తగదని పెద్దలు చెప్పుచున్నారు. ఈ వానరుడు నిస్సందేహముగా పెద్ద శత్రువే గొప్ప అప్రియము ఆచరించి ఉన్నాడు. పెద్దలు రాజనీతి శాస్త్రజ్ఞులు దూతను దండించునపుడు వధను అంగీకరింపలేరు. దూత విషయమున ఇతరదండములు ఎన్నియో విధించి ఉన్నారు. అవయవ లోపము కల్పించుట, కొరడాతో కొట్టుట, బుఱ్ఱ గొఱిగించుట, దూతకు చర్మము మీద కొన్ని గుర్తులు వేయుట ఈ నాలుగింటిని దూతకు దండనముగా రాజనీతి విశారదులు చెప్పియున్నారు. కాని వధను దూతదండముగ విధించినవారు లేరు. ఎప్పుడును వినలేదు కూడ.

ధర్మార్థముల విషయమై నీ బుద్ధి సుశిక్షితమయినది. కార్యము యొక్క ఉత్కర్షాపకర్షములను జ్ఞానవిశేషముచే నిర్ణయింపగలవాడవు. నీవును కోపమునకు విధేయుడవయి ఉండుటయా? సాత్త్వికులయిన వ్యక్తులు కోపమును నిగ్రహింతురు కాని కోపమునకు వశవర్తులయి

ఉండరు. ధర్మమును గూర్చి చెప్పుటలో, లోకప్రవృత్తిని తెలిసికొనుటలో శాస్త్రమును గురించి తెలిసికొనుటలో, గుర్తుపెట్టుకొనుటలో, నీకు సమానుడు ఎక్కడను లేడు. ఈ దూతను చంపుటలో నాకేమియు మంచి కనబడుటలేదు. ఈ దూతను పంపిన వారిని నీవు దండించుట ధర్మము. ఈ వచ్చినవాడు మంచివాడో చెడ్డవాడో ఇతరులు పంపగా వచ్చి ఉన్నాడు. పరతంత్రుడయిన ఈ దూత ఇతరులు చెప్పుమన్న వానిని చెప్పియున్నాడు. తనంత తానుగ ఏమియు చెప్పలేదు కదా! ఈ దూత పలికిన పలుకులు వాని ప్రభువు పలికినవి. కాని తనంత తానుగా పలికినవి కావు. కావున ఈ దూత దండనీయుడు కాడు.

ఈ వానరుని మనము చంపించినచో ఆకాశమార్గమున సముద్రమును దాటి ఇక్కడకు వచ్చువాడు మరొకడు కానరాడు. కావున నీవు ఈ దూతను చంపవలదు. నీవు ఇంద్రాదిదేవతలపై ఈ దండమును ప్రయోగింపుము. ఈ వానరుడు ఇక్కడ మరణించినచో ఇక్కడ నుండి సముద్రమును దాటిపోయి ఆ రామలక్ష్మణులను యుద్ధమునకు ప్రోత్సహించువాడు మఱియొకడు కనబడడు. పరాక్రమము, ఉత్సాహము, అభిమానము కలిగిన దేవాసురులు ఎవ్వరికిని జయింపరాని నీవు ఆ రాక్షసులకు ప్రియమైన యుద్ధావకాశము లేకుండుట యుక్తముకాదు. నీకు హితులు, శూరులు, ఉత్తమ వంశ సంజాతులయినవారునీచేత పోషింపబడుచున్నవారు, మఱియు శూరులయిన సైనికులు కోట్లకొలది గలరు. నీ సేనలో కొంతభాగమును తీసికొనిపోయి సమర్థులగు ఆ రాజపుత్రుల యందు నీ ప్రభావము కనబఱుచుట ఎంతో యుక్తము. తన తమ్ముడగు విభీషణుడు చెప్పినమాటలు విని దూతకు వధను కాక మరొక దండమును విధించుటకై నిర్ణయించుకొనెను.



 

# 53. త్రిపఞ్చాశ స్సర్గః

తస్య త ద్వచనం శ్రుత్వా దశగ్రీవో మహాబలః,
దేశకాలహితం వాక్యం భ్రాతు రుత్తర మబ్రవీత్. 1

సమ్య గుక్తం హి భవతా దూతవధ్యా విగర్హితా,
అవశ్యం తు వధా దన్యః క్రియతా మస్య నిగ్రహః. 2

కపీనాం కిల లాఙ్గూల మిష్టం భవతి భూషణమ్,
త దస్య దీప్యతాం శీఘ్రం తేన దగ్ధేన గచ్ఛతు. 3

తతః పశ్య న్త్విమం దీన మఙ్గవైరూప్యకర్శితమ్,
సమిత్రజ్ఞాతయ స్సర్వే బాన్ధవా స్ససుహృజ్జనాః. 4

ఆజ్ఞాపయ ద్రాక్షసేన్ద్రః పురం సర్వం సచత్వరమ్,
లాఙ్గూలేన ప్రదీప్తేన రక్షోభిః పరిణీయతామ్. 5

తస్య త ద్వచనం శ్రుత్వా రాక్షసాః కోపకర్శితాః,
వేష్టయన్తిస్మ లాఙ్గూలం జీర్ణైః కార్పాసకైః పటైః. 6

సంవేష్ట్యమానే లాఙ్గూలే వ్యవర్ధత మహాకపిః,
శుష్క మిన్ధన మాసాద్య వనే ష్వివ హుతాశనః. 7

తైలేన పరిషి చ్యాథ తేఽగ్నిం తత్రాభ్యపాతయన్,
లాఙ్గూలేన ప్రదీప్తేన రాక్షసాం స్తా నపాతయత్. 8

రోషామర్షపరీతాత్మా బాలసూర్యసమాననః,
లాఙ్గూలం సంప్రదీప్తం తు ద్రష్టుం తస్య హనూమతః. 9

సహ స్త్రీబాలవృద్ధాశ్చ జగ్ముః ప్రీతా నిశాచరాః,
స భూయ స్సఙ్గతైః క్రూరై రాక్షసై ర్హరిసత్తమః. 10

నిబద్ధః కృతవా న్వీర స్తత్కాలసదృశీం మతిమ్,
కామం ఖలు న మే శక్తా నిబద్ధస్యాపి రాక్షసాః. 11

ఛిత్త్వా పాశా న్సముత్పత్య హన్యా మహ మిమా న్పునః,
యది భర్తు ర్హితార్థాయ చరన్తం భర్తృశాసనాత్. 12

బధ్న న్త్యేతే దురాత్మానో న తు మే నిష్కృతిః కృతా,
సర్వేషామేవ పర్యాప్తో రాక్షసానా మహం యుధి. 13

కిన్తు రామస్య ప్రీత్యర్థం విషహిష్యేఽహ మీదృశమ్,
లఙ్కా చారయితవ్యా వై పునరేవ భవేదితి. 14

రాత్రౌ న హి సుదృష్టా మే దుర్గకర్మవిధానతః,
అవశ్యమేవ ద్రష్టవ్యా మయా లఙ్కా నిశాక్షయే. 15

కామం బద్ధస్య మే భూయః పుచ్ఛ స్యోద్దీపనేన చ,
పీడాం కుర్వన్తు రక్షాంసి నమేఽస్తి మనస శ్శ్రమః. 16

తత స్తే సంవృతాకారం సత్త్వవన్తం మహాకపిమ్,
పరిగృహ్య యయు ర్హృష్టా రాక్షసాః కపికుఞ్జరమ్. 17

శఙ్ఖభేరీనినాదై స్తం ఘోషయన్త స్స్వకర్మభిః,
రాక్షసాః క్రూరకర్మాణ శ్చారయన్తిస్మ తాం పురీమ్. 18

అన్వీయమానో రక్షోభి ర్యయౌ సుఖ మరిన్దమః,
హనుమాం శ్చారయామాస రాక్షసానాం మహాపురీమ్. 19

అథాపశ్య ద్విమానాని విచిత్రాణి మహాకపిః,
సంవృతాన్ భూమిభాగాంశ్చ సువిభక్తాంశ్చ చత్వరాన్. 20

వీథీశ్చ గృహసంబాధాః కపి శ్శృఙ్గాటకాని చ,
తథా రథ్యోపరథ్యాశ్చ తథైవ చ గృహాన్తరాన్. 21

గృహాం శ్చ మేఘసఙ్కాశాన్ దదర్శ పవనాత్మజః,
చత్వరేషు చతుష్కేషు రాజమార్గే తథైవ చ. 22

ఘోషయన్తి కపిం సర్వే చారీక ఇతి రాక్షసాః,
స్త్రీబాలవృద్ధా నిర్జగ్ము స్తత్ర తత్ర కుతూహలాత్. 23

తం ప్రదీపిత లాఙ్గూలం హనుమన్తం దిదృక్షవః,
దీప్యమానే తత స్తస్య లాఙ్గూలాగ్రే హనూమతః. 24

రాక్షస్య స్తా విరూపాక్ష్య శ్శంసు ర్దేవ్యా స్తదప్రియమ్,
య స్త్వయా కృతసంవాద స్సీతే తామ్రముఖః కపిః. 25

లాఙ్గూలేన ప్రదీప్తేన స ఏష పరిణీయతే,
శ్రుత్వా తద్వచనం క్రూర మాత్మాపహరణోపమమ్. 26

వైదేహీ శోకసన్తప్తా హుతాశన ముపాగమత్,
మఙ్గళాభిముఖీ తస్య సా తదాఽఽసీ న్మహాకపేః. 27

ఉపతస్థే విశాలాక్షీ ప్రయతా హవ్యవాహనమ్,
యద్యస్తి పతిశుశ్రూషా యద్యస్తి చరితం తపః. 28

యది చా ప్త్యేకపత్నీత్వం శీతో భవ హనూమతః,
యది కిఞ్చి దనుక్రోశ స్తస్య మయ్యస్తి ధీమతః. 29

యది వా భాగ్యశేషో మే శీతో భవ హనూమతః,
యది మాం వృత్తసంపన్నాం తత్సమాగమలాలసామ్. 30

స విజానాతి ధర్మాత్మా శీతోభవ హనూమతః,
యది మాం తారయే దార్య సుగ్రీవ స్సత్యసఙ్గరః. 31

అస్మా ద్దుఃఖామ్బుసంరోధా చ్ఛీతోభవ హనూమతః,
తత స్తీక్ష్ణార్చి రవ్యగ్రః ప్రదక్షిణ శిఖోఽనలః. 32

జజ్వాల మృగశాబాక్ష్యా శ్శంసన్నివ శివం కపేః,
హనుమజ్జనక శ్చాపి పుచ్ఛానలయుతోఽనిలః. 33

వవౌ స్వాస్థ్యకరో దేవ్యాః ప్రాలేయానిలశీతలః,
దహ్యమానే చ లాఙ్గూలే చిన్తయామాస వానరః. 34

ప్రదీప్తోఽగ్ని రయం కస్మా న్న మాం దహతి సర్వతః,
దృశ్యతే చ మహాజ్వాలః కరోతి న చ మే రుజమ్,
శిశిరస్యేవ సంపాతో లాఙ్గూలాగ్రే ప్రతిష్ఠితః. 35

అథవా త దిదం వ్యక్తం యద్దృష్టం ప్లవతా మయా,
రామప్రభావా దాశ్చర్యం పర్వత స్సరితాంపతౌ. 36

యది తావత్సముద్రస్య మైనాకస్య చ ధీమతః,
రామార్థం సంభ్రమ స్తాదృ క్కిమగ్ని ర్న కరిష్యతి. 37

సీతాయా శ్చానృశంస్యేన తేజసా రాఘవస్య చ,
పితుశ్చ మమ సఖ్యేన న మాం దహతి పావకః. 38

భూయ స్స చిన్తయామాస ముహూర్తం కపికుఞ్జరః,
ఉత్పపా తాథ వేగేన ననాద చ మహాకపిః. 39

పురద్వారం తత శ్శ్రీమా ఞ్శైలశృఙ్గ మివోన్నతమ్,
విభక్తరక్షస్సంబాధ మాససా దానిలాత్మజః. 40

స భూత్వా శైలసఙ్కాశః క్షణేన పున రాత్మవా౯,
హ్రస్వతాం పరమాం ప్రాప్తో బన్ధనా న్యవశాతయత్. 41

విముక్త శ్చాభవ చ్ఛ్రీమా న్పునః పర్వతసన్నిభః,
వీక్షమాణ శ్చ దదృశే పరిఘం తోరణాశ్రితమ్. 42

స తం గృహ్య మహాబాహుః కాలాయసపరిష్కృతమ్,
రక్షిణ స్తా న్పున స్సర్వా౯ సూదయామాస మారుతిః. 43

స తా న్నిహత్వా రణచణ్డవిక్రమ
స్సమీక్షమాణః పునరేవ లఙ్కామ్,
ప్రదీప్తలాఙ్గూలకృతార్చిమాలీ
ప్రకాశతాఽఽదిత్య ఇవార్చిమాలీ. 44

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, వాల్మీకీయే,
చతుర్వింశత్సహస్రికాయాం, సంహితాయాం,
శ్రీమత్సున్దరకాణ్డే, త్రిపఞ్చాశ స్సర్గః.

## 53వ సర్గము

### రావణుడు హనుమ తోకకు నిప్పంటింపింప నిశ్చయించుట

విభీషణా! నీవు చెప్పినది చాల సమంజసముగా ఉన్నది. దూతను వధించుట తగదని పెద్దలు వారించి ఉన్నారు. వధను కాక వేరొక దండనము వధింపవలసి ఉన్నది.

కోతులకు తోక అన్నచో చాల ఇష్టము. కోతులు తమ తోకను ఒక అభరణముగా భావించు చుండును. కావున ఈ వానరుని తోకకు నిప్పుపెట్టి కాల్పవలెను. దీని తోక దగ్ధమగుచుండగా కాలుచున్న తోకతో ఆ వానరుడు తిరిగి పోవచ్చు. మొండి తోకతో ఉన్న ఈ వానరుని జ్ఞాతులు, మిత్రులు, బాంధవులు అందరు చూడవచ్చు. తోకకు పెట్టిన నిప్పు మండు చుండగా ఈ వానరుని నాలుగు వీథుల మొగలో ఇంకను పట్టణ మంధు అంతటను త్రిప్పవలెను.

### రాక్షసులు హనుమ తోకకు నిప్పంటించుట

రావణుని ఆ మాటలను వీని ఇది వరకే ఆంజనేయునిపై కోపముగా ఉన్న ఆ రాక్షసులు ఆ వానరుని తోకకు పాతవైన నూలుగుడ్డలను తోకకు చుట్టచుండగా ఆంజనేయుడు దేహము పెంచెను. బాగుగ ఎండిన కట్టెలను స్వీకరించి అడవులలో దావాగ్ని పెరిగినట్లుగా ఆతడును వృద్ధి చెందెను. ఆంజనేయుని రోషము బాగుగా పెరిగిపోయెను. ముఖము బాలసూర్యుని వలె ఎరుపు

వారెను. రాక్షసులు తోకకు చుట్టిన గుడ్డలను నూనెతో తడిపి నిప్పు అంటించిరి.

తోక కాలుచుండగా ఆంజనేయుని చూచుటకై రాక్షసులు, స్త్రీలు, బాలలు, వృద్ధులు అందరును కలిసిపోయిరి. రాక్షసులు హనుమంతుని బంధమును మఱింత బిగించి కట్టిరి.

అపుడు ఆంజనేయుడు ఆలోచించెను. ఈ రాక్షసులు తమ బలమును ఉపయోగించి నన్ను ఎంత గట్టిగ బంధించినను ఈ పాశములన్నింటిని త్రెంచుకొన వీరందరిని నేనొకడనే చంపి వేయగలను. కాని నా ప్రభువు యొక్క హితమును కోరి నేను ప్రవర్తించుచుండగా తమ ప్రభువు ఆజ్ఞను పురస్కరించుకొని ఈ రాక్షసులు నన్ను బంధించినారు. వీరు నాకు చేసిన ప్రతిక్రియ ఏమియు లేదు. ఈ రాక్షసుల నందరిని నేను ఒక్కడనే చంపివేయగలను. కాని రాముడు చంపవలసిన రాక్షసులనందఱను నేనే చంపినచో రామునకు అప్రియము కల్పించినట్లగును.

ఈ రాక్షసులు చేసిన బంధములను హింసను నేను సహింప దలచితిని. మరల లంక అంతయు చారుని వలె పరిభ్రమింపవలసి ఉన్నది. రాత్రివేళ దుర్గ నిర్మాణాదులను సరిగా పరిశీలింపలేదు. ఈ తెల్లవారుజామున గూఢచారి వలె లంక అంతయు పరికింపవలసి యున్నది. నన్ను బంధించినను తోకకు నిప్పు పెట్టినను ఈ అంశము లన్నియు నాకు బాధాకరముగ ఉండుట లేదు. తరువాత ఆ రాక్షసులు నన్ను ఎంత గట్టిగ కట్టినను ఎంతగా బాధించినను నా మనస్సున కేమియు బాధ కలుగుట లేదు.

మిక్కిలి గంభీరముగ ఉన్న బలవంతుడగు ఆ వానరోత్తముని బలవంతులగు రాక్షసులు పట్టుకొని ముందునకు తీసికొని పోయిరి. శంఖములు, భేరులు మ్రోగించుకొనుచు పెద్దగ ఘోషణము చేయుచు ఆ రాక్షసులు క్రూరముగ హనుమంతుని బాధించుచు నగర మంతను త్రిప్పుచుండిరి. రాక్షసులు వెంబడించి రాగా హనుమంతుడు గూఢచారి దృష్టితో నగరమును పరిశీలింప నారంభించె[illegible]

సౌధముల ఉపరి భాగములను, గూఢమైన భూమి భాగములను చక్కగ తీర్చిదిద్దినట్లున్న నాల్గు వీధులు కలియు చోట్లను ఆ హనుమానుడు పరిశీలించుచుండెను. అత్యున్నత గృహములతో కూడిన వీధులను, ద్వారములు కానరాకుండ కట్టిన గృహములను మేఘమండల పర్యంతమైన ఉన్నత భవనములను రాజమార్గ మందున్న చత్వరములను హనుమానుడు చూచెను.

ఇదిగో గూఢచారుని బంధించితిమి. అని రాక్షసులు ఘోషణము చేయగనే స్త్రీలు, బాలురు, వృద్ధులు అతి. కుతూహలముతో ఆ వానరుని చూచుటకై బయటకు వచ్చిరి.

ఆంజనేయుని ఆ తోకలోని చివరి భాగము మండుచుండగా ఆ రాక్షస స్త్రీలు, బాలురు, వృద్ధులు కుతూహలముతో వీక్షించు చుండిరి. కొంతమంది రాక్షస స్త్రీలు కళ్ళు పెద్దవిగ చేసికొని సీతాదేవి సన్నిధికి పోయి సీతా! నీతో మాటలాడిన ఆ ఎర్రముఖపు కోతితోకకు నిప్పుపెట్టి మా రాక్షసులు వీధివెంట త్రిప్పుచున్నారు.

ఆ మాట వినునప్పటికి సీతాదేవికి ప్రాణములు కడపట్టినవి. వైదేహి శోక సంతప్తురాలయి ఆంజనేయుని క్షేమము కోరి ప్రజ్వలితమయిన అగ్నిహోత్రుని ఉపాసన చేసి ఈ రీతిగ ప్రార్థించెను.

## సీత అగ్నిదేవుని ప్రార్థించుట

అగ్నిదేవా! నేను పతి శుశ్రూష చేసి ఉండుచో, నేను పతివ్రతనగుచో అగ్నిదేవా! ఈ హనుమంతునకు చల్లగా ఉండుము. శ్రీరామచంద్రునకు నాయందు దయ ఉన్నచో నాకు అజ్ఞాతమయిన పుణ్యపరిపాకము ఏదయినను ఉన్నచో ఈ ఆంజనేయునకు నీవు చల్లగా ఉండుము. ధర్మాత్ముడగు ఆ శ్రీరాముడు సచ్చరిత్ర సంపన్నురాలినిగా, రామ సమాగమము కోరుచున్న దానిగా తలంచుచున్నచో, ఆడి తప్పని సుగ్రీవ మహారాజు నన్ను ఈ సముద్రము నుండి ఈ రాక్షసుల చెర నుండి దాటించుటకయి నిశ్చయించుకొన్న వాడయినచో హనుమంతునికి నీవు చల్లగా ఉండుము. ఆ సమయమున ప్రజ్వలితమయిన అగ్ని ప్రదక్షిణాకారముగా జ్వాలలను ప్రసారము చేయుచు సీతాదేవియొక్క మంగళకరమయిన భవిష్యత్తును తెలియజేయుచు ప్రజ్వలించెను. హనుమంతుని తండ్రియగు వాయుదేవుడును చల్లగ వీచెను.

## అగ్ని తన్ను బాధింపమికి హనుమ ఊహించుట

తోక కాలుచున్నను దాని వలన ఎట్టి తాపమును కలుగకుండుటచే ఆంజనేయుడు ఈ రీతిగ ఆలోచింపసాగెను. ఇంతగా మండుచున్న అగ్ని నాకు తాపము కలిగించుట లేదేమి? ఎట్టి బాధను

కలిగించుట లేదు. మంచువలె చల్లగ తోచుచున్నది. దీనికి రామచంద్రుని ప్రభావమే కారణమయి ఉండును. శ్రీరామచంద్రుని ప్రభావ విశేషముచేతనే సముద్రములో అట్టడుగున పడి ఉన్న మైనాకపర్వతము మీదకు వచ్చి నాకు ఆతిథ్యమీయగోరుట ఏమి? సముద్రుడు మైనాకుడు కూడ నన్ను ఆదరించుటకై సంభ్రమముతో చేసిన ప్రయత్నముకూడ రామ ప్రభావము చేతనే అయి ఉన్నది. సముద్రుడు మైనాకుడు ఇంత అనుకూలురై వర్తింపగా అగ్ని చల్లగా తోచుట విశేషమా? సీతాదేవి యొక్క దయచేత శ్రీరామచంద్రుని తేజోవిశేషముచేత మా తండ్రియగు వాయుదేవునితో అగ్నిదేవునికి ఉన్న స్నేహము చేత ఈ అగ్ని నన్ను దహించుట లేదు.

ఇంతలో ఆంజనేయుని మనస్సులో ఏదో సంకల్పము కలిగినది. ఆలోచించినాడు. ఒక నిర్ణయమునకు వచ్చినాడు. దేహమును బాగుగ తగ్గించి సూక్ష్మరూపమును ధరించినాడు. ఆతని బంధము లన్నియుజారిపడినవి. తిరిగి తన దేహమును పెంచినాడు. నగర బహిర్ద్వారమునకున్న పరిఘమును తీసికొనినాడు. ఆ పరిఘముతో ఆ ద్వారరక్షకులు అందరిని సంహరించినాడు. మరియొక పర్యాయము నగరపరిశీలనము కూడ చేయదలంచి ఆ మండుచున్న తోకతోడనే నగరములోనికి బయలుదేరెను. మండుచున్న తోకతో హనుమానుడు ఉదయకాలమందలి సూర్యుని వలె భాసించెను.



# 54. చతుఃపఞ్చాశ స్సర్గః

వీక్షమాణ స్తతో లఙ్కాం కపిః కృతమనోరథః,
వర్ధమాన సముత్సాహః కార్యశేష మచిన్తయత్. 1

కిన్ను ఖ ల్వవశిష్టం మే కర్తవ్య మిహ సాంప్రతమ్,
య దేషాం రక్షసాం భూయ స్సన్తాపజననం భవేత్. 2

వనం తావ త్ప్రమథితం ప్రకృష్టా రాక్షసా హతాః,
బలైకదేశః క్షపిత శ్శేషం దుర్గ వినాశనమ్. 3

దుర్గే వినాశితే కర్మ భవే త్సుఖపరిశ్రమమ్,
అల్పయత్నేన కార్యేఽస్మి న్మమ స్యా త్సఫల శ్శ్రమః. 4

యో హ్యయం మమ లాఙ్గూలే దీప్యతే హవ్యవాహనః,
అస్య సంతర్పణం న్యాయ్యం కర్తు మేభి ర్గృహోత్తమైః. 5

తతః ప్రదీప్తలాఙ్గూల స్సవిద్యుదివ తోయదః,
భవనాగ్రేషు లఙ్కాయా విచచార మహాకపిః. 6

గృహా ద్గృహం రాక్షసానా ముద్యానాని చ వానరః,
వీక్షమాణో హ్యసంత్రస్తః ప్రాసాదాంశ్చ చచార సః. 7

అవప్లుత్య మహావేగః ప్రహస్తస్య నివేశనమ్,
అగ్నిం తత్ర స నిక్షిప్య శ్వసనేన సమో బలీ. 8

తతోఽన్యత్పుప్లువే వేశ్మ మహాపార్శ్వస్య వీర్యవాన్,
ముమోచ హనుమా నగ్నిం కాలానలశిఖోపమమ్. 9

వజ్రదంష్ట్రస్య చ తదా పుప్లువే స మహాకపిః,
శుకస్య చ మహాతేజా స్సారణస్య చ ధీమతః. 10

తథా చేన్ద్రజితో వేశ్మ దదాహ హరియూథపః,
జమ్బుమాలే స్సుమాలేశ్చ దదాహ భవనం తతః. 11

రశ్మికేతో శ్చ భవనం సూర్యశత్రో స్తథైవ చ,
హ్రస్వకర్ణస్య దంష్ట్రస్య రోమశస్య చ రక్షసః. 12

యుద్ధోన్మత్తస్య మత్తస్య ధ్వజగ్రీవస్య రక్షసః,
విద్యుజ్జిహ్వస్య ఘోరస్య తథా హస్తిముఖస్య చ. 13

కరాళస్య పిశాచస్య శోణితాక్షస్య చైవ హి,
కుమ్భకర్ణస్య భవనం మకరాక్షస్య చైవ హి. 14

యజ్ఞశత్రోశ్చ భవనం బ్రహ్మశత్రో స్తథైవ చ,
నరాన్తకస్య కుమ్భస్య నికుమ్భస్య దురాత్మనః. 15

వర్జయిత్వా మహాతేజా విభీషణ గృహం ప్రతి,
క్రమమాణః క్రమేణైవ దదాహ హరిపుఙ్గవః. 16

తేషుతేషు మహార్హేషు భవనేషు మహాయశాః,
గృహే ష్వృద్ధిమతా మృద్ధిం దదాహ స మహాకపిః. 17

సర్వేషాం సమతిక్రమ్య రాక్షసేన్ద్రస్య వీర్యవాన్,
ఆససా దాథ లక్ష్మీవాన్ రావణస్య నివేశనమ్. 18

తత స్తస్మిన్గృహే ముఖ్యే నానారత్నవిభూషితే,
మేరుమన్దరసఙ్కాశే సర్వమఙ్గళశోభితే. 19

ప్రదీప్త మగ్ని ముత్సృజ్య లాఙ్గూలాగ్రే ప్రతిష్ఠితమ్,
ననాద హనుమా న్వీరో యుగాన్తజలదో యథా. 20

శ్వసనేన చ సంయోగా దతివేగో మహాబలః,
కాలాగ్ని రివ జజ్వాల ప్రావర్ధత హుతాశనః. 21

ప్రదీప్త మగ్నిం పవన స్తేషు వేశ్మ స్వచారయత్,
అభూ చ్ఛ్వసనసంయోగా దతివేగో హుతాశనః. 22

తాని కాఞ్చనజాలాని ముక్తామణిమయాని చ,
భవనా న్యవశీర్యన్త రత్నవన్తి మహాన్తి చ. 23

తాని భగ్నవిమానాని నిపేతు ర్వసుధాతలే,
భవనానీవ సిద్ధానా మమ్బరా త్పుణ్యసంక్షయే 24

సంజజ్ఞే తుముల శ్శబ్దో రాక్షసానాం ప్రధావతామ్,
స్వగృహస్య పరిత్రాణే భగ్నోత్సాహోర్జితశ్రియామ్. 25

నూన మేషోఽగ్ని రాయాతః కపిరూపేణ హా ఇతి,
క్రన్దన్త్య స్సహసా పేతు స్స్తనంధయధరాః స్త్రియః 26

కాశ్చి దగ్ని పరీతేభ్యో హర్మ్యేభ్యో ముక్తమూర్ధజాః,
పతన్త్యో రేజిరేఽభ్రేభ్య స్సౌదామిన్య ఇ వామ్బరాత్. 27

వజ్ర విద్రుమ వైడూర్య ముక్తా రజత సంహితాన్,
విచిత్రా న్భవనా న్ధాతూ న్స్యన్దమానా న్దదర్శ సః. 28

నాగ్ని స్తృప్యతి కాష్ఠానాం తృణానాం హరియూథపః,
నాగ్నే ర్నాపి విశస్తానాం రాక్షసానాం వసున్ధరా. 29

క్వచి త్కింశుక సఙ్కాశాః క్వచి చ్ఛాల్మలిసన్నిభాః,
క్వచి త్కుఙ్కుమసఙ్కాశా శ్శిఖా వహ్నే శ్చకాశిరే. 30

హనూమతా వేగవతా వానరేణ మహాత్మనా,
లఙ్కాపురం ప్రదగ్ధం త ద్రుద్రేణ త్రిపురం యథా. 31

తత స్తు లఙ్కాపుర పర్వతాగ్రే
సముత్థితో భీమ పరాక్రమోఽగ్నిః,
ప్రసార్య చూడావలయం ప్రదీప్తో
హనూమతా వేగవతా విసృష్టః. 32

యుగాన్తకాలానలతుల్యవేగ
స్సమారుతోఽగ్ని ర్వవృధే దివిస్పృక్,
విధూమరశ్మి ర్భవనేషు సక్తో
రక్షశ్శరీరాజ్యసమర్పితార్చిః. 33

ఆదిత్యకోటిసదృశ స్సుతేజా
లఙ్కాం సమస్తాం పరివార్య తిష్ఠన్,
శబ్దై రనేకై రశనిప్రరూఢై
ర్భిన్ద న్నివాణ్డం ప్రబభౌ మహాగ్నిః. 34

త త్రామ్బరా దగ్ని రతిప్రవృద్ధో
రూక్షప్రభః కింశుకపుష్పచూడః,

నిర్వాణ ధూమాకుల రాజయశ్చ
నీలోత్పలాభాః ప్రచకాశిరేఽభ్రాః. 35

వజ్రీ మహేన్ద్ర స్త్రిదశేశ్వరో వా
సాక్షా ద్యమో వా వరుణోఽనిలో వా,
రుద్రోఽగ్ని రర్కో ధనదశ్చ సోమో
న వానరోఽయం స్వయమేవ కాలః. 36

కిం బ్రహ్మణ స్సర్వపితామహస్య
సర్వస్య ధాతు శ్చతురాననస్య,
ఇహాఽగతో వానరరూపధారీ
రక్షోపసంహారకరః ప్రకోపః. 37

కిం వైష్ణవం వా కపిరూప మేత్య
రక్షో వినాశాయ పరం సుతేజః,
అనన్త మవ్యక్త మచిన్త్య మేకం
స్వమాయయా సాంప్రత మాగతం వా. 38

ఇత్యేవ మూచు ర్బహవో విశిష్టా
రక్షోగణా స్తత్ర సమేత్య సర్వే,
సప్రాణిసఙ్ఘాం సగృహాం సవృక్షామ్
దగ్ధాం పురీం తాం సహసా సమీక్ష్య. 39

తత స్తు లఙ్కా సహసా ప్రదగ్ధా
సరాక్షసా సాశ్వరథా సనాగా,
సపక్షిసంఘా సమృగా సవృక్షా
రురోద దీనా తుములం సశబ్దమ్. 40

హా తాత హా పుత్రక కాన్త మిత్ర
హా జీవితం భోగయుతం సుపుణ్యమ్,
రక్షోభి రేవం బహుధా బ్రువద్భి
శ్శబ్దః కృతో ఘోరతర స్సుభీమః. 41

హుతాశనజ్వాలసమావృతా సా
హతప్రవీరా పరివృత్తయోధా,
హనూమతః క్రోధబలాభిభూతా
బభూవ శాపోపహతేవ లఙ్కా. 42

స సంభ్రమత్రస్తవిషణ్ణరాక్షసాం
సముజ్జ్వలజ్జ్వాలహుతాశనాఙ్కితాం,
దదర్శ లఙ్కాం హనుమా న్మహామనాః
స్స్వయంభుకోపోపహతా మివావనిమ్. 43

భఙ్క్త్వా వనం పాదపరత్నసఙ్కులం
హత్వా తు రక్షాంసి మహాన్తి సంయుగే,
దగ్ధ్వా పురీం తాం గృహరత్నమాలినీం
తస్థౌ హనూమా న్పవనాత్మజః కపిః. 44

త్రికూటశృఙ్గాగ్రతలే విచిత్రే
ప్రతిష్ఠితో వానరరాజసింహః,
ప్రదీప్త లాఙ్గూలకృతార్చిమాలీ
వ్యరాజతాఽఽదిత్య ఇ వాంశుమాలీ. 45

సరాక్షసాం స్తా న్సుబహూంశ్చ హత్వా
వనం చ భఙ్క్త్వా బహుపాదపం తత్,

విసృజ్య రక్షోభవనేషు చాగ్నిం
జగామ రామం మనసా మహాత్మా. 46

తత స్తు తం వానరవీరముఖ్యం
మహాబలం మారుతతుల్యవేగమ్,
మహామతిం వాయుసుతం వరిష్ఠం
ప్రతుష్టువు ర్దేవగణాశ్చ సర్వే. 47

భఙ్క్త్వా వనం మహాతేజా హత్వా రక్షాంసి సంయుగే,
దగ్ధ్వా లఙ్కాపురీం రమ్యాం రరాజ స మహాకపిః. 48

తత్ర దేవా స్సగన్ధర్వా స్సిద్ధాశ్చ పరమర్షయః,
దృష్ట్వా లఙ్కాం ప్రదగ్ధాం తాం విస్మయం పరమం గతాః.
తం దృష్ట్వా వానరశ్రేష్ఠం హనుమన్తం మహాకపిమ్,
కాలాగ్ని రితి సఞ్చిన్త్య సర్వభూతాని తత్రసుః. 50

దేవాశ్చ సర్వే మునిపుఙ్గవాశ్చ
గన్ధర్వ విద్యాధర నాగయక్షాః,
భూతాని సర్వాణి మహాన్తి తత్ర
జగ్ముః పరాంప్రీతి మతుల్యరూపామ్. 51

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, వాల్మీకీయే,
చతుర్వింశత్సహస్రికాయాం, సంహితాయాం,
శ్రీమత్సున్దరకాణ్డే, చతుఃపఞ్చాశ స్సర్గః.

# 54వ సర్గము

## హనుమత్కృత లంకాదహనము

హనుమానుడు వచ్చిన పని నెరవేరినది. అతని ఉత్సాహము అంత కంతకు పెరుగుచున్నది. ఇక చేయవలసిన పని ఏమి? ఈ రాక్షసులకు ఇంకను పరితాపము కలిగింపవలసిన పని ఏదయిను చేయవలసి ఉన్నది.

అశోకవనము భగ్నము చేయబడినది. ప్రబలులయిన రాక్షసులు చంపబడిరి. రావణుని సేనలో కొంతభాగము నష్టమయినది. ఇక మిగిలినది దుర్గములను ధ్వంసము చేయుట. దుర్గములను ధ్వంసము చేసినచో నా పని పూర్తి అగును.

నాకు తాపము కలుగకుండ ప్రజ్వలించుచున్న ఈ తోక యందలి అగ్నిహోత్రమునకు సంతర్పణము చేయవలసి యున్నది. ఈ లంకా భవనములచే ఈ అగ్నిహోత్రునకు సంతర్పణము చేసెదను. తోకయందలి అగ్ని ప్రజ్వలించుచుండగా మెఱపులతో కూడిన మేఘము వలె అతడు కనబడుచుండెను. లంకలోని భవనముల పై భాగమున చేరి ఒక భవనము నుండి మరియొక భవనమునకు చేరుచు వారి వారి గృహోద్యానములకు చేరుచు, ఆ మండుచున్న తోకతోడనే విహరించెను. ఆ తరువాత ప్రహస్తుని భవనమునకు పోయి ఆ భవనమునకు నిప్పుపెట్టెను. తరువాత మహాపార్శ్వుడు, వజ్రదంష్ట్రుడు, కుంభకర్ణుడు మొదలగువారి ఇండ్లకు నిప్పుపెట్టెను. చివరకు అత్యున్నతమయిన నానారత్నములచే అలంకృతమయిన రావణ భవనమునకు పోయి దానికి కూడ నిప్పు పెట్టెను.

ఆ భవనములన్నియు మండుచుండగా ప్రళయకాలాగ్ని గుర్తునకు వచ్చుచుండెను. రావణుని గృహము తగుల బడుచుండగా చూచి

ఆంజనేయుడు చేసిన సింహనాదము ప్రళయ కాలమందు వచ్చిన మేఘధ్వనిని తలపించెను. కాలిన భవనములు నేల కూలినవి. చేసికొన్న పుణ్యము క్షీణించిన తరువాత నేలకూలిన సిద్ధ భవనములను తలంపునకు తెచ్చుచుండెను. కొంపలు కాలుచుండగా వానిని ఆర్పుటకు ఎవరికిని శక్యము కాకున్నది. రాక్షసులు భయముతో కాలిపడుచున్న భవనము నుండి, రాక్షస స్త్రీలందఱును ఒడిలో కూర్చుండి పాలుత్రాగుచున్న పసిబిడ్డలతోపాటుగా, రాక్షస స్త్రీలందరును, ముడివీడిన శిరోజములతో హాహాకారములు చేయుచు నేలకూలుచుండిరి. కాలిన భవనముల నుండి ముత్యములు, వైడూర్యములు, వెండి బంగారములు కాలి కాలి ద్రవరూపమును ధరించి ప్రవహించుచుండెను. అగ్ని కాష్ఠములతో తృప్తిపడదు. సింహము గడ్డితో తృప్తి పడదు. చచ్చి నేలపై పడిన రాక్షసులచే భూమియు తృప్తి పడుట లేదు. అగ్ని జ్వాలలు ఒకచోట మోదుగు పువ్వుల వలె మరియొక చోట బూరుగు పువ్వుల వలె మరియొక చోట కుంకుమ పువ్వుల వలె జ్వలించుచున్నవి.

### లంకాదహనమును గాంచినవారి యూహ

రుద్రుడు త్రిపుర దాహమొనర్చినట్లుగా వేగవంతుడయిన హనుమంతుడు ఈ లంకానగరమును దగ్ధమొనర్చినాడు. లంకాపుర పర్వతాగ్రమున ఉత్పన్నమయిన ఈ అగ్ని ఈ హనుమంతునిచే క్రిందికి పడవేయబడినది. ఆ అగ్ని ప్రళయ కాలాగ్ని వలె ప్రజ్వలించినది. కోటి సూర్యులు ఒక్కసారి ఉదయించినట్లుగా మహోష్ణమయిన జ్వాలలను చిమ్ముచు లంకాపట్టణ మంతయు దగ్ధము చేసినది. ఈ లంకను కాల్చిన వానరుడు సామాన్య వానరుడుగా తోచుట లేదు.

మహేంద్రుడో, యముడో, వరుణుడో, వాయుదేవుడో, రుద్రుడో, అగ్నిదేవుడో, కుబేరుడో అయియుండవచ్చు. సృష్టికర్త అయిన బ్రహ్మయే ఈ వానర రూపమున వచ్చి ఉండినను ఉండవచ్చు. లేక విష్ణువే ఈ రూపమున వచ్చెనో. ఆ విష్ణువే మాయా పరికల్పితమయిన వానర రూపమును ధరించి రాక్షస నాశనమునకై ప్రయత్నించి ఉండవచ్చును. పూర్తిగ దగ్ధమయిన లంకాపురమును చూచి ఆ రాక్షసులలోని కొంతమంది పెద్దలు పై రీతిగ ఊహింపసాగిరి.

లంకలోని అశ్వములు, రథములు, ఏనుగులు, పక్షులు, మృగ ములు, వృక్షములు అన్నియు దగ్ధమై పోయినవి. లంక అంతయు సాగరములో మునిగెను. తండ్రి కొరకు, బిడ్డల కొరకు, భర్త కొరకు ఏడ్చుచున్న వారి యొక్క అక్రందనములతో లంక అంతయు మారు మ్రోగుచుండెను. భగవంతుని కోపమునకు గుఱియై దగ్ధమయిన భూమివలె ఉండెను.

మంచి వృక్షములతో నిండిన అశోకవనమును భగ్న మొనరించి యుద్ధభూమిలో మహావీరులగు రాక్షసుల నెందరినో వధించి మహా భవనములతో కూడిన లంకను దహించి ఆ హనుమానుడు ఒక చోట నిలిచి ఉండెను. అప్పుడు ఆతడు త్రికూటశిఖరాగ్రమున నిలిచిన ఆదిత్యుని వలె ప్రకాశించెను. ఆంజనేయుని మనస్సు రామచంద్రుని గుఱించి రామచంద్రుని సన్నిధికి పోయెను. దేవతలు, గంధర్వులు, సిద్ధులు, ఇట్టి దేవయోని విశేషులు అందరును లంకాదహనమును చూచి ఆశ్చర్యపడిరి. లంకా దహనము చేసిన ఆంజనేయుని చూచి ప్రళయకాలాగ్ని అనుకొని భయపడసాగిరి. లంకా దహన వార్తను విని, చూచి దేవయోని విశేషులెందరో మిక్కిలి సంతోషించిరి.



# 55. పఞ్చపఞ్చాశ స్సర్గః

లఙ్కాం సమస్తాం సందీప్య లాఙ్గూలాగ్నిం మహాబలః,
నిర్వాపయామాస తదా సముద్రే హరిసత్తమః. 1

సందీప్యమానాం విధ్వస్తాం త్రస్తరక్షోగణాం పురీమ్,
అవేక్ష్య హనుమా౯ లఙ్కాం చిన్తయామాస వానరః. 2

త స్యాభూ త్సుమహాం త్రాసః కుత్సా చాఽఽత్మ న్యజాయత,
లఙ్కాం ప్రదహతా కర్మ కింస్వి త్కృత మిదం మయా.3

ధన్యా స్తే పురుషశ్రేష్ఠా యే బుద్ధ్వా కోప ముత్థితమ్,
నిరున్ధన్తి మహాత్మానో దీప్త మగ్ని మి వామ్భసా. 4

క్రుద్ధః పాపం న కుర్యా త్కః క్రుద్ధో హన్యా ద్గురూ నపి,
క్రుద్ధః పరుషయా వాచా నర స్సాధూ నధిక్షిపేత్. 5

వాచ్యావాచ్యం ప్రకుపితో న విజానాతి కర్హిచిత్,
నాకార్యమస్తి క్రుద్ధస్య నావాచ్యం విద్యతే క్వచిత్. 6

య స్సముత్పతితం క్రోధం క్షమయైవ నిరస్యతి,
య థోరగ స్త్వచం జీర్ణాం స వై పురుష ఉచ్యతే. 7

ధిగస్తు మాం సుదుర్బుద్ధిం నిర్లజ్జం పాపకృత్తమమ్,
అచిన్తయిత్వా తాం సీతా మగ్నిదం స్వామిఘాతుకమ్. 8

యది దగ్ధా త్వియం లఙ్కా నూన మార్యాఽపి జానకీ,
దగ్ధా తేన మయా భర్తు ర్హతం కార్య మజానతా. 9

యదర్థ మయ మారమ్భ స్తత్కార్య మవసాదితమ్,
మయా హి దహతా లఙ్కాం న సీతా పరిరక్షితా. 10

ఈషత్కార్య మిదం కార్యం కృత మాసీ న్నసంశయః,
తస్య క్రోధాభిభూతేన మయా మూలక్షయః కృతః. 11

వినష్టా జానకీ నూనం న హ్యదగ్ధః ప్రదృశ్యతే,
లఙ్కాయాం కశ్చి దుద్దేశ స్సర్వా భస్మీకృతా పురీ. 12

యది తద్విహతం కార్యం మమ ప్రజ్ఞావిపర్యయాత్,
ఇహైవప్రాణ సన్న్యాసో మమాపి హ్యద్య రోచతే. 13

కి మగ్నౌ నిపతా మ్యద్య అహోస్వి ద్బడబాముఖే,
శరీర మాహో సత్త్వానాం దద్మి సాగరవాసినామ్. 14

కథం హి జీవతా శక్యో మయా ద్రష్టుం హరీశ్వరః,
తౌ వా పురుషశార్దూలౌ కార్యసర్వస్వఘాతినా. 15

మయా ఖలు తదే వేదం రోషదోషా త్ప్రదర్శితమ్,
ప్రథితం త్రిషు లోకేషు కపిత్వ మనవస్థితమ్. 16

ధిగస్తు రాజసం భావ మనీశ మనవస్థితమ్,
ఈశ్వరేణాపి యద్రాగా న్మయా సీతా న రక్షితా. 17

వినష్టాయాం తు సీతాయాం తా వుభౌ వినశిష్యతః,
తయో ర్వినాశే సుగ్రీవ స్సబన్ధు ర్వినశిష్యతి. 18

ఏతదేవ వచ శ్శ్రుత్వా భరతో భ్రాతృవత్సలః,
ధర్మాత్మా సహశత్రుఘ్నః కథం శక్ష్యతి జీవితుమ్. 19

ఇక్ష్వాకువంశే ధర్మిష్ఠే గతే నాశ మసంశయమ్,
భవిష్యన్తి ప్రజా స్సర్వా శ్శోకసన్తాపపీడితాః. 20

త దహం భాగ్యరహితో లుప్తధర్మార్థసఙ్గ్రహః,
రోషదోషపరీతాత్మా వ్యక్తం లోకవినాశనః. 21

ఇతి చిన్తయత స్తస్య నిమిత్తా న్యుపపేదిరే,
పూర్వ మ ప్యుపలబ్ధాని సాక్షా త్పున రచిన్తయత్. 22

అథవా చారుసర్వాఙ్గీ రక్షితా స్వేన తేజసా,
న నశిష్యతి కల్యాణీ నాగ్ని రగ్నౌ ప్రవర్తతే. 23

న హి ధర్మాత్మన స్తస్య భార్యా మమితతేజసః,
స్వచారిత్రాభిగుప్తాం తాం స్ప్రష్టు మర్హతి పావకః. 24

నూనం రామప్రభావేన వైదేహ్యా స్సుకృతేన చ,
య న్మాం దహనకర్మాయం నాదహ ద్ధవ్యవాహనః. 25

త్రయాణాం భరతాదీనాం భ్రాతౄణాం దేవతా చ యా,
రామస్య చ మనఃకాన్తా సా కథం వినశిష్యతి. 26

యద్వా దహనకర్మాయం సర్వత్రప్రభు రవ్యయః,
న మే దహతా లాఙ్గూలం కథ మార్యాం ప్రధక్ష్యతి. 27

పున శ్చాఽఽచిన్తయ త్తత్ర హనుమా న్విస్మిత స్తదా,
హిరణ్యనాభస్య గిరే ర్జలమధ్యే ప్రదర్శనమ్. 28

తపసా సత్యవాక్యేన అనన్యత్వా చ్చ భర్తరి,
అపి సా నిర్దహే దగ్నిం న తా మగ్నిః ప్రధక్ష్యతి. 29

స తథా చిన్తయం స్తత్ర దేవ్యా ధర్మపరిగ్రహమ్,
శుశ్రావ హనుమా న్వాక్యం చారణానాం మహాత్మనామ్. 30

అహో ఖలు కృతం కర్మ దుష్కరం హి హనూమతా,
అగ్నిం విసృజతాఽభీక్ష్ణం భీమం రాక్షసవేశ్మని. 31

ప్రపలాయిత రక్షఃస్త్రీ బాలవృద్ధసమాకులా,
జనకోలాహలాధ్మాతా క్రన్దన్తీ వాద్రికన్దరే. 32

ద గ్ధేయం నగరీ సర్వా సాట్టప్రాకారతోరణా,
జానకీ న చ దగ్ధేతి విస్మయోఽద్భుత ఏవ నః. 33

స నిమిత్తైశ్చ దృష్టార్థైః కారణైశ్చ మహాగుణైః,
ఋషివాక్యైశ్చ హనుమా నభవ ప్రీతమానసః. 34

తతః కపిః ప్రాప్త మనోరథార్థ
స్తా మక్షతాం రాజసుతాం విదిత్వా,
ప్రత్యక్షత స్తాం పునరేవ దృష్ట్వా
ప్రతిప్రయాణాయ మతిం చకార. 35

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, వాల్మీకీయే,
చతుర్వింశత్సహస్రికాయాం, సంహితాయాం,
శ్రీమత్సున్దరకాణ్డే, పఞ్చపఞ్చాశ స్సర్గః.

## 55వ సర్గము

### లంకాదహనము చేసినందులకు హనుమ పశ్చాత్తాప పడుట

హనుమానుడు లంకానగర మంతయు కాల్చివేసిన తరువాత తన తోకను సముద్రములో ముంచి అగ్నిని చల్లార్చెను. లంక అంతయు తగులపడిపోయిన తరువాత లంకాదహనముచే రాక్షసులందరు భయపడుచుండగా పరిశీలనగా చూచిన ఆంజనేయునకు ఒక ఆలోచన కల్గెను. అతనికి గొప్ప భయము కలిగెను. ముందు వెనుకలు చూడక అకృత్యమాచరించిన తన్ను తానే నిందించుకొనెను. ఈ లంకను దహించుచు ఎంతటి అకృత్యమును చేసితిని. తమకు కలిగిన కోపమును నిగ్రహించుకొనవలసి ఉన్నది.

క్రోధము కలిగిన మనుష్యుడు పాపములు చేయును. గురువులను కూడ హింసించును. పరుషమయిన వాక్యములతో సాధుజనులను నిందించుచుండును. కోపము కలిగిన వాడు ఎప్పుడును ఈ మాటలు అనవచ్చునా అనకూడదా అని ఆలోచింపడు. కోపము కలిగిన వానికి చేయగూడని పని ఉండదు అనరానిమాట ఉండదు.

తనకు కలిగిన కోపమును పాము కుబుసమును విడిచినట్లుగా ఓరిమిచే నిగ్రహింపవలసి ఉండును. అట్టి వానిని సత్పురుషునిగా

భావింపదగును. నా దుర్బుద్ధి ఎంత తీవ్రమయినది. సిగ్గులేక మహాపాపి వలె సీతాదేవి విషయమును ఆలోచింపక ఈ లంకకు నిప్పుపెట్టితినే! స్వామి కార్యమును ఎంతగ పాడు చేసితిని! ఈ లంక అంతయు దగ్ధ మైనచో సీతాదేవి మాత్రము కాలిపోకుండ ఉండునా. ప్రభుకార్యము నాకోపము చేత ఎంతగ పాడయినదో! ప్రభుకార్యము దాదాపుగ పూర్తి అగు సమయమున విధ్వస్తమయినది. దగ్ధము కాని ప్రదేశము కానవచ్చుట లేదు. నా యొక్క బుద్ధిహీనత చేత నా ప్రభుకార్యము విహతమయినచో నేను ఇచటనే ప్రాణములు విడుచుట మంచిది. ఈ అగ్నిలో పడి కాలిపోవుదునా లేదా బడబాగ్నిలో పడిపోవుదునా. ప్రాణములతో ఉండి వానరేంద్రుని దర్శించుటకు నాకు అర్హత కలదా! చేసిన పని అంతయు ధ్వంసము చేసిన నేను రామలక్ష్మణులకు ఎట్లు ముఖము చూపింపగలను? వానరజాతి బుద్ధి అనవస్థితమను నిందను నా చేష్టచే నేను నిరూపించితిని. ఈ రాజసభావము శాసించువాడు లేక అవ్యవస్థితమయినది.

వారించుకొనగలిగిన శక్తి గలవాడనైనను సీతాదేవిని రక్షింపలేక పోయితిని. సీత కనబడకపోయినచో రామలక్ష్మణులు బ్రదుకరు. రామలక్ష్మణులు లేనిచో సుగ్రీవుడు బ్రదుకడు. సుగ్రీవుడు లేనిచో బంధువులు ఉండరు. ఈ వార్త తెలిసినచో అన్నయందు గొప్ప ప్రేమాభిమానములు గల భరతుడు ఉండడు. భరతుడు లేనిచో శత్రుఘ్నుడు ఉండడు. ధర్మిష్ఠమయిన ఇక్ష్వాకు వంశము నష్టమయినచో కోసల దేశవాసులును ఉండరు. నేను అదృష్ట హీనుడను. ధర్మార్థఫలములను పోగొట్టుకొంటిని. రోషదోషములు

రెండును నాయందు విపరీతముగా పెరిగి ఉన్నవి. ఈ మానవ లోకమునకు ఎంతటి అనర్థము కల్గించితిని?

**సీతా నిరపాయమై యుండునని హనుమ భావించుట**

ఈ ప్రకారముగా హనుమానుడు తలంచుచుండగనే కొన్ని శుభనిమిత్తములు తోచుచుండెను. ఇది వరకే తోచిన వానిని గురించి ఆలోచించెను. ఏ సాముద్రిక లక్షణము లేక సర్వాంగసుందరి అయిన ఆ సీత తన తేజస్సు చేతనే రక్షింపబడి ఉండును. ఇన్ని కళ్యాణ లక్షణములు కలిగిన ఆ సీత ఆపద చెందదు. ఒక అగ్ని మరియొక అగ్నిని ఏమియును చేయలేదు. ధర్మాత్ముడు మహాతేజస్వి అగు రామచంద్రుని భార్య అగు సీత తన సచ్చరిత్రచే తానే రక్షింపబడగలదు. ఆమెను అగ్ని స్పృశింపజాలదు. రామచంద్రుని ప్రభావముచేత సీతాదేవి సుకృతముచేత నన్ను కూడ అగ్నిహోత్రుడు ఏమియు చేయలేక పోయినాడు. భరతాది రామసోదరులచే దేవతామూర్తిగ ఆరాధింపబడు రామచంద్రుని ధర్మపత్ని యగు సీతను ఈ అగ్నిహోత్రుడు ఏమి చేయగలడు? దహించుటయే స్వభావముగా కలిగిన ఈ అగ్నిహోత్రుడు సర్వత్ర దహింపగలవాడు. సీతారాములచే అనుగృహీతుడయిన నన్నే కాల్పలేకపోయెను. అందరిచే పూజ్యురాలగు సీతనేమి చేయగలడు. మైనాకుడు నన్ను ఆదరింపబూనుట సీతాదేవి యందు గౌరవము చేతనే. ఆమె తపస్సుచేత ఆమె సత్యవచనము చేత ఆమె పాతివ్రత్యముచేత సర్వత్రనాకును అనుకూల్యము లభించినది. సీతాదేవి అగ్నిని కాల్పగలదే కాని అగ్ని ఆమెను కాల్పలేదు.

## చారణుల ఆశ్చర్యము

ఈవిధముగా సీతాదేవి యొక్క ధర్మాచారఫలమును అనుసరించి ఆలోచించుచుండగనే మహాత్ములగు చారణుల మాటలు హనుమంతునకు వినబడెను. రాక్షస గృహములందు నిప్పుపెట్టి ఎంత దుష్కరమయిన పని చేసినాడు! లంక కాలుచుండగా రాక్షస స్త్రీలు, బాలుర్రు, వృద్ధులు తమ ఇల్లు వాకిళ్ళు విడిచి పరుగులు పెట్టిరి. జనకోలాహలము పెరిగినది. ప్రాకారములతో తోరణములతో నగరమంతయు దెబ్బతిన్నది. కేవలము సీతాదేవికి మాత్రము ఏ ఆపద కలుగలేదు. అనగా ఆశ్చర్యకరముగ ఉన్నది. సార్థకమయిన అనేక నిమిత్తములచేత సీతాదేవి యొక్క అనేక గుణముల చేత చారణుల మాటల చేత సీతాదేవి క్షేమమును తలంచుకొని ఆంజనేయుడు మిక్కిలి సంతోషించెను. తరువాత ఆంజనేయుడు తాను స్వయముగ వెళ్ళి సీతాదేవిని సేవించుకొని లంకను విడిచి శ్రీరామ సుగ్రీవుల సన్నిధికి చేరుటకై నిశ్చయించుకొనెను.



# 56. షట్పఞ్చాశ స్సర్గః

తత స్తు శింశుపామూలే జానకీం పర్యుపస్థితామ్,
అభివాద్యాఽబ్రవీ ద్దిష్ట్యా పశ్యామి త్వా మి హాక్షతమ్. 1

తత స్తం ప్రస్థితం సీతా వీక్షమాణా పునః పునః,
భర్తృ స్నేహాన్వితం వాక్యం హనుమన్త మభాషత. 2

కామ మస్య త్వ మే వైకః కార్యస్యపరిసాధనే,
పర్యాప్తః పరవీరఘ్న యశస్య స్తే బలోదయః. 3

శరై స్తు సఙ్కులాం కృత్వా లఙ్కాం పరబలార్దనః,
మాం నయే ద్యది కాకుత్స్థ స్తత్తస్య సదృశం భవేత్. 4

త ద్యథా తస్య విక్రాన్త మనురూపం మహాత్మనః,
భవ త్యాహవశూరస్య తథా త్వ ముపపాదయ. 5

తదర్థోపహితం వాక్యం ప్రశ్రితం హేతుసంహితమ్,
నిశమ్య హనుమాం స్తస్యా వాక్య ముత్తర మబ్రవీత్. 6

క్షిప్ర మేష్యతి కాకుత్స్థో హర్యృక్షప్రవరై ర్వృతః,
యస్తే యుధి విజి త్యారీ న్శోకం వ్యపనయిష్యతి. 7

ఏవ మాశ్వాస్య వైదేహీం హనుమా న్మారుతాత్మజః,
గమనాయ మతిం కృత్వా వైదేహీ మభ్యవాదయత్. 8

తత స్స కపిశార్దూల స్స్వామి సన్దర్శనోత్సుకః,
ఆరురోహ గిరిశ్రేష్ఠ మరిష్ట మరిమర్దనః. 9

తుఙ్గపద్మకజుష్టాభి ర్నీలాభి ర్వనరాజిభిః,
సోత్తరీయ మి వామ్భోదై శృఙ్గాన్తరవిలమ్బిభిః. 10

బోధ్యమాన మివ ప్రీత్యా దివాకరకరై శ్శుభైః,
ఉన్మిషన్త మి వోద్ధూతై ర్లోచనై రివ ధాతుభిః. 11

తోయౌఘనిస్స్వనై ర్మన్ద్రైః ప్రాధీతమివ పర్వతమ్,
ప్రగీతమివ విస్పష్టై ర్నానాప్రస్రవణస్వనైః. 12

దేవదారుభి రత్యుచ్చై రూర్ధ్వబాహు మివ స్థితమ్,
ప్రపాతజలనిర్ఘోషైః ప్రాక్రుష్ట మివ సర్వతః. 13

వేపమానమివ శ్యామైః కమ్పమానై శ్శరద్వనైః,
వేణుభి ర్మారుతోద్ధూతైః కూజన్త మివ కీచకైః. 14

నిశ్శ్వసన్త మి వామర్షా ద్ఘోరై రాశీవిషోత్తమైః,
నీహారకృతగమ్భీరై ర్ధ్యాయన్త మివ గహ్వరైః. 15

మేఘపాదనిభైః పాదైః ప్రక్రాన్త మివ సర్వతః,
జృమ్భమాణ మివాఽఽకాశే శిఖరై రభ్రమాలిభిః. 16

కూటైశ్చ బహుధా కీర్ణై శ్శోభితం బహుకన్దరైః,
సాలతాలాశ్వకర్ణైశ్చ వంశైశ్చ బహుభిర్వృతమ్. 17

లతావితానై ర్వితతైః పుష్పవద్భి రలఙ్కృతమ్,
నానామృగగణాకీర్ణం ధాతునిష్యన్దభూషితమ్. 18

బహుప్రస్రవణోపేతం శిలాసఞ్చయసఙ్కటమ్,
మహర్షియక్షగన్ధర్వకిన్నరోరగసేవితమ్. 19

లతాపాదపసఞ్ఛాతం సింహాధ్యుషితకన్దరమ్,
వ్యాఘ్రసఙ్ఘ సమాకీర్ణం స్వాదుమూలఫలద్రుమమ్. 20

త మారురోహ హనుమా న్పర్వతం పవనాత్మజః,
రామదర్శనశీఘ్రేణ ప్రహర్షే ణాభిచోదితః. 21

తేన పాదతలాక్రాన్తా రమ్యేషు గిరిసానుషు,
సఘోషా స్సమశీర్యన్త శిలా శ్చూర్ణీకృతా స్తతః. 22

స త మారుహ్య శైలేన్ద్రం వ్యవర్ధత మహాకపిః,
దక్షిణా దుత్తరం పారం ప్రార్థయ న్లవణామ్భసః. 23

అధిరుహ్య తతో వీరః పర్వతం పవనాత్మజః,
దదర్శ సాగరం భీమం మీనోరగనిషేవితమ్. 24

స మారుత ఇవాఽఽకాశం మారుత స్యాఽఽత్మసమ్భవః,
ప్రపేదే హరిశార్దూలో దక్షిణా దుత్తరాం దిశమ్. 25

స తదా పీడిత స్తేన కపినా పర్వతోత్తమః,
రరాస సహ తై ర్భూతైః ప్రవిశ న్వసుధాతలమ్. 26

కమ్పమానైశ్చ శిఖరైః పతద్భి రపి చ ద్రుమైః,
త స్యోరువేగోన్మథితాః పాదపాః పుష్పశాలిన-
నిపేతు ర్భూతలే రుగ్ణా శ్శక్రాయుధ[illegible] 27

కన్దరాన్తర సంస్థానాం పీడితానాం మహౌజసామ్
సింహానాం నినదో భీమో నభో భిన్ద న్స శు[illegible]నే. 28

త్రస్తవ్యావృత్తవసనా వ్యాకులీకృతభూషణాః,
విద్యాధర్య స్సముత్పేతుః సహసా ధరణీధరాత్. 29

అతిప్రమాణా బలినో దీప్తజిహ్వామహావిషాః,
నిపీడితశిరోగ్రీవా వ్యచేష్టన్త మహాహయః. 30

కిన్నరోరగగన్ధర్వయక్షవిద్యాధరా స్తదా,
పీడితం తం నగవరం త్యక్త్వా గగన మాస్థితాః. 31

స చ భూమిధర శ్శ్రీమా న్బలినా తేన పీడితః,
స వృక్షశిఖరోదగ్రః ప్రవివేశ రసాతలమ్. 32

దశయోజనవిస్తార స్త్రింశద్యోజన ముచ్ఛ్రితః,
ధరణ్యాం సమతాం యాతః స బభూవ ధరాధరః. 33

స లిలఙ్ఘయిషు ర్భీమం సలిలం లవణార్ణవమ్,
కల్లోలస్ఫాలవేలాన్త ముత్పపాత నభో హరిః. 34

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, వాల్మీకీయే,
చతుర్వింశత్సహస్రికాయాం, సంహితాయాం,
శ్రీమత్సున్దరకాణ్డే, షట్పఞ్చాశ సర్గః.

# 56వ సర్గము

## సీత హనుమనభినందించుట

శింశుపావృక్షము మొదటనున్న సీతాదేవి సన్నిధికి పోయి నమస్కరించి ఈ లంకాదహన కాలమున అదృష్టవశమున క్షేమముగా ఉన్న నిన్ను చూడగలిగినాడను. తరువాత లంకనుండి వెడలిపోవుటకు సంసిద్ధుడయిన ఆంజనేయునితో సీత రాముని యందలి ప్రేమను వ్యక్తము చేయు మాటలను పలికెను.

ఆంజనేయా! నీవు ఒక్కడవే ఈ కార్యసాధనకు సమర్థుడవుగా కనబడుచున్నావు. శత్రువులను సంహరించి నీవు సాధించిన కార్యసాఫల్యము అందరిచే శ్లాఘింపబడినది. సర్వదా శత్రువులకు పరాజయము కలిగించి విజయము గాంచెడి రామచంద్రుడు తన బాణములచే లంకను వ్యాకుల పఱిచి నన్ను అయోధ్యానగరమునకు తీసికొని పోయినచో అది అతనికి తగినదై యుండును. ఆహవశూరుడయిన శ్రీరామునకు ఏమి కర్తవ్యమో దానిని సహేతుకముగా సూచింపుము. అర్థవంతము, సహేతుకము అయిన ఆ సీతాదేవి మాటలను విని ఆమెకు ఇటుల సమాధానము చెప్పెను.

శ్రీరాముడు తొందరలో ఋక్ష వానర సేనాధిపతులతో వచ్చి శత్రువులను జయించి నీ శోకమును పోగొట్టగలడు. ఈ ప్రకారముగా సీతను ఊరడించి హనుమంతుడు నమస్కరించెను.

## అరిష్ట పర్వత వర్ణన

ఆంజనేయుడు శ్రీరాముని దర్శించుటకై కుతూహలము పెరుగగా సముద్రమును దాటిపోవుటకై అరిష్టమను పర్వతమును ఆరోహించెను. అత్యున్నతమయిన పద్మక వనముల పంక్తులతో ఆపర్వతము కూడి

ఉండెను. శిఖరములను అంటిపెట్టుకొని ఉన్న మేఘములచే ఆ పర్వతరాజు ఉత్తరీయము ధరించినట్లు ఉండెను. సూర్యకిరణములచే మేల్కొనబడుచు గైరికాది ధాతువులచే కన్నులు తెఱచి చూచుచున్నట్లు ఉండి సెలయేఱులు ప్రవహించుచు చేయు ధ్వనులచే వేదాధ్యయనము చేయుచున్న వానివలె ఉండెను.

కొండ నుండి దిగజారుచున్న చిన్న కాలువల మధురధ్వనులచే పాడుచున్నట్లు ఉండెను. అత్యున్నతమైన దేవదారు వృక్షములచే చేతులెత్తినట్లు ఉండెను. జలపాతముల గంభీర ధ్వనులచే గాలిచే పూరింపబడి బొంగు వెదుళ్ళు ధ్వని చేయుచుండగా ఆ పర్వత రాజే కూజితము లొనరించుచున్నట్లుండెను.

మహాసర్పములు బుసలు కొట్టుచుండగా నిట్టూర్పులు విడుచు చున్నట్లుండెను. మంచుతో నిండిన గుహలచే ధ్యానమొనరించు చున్నట్లుండెను. ప్రత్యంత పర్వతములచే ముందునకు పోవుటకై అడుగులు చాచుచున్నట్లుండెను.

మేఘములచే ఆవరింపబడిన శిఖరములచే నిద్రానంతరము ఒడలు విఱుచుకొనుచున్నట్లుండెను. ఎన్నియో శిఖరములతో ఎన్నియో గుహలతో ఆ పర్వతము ప్రకాశమానమై ఉండెను. ఎన్నియో వృక్షములు అచట విస్తరించి ఉండెను. చక్కగ పుష్పించిన పుష్పముల చేత అలంకృతమై ఉండెను. ఎన్నియో మృగముల గుంపులు గుంపులుగా ఉన్నవి. గైరికాది ధాతువులచే భూషితమై ఉండెను.

ఎన్నియో కొండకాలువలు అందు ప్రవహించుచున్నవి. మహర్షులు, యక్షులు. గంధర్వులు ఆ పర్వతమును సేవించుచుండిరి. ఎన్నియో తీగలు ఆ చెట్లను ఆధారముగ గొని విస్తరించుచున్నవి.

ఆ గుహలలో సింహములు నివసించుచున్నవి. పెద్దపులులు గుంపులుగుంపులుగా తిరుగుచున్నవి. మధురమైన ఫలములు వేళ్ళు కలిగిన చెట్లు ఎన్నియో అచ్చట ఉన్నవి.

**హనుమ ఒత్తిడిచే పర్వతము క్రుంగుట**

తొందరగా పోయి శ్రీరామచంద్రుని కానవలెనన్న కోరికతో మహానందముతో వాయునందనుడు ఆ పర్వతము ఆరోహించెను. దక్షిణ దిక్కు నుండి ఉత్తర దిక్కునకు పోవుటకై సంకల్పించుకొనెను.

హనుమానుని పాదముల ఒత్తిడికి ఆ పర్వతము పెద్దగ ధ్వని చేసెను. పర్వత సానువులు చూర్ణీకృతములైనవి. పర్వతమును ఆరోహించి తన దేహమును మిక్కిలి పెంచెను. దక్షిణ తీరము నుండి ఉత్తర తీరము చేరుటకై పర్వతము యొక్క అత్యున్నత ప్రదేశమునకు హనుమానుడు చేరెను. పర్వతము భూమిలోనికి క్రుంగిపోయెను. అతని ఊరువేగమునకు చెట్లు మొదళ్ళు తెగి నేలపై వాలినవి. అంతకు పూర్వము గుహలలో నివసించుచున్న సింహములు తమ సింహనాదముచే ఆకాశమును బ్రద్దలు చేయుచు బయటకు వచ్చినవి. విద్యాధర స్త్రీలు కొండను విడిచి బయటకు పోయిరి. బలవంతములయిన అతిదీర్ఘములయిన మహాసర్పములు తలలు, మెడలు బయటకువచ్చి చుట్టలు చుట్టుకొని పడి ఉన్నవి. దేవయోనివిశేషులు కొందరు ఆ పర్వతమును విడిచి ఆకాశములోనికి ఎగిరిపోయిరి.

హనుమానుని దేహభారమును సహింపలేక ఆపర్వతము రసాతలపర్యంతము క్రుంగిపోయెను. హనుమానుడు సముద్రమును దాటుటకై ఆకాశములోనికి ఎగిరెను.



# 57. సప్తపఞ్చాశ స్సర్గః

సచన్ద్రకుముదం రమ్యం సార్కకారణ్డవం శుభమ్,
తిష్యశ్రవణకాదమ్బ మభ్రశైవాలశాద్వలమ్. 1

పునర్వసుమహామీనం లోహితాఙ్గమహాగ్రహమ్,
ఐరావతమహాద్వీపం స్వాతిహంసవిలోళితమ్. 2

వాతసఙ్ఘాతజాతోర్మి చన్ద్రాంశుశిశిరామ్బుమత్,
భుజఙ్గయక్షగన్ధర్వ ప్రబుద్ధకమలోత్పలమ్. 3

హనుమా న్మారుతగతి ర్మహానౌ రివ సాగరమ్,
అపార మపరిశ్రాన్తః పుప్లువే గగనార్ణవమ్. 4

గ్రసమాన ఇవాకాశం తారాధిప మివోల్లిఖన్,
హరన్నివ సనక్షత్రం గగనం సార్కమణ్డలమ్. 5

మారుత స్యాత్మజ శ్శ్రీమా న్కపి ర్వ్యోమచరో మహాన్,
హనుమా న్మేఘజాలాని వికర్షన్నివ గచ్ఛతి. 6

పాణ్డురారుణవర్ణాని నీలమాఞ్జిష్ఠకాని చ,
హరితారుణవర్ణాని మహాభ్రాణి చకాశిరే. 7

ప్రవిశన్నభ్రజాలాని నిష్పతం శ్చ పునః పునః,
ప్రచ్ఛన్నశ్చ ప్రకాశశ్చ చన్ద్రమా ఇవ లక్ష్యతే. 8

వివిధాభ్రఘనాపన్న గోచరో ధవళామ్బరః,
దృశ్యాదృశ్యతను ర్వీర స్తదా చన్ద్రాయతేఽమ్బరే. 9

తా ర్క్ష్యాయమాణో గగనే బభాసే వాయునన్దనః,
దారయ న్మేఘబృన్దాని నిష్పతంశ్చ పునః పునః. 10

నద న్నాదేన మహతా మేఘస్వనమహాస్వనః,
ప్రవరా న్రాక్షసా న్హత్వా నామ విశ్రావ్య చాత్మనః. 11

ఆకులాం నగరీం కృత్వా వ్యథయిత్వా చ రావణమ్,
అర్దయిత్వా బలం ఘోరం వైదేహీ మభివాద్య చ. 12

ఆజగామ మహాతేజాః పున ర్మధ్యేన సాగరమ్,
పర్వతేన్ద్రం సునాభం చ సముపస్పృశ్య వీర్యవా న్. 13

జ్యాముక్త ఇవ నారాచో మహావేగోఽభ్యుపాగతః.
స కిఞ్చి దనుసంప్రాప్తః సమాలోక్య మహాగిరిమ్. 14

మహేన్ద్రం మేఘసఙ్కాశం ననాద హరిపుఙ్గవః,
స పూరయామాస కపి ర్దిశో దశ సమన్తతః. 15

నదన్నాదేన మహతా మేఘస్వనమహాస్వనః,
స తం దేశ మనుప్రాప్తః సుహృద్దర్శనలాలసః. 16

ననాద హరిశార్దూలో లాఙ్గూలం చా ప్యకమ్పయత్,
తస్య నానద్యమానస్య సుపర్ణచరితే పథి. 17

ఫలతీ వాస్యఘోషేణ గగనం సార్కమణ్డలమ్,
యే తు తత్రోత్తరే తీరే సముద్రస్య మహాబలాః. 18

పూర్వం సంవిష్ఠితా శ్శూరా వాయుపుత్రదిదృక్షవః,
మహతో వాతనున్నస్య తోయదస్యేవ గర్జితమ్. 19

శుశ్రువు స్తే తదా ఘోష మూరువేగం హనూమతః,
తే దీనమనస స్సర్వే శుశ్రువుః కాననౌకసః. 20

వానరేన్ద్రస్య నిర్ఘోషం పర్జన్యనినదోపమమ్,
నిశమ్య నదతో నాదం వానరా స్తే సమన్తతః. 21

బభూవు రుత్సుకా స్సర్వే సుహృద్దర్శనకాఙ్క్షిణః,
జామ్బవా న్స హరిశ్రేష్ఠః ప్రీతిసంహృష్టమానసః. 22

ఉపామన్త్ర్య హరీ న్సర్వా నిదం వచన మబ్రవీత్,
సర్వథా కృతకార్యోఽసౌ హనూమా న్నాత్ర సంశయః. 23

న హ్యస్యాఽకృతకార్యస్య నాద ఏవం విధో భవేత్,
తస్య బాహూరువేగం చ నినాదం చ మహాత్మనః. 24

నిశమ్య హరయో హృష్టాః సముత్పేతు స్తతస్తతః,
తే నగాగ్రా న్నగాగ్రాణి శిఖరా చ్ఛిఖరాణి చ. 25

ప్రహృష్టా స్సమపద్యన్త హనూమన్తం దిదృక్షవః,
తే ప్రీతాః పాదపాగ్రేషు గృహ్య శాఖా స్సుపుష్పితాః. 26

వాసాంసీవ ప్రశాఖాశ్చ సమావిధ్యన్త వానరాః,
గిరిగహ్వరసంలీనో యథా గర్జతి మారుతః. 27

ఏవం జగర్జ బలవాన్ హనుమా న్మారుతాత్మజః,
త మభ్రఘనసఙ్కాశ మాపతన్తం మహాకపిమ్. 28

దృష్ట్వా తే వానరా స్సర్వే తస్థుః ప్రాఞ్జలయ స్తదా,
తత స్తు వేగవాం స్తస్య గిరే ర్గిరినిభః కపిః. 29

నిపపాత మహేన్ద్రస్య శిఖరే పాదపాకులే,
హర్షే ణాపూర్యమాణోఽసౌ రమ్యే పర్వతనిర్ఝరే. 30

ఛిన్నపక్ష ఇ వాఽకాశా త్పపాత ధరణీధరః,
తత స్తే ప్రీతమనసః సర్వే వానరపుఙ్గవాః. 31

హనుమన్తం మహాత్మానం పరివార్యోపతస్థిరే,
పరివార్య చ తే సర్వే పరాం ప్రీతి ముపాగతాః. 32

ప్రహృష్టవదనా స్సర్వే త మరోగ ముపాగతమ్,
ఉపాయనాని చాదాయ మూలానిచ ఫలానిచ. 33

ప్రత్యర్చయ న్హరిశ్రేష్ఠం హరయో మారుతాత్మజమ్,
హనుమాంస్తు గురూ న్వృద్ధా న్జామ్బవత్ప్రముఖాం స్తదా. 34

కుమార మఙ్గదం చైవ సోఽవన్దత మహాకపిః,
స తాభ్యాం పూజితః పూజ్యః కపిభిశ్చ ప్రసాదితః. 35

దృష్టా సీ తేతి విక్రాన్త స్సంక్షేపేణ న్యవేదయత్,
నిషసాద చ హస్తేన గృహీత్వా వాలిన స్సుతమ్. 36

రమణీయే వనోద్దేశే మహేన్ద్రస్య గిరే స్తదా,
హనుమా నబ్రవీ ద్హృష్ట స్తదా తా న్వానరర్షభాన్. 37

అశోకవనికాసంస్థా దృష్టా సా జనకాత్మజా,
రక్ష్యమాణా సుఘోరాభీ రాక్షసీభి రనిన్దితా. 38

ఏకవేణీ ధరా బాలా రామదర్శనలాలసా,
ఉపవాసపరిశ్రాన్తా జటిలా మలినా కృశా. 39

తతో దృష్టేతి వచనం మహార్థ మమృతోపమమ్,
నిశమ్య మారుతే స్సర్వే ముదితా వానరా భవన్. 40

క్ష్వేళ న్త్యన్యే నద న్త్యన్యే గర్జ న్త్యన్యే మహాబలాః,
చక్రుః కిలికిలా మన్యే ప్రతిగర్జన్తి చాఽపరే. 41

కేచి దుచ్ఛ్రిత లాఙ్గూలాః ప్రహృష్టాః కపికుఞ్జరాః,
అఞ్చితాయతదీర్ఘాణి లాఙ్గూలాని ప్రవివ్యధుః. 42

అపరే చ హనూమన్తం వానరా వారణోపమమ్,
ఆప్లుత్య గిరిశృఙ్గేభ్య స్సంస్పృశన్తిస్మ హర్షితాః. 43

ఉక్తవాక్యం హనూమన్త మఙ్గద స్త మ థాబ్రవీత్,
సర్వేషాం హరివీరాణాం మధ్యే వచన ముత్తమమ్. 44

సత్త్వే వీర్యే న తే కశ్చి త్సమో వానర విద్యతే,
య దవప్లుత్య విస్తీర్ణం సాగరం పున రాగతః. 45

అహో స్వామిని తే భక్తి రహో వీర్య మహో ధృతిః,
దిష్ట్యా దృష్టా త్వయా దేవీ రామపత్నీ యశస్వినీ. 46

దిష్ట్యా త్యక్ష్యతి కాకుత్స్థ శ్శోకం సీతావియోగజమ్,
తతోఽఙ్గదం హనూమన్తం జామ్బవన్తం చ వానరాః. 47

పరివార్య ప్రముదితా భేజిరే విపులా శ్శిలాః,
శ్రోతుకామా స్సముద్రస్య లఙ్ఘనం వానరోత్తమాః. 48

దర్శనం చాపి లజ్జాయా స్సీతాయా రావణస్య చ,
తస్థుః ప్రాఞ్జలయ స్సర్వే హనుమద్వదనోన్ముఖాః. 49

తస్థౌ తత్రాఙ్గద శ్శ్రీమా న్వానరై ర్బహుభి ర్వృతః,
ఉపాస్యమానో విబుధై ర్దివి దేవపతి ర్యథా. 50

హనూమతా కీర్తిమతా యశస్వినా
త థాఙ్గదే నాఙ్గదబద్ధబాహునా,
ముదా తదాఽధ్యాసిత మున్నతం మహ
న్మహీధరాగ్రం జ్వలితం శ్రియాఽభవత్. 51

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, వాల్మీకీయే,
చతుర్వింశత్సహస్రికాయాం, సంహితాయాం,
శ్రీమత్సున్దరకాణ్డే, సప్తపఞ్చాశ స్సర్గః.

శ్లో. సుగ్రీవసఖ్య మారభ్య యావద్వాలి నిషూదనమ్,
శ్రుత్వా విజయ మాప్నోతి ముచ్యతే జారదోషతః.

శ్లో. దణ్డాదన్యం నపశ్యామీ త్యత్రైకాదశ మక్షరమ్,
శ్రుత్వామర్త్య స్స్వప్రకాశో లక్ష్మీలోక మవాప్నుయాత్.

- తత్త్వసంగ్రహ రామాయణే, కిష్కిన్ధాకాణ్డే

## 57వ సర్గము

### హనుమంతుని పున స్సముద్ర లంఘనము

హనుమానుడు ఆకాశమార్గమున మహాసముద్రమును దాటి పోవునపుడు ఒక మహానౌక సముద్రములో ప్రయాణించు చున్నట్లుండెను. అనగా ఆకాశము ఒక మహాసముద్రమువలె హనుమానుడు ఒక మహానౌకవలె ఉండెను. ఆకాశమార్గమున చంద్రుడు తెల్లకలువవలె ఉండెను. సూర్యుడు కారండవ పక్షివలె ఉండెను.

పుష్యమీ శ్రవణా నక్షత్రములు కలహంసల వలె ఉండెను. మేఘములు నాచువలె ఉండెను. పునర్వసు నక్షత్రము మహా మీనమువలె ఉండెను. కుజగ్రహము గ్రాహము (మొసలి) వలె ఉండెను. ఐరావతము మహాద్వీపమువలె ఉండెను. స్వాతీనక్షత్రము రాజహంసవలె ఉండెను. చంద్రుని కిరణకాంతి చల్లని జలమువలె ఉండెను. యక్షగంధర్వాదులు వికసించిన తామరలలె కలువలవలె ఉండిరి.

హనుమానుడు సముద్రమునేకాక ఆకాశసముద్రమునే దాటిపోవు చుండెను. ఆకాశమును మ్రింగుచున్న వానివలెను చంద్రుని

రాసికొనుచు సూర్య మండలముతో నక్షత్రమండలముతో కూడిన ఆకాశమును మరియొక చోటికి ఎత్తుకొని పోవుచున్నట్లుండెను. రంగురంగుల మేఘమండలము వెనుకకు విసిరివేయుచున్న వానివలె ముందునకు పోవుచుండెను.

మేఘమండలములో ప్రయాణించుచున్న హనుమానుడు ఒక్కప్పుడు దృశ్యుడై ఇంకొక్కప్పుడు అదృశ్యుడై ముందునకు సాగిపోవుచుండెను. మేఘమండలమును చీల్చుకొనుచు ఆకాశమున గరుత్మంతునివలె ప్రయాణించుచుండెను. మేఘముల వలె గంభీరముగా ధ్వనిచేయుచు గొప్ప రాక్షసులను చంపి, లంకా నగరమును వ్యాకులపఱిచి, రావణునికి వ్యాకులత కలిగించి, రాక్షసుల బలగమును సంహరించి, సాగర మధ్యకు వచ్చి మైనాకుని చూచి తన హస్తముచే స్పృశించి వింటినారి నుండి వెలువడిన మహాశరమువలె మహేంద్ర పర్వతమునకు దగ్గరగావచ్చి పెద్దగ ధ్వనిచేసెను. తోకను ఆకాశమున జాడించెను. ఆతని సింహనాదమునకు ఆకాశము బ్రద్దలై పోయినట్లు తోచెను.

ఉత్తర తీరమందున్న ఆంజనేయుని ఆగమనమునకై నిరీక్షించుచున్న వానరులందరికి హనుమంతుని గర్జనను వినినంతనే ఆంజనేయుని చూడవలెనని కుతూహలము మరింత పెరిగెను.

ఆ సమయమున జాంబవంతుడు మిక్కిలి సంతోషించిన వాడై వానరులందరిని దగ్గరకు పిలిచి ఇట్లు చెప్పదొడంగెను. వానరోత్తములారా! హనుమంతుడు కృతార్థుడై వచ్చుచున్నాడు. పని పూర్తికానిచో అతని కంఠధ్వని ఇటుల ఉండదు. ఆంజనేయుని

బాహువేగము ఊరువేగము కంఠనాదము గమనించి వానరులందరు సంతసించిరి. ఆ వానరులు సంతోషముతో ఎగిరి గంతులు వేసిరి ఆనందముతో కొండ శిఖరములకు చెట్టుపై కొమ్మలకు హనుమానుని చూచుటకై ఎగబడిరి. చివర కొమ్మలలో కూర్చుండిరి. ఆత్మబంధువు వచ్చుచున్నప్పుడు వస్త్రములను ఆకాశము ఎత్తినట్లుగా చిన్న కొమ్మలను ఆకాశమార్గమున ఎగురవేసిరి. హనుమానుడు మరల గర్జించెను. ఉఱుములతో వచ్చు మేఘముల వలె గర్జించుచు వచ్చుచున్న ఆంజనేయుడు వానరులకు దృష్టి గోచరుడయ్యెను.

**కృతార్థుడై వచ్చు హనుమను జూచిన వానరుల హర్షాతిరేకము**

హనుమానుని చూచి వానరులందరు చేతులు జోడించుకొని నిలబడిరి. హనుమానుడు వృక్షములతో నిండి ఉన్న సెలయేఱులు జలజల ప్రవహించుచున్న ఆ మహేంద్ర పర్వతముపై రెక్కలు తెగిన పర్వతమువలె వ్రాలెను. హనుమంతుని వానరులందరు చుట్టు ముట్టిరి. క్షేమముగా వచ్చిన ఆంజనేయుని చూచి వానరులెల్లరు సంతోషించిన వారయి కానుకలుగా మూలఫలములు తీసికొని వచ్చి సమర్పించిరి. హనుమంతుడును పెద్దలైన జాంబవంతుడు మున్నగు వారికి యువరాజగు అంగదునకు నమస్కరించెను. జాంబవంతుడు అంగదుడు అభినందనవాక్యములతో తన్ను అభినందింపగా తక్కిన వానరులును తమ మంచి మాటలతో ప్రసన్నుని చేసికొనిరి. అప్పుడు ఆంజనేయుడు కనబడినది సీత అని లంకావృత్తాంతమును సంగ్రహముగా చెప్పెను.

ఈ సంతోషవార్త విన్న వానరులు కొందరు సింహనాదము చేసిరి, కొందరు గర్జించిరి, కొందరు కిలకిల ధ్వనులు చేసిరి. మఱికొందరు

తోకలను ఆకాశములోనికి ఎత్తి నేలపై చఱిచిరి. మఱికొందఱు వానరులు కొండ శిఖరముల నుండి క్రిందకు దుమికి వచ్చి ఆంజనేయుని స్పృశించి పోవుచుండిరి. హనుమంతుడు సంగ్రహముగా లంకావృత్తాంతమును తెలిసిన తరువాత యువరాజగు అంగదుడు వానరోత్తములు వినుచుండగా ఆంజనేయునితో ఇట్లు చెప్పెను.

బలములో వీరతాగుణములో నీతో సమానుడు మఱొకడు లేడు. ఈ విస్తీర్ణమైన సముద్రమును దాటి లంకకు పోయి పని పూర్తిచేసికొని మరల ఉత్తరతీరమునకు చేరగలిగితివి. ఇది సామాన్యులకు సాధ్యము కాదు. నీ ప్రభుభక్తి, నీ వీరత్వము, నీ ధైర్యము ఆశ్చర్యకరమైనవి. నీవు ఎంత అదృష్టవంతుడవు. రామచంద్రుని భార్యను సీతాదేవిని చూడగలిగితివి. సీతాక్షేమవార్త విని రాముడు సీతావియోగముచే కల్గిన శోకమును విడువగలడు.

అప్పుడు వానరులందరు ఆంజనేయుని వలన లంకలో జరిగిన వృత్తాంతము అంతయు వినదలచినవారై ప్రత్యేకముగా శిలలను ఆసనములుగా స్వీకరించినవారయి ఆంజనేయుని చుట్టుచేరి ఉండిరి. ఈ వానరులు అందరితో కూడి అంగదుడును దేవతలతో కూడిన ఇంద్రుని వలె కూర్చుండి ఉండెను. తన పరాక్రమముచే మహాయశశ్శాలియై వచ్చిన ఆంజనేయునిచేత అంగదాలంకృత మయిన బాహువులతో కూడిన అంగదుని చేత అధిష్ఠింపబడిన మంహేంద్ర పర్వత శిఖరము మిక్కిలి ప్రకాశమానమయ్యెను.



# 58. అష్టపఞ్చాశ స్సర్గః

తత స్తస్య గిరే శ్శృఙ్గే మహేన్ద్రస్య మహాబలాః,
హనుమత్ప్రముఖాః ప్రీతిం హరయో జగ్ము రుత్తమమ్. 1

తం తతః ప్రీతిసంహృష్టః ప్రీతిమన్తం మహాకపిమ్,
జామ్బవా న్కార్యవృత్తాన్త మపృచ్ఛ దనిలాత్మజమ్. 2

కథం దృష్టా త్వయా దేవీ కథం వా తత్ర వర్తతే,
తస్యాం వా స కథం వృత్తః క్రూరకర్మా దశాననః. 3

తత్త్వత స్సర్వ మేత న్నః ప్రబ్రూహి త్వం మహాకపే,
శ్రుతార్థా శ్చిన్తయిష్యామో భూయః కార్యవినిశ్చయమ్. 4

యశ్చార్థ స్తత్ర వక్తవ్యో గతై రస్మాభి రాత్మవా న్,
రక్షితవ్యం చ య త్తత్ర త ద్భవా న్వ్యాకరోతు నః. 5

స నియుక్త స్తత స్తేన సంప్రహృష్ట తనూరుహః,
ప్రణమ్య శిరసా దేవ్యై సీతాయై ప్రత్యభాషత. 6

ప్రత్యక్షమేవ భవతాం మహేన్ద్రాగ్రాత్ ఖ మాప్లుతః,
ఉదధే ర్దక్షిణం పారం కాఙ్క్షమాణ స్సమాహితః. 7

గచ్ఛత శ్చ హి మే ఘోరం విఘ్న రూపా మివాభవత్,
కాఞ్చనం శిఖరం దివ్యం పశ్యామి సుమనోహరమ్. 8

స్థితం పన్థాన మావృత్య మేనే విఘ్నం చ తం నగమ్,
ఉపసఙ్గమ్య తం దివ్యం కాఞ్చనం నగసత్తమమ్. 9

కృతా మే మనసా బుద్ధి ర్భేత్తవ్యోఽయం మయేతి చ,
ప్రహతం చ మయా తస్య లాఙ్గూలేన మహాగిరేః. 10

శిఖరం సూర్యసఙ్కాశం వ్యశీర్యత సహస్రధా,
వ్యవసాయం చ తం బుద్ధ్వా స హోవాచ మహాగిరిః. 11

పుత్రేతి మధురాం వాణీం మనః ప్రహ్లాదయన్నివ,
పితృవ్యం చాపి మాం విద్ధి సఖాయం మాతరిశ్వనః. 12

మైనాక మితి విఖ్యాతం నివసన్తం మహోదధౌ,
పక్షవన్తః పురా పుత్ర బభూవుః పర్వతోత్తమాః. 13

ఛన్దతః పృథివీం చేరు ర్బాధమానా స్సమన్తతః,
శ్రుత్వా నగానాం చరితం మహేన్ద్రః పాకశాసనః. 14

చిచ్ఛేద భగవా న్పక్షా న్వజ్రే ణైషాం సహస్రశః,
అహం తు మోక్షిత స్తస్మా త్తవ పిత్రా మహాత్మనా. 15

మారుతేన తదా వత్స ప్రక్షిప్తోఽస్మి మహార్ణవే,
రామస్య చ మయా సాహ్యే వర్తితవ్య మరిన్దమ. 16

రామో ధర్మభృతాం శ్రేష్ఠో మహేన్ద్రసమవిక్రమః,
ఏత చ్ఛ్రుత్వా వచ స్తస్య మైనాకస్య మహాత్మనః. 17

కార్య మావేద్య తు గిరే రుద్యతం చ మనో మమ,
తేన చాహ మనుజ్ఞాతో మైనాకేన మహాత్మనా. 18

పాణిభి ర్నిహతాః కేచి త్కేచి జ్జానుభి రాహతాః,
ప్రకృష్టాశ్చ యథాకామం దేవమార్గం చ దర్శితాః. 9

ఏవ మేతే హతా శ్శూరా స్త్వయి తిష్ఠతి భర్తరి,
కృత్స్నం మధువనం చైవ ప్రకామం తైః ప్రభక్ష్యతే. 10

ఏవం విజ్ఞాప్యమానం తం సుగ్రీవం వానరర్షభమ్,
అపృచ్ఛ త్త న్మహాప్రాజ్ఞో లక్ష్మణః పరవీరహా. 11

కి మయం వానరో రాజ న్వనపః ప్రత్యుపస్థితః,
కం చార్థ మభినిర్దిశ్య దుఃఖితో వాక్య మబ్రవీత్. 12

ఏవ ముక్తస్తు సుగ్రీవో లక్ష్మణేన మహాత్మనా,
లక్ష్మణం ప్రత్యువా చేదం వాక్యం వాక్యవిశారదః. 13

ఆర్య లక్ష్మణ సంప్రాహ వీరో దధిముఖః కపిః,
అఙ్గదప్రముఖై ర్వీరై ర్భక్షితం మధు వానరైః. 14

విచిత్య దక్షిణా మాశా మాగతై ర్హరిపుఙ్గవైః,
నైషా మకృతకృత్యానా మీదృశ స్స్యా దుపక్రమః. 15

ఆగతైశ్చ ప్రమథితం యథా మధువనం హి తైః,
ధర్షితం చ వనం కృత్స్న ముపయుక్తం చ వానరైః. 16

వనం యదాఽభిపన్నా స్తే సాధితం కర్మ వానరైః,
దృష్టా దేవీ న సన్దేహో న చాన్యేన హనూమతా. 17

న హ్యన్య స్సాధనే హేతుః కర్మణోఽస్య హనూమతః,
కార్యసిద్ధి ర్మతిశ్చైవ తస్మి న్వానరపుఙ్గవే. 18

వ్యవసాయశ్చ వీర్యం చ శ్రుతం చాపి ప్రతిష్ఠితమ్,
జామ్బవా న్యత్ర నేతా స్యా దఙ్గదశ్చ మహాబలః. 19

హనుమాం శ్చాప్యధిష్ఠాతా న తస్య గతి రన్యథా,
అఙ్గదప్రముఖై ర్వీరై ర్హతం మధువనం కిల. 20

వారయన్తశ్చ సహితా స్తథా జానుభి రాహతాః,
ఏత దర్థ మయం ప్రాప్తో వక్తుం మధురవా గిహ. 21

నామ్నా దధిముఖో నామ హరిః ప్రఖ్యాతవిక్రమః,
దృష్టా సీతా మహాబాహో సౌమిత్రే పశ్య తత్త్వతః. 22

అభిగమ్య తథా సర్వే పిబన్తి మధు వానరాః,
న చా ప్యదృష్ట్వా వైదేహీం విశ్రుతాః పురుషర్షభ. 23

వనం దత్తవరం దివ్యం ధర్షయేయు ర్వనౌకసః,
తతః ప్రహృష్టో ధర్మాత్మా లక్ష్మణ స్సహ రాఘవః. 24

శ్రుత్వా కర్ణసుఖాం వాణీం సుగ్రీవవదనా చ్చ్యుతామ్,
ప్రాహృష్యత భృశం రామో లక్ష్మణశ్చ మహాబలః. 25

శ్రుత్వా దధిముఖ స్యేదం సుగ్రీవస్తు ప్రహృష్య చ,
వనపాలం పున ర్వాక్యం సుగ్రీవః ప్రత్యభాషత. 26

ప్రీతోఽస్మి సోఽహం యద్భుక్తం వనం తైః కృతకర్మభిః,
హర్షితం హర్షణీయం చ చేష్టితం కృతకర్మణామ్. 27

ఇచ్ఛామి శీఘ్రం హనుమత్ప్రధానాన్
శాఖామృగాం స్తా న్మృగరాజదర్పాన్,

ద్రష్టుం కృతార్థా సహ రాఘవాభ్యాం
శ్రోతుం చ సీతాధిగమే ప్రయత్నమ్. 28

ప్రీతి స్పీతాక్షౌ సంప్రహృష్టౌ కుమారౌ
దృష్ట్వా సిద్ధార్థౌ వానరాణాం చ రాజా,
అఙ్గై స్సంహృష్టై కర్మసిద్ధిం విదిత్వా
బాహ్వో రాసన్నాం సోఽతిమాత్రం ననన్ద. 29

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, వాల్మీకీయే,
చతుర్వింశత్సహస్రికాయాం, సంహితాయాం,
శ్రీమత్సున్దరకాణ్డే, త్రిషష్టితమ స్సర్గః.

## బాలకాణ్డాది సప్తకాణ్డ కర్తవ్య శ్రీరామధ్యానక్రమః

కాకపక్ష ధరం దేవం వనమాలా విభూషితమ్,
శ్రీరామం బాలకం ధ్యాయే ద్బాలకాణ్డే మునీశ్వర.

సీతాదేవియుతం వీరం సర్వభూషణ భూషితమ్,
పితృభక్తం హరిం ధ్యాయే దయోధ్యకాణ్డ ఉత్తమే.

## 63వ సర్గము

### దధిముఖుడు సుగ్రీవునితో వానరుల దుండగములను చెప్పట

దధిముఖుడు వచ్చి తన కాళ్ళపై బడి నమస్కరించుటయేకాక దీనవదనుడైయున్న దధిముఖుని చూచి సుగ్రీవుని హృదయము ఆందోళన పడసాగెను. వానరవీర! ఏల నీవు నా కాళ్ళపై బడితివి. నీకు అభయమిచ్చుచున్నాను. ఏమి జరిగినదో అంతయు వివరముగా చెప్పుము.

ఆ సుగ్రీవుని మాటలకు ఊరట చెందిన దధిముఖుడు సుగ్రీవునితో, ఇట్లు చెప్పసాగెను. ఈ మధువనము నీతండ్రి ఋక్షరజస్కుడు కాని వాలి కాని ఈనాటి వానర ప్రభుడవయిన నీవుకాని రాజభోగ్యముగా ఉంచిదేకాని సామాన్యజనులకు ఉపభోగార్హముగ చేయలేదు. అట్టి మధువనమును ప్రవేశించి ఈ వానరులందరు తేనెలను త్రాగివేయు చున్నారు. పండ్లను తినివేయుచున్నారు. ధ్వంసము చేయుచున్నారు. తినగా మిగిలిన వానిని నేలపై పారబోయుచున్నారు. వారించినచో కనుబొమలు ముడివైచి కోపముగ చూచుచున్నారు. మేము వారింపగా కోపించి మమ్ములను వెంటిచెదిరి. కొందరిని చేతులతో కొట్టిరి.

మఱికొందరిని మోకాలితో పొడిచిరి. కొందరిని ఈడ్చుకొని పోయి మీకు దిక్కున్నచోటికి పోయి చెప్పుకొనుడని ఆకాశము వైపునకు చూపిరి. సుగ్రీవ మహారాజా! నీ ప్రభుత్వ కాలములో కూడ మేమిట్టి దురవస్థల పాలయితిమి. మధువనమంతయు వారిచే తినివేయబడుచున్నది.

ఈ రీతిగ దధిముఖుడు సుగ్రీవమహరాజుతో విన్నవించుచుండగా లక్ష్మణుడు చూచి సుగ్రీవ మహారాజా ఈ వనపాలకుడైన వానరుడు ఎందుకొఱకు వచ్చినాడు? దుఃఖముతో మీతో ఏమి చెప్పుచున్నాడు. ఈ ప్రకారమడిగిన లక్ష్మణునకు దధిముఖుని మాటలను సరిగా అవగాహనము చేసికొనిన సుగ్రీవుడు లక్ష్మణునితో ఇట్లు చెప్పెను.

దక్షిణ దిక్కున సీతాన్వేషణ /మొనరించి వచ్చిన అంగదాది వానరులు మధువనమును ప్రవేశించి తేనెలు పండ్లు తినివేయుచున్నారని చెప్పుచున్నాడు. వారు సీతాన్వేషణములో కృతార్థులు కానిచో ఈ పని చేయరు. మధువనమున ప్రవేశించి నిర్భయముగా సీతాదేవి జాడను వారు తెలిసికొనినట్లే మనము భావింపవలసి ఉండును. ఆపని కూడ హనుమంతుని చేత చేయబడి ఉండును. జాంబవంతుడు, హనుమంతుడు, అంగదుడు నాయకత్వమును వహించి వెళ్ళిన మన వానరుల ప్రయత్నము ఎప్పుడును వ్యర్థము కాదు.

హనుమంతుని కార్యసాధన పద్ధతి, బుద్ధిబలము, ప్రయత్నము, కార్యోత్సాహము అనన్యసామాన్యములు. అంగదాది వానరులు

మధువనమున చేయు ధ్వంసము ఈవనపాలురు వారింపగా కొట్టిరట, తిట్టిరట. ఆవిషయమునే ఈదధిముఖుడు నాకు తెలియజేయు చున్నాడు. లక్ష్మణా! సీతాదేవి కనబడినది. ఆ సంతోషముచేతనే వానరులు మధువనమున ప్రవేశించి మధుపానము చేసిరి. సీతను చూడకుండ వారు మధువన ప్రవేశమునకు సాహసింపరు.

## వానరుల దుండగములను క్షమించుట

సుగ్రీవుని నోటి నుండి వెలువడిన ఈ అతి మధురమగు మాటలను విని, రాముడును, లక్ష్మణుడును చాల సంతోషించిరి. అప్పుడు సుగ్రీవుడు దధిముఖునితో ఇట్లనెను. కర్తవ్యమును పూర్తి చేసికొని వచ్చిన అంగదాదియూథనాథులుచేసిన పనికి నేనెంతయో సంతోషించు చున్నాను. నేను వారిని క్షమించితిని. ఆచేష్టలు క్షమించి తీరవలసినదే. హనుమంతుడు మున్నగు వానరులను నేను రామలక్ష్మణులు కూడ చూడగోరుచున్నాము. సీత జాడ ఎట్లు తెలిసినదో తెలిసికొన గోరుచున్నాము. సుగ్రీవుడు రామలక్ష్మణులు ఆనందపరవశులై ప్రేమతో నేత్రములను పెద్దవిగ చేసికొని కార్యోన్ముఖులై యుండుటను గమనించి సీతాదేవి శ్రీరాముని చేతికి అందినట్లే సంతోషించెను.



# 64. చతుష్షష్టితమ స్సర్గః

సుగ్రీవే ణైవ ముక్తస్తు హృష్టో దధిముఖః కపిః,
రాఘవం లక్ష్మణం చైవ సుగ్రీవం చా భ్యవాదయత్. 1

స ప్రణమ్య చ సుగ్రీవం రాఘవౌ చ మహాబలౌ,
వానరై స్సహితై శ్శూరై ర్దివ మేవోత్పపాత హ. 2

స యథైవాఽఽగతః పూర్వం తథైవ త్వరితం గతః,
నిపత్య గగనా ద్భూమౌ తద్వనం ప్రవివేశ హ. 3

స ప్రవిష్టో మధువనం దదర్శ హరియూథపాన్,
విమదా నుత్థితాన్ సర్వా న్మేహమానా న్మధూదకమ్. 4

స తా నుపాగమ ద్వీరో బద్ధ్వా కరపుటాఞ్జలిమ్,
ఉవాచ వచనం శ్లక్ష్ణ మిదం హృష్టవ ద ఙ్గదమ్. 5

సౌమ్య రోషో న కర్తవ్యో య దేభి రభివారితః,
అజ్ఞానా ద్రక్షిభిః క్రోధా ద్భవన్తః ప్రతిషేధితాః. 6

యువరాజ స్త్వ మీశశ్చ వన స్యాస్య మహాబల,
మౌర్ఖ్యాత్పూర్వం కృతో దోష స్తం భవా న్క్షన్తు మర్హతి. 7

ఆఖ్యాతం హి మయా గత్వా పితృవ్యస్య తవానఘ,
ఇహోపయాతం సర్వేషా మేతేషాం వనచారిణామ్. 8

స త్వదాగమనం శ్రుత్వా సహైభి ర్హరియూథపైః,
ప్రహృష్టో న తు రుష్టోఽసౌ వనం శ్రుత్వా ప్రధర్షితమ్. 9

ప్రహృష్టో మాం పితృవ్య స్తే సుగ్రీవో వానరేశ్వరః,
శీఘ్రం ప్రేషయ సర్వాం స్తా నితి హోవాచ పార్థివః. 10

శ్రుత్వా దధిముఖస్యేదం వచనం శ్లక్ష్ణ మఙ్గదః,
అబ్రవీ త్తా న్హరిశ్రేష్ఠో వాక్యం వాక్యవిశారదః. 11

శఙ్కే శ్రుతోఽయం వృత్తాన్తో రామేణ హరియూథపాః,
తత్ క్షమం నేహ న స్థాతుం కృతే కార్యే పరంతపాః. 12

పీత్వా మధు యథాకామం విశ్రాన్తా వనచారిణః,
కిం శేషం గమనం తత్ర సుగ్రీవో యత్ర మే గురుః. 13

సర్వే యథా మాం వక్ష్యన్తి సమేత్య హరియూథపాః,
తథాఽస్మి కర్తా కర్తవ్యే భవద్భిః పరవా నహమ్. 14

నాజ్ఞాపయితు మీశోఽహం యువరాజోఽస్మి యద్యపి,
అయుక్తం కృతకర్మాణో యూయం ధర్షయితుం మయా 15

బ్రువత శ్చాఙ్గద స్యైవం శ్రుత్వా వచన మవ్యయమ్,
ప్రహృష్టమనసో వాక్య మిద మూచు ర్వనౌకసః. 16

ఏవం వక్ష్యతి కో రాజ న్ప్రభు స్సన్ వానరర్షభ,
ఐశ్వర్యమదమత్తో హి సర్వోఽహ మితి మన్యతే. 17

తవ చేదం సుసదృశం వాక్యం నాన్యస్య కస్యచిత్,
సంనతి ర్హి తవాఖ్యాతి భవిష్యచ్ఛుభయోగ్యతామ్. 18

సర్వే వయ మపి ప్రాప్తా స్తత్ర గన్తుం కృతలక్షణాః,
స యత్ర హరివీరాణాం సుగ్రీవః పతి రవ్యయః. 19

త్వయా హ్యనుక్తై ర్హరిభి ర్నైవ శక్యం పదాత్పదమ్,
క్వచి ద్గన్తుం హరిశ్రేష్ఠ బ్రూమ స్సత్య మిదం తు తే. 20

ఏవం తు వదతాం తేషా మఙ్గదః ప్రత్యువాచ హ,
బాఢం గచ్ఛామ ఇత్యుక్త్వా ఖ ముత్పేతు ర్మహాబలాః. 21

ఉత్పతన్త మనూత్పేతు స్సర్వే తే హరియూథపాః,
కృత్వాకాశం నిరాకాశం యన్త్రోత్క్షిప్తా ఇవాచలాః. 22

తేఽమ్బరం సహసోత్పత్య వేగవన్తః ప్లవఙ్గమాః,
వినదన్తో మహానాదం ఘనా వాతేరితా యథా. 23

అఙ్గదే హ్యననుప్రాప్తే సుగ్రీవో వానరాధిపః,
ఉవాచ శోకోపహతం రామం కమలలోచనమ్. 24

సమాశ్వసిహి భద్రం తే దృష్టా దేవీ న సంశయః,
నాగన్తు మిహ శక్యం తై రతీతే సమయే హి నః. 25

న మత్సకాశ మాగచ్ఛే త్కృతే హి వినిపాతితే,
యువరాజో మహాబాహుః ప్లవతాం ప్రవరోఽఙ్గదః. 26

య ద్య ప్యకృతకృత్యానా మీదృశ స్స్యా దుపక్రమః,
భవే త్స దీనవదనో భ్రాన్తవిప్లుతమానసః. 27

పితృపైతామహం చైత త్పూర్వకై రభిరక్షితమ్,
న మే మధువనం హన్యా దహృష్టః ప్లవగేశ్వరః. 28

కౌసల్యా సుప్రజా రామ సమాశ్వసిహి సువ్రత,
దృష్టా దేవీ న సన్దేహో న చాన్యేన హనూమతా. 29

న హ్యన్యః కర్మణో హేతు స్సాధనేఽస్య హనూమతః,
హనూమతి హి సిద్ధిశ్చ మతిశ్చ మతిసత్తమ. 30

వ్యవసాయశ్చ వీర్యం చ సూర్యే తేజ ఇవ ధ్రువమ్,
జామ్బవా న్యత్ర నేతా స్యా దఙ్గదశ్చ బలేశ్వరః. 31

హనుమాం శ్చా ప్యధిష్ఠాతా న తస్య గతి రన్యథా,
మా భూ శ్చిన్తాసమాయుక్త స్సంప్ర త్యమితవిక్రమః. 32

తతః కిలకిలాశబ్దం శుశ్రా వాసన్న మమ్బరే,
హనుమత్కర్మదృప్తానాం నర్దతాం కాననౌకసామ్. 33

కిష్కిన్ధా ముపయాతానాం సిద్ధిం కథయతా మివ,
తతః శ్రుత్వా నినాదం తం కపీనాం కపిసత్తమః,
ఆయతాఞ్చితలాఙ్గూల స్సోఽభవ ద్ధృష్టమానసః. 34

ఆజగ్ము స్తేఽపి హరయో రామదర్శనకాఙ్క్షిణః,
అఙ్గదం పురతః కృత్వా హనూమన్తం చ వానరమ్. 35

తేఽఙ్గద ప్రముఖా వీరాః ప్రహృష్టాశ్చ ముదాన్వితాః,
నిపేతు ర్హరిరాజస్య సమీపే రాఘవస్య చ. 36

హనూమాంశ్చ మహాబాహుః ప్రణమ్య శిరసా తతః,
నియతా మక్షతాం దేవీం రాఘవాయ న్యవేదయత్. 37

నిశ్చితార్థ స్తత స్తస్మిన్ సుగ్రీవః పవనాత్మజే,
లక్ష్మణః ప్రీతిమాన్ ప్రీతం బహుమానా దవైక్షత. 38

ప్రీత్యా చ రమమాణోఽథ రాఘవః పరవీరహా,
బహుమానేన మహతా హనుమన్త మవైక్షత. 39

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, వాల్మీకీయే,
చతుర్వింశత్సహస్రికాయాం, సంహితాయాం,
శ్రీమత్సున్దరకాణ్డే, చతుష్షష్టితమ స్సర్గః.

## బాలకాణ్డాది సప్తకాణ్డ కర్తవ్య శ్రీరామధ్యానక్రమః

జటిలం చీరవసనం దణ్డకారణ్యవాసినమ్,
మునివేష ధరం ధ్యాయే దరణ్యేకాణ్డ ఉత్తమే.

సుగ్రీవాదియుతం శ్రీశం భస్మాఙ్గావృత మీశ్వరమ్,
మహేశ్వర సమం ధ్యాయే త్కిష్కిన్ధాకాణ్డ ఉత్తమే.

చన్ద్రబిమ్బసమాకారం వాఞ్ఛితార్థ ప్రదాయకమ్,
హనుమత్సేవితం ధ్యాయే త్సున్దరే కాణ్డ ఉత్తమే.

## 64వ సర్గము

### దధిముఖుడు క్షమింప అంగదుని వేడుట

సుగ్రీవుని మాటలు తెలిసికొని దధిముఖ వానరుడు హర్షము పొందిన వాడై రామునకు, లక్ష్మణునకు, సుగ్రీవునకు నమస్కరించి వానరులతో కలిసి ఆకాశములోనికి ఎగిరెను. ఒక గంతులో మధువనము లోనికి పోయి అచట మత్తు వదలి ప్రశాంతముగా ఉన్న అంగధాదివానరులతో చేతులు జోడించుకొని హర్షవినయములు గోచరించునట్లు పలుక దొడంగెను.

అంగదా! మీరు మధువనమున ప్రవేశింపకుండ అడ్డుపెట్టితినని కోపింపవలదు. అజ్ఞానము వలన కోపముతో ఈవనపాలకులు మిమ్ములను వారించిరి. మీరు వారింపబడిరి, నీవు యువరాజవై ఉన్నావు. ఈవనమందు నీకు అధికారమున్నది. అది తెలియక వానరులు నిన్ను వారించిరి. వారి తప్పును క్షమింపుము. మీరందరును మధువనమునకు వచ్చితిరని నేను సుగ్రీవ మహారాజునకు ఎఱింగించితిని. ఈవానర వీరులతో నీవు మధువనమునకు వచ్చిన వార్తను విని సుగ్రీవ మహారాజు సంతోషించెనే కాని కోపపడలేదు

మధువన భంగ వార్తను వినియు కోపింపలేదు. నీ పినతండ్రి సుగ్రీవుడు అంగదాది వానరులను వెంటనే నావద్దకు పంపుము అని ఆజ్ఞాపించినాడు. దధిముఖుని ఈ మధురమైన మాటలను విని అంగదుడు ఆవానరులతో ఇట్లు అనెను.

### అంగదుని ప్రతివచనము

వానరయూథపతులారా! మనము వచ్చిన వార్తను రామచంద్రుడు కూడ విని యుండును. పని పూర్తిచేసికొని వచ్చిన తరువాత మన మిచ్చట ఆలస్యము చేయుట మంచిదికాదు. వానరులందరు మధుపానము చేసి విశ్రమించి యున్నారు. మా పినతండ్రి సుగ్రీవుని వద్దకు వెంటనేపోవుట మన కర్తవ్యమై ఉన్నది. మీరందరు చెప్పినది చేయుటకు నేను సిద్ధముగా ఉన్నాను. నేను యువరాజనైనను మిమ్ములను ఆజ్ఞాపింపలేను. మిమ్ములను ఆజ్ఞాపించి అవమానించుట తగదు. అంగదుడు ఇంత వినయముగా మాటాడిన మాటలను విని వానరులందరు సంతోషించిరి. మరియు ఇట్లనిరి.

యువరాజా! వానరోత్తమా! అధికారము కలిగియు ఇంత వినయముగా ఎవరు మాటలాడుదురు? ఐశ్వర్యమదమత్తులైన ప్రతివాడును అహంకారము పెరిగి ఉండును. ఇట్టి మాటలు ఇతరులు ఎవ్వరు పలుకలేరు. నీ యొక్క వినయము భవిష్యత్తులో కలుగు శుభములను సూచించుచున్నది. మేమందరము సుగ్రీవ సన్నిధికి పోవుటకు సంసిద్ధులమై ఉన్నాము. నీ ఆజ్ఞలేనిదే ఈ వానరు లెవ్వరు ఒక్క అడుగుకదలలేరు. యథార్థము నీతో చెప్పుచున్నాము.

వారి మాటలను విని అంగదుడు సుగ్రీవుని సన్నిధికి పోవుటకై ఆజ్ఞనిచ్చెను. అందరును ఒక్కసారి ఆకాశములోనికి ఎగిరిరి. పెద్దవాయువు వీచగా కదలిన మేఘములవలె వానరులు మహనాదములు చేసికొనుచు ముందునకు సాగిపోయిరి. అంగదాది వానరులు వచ్చుట కొంచెము ఆలస్యము కాగా శ్రీరాముడు దుఃఖితుడయ్యెను. అప్పుడు రామచంద్రా! ఊరడిల్లుము. నీకు మేలు కలుగును. సీతాదేవి కనబడినది. గడువు దాటిన తరువాత కృతకృత్యులు కాకుండ ఈవానరులు నావద్దకు రాలేరు. కార్యసాఫల్యము లేనపుడు మహాబాహువు, యువరాజు అగు అంగదుడు నావద్దకు రానేరాడు. కార్యము సఫలము కాకపోయినను వానరులు ఇట్టి అకృత్యమునకు దిగినచో దీనవదనుడై మనోవేదన కలిగిన వాడై తాత ముత్తాతల కాలమునుండి పూర్వులచే సురక్షితమై ఉన్న ఈమధువనమును వానరులు వచ్చి ధ్వంసము చేయుటను ఉపేక్షింపడు.

కౌసల్యాకుమారా! ఊరడిల్లుము. నీ పుణ్యము ఫలించినది. సీతాదేవి కనబడినది. ఆంజనేయుడే ఆమె జాడ కనుగొని ఉండును. ఆకార్యము ఇతరులకు సాధ్యము కాదు. కార్యసాధన శక్తి, బుద్ధి విశేషము ఆంజనేయుని యందు పుష్కలముగా ఉన్నవి. అంగదుడు. ఆంజనేయుడు. జాంబవంతుడు ఈ ముగ్గురు చేయు ప్రయత్నము ఎప్పుడును విఫలము కాలేదు.

ఇంతలో ఆకాశమున కిలకిల ధ్వనులు వినబడినవి. ఆ వానరుల యొక్క కిలకిల ధ్వనులతో కిష్కింధా పురవాసులకు కార్యసిద్ధిని చెప్పుచున్నట్లుండెను. వానరులు వచ్చుచున్నప్పుడు కలిగిన ధ్వనిని విని సుగ్రీవుడు సంతుష్టాంతరంగుడై తన తోకను ఆకాశములోనికి నిగిడించెను. అంగదుని, హనుమంతుని ముందు పెట్టుకొని ఆవానరులందరు రాముని సన్నిధికి చేరిరి. అంగదుడు మొదలగు ఆవీరులు రామసుగ్రీవుల ఎదుట సన్నిధికి చేరిరి.

అంగదుడు మొదలగు ఆవీరులు రామసుగ్రీవుల సన్నిధికి చేరిరి. అంగదుడు మొదలగు ఆవీరులు రామసుగ్రీవుల ఎదుట నిలిచిరి. హనుమంతుడు తలవంచి నమస్కరించి సీతాదేవి ఏ అపాయము లేక నియమమును విడువక క్షేమముగా ఉన్నదని చెప్పెను.

సీతాన్వేషణకార్యమంతయు హనుమంతుడే చేసెనని సుగ్రీవుడు నిర్ణయించుకొనెను. లక్ష్మణుడు ప్రీతితో గౌరవము చూపెను. శ్రీరాముడు ప్రీతితో మహానందమును పొందుచున్న వాడై మిక్కిలి బహుమానపూర్వకముగా హనుమంతుని కటాక్షించెను.



# ౬5. పఞ్చషష్టితమ స్సర్గః

తతః ప్రస్రవణం శైలం తే గత్వా చిత్రకాననమ్,
ప్రణమ్య శిరసా రామం లక్ష్మణం చ మహాబలమ్. 1

యువరాజం పురస్కృత్య సుగ్రీవ మభివాద్య చ,
ప్రవృత్తి మథ సీతయాః ప్రవక్తు ముపచక్రముః. 2

రావణాన్తఃపురే రోధం రాక్షసీభి శ్చ తర్జనమ్,
రామే సమనురాగం చ య శ్చాయం సమయః కృతః. 3

ఏత దాఖ్యాన్తి తే సర్వే హరయో రామసన్నిధౌ,
వైదేహీ మక్షతాం శ్రుత్వా రామ స్తూత్తర మబ్రవీత్. 4

క్వ సీతా వర్తతే దేవీ కథం చ మయి వర్తతే,
ఏత న్మే సర్వ మాఖ్యాత వైదేహీంప్రతి వానరాః. 5

రామస్య గదితం శ్రుత్వా హరయో రామసన్నిధౌ,
చోదయన్తి హనూమన్తం సీతావృత్తాన్తకోవిదమ్. 6

శ్రుత్వా తు వచనం తేషాం హనుమా న్మారుతాత్మజః,
ప్రణమ్య శిరసా దేవ్యై సీతాయై తాం దిశం ప్రతి. 7

ఉవాచ వాక్యం వాక్యజ్ఞః స్సీతాయా దర్శనం యథా,
సముద్రం లఙ్ఘయి త్వాహం శతయోజన మాయతమ్. 8

అగచ్ఛం జానకీం సీతాం మార్గమాణో దిదృక్షయా,
తత్ర లఙ్కేతి నగరీ రావణస్య దురాత్మనః. 9

దక్షిణస్య సముద్రస్య తీరే వసతి దక్షిణే,
తత్ర దృష్టా మయా సీతా రావణాన్తఃపురే సతీ. 10

సన్న్యస్య త్వయి జీవన్తి రామ రామ మనోరథమ్,
దృష్టా మే రాక్షసీమధ్యే తర్జ్యమానా ముహుర్ముహుః. 11

రాక్షసీభి ర్విరూపాభీ రక్షితా ప్రమదావనే,
దుఃఖ మాసాద్యతే దేవీ తథాఽదుఃఖోచితా సతీ. 12

రావణాన్తఃపురే రుద్ధా రాక్షసీభి స్సురక్షితా,
ఏకవేణీధరా దీనా త్వయి చిన్తాపరాయణా. 13

అధశ్శయ్యా వివర్ణాఙ్గీ పద్మినీవ హిమాగమే,
రావణా ద్వినివృత్తార్థా మర్తవ్యకృతనిశ్చయా. 14

దేవీ కథం చిత్కాకుత్స్థ త్వన్మనా మార్గితా మయా,
ఇక్ష్వాకువంశవిఖ్యాతిం శనైః కీర్తయతాఽనఘ. 15

సా మయా నరశార్దూల విశ్వాసముపపాదితా,
తత స్సంభాషితా దేవీ సర్వ మర్థం చ దర్శితా. 16

రామసుగ్రీవసఖ్యం చ శ్రుత్వా ప్రీతి ముపాగతా,
నియత స్సముదాచారో భక్తి శ్చాస్యా స్తథా త్వయి. 17

ఏవం మయా మహాభాగా దృష్టా జనకనన్దినీ,
ఉగ్రేణ తపసా యుక్తా త్వద్భక్త్యా పురుషర్షభ. 18

అభిజ్ఞానం చ మే దత్తం యథావృత్తం తవాన్తికే,
చిత్రకూటే మహాప్రాజ్ఞ వాయసంప్రతి రాఘవ. 19

విజ్ఞాప్యశ్చ నరవ్యాఘ్రో రామో వాయుసుత త్వయా,
అఖిలే నేహ యద్దృష్ట మితి మా మాహ జానకీ. 20

అయం చాస్మై ప్రదాతవ్యో యత్నా త్సుపరిరక్షితః,
బ్రువతా వచనా న్యేవం సుగ్రీవ స్యోపశృణ్వతః. 21

ఏష చూడామణి శ్శ్రీమా న్మయా సుపరిరక్షితః,
మనశ్శిలాయా స్తిలకో గణ్డపార్శ్వే నివేశితః. 22

త్వయా ప్రనష్టే తిలకే తం కిల స్మర్తు మర్హసి,
ఏష నిర్యాతిత శ్శ్రీమా న్మయా తే వారిసమ్భవః. 23

ఏతం దృష్ట్వా ప్రమోదిష్యే వ్యసనే త్వా మివానఘ,
జీవితం ధారయిష్యామి మాసం దశరథాత్మజ. 24

ఊర్ధ్వం మాసా న్నజీవేయం రక్షసాం వశమాగతా,
ఇతి మా మబ్రవీ త్సీతా కృశాఙ్గీ ధర్మచారిణీ. 25

ఏతదేవ మయాఖ్యాతం సర్వం రాఘవ యద్యథా,
సర్వథా సాగరజలే సంతారః ప్రవిధీయతామ్. 26

తౌ జాతాశ్వాసౌ రాజపుత్రౌ విదిత్వా
త చ్చాభిజ్ఞానం రాఘవాయ ప్రదాయ,
దేవ్యా చాఖ్యాతం సర్వమే వానుపూర్వ్యా
ద్వాచా సంపూర్ణం వాయుపుత్ర శ్శశంస. 27

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, వాల్మీకీయే,
చతుర్వింశత్సహస్రికాయాం, సంహితాయాం,
శ్రీమత్సున్దరకాణ్డే, పఞ్చషష్టితమ స్సర్గః.

## 65వ సర్గము

### సీత లంకయందున్నదని రామునికి తెల్పుట

తరువాత చక్కని కాననములతో కూడి ఉన్న ప్రస్రవణ పర్వతమును చేరి యువరాజును పురస్కరించుకొని వానరులు రామునకు, లక్ష్మణునకు, సుగ్రీవునకు అభివాద మొనర్చి సీతావృత్తాంతము చెప్పనారంభించిరి.

రావణుని అంతఃపురములో సీత బంధింపబడుట రాక్షసస్త్రీలు ఆమెను బెదరించుట సీతకు రాముని యందున్న అనురాగము, సీతకు రావణుడు ఇచ్చిన రెండు మాసముల కాలవ్యవధి ఈ విషయములను రాముని సన్నిధిలో వానరులు చెప్పుచుండిరి. సీత క్షేమముగా ఉన్న మాట విని శ్రీరాముడు సీత ఎచ్చట ఉన్నది? నా విషయములో ఎటుల ఉన్నది. ఆ విషయమును సరిగా చెప్పుడు అని ప్రశ్నింపగనే శ్రీరాముని సన్నిధిలో వానరులందరు సీతా వృత్తాంతమును బాగుగ తెలిసిన హనుమంతుని శ్రీరామచంద్రుని ప్రశ్నకు సమాధానము చెప్పుటకై ప్రోత్సహించిరి. వానరుల ప్రార్థనను మన్నించి హనుమానుడు దక్షిణ దిక్కునకు తిరిగి సీతాదేవికి నమస్కరించి సీతాదర్శన గాథను చెప్పనారంభించెను.

65 వ సర్గము

## హనుమ శ్రీరామునకు సీత కుశలవార్త చెప్పుట

రామచంద్రా! సీతను అన్వేషించుట కొరకై శతయోజన విస్తీర్ణమైన దక్షిణ సముద్రము దాటితిని. దాని యొక్క దక్షిణ తీరమున దుర్మార్గుడగు రావణుని రాజధాని యగు లంకానగరము ఉన్నది. అక్కడ రావణుని అంతఃపురములో పతివ్రత అయిన సీతాదేవి కనబడినది. తన కోరికలను నీ యందే నిలుపుకొని జీవించుచున్నది. భయంకర స్వరూపలగు రాక్షస స్త్రీలు ఎందరో ఆమెకు రక్షణగా నిలిచి ఉండిరి. ఆ రాక్షస స్త్రీలు ఆమెను అనుక్షణము బెదరించుచుండిరి. ఎప్పుడును దుఃఖము అనుభవింపని ఆమె దుఃఖము అనుభవించు చున్నది.

ఏకవేణీధరయై నిరంతరము నిన్ను గుఱించియే ఆలోచించుచు కటికనేలనే పరుండుచు హేమంతకాలమందలి తామరతీగవలె రంగుమాసి రావణుని యందు ప్రీతిలేక మరణో న్ముఖురాలయిన దశలో సీతాదేవిని కనుగొంటిని.

ఇక్ష్వాకు వంశము యొక్క పేరు ప్రసిద్ధులను కీర్తించుచు ఆమెకు విశ్వాసము కలిగించితిని. తరువాత ఆమెతో సంభాషణ చేయుచు విషయ మంతయు చెప్పితిని. రామసుగ్రీవుల స్నేహమును విని ఆమె చాల సంతోషించినది.

ఆమె సముదాచారమును అతిక్రమింపలేదు. నీయందలి భక్తియు తిరుగలేదు. ఈ రీతిగ నున్న సీతను చూచితిని. నీ సన్నిధిలో జరిగిన వాయస వృత్తాంతము. ప్రయత్న పూర్వకముగా పరిరక్షించుకొనుచు

వచ్చిన చూడామణిని కూడ ఆమె అభిజ్ఞానముగా సమర్పించినది.

చిత్రకూట పర్వత ప్రాంతమున విహరించుచున్న కాలమున నా ముఖమును కూడ గుర్తు చేయుచున్నది. ఈచూడామణి నా దగ్గఱ ఉన్నప్పుడు దానిని చూచుకొనుచు శ్రీరామచంద్రుని చూచినంతగా ఆనందించుచుంటిని. రామచంద్రుని విడిచి ఒక మాసము కంటె దీర్ఘకాలము జీవింపనని చెప్పుము. ఈ రాక్షసులచే బద్ధురాలనై అంతకంటె ధీర్ఘకాలము జీవింపలేనని చెప్పుము అని పలికినది. సీతాదేవి లంకలో ధర్మ ప్రవృత్తి కలిగి కృశాంగియై రావణాంతఃపురమున బద్ధురాలై యున్నది.

వాస్తవ విషయమును యథార్థముగ నెఱింగించితిని. సముద్రమును దాటిపోవుటకై తగు ప్రయత్నము చేయవలసి యున్నది. సీత ఇచ్చిన అభిజ్ఞానమును శ్రీరామచంద్రునకు ఇచ్చి రామలక్ష్మణులిరువురకు విశ్వాసము కలిగించి సీతా సందేశమును క్రమము తప్పకుండ పూర్తిగా చెప్పెను.



# ౬౬. షట్షష్టితమ స్సర్గః

ఏవ ముక్తో హనుమతా రామో దశరథాత్మజః,
తం మణిం హృదయే కృత్వా ప్రరురోద సలక్ష్మణః. 1

తం తు దృష్ట్వా మణిశ్రేష్ఠం రాఘవ శ్శోకకర్శితః,
నేత్రాభ్యా మశ్రుపూర్ణాభ్యాం సుగ్రీవ మిద మబ్రవీత్. 2

యథైవ ధేను స్స్రవతి స్నేహా ద్వత్సస్య వత్సలా,
తథా మమాపి హృదయం మణిరత్నస్య దర్శనాత్. 3

మణిరత్న మిదం దత్తం వైదేహ్యా శ్శ్వశురేణ మే,
వధూకాలే యథాబద్ధ మధికం మూర్ధ్ని శోభతే. 4

అయం హి జలసమ్భూతో మణి స్సజ్జనపూజితః,
యజ్ఞే పరమతుష్టేవ దత్త శ్శక్రేణ ధీమతా. 5

ఇమం దృష్ట్వా మణిశ్రేష్ఠం యథా తాతస్య దర్శనమ్,
అద్యా స్మ్యవగత స్సౌమ్య వైదేహస్య తథా విభోః. 6

అయం హి శోభతే తస్యాః ప్రియాయా మూర్ధ్ని మే మణిః,
అ స్యాద్య దర్శనే నాహం ప్రాప్తాం తా మివ చిన్తయే. 7

కి మాహ సీతా వైదేహీ బ్రూహి సౌమ్య పునఃపునః,
పిపాసు మివ తోయేన సిఞ్చన్తీ వాక్యవారిణా. 8

ఇత స్తు కిం దుఃఖతరం య దిమం వారిసమ్భవమ్,
మణిం పశ్యామి సౌమిత్రే వైదేహీ మాగతాం వినా. 9

చిరం జీవతి వైదేహీ యది మాసం ధరిష్యతి,
క్షణం సౌమ్య న జీవేయం వినా తా మసితేక్షణామ్. 10

నయ మా మపి తం దేశం యత్ర దృష్టా మమ ప్రియా,
న తిష్ఠేయం క్షణమపి ప్రవృత్తి ముపలభ్య చ. 11

కథం సా మమ సుశ్రోణీ భీరుభీరు స్సతీ సదా,
భయావహానాం ఘోరాణాం మధ్యే తిష్ఠతి రక్షసామ్. 12

శారద స్తిమిరోన్ముక్తో నూనం చన్ద్ర ఇ వామ్బుదైః,
ఆవృతం వదనం తస్యా న విరాజతి రాక్షసైః. 13

కి మాహ సీతా హనుమం స్తత్త్వతః కథయాద్య మే,
ఏతేన ఖలు జీవిష్యే భేషజే నాతురో యథా. 14

మధురా మధురాలాపా కి మాహ మమ భామినీ,
మద్విహీనా వరారోహా హనుమన్ కథయస్వ మే. 15

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, వాల్మీకీయే,
చతుర్వింశత్సహస్రికాయాం, సంహితాయాం,
శ్రీమత్సున్దరకాణ్డే, షట్షష్టితమ స్సర్గః.

## 66వ సర్గము

### శ్రీరాముడు చూడామణిని చూచి దుఃఖించుట

హనుమంతుడు చెప్పిన సీతా సందేశమును వినిన తరువాత శ్రీరామచంద్రుడు ఆచూడామణిని హృదయమునకు చేర్చుకొని మిక్కిలి ఏడ్చెను. శ్రీరాముని చూచి లక్ష్మణుడును ఏడ్చెను. ఆ రత్నమును చూచి మిక్కిలి దుఃఖితుడై కన్నీళ్లు కార్చుచు సుగ్రీవునితో ఇట్లనెను.

ధేనువు తన దూడను చూచి ద్రవించునట్లుగా ఈచూడామణి దర్శనము చేత నామనస్సు కూడ ద్రవించినది. వివాహకాలమున జనక చక్రవర్తి తన కొమార్తె యగు వైదేహికి ఈచూడామణిని కానుకగా, ఇచ్చెను. సీతాదేవి తలయందు అలంకృతమై ఈచూడామణి ఎంతగ శోభించెనో చెప్పనలవి కాదు.

ఈచూడామణి సముద్రజలమున పుట్టినది. ఎందరో పెద్దలు ఈ రత్నము యొక్క గొప్పతనమును శ్లాఘించిరి. జనకచక్రవర్తి యజ్ఞము చేయుచుండగా సంతుష్టుడయిన దేవేంద్రుడు ఈ రత్నమును కానుకగా సమర్పించెను. ఈరత్నమును చూచిన వెంటనే మాతండ్రి దశరథచక్రవర్తి మా మామగారు జనకచక్రవర్తి స్మృతిపథమున

తోచుచున్నారు. ఈ రత్నము సీతాదేవి శిరోజములందు ఎంత అందముగా ఉండెడిదో ఈరత్నమును చూచి సీత నాదగ్గరకు వచ్చినట్లే భావించుచున్నాను. దప్పిక కల్గిన వానిని నీటిచే సేద తీర్చినట్లుగా తన మాట లను నీటిని నాపై చల్లుచు సీత ఏమి చెప్పినదో మరల మరల చెప్పుము.

మణిని చూచుచున్నాను సీతను చూచుటలేదు. ఇంతకంటె దుఃఖకరమైన విషయము మరియొక్కటి ఉన్నదా? లక్ష్మణా. నన్ను విడిచి సీత ఒక నెలదినములు జీవింప గలదు అనగా సీత చిరకాలము జీవింపగలదు అన్నమాట. నల్లని నేత్రములు కల్గిన సీతను విడిచి నేను ముహూర్తకాలము కూడ జీవింపలేను. ఆమె జాడ తెలిసిన తరువాత ఆమెను విడిచి క్షణకాలమైన జీవించి ఉండలేను. నన్ను కూడ సీత ఉన్న చోటికి తీసికొని వెళ్ళుము. భీరువైన ఆసీత భయంకర రూపములుగల ఆరాక్షస స్త్రీల మధ్య ఏరీతిగ జీవింపగలుగుచున్నదో మేఘముల చేత ఆవరింపబడిన శరత్కాలపు చంద్రుని వలె రాక్షసులచే పరివేష్టితయైన సీత ముఖమును శోభిల్లదు.

ఆంజనేయా! సీత ఇంకను ఏమన్నది? ఉన్నది ఉన్నట్లుగా చెప్పుము. వ్యాధిగ్రస్తుడు ఔషధమును స్వీకరించి జీవించినట్లుగా సీత మాటలనే ఔషధముగా స్వీకరించి కొంతకాలము బ్రతికి ఉందును. మధురమైన రూపము మధురమైన ఆలాపము కల సీత ఇంకను ఏమన్నదో చెప్పుము.



# 67. సప్తషష్టితమ స్సర్గః

ఏవ ముక్తస్తు హనుమా న్రాఘవేణ మహాత్మనా,
సీతాయా భాషితం సర్వం న్యవేదయత రాఘవే.

ఇద ముక్తవతీ దేవీ జానకీ పురుషర్షభ,
పూర్వవృత్త మభిజ్ఞానం చిత్రకూటే యథాతథమ్. 2

సుఖసుప్తా త్వయా సార్ధం జానకీ పూర్వ ముత్థితా,
వాయస స్సహ సోత్పత్య విదదార స్తనాన్తరే. 3

పర్యాయేణ చ సుప్త స్త్వం దేవ్యఙ్కే భరతాగ్రజ,
పునశ్చ కిల పక్షీ స దేవ్యా జనయతి వ్యథామ్. 4

పునఃపున రుపాగమ్య విదదార భృశం కిల,
తత స్త్వం బోధిత స్తస్యా శ్శోణితేన సముక్షితః. 5

వాయసేన చ తేనైవ సతతం బాధ్యమానయా,
బోధితః కిల దేవ్యాత్వం సుఖసుప్తః పరంతపః. 6

తాం తు దృష్ట్వా మహాబాహో దారితాం చ స్తనాన్తరే,
అశీవిష ఇవ క్రుద్ధో నిశ్శ్వస న్నభ్యభాషథాః. 7

నఖాగ్రైః కేన తే భీరు దారితం తు స్తనాన్తరమ్,
కః క్రీడతి సరోషేణ పఞ్చవక్త్రేణ భోగినా. 8

నిరీక్షమాణ స్సహసా వాయసం సమవైక్షథాః,
నఖై స్సరుధిరై స్తీక్ష్ణై స్తా మే వాభిముఖం స్థితమ్. 9

సుతఃకిల స శక్రస్య వాయసః పతతాం వరః,
ధర్మాన్తరచర శ్శీఘ్రం పవనస్య గతా సమః. 10

తత స్తస్మి న్మహాబాహో కోపసంవర్తితేక్షణః,
వాయసే త్వం కృథాః క్రూరాం మతిం మతిమతాంవర.11

స దర్భం సంస్తరా ద్గృహ్య బ్రహ్మాస్త్రేణ హ్యయోజయః,
ప్రదీప్త ఇవ కాలాగ్ని ర్జజ్వా లాభిముఖః ఖగమ్. 12

క్షిప్తవాం స్త్వం ప్రదీప్తం హి దర్భం తం వాయసం ప్రతి,
తత స్తు వాయసం దీప్త స్స దర్భోఽనుజగామ హ. 13

స పిత్రా చ పరిత్యక్త స్సురై శ్చ సమహర్షిభిః,
త్రీ న్లోకా న్సంపరిక్రమ్య త్రాతారం నాధిగచ్ఛతి,
పున రేవాగత స్త్రస్త స్త్వత్సకాశ మరిన్దమ. 14

స తం నిపతితం భూమౌ శరణ్య శ్శరణాగతమ్,
వధార్హ మపి కాకుత్స్థ కృపయా పర్యపాలయః. 15

మోఘ మస్త్రం న శక్యం తు కర్తు మిత్యేవ రాఘవ,
భవాం స్తస్యాక్షి కాకస్య హినస్తిస్మ స దక్షిణమ్. 16

రామ త్వాం స నమస్కృత్య రాజ్ఞే దశరథాయ చ,
విసృష్ట స్తు తదా కాకః ప్రతిపేదే స్వ మాలయమ్. 17

ఏవ మస్త్రవిదాం శ్రేష్ఠ సత్త్వవాన్ శీలవా నపి,
కిమర్థ మస్త్రం రక్షస్సు న యోజయతి రాఘవః. 18

న నాగా నా పి గన్ధర్వా నా సురా న మరుద్గణాః,
న చ సర్వే రణే శక్తా రామంప్రతి సమాసితుమ్. 19

తస్య వీర్యవతః కశ్చి ద్యద్యస్తి మయి సంభ్రమః,
క్షిప్రం సునిశితై ర్బాణై ర్హన్యతాం యుధి రావణః. 20

భ్రాతు రాదేశ మాజ్ఞాయ లక్ష్మణో వా పరంతపః,
స కిమర్థం నరవరో న మాం రక్షతి రాఘవః. 21

శక్తౌ తౌ పురుషవ్యాఘ్రౌ వాయ్వగ్నిసమతేజసౌ,
సురాణా మపి దుర్ధర్షౌ కిమర్థం మా ముపేక్షతః. 22

మమైవ దుష్కృతం కిఞ్చి న్మహ దస్తి న సంశయః,
సమర్థౌ సహితౌ యన్మాం నా వేక్షేతే పరంతపౌ. 23

వైదేహ్యా వచనం శ్రుత్వా కరుణం సాశ్రుభాషితమ్,
పున ర ప్యహ మార్యాం తా మిదం వచన మబ్రువమ్. 24

త్వ చ్ఛోకవిముఖో రామో దేవి సత్యేన తే శపే,
రామే దుఃఖాభిభూతే తు లక్ష్మణః పరితప్యతే. 25

కథం చి ద్భవతీ దృష్టా న కాలః పరిశోచితుమ్,
అస్మి న్ముహూర్తే దుఃఖానా మన్తం ద్రక్ష్యసి భామిని. 26

తా వుభౌ నరశార్దూలౌ రాజపుత్రా వనిన్దితౌ,
త్వద్దర్శనకృతోత్సాహౌ లఙ్కాం భస్మీకరిష్యతః. 27

హత్వా చ సమరే రౌద్రం రావణం సహబాన్ధవమ్,
రాఘవ స్త్వాం వరారోహే స్వాం పురీం నయతే ధ్రువమ్.

యత్తు రామో విజానీయా దభిజ్ఞాన మనిన్దితే,
ప్రీతిసంజననం తస్య ప్రదాతుం త్వ మి హార్హసి. 29

సాభివీక్ష్య దిశ స్సర్వా వేణ్యుద్గ్రథిత ముత్తమమ్,
ముక్త్వా వస్త్రా ద్దదౌ మహ్యం మణి మేతం మహాబలః. 30

ప్రతిగృహ్య మణిం దివ్యం తవ హేతో రఘూద్వహ,
శిరసా తాం ప్రణ మ్యార్యా మహ మాగమనే త్వరే. 31

గమనే చ కృతోత్సాహ మవేక్ష్య వరవర్ణినీ,
వివర్ధమానం చ హి మా మువాచ జనకాత్మజా. 32

అశ్రుపూర్ణముఖీ దీనా బాష్పసన్దిగ్ధభాషిణీ,
మమోత్పతనసంభ్రాన్తా శోకవేగసమాహతా. 33

హనుమ న్సింహసంకాశా వుభౌ తౌ రామలక్ష్మణౌ,
సుగ్రీవం చ సహామాత్యం సర్వా న్బ్రూయా హ్యనామయమ్.

యథా చ స మహాబాహు ర్మాం తారయతి రాఘవః,
అస్మా ద్దుఃఖామ్బుసంరోధా త్త్వం సమాధాతు మర్హసి. 35

ఇమంచ తీవ్రం మమ శోకవేగం
రక్షోభి రేభిః పరిభర్త్సనం చ,
బ్రూయాస్తు రామస్య గత స్సమీపం
శివశ్చ తేఽధ్వాస్తు హరిప్రవీర. 36

ఏత త్తవార్యా నృపరాజసింహ
సీతా వచః ప్రాహ విషాదపూర్వమ్,
ఏతచ్చ బుద్ధ్వా గదితం మయా త్వం
శ్రద్ధత్స్వ సీతాం కుశలాం సమగ్రామ్. 37

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, వాల్మీకీయే,
చతుర్వింశత్సహస్రికాయాం, సంహితాయాం,
శ్రీమత్సున్దరకాణ్డే, సప్తషష్టితమ స్సర్గః.

# 67వ సర్గము

## హనుమంతుడు సీతా వృత్తాంతమును కొనసాగించుట

శ్రీరామచంద్రుడు ఈరీతిగా చెప్పగనే హనుమంతుడు సీత చెప్పిన మాటలనన్నిటిని శ్రీరామచంద్రునకు చెప్పనారంభించెను. ఓ పురుషోత్తమా! చిత్రకూట పర్వతమున జరిగిన ఒక పూర్వ వృత్తాంతము మీకు అభిజ్ఞానముగా నాచే సందేశముగా పంపినది. నాతో సుఖముగ నిద్రించిన సీత నీ కంటె ముందుగ లేచినది. అప్పు డొక కాకి వేగముగ వచ్చి వక్షస్థలము చీల్చెను. ఆ తరువాత నీవు సీతాదేవి ఊరు భాగమున తలచేర్చి నిద్రించుచుంటివి. అదియే అదనుగ భావించి ఆకాకి మరల వచ్చి వక్షస్థలమును మిక్కిలి గాయపఱిచెను. రక్తము స్రవించెను. రక్తము నీమీద పడగా నీవు మేల్కొంటివి. కాకిచే పీడితయైన సీత చేత సుఖనిద్రపోవుచున్న నీవు మేల్కొనజేయబడితివి. కాకిచే గాయపడిన సీతను చూడగనే నీకు పెద్ద కోపము వచ్చినది. నీ వక్షస్థలమును గాయపఱిచినదెవరు? ఈ ఐదు తలల పాముతో చెలగాట మాడుచున్నది ఎవరు? పరిశీలనగా చూచుచుండగా రక్తసిక్తమైన గోళ్ళతో నాకు ఎదురుగా నిలిచి ఉన్న కాకి నీకంట బడినది.

ఆకాకి సామాన్యమైన కాకి కాదు. ఇంద్రుని పుత్రుడు. ఆతని దుర్బుద్ధి చేత కాకి రూపమును పొందినాడు. భూమికి దిగి వచ్చినాడు. ఆతనిని దండించుటకై ఒక దర్భను తీసి బ్రహ్మాస్త్రముగా ప్రయోగించితివి.

అది చూచి పారిపోవుచున్న కాకాసురుని వెంబడించెను. ఎవరిని ఆశ్రయించినను ఆశ్రయమిచ్చువారు లేరు. తండ్రీ తిరస్కరించెను, తల్లి తిరస్కరించెను. దేవతలు తిరస్కరించిరి, మహర్షులు

తిరస్కరించిరి. ఎచ్చటను రక్షించువారు లేక దిక్కులేని వాడై చివరకు నీవద్దకే వచ్చెను. నీ చరణారవింద సన్నిధిలో సాగిలపడెను. ఆశ్రయించిన ఆతనిని త్రోసిపుచ్చక వధార్హుడైనను దయతో రక్షించితివి.

నీ అస్త్రము అమోఘము కనుక ఆ అస్త్రమును శాంతింపచేయుటకై ఆ కాకాసురుడు కుడి కంటిని సమర్పించి నీకు నమస్కరించి నీతండ్రి దశరథునకు నమస్కరించి నీదగ్గర అనుజ్ఞ తీసికొని తన లోకమునకు పోయినాడు.

నాకోసమై కాకి మీద బ్రహ్మాస్త్రమును ప్రయోగించిన శ్రీరాముడు ఈరాక్షసులయందు ఏల బ్రహ్మాస్త్రమును సంధింపడు. నాగులు కాని గంధర్వులు కాని యక్షులు కాని దేవతలు కాని ఎవ్వరును యుద్ధభూమిలో శ్రీరాముని ఎదుట నిలువలేరు. నాయందు ప్రేమ, వేగముగ కష్టముల నుండి ఉద్ధరింపవలెనను సంభ్రమము ఉన్నచో వెంటనే రావణుని చంపవచ్చుగదా. అన్నగారి ఆజ్ఞను తీసికొని లక్ష్మణుడైనను ప్రయత్నింప వచ్చుగదా. పురుషోత్తముడగు శ్రీరాముడు నన్ను రక్షించుటకై ఏల ప్రయత్నము చేయడు? శక్తి కలిగిన వాయ్వగ్ని సమతేజస్కులయిన ఆరామలక్ష్మణులు ఇరువురును ఏల ఉపేక్షించుచున్నారో! వారు శక్తిమంతులు, పురుషోత్తములు, వారిని ప్రతిఘటించు శక్తి దేవతలకు కూడ లేదు. వారి రక్షణ ప్రవృత్తిని ప్రతిబంధించు ఏదో పాపము నేను చేసి ఉండవచ్చును. అందుచేతనే వారు నన్ను ఉపేక్షించుచున్నారు.

కన్నీళ్ళు కార్చుచు సీతాదేవి పలికిన ఈ దీనభాషితములు విని సీతాదేవి! నీ వియోగ శోకము చేత శ్రీరాముడు దేనికిని ఉత్సాహపడుటలేదు. రాముని చూచి లక్ష్మణుడును దుఃఖితుడగుచున్నాడు. ఇది యథార్థము. ఒట్టువేసికొని చెప్పుచున్నాను. ఇంత కాలమునకు

అన్వేషింపగా నీవు కనబడితివి. ఇక దుఃఖింపవలసినది లేదు. ముహూర్తకాలములో అనగా చాల కొద్ది కాలములో ఈ దుఃఖములన్నింటికిని అంతము చూడగలవు. ఈ క్షణము నుండియే ఆశుభ సమయము ప్రారంభమగును.

ఆరాజపుత్రులిద్దరును ఏ లోపము లేనివారు, ఏనిందను పొందనివారు. నీవు కనబడితివి అను శుభవార్త వినగానే ఈలంకను భస్మము చేయగలరు. దుర్మార్గుడగు రావణుని బంధుమిత్ర పరివారముతో యుద్ధభూమి యందు సంహరించి నిన్ను అయోధ్యా నగరమునకు తప్పక తీసికొని పోగలడు. రామచంద్రుడు విశ్వసింపగల, ప్రీతిని కలిగింపగల వస్తువేదయినను గుర్తుగ ఇమ్ము అని కోరితిని. ఆమె నాలుగు దిక్కుల వంక పరిశీలనగా చూచి అతి భద్రముగా దాచి ఉంచిన ఈ శిరోరత్నమును నాకు ఇచ్చినది.

ఆమె ఇచ్చిన చూడామణిని స్వీకరించి ఆమెకు తలవంచి నమస్కరించి నీ దర్శనమునకై వచ్చుటకు తొందర పడుచుండగా నన్ను చూచి సీతాదేవి మరల ఇట్లు అన్నది.

కన్నీళ్ళు పెట్టుకొనుచు బాష్పగద్గద స్వరముతో హనుమా! సింహసదృశులైన రామలక్ష్మణులను మంత్రులతో కూడిన సుగ్రీవుని అందరిని క్షేమ మడిగినట్లు చెప్పుము. శ్రీరామచంద్రుడు తొందరగ వచ్చి నాకు బంధవిముక్తి చేయునట్లు నీవే శ్రీరాముని ఉత్సాహ వఱుపవలసి ఉన్నది. నేను పడుచున్న దురవస్థ ఈ రాక్షసులు పెట్టుచున్న బాధలు నీవు చెప్పవలసి ఉన్నది. నీ ప్రయాణ మార్గము నీకు శుభకరముగా ఉండుగాక. సీతాదేవి పెద్ద దుఃఖస్థితిలో చెప్పినది. ఆ మాటలు నీకు నేను తెలియజేసితిని. సీతాదేవి యోగక్షేమము విషయమై రామా! నీవు శ్రద్ధ వహింపుము.



 

# 68. అష్టషష్టితమ స్సర్గః

అ థాహ ముత్తరం దేవ్యా పునరుక్త స్ససంభ్రమః,
తవ స్నేహా న్నరవ్యాఘ్ర సౌహార్దా దనుమాన్య వై. 1

ఏవం బహువిధం వాచ్యో రామో దాశరథి స్త్వయా,
యథా మా మాప్నుయా చ్ఛీఘ్రం హత్వా రావణ మాహవే.

యది వా మన్యసే వీర వసై కాహ మరిన్దమ,
కస్మింశ్చి త్సంవృతే దేశే విశ్రాన్త శ్శ్వో గమిష్యతి. 3

మమ చా ప్యల్పభాగ్యాయా స్సాన్నిధ్యా త్తవ వీర్యవన్,
అస్య శోకవిపాకస్య ముహూర్తం స్యా ద్విమోక్షణమ్. 4

గతే హి త్వయి విక్రాన్తే పున రాగమనాయ వై,
ప్రాణానా మపి సన్దేహో మమ స్యా న్నాత్ర సంశయః. 5

తవాదర్శనజ శ్శోకో భూయో మాం పరితాపయేత్,
దుఃఖా ద్దుఃఖపరాభూతాం దుర్గతాం దుఃఖభాగినీమ్. 6

అయం చ వీర సన్దేహ స్తిష్ఠతీవ మమాగ్రతః,
సుమహాం స్త్వత్సహాయేషు హర్యృక్షేషు హరీశ్వర. 7

కథం ను ఖలు దుష్పారం తరిష్యన్తి మహోదధిమ్,
తాని హర్యృక్షసైన్యాని తౌ వా నరవరాత్మజౌ. 8

త్రయాణా మేవ భూతానాం సాగరస్యాస్య లఙ్ఘనే,
శక్తి స్స్యా ద్వైనతేయస్య తవ వా మారుతస్య వా. 9

త దస్మిన్ కార్యనిర్యోగే వీరైవం దురతిక్రమే,
కిం పశ్యసి సమాధానం బ్రూహి కార్యవిదాంవర. 10

కామ మస్య త్వ మేవైకః కార్యస్య పరిసాధనే,
పర్యాప్తః పరవీరఘ్న యశస్య స్తే బలోదయః. 11

బలై స్సమగ్రై ర్యది మాం హత్వా రావణ మాహవే,
విజయీ స్వాం పురీం రామో నయే త్తత్స్యా ద్యశస్కరమ్.

యథాఽహం తస్య వీరస్య వనా దుపధినా హృతా,
రక్షసా తద్భయా దేవ తథా నార్హతి రాఘవః. 13

బలైస్తు సఙ్కులాం కృత్వా లఙ్కాం పరబలార్దనః,
మాం నయే ద్యది కాకుత్స్థ స్త త్తస్య సదృశం భవేత్. 14

త ద్యథా తస్య విక్రాన్త మనురూపం మహాత్మనః,
భవ త్యాహవశూరస్య తథా త్వ ముపపాదయ. 15

తదర్థోపహితం వాక్యం ప్రశ్రితం హేతుసంహితమ్,
నిశ మ్యాహం తత శ్శేషం వాక్య ముత్తర మబ్రవమ్. 16

దేవి హర్యృక్షసైన్యానా మీశ్వరః ప్లవతాం వరః,
సుగ్రీవ స్సత్త్వసంపన్న స్తవార్థే కృతనిశ్చయః. 17

తస్య విక్రమసంపన్నా స్సత్త్వవన్తో మహాబలాః,
మనస్సఙ్కల్పసంపాతా నిదేశే హరయ స్స్థితాః. 18

యేషాం నోపరి నాధస్తా న్న తిర్య క్సజ్జతే గతిః,
న చ కర్మసు సీదన్తి మహ త్స్వమితతేజసః. 19

అసకృ త్తై ర్మహోత్సాహై ర్వానరై ర్బలదర్పితైః,
ప్రదక్షిణీకృతా భూమి ర్వాయుమార్గానుసారిభిః. 20

మద్విశిష్టా శ్చ తుల్యాశ్చ సన్తి తత్ర వనౌకసః,
మత్తః ప్రత్యవరః కశ్చి న్నాస్తి సుగ్రీవసన్నిధౌ. 21

అహం తావ దిహ ప్రాప్తః కిం పున స్తే మహాబలాః,
న హి ప్రకృష్టాః ప్రేష్యన్తే ప్రేష్యన్తే హీతరే జనాః. 22

త దలం పరితాపేన దేవి మన్యు ర్వ్యపైతు తే,
ఏకోత్పాతేన తే లఙ్కా మేష్యన్తి హరియూథపాః. 23

మమ పృష్ఠగతౌ తౌ చ చన్ద్రసూర్యా వివోదితౌ,
త్వత్సకాశం మహాభాగే నృసింహా వాగమిష్యతః. 24

అరిఘ్నం సింహసఙ్కాశం క్షిప్రం ద్రక్ష్యసి రాఘవమ్,
లక్ష్మణం చ ధనుష్పాణిం లఙ్కాద్వార ముపస్థితమ్. 25

నఖదంష్ట్రాయుధా న్వీరా న్సింహశార్దూలవిక్రమా న్,
వానరా న్వారణేన్ద్రాభా న్క్షిప్రం ద్రక్ష్యసి సఙ్గతా న్. 26

శైలామ్బుదనికాశానాం లఙ్కామలయసానుషు,
నర్దతాం కపి ముఖ్యానా మచిరా చ్ఛ్రోష్యసి స్వనమ్. 27

నివృత్తవనవాసం చ త్వయా సార్ధ మరిన్దమమ్,
అభిషిక్త మయోధ్యాయాం క్షిప్రం ద్రక్ష్యసి రాఘవమ్. 28

తతో మయా వాగ్భి రదీనభాషిణా
శివాభి రిష్టాభి రభిప్రసాదితా,
జగామ శాన్తిం మమ మైథిలాత్మజా
తవాపి శోకేన సదాభిపీడితా. 29

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, వాల్మీకీయే,
చతుర్వింశత్సహస్రికాయాం, సంహితాయాం,
శ్రీమత్సున్దరకాణ్డే, అష్టషష్టితమ స్సర్గః

శ్రీమత్సున్దరకాణ్డ స్సమాప్తః.

## బాలకాణ్డాది సప్తకాణ్డ కర్తవ్య శ్రీరామధ్యానక్రమః

రావణాది నిహన్తారం బ్రహ్మరుద్రాది సేవితమ్,
సీతాదేవియుతం యొద్దే రామం ధ్యాయే ద్ద్రుదమ్బుజే.

అగస్త్యాదిమునిస్తుత్యం వాఞ్ఛితార్థ ప్రదాయకమ్,
సర్వ దేవోత్తమం ధ్యాయే దుత్తర కాణ్డ ఉత్తమే.

శ్రీరామచన్ద్ర శ్శ్రిత పారిజాత స్సమస్త కల్యాణ గుణాభిరామః
సీతాముఖామ్భోరుహ చఞ్చరీకో నిరన్తరం మఙ్గళ మాతనోతు.

# 68వ సర్గము

## హనుమలంకలో తనకు సీతకు జరిగిన సంభాషణమును తెల్పుట

తరువాత నేను లంక నుండి బయలుదేరి వచ్చుటకునై తొందర పడుచున్నాను. అప్పుడు సీతాదేవి నీయందు ఉండు ప్రేమ వలన నా యందు ఉండు సౌహర్దము వలన తరువాత కర్తవ్యము గుఱించి నాతో చెప్పినది.

ఆంజనేయా! శ్రీరామచంద్రుడు రావణ సంహారము చేసి తొందరలో నన్ను తీసికొని వెళ్ళునట్లుగా రామచంద్రుని ప్రోత్సాహపఱుపుము. వీరా! వానరోత్తమా! నీకు వీలయినచో మరియొక్క దినమయినను ఈ లంకలో ఉండ వలసినదిగా కోరుచున్నాను. ఎక్కడనో ఒక చోట జనసమ్మర్దము లేనిచోట నేడు విశ్రమించి రేపు వెళ్ళవచ్చును. అల్పభాగ్యనైన నాకు నీ సాన్నిధ్యము వలన క్షణకాలమయినను శోకము నుండి విముక్తి కలుగును.

పరాక్రమవంతుడవైన నీవు రామచంద్రుని సన్నిధికి తిరిగి వచ్చుటకై వెళ్ళియున్నను నా జీవితము సందేహస్థితిలో పడును. నీకు మిత్రులయిన వానర భల్లూక సేనాధిపతులు, ఆ రామలక్ష్మణులు. దుస్తరమయిన ఈ సముద్రమును ఎట్లు దాటి రాగలరు?

ఈ మహాసముద్రమును దాట గల మహాశక్తి గరుత్మంతునకు, నీకు, వాయుదేవునకు మాత్రమే కలదని నేను తలంచుచున్నాను. ఇట్టి పరిస్థితులలో లంకా విజయమునకు నీవు ఏమి ఉపాయము ఆలోచించితివి. ఈ కార్యసాధనకు నీవు ఒక్కడవే సమర్థుడవు. నీవు సాధింపని కార్యసాఫల్యము అందఱును మెచ్చుకో దగ్గది. పరిపూర్ణమైన సేనాబలముతో లంకకు వచ్చి రావణుని సంహరించి ఆ శ్రీరాముడు నన్ను అయోధ్యా నగరమునకు తీసికొని పోయినచో అది రామచంద్రునికి కీర్తికరముగ ఉండును.

రామలక్ష్మణులకు భయపడి రావణుడు రాముని మాయచేసి నన్ను తీసికొని వచ్చినాడు. శ్రీరాముడు మరల రావణుని మాయచేసి నన్ను తీసికొని పోవుట తగదు. శ్రీరాముడు తన సేనలతో వచ్చి బాణములతో లంకను ధ్వంసము చేసి నన్ను తీసికొని పోయినచో అది రామునికి తగి ఉండును. యుద్ధశూరుడైన మహాత్ముడయిన ఆ రామచంద్రుని విక్రమమునకు తగిన కర్తవ్యమును నీవు సూచింపుము.

అర్థవంతమైన సహేతుకమయిన సీతాదేవి మాటలను విని నేనిట్లు ప్రత్యుత్తర మిచ్చితిని. దేవీ! సర్వ వానర ప్రభువైన సుగ్రీవ మహారాజు మహాశక్తి మంతుడు. నీకు లంక నుండి విముక్తి కలిగించి శ్రీరామచంద్రుని సన్నిధికి చేర్చుటకై ఆతడు నిశ్చయించుకొని ఉన్నాడు. సుగ్రీవ మహారాజునకు విధేయులై మనస్సంకల్పముతో సమానముగా ముందునకు పోగల వానర వీరులు ఎందరో ఉన్నారు.

ఆకాశములో కాని, నేలమీద కాని ఈ భూమ్యాకాశముల మధ్య కాని ఎచ్చటను వారి గమనమునకు అడ్డులేదు. మహాబలవంతు లయిన ఈ వానరులు ఒక్క గంతులో ప్రదక్షిణము చేసి వచ్చి ఉన్నారు. సుగ్రీవుని వద్ద నాతో సమానులు నాకంటె పెద్దలు ఎందరో ఉన్నారు. వా రెవ్వరును నాకంటె తక్కువ వారు కారు.

రాయబారమునకు కాని ఒక సందేశమును తీసికొని పోవుటకు కాని అల్పులనే పంపించు చుందురు. సామాన్యుడనైన నేను వచ్చి ఇంత పనిచేసితిని. ఇంకను మహాబలులైన వారి విషయము నేను ఏమని చెప్పను? నీవు పరితపింపకుము, నీవు శోకింపకుము. ఒక్క గంతులో వానర వీరులు ఈ లంకను చేరగలదు.

రామలక్ష్మణులను నా భుజములపై కూర్చుండ బెట్టుకొని ఈ లంకకు తీసికొని రాగలను. శత్రుసంహారకుడైన సింహసమానుడైన రామచంద్రుని తొందరలో చూడగలవు. ధనుస్సును చేతబట్టి లంకా ద్వారమున నిలిచిన లక్ష్మణుని కూడ చూడగలవు.

దంతములు, గోళ్ళు ఆయుధములుగా కలిగి, సింహ శార్దూలములతో సమాన పరాక్రమము కల్గిన, గజేంద్రసమానమైన శరీరపరిమాణము గల, సంఘముగా కలిసి వచ్చిన వానరేంద్రులను తొందరలో చూడగలవు.

శైల పరిమాణము కలిగి మేఘమంత ఔన్నత్యము కలిగిన లంకా మలయ సానువులందు నిలిచిన వానర వీరుల సింహనాదమును తొందరలో వినగలవు. శత్రువిజయము చేసి నీతో కలిసి అయోధ్యకు చేరి పట్టాభిషిక్తుడైన రాముని తొందరలో చూడగలవు.

తరువాత ధైర్యముగ మాటలాడుచున్న మంగళకరమైన నా మాటలచే ప్రసన్నురాలై నీ వియోగ క్లేశముచే బాధపడుచున్న సీత శాంతిని పొందినది. శోకమును విడిచి ప్రసన్నురాలైనది.



శ్రీమద్రామాయణాంతర్గమయిన సకలాభీష్టప్రదాయి

# శ్రీమత్సుందరకాండము

(సకలజన నిత్య పారాయణ గ్రంథము) నకు

భాషాప్రవీణ, విద్యాప్రవీణ

ఉభయవేదాంత ప్రవర్తకులు

**శ్రీమాన్ శ్రీమత్తిరుమల పురిహెళ్ళ వేంకట కోనప్పాచార్యుల** వారి

సరళ సుందర అనువాదము

సమాప్తము



## శ్రీరామార్పణమస్తు



# శ్రీమత్సుందరకాండ పారాయణాంతములో పఠింపవలసిన సర్గములు

## నాగపాశవిమోచన సర్గము

శ్లో. అ థోవాచ మహాతేజా హరిరాజో మహాబలః,
కి మియం వ్యథితా సేనా మూఢవాతేవ నౌ ర్జలే. 1

తా. అప్పుడు గొప్ప తేజస్సు, బలము గల సుగ్రీవుడు పలికెను. 'తీవ్రమైన వాయువుచేత ఓడ నీటిలో వ్యాకులమైనట్లు సైన్యము వ్యథ చెందినదేమి?'

శ్లో. సుగ్రీవస్య వచః శ్రుత్వా వాలిపుత్రోఽఙ్గదోఽబ్రవీత్,
న త్వం పశ్యసి రామం చ లక్ష్మణం చ మహారథమ్. 2

శ్లో. శరజాలాచితా వీరా వుభౌ దశరథాత్మజౌ,
శరతల్పే మహాత్మానౌ శయానౌ రుధిరోక్షితౌ. 3

తా. సుగ్రీవుని మాటలు విని వాలిపుత్రుడైన అంగదుడు ఇట్లనెను. 'మహాత్ములైన దశరథకుమారులు రాముడు, మహారథుడైన లక్ష్మణుడు బాణముల సముదాయము చేత కప్పబడి, రక్తముచేత తడిసి, శరతల్పముమీద శయనించి ఉన్నారుకదా! నీవు ఆ వీరులను చూడలేదా?'

శ్లో. అ థాబ్రవీ ద్వానరేన్ద్రః సుగ్రీవః పుత్రమఙ్గదమ్,
నానిమిత్త మిదం మన్యే భవితవ్యం భయేన తు. 4

తా. పిమ్మట వానరరాజైన సుగ్రీవుడు పుత్రుడైన అంగదునితో ఇట్లు పల్కెను. 'ఇది కారణము లేకుండ జరుగుచున్నదని అనుకొనను. ఏదో భయకారణము ఉండి ఉండవలెను.'

శ్లో. విషణ్ణవదనా హ్యేతే త్యక్తప్రహరణా దిశః,
పలాయన్తేఽత్ర హరయ స్త్రాసా దుత్ఫుల్లలోచనాః. 5

తా. ఇక్కడ ఈ వానరులు దిగులు చెందిన ముఖములతో, భయముచేత విప్పారిన కన్నులతో, ఆయుధములు విడిచి నాల్గు దిక్కులకు పారిపోవుచున్నారు.

శ్లో. అన్యోన్యస్య న లజ్జన్తే న నిరీక్షన్తి పృష్ఠతః,
విప్రకర్షన్తి చాన్యోన్యం పతితం లఙ్ఘయన్తి చ. 6

తా. ఈ వానరులు ఒకరిని చూచి ఒకరు సిగ్గు పడుటలేదు. వెనుకకు తిరిగి చూచుటలేదు. ఒకరినొకరు లాగుచున్నారు. పడిపోయినవారిని దాటి వెళ్ళిపోవుచున్నారు.

శ్లో. ఏతస్మి న్నన్తరే వీరో గదాపాణి ర్విభీషణః,
సుగ్రీవం వర్ధయామాస రాఘవం చ జయాశిషా. 7

తా. ఇంతలో చేతిలో గద ధరించిన వీరుడైన విభీషణుడు వచ్చి జయ శబ్దమును ఉచ్చరించుచు సుగ్రీవునకు, రామునకు అభివాదనము చేసెను.

శ్లో. విభీషణం చ సుగ్రీవో దృష్ట్వా వానరభీషణమ్,
ఋక్షరాజం మహాత్మానం సమీపస్థ మువాచ హ. 8

తా. వానరులు భయపడుటకు కారణము విభీషణుడే అని గ్రహించి సుగ్రీవుడు సమీపమునందున్న మహాత్ముడైన జాంబవంతునితో ఇట్లనెను.

శ్లో. విభీషణోఽయం సంప్రాప్తో యం దృష్ట్వా వానరర్షభాః,
ద్రవ న్త్యాయతసంత్రాసా రావణాత్మజశఙ్కయా. 9

తా. ఈ విభీషణుడు వచ్చినాడు. ఈతనినే చూచి వానరశ్రేష్ఠులు ఇంద్రజిత్తు అనెడి శంకచేత భయపడి పారిపోవుచున్నారు.

శ్లో. శీఘ్రమేవ సుసంత్రస్తా న్సహసా విప్రధావితాన్,
పర్యవస్థాపయాఖ్యాహి విభీషణ ముపస్థితమ్. 10

తా. భయపడి అన్నివైపులకు పారిపోవుచున్న వారికి శీఘ్రముగా వెళ్ళి ధైర్యము చెప్పుము. వచ్చినవాడు విభీషణుడని వారికి చెప్పుము.

శ్లో. సుగ్రీవే ణైవ ముక్తస్తు జామ్బవా నృక్షపార్థివః,
వానరాన్ సాన్త్వయామాస సంనిరుధ్య ప్రధావతః. 11

తా. భల్లూకముల రాజైన జాంబవంతుడు సుగ్రీవుని ఆజ్ఞ ప్రకారము వెళ్ళి పారిపోవుచున్న వానరులను వెనుకకు మరల్చి వారికి ధైర్యము చెప్పెను.

శ్లో. తే నివృత్తాః పునః సర్వే వానరా స్త్యక్తసంభ్రమాః,
ఋక్షరాజవచః శ్రుత్వా తం చ దృష్ట్వా విభీషణమ్. 12

తా. ఆ వానరులందరు జాంబవంతుని మాటలు విని, విభీషణుని చూచి, భయము విడిచి మరల వచ్చిరి.

శ్లో. విభీషణస్తు రామస్య దృష్ట్వా గాత్రం శరై శ్చితమ్,
లక్ష్మణస్య చ ధర్మాత్మా బభూవ వ్యథితేన్ద్రియః. 13

తా. ధర్మాత్ముడైన విభీషణుడు బాణములచేత అంతటా గ్రుచ్చబడిన రామలక్ష్మణుల శరీరములు చూచి అప్పుడు చాల వ్యధ చెందెను.

శ్లో. జలక్లిన్నేన హస్తేన తయో ర్నేత్రే విమృజ్య చ,
శోకసంపీడతమనా రురోద విలలాప చ. 14

తా. అతడు నీళ్ళతో తడిసిన చేతితో వారి కన్నులు తుడిచి, శోకముచేత పీడింపబడిన మనస్సు గలవాడై ఏడ్చుచు విలపించెను.

శ్లో. ఇమౌ తౌ సత్త్వసంపన్నౌ విక్రాన్తౌ ప్రియసంయుగే,
ఇమా మవస్థాం గమితౌ రాక్షసైః కూట యోధిభిః. 15

తా. అధికబలము గలవారు, పరాక్రమవంతులు, యుద్ధమునందు ఆసక్తి గలవారు అయిన ఈ రామలక్ష్మణులను కపటయుద్ధము చేయు రాక్షసులు ఇట్టి స్థితి పొందించినారు.

శ్లో. భ్రాతృపుత్రేణ చైతేన దుష్పుత్రేణ దురాత్మనా,
రాక్షస్యా జిహ్మయా బుద్ధ్యా చాలితావృజువిక్రమౌ. 16

తా. కపటము ఎరుగని పరాక్రమము గల వీరిద్దరిని దుష్టపుత్రుడు, చెడ్డబుద్ధి కలవాడు అయిన నా సోదరుని కుమారుడు రాక్షస సహజమైన కుటిల బుద్ధితో వంచించినాడు.

శ్లో. శరై రిమావలం విద్ధే రుధిరేణ సముక్షితౌ,
వసుధాయా మిమౌ సుప్తే దృశ్యేతే శల్యకా వివ. 17

తా. బాణములచేత అధికముగా కొట్టబడి, రక్తముతో తడిసి నేలమీద పడి ఉన్న ఈ రామలక్ష్మణులు శల్యకమృగముల వలె కనబడుచున్నారు.

శ్లో. యయో ర్వీర్య ముపాశ్రిత్య ప్రతిష్ఠా కాఙ్క్షితా మయా,
తా వుభౌ దేహనాశాయ ప్రసుప్తే పురుషర్షభౌ. 18

తా. ఏ రామలక్ష్మణుల పరాక్రమమును ఆశ్రయించి నేను రాజ్యము పొందవలెనని కోరుకొంటినో, అట్టి ఈ మానవశ్రేష్ఠులు ప్రాణములను విడుచుటకై పడియున్నారు.

శ్లో. జీవ న్నద్యవిపన్నోఽస్మి నష్టరాజ్యమనోరథః,
ప్రాప్తప్రతిజ్ఞశ్చ రిపుః సకామో రావణః కృతః. 19

తా. నా రాజ్యలాభాశ నశించుటచేత నేను ఇప్పుడు జీవించి యున్న ఆపదలో ఉన్నాను. శత్రువైన రావణుని ప్రతిజ్ఞ నెరవేరి వాని కోరిక తీరినది.

శ్లో. ఏవం విలపమానం తం పరిష్వజ్య విభీషణమ్,
సుగ్రీవః సత్త్వసంపన్నో హరిరాజోఽబ్రవీ దిదమ్. 20

తా. బలశాలి, వానరరాజు అయిన సుగ్రీవుడు ఈ విధముగా విలపించుచున్న విభీషణుని కాగిలించుకొని ఇట్లనెను.

శ్లో. రాజ్యం ప్రాప్స్యసి ధర్మజ్ఞ లఙ్కాయాం నాత్ర సంశయః,
రావణః సహపుత్రేణ స్వకామం నేహ లప్స్యతే. 21

తా. ధర్మము తెలిసిన ఓ విభీషణా! నీవు లంకారాజ్యము పొందగలవు. సందేహము లేదు. రావణుడు, అతని కుమారుడు అనుకొన్నట్లు వారికోరిక సఫలము కాదు.

శ్లో. న రుజాపీడితా వేతావుభౌ రాఘవ లక్ష్మణౌ,
త్యక్త్వా మోహం వధిష్యేతే సగణం రావణం రణే. 22

తా. ఈ రామలక్ష్మణు లిద్దరును మరణమును కలిగించు బాధచేత పీడింపబడుట లేదు. కేవలము మోహము చెంది ఉన్నారు. మోహమును విడిచి యుద్ధములో పరివారసమేతులై రావణుని చంపగలరు.

శ్లో. త మేవం సాన్త్వయిత్వా తు సమాశ్వాస్య చ రాక్షసమ్,
సుషేణం శ్వశురం పార్శ్వే సుగ్రీవ స్త ముమవాచ హ. 23

తా. సుగ్రీవుడు విభీషణుని ఈ విధముగా ఓదార్చి విశ్వాసము కలిగించి, ప్రక్కనే ఉన్న మామగారైన సుషేణునితో ఇట్లు పలికెను.

శ్లో. సహ శూరై ర్హరిగణై ర్లబ్ధసంజ్ఞ వరిందమౌ,
గచ్ఛ త్వం భ్రాతరం గృహ్య కిష్కిన్ధాం రామలక్ష్మణౌ.

తా. నీవు శూరులైన వానరులతో కలిసి, సంజ్ఞ వచ్చిన శత్రుసంహారకులైన ఈ సోదరులను రామలక్ష్మణులను తీసికొని కిష్కింధకు వెళ్ళుము.

శ్లో. అహం తు రావణం హత్వా సపుత్రం సహబాన్ధవమ్,
మైథిలీ మానయిష్యామి శక్రో నష్టా మివ శ్రియమ్. 25

తా. నేను రావణుని, వాని పుత్రులను, బంధువులను సంహరించి, దేవేంద్రుడు నష్టమైన రాజ్యలక్ష్మిని తిరిగి తీసికొని వచ్చినట్లు సీతను తీసికొని వచ్చెదను.

శ్లో. శ్రుత్వైతద్వానరేన్ద్రస్య సుషేణో వాక్య మబ్రవీత్,
దైవాసురం మహద్యుద్ధ మనుభూతం సుదారుణమ్. 26

తా. సుగ్రీవుని వాక్యమును విని సుషేణుడు ఇట్లు పలికెను. 'దేవాసురుల మధ్య జరిగిన చాల భయంకరమైన యుద్ధమును గూర్చి నాకు తెలియును.'

శ్లో. తదా స్మ దానవా దేవాన్ శరసంస్పర్శకోవిదాః,
నిజఘ్నుః శస్త్రవిదుష శ్ఛాదయన్తో ముహుర్ముహుః. 27

తా. అప్పుడు బాణప్రయోగమునందు నేర్పుగల దానవులు మాటిమాటికి అంతర్ధానము చెందుచు, అస్త్రములయందు సమర్థులైన దేవతలను కొట్టిరి.

శ్లో. తా నార్తా న్నష్టసంజ్ఞాంశ్చ పరాసూంశ్చ బృహస్పతిః,
విద్యాభి ర్మన్త్రయుక్తాభి రోషధీభి శ్చికిత్సతి. 28

తా. ఆ దేవతలలో కొందరు పీడితులైరి. కొందరు మూర్ఛచెందిరి. కొందరు మరణించిరి. వారందరికిని బృహస్పతి మంత్రములతో కూడిన విద్యచేత, ఓషధుల చేత చికిత్స చేసెను.

శ్లో. తా న్యౌషధా న్యానయితుం క్షీరోదం యాన్తు సాగరమ్,
జవేన వానరాః శీఘ్రం సంపాతిపనసాదయః. 29

తా. సంపాతి పనసుడు మొదలైన వానరులు ఆ ఔషధములను తీసికొని వచ్చుటకై వెంటనే క్షీరసముద్రమునకు వేగముగా వెళ్ళెదరుగాక!'

శ్లో. హరయ స్తు విజానన్తి పార్వతీ స్తా మహౌషధీః,
సంజీవకరణీం దివ్యాం విశల్యాం దేవనిర్మితామ్. 30

తా. దివ్యమైన సంజీవకరణిని, దేవతలు సృజించిన విశల్యకరణిని, ఇతరములైన పర్వతములందు లభించు ఓషధులను ఆ వానరులు ఎరుగుదురు.

శ్లో. చన్ద్రశ్చ నామద్రోణశ్చ క్షీరోదే సాగరోత్తమే,
అమృతం యత్ర మథితం తత్ర తే పరమౌషధీ. 31

తా. అమృతము మథించిన సముద్రశ్రేష్ఠమైన క్షీరసముద్రములో చంద్రము, ద్రోణము అను పర్వతములున్నవి. సంజీవకరణి, విశల్యకరణి అను పరమౌషధములు ఆ పర్వతముల మీద ఉన్నవి.

శ్లో. తే తత్ర నిహితే దేవైః పర్వతే పరమౌషధీ,
అయం వాయుసుతో రాజన్ హనుమాం స్తత్ర గచ్ఛతు.

తా. 'ఆ రెండు పర్వతములను దేవతలు ఆ క్షీరసముద్రమునందు ఉంచినారు. రాజా! వాయుపుత్రుడైన ఈ హనుమంతుని అక్కడికి పంపుము.'

శ్లో. ఏతస్మి న్నన్తరే వాయు ర్మేఘాంశ్చాపి సవిద్యుతః,
పర్యస్యన్ సాగరే తోయం కమ్పయన్నివ మేదినీమ్. 33

తా. ఇంతలో మెరుపులతో కూడిన మేఘములను, సముద్రములోని జలమును చిమ్మివేయుచు, భూమిని కూడ కంపింపచేయుచున్నదా అన్నట్లు తీవ్రమైన వాయువు వీచెను.

శ్లో. మహతా పక్షవాతేన సర్వద్వీపమహాద్రుమాః,
నిపేతు ర్భగ్నవిటపాః సమూలా లవణామ్భసి. 34

తా. అన్ని ద్వీపములందు ఉన్న మహావృక్షములు రెక్కలనుండి పుట్టిన పెద్దగాలికి కొమ్ములు విరిగిపోగా లవణసముద్రజలములో పడిపోయెను.

శ్లో. అభవన్ పన్నగా స్త్రస్తా భోగిన స్తత్రవాసినః,
శీఘ్రం సర్వాణి యాదాంసి జగ్ముశ్చ లవణార్ణవమ్. 35

తా. సర్పములన్నియు భయపడెను. అక్కడ నివసించు సర్పములు సమస్తమైన జలజంతువులు శీఘ్రముగా లవణసముద్రములో చేరెను.

శ్లో. తతో ముహూర్తా ద్గరుడం వైనతేయం మహాబలమ్,
వానరా దదృశుః సర్వే జ్వలన్త మివ పావకమ్. 36

తా. పిమ్మట మరుక్షణమునందే, మండుచున్న అగ్నివలె ఉన్న వినతాకుమారుడు మహాబలశాలి అయిన గరుత్మంతుడు వానరులకు కనబడెను.

శ్లో. త మ్మాగత మభిప్రేక్ష్య నాగా స్తే విప్రదుద్రువుః,
యైస్తౌ తే పురుషౌ బద్ధౌ శరభూతై ర్మహాబలౌ. 37

తా. బాణములుగా అయి ఆ రామలక్ష్మణులను బంధించి ఉన్న మహా బలము గల నాగములన్నియు గరుత్మంతుడు వచ్చుట చూచి పారిపోయెను.

శ్లో. తతః సుపర్ణః కాకుత్స్థౌ స్పృష్ట్వా ప్రత్యభినన్దితః,
విమమర్శ చ పాణిభ్యాం ముఖే చన్ద్రసమప్రభే. 38

తా. పిమ్మట గరుత్మంతుడు ఆ రామలక్ష్మణులను స్పృశించి, అభినందించి చంద్రుని వంటి వారి ముఖములను చేతులతో నిమిరెను.

శ్లో. వైనతేయేన సంస్పృష్టా స్తయోః సంరురుహు ర్వ్రణాః,
సువర్ణే చ తనూ స్నిగ్ధే తయో రాశు బభూవతుః. 39

తా. గరుత్మంతుడు స్పృశింపగానే రామలక్ష్మణుల గాయములు మానిపోయెను. వెంటనే వారి శరీరములు గూడ మంచి రంగుతో నున్నగా అయినవి.

శ్లో. తేజో వీర్యం బలం చౌజ ఉత్సాహశ్చ మహాగుణాః,
ప్రదర్శనం చ బుద్ధిశ్చ స్మృతిశ్చ ద్విగుణా తయోః. 40

తా. ఆ రామలక్ష్మణుల తేజస్సు, వీర్యము, బలము, ఉత్సాహము, ఇతర మహాగుణములు, సూక్ష్మవిషయజ్ఞానము, బుద్ధి, స్మృతి రెట్టింపు అయినవి.

శ్లో. తా వుత్థాప్య మహాతేజా గరుడో వాసవోపమౌ,
ఉభౌ తౌ సస్వజే హృష్టౌ రామ శ్చైన ముచాచ హ. 41

తా. మహాతేజఃశాలియైన గరుత్మంతుడు ఇంద్రునితో సమానులైన ఆ రామలక్ష్మణులను లేవదీసి వారినిద్దరిని కౌగిలించుకొనెను. రాముడు సంతోషించి అతనితో నిట్లనెను.

శ్లో. భవత్ప్రసాదా ద్వ్యసనం రావణిప్రభవం మహత్,
ఆవా మిహ వ్యతిక్రాన్తౌ పూర్వవత్ బలినౌ కృతౌ. 42

తా. నీ అనుగ్రహము చేత మేమిద్దరమును ఇప్పుడు ఇంద్రజిత్తు వలన కలిగిన గొప్ప ఆపదను దాటితిమి. పూర్వమువలె బలము కలవారమైతిమి.

శ్లో. యథా తాతం దశరథం యథాజం చ పితామహమ్,
తథా భవన్త మాసాద్య హృదయం మే ప్రసీదతి. 43

తా. నిన్ను చూచుటచే నా మనస్సు నా తండ్రియైన దశరథమహారాజును చూచినట్లు, పితామహుడైన అజమహారాజును చూచినట్లు ప్రసన్నమగుచున్నది.

శ్లో. కో భవా న్రూపసంపన్నో దివ్యస్రగనులేపనః,
వసానో విరజే వస్త్రే దివ్యాభరణభూషితః. 44

తా. నీ రూపము చాల అందముగా ఉన్నది. దివ్యములైన పుష్పమాలలను, చందనాద్యనులేపనములను, శరీరమునకు పూసికొను సుగంధ ద్రవ్యములను, మాయని వస్త్రములను ధరించినాడవు. దివ్యములైన అలంకారములను ధరించినాడవు. నీ వెవ్వరవు?

శ్లో. త మువాచ మహాతేజా వైనతేయో మహాబలః,
పతత్త్రిరాజః ప్రీతాత్మా హర్షపర్యాకులేక్షణః. 45

తా. గొప్ప తేజోబలము గల, పక్షిరాజైన ఆ గరుత్మంతుడు సంతోషించిన మనస్సు గలవాడై, ఆనందముచేత వ్యాకులమైన నేత్రములతో రామునితో ఇట్లనెను.

శ్లో. అహం సఖా తే కాకుత్స్థ ప్రియః ప్రాణో బహిశ్చరః,
గరుత్మా నిహ సంప్రాప్తో యువయోః సాహ్యకారణాత్.

తా. రామా! నేను నీ ప్రియమిత్రుడను. బయట సంచరించు ప్రాణము వంటివాడను. నాపేరు గరుత్మంతుడు. మీ ఇద్దరికిని సహాయము చేయుటకై ఇక్కడకు వచ్చినాడను.

శ్లో. అసురా వా మహావీర్యా దానవా వా మహాబలాః,
సురాశ్చాపి సగన్ధర్వాః పురస్కృత్య శతక్రతుమ్. 47

శ్లో. నేమం మోక్షయితుం శక్తాః శరబన్ధం సుదారుణమ్,
మాయాబలాదిన్ద్రజితా నిర్మితం క్రూరకర్మణా. 48

తా. క్రూరకర్ముడగు ఇంద్రజిత్తు మాయాబలము చేత చేసిన చాల భయంకరమైన ఈ శరబంధమును గొప్ప పరాక్రమముగల అసురులు గాని, మహాబలవంతులైన దానవులుగాని, దేవేంద్రునితో సహచరులుగాని, గంధర్వులుగాని విడిపింపజాలరు.

శ్లో. ఏతే నాగాః కాద్రవేయా స్తీక్ష్ణదంష్ట్రా విషోల్బణాః,
రక్షోమాయాప్రభావేణ శరా భూతా స్త్వదాశ్రితాః. 49

తా. తీక్ష్ణమైన కోరలుగలవి, విషము చేత తీవ్రములు, కద్రువ పుత్రులైన ఈ నాగములు రాక్షసుని మాయాప్రభావము చేత బాణములై నిన్ను ఆక్రమించినవి.

శ్లో. సభాగ్యశ్చాసి ధర్మజ్ఞ రామ సత్యపరాక్రమ,
లక్ష్మణేన సహభ్రాత్రా సమరే రిపుఘాతినా. 50

తా. ధర్మము తెలిసినవాడా! సత్యమైన పరాక్రమము గలవాడా! రామా! యుద్ధములో శత్రుసంహారకుడైన నీ సోదరుడు లక్ష్మణుడు, నీవు కూడ భాగ్యవంతులు.

శ్లో. ఇమం శ్రుత్వా తు వృత్తాన్తం త్వరమాణోఽహ మాగతః,
సహ సై వావయోః స్నేహో త్సఖిత్వ మనుపాలయన్. 51

తా. నేను ఈ వృత్తాంతమును విని మన యిద్దరి మధ్య స్నేహము వలన ఆ స్నేహమును పాలించుచు, తొందరపడుచు వెంటనే వచ్చినాడను.

శ్లో. మోక్షితే చ మహాఘోరా దస్మా త్సాయకబన్ధనాత్,
అప్రమాదశ్చ కర్తవ్యో యువాభ్యాం నిత్యమేవ హి. 52

తా. మీరు చాల భయంకరమైన ఈ బాణబంధమునుండి విడిపింపబడినారు. ఎల్లప్పుడును మీరు ఏమరుపాటుగా ఉండరాదు.

శ్లో. ప్రకృత్యా రాక్షసాః సర్వే సఙ్గ్రామే కూటయోధినః,
శూరాణాం శుద్ధభావానాం భవతా మార్జవం బలమ్. 53

తా. యుద్ధములో కపటముగా యుద్ధము చేయుట రాక్షసుల స్వభావము. శూరులు, పరిశుద్ధమైన మనోభావము కలిగినవారు అయిన మీకు ఋజుత్వము బలము.

శ్లో. త న్న విశ్వసనీయం వో రాక్షసానాం రణాజిరే,
ఏతే నైవోపమానేన నిత్యం జిహ్మా హి రాక్షసాః. 54

తా. రాక్షసులు ఎల్లప్పుడును వక్రస్వభావము గలవారు అనుటకు ఇంద్రజిత్తు చేసినదే దృష్టాంతము. అందుచేత యుద్ధభూమిలో మీరు రాక్షసులను విశ్వసింపరాదు.

శ్లో. ఏవ ముక్త్వా తదా రామం సుపర్ణః స మహాబలః,
పరిష్వజ్య చ సుస్నిగ్ధ మాప్రష్టు ముపచక్రమే. 55

తా. గొప్పబలము గల ఆ గరుత్మంతుడు రామునితో యిట్లు పలికి, స్నేహపూర్వకముగా కౌగిలించుకొని వెళ్ళుటకు అనుజ్ఞ వేడుట ప్రారంభించెను.

శ్లో. సఖే రాఘవ ధర్మజ్ఞ రిపూణామపి వత్సల,
అభ్యనుజ్ఞాతు మిచ్ఛామి గమిష్యామి యథాసుఖమ్. 56

తా. ధర్మము తెలిసినవాడా! శత్రువులను కూడ ప్రేమించువాడా! మిత్రుడవైన రామా! నేను సుఖముగా వెళ్ళెదను. అనుజ్ఞ ఈయవలెనని కోరుచున్నాను.

శ్లో. నచ కౌతూహలం కార్యం సఖిత్వం ప్రతి రాఘవ,
కృతకర్మా రణే వీరః సఖిత్వ మనువేత్స్యసి. 57

తా. నీవు మన యిద్దరికిని స్నేహము ఎట్లు ఏర్పడినది అని తెలిసికొనుటకు అభిలాషను చూపవద్దు. యుద్ధమునందు శత్రుసంహారము పూర్తిచేసిన పిదప నీకు తెలియగలదు.

శ్లో. బాలవృద్ధావశేషాం తు కృత్వా లఙ్కాం శరోర్మిభిః,
రావణం చ రిపుం హత్వా సీతాం సముపలప్స్యసే.

తా. నీవు బాణతరంగములచేత లంకలో బాలలు, వృద్ధులు, మాత్రమే మిగులునట్లు చేసి, శత్రువైన రావణుని సంహరించి, సీతను పొందగలవు.

శ్లో. ఇత్యేవ ముక్త్వా వచనం సుపర్ణః శీఘ్రవిక్రమః,
రామం చ విరుజం కృత్వా మధ్యే తేషాం వనౌకసామ్. 59

శ్లో. ప్రదక్షిణం తతః కృత్వా పరిష్వజ్య చ వీర్యవాన్,
జగా మాకాశ మావిశ్య సుపర్ణః పవనో యథా. 60

తా. మంచి రెక్కలు గలవాడు, శీఘ్రగమనము గలవాడు, పరాక్రమవంతుడు అయిన గరుత్మంతుడు రామునితో ఇట్లు పలికి, వానరుల మధ్య రాముని బాధను తొలగించి, ప్రదక్షిణము చేసి, కౌగిలించుకొని, వాయువు వలె ఆకాశమున ప్రవేశించెను.

శ్లో. విరుజౌ రాఘవౌ దృష్ట్వా తతో వానరయూథపాః,
సింహనాదాం స్తదా నేదు ర్లాఙ్గూలాన్ దుధువు స్తదా. 61

తా. పిమ్మట వానర సేనానాయకులు రామలక్ష్మణులు పీడావిముక్తులైనట్లు చూచి, సింహనాదము చేయుచు, తోకలు జాడించిరి.

శ్లో. తతో భేరీః సమాజఘ్ను ర్మృదఙ్గాం శ్చా ప్యనాదయన్,
దధ్ముః శఙ్ఖాన్ సంప్రహృష్టాః క్ష్వేలన్త్యపి యథాపురమ్.

తా. పిమ్మట ఆ వానరులు పూర్వము వలె అరచుచు ఆనందముతో భేరీలను మ్రోగించిరి. మృదంగములను వాయించిరి. శంఖములను పూరించిరి.

శ్లో. ఆస్ఫోట్యాస్ఫోట్య విక్రాన్తా వానరా నగయోధినః,
ద్రుమా నుత్పాట్య వివిధాం స్తస్థుః శతసహస్రశః. 63

తా. పర్వతములలో యుద్ధము చేయ మరికొందరు పరాక్రమవంతులైన వానరులు భుజములు చరచుచు, వందలకొలది, వేలకొలది అనేక విధములైన వృక్షములను పెకలించి నిలిచిరి.

శ్లో. విసృజన్తో మహానాదాం స్త్రాసయన్తో నిశాచరాన్,
లఙ్కాద్వారా ణ్యుపాజగ్ము ర్యోద్ధుకామాః ప్లవఙ్గమాః. 64

తా. వానరులు గొప్ప ధ్వని చేయుచు, రాక్షసులకు భయము కలిగించుచు, యుద్ధము చేయుటకై లంకాద్వారము నొద్దకు వెళ్ళిరి.

శ్లో. తతస్తు భీమ స్తుములో నినాదో
బభూవ శాఖామృగయూథపానామ్,

క్షయే నిదాఘస్య యథాఘనానాం
నాదః సుభీమో నదతాం నిశీథే. 65

తా. ఆ వానర సేనా నాయకుల భయంకరము, వ్యాకులము అయిన ధ్వని గ్రీష్మర్తువు గడచినపుడు అర్ధరాత్రి యందు ధ్వని చేయుచున్న మేఘముల భయంకరధ్వని వలె ఉండెను.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, వాల్మీకీయే,
యుద్ధకాణ్డే, పఞ్చాశఃసర్గః.

శ్రీమద్రామాయణమునందు యుద్ధకాండములోని
ఏబదవ సర్గము సమాప్తము



శ్రీమతే ఆదిత్యమణ్డలాన్తర్వర్తినే పరబ్రహ్మణే నమః.

# ఆదిత్యహృదయసర్గము

శ్లో. తతో యుద్ధపరిశ్రాన్తం సమరే చిన్తయా స్థితమ్,
రావణం చాగ్రతో దృష్ట్వా యుద్ధాయ సముపస్థితమ్. 1

శ్లో. దైవతైశ్చ సమాగమ్య ద్రష్టు మభ్యాగతో రణమ్,
ఉపాగ మ్యాబ్రవీ ద్రామ మగస్త్యో భగవా నృషిః. 2

తా. అంతకుమున్న యుద్ధమును చూచుటకై దేవతలతోడ వచ్చి ఉండిన భగవంతుడగు అగస్త్యమహర్షి, అంత యుద్ధమునందు అలసట పొందినవాడును మరల తన ఎదుట యుద్ధమునకై వచ్చియున్న రావణుని చూచి చింతపొందియున్న వాడును అగు రాముని యొద్దకు వచ్చి, యిట్లు పలికెను.

శ్లో. రామ రామ మహాబాహో శృణు గుహ్యం సనాతనమ్,
యేన సర్వా నరీ న్వత్స సమరే విజయిష్యసి. 3

తా. రామా! రామా! గొప్పచేతులు కలవాడా! నాయనా! నీవు దేనిచే యుద్ధమున సమస్త శత్రువుల జయింపగలవో, అట్టి సనాతనము రహస్యము అగు ఒక్క స్తోత్రము చెప్పెదను వినుము.

శ్లో. ఆదిత్యహృదయం పుణ్యం సర్వశత్రువినాశనమ్,
జయావహం జపే న్నిత్య మక్షయం పరమం శివమ్. 4

శ్లో. సర్వమఙ్గళమాఙ్గళ్యం సర్వపాపప్రణాశనమ్,
చిన్తాశోకప్రశమన మాయుర్వర్ధన ముత్తమమ్. 5

తా. పవిత్రమయినదియు ఎల్లశత్రువుల నశింపచేయునదియు జయము కలిగించునదియు ఉత్తమమయినదియు మంగళకరమును ఎల్ల మంగళముల యందును మంగళకరమైనదియు సమస్తపాపములను పోగొట్టునదియు మనస్సు నందలి దుఃఖమును దేహపీడను పోగొట్టునదియు ఆయుర్వృద్ధి పొందించునదియు శ్రేష్ఠమునగు ఆదిత్యహృదయ మను స్తోత్రమును ఉపదేశించెద వినుము.

శ్లో. రశ్మిమన్తం సముద్యన్తం దేవాసురనమస్కృతమ్,
పూజయస్వ వివస్వన్తం భాస్కరం భువనేశ్వరమ్. 6

తా. నీవు ప్రశస్తములయిన కిరణములు కలవాడును, ఉదయమును పొందుచున్నవాడును, దేవతలచేతను అసురులచేతను నమస్కరింపబడిన వాడును, ఇతర తేజస్సుల పరిభవించునట్టి మహాతేజస్సు కలవాడును, చంద్రుడు మొదలగువారికిని తేజస్సు కలిగించువాడును, సమస్తలోకములకు నియామకుడును అగు దేవుని ఈ స్తోత్రముచే పూజింపుము.

శ్లో. సర్వదేవాత్మకో హ్యేష తేజస్వీ రశ్మిభావనః,
ఏష దేవాసురగణాన్ లోకాన్ పాతి గభస్తిభిః. 7

తా. ఆదిత్యమండలాంతర్వర్తియగు నీ పురుషుడే సమస్తదేవతలకును ఆత్మభూతుడు. సమస్త తేజస్సులను తిరస్కరించునట్టి మహాతేజస్సు కలవాడు, కిరణములచే సమస్తలోకములకును ఉత్పత్తి స్థితి సంహారములు చేయువాడు. ఈతడే కిరణములచే వర్షాదులు కల్గించి దేవాసురప్రభృతి సమస్తలోకములను రక్షించుచున్నాడు.

శ్లో. ఏష బ్రహ్మా చ విష్ణు శ్చ శివ స్స్కన్దః ప్రజాపతిః,
మహేన్ద్రో ధనదః కాలో యమ స్సోమో హ్యపాంపతిః.

తా. ఇతడే బ్రహ్మ. ఇతడే విష్ణువు. ఇతడే శివుడు. ఇతడే

కుమారస్వామి. ఇతడే ప్రజాపతి. ఇతడే దేవేంద్రుడు. ఇతడే కుబేరుడు. ఇతడే మృత్యువు. ఇతడే యముడు. ఇతడే చంద్రుడు. ఇతడే వరుణుడు.

శ్లో. పితరో వసవ స్సాధ్యా హ్యశ్వినౌ మరుతో మనుః,
వాయు ర్వహ్నిః ప్రజాప్రాణ ఋతుకర్తా ప్రభాకరః. 9

తా. ఈతడే పితృదేవతలు. ఇతడే అష్టవసువులు. ఇతడే సాధ్యులు. ఇతడే అశ్విదేవతలు. ఇతడే మరుత్తులు. ఇతడే మనువు. ఇతడే వాయువు. ఇతడే అగ్ని. ఇతడే లోకములకు ప్రాణము. ఇతడే ఋతుకర్త. ఇతడే సూర్యుడు.

శ్లో. ఆదిత్య స్సవితా సూర్యః ఖగః పూషా గభస్తిమాన్,
సువర్ణసదృశో భాను ర్హిరణ్యరేతా దివాకరః. 10

తా. నీవు సర్వమును గ్రహించువాడవు. జగత్తును కలిగించువాడవు. జనులను కర్మములయందు ప్రేరించువాడవు. ఆకాశమును పొందినవాడవు. లోకమును పోషించువాడవు. ప్రశస్తములయిన కిరణములు కలవాడవు. బంగారముతో సమానమైనవాడవు. తపింపజేయువాడవు, ప్రకాశించువాడవు. స్వర్ణరూపమయిన తేజస్సు కలవాడవు. పగటిని చేయువాడవు.

శ్లో. హరిదశ్వ స్సహస్రార్చి స్సప్తసప్తి ర్మరీచిమాన్,
తిమిరోన్మథన శ్శంభు స్త్వష్టా మార్తాణ్డ అంశుమాన్. 11

తా. నీవు పచ్చనిగుఱ్ఱములు కలవాడవు. వేయికిరణములు కలవాడవు. సప్తయను గుఱ్ఱముకలవాడవు. ప్రశస్తములయిన కిరణములు కలవాడవు. చీకటిని పోగొట్టువాడవు. సుఖమును కలిగించువాడవు. సమస్తమును సంహరించువాడవు. బ్రహ్మాండము మృతమయినను ఉండువాడవు. అంతటను వ్యాప్తికలవాడవు.

శ్లో. హిరణ్యగర్భ శ్శిశిర స్తపనో భాస్కరో రవిః
అగ్నిగర్భోఽదితేః పుత్త్ర శ్శఙ్ఖ శ్శిశిరనాశనః. 12

తా. బంగారు వికారమయిన అండము గర్భమునందు కలవాడవు. చల్లనివాడవు. భక్తులశత్రువులను తపింపచేయువాడవు. ప్రకాశము కలిగించువాడవు. వేదములను బ్రహ్మదేవునకు ఉపదేశించినవాడవు. గర్భమునందు అగ్నికలవాడవు. అదితికి పుత్త్రుడుగా అవతరించినవాడవు. శాంతుడవు. మంచును పోగొట్టువాడవు.

శ్లో. వ్యోమనాథ స్తమోభేదీ ఋుగ్యజుస్సామపారగః,
ఘనవృష్టి రపాం మిత్రో విన్ధ్యవీథీప్లవఙ్గమః. 13

తా. నీవు ఆకాశమును సృజించినవాడవు. అజ్ఞానమును భేదించువాడవు. ఋుగ్వేదము యజుర్వేదము సామవేదము అనువేదములు మూడింటిచే ఆకాశముయొక్క అంతము పొందువాడవు. అధికమయిన వర్షము కురిపించువాడవు. జలములకు మిత్రుడవు. వింధ్య పర్వతమువలె దుర్గమయిన సుషుమ్నా మార్గమునందు భక్తులను పోవునట్లు చేయువాడవు.

శ్లో. ఆతపీ మణ్డలీ మృత్యుః పిఙ్గళ స్సర్వతాపనః,
కవి ర్విశ్వో మహాతేజా రక్త స్సర్వభవోద్భవః. 14

తా. నీవు జ్ఞానమయుడవు. మండలాకారము కలవాడవు. శత్రువులను చంపువాడవు. ఉదయకాలమునందు గోరోచనపు వన్నెకలవాడవు. సమస్తమును తపింపచేయువాడవు. సర్వజ్ఞుడవు. సమస్తమును నిర్వహించువాడవు. కొలదిలేని తేజస్సుకలవాడవు. భక్తులయందు అనురాగము కలవాడవు. ఎల్లకార్యములకును కారణమయినవాడవు.

శ్లో. నక్షత్రగ్రహతారాణా మధిపో విశ్వభావనః
తేజసామపి తేజస్వీ ద్వాదశాత్మ న్నమోఽస్తు తే. 15

తా. నీవు అశ్విన్యాది నక్షత్రములకును గ్రహములకును సాధారణ నక్షత్రములకును నాథుడవు. ప్రపంచమును నిలుపువాడవు. అన్ని తేజస్సులను అణచి వేయునట్టి మహాతేజస్సుకలవాడవు. పన్నెండు మూర్తులు కలవాడా! నీకు నమస్కారము.

శ్లో. నమః పూర్వాయ గిరయే పశ్చిమా యాద్రయే నమః,
జ్యోతిర్గణానాంపతయే దినాధిపతయే నమః. 16

తా. తూర్పుకొండపై ఉన్న నీకు నమస్కారము. పడమటికొండపై ఉన్న నీకు నమస్కారము. జ్యోతిర్గణములకు నాథువడగు నీకు నమస్కారము. దినములకు ప్రభుడవైన నీకు నమస్కారము.

శ్లో. జయాయ జయభద్రాయ హర్యశ్వాయ నమో నమః,
నమో నమ స్సహస్రాంశో ఆదిత్యాయ నమో నమః. 17

తా. జయము కలవాడవు. జయమును మంగళమును ఇచ్చువాడవు. పచ్చని గుఱ్ఱము కలవాడవగు నీకు నమస్కారము. నమస్కారము. వేయికిరణములు కలదేవుడా! అదితికొడుకుగా అవతరించిన నీకు నమస్కారము. నమస్కారము.

శ్లో. నమ ఉగ్రాయ వీరాయ సారఙ్గాయ నమో నమః,
నమః పద్మప్రబోధాయ మార్తాణ్డాయ నమో నమః. 18

తా. ఉపాసకులు కానివారలకు భయంకరుడవయిన నీకు నమస్కారము. సర్వప్రాణులను వారివారి పూర్వకర్మానుసారముగా నానావిధములగు కర్మములయందు ప్రేరించువాడవయిన నీకు నమస్కారము. సారమును గ్రహించువాడవయిన నీకు నమస్కారము. కమలములను వికసింపజేయు వాడవగు నీకు నమస్కారము. బ్రహ్మాండము ప్రళయము పొందినపుడు మరల దాని సృజించుటకున్నవాడవయిన నీకు నమస్కారము. నమస్కారము.

శ్లో. బ్రహ్మేశానాచ్యుతేశాయ సూర్యా యాదిత్యవర్చసే,
భాస్వతే సర్వభక్షాయ రౌద్రాయ వపుషే నమః. 19

తా. బ్రహ్మవిష్ణు శివులకును నియామకుడయిన పరబ్రహ్మవు. సమస్త ప్రాణులను ఆయా కర్మములకు ప్రేరించువాడవు. సూర్యమండలమునందు తేజోరూపమున ఉండువాడవు. మహాతేజస్సుకలవాడవు. ప్రళయకాలమున సర్వమును హరించువాడవు. అప్పుడు భయంకరమయిన ఆకారముకలవాడవు అయిన నీకు నమస్కారము.

శ్లో. తమోఘ్నాయ హిమఘ్నాయ శత్రుఘ్నాయామితాత్మనే,
కృతఘ్నఘ్నాయ దేవాయ జ్యోతిషాం పతయే నమః. 20

తా. చీకటిని పోగొట్టువాడవు, మంచును హరించువాడవు, శత్రువుల వధించువాడవు, అపరిచ్ఛిన్నమయిన స్వరూపముకలవాడవు, కృతఘ్నులు మొదలగు పాపాత్ములను వధించువాడవు, ప్రకాశించువాడవు, సర్వతేజస్సులకు నాథుడవు అయిన నీకు నమస్కారము.

శ్లో. తప్తచామీకరాభాయ వహ్నయే విశ్వకర్మణే,
నమ స్తమోఽభినిఘ్నాయ రుచయే లోకసాక్షిణే. 21

తా. ఉత్తమమగు బంగారువంటి కాంతికలవాడవు. సమస్త లోకములను వహించువాడవు. జగత్తును నిర్మించినవాడవు. అజ్ఞానమును పోగొట్టువాడవు. ప్రకాశస్వరూపుడవు. సమస్తలోకములకును సాక్షిభూతుడవు అయిన నీకు నమస్కారము.

శ్లో. నాశయ త్యేష వై భూతం త దేవ సృజతి ప్రభుః,
పాయ త్యేష తప త్యేష వర్ష త్యేష గభస్తిభిః. 22

తా. సర్వలోక నియామకుడగు ఈదేవుడే సమస్త ప్రపంచమును ప్రళయకాలమునందు సంహరించును. మరల ఆ ప్రపంచమునే సృజించును.

ఈతడే దానిని రక్షించును. ఈతడే కిరణములచే తాపమును కల్గించి శోషిల్లజేయును. వర్షమును కురిపించును.

శ్లో. ఏష సుప్తేషు జాగర్తి భూతేషు పరినిష్ఠితః,
ఏష ఏ వాగ్నిహోత్రంచ ఫలం చైవాగ్నిహోత్రిణామ్.

తా. సర్వభూతములు నిద్రించియున్నపుడు ఈతడు ఒకడు మాత్రము ఆ భూతముల అన్నిటియందును అంతర్యామిత్వంబున వ్యాపించినవాడై మేలుకొనియుండును. ఇతడే అగ్నిహోత్రము మొదలగు కర్మములు. ఆ కర్మములు చేయువారికి కలుగు ఫలమును ఇతడే.

శ్లో. వేదాశ్చ క్రతవ శ్చైవ క్రతూనాం ఫల మేవ చ
యాని కృత్యాని లోకేషు సర్వ ఏష రవిః ప్రభుః. 24

తా. ఇతడే వేదములు, ఇతడే యజ్ఞములు. యజ్ఞములచే పొందదగిన ఫలమును ఇతడే. మరియు లోకమున ఏయే కర్మములు చేయబడుచున్నవో వాని కన్నిటికిని సర్వాత్మకుడయిన ఈ సూర్యుడే నియామకుడు.

శ్లో. ఏన మాపత్సు కృచ్ఛ్రేషు కాన్తారేషు భయేషు చ,
కీర్తయర్ పురుషః కశ్చి న్నావసీదతి రాఘవ. 25

తా. రాముడా! ఇందు వర్ణము, ఆశ్రమము ఆదిగాగల అధికార నియమము లేదు. ఎవ్వడైనను ఆపద కలిగినపుడుకాని కష్టము వచ్చినపుడుకాని ఈ ఇతర మార్గములందుకాని ఇతరభయములు కలిగినపుడుకాని ఈ దేవుని కీర్తించిన యెడల అతడు దుఃఖము పొందడు.

శ్లో. పూజయ స్వైన మేకాగ్రో దేవదేవం జగత్పతిమ్,
ఏత త్త్రిగుణితం జప్త్వా యుద్ధేషు విజయిష్యసి. 26

తా. నీవు మనసు నిశ్చలముగా నిలిపి దేవతలకును దేవుడు

లోకనాథుడు అగు ఈ దేవుని ఈ స్తోత్రముచే పూజింపుము. ఈ యాదిత్యహృదయ స్తోత్రమును మూడుమారులు జపించినచో యుద్ధమునందు జయము పొందుదువు.

శ్లో. అస్మిన్ క్షణే మహాబాహో రావణం త్వం వధిష్యసి,
ఏవ ముక్త్వా తదాగస్త్యో జగామ చ యథాగతమ్. 27

తా. గొప్పచేతులుగల రామా! నీ వీ స్తోత్రమును పలికి జపింపుము. ఈ క్షణముననే రావణుని వధింతువు. ఇట్లు పలికి అంత అగస్త్యమహర్షి వచ్చిన దారిని వెడలెను.

శ్లో. ఏత చ్ఛ్రుత్వా మహాతేజా నష్టశోకోఽభవత్తదా,
ధారయామాస సుప్రీతో రాఘవః ప్రయతాత్మవాన్. 28

తా. అప్పుడు మహాతేజుడగు రాముడు దీనిని విన్నంతనే అతనికి మనస్సునందలి చింత నశించెను. అంత అతడు పరమసంతుష్టుడై నిర్మలమయిన మనస్సుకలవాడై ఈ మహాస్తోత్రమును మనస్సులో జపించెను.

శ్లో. ఆదిత్యం ప్రేక్ష్య జప్త్వా తు పరం హర్ష మవాప్తవాన్,
త్రి రాచమ్య శుచి ర్భూత్వా ధను రాదాయ వీర్యవాన్.

తా. అంత రాముడు ఆచమనము చేసి శుద్ధుడై సూర్యమండలమును చూచి ధ్యానించుచు మూడుమార్లు ఆదిత్య హృదయస్తోత్రమును జపించి రెట్టించిన పరాక్రమము కలవాడై పరమసంతోషము పొంది ధనుస్సును చేత పట్టెను.

శ్లో. రావణం ప్రేక్ష్య హృష్టాత్మా యుద్ధాయ సముపాగమత్
సర్వయత్నేన మహతా వధే తస్య ధృతో భవత్. 30

తా. అంత రాముడు రావణుని చూచి సంతోషముపొందిన మనస్సుకలవాడై యుద్ధమున ఎదుర్కొనెను. సర్వప్రయత్నములతో అతనిని వధించుటయందు నిశ్చయము కలవాడు అయ్యెను.

శ్లో. అథ రవి రవద న్నిరీక్ష్య రామం
ముదితమనాః పరమం ప్రహృష్యమాణః,
నిశిచరపతి సంక్షయం విదిత్వా
సురగణమధ్యగతో వచ స్త్వరేతి. 31

తా. అట్లు రాముడు జపధ్యానపరాయణు డగుటయు, సూర్యుడు సంతోషించిన మనస్సుకలవాడై పులకాంకితుడై దేవగణములు చుట్టును పరివేష్టించి కొలువగా రాముని చూచి రాక్షసరాజు రావణుడు హతుడు కాగలడని తెలిసికొనుము ఆలస్యముచేయక పోరాడుము అని పలికెను.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే
యుద్ధకాణ్డే ఆదిత్యహృదయంనామ సప్తోత్తరశతతమస్సర్గః.

తా. ఇది ఋషిప్రోక్తమయిన శ్రీమద్రామాయణమనెడి ఆదికావ్యము నందు యుద్ధకాండమున ఆదిత్యహృదయము అనబడు సప్తోత్తర శతతమ సర్గము ముగిసినది.

శ్లో. స రథం సారథి ర్హృష్టః పరసైన్యప్రధర్షణమ్,
గన్ధర్వనగరాకారం సముచ్ఛ్రితపతాకినమ్.

తా. ఆ రావణునిసారథి, సంతోషించినవాడై శత్రుసైన్యములకు భయము కలిగించునదియు గంధర్వనగరమువలె ఆశ్చర్యకరమును, ఎత్తబడిన ధ్వజముకలదియు అగు రావణుని రథమును తోలెను.



# రావణ వధ సర్గము

శ్లో. అథ సంస్మారయామాస మాతలి రాఘవం స్తదా,
అజానన్నివ కిం వీర త్వ మేన మనువర్తసే. 1

తా. అప్పుడు మాతలి రామునకు జ్ఞాపకము చేసెను. 'ఓ వీరుడా! ఏమీ తెలియనివానివలె ఎందుకు ఈతనితో ఇంతసేపు యుద్ధము చేయుచున్నావు?

శ్లో. విసృ జాస్మై వధాయ త్వ మస్త్రం పైతామహం ప్రభో,
వినాశకాలః కథితో యః సురైః సోఽద్య వర్తతే. 2

తా. ఓ సర్వసమర్థుడా! ఈతనిని చంపుటకు బ్రహ్మాస్త్రమును ప్రయోగింపుము. దేవతలు చెప్పిన విధముగా వీనికి వినాశకాలము ఇప్పుడు వచ్చినది.

శ్లో. తతః సంస్మారితో రామ స్తేన వాక్యేన మాతలేః,
జగ్రాహ స శరం దీప్తం నిఃశ్వసన్త మివోరగమ్. 3

శ్లో. యం తస్మై ప్రథమం ప్రాదా దగస్త్యో భగవా నృషిః,
బ్రహ్మదత్తం మహాబాణ మమోఘం యుధి వీర్యవాన్. 4

తా. పిమ్మట మాతలి పలుకులచేత స్మరింపజేయబడిన పరాక్రమశాలియైన ఆ రాముడు, బ్రహ్మచేత ఇవ్వబడిన, యుద్ధములో తిరుగులేని గొప్ప బాణమును పూర్వము భగవంతుడైన అగస్త్యుడు తనకిచ్చెనో అట్టి, బుసలు కొట్టుచున్న సర్పమువలె ప్రకాశించుచున్న బాణమును తీసెను.

శ్లో. బ్రహ్మణా నిర్మితం పూర్వ మిన్ద్రార్థ మమితౌజసా,
దత్తం సురపతేః పూర్వం త్రిలోకజయకాఙ్క్షిణః. 5

తా. పూర్వము గొప్ప తేజస్సుగల బ్రహ్మదేవుడు దీనిని ఇంద్రుని కొరకై నిర్మించి మూడు లోకములను జయించుటకై అతనికి ఇచ్చెను.

శ్లో. యస్య వాజేషు పవనః ఫలే పావకభాస్కరౌ,
శరీర మాకాశమయం గౌరవే మేరుమన్దరౌ. 6

తా. దాని వేగసాధనములైన రెక్కలయందు వాయువు, ములికియందు అగ్నిసూర్యులు, బరువునందు మేరుమందర పర్వతములు, అధిష్టాన దేవతలుగా ఉందురు. దానికి శరీరము బ్రహ్మమయము.

శ్లో. జాజ్వల్యమానం వపుషా సుపుఙ్ఖం హేమభూషితమ్,
తేజసా సర్వభూతానాం కృతం భాస్కరవర్చసమ్. 7

తా. దాని దేహము మంటలతో నిండి ఉండెను. బంగారము చేత అలంకరించిన దాని పొన్ను చక్కగా ఉండెను. అది సకల భూతములలోని తేజస్సును తీసి దానితో నిర్మింపబడెను. సూర్యుని వంటి కాంతితో నిండి ఉండెను.

శ్లో. సధూమమివ కాలాగ్నిం దీప్తమాశీవిషోపమమ్,
నరనాగాశ్వబృన్దానాం భేదనం క్షిప్రకారిణమ్. 8

తా. సర్పమువంటి ఆ బాణము ధూమముతో కూడిన ప్రళయ కాలాగ్నివలె ప్రజ్వలించుచుండెను. నరులు, గజములు, అశ్వముల సముదాయములను బ్రద్దలుకొట్టినది, శీఘ్రముగా పనిచేయు బాణమును గ్రహించెను.

శ్లో. ద్వారాణాం పరిఘాణాం చ గిరీణాం చాపి ఖేదనమ్,
నానారుధిరదిగ్ధాఙ్గం మేదోదిగ్ధం సుదారుణమ్. 9

తా. ఆ బాణము ఎన్నో ద్వారములను, కోటగడియలను, పర్వతములను బ్రద్దలుకొట్టెను. దాని శరీరము అనేక విధములైన రక్తముచేత, క్రొవ్వుచేత పూయబడి చాల భయంకరముగా ఉండెను.

శ్లో. వజ్రసారం మహానాదం నానాసమితిదారణమ్,
సర్వవిత్రాసనం భీమం శ్వసన్త మివ పన్నగమ్. 10

తా. ఆ బాణము వజ్రము వంటి సారము గలది. గొప్పధ్వని చేయునది. అనేక యుద్ధములలో శత్రుసైన్యాలను చీల్చివేసినది. అందరిని భయపెట్టినది. బుసలు కొట్టుచున్న పామువలె భయంకరముగా ఉన్నది.

శ్లో. కఙ్కగృధ్రబకానాం చ గోమాయుగణరక్షసామ్,
నిత్యం భక్ష్యప్రదం యుద్ధే యమరూపం భయావహమ్.

తా. ఆ బాణము నిత్యమును యుద్ధములో డేగలకు, గ్రద్దలకు, నక్కల గుంపులకు, రాక్షసులకు ఆహారము నిచ్చుచుండును. యమునివంటి రూపముతో భయంకరముగా ఉండును.

శ్లో. నన్దనం వానరేన్ద్రాణాం రక్షసా మవసాదనమ్,
వాజితం వివిధై ర్వాజై శ్చారు చిత్రైర్గరుత్మతః. 12

తా. ఆ బాణము వానరనాయకులకు ఆనందము కలిగించునది. రాక్షసులను వినాశము చేయునది. గరుత్మంతుని విచిత్రవర్ణములు గల అనేక విధములైన రెక్కలు కట్టి మంచి వేగము ఉండునట్లు చేయబడినది.

శ్లో. త ముత్తమేషుం లోకానా మిక్ష్వాకుభయనాశనమ్,
ద్విషతాం కీర్తిహరణం ప్రహర్షకర మాత్మనః. 13

శ్లో. అభిమన్త్ర్య తతో రామ స్తం మహేషుం మహాబలః,
వేదప్రోక్తేన విధినా సందధే కార్ముకే బలీ. 14

తా. ఆ బాణము మూడు లోకములలోను ఉత్తమమైనది. ఇక్ష్వాకు వంశీయుల భయమును నశింపజేయునది. శత్రువుల కీర్తిని హరించునది. తనకు సంతోషము కలిగించునది. మహాబలశాలియైన రాముడు ఆ మహాబాణమును వేదోక్తప్రకారము అభిమంత్రించి ధనుస్సుపై సంధించెను.

శ్లో. తస్మిన్ సంధీయమానే తు రాఘవేణ శరోత్తమే,
సర్వభూతాని విత్రేసు శ్చచాల చ వసుంధరా. 15

తా. రాముడు శ్రేష్ఠమైన ఆ బాణమును సంధించుచున్నప్పుడు సర్వ భూతములు భయపడినవి. భూమి కంపించెను.

శ్లో. స రావణాయ సంక్రుద్ధో భృశ మాయమ్య కార్ముకమ్,
చిక్షేప పరమాయత్తస్తం శరం మర్మఘాతినమ్. 16

తా. కోపించిన రాముడు ధనుస్సును బాగుగా లాగి, సావధానచిత్తుడై మర్మస్థానమును చీల్చివేయు ఆ బాణమును రావణునిపై ప్రయోగించెను.

శ్లో. స వజ్ర ఇవ దుర్ధర్షో వజ్రబాహువిసర్జితః,
కృతాన్త ఇవ చావార్యో న్యపత ద్రావణోరసి. 17

తా. ఇంద్రుని బాహువుల చేత ప్రయోగింపబడిన వజ్రాయుధము వలె ఎదిరింప శక్యము కానిది, యముని వలె నివారింప శక్యము కానిది అయిన ఆ బాణము రావణుని వక్షఃస్థలము మీద పడెను.

శ్లో. స విసృష్టో మహావేగః శరీరాన్తకరః శరః,
చిచ్ఛేద హృదయం తస్య రావణస్య దురాత్మనః. 18

తా. శరీరమును అంతమొందించు మహావేగము గల ఆ బాణము ఆ విధముగా విడువబడినదై దురాత్ముడైన ఆ రావణుని హృదయమును బ్రద్దలుకొట్టెను.

శ్లో. రుధిరాక్తః స వేగేన శరీరాన్తకరః శరః,
రావణస్య హరన్ ప్రాణాన్ వివేశ ధరణీతలమ్. 19

తా. శరీరమును అంతమొందించు ఆ బాణము వేగముగా వెళ్ళి రావణుని ప్రాణములు హరించి, రక్తముచేత పూయబడినదై భూమిలో ప్రవేశించెను.

శ్లో. స శరో రావణం హత్వా రుధిరార్ద్రీకృతచ్ఛవిః,
కృతకర్మా నిభృతవ త్స్వతూణీం పున రావిశత్. 20

తా. ఆ బాణము రావణుని సంహరించి రక్తముచేత తడిసి, తాను చేయవలసిన పని చేసిన పిమ్మట చడీ చప్పుడు లేకుండ తానుండు అమ్ములపొదిలోనికి తిరిగి ప్రవేశించెను.

శ్లో. తస్య హస్తా ద్ధత స్యాశు కార్ముకం తత్ ససాయకమ్,
విపపాత సహ ప్రాణై ర్భ్రశ్యమానస్య జీవితాత్. 21

తా. ఆ విధముగా చంపబడి జీవితమును కోల్పోవుచున్న ఆ రావణుని హస్తమునుండి బాణముతో కూడిన ధనుస్సు క్రింద పడెను. ప్రాణములు పోయెను.

శ్లో. గతాసు ర్భీమవేగస్తు నైర్ఋతేన్ద్రో మహాద్యుతిః,
పపాత స్యన్దనా ద్భూమౌ వృత్రో వజ్రహతో యథా. 22

తా. భయంకరమైన వేగము, గొప్ప తేజస్సు గల ఆ రావణుడు ప్రాణములు విడిచి, వజ్రాయుధముచేత కొట్టబడిన వృత్రాసురునివలె రథముపైనుండి నేలమీద పడెను.

శ్లో. తం దృష్ట్వా పతితం భూమౌ హతశేషా నిశాచరాః,
హతనాథా భయత్రస్తాః సర్వతః సంప్రదుద్రువుః. 23

తా. నేలమీద పడిపోయిన ఆ రావణుని చూచి చంపగా మిగిలిన రాక్షసులందరును ప్రభువు మరణించుటచేత భయాక్రాంతులై అన్నివైపులకు పారిపోయిరి.

శ్లో. సర్వతశ్చాభి పేతుస్తాన్ వానరా ద్రుమయోధినః,
దశగ్రీవవధం దృష్ట్వా వానరా జితకాశినః. 24

తా. వృక్షములతో యుద్ధము చేయు వానరులు పారిపోవుచున్న ఆ రాక్షసులను అన్నివైపులనుండి ఎదిరించిరి. రావణుని వధను చూచి వానరులందరు విజయముచేత ప్రకాశించిరి.

శ్లో. అర్దితా వానరైర్హృష్టై ర్లఙ్కా మభ్యపతన్ భయాత్,
హతాశ్రయత్వా త్కరుణై ర్బాష్పప్రస్రవణై ర్ముఖైః. 25

తా. వానరుల చేత పీడింపబడిన ఆ రాక్షసులు పారిపోయి తమకు ఆశ్రయము నిచ్చు రావణుడు చంపబడుటచే దీనములైన కన్నీళ్ళు కార్చుచున్న ముఖములతో భయాక్రాంతులై లంకకు తిరిగి పరుగెత్తిరి.

శ్లో. తతో వినేదుః సంహృష్టా వానరా జితకాశినః,
వదన్తో రాఘవజయం రావణస్య చ తద్వధమ్. 26

తా. పిమ్మట విజయముతో ప్రకాశించుచున్న వానరులు సంతోషించుచు రాముని విజయమును, రాముడు రావణుని సంహరించుటను గూర్చి చెప్పుకొనుచు హర్షధ్వానములు చేసిరి.

శ్లో. అథా న్తరిక్షే వ్యవద త్సౌమ్య స్త్రిదశదున్దుభిః,
దివ్యగన్ధవహా స్తత్ర మారుతః సుసుఖో వవే. 27

తా. అప్పుడు దేవదుందుభి మధురముగా మ్రోగెను. అక్కడ దివ్యమైన సుగంధమును వహించుచు వాయువు సుఖకరముగా వీచెను.

శ్లో. నిపపా తాన్తరిక్షా చ్చ పుష్పవృష్టి స్తదా భువి,
కిరన్తీ రాఘవరథం దురవాపా మనోహరా. 28

తా. అప్పుడు ఇతరులకు ఎవరికిని లభించని మనోహరమైన పుష్పవర్షము రాముని రథముమీద పుష్పములు వెదజల్లుచు, ఆకాశమునుండి నేలమీద పడెను.

శ్లో. రాఘవస్తవసంయుక్తా గగనేఽపి చ శుశ్రువే,
సాధు సాధ్వితి వా గగ్ర్యా దేవతానాం మహాత్మనామ్. 29

తా. రాముని స్తుతించు మహాత్ములైన దేవతలు పలికిన 'బాగు బాగు' అను శ్రేష్ఠవాక్కు ఆకాశమునందు వినబడెను.

శ్లో. ఆవివేశ మహాన్ హర్షో దేవానాం చారణైః సహ,
రావణే నిహతే రౌద్రే సర్వలోకభయఙ్కరే. 30

తా. క్రూరుడు, సర్వలోకభయంకరుడు అయిన ఆ రావణుడు చంపబడగానే, దేవతలు, చారణులు గొప్ప సంతోషము పొందిరి.

శ్లో. తతః సకామం సుగ్రీవ మఙ్గదం చ విభీషణమ్,
చకార రాఘవః ప్రీతో హత్వా రాక్షసపుఙ్గవమ్. 31

తా. రావణుని చంపి సంతోషించుచున్న రాముడు రావణసంహారము చేత సుగ్రీవాంగదవిభీషణుల కోరిక తీర్చెను.

శ్లో. తతః ప్రజగ్ముః ప్రశమం మరుద్గణా
దిశః ప్రసేదు ర్విమలం నభోఽభవత్,
మహీ చకమ్పే న హి మారుతో వవౌ
స్థిరప్రభ శ్చా ప్యభవ ద్దివాకరః. 32

తా. అప్పుడు దేవతలందరు మనఃశాంతి పొందిరి. దిక్కులు

ప్రసన్నము లైనవి. ఆకాశము నిర్మలమయ్యెను. భూమి కంపింపలేదు. వాయువు సుఖకరముగా వీచెను. సూర్యకాంతి స్థిరముగా ఉండెను.

శ్లో. తతస్తు సుగ్రీవవిభీషణాఙ్గదాః
సుహృద్విశేషాః సహలక్ష్మణా స్తదా,
సమేత్య హృష్టా విజయేన రాఘవం
రణేఽభిరామం విధినాభ్య పూజయన్. 33

తా. పిమ్మట సుగ్రీవవిభీషాంగదులు, లక్ష్మణుడు, ఇతర మిత్రులు యుద్ధములో రాముని విజయముచేత సంతోషించి, అతనిని సమీపించి, మనోహరుడైన ఆ రాముని యథావిధిగా పూజించిరి.

శ్లో. స తు నిహతరిపుః స్థిరప్రతిజ్ఞః
స్వజనబలాభివృతో రణే రరాజ,
రఘుకులనృపనన్దనో మహౌజా
స్త్రిదశగణై రభిసంవృతో యథేన్ద్రః. 34

తా. రఘువంశ రాజులకు ఆనందకరుడైన ఆ రాముడు శత్రువును చంపి, ప్రతిజ్ఞ నిలుపుకొని యుద్ధరంగములో తన మిత్రాదులతోను, సైన్యముతోను కూడినవాడై, దేవతాగణములతో కూడిన ఇంద్రునివలె ప్రకాశించెను.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, యుద్ధకాణ్డే,
అష్టోత్తర శతతమః సర్గః.

శ్రీమద్రామాయణము నందు యుద్ధకాండములో నూట ఎనిమిదవ సర్గ సమాప్తము.

# శ్రీ రామస్తుతి సర్గము

శ్లో. తతో హి దుర్మనా రామః శ్రుత్వైవ వదతాం గిరః,
దధ్యౌ ముహూర్తం ధర్మాత్మా బాష్పవ్యాకులలోచనః. 1

తా. అంత ధర్మాత్ముడగు రాముడు, సమస్తజనుల హాహాకారములు విని, కన్నీళ్ళచే కలగిన కన్నులు కలవాడై, కొంతసేపు చింతాక్రాంతుడై ఉండెను.

శ్లో. తతో వైశ్రవణో రాజా యమ శ్చామిత్రకర్శనః,
సహస్రాక్షో మహేన్ద్రశ్చ వరుణశ్చ పరంతపః. 2

తా. అటుపిమ్మట, రాజరాజగు కుబేరుడును, శత్రువులను చంపునట్టి యముడును, వేయికన్నులుకల దేవేంద్రుడును, శత్రువులను వధించునట్టి వరుణుడును,

శ్లో. షడర్ధనయనః శ్రీమా న్మహాదేవో వృషధ్వజః,
కర్తా సర్వస్య లోకస్య బ్రహ్మా బ్రహ్మవిదాం వరః. 3

తా. అందరికన్న అధికుడును, మూడుకన్నులు కలవాడును, వృషభము ధ్వజముగా కలవాడును అగు శివుడును, సమస్తలోకమును సృజించువాడును, బ్రహ్మవేత్తలలో ఉత్తముడునగు బ్రహ్మదేవుడును,

శ్లో. ఏతే సర్వే సమాగమ్య విమానై స్సూర్యసన్నిభైః,
ఆగమ్య నగరీం లఙ్కా మభిజగ్ముశ్చ రాఘవమ్. 4

తా. వీరందరును చేరి, సూర్యమండలమువంటి విమానముల మీద లంకాపురి కేతెంచి, రాముని యొద్దకు వచ్చిరి.

శ్లో. తత స్సమస్తాభరణాన్ ప్రగృహ్య విపులాన్ భుజాన్,
అబ్రువం స్త్రిదశ శ్రేష్ఠాః ప్రాఞ్జలిం రాఘవం స్థితమ్.

తా. అంత, ఆ దేవతాశ్రేష్ఠులు, చేతులుమోడ్చి నిలిచియున్న రాముని చూచి, కడియములు మొదలయిన భూషణములతో కూడిన దీర్ఘబాహువులను ఎత్తి యిట్లని పలికిరి.

శ్లో. కర్తా సర్వస్య లోకస్య శ్రేష్ఠో జ్ఞానవతాం వరః,
ఉపేక్షసే కథం సీతాం పతన్తీం హవ్యవాహనే. 6

తా. నీవు సమస్తలోకమునకు కర్తవు, సర్వోత్తముడవు, జ్ఞానవంతులలో శ్రేష్ఠుడవు. ఇట్టి నీవు, సీత అగ్నిలో పడుచుండగా ఎట్లు ఉపేక్షించుచున్నావు?

శ్లో. కథం దేవగణశ్రేష్ఠ మాత్మానం నావబుధ్యసే,
ఋతధామా వసుః పూర్వం వసూనాం త్వం ప్రజాపతిః.

తా. దేవతా సమూహములో ఉత్తముడవగు నిన్ను నీవెట్లు ఎఱుగకున్నావు? నీవు మునుపు అష్టవసువులలో ప్రజాపతియగు ఋతధామయను వసువుగా ఉన్నావు.

శ్లో. త్రయాణాం త్వం హి లోకానా మాదికర్తా స్వయంప్రభుః,
రుద్రాణా మష్టమో రుద్ర స్సాధ్యానా మసి పఞ్చమః. 8

తా. నీవేకదా ముల్లోకములకును ఆదికర్తవు, సర్వస్వతంత్రుడవు.

రుద్రమూర్తుల ఎనిమిదింటిలో నీవు ఎనిమిదవమూర్తి అయిన మహాదేవుడవు. సాధ్యుల పండ్రెండుగురిలోను వీర్యవంతుడను ఐదవ వాడవు.

శ్లో. అశ్వినౌ చాపి తే కర్ణౌ చన్ద్రసూర్యౌ చ చక్షుషీ,
అన్తే చాదౌ చ లోకానాం దృశ్యసే త్వం పరంతప. 9

తా. శత్రువులను తపింపజేయునట్టి రాముడా! నీకు అశ్విదేవతలు చెవులుగాను, చంద్రసూర్యులు కన్నులుగాను ఉందురు. లోకముల సృష్టికి ముందును నాశనమునకు పిమ్మటను నీవొక్కడవె కబపడుదువు.

శ్లో. ఉపేక్షసే చ వైదేహీం మానుషః ప్రాకృతో యథా.
ఇత్యుక్తో లోకపాలైస్తై స్స్వామీ లోకస్య రాఘవః. 10

తా. ఇట్టివాడవు నీవు ప్రాకృతుడైన మనుష్యుని వలె, సీతాదేవి అగ్నిలో పడుచుండగా ఎట్లు ఊరకున్నావు? అని జగత్ప్రభువగు రామునితో లోకపాలు రనిరి.

శ్లో. అబ్రవీ త్త్రిదశశ్రేష్ఠా నామో ధర్మభృతాం వరః,
ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాత్మజమ్॥

తా. లోకనాథుడును ఎల్లధార్మికులలో ఉత్తముడునగు రాముడు, దేవోత్తములగు వారలను చూచి యిట్లని చెప్పెను. 'నేను దశరథుని పుత్త్రుడగు రాముడను మనుష్యుడనని తలచుచున్నాను.

శ్లో. యోఽహం యస్య యత శ్చాహం భగవాం స్తద్బ్రవీతు మే,
ఇతి బ్రువన్తం కాకుత్స్థం బ్రహ్మా బ్రహ్మవిదాం వరః. 12

తా. నేను పరమార్థమున ఎవ్వడనో, ఎవ్వని సంబంధమువాడనో ఎందువలన ఇట పుట్టితినో, ఆ వివరములు నాకు భగవంతుడగు బ్రహ్మదేవుడు చెప్పవలయును.' అని పలుకుచున్న రామునితో బ్రహ్మవేత్తలలో శ్రేష్ఠుడగు బ్రహ్మ ఇట్లు పలికెను.

శ్లో. అబ్రవీ చ్ఛృణు మే రామ సత్యం సత్యపరాక్రమ!
భవా న్నారాయణో దేవః శ్రీమాం శ్చక్రాయుధో విభుః.

తా. సత్యపరాక్రముడవగు రాముడా! నేను యథార్థము చెప్పెదను వినుము. నీవు నారాయణుడవు, సృష్టిస్థితిసంహారములచే క్రీడించువాడవు, లక్ష్మితో కూడినవాడవు, సుదర్శనచక్రము ఆయుధముగా కలవాడవు, సర్వమును వ్యాపించియుండువాడవు.

శ్లో. ఏకశృఙ్గో వరాహ స్త్వం భూతభవ్య సపత్నజిత్.
అక్షరం బ్రహ్మ సత్యం చ మధ్యే చాన్తే చ రాఘవ. 14

తా. ఒక కొమ్ముకల వరాహమూర్తివి, లోకకంటకులగు వారలను ఇదివరకుండినవారిని ఇక రాబోవువారిని సంహరించువాడవు. రామా! నీవు నాశనములేనిదియు సత్యమును సర్వవ్యాపకము అగు పరబ్రహ్మవు.

శ్లో. లోకానాం త్వం పరోధర్మో విష్వక్సేన శ్చతుర్భుజః,
శారఙ్గధన్వా హృషీకేశః పురుషః పురుషోత్తమః. 15

తా. లోకములకంతకు ముఖ్యముగా పొందదగిన జ్ఞానరూపమైన ధర్మము, లోకనాథుడవు, నాలుగు చేతులుకలవాడవు. నీవు, శార్ఙ్గ మను ధనుస్సుకలవాడవు, సమస్తేంద్రియములను నియమించువాడవు, పురుషుడవు, పురుషోత్తముడవు.

శ్లో. అజితః ఖడ్గధృ ద్విష్ణుః కృష్ణశ్చైవ బృహద్బలః,
సేనానీ గ్రామణీశ్చ త్వం బుద్ధి స్సత్త్వం క్షమా దమః.

తా. ఎప్పుడును పరాజయము లేనివాడవు. నందకమను ఖడ్గమును తాల్చువాడవు, సర్వమును వ్యాపించువాడవు, భూమికి భారముబాపి ఊరట కల్గించు వాడవు, మహాబలము కలవాడవు. నీవు, దేవసేనల నడిపించి దేవకార్యములు నిర్వహించువాడవు. ప్రాణులకు వారి కర్మముల

అనురూపముగా ఫలమిచ్చువాడవు, భక్తులకు బుద్ధిని చిత్తశుద్ధిని ఓర్పును ఇంద్రియనిగ్రహమును కల్గించువాడవు,

శ్లో. ప్రభవ శ్చావ్యయశ్చ త్వ ముపేన్ద్రో మధుసూదనః
ఇన్ద్రకర్మామహేన్ద్ర స్త్వం పద్మనాభో రణాన్తకృత్. 17

తా. ప్రపంచమున ఉత్పత్తిస్థానము లయస్థానము నీవే, నీవే ఇంద్రుని తమ్ముడవు, మధువను రాక్షసుని చంపినవాడవు. నీవు ఐశ్వర్యముకలవాడవు, ఈశ్వరులకు ఈశ్వరుడవు, కమలము నాభియందుకలవాడవు, యుద్ధమునందు శత్రువులను నాశము చేయువాడవు,

శ్లో. శరణ్యం శరణంచ త్వా మాహు ర్దివ్యా మహర్షయః,
సహస్రశృఙ్గో వేదాత్మా శతజిహ్వో మహర్షభః. 18

తా. దేవతలును మహర్షులును నిన్ను శరణాగతుల రక్షింప జాలినవాడవనియు రక్షకుడవనియు చెప్పుదురు. అనంతములయిన శాఖలును శిఖరములుకలవాడవు. అనేకము లయిన విధులను నాలుకలు కలవాడవు. పూజనీయుడవు. కర్మజాలమును బోధించువాడవు. వేదస్వరూపుడవు నీవే.

శ్లో. త్వం త్రయాణాం హి లోకానా మాదికర్తా స్వయంప్రభుః,
సిద్ధానామపి సాధ్యానా మాశ్రయ శ్చాసి పూర్వజః. 19

తా. నీవే ముల్లోకముల మొదట సృజించినవాడవు, ఇతర ప్రభువులందరును నీ అనుగ్రహమున ప్రభువులయిన వారలు. నీవు మాత్రము నీవు స్వయముగా ప్రభుడవు. సిద్ధులకును సాధ్యులకును నీవే ఆశ్రయము, సృష్టికి ముందు నీ ఒకడవే ఉన్నవాడవు.

శ్లో. త్వం యజ్ఞ స్త్వం వషట్కార స్త్వ మోంకారః పరంతపః,
ప్రభవం నిధనం వా తే న విదుః కో భవా నితి. 20

తా. నీవే యజ్ఞము, నీవే వషట్కారము, నీవే ప్రణవము, నీవే గొప్పవారిచే తెలియదగినవాడవు, నీ ఉత్పత్తియు నాశమును నీ వెవ్వడవనియు ఎవ్వరును ఎరుగరు.

శ్లో. దృశ్యసే సర్వభూతేషు బ్రాహ్మణేషు చ గోషు చ
దిక్షు సర్వాసు గగనే పర్వతేషు వనేషు చ. 21

తా. నీవు, యోగులచే సమస్తభూములను బ్రాహ్మణులయందును గోవులయందును ఎల్లదిక్కులయందును ఆకాశమునందును పర్వతముల యందును వనములయందును దర్శింపబడుదువు.

శ్లో. సహస్రచరణ శ్శ్రీమాన్ శతశీర్ష స్సహస్రదృక్,
త్వం ధారయసి భూతాని వసుధాం చ సపర్వతామ్. 22

తా. నీవు లెక్కలేని పాదములుకలవాడవు, అందరికన్న అధికుడవు, లెక్కలేని శిరస్సులు కలవాడవు, నీవే సమస్తభూతములను పర్వతములతో కూడిన భూమినంతను మోయుచున్నావు.

శ్లో. అన్తే పృథివ్యా స్సలిలే దృశ్యసే త్వం మహోరగః,
త్రీన్ లోకాన్ ధారయన్ రామ దేవగన్ధర్వదానవాన్. 23

తా. రామా! ప్రళయమునందు నీవు, జలమధ్యమునందు ఆదిశేషుడు పాన్పుగా కలవాడవై, దేవతలను గంధర్వులను దానవులను మూడులోకములను ఉదరమున ధరించుచున్నవాడవై, మార్కండేయాదులచే చూడబడుదువు.

శ్లో. అహం తే హృదయం రామ జిహ్వా దేవీ సరస్వతీ,
దేవా గాత్రేషు రోమాణి నిర్మితా బ్రహ్మణః ప్రభో. 24

తా. లోకనాథుడవగు రాముడా! విరాడ్రూపుడవగు నీకు, బ్రహ్మదేవుడును నేను హృదయము, సరస్వతీదేవి నాలుక, దేవతల రోమములు.

శ్లో. నిమేష స్తే భవే ద్రాత్రి రున్మేష స్తే భవే ద్దివా,
సంస్కారా స్తేఽభవ న్వేదా న త దస్తి త్వయా వినా.

తా. నీవు రెప్పమూసిన రాత్రియగును, నీవు కన్నులు తెరచిన పగలగును. నీ యూర్పులు వేదములయినవి. నీవు లేనిది ఏది లేదు.

శ్లో. జగ త్సర్వం శరీరం తే స్థైర్యం తే వసుధాతలమ్,
అగ్నిః కోపః ప్రసాద స్తే సోమ శ్శ్రీవత్సలక్షణః. 26

తా. ఈ జగత్తంతయు నీకు శరీరము, ఎట్లనగా, నీ కాఠిన్యము భూమి, నీ కోపము నిప్పు, నీ ప్రసన్నతయే లక్ష్మీకరమైన గురుతుగల చంద్రుడు.

శ్లో. త్వయా లోకా స్త్రయః క్రాన్తాః పురాణే విక్రమై స్త్రిభిః,
మహేన్ద్రశ్చ కృతో రాజా బలిం బద్ధ్వా మహాసురమ్. 27

తా. మున్ను త్రివిక్రమావతారమునందు, నీవు, మూడు అడుగులచే మూడులోకములు ఆక్రమించి అసురరాజయిన బలిని బంధించి ఇంద్రుని స్వర్గమునకు రాజు కావించితివి.

శ్లో. సీతా లక్ష్మీ ర్భవా న్విష్ణుః దేవః కృష్ణః ప్రజాపతిః,
వధార్థం రావణ స్యేహ ప్రవిష్టో మానుషీం తనుమ్. 28

తా. సీత లక్ష్మీదేవి, నీవు సృష్టిస్థితిలయములు చేయువాడును భూభారమును పోగొట్టువాడును లోకనాథుడునగు విష్ణుడవు. రావణుని వధించుటకై, ఈ భూలోకమునందు మనుష్యశరీరము పొందితివి.

శ్లో. త దిదం నః కృతం కార్యం త్వయా ధర్మభృతాం వర,
నిహతో రావణో రామ ప్రహృష్టో దివ మాక్రమ. 29

తా. ఎల్లధార్మికులలో ఉత్తముడవగు రామా! అట్టి మా యొక్క కార్యము నీచే చేయబడినది. రావణుడు వధింపబడెను. ఇక సంతోషమున వైకుంఠమునకు రమ్ము.

శ్లో. అమోఘం బలవీర్యం తే అమోఘ స్తే పరాక్రమః,
అమోఘం దర్శనం రామ న చ మోఘః స్తవస్తవ. 30

తా. రాముడా! నీ బలమును పరాక్రమమును ఎప్పుడు వ్యర్థము

కానివి. నీ దర్శనము మోక్షము ఒసంగును. నీ స్తోత్రము మహాఫలము కల్గించును.

శ్లో. అమోఘా స్తే భవిష్యన్తి భక్తిమన్తశ్చ యే నరాః,
యే త్వాం దేవం ధ్రువం భక్తాః పురాణం పురుషోత్తమమ్.
నీయందు భక్తికల మనుష్యులు మహాప్రభావము కలవారు అగుదురు.

శ్లో. ప్రాప్నువన్తి సదా కామా నిహ లోకే పరత్ర చ
ఇమ మార్షం స్తవం నిత్య మితిహాసం పురాతనమ్. 32
తా. దేవుడవు పురాతనుడవు పురుషోత్తముడవగు, నిన్ను ఎవ్వరు నిశ్చలముగా భజియింతురో వారలు ఈ లోకమున కాని పరలోకమున కాని ఎల్లప్పుడు కామితభోగంబులు పొందుచుందురు.

శ్లో. యే నరాః కీర్తయిష్యన్తి నాస్తి తేషాం పరాభవః.
తా. వేదసిద్ధము పురాతనములగు ఇతిహాసరూపమయిన యీ స్తోత్రమును ఎవ్వరు కీర్తింతురో వారలకు ఎప్పుడును పరాభవము కలుగదు.

ఇతి శ్రీమద్రామాయణే యుద్ధకాణ్డే శ్రీరామస్తుతి
ర్నామ వింశత్యుత్తరశతతమ స్సర్గః.

తా. ఇట్లు ఋషిప్రోక్తమయిన రామాయణమను ఆదికావ్యమునందు యుద్ధకాండమున శ్రీరామస్తోత్రమను నూట ఇరువదియగుసర్గము ముగిసినది.

శ్లో. ఏత చ్ఛ్రుత్వా శుభం వాక్యం పితామహసమీరితమ్
అఙ్కే నాదాయ వైదేహీ ముత్పపాత విభావసుః.

తా. బ్రహ్మదేవునిచే రామునితో చెప్పపడిన శుభమగు ఈ మాటను విని అగ్ని సీతాదేవిని అంకమున ఎత్తుకొని చితినుండి ఆవిర్భవించెను.



శ్రీమతే పట్టాభిరామాయ నమః

# శ్రీరామ పట్టాభిషేక సర్గము

శ్లో. శిర స్యఞ్జలి మాధాయ కైకేయ్యానన్దవర్ధనః
బభాషే భరతో జ్యేష్ఠం రామం సత్యపరాక్రమమ్. 1

తా. కైకేయికి సంతోషవృద్ధి పొందించునట్టి భరతుడు శిరస్సువంచి నమస్కరించి అన్నయు సత్యపరాక్రముడునగు రాముని చూచి యిట్లని పలికెను.

శ్లో. పూజితా మామికా మాతా దత్త రాజ్యం మిదం మమ,
త ద్దదామి పున స్తుభ్యం యథా త్వ మదదా మమ. 2

తా. నీచే నాతల్లి పూజింపబడెను. నాకు ఈ రాజ్యమీయబడెను. ఆ రాజ్యము నీవు నాకెట్లు ఇచ్చితివో అట్లే మరల నీ కిచ్చుచున్నాను.

శ్లో. ధుర మేకాకినా. న్యస్తా మృషభేణ బలీయసా,
కిశోరీవ గురుం భారం న వోఢు మహ ముత్సహే. 3

తా. బలిష్ఠమగు ఆబోతు తాను మోయదగిన బరువును లేతదూడమీద వేసిన ఎడల ఆ దూడ ఎట్లు మోయలేదో అట్లే నీవు వహింపదగిన యీ రాజ్యభారమును నేను మోయజాలను.

శ్లో. వారివేగేన మహతా భిన్న స్సేతు రివ క్షరన్,
దుర్బన్ధన మిదం మన్యే రాజ్యచ్ఛిద్ర మసంవృతమ్. 4

తా. ఏటిగట్టు గొప్ప జలప్రవాహముచే తెగిపడిన యెడల దానిని మరల కట్టుట ఎ ట్లసాధ్యమో అట్లే మంత్రాదిసాధనములచే రక్షింపబడకుండుటవలన రాజ్యమునందు ఛిద్రము కలిగనేని దానిని సరిపరుచుట అసాధ్యము.

శ్లో. గతిం ఖరఇ వాశ్వస్య హంసస్యేవ చ వాయసః,
నాన్వేతు ముత్సహే రామ తవ మార్గ మరిన్దమ. 5

తా. శత్రువులను అణగద్రొక్కునట్టి రాముడా! గాడిద గుఱ్ఱము యొక్క గతిని, కాకి హంసయొక్క గతిని ఎట్లు అనుసరింపజాలదో అట్లు నీ మార్గమును నేను అనుసరింపజాలను.

శ్లో. యథా చారోపితో వృక్షో జాత శ్చాన్తర్నివేశనే,
మహాంశ్చ సుదురారోహో మహాస్కన్ధప్రశాఖవాన్. 6

తా. ఎట్లు ఇంటియావరణములోపల నాటబడిన వృక్షము పెరిగి గొప్పబోదెయును కొమ్మలు కల్గి ఎక్కుటకు కష్టమగునంత పెద్దదై.

శ్లో. శీర్యేత పుష్పితో భూత్వా న ఫలాని ప్రదర్శయన్,
తస్య నానుభవే దర్థం యస్య హేతో స్సరోప్యతే. 7

తా. పుష్పించి ఫలములు చూపక నశించిన పక్షమునందు ఆ వృక్షము నాటిన ఫలము నాటినవానికి కలుగకయేపోవునో.

శ్లో. ఏషోపమా మహాబాహో త్వ మర్థం వేత్తు మర్హసి,
య ద్యస్మా న్మనుజేన్ద్ర త్వం భర్తా భృత్యా న్న శాధి హి.

తా. గొప్ప చేతులు కలవాడవగు రాజా! నీ భక్తులము భృత్యులము

అగుమమ్మ పాలింపవేని అట్టిపోలిక యగును. దీని అర్థమును నీవే తెలిసికొనవలెను.

శ్లో. జగ ద ద్యాభిషిక్తం త్వా మనుపశ్యతు సర్వతః,
ప్రతపన్త మి వాదిత్యం మధ్యాహ్నే దీప్తతేజసమ్. 9

తా. ఇప్పుడు పట్టాభిషిక్తుడవై జ్వలించుచున్న మధ్యాహ్న సూర్యుడు వలె మహాతేజస్సుకలవాడవైన నిన్ను లోకమంతయు చూడవలయును.

శ్లో. తూర్య సఙ్ఘాతనిర్ఘోషైః కాఞ్చీ నూపుర నిస్స్వనైః,
మధురై ర్గీతశబ్దైశ్చ ప్రతిబుధ్యస్వ రాఘవ. 10

తా. రాముడా! ఇక నీవు వాద్యసమూహముల ధ్వనులచేతను స్త్రీల మొలనూళ్ళ యొక్కయు అందెలయొక్కయు ధ్వనులచేతను మధురములగు గానధ్వనులచేతను మేలుకొనవలయును.

శ్లో. యావ దావర్తతే చక్రం యావతీ చ వసున్ధరా,
తావ త్త్వ మిహ సర్వస్య స్వామిత్వ మనువర్తయ. 11

తా. జ్యోతిశ్చక్రము ఎంతవరకు తిరుగుచుండునో భూమి ఎంతవరకు ఉండునో అంతవరకు నీవు సర్వలోకమును పరిపాలనము చేయుము.

శ్లో. భరతస్య వచః శ్రుత్వా రామః పరపురంజయః,
తథేతి ప్రతిజగ్రాహ నిషసాదాసనే శుభే. 12

తా. భరతుని మాటను విని శత్రుపట్టణములను జయించినట్టి రాముడు అట్లేయని అంగీకరించెను. అంత నదివరకు నిలుచుండిన శ్రీరాముడును శుభమగు పీఠముమీద కూర్చుండెను.

శ్లో. తత శ్శత్రుఘ్న వచనా న్నిపుణాః శ్మశ్రువర్ధకాః,
సుఖహస్తా స్సుశీఘ్రాశ్చ రాఘవం పర్యుపాసత. 13

తా. అంత శత్రుఘ్నుని పనుపునం చేసి సమర్థులును సుఖమయిన హస్తలాఘవము కలవారును మిక్కిలి శీఘ్రముగా చేయకలవారు అగు క్షౌరికులు రాముని సేవించిరి.

శ్లో. పూర్వం తు భరతే స్నాతే లక్ష్మణే చ మహాబలే,
సుగ్రీవే వానరేన్ద్రే చ రాక్షసేన్ద్రే విభీషణే. 14

తా. మొదట భరతుడును మహాబలుడగు లక్ష్మణుడును వానరరాజైన సుగ్రీవుడును రాక్షసరాజైన విభీషణుడును స్నానము చేసిన పిమ్మట.

శ్లో. విశోధితజటస్స్నాత శ్చిత్రమాల్యానులేపనః,
మహార్హవసనో రామ స్తస్థౌ తత్ర శ్రియా జ్వలన్. 15

తా. రాముడు విడదీయబడిన జడలుకలవాడై స్నానము చేసి సుందరములగు పుష్పమాలికలును మైపూతయును కలవాడై ఉత్తమమగు వస్త్రములు కట్టినవాడై కాంతిచే జ్వలించుచుండెను.

శ్లో. ప్రతికర్మ చ రామస్య కారయామాస వీర్యవాన్,
లక్ష్మణస్య చ లక్ష్మీవా నిక్ష్వాకుకులవర్ధనః. 16

తా. పరాక్రమవంతుడును శ్రీమంతుడును అగు శత్రుఘ్నుడు రామునకు లక్ష్మణునకు భరతునకు భూషణములు తొడిగించి అలంకారము చేయించెను.

శ్లో. ప్రతికర్మ చ సీతాయా స్సర్వా దశరథస్త్రియః,
ఆత్మ నైవ తదా చక్రు ర్మనస్విన్యో మనోహరమ్. 17

తా. అప్పుడు మంచిమనస్సుకలవారలగు దశరథుని భార్యలందరు సీతకు సుందరమగు అలంకారములు తామే చేసిరి.

శ్లో. తతో వానరపత్నీనాం సర్వాసా మేవ శోభనమ్,
చకార యత్నా త్కౌసల్యా ప్రహృష్టా పుత్రలాలసా. 18

తా. అంత కొడుకునందు అధికప్రీతికల కౌసల్యాదేవి మిక్కిలి సంతోషముతో వానరభార్యలకందరకును కూడ ప్రయత్నమున సుందరమగు అలంకారములు కావించెను.

శ్లో. తత శ్శత్రుఘ్నవచనా త్సుమన్త్రో నామ సారథిః,
యోజయి త్వాభిచక్రామ రథం సర్వాఙ్గశోభనమ్. 19

తా. అటుపిమ్మట శత్రుఘ్నుని నియోగమువలన సుమంత్రుడను సారథి అన్నిఅంగములందును సుందరమయిన రథమును గుఱ్ఱములు పూన్చి తెచ్చెను.

శ్లో. అర్కమణ్డలసఙ్కాశం దివ్యం దృష్ట్వా రథోత్తమమ్,
ఆరురోహ మహాబాహూ రామ స్సత్యపరాక్రమః. 20

తా. గొప్ప చేతులుకలవాడును సత్యమయిన పరాక్రమముకలవాడును అగు రాముడు సూర్యమండలముతో సమానమయిన దివ్యమగు ఉత్తమరథము చూచి ఆరోహించెను.

శ్లో. సుగ్రీవో హనుమాం శ్చైవ మహేన్ద్రసదృశద్యుతీ,
స్నాతౌ దివ్యనిభై ర్వస్త్రై ర్జగ్మతు శ్శుభకుణ్డలౌ. 21

తా. సుగ్రీవుడును హనుమంతుడును స్నానము చేసి సుందరములగు పోగులు ధరించి స్వర్గమునందలి వస్త్రములతో సమానములయిన వస్త్రములనుకట్టి దేవేంద్రునివంటి కాంతికలవారలై నడచిరి.

శ్లో. వరాభరణసమ్పన్నా యయు స్తా శ్శుభకుణ్డలాః,
సుగ్రీవపత్న్య స్సీతా చ ద్రష్టుం నగర ముత్సుకాః. 22

తా. సుగ్రీవుని భార్యలును సీతాదేవియు ఉత్తమములగు ఆభరణములతో కూడినవారలై సుందరమగు చెవిపోగులు కలవారై అయోధ్యా నగరమును చూచు వేడుకతో వెళ్లిరి.

శ్లో. అయోధ్యాయాం తు సచివా రాజ్ఞో దశరథస్య యే,
పురోహితం పురస్కృత్య మన్త్రయామాసు రర్థవత్. 23

తా. అచ్చట అయోధ్యయందును దశరథుని మంత్రులు ఎవ్వరు కలరో వారలు పురోహితుడగు వసిష్ఠునితో శ్రీరామపట్టాభిషేకమును గురించి ఆలోచించిరి.

శ్లో. అశోకో విజయ శ్చైవ సుమన్త్ర శ్చైవ సఙ్గతాః,
మన్త్రయర్ రామవృద్ధ్యర్థ మృద్ధ్యర్థం నగరస్య చ. 24

తా. అశోకుడు విజయుడు సుమంత్రుడు చేరి రాముని అభివృద్ధికొరకును అయోధ్యానగరముయొక్క అభివృద్ధికొరకును ఆలోచించిరి.

శ్లో. సర్వమేవాభిషేకార్థం జయార్హస్య మహాత్మనః,
కర్తు మర్హథ రామస్య యద్యన్మఙ్గళపూర్వకమ్. 25

తా. జయమునకు తగినవాడును మహానుభావుడు అగు రాముని అభిషేకము కొరకు ఏది మంగళకరమో దానినంతయు కావింపుడు.

శ్లో. ఇతి తే మన్త్రిణ స్సర్వే సందిశ్య తు పురోహితమ్,
నగరా న్నిర్యయు స్తూర్ణం రామదర్శనబుద్ధయః. 26

తా. ఇట్లు పురోహితుడగు వసిష్ఠునకు చెప్పి ఆ మంత్రులందరు రాముని చూచుటయందు మనస్సుకలవారలై శీఘ్రముగా పట్టణమునుండి వెడలిరి.

శ్లో. హరియుక్తం సహస్రాక్షో రథ మిన్ద్ర ఇ వానఘః,
ప్రయయౌ రథ మాస్థాయ రామో నగర ముత్తమమ్.

తా. రాముడు పచ్చని గుఱ్ఱములతో కూడిన రథము నెక్కి దేవేంద్రునివలె శ్రేష్ఠమగు అయోధ్యానగరమునకు పోయెను.

శ్లో. జగ్రాహ భరతో రశ్మీ౯ శత్రుఘ్న శ్ఛత్ర మాదదే,
లక్ష్మణో వ్యజనం తస్య మూర్ధ్ని సంపర్యవీజయత్. 28

తా. అప్పుడు భరతుడు సారథ్యము కావించెను. శత్రుఘ్నుడు ఛత్రము పట్టెను. లక్ష్మణుడు విసనకఱ్ఱచే రాముని శిరస్సునందు తిన్నగా విసరెను.

శ్లో. శ్వేతం చ వాలవ్యజనం జగ్రాహ పురతః స్థితః,
అపరం చన్ద్రసఙ్కాశం రాక్షసేన్ద్రో విభీషణః. 29

తా. ఇంకను లక్ష్మణుడు పురోభాగమున నిలుచున్నవాడై తెల్లని చామరమును పట్టెను. రాక్షసరాజయిన విభీషణుడు చంద్రుని వలె తెల్లనైన మరియొక చామరమును పట్టెను.

శ్లో. ఋషిసఙ్ఘై స్తదాకాశే దేవైశ్చ స మరుద్గణైః,
స్తూయమానస్య రామస్య శుశ్రువే మధురధ్వనిః. 30

తా. అప్పుడు ఆకాశమునందు ఋషిసమూహములును మరుద్గణములును దేవతలును రాముని స్తోత్రము చేయు ధ్వని మధురముగా వినబడెను.

శ్లో. తత శ్శత్రుఞ్జయం నామ కుఞ్జరం పర్వతోపమమ్,
అరురోహ మహాతేజా స్సుగ్రీవః ప్లవగర్షభః. 31

తా. అంత గొప్ప పరాక్రమముకలవాడును వానరోత్తముడును అగు సుగ్రీవుడు పర్వతమువలె ఉన్న శత్రుంజయమను పేరుగల ఏనుగును ఎక్కి వెడలెను.

శ్లో. నవ నాగసహస్రాణి యయు రాస్థాయ వానరాః,
మానుషం విగ్రహం కృత్వా సర్వాభరణభూషితాః. 32

తా. వానరులు మనుష్యరూపము ధరించి సమస్తభూషణములచే

అలంకరింపబడినవారలై తొమ్మిదివేల ఏనుగులను ఆరోహించి వెడలిరి.

శ్లో. శఙ్ఖశబ్దప్రణాదైశ్చ దున్దుభీనాం చ నిస్స్వనైః,
ప్రయయౌ పురుషవ్యాఘ్ర స్తాం పురీం హర్మ్యమాలినీమ్.

తా. పురుషోత్తముడగు రాముడు శంఖధ్వనులతోను జనులు కావించు కోలాహలధ్వనులతోను భేరీధ్వనులతోను మేడల వరుసలతో ఒప్పు అయోధ్యాపట్టణమునకు పోయెను.

శ్లో. దదృశు స్తే సమాయాన్తం రాఘవం సపురస్సరమ్,
విరాజమానం వపుషా రథేనాఽతిరథం తదా. 34

తా. అప్పుడు అయోధ్యనుండి రాముని ఎదుర్కొన వచ్చిన ఆ మంత్రులు పరివారసమేతముగా రథముపై వచ్చుచున్నవాడును దేహకాంతిచే ప్రకాశించుచున్నవాడును అతిరథుడును అగు రాముని తిలకించిరి.

శ్లో. తే వర్ధయిత్వా కాకుత్స్థం రామేణ ప్రతినన్దితాః,
అనుజగ్ము ర్మహాత్మానం భ్రాతృభిః పరివారితమ్. 35

తా. ఆ మంత్రులు రాముని జయశబ్దమున ఆశీర్వదించి రామునిచే ఆదరింపబడినవారలయి సోదరులచే పరివేష్టితుడయిన ఆ మహాత్ముని వెంట వెడలిరి.

శ్లో. అమాత్యై ర్బ్రాహ్మణైశ్చైవ తథా ప్రకృతిభి ర్వృతః,
శ్రియా విరురుచే రామో నక్షత్రై రివ చన్ద్రమాః. 36

తా. రాముడు మంత్రులచేతను బ్రాహ్మణులచేతను పరివేష్టితుడై కాంతిచే నక్షత్రములచే చుట్టబడిన చంద్రునివలె ప్రకాశించెను.

శ్లో. స పురోగామిభి స్తూర్యై స్తాళస్వస్తికపాణిభిః,
ప్రవ్యాహరద్భి ర్ముదితై ర్మఙ్గళాని యయౌ వృతః. 37

తా. ఆ రాముడు వాద్యములతోను తాళములు స్వస్తికములు మొదలగు వాద్యముల చేతులందు ధరించి సంతోషమున మంగళములు పాడుచు ముందు నడచుచున్న పురుషులతోను కూడినవాడై వెడలెను.

శ్లో. అక్షతం జాతరూపంచ గావః కన్యా స్తథా ద్విజాః,
నరా మోదకహస్తాశ్చ రామస్య పురతో యయుః. **38**

తా. పసుపుపూసిన అక్షతలతో మనుష్యులును, గోవులును, కన్యలును, బ్రాహ్మణులును, కుడుములు చేతుల పట్టుకొన్న పురుషులును రామునకు ముందు నడచిరి.

శ్లో. సఖ్యం చ రామ స్సుగ్రీవే ప్రభావం చానిలాత్మజే,
వానరాణాం చ తత్కర్మ రాక్షసానాం చ తద్బలమ్.
శ్లో. విభీషణస్య సంయోగ మాచచక్షే చ మన్త్రిణామ్,

తా. రాముడు సుగ్రీవుని స్నేహమును, హనుమంతుని ప్రభావమును, వానరుల పరాక్రమమును రాక్షసుల బలవిశేషమును, విభీషణుడు తనతో చేరుటను మంత్రులకు చెప్పెను.

శ్రుత్వా చ విస్మయం జగ్ము రయోధ్యాపురవాసినః. **40**

తా. అయోధ్యాపురమునందుండెడు ప్రజలు ఆ వృత్తాంతములను విని ఆశ్చర్యము పొందిరి.

శ్లో. ద్యుతిమా నేత దాఖ్యాయ రామో వానరసంవృతః
హృష్టపుష్టజనాకీర్ణా మయోధ్యాం ప్రవివేశ హ. **41**

తా. అధికమయిన కాంతికల రాముడు ఈ వృత్తాంతములు చెప్పుచు సంతుష్టులును పుష్టికలవారలు అగు జనులచే నిండిన అయోధ్యాపురమును వానరులచే పరివృతుడై ప్రవేశించెను.

శ్లో. తతో హ్యభ్యుచ్ఛ్రయుర్జ్ఞ పౌరాః పతాకా స్తే గృహే గృహే,
ఐక్ష్వాకాధ్యుషితం రమ్య మాససాద పితు ర్గృహమ్. 42

తా. అంత పురజనులు ప్రతిగృహమునందును ధ్వజములనెత్తిరి. రాముడును ఇక్ష్వాకులవంశరాజులు వాసము చేయునట్టి రమణీయమైన తండ్రి గృహమునకు వెడలెను.

శ్లో. అథా బ్రవీ ద్రాజసుతో భరతం ధర్మిణాం వరమ్,
అర్థోపహితయా వాచా మధురం రఘునన్దనః. 43

శ్లో. పితు ర్భవన మాసాద్య ప్రవేశ్య చ మహాత్మనః,
కౌసల్యాం చ సుమిత్రాం చ కైకేయీ మభివాద్య చ. 44

తా. అట్లు మహాత్ముడగు దశరథుని గృహములో ప్రవేశించి కౌసల్యకును సుమిత్రకును కైకేయికిని నమస్కరించి రాజకుమారుడగు రాముడు ధర్మము తెలిసినవారిలో ఉత్తముడైన భరతుని చూచి గొప్ప అర్థములతో కూడిన వాక్యమును మధురముగా ఇట్లని పలికెను.

శ్లో. యచ్చ మద్భవనం శ్రేష్ఠం సాశోకవనికం మహత్,
ముక్తావైడూర్యసఙ్కీర్ణం సుగ్రీవాయ నివేదయ. 45

తా. అంతఃపురోద్యానసహితమును ముత్తైములచేతను వైడూర్యముల చేతను తాపబడిన ఉత్తమమును గొప్పదియును అగు గృహ మేది కలదో దానిని సుగ్రీవునకు విడిదిగా చూపుము.

శ్లో. తస్య తద్వచనం శ్రుత్వా భరత స్సత్యవిక్రమః,
పాణౌ గృహీత్వా సుగ్రీవం ప్రవివేశ త మాలయమ్.

తా. రాముని ఆ మాటలు విని సత్యపరాక్రముడగు భరతుడు సుగ్రీవుని చేయిపట్టుకొని ఆ గృహమునకు తోడ్కొనిపోయెను.

శ్లో. తత స్తైలప్రదీపాంశ్చ పర్యఙ్కా స్తరణాని చ
గృహీత్వా వివిశుః క్షిప్రం శత్రుఘ్నేన ప్రచోదితాః. 47

తా. అంత శత్రుఘ్నునిచే ప్రేరింపపడినవారలై పరిజనుల తైల దీపములను, మంచములను, పరుపులను తీసికొని శీఘ్రముగా ఆ గృహము నందు ప్రవేశించిరి.

శ్లో. ఉవాచ చ మహాతేజా స్సుగ్రీవం రాఘవానుజః,
అభిషేకాయ రామస్య దూతా నాజ్ఞాపయ ప్రభో. 48

తా. అంత మహాపరాక్రమశాలియగు భరతుడు సుగ్రీవుని చూచి ప్రభూ! రాముని పట్టాభిషేకమునకై దూతలను పంపుము అని పలికెను.

శ్లో. సౌవర్ణా న్వానరేన్ద్రాణాం చతుర్ణాం చతురో ఘటాన్,
దదౌ క్షిప్రం స సుగ్రీవ స్సర్వరత్నవిభూషితాన్. 49

తా. అంత సుగ్రీవుడు శీఘ్రముగా సమస్తరత్నములచేతను అలంకరింపబడిన నాలుగు బంగారుకలశములను నలుగురు వానరులకు నొసగెను.

శ్లో. యథా ప్రత్యూషసమయే చతుర్ణాం సాగరామ్బసామ్,
పూర్ణై ర్ఘటైః ప్రతీక్షధ్వం తథా కురుత వానరాః. 50

తా. వానరులారా! మీరు రేపు వేకువనే నాలుగు సముద్రముల జలములతో నిండిన కలశములతో వచ్చి మమ్మెదురు చూచుచుండు నట్లు శీఘ్రముగా పనిచేయవలెను.

శ్లో. ఏవ ముక్తా మహాత్మానో వానరా వారణోపమాః,
ఉత్పేతు ర్గగనం శీఘ్రం గరుడా ఇవ శీఘ్రగాః. 51

తా. ఇట్లు చెప్పబడిన వారలై మహాపరాక్రమశాలులును ఏనుగు

లంతటి మేనులు కలవారును గరుత్మంతునివలె శీఘ్రముగా పోవువారలు అగు ఆ వానరులు ఆకాశమునకు ఎగసిరి.

శ్లో. జామ్బవాంశ్చ హనూమాంశ్చ వేగదర్శీ చ వానరః,
ఋషభ శ్చైవ కలశా౯ జలపూర్ణా న థానయ౯. 52

తా. అంత జాంబవంతుడును హనుమంతుడును వేగదర్శియను వానరుడును ఋషభుడును జలముచే నిండిన కలశములు తెచ్చిరి.

శ్లో. నదీశతానాం పఞ్చానాం జలం కుమ్భేషు చాహర౯,

తా. జాంబవంతుడు మొదలయిన వానరులు అయిదువందల నదులలోని జలముల కలశములు తెచ్చిరి.

పూర్వా త్సముద్రా త్కలశం జలపూర్ణ మ థానయత్. 53

శ్లో. సుషేణ స్సత్త్వసంపన్న స్సర్వరత్నవిభూషితమ్,

తా. అంత బలవంతుడగు సుషేణుడు తూర్పుసముద్రమునుండి జలముతోనిండిన సమస్తరత్నాలంకృతమగు కలశమును తెచ్చెను.

ఋషభో దక్షిణా త్తూర్ణం సముద్రా జ్జల మాహరత్.

శ్లో. రక్తచన్దనశాఖాభి స్సంవృతం కాఞ్చనం ఘటమ్,

తా. మరియొక ఋషభుడు దక్షిణసముద్రమునుండి జలముచే నిండిన రక్తచందనశాఖలచే కప్పబడినదియగు బంగారు కలశమును శీఘ్రముగా తెచ్చెను.

గవయః పశ్చిమా త్తోయ మాజహార మహార్ణవాత్. 55

శ్లో. రత్నకుమ్భేవ మహతా శీతం మారుతవిక్రమః,

తా. వాయువునకు పోలె వేగముకల గవయుడు గొప్పరత్న కలశముతో పశ్చిమసముద్రమునుండి చల్లనిజలము తెచ్చెను.

ఉత్తరా చ్చ జలం శీఘ్రుం గరుడానిలవిక్రమః. 56

శ్లో. ఆజహార స ధర్మాత్మా నళ స్సర్వగుణాన్వితః,

తా. గరుత్మంతునితోను వాయువుతోను సమానమైన వేగము కలవాడును, ధర్మబుద్ధికలవాడును, ఎల్ల సద్గుణములతో కూడిన వాడును అగు నళుడు ఉత్తర సముద్రమునుండి జలము తెచ్చెను.

తత స్తై ర్వానరశ్రేష్ఠై రానీతం ప్రేక్ష్య తజ్జలమ్. 57

శ్లో. అభిషేకాయ రామస్య శత్రుఘ్న స్సచివై స్సహ,

పురోహితాయ శ్రేష్ఠాయ సుహృద్భ్యశ్చ న్యవేదయత్. 58

తా. అంత శత్రుఘ్నుడు ఆ వానరోత్తములచే తేబడిన జలమును చూచి మంత్రులతో కూడినవాడై రాముని పట్టాభిషేకము కొరకు ఉత్తముడగు పురోహితుడైన వసిష్ఠునకును, బంధువులకును ఆ జలములు చేరిన సంగతి తెలిపెను.

## శ్రీరామ పట్టాభిషేక ఘట్టః

శ్లో. తత స్స్రయతో వృద్ధో వసిష్ఠో బ్రాహ్మణై స్సహ,
రామం రత్నమయే పీఠే సహసీతం న్యవేశయత్. 59

తా. అంత పరిశుద్ధుడు, వృద్ధుడునగు వసిష్ఠుడు బ్రాహ్మణులతో కూడినవాడై రాముని సీతాసమేతముగా మణిమయపీఠము మీద కూర్చుండబెట్టెను.

శ్లో. వసిష్ఠో వామదేవశ్చ జాబాలి రథ కాశ్యపః,
కాత్యాయన స్సుయజ్ఞశ్చ గౌతమో విజయ స్తథా. 60

తా. అంత వసిష్ఠుడును వామదేవుడును జాబాలియును కాశ్యపుడును కాత్యాయనుడును సుయజ్ఞుడును గౌతముడును విజయుడును.

శ్లో. అభ్యషిఞ్చ న్నరవ్యాఘ్రం ప్రసన్నేన సుగన్ధినా,
సలిలేన సహస్రాక్షం వసవో వాసవం యథా. 61

తా. దేవేంద్రుని వసువులు వలె పురుషోత్తముడగు రాముని నిర్మలమును మంచివాసనగలదియు నగు జలముచే నభిషేకించిరి.

శ్లో. ఋత్విగ్భి ర్బ్రాహ్మణైః పూర్వం కన్యాభి ర్మన్త్రిభి స్తథా,
యోధై శ్చైవాభ్యషిఞ్చం స్తే సంప్రహృష్టా స్సనైగమైః. 62

తా. అంత వసిష్ఠాదులు తామభిషేకించిన పిదప సంతోషించిన వారలై మొదట ఋత్విజులచేతను బ్రాహ్మణులచేతను అంత కన్యలచేతను మంత్రుల చేతను పట్టణమందలి జనులచేతను యోధులచేతను అభిషేకము చేయించిరి.

శ్లో. సర్వౌషధిరసై ర్దివ్యై ర్దైవతై ర్నభసి స్థితైః,
చతుర్భి ర్లోకపాలైశ్చ సర్వై ర్దేవైశ్చ సఙ్గతైః. 63

తా. మరియు ఆ వసిష్ఠాదులు ఆకాశమునందున్న లోకపాలురగు నలుగురు దేవతలచేతను, ఒకటిగా చేరిన యెల్లదేవతలచేతను స్వర్గమునందు పుట్టిన సమస్తౌషధుల రసములచే రాముని కభిషేకము చేయించిరి.

శ్లో. బ్రహ్మణా నిర్మితం పూర్వం కిరీటం రత్నశోభితమ్,
అభిషిక్తః పురా యేన మను స్తం దీప్తతేజసమ్. 64

శ్లో. తస్యాన్వవాయే రాజానః క్రమా ద్యే నాభిషేచితాః,

తా. దేనిచేత వైవస్వతమనువు అభిషేకింపబడెనో అతని మొదలుకొని క్రమముగా అతని వంశమునందు రాజులందరు దేనిచే అభిషేకింపబడిరో మున్ను బ్రహ్మచే నిర్మింపబడినది మణులచే ప్రకాశించుచున్నది వెలుగుచున్న కాంతి కలదియగు కిరీటమును.

సభాయాం హేమక్లుప్తాయాం శోభితాయాం మహాజనైః.

శ్లో. రత్నై ర్నానావిధైశ్చైవ చిత్రితాయాం సుశోభనైః. 65

తా. బంగారుచే అలంకరింపబడినదియు మహాజనులచే నొప్పుచున్నదియు నగు మిక్కిలి సుందరములగు మణులచే చిత్రితమగు సభయందు.

నానారత్నమయే పీఠే కల్పయిత్వా యథావిధి. 66

శ్లో. కిరీటేన తతః పశ్చా ద్వసిష్ఠేన మహాత్మనా,
ఋత్విగ్భి ర్భూషణై శ్చైవ సమయోక్ష్యత రాఘవః. 67

తా. నానావిధములగు రత్నములచే ఖచితమయిన పీఠముమీద యథాశాస్త్రముగా పూజించి అటుపిమ్మట ఆ కిరీటముతో మహాత్ముడు

వసిష్ఠునిచేతను భూషణములతో ఋత్విజులచేతను రాముడు అలంకరింపబడెను.

శ్లో. ఛత్రం తు తస్య జగ్రాహ శత్రుఘ్నః పాణ్డరం శుభమ్,
శ్వేతం చ వాలవ్యజనం సుగ్రీవో వానరేశ్వరః. 68

శ్లో. అపరం చన్ద్రసఙ్కాశం రాక్షసేన్ద్రో విభీషణః.

తా. అప్పుడు రామునకు శత్రుఘ్నుడు సుందరమగు శ్వేతచ్ఛత్రము పట్టెను. వానరరాజగు సుగ్రీవుడు తెల్లని చామరముపట్టెను. రాక్షసరాజగు విభీషణుడు చంద్రునితో సమానమయిన మరియొక వింజామరము పట్టెను.

మాలాం జ్వలన్తీం వపుషా కాఞ్చనీం శతపుష్కరామ్.
శ్లో. రాఘవాయ దదౌ వాయు ర్వాసవేన ప్రచోదితః.

తా. వాయుదేవుడు దేవేంద్రునిచే ప్రేరితుడై కాంతిచే దేదీప్యమానములును నూఱు కమలములుకలదియు అగు బంగారుహారమును రామునకు నొసగెను.

సర్వరత్న సమాయుక్తం మణిరత్న విభూషితమ్. 70
శ్లో. ముక్తాహారం నరేన్ద్రాయ దదౌ శక్రప్రచోదితః

తా. మరల దేవేంద్రునిచే ప్రేరింపబడినవాడై వాయువు సమస్తరత్నములతో కూడినదియు మణిశ్రేష్ఠమగు నాయకమణిచే అలంకరింపబడినదియు నగు ముత్యాలహారమును రామునకు ఇచ్చెను.

ప్రజగు ర్దేవగన్ధర్వా ననృతు శ్చాప్సరోగణాః. 71
శ్లో. అభిషేకే తదర్హస్య తదా రామస్య ధీమతః,

తా. అప్పుడు పట్టాభిషేకార్హుడును బుద్ధిమంతుడునగు రాముని పట్టాభిషేకమునందు దేవగంధర్వులు పాడిరి. అప్సరసలు ఆడిరి.

భూమి స్సస్యవతీ చైవ ఫలవన్తశ్చ పాదపాః. 72
శ్లో. గన్ధవన్తి చ పుష్పాణి బభూవూ రాఘవోత్సవే.

తా. రాముని పట్టాభిషేకోత్సవమునందు భూమి మంచి పైరులు కలదియు వృక్షములు అధికముగా ఫలములు కలవియు పూవులు మంచి వాసన కలవియు అయ్యెను.

సహస్రశత మశ్వానాం ధేనూనాం చ గవాం తథా. 73
శ్లో. దదౌ శతం వృషా న్పూర్వం ద్విజేభ్యో మనుజర్షభః.

తా. పురుషోత్తముడగు రాముడు మొదట లక్షగుఱ్ఱములను, లక్షపాడి ఆవులను నూఱు ఆబోతులను బ్రాహ్మణులకు ఇచ్చెను.

త్రింశత్కోటీ ర్హిరణ్యస్య బ్రాహ్మణేభ్యో దదౌ పునః.
శ్లో. నానాభరణవస్త్రాణి మహార్హాణి చ రాఘవః

తా. రాముడు మరల ముప్పదికోట్ల బంగారు నాణెములను, ఉత్తమములగు నానావిధములైన భూషణములను, వస్త్రములను బ్రాహ్మణులకు నొసగెను.

అర్కరశ్మిప్రతీకాశాం కాఞ్చనీం మణివిగ్రహామ్. 75
శ్లో. సుగ్రీవాయ స్రజం దివ్యాం ప్రాయచ్ఛ న్మనుజర్షభః.

తా. పురుషశ్రేష్ఠుడగు రాముడు సూర్యకిరణములతో సమానమైనదియు మణిమయమును ఉత్తమమునగు బంగారుహారమును సుగ్రీవునకు ఒసంగెను.

76
వైడూర్యమణిచిత్రే చ వజ్రరత్నవిభూషితే.
శ్లో. వాలిపుత్త్రాయ ధృతిమా నఙ్గదా యాఙ్గదే దదౌ.

తా. రాముడు మిక్కిలి సంతోషముకలవాడై వాలికుమారుడగు అంగదునకు వైడూర్యమణులచే సుందరమయినవియు వజ్రములచే అలంకృతములగు రెండు బంగారుబాహుపురులను ఇచ్చెను.

మణి ప్రవరజుష్టం చ ముక్తాహార మనుత్తమమ్. 77
శ్లో. సీతాయై ప్రదదౌ రామ శ్చన్ద్రరశ్మిసమప్రభమ్.

తా. రాముడు సీతాదేవికి ఉత్తమమైన నాయకమణితో కూడినదియు, చంద్రుని కిరణములతో సమానమైన కాంతికలదియు అగు దివ్యమైన ముత్యాలహారమును ఒసంగెను.

అరజే వాససీ దివ్యే శుభా న్యాభరణాని చ. 78
శ్లో. అవేక్షమాణా వైదేహీ ప్రదదౌ వాయుసూనవే.

తా. అంత సీతాదేవి భర్తను చూచుచు నిర్మలములు దివ్యములు అగు రెండు వస్త్రములను, సుందరములయిన ఆభరణములను వాయుకుమారుడు అగు హనుమంతునికి ఇచ్చెను.

అవము చ్యాత్మనః కణ్ఠా ద్ధారం జనకనన్దినీ. 79
శ్లో. అవైక్షత హరీ న్సర్వా న్భర్తారం చ ముహుర్ముహుః.

తా. మరియు సీతాదేవి హారమును తన కంఠమునుండి తీసి వానరులనందరను భర్తను మాటిమాటికి చూచెను.

తా మిఙ్గితజ్ఞ స్సంప్రేక్ష్య బభాషే జనకాత్మజామ్. 80

తా. రాముడు ఆ సీతను చూచి ఆవిడ అభిప్రాయము తెలిసినవాడై ఇట్లని పలికెను.

శ్లో. ప్రదేహి సుభగే హారం యస్య తుష్టాసి భామిని,
పౌరుషం విక్రమో బుద్ధి ర్యస్మి న్నేతాని సర్వశః. 81

తా. మనోహరురాలా! నీవు ఎవ్వరివలన సంతోషించితివో ఎవ్వని యందు బలము పరాక్రమము బుద్ధి ఇవన్నియు కలవో అతనికి ఈ హారము ఇమ్ము.

శ్లో. దదౌ సా వాయుపుత్రాయ తం హార మసితేక్షణా,

తా. అంత నల్లని కన్నులు కల సీతాదేవి ఆ హారమును వాయుకుమారుడగు హనుమంతునకు ఇచ్చెను.

హనుమాం స్తేన హారేణ శుశుభే వానరర్షభః. 82

శ్లో. చన్ద్రాంశుచయగౌరేణ శ్వేతాభ్రేణ యథాచలః,

తా. వానరోత్తముడు అగు హనుమంతుడు చంద్రకిరణముల సమూహాము వలె ధవళమయిన ఆ హారముచే తెల్లని మేఘములతో కూడిన పర్వతమువలె ప్రకాశించెను.

తతో ద్వివిదమైన్దాభ్యాం నీలాయ చ పరంతపః. 83

శ్లో. సర్వాన్ కామగుణాన్ వీక్ష్య ప్రదదౌ వసుధాధిపః,

తా. అంత శత్రువులను తపింపచేయునట్టి పుడమిరేడగు రాముడు ద్వివిదునకును, మైందునకును, నీలునకును వారికోర్కెల స్వభావములను అన్నింటిని తెలిసికొని బహుమతులను ఒసంగెను.

సర్వవానరవృద్ధా శ్చ యే చాన్యే వానరేశ్వరాః. 84

శ్లో. వాసోభి ర్భూషణై శ్చైవ యథార్హం ప్రతిపూజితాః

తా. సమస్తవానరులందును వృద్ధులగువారలను మరియు ఇతరులగు వానరనాథులు ఎవ్వరుకలరో వారలు వస్త్రములచేతను, ఆభరణముల చేతను పూజింపబడిరి.

విభీషణోఽథ సుగ్రీవో హనుమాన్ జామ్బవాం స్తథా.

శ్లో. సర్వవానరముఖ్యాశ్చ రామే ణాక్లిష్టకర్మణా

యథార్హం పూజితా స్సర్వైః కామై రత్నైశ్చ పుష్కలైః. 86

శ్లో. ప్రహృష్టమనస స్సర్వే జగ్ము రేవ యథాగతమ్.

తా. అంత విభీషణుడును, సుగ్రీవుడును, హనుమంతుడును, జాంబవంతుడును ఎల్ల వానరశ్రేష్ఠులును, ఎవ్వరికిని ఎంతమాత్రమును దుఃఖము కలిగింపని రామునిచే, తాము కోరిన వస్తువులన్నిటి చేతను, సమృద్ధము అగు రత్నములచేతను తగునట్లు పూజింపబడిన వారలై అందరును సంతోషించిన మనస్సుకలవారై తమస్థానములకు పోయిరి.

దృష్ట్వా సర్వే మహాత్మానం తత స్తే ప్లవగర్షభాః. **87**

శ్లో. విసృష్టాః పార్థివేన్ద్రేణ కిష్కిన్ధా మభ్యుపాగమన్,

తా. అంత అట్లు ఆ వానరశ్రేష్ఠులు అందరును మహాత్ముడగు రాముని కన్నులార చూచి రాజశ్రేష్ఠుడగు రామునిచే పంపబడినవారలై కిష్కింధకు పోయిరి.

సుగ్రీవో వానరశ్రేష్ఠో దృష్ట్వా రామాభిషేచనమ్. **88**

తా. వానరోత్తముడగు సుగ్రీవుడును రాముని పట్టాభిషేకమును చూచి కిష్కింధకు పోయెను.

శ్లో. లబ్ధ్వా కులధనం రాజా లఙ్కాం ప్రాయా ద్విభీషణః,

తా. రాక్షసరాజయిన విభీషణుడు అట్లు తనకులధనమయిన లంకారాజ్యమును పొంది లంకకు పోయెను.

స రాజ్య మఖిలం శాసన్ నిహతారి ర్మహాయశాః. **89**

శ్లో. రాఘవః పరమోదారః శ్శశాస పరయా ముదా,

తా. వధింపపడిన శత్రువులు కలవాడును గొప్ప కీర్తికలవాడును మహాత్ముడు అగు ఆ రాముడు దుష్టుల శిక్షించుచు రాజ్యమును అంతయు పరమ సంతోషముతో పాలించెను.

ఉవాచ లక్ష్మణం రామో ధర్మజ్ఞం ధర్మవత్సలః. **90**

తా. అప్పుడు ధర్మమునందు ప్రీతి కల రాముడు ధర్మము తెలిసినట్టి లక్ష్మణుని చూచి ఇట్లు చెప్పెను.

శ్లో. ఆతిష్ఠ ధర్మజ్ఞ మయాస హేమాం
గాం పూర్వరాజాధ్యుషితాం బలేన,
తుల్యం మయా త్వం పితృభి ర్ధృతా యా
తాం యౌవరాజ్యే ధుర ముద్వహస్వ. 91

తా. ధర్మము తెలిసినవాడా! పూర్వరాజులచే బలముతో పాలింపబడిన యీ భూమిని నీవు నాతోకూడ పాలింపుము; ఏది మన తండ్రులచే వహింపబడెనో అట్టి రాజ్యభారమును నీవు యౌవరాజ్యమునందుండి నాతో సమానముగా వహింపుము.

శ్లో. సర్వాత్మనా పర్యనునీయమానో
యదా న సౌమిత్రి రుపైతి యోగమ్,
నియుజ్యమానో ఽపి చ యౌవరాజ్యే
తతోఽభ్యషిఞ్చ ద్భరతం మహాత్మా. 92

తా. ఇట్లు యౌవరాజ్యమును పొందుమని అనునయింపపడుచున్న వాడయ్యును, ఆజ్ఞాపింపబడుచున్నవాడయ్యును, లక్ష్మణుడు ఎంతమాత్రము అంగీకరింపడయ్యెను. అంత మహాత్ముడగు రాముడు యౌవరాజ్యమునందు భరతుని అభిషేకించెను.

శ్లో. పౌణ్డరీకాశ్వమేధాభ్యాం వాజపేయేన చాసకృత్,
అన్యైశ్చ వివిధై ర్యజ్ఞై రయజ త్పార్థివర్షభః. 93

తా. పార్థివోత్తముడగు రాముడు పౌండరీకము చేతను, అశ్వమేధము చేతను, వాజపేయము చేతను, మరియు ఇతరములయిన నానావిధములగు యజ్ఞములచేతను పలుమారు దేవతలను ఆరాధించెను.

శ్లో. రాజ్యం దశసహస్రాణి ప్రాప్య వర్షాణి రాఘవః,
శతాశ్వమేధా నాజహ్రే సదశ్వా న్భూరిదక్షిణాన్. 94

తా. రాముడు పదివేల యేండ్లు రాజ్యముపాలించి ఉత్తమాశ్వంబులు కలవియు, అధిక దక్షిణలుకలవియు అగు నూఱు అశ్వమేధయాగములు కావించెను.

శ్లో. ఆజానులమ్బబాహూ స్స మహాస్కన్దః ప్రతాపవాన్
లక్ష్మణానుచరో రామః పృథివీ మన్వపాలయత్. 95

తా. మోకాలి వరకు వేలాడు చేతులుకలవాడును, బలిసిన భుజములు కలవాడును, మహాపరాక్రమశాలియు, లక్ష్మణుడు సహాయుడుగాగలవాడును అగు రాముడు భూమిని పాలించెను.

శ్లో. రాఘవ శ్చాపి ధర్మాత్మా ప్రాప్య రాజ్య మనుత్తమమ్,
ఈజే బహువిధై ర్యజ్ఞై స్ససుహృద్ జ్ఞాతిబాన్ధవః. 96

తా. ధర్మాత్ముడు అగు రాముడును సర్వోత్తమము అగు రాజ్యమును పొంది మిత్రులతోను దాయాదులతోను బంధువులతోను కూడినవాడై బహువిధములు అగు యాగములచే దేవతలను ఆరాధించెను.

శ్లో. న పర్యదేవ న్విధవా న చ వ్యాళకృతం భయమ్,
నవ్యాధిజం భయం వాపి రామే రాజ్యం ప్రశాసతి. 97

తా. రాముడు రాజ్యమును పాలించినపుడు స్త్రీలు విధవలై దుఃఖింపరైరి. దుష్టమృగములచే కలుగు భయము లేదయ్యెను. రోగముల భయమును కలుగదయ్యెను.

శ్లో. నిర్దస్యు రభవ ల్లోకో నానర్థః కంచి దస్పృశత్,
నచస్మ వృద్ధా బాలానాం ప్రేతకార్యాణి కుర్వతే. 98

తా. లోకము దొంగలులేనిది అయ్యెను. ఎవరినీ అనర్థము స్పృశింపదయ్యెను. మరియు వృద్ధులు బాలురకు పరలోకక్రియలు చేయరైరి.

శ్లో. సర్వం ముదిత మేవాసీ త్సర్వో ధర్మపరోఽభవత్
రామమే వానుపశ్యన్తో నాభ్యహింసన్ పరస్పరమ్. 99

తా. సమస్తప్రాణిసమూహము సంతోషము పొంది ఉండెను. సమస్తజనులు ధర్మమునందు ఆసక్తులై ఉన్నారు. జనులు రాముని చూచుచున్న వారలై అతనిని అనుసరించి ఒకరిని మరొకరు హింసింపరైరి.

శ్లో. ఆసర్ వర్షసహస్రాణి తథా పుత్త్రసహస్రిణః
నిరామయా విశోకాశ్చ రామే రాజ్యం ప్రశాసతి. 100

తా. రాముడు రాజ్యమును పాలించునపుడు జనులు పెక్కువేల ఏండ్లు జీవించువారలుగను వేవురుకొడుకులు కలవారలుగను రోగములేని వారలుగను దుఃఖము లేనివారలుగను ఉండిరి.

శ్లో. రామో రామో రామ ఇతి ప్రజానా మభవర్ కథాః,
రామభూతం జగ దభూ ద్రామే రాజ్యం ప్రశాసతి.

తా. రాముడు రాముడు రాముడు అని ప్రజలమాటలు రామ విషయమే అగుచుండెను. రాముడు రాజ్యము చేయునపుడు లోకము అంతయు రామమయము అయ్యెను.

శ్లో. నిత్యపుష్పా నిత్యఫలా స్తరవః స్కన్ధవిస్తృతాః,
కాలే వర్షీ చ పర్జన్య స్సుఖస్పర్శ శ్చ మారుతః. 102

తా. వృక్షములు ఎల్లప్పుడును పుష్పములు కలవై, ఎల్లప్పుడును ఫలములు కలవై విశాలమయిన బోదెలు కలవై ఉండెను. మేఘములు సకాలమున వర్షించెను. వాయువు సుఖమయిన స్పర్శము కలిగి ఉండెను.

శ్లో. బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యా శ్శూద్రా లోభవివర్జితాః,
స్వకర్మసు ప్రవర్తన్తే తుష్టాః స్వైరేవ కర్మభిః. 103

తా. బ్రాహ్మణులు క్షత్రియులు వైశ్యులు శూద్రులు లోభముచే విడువ బడిన వారలై తమతమ కర్మములచేత తృప్తి పొందినవారలై స్వకర్మలయందు ప్రవర్తించుచుండిరి.

